





# నాటకాలు

## భక్తి,జ్ఞాన,పురాణ,జానపద

# యక్ష గానములు- 1 నుంచి 5





# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

Andhra University Series No. 55

# యక్షగానములు

## ( తంజావూరు )

సంపుటము ౧.

---

పరిష్కర్త

[illegible] డాక్టర్

గంటి జోగిసోమయాజి, ఎం. ఏ., ఎల్. టి.,
ప్రొఫెసరు, ఆంధ్రవిశ్వకళాపరిషత్తు.

---

ఆంధ్ర విశ్వకళా పరిషత్తుచే ప్రచురితము.




కాకినాడ : జాన్ట్సీ ప్రెస్సునందు
శ్రీ పట్టమట్ట శేషగిరిరావుగారిచే ముద్రితము

Price Rs. 2-8-0] 1955 [ వెల రు 2-8-0

# విషయసూచిక







# యక్షగానములు

## (తంజావూరు)

### ఉపోద్ఘాతము.

---

తంజావూరి నాయకరాజులలో నాల్గవవాఁడగు విజయ రాఘవనాయకుని (క్రీ. శ. 1633-73) ఆంధ్రవాఙ్మయసేవను గూర్చియు, పాండిత్యమునుగూర్చియు నింతకుముం దనేకస్థలములలో ననేకగ్రంథములలో శ్రుతపఱుపఁ బడినది గాన వానిని గూర్చి ప్రత్యేకముగా నిందువ్రాయ నవసరములేదు.

తంజావూరునందలి ఆంధ్రవాఙ్మయసేవయుఁ బండితా దరణమును కవితాగోష్ఠియు నితనికాలములో మిన్నందినది. ఈతఁడు కవులను గాయకులను పోషించుటయేగాక స్వయముగా

---

తంజావూరు నేలిన నాయకరాజులు :—

| | | |
|---|---|---|
| చెవ్వప్ప నాయకుడు | ... | 1535 — 1561 |
| అచ్యుతప్ప నాయకుఁడు | ... | 1561 — 1614 |
| రఘునాథ నాయకుఁడు | ... | 1614 — 1633 |
| విజయరాఘవ నాయకుఁడు | ... | 1633 — 1673 |
| తక్కినవారు | ... | 1673 — 1675 |
| చెంగమలదాసు | ... | 1675 |

కవియై అనేక గ్రంథములరచించి ఆంధ్రశారద నారాధించి నాడు. ఈతనిపోషణలో ఆంధ్రవాఙ్మయమున కొకవిశిష్టతయు, యక్షగానముల కొక క్రొత్త చెలువమును కలిగినవి. అంతవఱకును మూలమూలల జీవితము గడుపుచున్న యక్షగానము ఈతని యేల్బడిలో రాజసభాప్రవేశమునంది బహుజనాదర పాత్రమైనది.

తన యాస్థానకవులును సమకాలికులును రచించినవే గాక, విజయరాఘవుడు స్వయముగా ననేకములగు ద్విపద-కావ్యములు యక్షగానములు పదములు మున్నగునవి రచించినాడు. ప్రహ్లాదచరిత్రయందలి ప్రారంభసీసమాలిక ననుసరించి యీక్రింది గ్రంథములు విజయరాఘవుని కృతులుగా తెలియవచ్చుచున్నది.

1. రాజగోపాల విలాసము. 2. చెంగమలవల్లి పరిణయము. 3. గోవర్ధనోద్ధరణము. 4. రతిమన్మథ విలాసము. 5. రాసక్రీడ. 6. పారిజాతాపహరణము. 7. రుక్మిణీకల్యాణము. 8. రాధామాధవ సంవాదము. 9. సత్యభామా వివాహము. 10. ఉషాపరిణయము. 11. కాళీయమర్దనము. 12. రఘునాథాభ్యుదయము. 13. మోహినీవిలాసము. 14. ప్రహ్లాద చరిత్ర. 15. పూతనాహరణము. 16. విప్రనారాయణచరిత్ర. 17. సముద్రమథనము. 18. కృష్ణవిలాసము. 19. పాదుకా

సహస్రము. 20. ప్రణయకలహము. 21. కంసవిజయము. 22. జానకీ కల్యాణము. 23. నవపుణ్యకవ్రతము. 24. ఆంధ్రీకృత గోపికాగీతలు. 25. భ్రమరగీతలు. 26. ఫాల్గుణోత్సవము. 27. రాజగోపాల దండకము. 28. గోపాలునకు వేడుకోలు విన్నపములు. 29. దరువులు మున్నగునవి.

పైరచనలలో కాళీయమర్దనము, ప్రహ్లాదచరిత్ర, పూతనాహరణము, విప్రనారాయణ చరిత్ర, రఘునాథాభ్యుదయము అను యక్షగానములును, రఘునాథనాయకాభ్యుదయమను ద్విపదకావ్యమును ప్రస్తుతము లభించినవి. తంజావూరిలోని గ్రంథములన్నియు ముద్రించి ప్రకటించవలయుననెడి యుద్దేశముతోఁ బండితులను బంపి వానికి ప్రత్యంతరములు వ్రాయించి మాచే తెప్పింపఁబడినవి. అందలి యముద్రిత గ్రంథములలో అమూల్యమును, అపరకవిత్రియ కర్తృకమును అగు ద్విపద భారతము ఈనడుమ ప్రకటితమయినది.

మద్రాసు ప్రభుత్వమువారు ఇటీవల రఘునాథనాయకుని గ్రంథములలో కొన్ని ప్రకటించిరి. మిగిలినప్రహ్లాదచరిత్ర, పూతనాహరణము, కాళీయమర్దనము అను యక్షగానములును మన్నారుదాసకృతి హేమాబ్జనాయికా స్వయంవరమును ఈ సంపుటముగా వెలయింపఁబడుచున్నవి.

పరిష్కర్త.

# ప్రహ్లాద చరిత్రము



విజయరాఘవ భూపాలుడు

# ప్రహ్లాదచరిత్రము

## (విజయరాఘవ కృతము)

### ఉపోద్ఘాతము.

ఇదియొక దృశ్యకావ్యము. ఇట్టి రచనములను యక్షగానము లనియు ప్రబంధములనియు, మహానాటకములనియు, నాటకములనియు ఆయాకవులు పేర్కొనుచు వచ్చిరి. ఈజాతి కావ్యములు నాట్యసంగీత ప్రధానములై నేటి వీథిభాగవతముల పోలియుండును.

ఈనాటకము విజయరాఘవుని యెదుట "నటనపటిమ గనుపింప" ప్రదర్శించినట్లు ప్రస్తావననుబట్టి తెలియుచున్నది. "విజయరాఘవస్వామి తెల్పేమాట" యని యిందు కొన్ని వాక్యములు గలవు. వీనిని సామాజికుఁడైన విజయరాఘవుఁడే చెప్పునా, లేక యాతని వేషము ధరించిన నటకుఁడు ఆతనిముందర విన్పించునా, లేక హంగుదారులే విన్పించి యూరకుందురా, అని సందేహములు కలుగవచ్చును. వీనిని హంగుదారులే విన్పింతురనుట సమంజసముగా దోఁచుచున్నది.

హిరణ్యకశిపుఁడు దేవతలను బాధింప వారు విష్ణునికడకుఁ బోయి తమబాధలు చెప్పుకొనఁగా ఆయన వారిని సంరక్షించెదనని మాటయిచ్చుట, దేవతలింటికిఁ బోవుటయు సూచిం

పఁబడిన తరువాతిదగు కథాసంవిధానము హిరణ్యకశిపుని కొలువుతో ప్రారంభమగును.

ఇందలి హిరణ్యకశిపుని సంస్థానవర్ణనయు, విజయరాఘవుని యాస్థానము ననుసరించియే చేయఁబడినదని యూహింపనగును. అచ్చట కటికవారనఁబడెడు వేత్రపాణులు, విదూషకులు నుండినట్లును, ఆనాటివిదూషకుని వేషభాషలను బట్టి యూహింపవచ్చును.

శుక్రాచార్యుని కుమారుఁడు నీరుకావిన్రోవతి నిలువు మగ్గపు పట్టుదుప్పటి, కనకపుకళ్ళజోడు, నూరెపుటపు కుళ్లాయి ధరించి వచ్చెనఁట. ఇది యానాటి ఆచార్యులును, పండితులును ధరించువేషమై యుండవచ్చును.

తరువాత వేల్పుమచ్చెకంటులు పదకేళికవినిపించుట. ఇదియును విజయరాఘవుని కొలువుకూటమున జరుగునదే యని యితరగ్రంథములనుబట్టి తెలియుచున్నది.

ప్రహ్లాదుని వేషమునుబట్టి బురుసాతదుప్పు, జిగిబంగరు టందెలు, చిలుకతాళి, కస్తురిబొట్టు, రత్నాంగుళ్యాద్యాభరణములు, అందెలు గజ్జెలు మున్నగువానిని రాజకుమారులైన చిన్నవాండ్రు ధరించుచుండిరని యూహింపనగును.

ఇందు ప్రహ్లాదునిచే హిరణ్యకశిపునకు మ్రొక్కించు సందర్భములో "మ్రొక్కెను మ్రొక్కెనయా" యనియు, "ప్రహ్లా

దోహమభివాదయే"యనియు రెండువిధములైన నమస్కార వాక్యములిచ్చి "యీరెంటిలో సరిపోయేది చెప్పిమొ్రక్కేది" అని యొకసలహా (Stage direction) యీయఁబడినది. దీనినిబట్టి ఆనాఁడీవేషములు వేసినవారి యోగ్యతనుబట్టి యీరెంటిలో నేదేనొకటి యుపయోగింపవచ్చునని యూహింపనగును. ఇంతటితో మొదటిరంగము పూర్తియగును.

రెండవరంగమున ప్రహ్లాదునికి ఆచార్యులవారు విద్యాబోధముచేయుట. ఇందు గురువుచెప్పిన మాటనే హిరణ్యకశిపుఁడను నర్థముగలదానిని కొంచెముమార్చి విష్ణువాచకముగా ప్రహ్లాదుఁడుచెప్పెను. ఇందు కవినేర్పు చూపఁబడినది. గురువు రాజకుమారునిబుగ్గలు మెలివెట్టుట చూచిన ఆనాటిబాలుర శిక్షించుట యూహింపవచ్చును.

తరువాతిరంగము హిరణ్యకశిపుని సభాంగణమున పాములవాని ప్రవేశము, వానిమూపున పాములకావడి, వెంట వానరము, చేతిలో నాగవరాళి, అతఁడు చేసినపాముల వర్ణనలు నాఁటిపరిస్థితులను నిరూపించుచున్నవి. తరువాత "ఆజోగితోలున చెలువునిపైవిడిచిన బలుచిలువ లెల్లను సలినలియై భూస్థలింబడిన"అనువాక్యముగలదు. రంగస్థలముపై పాములనెట్లు విడిచెడువారు? ఆపాములెట్లు సలినలియై పడినట్లు నిరూపించెడివారు? అనునవి కేవలమూహ్యమే. ఇట్టివిషయములను సూచ్యార్థ సూచనగా సంస్కృత నాటకములందు తెలియఁజేయుచుండిరి. ఇక్కడ

జట్లతోడి పోరాటము, ఏనుఁగుచేత ప్రహ్లాదుని మర్దించుట, రంగస్థలమున నెట్లుప్రదర్శించెడివారో యూహింపవలసినదే. జెట్టుల వర్ణనయు, వేషమును నాఁటిస్థితులకు ప్రతిబింబములు.

తరువాత తిరిగి పురోహితులు వత్తురు. వారి వేషమును, వర్ణనమును హాస్యరసపోషకములు. వీరు అభిచారహోమము చేయువిధానము, సంకల్పమును వర్ణింపఁబడినవి. ఇందలి హోమము వైదికులుచేయు హోమమువలెనే "హిరణ్యాయస్వాహా హిరణ్యాయేదంనమమ" అనునట్టి వాక్యములతో నిండియున్నది. తరువాత నొకశక్తి యుద్భవించినది. ప్రాయశః ఈమహాశక్తివేషము నొకఁడు ధరించివచ్చియుండవచ్చును. ఆశక్తి మోడిపోయి తిరిగి బ్రాహ్మణులపైఁబడినపుడు వారుపడుకలగుండు హాస్యరస పోషకమయ్యు వేదాంతార్థగర్భితమై యున్నది.

తరువాత నరసింహావతారము, హిరణ్యకశిపు నారసింహుల యుద్ధము, రక్కసుని మారణము, దేవతలువచ్చుట, ప్రదర్శింపఁబడును. ఇవియును రంగమునఁబ్రదర్శింపఁబడినట్లూహింపవలయును. తరువాత లక్ష్మీ సాక్షాత్కారము, ప్రహ్లాదుని స్తోత్రమును సూచింపఁడినవి.

ఈనాటకమున రంగముల మార్పును, కథాగమనమును మిక్కిలి యల్పముగాఁగన్పట్టుచున్నవి. ఇందుఁగవియొక్క శబ్ద ప్రయోగ నైపుణ్యమును, వర్ణనలనేర్పును జూపట్టుచున్నవి.

---

# ప్రహ్లాద చరిత్రము



సీ. శ్రీయానంద రాజగోపాల విలాస నా
టకము సందర్భించు సుకవివంద్య,
మధురోక్తులను చెంగమలవల్లిపరిణయం
బానతిచ్చిన ప్రతిభా నిధాన,
కోవిదుల్ గొనియాడ గోవర్ధనోద్ధర
ణము రచించిన కల్పనాధురీణ,
రతి మన్మథ విలాస కృతిరాజ మొనరించి
పరగు ప్రాబంధికపట్టభద్ర,
భువిని రాసక్రీడ నవనీతచోరంబు
హావణించి వెలయు మహానుభావ,
చాతురిచే పారిజాతాపహరణంబు
రచన చేసిన మృదు వచనధుర్య,
ఘనమైన రుక్మిణీ కల్యాణమనుకృతి
నిర్వహించిన బుధసార్వభౌమ,
సరస రాధామాధవవివాదము ధనాభి
రామం బొనర్చుసర్వజ్ఞతిలక,

పాండిత్యమున సత్యభామా వివాహ వ
ర్ణన యొనర్చిన కవిరాజరాజ,
ప్రాజ్ఞ లౌనన నుషాపరిణయ నాటకం
బమరఁ జేసిన శారదావతార,
దక్షిణద్వారకా స్థల వర్ణనాభాగ
ముద్ధరించిన సుప్రసిద్ధచరిత,
మహిమచేఁ గాళీయ మర్దనం బొనరించు
సరిలేని రాజుల చక్రవర్తి,
ధర రఘునాథాభ్యుదయము నాటకముగా
ద్విపదగా రచియించు ధీరవర్య,
అలమోహినీ విలాసాఖ్య ద్విపదకృతి
నాటకంబొనరించు నలసమాన,
అతి పవిత్రంబు ప్రహ్లాదచరిత్రంబు
నవరించు ఘన మనీషాధురీణ,
హరువుగాఁ బూతనాహరణంబనెడు నాట
కం బొనరించు శృంగారలోల,
తగు మంజరీద్విపద ప్రబంధము నాట
కంబొనరించిన గానచతుర,
విప్రనారాయణ విద్వత్కథాసంవి
ధానంబొనర్చిన ధీనిధాన,

బుధులు మెచ్చ సముద్ర మథననాటకరాజ
మొనరించు భువన మోహనచరిత్ర,
లలితమహా కృష్ణవిలాస నాటకమణి
గల్పిన యష్టభాషాధురీణ,
ఘనతరంబగు పాదుకాసహస్రంబెల్ల
స్వపదఁ జేయు కళావతీ తనూజ,
రసికులు పరిణుతింపఁ బరిణయకలహమను
కృతి యొనర్చిన చమత్కృతిధురీణ,
అతులితప్రౌఢిచే నలకంసవిజయంబు
ఘటియించు భువనవిఖ్యాతశీల,
ఘనమైన జానకీ కల్యాణనాటకం
బమరించు వావదూకాగ్రగణ్య,
నవ పుణ్యాకవ్రతనాటకవైఖరి
సేకరించిన వాగ్విశేష శేష,
కేళికై గోపికాగీతలు భ్రమర గీ
తలు తెనిఁగించు నద్యతనభోజ,
సరిలేని ఫాల్గుణోత్సవమెల్ల రగడ చా
పదము లొనర్చిన భవ్యచరిత్ర,
ధర రాజగోపాల దండకసందర్భ
వైదర్భిగన్న విద్వత్కవీంద్ర,

సారమౌ వీర శృంగార సాంగత్యంబు
మెఱయించు రసికుల మేలుబంతి
సంపంగి మన్నారు సాంగత్యము సమర్చి
జగతి మెచ్చిన నెఱజాణరాయ,
గోపాలునకు వేడుకోలు విన్నపములు
దరువులొనర్చునౌదార్యధుర్య,
యేలలు విడిపదాల్ మెచ్చుసంకీర్తన
లధ్యాత్మ లొనరించు సతులచర్య,
వాల్వోచి (?) గుజ్జరి విల్వోచు (?) దండలా
స్యము కందుకక్రీడ యల్లికయును
కొరవంజి శుభలీల గుజరాతి దేశి చౌ
పదము జక్కిణి దురుపదము మదన
బలదూత్యమును, జోగి, పదచాళి, శారదా
సామ్రాజ్యమును, చిందు, సవతిమచ్చ
రంబును, నాట్యకదంబంబు మొదలైన
నాట్యముల్ హావణించు నవరసజ్ఞ,
తే. మహితగాంభీర్య, చోళసామ్రాజ్యధుర్య,
కోటిమన్మథరూప, సద్గుణకలాప,
విక్రమకుమార, రఘునాథవిభుకుమార,
ధ్రువముగా మను విజయరాఘవనృపాల !

వ. పరాకు స్వామివారు హావణించిన ప్రహ్లాదనాటకంబు నటనపటిమ గనుపింప వినిపించేము విన నవధరించుండ.

ద్వి. శ్రీరాజగోపాల, చిరకీర్తిజాల,
కారుణ్య గుణశీల, కల్యాణలోల,
గోవర్ధనోద్ధార, గోపకుమార,
భావజసమరూప, బహుళప్రతాప,
నందగోపకుమార, నవనీతచోర,
చందన మందార సమకీర్తిహార,
కరుణా రసాపాంగ, గరుడతురంగ,
పరమ వచోవేద్య, భవరోగవైద్య,
దక్షిణద్వారకా స్థలకృతలీల,
రక్షింపఁ గదవయ్య రాధికాలోల !

వ. అని విజయరాఘవ భూపాలుఁడు రాజగోపాలస్వామినిఁ గొనియాడి యా దేవతాపట్టభద్రిని పట్టంపుదేవి నేమని ప్రశంసించీని.

ద్వి. కలశాంబు నిధికన్య, కల్యాణధన్య,
సలలిత సౌజన్య, జగదేకమాన్య,
పందారు శర్వాణి, వారిజపాణి,
మందరధరురాణి, మధుకరవేణి,

పరమదయాలోక పాలితలోక,
నియత గజానీక నియతాభిషేక,
భారతీ పార్వతీ భామల 1 లోనఁ
గోరిన వరమిచ్చుకువలయ నయన,
శ్రీ చెంగమలవల్లి, చెలువైనతల్లి,
కాచి రక్షింపవే కనకాబ్జవల్లి !

వా. అని యిష్టదేవతా ప్రార్థనంబు గావించి నాటక చాటు కావ్యంబు నిర్వహింపఁబూనిన విజయరాఘవ సార్వభౌముఁ డయ్యాదిమ దంపతులకు నేమని విన్నవించుచున్నాఁడు.

విజయ రాఘవస్వామి తెల్పేమాట :-మదీయ జననీజనకులైన ప్రధాన వధూవరులార ! హేమారవిందేందిరా రాజ గోపాలకస్వాములార ! నారద పరాశర పుండరీక వ్యాసాది భవదీయదాసుల కగ్రేసరుండైన ప్రహ్లాదుని చరిత్రంబు పరమ పవిత్రంబనియు నెంచి, మీరు నాకుఁ బాలించిన సారసారస్వతంబు సఫలంబుగా నాటక చాటుకావ్యరీతి వర్ణించెద నాకర్ణింపరయ్య,

వా. అని విన్నవించి విజయరాఘవ ధాత్రీకళత్రుండు హావణించిన ప్రహ్లాద చరిత్రంబునకు కథాక్రమంబెటువలెను.

1. కైన.

ద్వి. వైమానికులు చాల వర్ణింపఁ దగిన
నైమిశారణ్య పుణ్యస్థలంబునను
పరమపుణ్యుండగు ప్రహ్లాదు భవ్య
చరిత మెట్టిది యని సన్మౌనివరులు
కరమర్థి నడిగిన గౌరవంబొదవ
సొరిది వారలఁ జూచి సూతుఁడిట్లనియె :
"పలికెద వినుఁడు తాపసముఖ్యులార !
జలజసంభవుఁగూర్చి సతతంబుఁ దపము
గావించి మును హేమకశిపుండుభక్తి
దేవకిన్నర నరాధిపులచే మఱియు
నాయుధములచేత నలజడితనకు
రేయును బగలును. గృహమునన్ బయట
భూతలమున మింటఁ బొరయకయుండ
ఖ్యాతిగా వరములఁ గైకొని వచ్చి
యావరములచేత నత్యుగ్రమైన
కావరమున దేవగణములఁ దఱిమి
త్రైలోక్య రాజ్యమంతయుఁ బ్రతాపమున
నేలుచు యాగాదు లెల్లను దనకు
నర్పింపుఁ డనుచు నయ్యసురేంద్రుఁ డట్లు
పర్పించియున్న, బృందారకులెల్ల

సరసీరుహాసను సమ్ముఖమునకు
నరిగి తద్వృత్తాంత మంతయుఁ దెలుప
నతఁడు వారలతోడ నమృతాబ్ధి నురగ
పతిశయ్యపై నున్న పద్మాక్షుఁ జేరి
రక్కసుఁడొనరించు రాయిడియెల్ల
గ్రిక్కునఁ దెలిపినఁ గమలలోచనుఁడు
తెలిసి మీయలజడి తీర్చెద ననుచుఁ
బలికి వారలఁ బంపెఁ బ్రియదంబు మీఱ.

వా. ఇవ్విధంబున సుధాసాగరాంతరీపాంతరాళ విహారియగు మురారి పంప సొంపలరంగ నిలింపులు గుంపులుగ వెడలి, తడ యక వడిగా మగిడి యజయ్యంబగు నిజభవనంబుఁ జేరినఁ దదనంతర కథాసంవిధానం బెటువలెను.

వా. అంతటఁ గిరీటాద్యశేషభూషావిశేషంబులు ధరియించి దోషాచరవరేణ్యుండగు హిరణ్యకశిపుండు గొలువుకు వచ్చెనఁట యెటువలెను.

జతి॥ సౌరాష్ట్రము॥ ఆది॥

నేలపై నడయాడు – నీలశైలంబనఁగ
గాలమేఘమొక్కటి – గదలివచ్చె ననఁగ
త్రైలోక్యశూరుండు – దైతేయవరుండు
చాల వేడుకమీఱ – సభఁజేరవచ్చెన్ ॥

వా. ఇవ్విధంబున వచ్చిన వియచ్చరవైరి కొలువై యుండె నంట యెటునలెను.

వా. హితపురోహితామాత్య భృత్య విద్వత్కవిరాజ సమాజంబులు గొలువఁ గొలువై యున్న రాత్రించరసుత్రాముండు వేత్రపాణింజూచి యేమనుచున్నాఁడు.

హిరణ్యకశిపుమాట॥ రారానోరి కటికి ! హాస్యరసంబుఁ జిలుకు
పలుకుల నవ్వింప నేర్పరియైన విదూషకుని రప్పించరా.

కటికిమాట: అయ్యయ్య ! ఆలాగే రప్పించెదనయ్యా. రారా
వోరి ఆస్థానసంతోషి ! అయ్య పిలిచీని రారా.

వా. అని కంచుకి పిలువ ముంతమొగము దొంతరపంక్తులను కంతిగొంతును గలిగి వింతవింతగంతులువైచుచు సభారంజకుఁడు వచ్చెనంట యెటువలెను.

జతి॥ ఘంటారవము॥ ఏకతాళి॥

వేలిసిగ వేసికొని – వెఱివెఱినవ్వులు నవ్వుకొని
నీలిదట్టి గట్టుకొని – కోలకేతుండు వచ్చెను॥

(ఇక్కడ విదూషకుఁడు హాస్యపుమాటలాడేది.)

వా. ఇవ్విధంబున విదూషకుండు తనవేషభాషలచే దోషాచర కుంజరునకు హృదయరంజకంబు గావించి మగిడెనంట యెటువలెను.

వా. ఆసమయంబున హిరణ్యకశిపుండు తన సమ్ముఖమ్మున నున్న కటికివానింజూచి మఱియు నేమనుచున్నాఁడు.

హిరణ్యకశిపువాక్యం:- రారా కటికి! నాటకశాలకొలువుకు
ఆచార్యులు మొదలైనవారిని రప్పించరా.

కటికి:- అయ్యయ్యా. అయ్యా ఆచార్యనందన! ఏలినవారు
నాటకశాల చూస్తామన్నారు రారయ్యా.

వా. అనిపిలువఁగా నాచార్యులు వచ్చేక్రియ మెటువలెను.

దII ముఖారిII

నీరుకావిధోవతి మీఁద - నిలువు మగ్గపుఁబట్టుదుప్పటి
తీరైన కనకపుఁ గళ్ళజోడు - దీపింపంగాII
సూరెపుటపు కుళ్లాయిపూని - శుక్రనందనుఁడావేళఁ
జేరవచ్చె దైతేయ - శేఖరుని వద్దకిII

వా. ఆశుక్రకుమారునిం జూచి శక్రవిరోధి సింహాసనము డిగ్గి నమస్కరించఁగా వా రాశీర్వదించిరఁట యెటువలెను.

హిర:- వందనంబిదె నీకు ఆచార్యనందనా!

శుక్ర:- విజయీభవ, విజయీభవ.

వా. అని యాశీర్వదించిన దేశికసుతుని అర్ఘ్యాసనంబున నుంచి దైతేయ మూర్ధన్యుండు సుఖాసీనుఁ డయ్యెనఁట యెటువలెను.

హిరణ్యకశిపువాక్యం:- రారా కటికి! కేళిక చూడవలసి యున్నది.
రంభను పిలిపించరాII

వా. ఆసమయంబున హిరణ్యకశిపుఁడు పిలువనంపఁగా నాటకశాలవారు వచ్చిరఁట యెటువలెను.

ద. చెఱకు విల్లిడు రౌతు చేలకోరులో యన
బిరుదుపాత్రలు వచ్చిరి సురవైరికడకు॥

వా. ఆమచ్చెకంటులు తొంటితెఱగంటిదొరకు చేతులు
మొగిచి యేమని విన్నవించిరి.

మొక్కేము మొక్కేమయా రక్కసరాయ !

హిరణ్యకశిపువాక్యం:- ఓమించుఁబోఁడులార ! యించుకసేపు
పదకేళిక వినిపించరె.

వా. అనిపలుకు పూర్వసుపర్వసార్వభౌముని కుఱంగట నా కురంగనయనలు మెఱుంగుటందెలరవళి తరంగలింప శృంగారనటనంబు సలిపిరఁట యెటువలెను.

(పదం సమయోచితంగా వినిపించేది)

హిరణ్యకశిపువాక్యం:- రారే యోబాలికలార, మీకేళిక బాగాయెను. మీకేలికి పచ్చలమేలి కడేలు చేకోరే.

వా. అప్పుడామచ్చెకంటులు వియచ్చరవిరోధిచే మెచ్చులంది మగిడిరఁట యెటువలెను.

వా. ఆసమయంబున నాచార్యులఁ జూచి హిరణ్యకశిపుఁడేమనుచున్నాఁడు.

ద్వి. సన్నుత బహువేదశాస్త్రప్రవీణ,
విన్నపమొక్కటి వినవయ్యయిపుడు
బాలుఁడైనట్టి మాప్రహ్లాదు మీరు
చాల ప్రౌఢిమ మీఱఁజదివించరయ్య.

శుక్రకుమారునివాక్యం:-

ద్వి. దనుజేంద్ర, హర్షమెంతయు నయ్యె నేఁడు
దినము మంచిది తోడి తెప్పింపుఁ డతనిఁ
బదునాల్గు విద్యలఁ బ్రావీణ్యమమరఁ
జదివింతు నీమది సంతోషమొదవ.

వా. అని విన్నవింప నన్నిలింపవిరోధి కటికివానింజూచి యేమను చున్నాఁడు.

హిరణ్య:- రారా కటికి, ప్రహ్లాదునిఁ దోడితేరా.

కటికి:- అయ్యయ్యా, ఓయి కుమారకంఠీరవ, అయ్య పిలిచీని రావయ్యా.

వా. అనికంచుకి పిలువ నతని కొలువుకుఁ బ్రహ్లాదుఁడు వచ్చె క్రమమెటునలెను.

క. బురుసాతడుప్పును, జిగి బం
గరుటందెలు, చిలుకతాళి, కస్తురిబొట్టున్,
సురుచిర రత్నాంగుళికా
భరణంబులు, పరిఢవింప బాలుఁడు మెఱసెన్.

వా. ఇటువలె ప్రహ్లాదుండు వచ్చేక్రమమెటు వలెను.

ద. బిలాహురి॥ ఏకతాళి॥

అందెలు గజ్జెలు - నందందమ్రోయంగ
అందముగాఁ బ్ర - హ్లాదుండు వచ్చెన్.
ప్రహ్లాదోహ మభివాదయే -

మొ్రొక్కేను మొ్రొక్కేనయ్యా యయ్య (ఈ రెంటిలో సరి పోయేదిచెప్పి మొ్రొక్కేది.)

వా. అని జోహారు చేసినకుమారుని గారవించి చేరఁదిగిచి తనదండఁ గూర్చుండ నియమించి దయమించిన పలుకుల బృందారకవైరి గురునందనుఁజూచి యేమనుచున్నాఁడు.

హిరణ్యకశిపువాక్యం:— ఓఆచార్యనందన ! ఇదియే సుము హూర్తంబు. ప్రహ్లాదునకు విద్యాభ్యాసంబునకు ముహూ ర్తంబు సేయించరయ్యా.

ఆచార్యులు:- అయ్యయ్యా ! మహాభాగ్యము చేస్తిని. అటువలెనే చదివించేనయ్యా.

వా. అని పలికి గురుతనయుండు హిరణ్యకశిపుని వీడుకొని ప్రహ్లాదునిఁ దోడుకొని భారతీభవనంబునకు వచ్చి విద్యారం భంబు గావించెనఁట యెఱవలెను.

శుక్రకుమారుండు చదివే శ్లోకము:-

శ్లో. దంష్ట్రాకరాళవదనం బృందారకభయావహం
హిరణ్యకశిపుం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే॥

ధ్యాయామి ఆవాహయామి సర్వోపచారాన్ సమర్పయామి.

వా. అని హిరణ్యకశిపు ప్రార్థనచేసి యసగ్గళ నిసర్గమధు రోక్తి విహారుండగు భార్గవకుమారుండు చక్రిభజన క్రియాశాలి యగు నాశకారిసుతుని నేక్రమాన చదివించెను.

ఆచార్యునిమాట:- రావోయన్న, చదువవోయి ప్రహ్లాద !

గురువాక్యము:- 'నమోహిరణ్యాయ' అననోయి.

ప్రహ్లాదవాక్యం:- నమోహిరణ్యాంబరాయ.

గురువాక్యం:- ఓయి అషువలెగాదు. అంబరశబ్దమేలచెప్పేవు ?
నమోహిరణ్యాయ అనవోయి.

ప్రహ్లాదవాక్యం:- నమో హిరణ్యగర్భజనకాయ.

గురువాక్యం:- అయితే నీకీశబ్దము రాదు గంటిమి. నమోదైత్యే
శ్వరాయ. అనవోయి.

ప్రహ్లాదవాక్యం:- నమోదైత్యహరాయ.

గురుతనయునివాక్యం:- ఓయి బాలకా! యీప్రతికూలవచ
నంబులేల? నమో దేవభయంకరాయ, అననోయి.

ప్రహ్లాదవాక్యం:- నమో దేవాభయంకరాయ.

గురువాక్యం:- భళాభళ! మహాలెస్సాయె. నేనొకటచెప్పితే
నీవొకటి చెప్పుచున్నాఁడవు. ఓయీ యెజ్ఞావధానులు!
చూస్తివా తనయద్వాతద్వాలు మానఁడు. దొరకొమా
రుండు గదయ్యా మనమేమనేవచ్చును! ఇషువంటివానికి
ఎషువలె చదువు వచ్చునయ్యా.

ఎజ్ఞావధానిమాట:- సర్వావధానిగారూ, మీారు ఇషువలె వేసట
కొందురా? మహారాజుకొమారుండు గాఁడా? బాలుండు
గాఁడా? ఒక యించుక సోఁకోర్చి పట్టిచెప్పరయ్యా
వచ్చెడిఁ గాని.

వా. అనిన గురుండు కోపాటోపప్రచండుఁడై ఆకొండిక ప్రాయంపుఁ జిన్నికుమారుని బుగ్గలు వడిపెట్టి దిగ్గనలేచి యే మనుచున్నాఁడు.

శుక్రకుమారునివాక్యం:- ఓరి, దనుజకుల పట్టభద్రుని కడుపునం బుట్టి త్రైలోక్యాధీశ్వరుండైన దానవాధీశ్వరుఁ డుండఁగా అదృశ్యుఁడైన నారాయణు నెంచేవా? కానీ కానీ నీకుఁ దగినబుద్ధి చెప్పించేగాని రారా.

వా. అనిచేపట్టి తిగిచిన నాదనుజకుమారుండు భీరుండై గురు కుమారునిం జూచి యేమనుచున్నాఁడు.

ప్రహ్లాదుండుచెప్పేది:-

ద॥ కల్యాణి॥ ఏక తాళము॥

హరి సర్వేశ్వరుఁ - డని నే నమ్మితి
నెఱుఁగక నన్నేల - యేఁచేరు।
తపువు సేయక గురు - తనయ, నేవచ్చెదను
సరగున మాయయ్య - సముఖానకు॥

వా. అనుచు వచ్చిన జగత్త్రయస్తోత్రపాత్రచరిత్రుం డగు ప్రహ్లాదుని సురామిత్రసుతాగ్రమునికింజూపి గురుపుత్రుం డేమను చున్నాఁడు.

శుక్రకుమారుని వాక్యము:-

ఓయయ్యా, యీప్రహ్లాదుండు నేఁజెప్పినచొప్పునఁ జదువక హరికీర్తనలే చేస్తున్నాఁడు. ఎంతచెప్పినా తన యోజ మానఁ డయ్యా.

హిరణ్యకశిపువాక్యం:- మేము వీనికిఁ దగినబుద్ధి చెప్పించేము గాని మీరు విచ్చేయరయ్యా.

వా. అంత నద్దనుజుండు తనూజునితో నేమనుచున్నాఁడు.

హిరణ్యకశిపువాక్యం:-

ద్వి. ఇది యేమిరా యోరి యీయోజ నీకుఁ
జదువుకొమ్మన్నను జలమురెట్టింప
నాచార్యువలన విద్యాభ్యాసమేమి
యాచరింపక సారె హరి హరి యనుచుఁ
బగవానిఁ దలఁచుచు బాలత్వమునను
మిగుల నాపలుకులు మీఱఁ జూచెదవు.
తనయుఁడవా నీవు దాయవు గాక
నెనరెట్లు గలుగురా నీమీఁద నఁకను.

వా. అని యనుచు నుగ్రదనుజాగ్రేసరుండు పలుక నాచిన్ని చెలువుండు కన్నీరుగుగ్రిక్కుచు, సన్నిచరజనీచరుసిఁ జూచి యేమనుచున్నాఁడు.

ప్రహ్లాదుని వాక్యము :- అదేమయ్యా, "సర్వం విష్ణుమయం జగత్" అనేవాక్యం పెద్దలానతియ్యంగా విని హరికీర్తన చేస్తి నింతేకాని నావల్ల నేర మేమయ్యా.

వా. అని పలుకుపలుకులకు. గోపాటోపపాటవపాటు బాత్మునై శతకోటి ధరద్వేషి ప్రహ్లాదుని చూపించి యేమను చున్నాఁడు.

హిరణ్యకశిపువాక్యం :-ఓరి! నీవు శత్రుండవుగాక పుత్రుండవా?
మాయెదుట నుండక లేచిపోరా.

హిరణ్యకశిపువాక్యం :-ఓరీ కటికి, ఈవేళ వ్యాళగ్రాహిం
దోడితేరా.

కటికి: -అయ్యయ్యా, అటువలెనే తోడితెచ్చెదనయ్యా, ఓయీ
పాములజోగి, అయ్య పిలిచీని రావోయి.

వా. అని కటికివాఁడు పిలువఁగా పాములవాఁ డేవిధాన
వచ్చెను.

జతి॥ ఆహారి ॥ఆట॥

వరుసలకు దిద్దిన - వానరము వెంటరాఁగా
కఱకు మూపునఁ జిల్వ - కావడిపూని।
పరఁగ నాగవరాళి - పాడుచుఁ బాములజోగి
సరగ దైత్యేంద్రుని - సభఁ జేరవచ్చె॥

పాములవాఁడు : మొ్రక్కేను మొ్రక్కేనయా రక్కసరాయ!
పాలసంద్రాన పవళించిన రాజగోపాలస్వామికి పాను
పైన యోనాగుమయ్య ! త్రిపురాలు సాధించిన జంగ
మయ్యకు బంగరు వింటినారియైన యోకోరజీవాలదునే
దారి! నాకు బ్రిసన్నుఁడవు గావయ్యా.

వా. అని జాంగలికుండు భుజంగంబు నేవిధాన నాడించెను.
(పామునాడించేది)

వా. ఇవ్విధంబున జాంగలికుండు భుజంగంబు నాడించి ప్లవంగంబు నేవిధాన నాడించెను.

పాములవాని వాక్యం:

ద్వి. ఓసామి, విన్నపమొకటి గావింతు
నీ సేవ సేయంగ నేర్చినవాఁడ
నాగురు నానతి నాగేంద్రునైన
వేగంబె తడకట్టి విడుమన్న విడుతు.
పాదయుగ్మంబునఁ బన్నగద్వయము
చేదోయియందును జిలువలజోడు
మఱి నోర నొకమహామారుతాశనము
తెఱఁ గొప్పఁబట్టి యైదింటి నాడింతు.
గరుడయంత్రం బుదకంబుపై వ్రాసి
సరగ మంత్రించి యాజలమునేఁ జల్ల
నెటువంటి విసము దానెక్కియుండినను
చిటికె వేసినయంత జిఱ్ఱున డిగ్గు.
మలయాచలంబున మందరగిరిని
కలధౌత నగమునఁ గనకాద్రియందు
బిలముల నుండెడు భీమసర్పముల
బలువిడి వాకట్టి పట్టి తెచ్చితిని.
మేనులు నిగనిగ మెఱయఁగనున్న

నానావిధములైన నాగుఁబాములను
నిడుదలై మిక్కిలి నిలువెల్ల పెక్కు-
పొడలచేఁ గనుపట్టు పొట్టపెంజెరలఁ,
దోరంబులై చాలఁ దుదతోఁక లంటఁ
జారలమించు దాసరి చిలువలను
నాలుకల్ గోరియుచు నవ్యవిషాగ్ని
కీలలు గ్రక్కెడు కృష్ణసర్పములఁ
బైకొల్పి చాల నాప్రహ్లాదు నిపుడు
చీకాకు సేతు నీశ్రీపాదమాన.

వా. అని యా నాగసరంపుజోగి యాభీలవిషాగ్ని జ్వాలంబు లగు భోగిజాలంబుల నాబాలునిపై నేలాగునఁ గదియించెను.

ద॥ ఆరభి॥ ఆట॥

పాములవాఁ డాబాలుని నప్పుడు
బాములఁ బెట్టెను — పాములచేత.

ప్రహ్లాదవాక్యం : హరి హరి ! కాళీయభంజన !

వా. ఇటువలెఁ బాములు గదిసినఁ బ్రహ్లాదుండు నిజహృదయసింహాసనంబున నున్న గోపాలసింహంబునకుఁ గేలు మొగిచి "యో కాళీయభుజంగభేది ! గరుడతురంగవాహ ! ఈ పన్నగంబుల భిన్నభిన్నంబులుసేసి నన్నుఁ గావవే" యని విన్నవించెనంట యెటువలెను.

ప్రహ్లాదుఁడు చదివే పద్యం :

క. పెక్కువిధంబులఁ జిలువల
కక్కటు వైరింపఁజాల; హరి హరి ! నీవే
దిక్కని యుండుదు నెప్పుడు
గ్రక్కున మన్నారుసామి, గావ వదేమీ !

వా. అని ప్రహ్లాదుండు వేడిన నాదేవుని ప్రభావంబున జో॥ తులువ యాచెలువునిపై విడిచిన బలుచిలువల్లెల్లను సలిసలియై భూస్థలింబడిన వాఁడు తన బరిపెట్టలు తలఁబెట్టుకొని హిరణ్యకశిపునివద్ద కేవిధాన వచ్చెను.

ద॥ యదుకుల కాంభోజి॥ ఏకతాళము॥

పాములఁగొల్పడితిని ఈ – పాపజాతిమాట విని
ఏమని చెప్పుదు నా – యీడువారితో॥

వా. అనుచు వచ్చిన పాములవాఁడు హేమకశిపునితో నే మనుచున్నాఁడు.

పాములవానివాక్యం:– ఓసామీ, పాములచేత నెన్ని బాములు పెట్టినా పాములే తుత్తుమురాయెఁగాని యానీచుఁ డిసుమంతైనా విసమంటి కసుగందఁడాయెనయ్యా.

హిరణ్యకశిపువాక్యం:–

అయితే నీచేతఁగాదు పోరా ఓరి. ఓరికంచుకీ ! జగజెట్లను దీసుకరారా.

కటికి:- అయ్యయ్య! అటువలెనే తోడి తెచ్చెదనయ్యా.
ఓహో జగజెట్లు! ఏలినవారు పిలిచేరు రారోయి.

వా. అని రాత్రించరుండు పంప వేత్రపాణి పిలువ కండలు దిరిగిన కుఱుమట్టంపు గట్టిరెట్టలతో, నెఱమట్టి పచ్చడంబులతో గుఱుచజెట్లచేనొప్పు బరిబోడితలలతో మట్టిపట్టించి కట్టిన గట్టి నగదట్లతో జగజెట్లు వచ్చిరఁట యెటువలెను.

జతి॥ మలహారి॥ హుశాని॥ త్రిపుట॥

బలుమట్టి పచ్చడంబులు బిగువు దట్లు
దళమైన చేతాళ్ళు – దనరఁగను॥
పలుతెఱంగుల డవిణమలహారి మెఱయఁ గా
వలనొప్ప జగజెట్లు – వచ్చిరావేళ॥

జెట్లభాష:- సలాము సలామయ్యా దానవలలామ! కత్తిరఁ గాజెట్టి, అడ్డతలహనుమాజెట్టి, నిమాజెట్టి, బవనాజెట్టి వీరు మొదలైనవారిలో మాచేతిపెట్టు తిననివారులేరు. దూరదేశాననుండి స్వామివారికీర్తి ప్రతాపాలు విని వస్తిమి. మీవేడుక చెల్లించేము చూడ నవధరించుఁడ.

వా. అని తమపౌరుషంబులు విన్నవించిన జెట్ల కాజగదేక వీరుండు తాళ్ళు ఇప్పించెనఁట యెటువలెను.

వా. ఈవిధాన నసమ సమరసన్నాహధౌరేయులై కాసెవేసి కొని యుప్పొంగి భుజంబు లప్పళించుచు రంగమధ్యంబున నిలిచి యభంగుర సంగరోత్సాహసాహసంబులు దైవాఱ వారిలో

నిద్దఱు జగజెట్లు చెంతనున్న హరొంతకారుచెంత నంత నిలిచి హెచ్చరింప నొకరొకరితో మత్సరింపుచు చేరిరట యెటువలెను.
(జెట్లుపోరాడేది)

హిరణ్యాకశిపువాక్యం:- అవునోయి జెట్లు! పోరాడి బిరుదు
చెల్లించుకొంటిరి. ప్రహ్లాదుని పట్టిపెట్టిరారోయి.

ద॥ కాంభోజి॥ ఆట॥

జగజెట్లు తమపుణ్యా - జననాథుఁ డంపఁగా
తగుజెట్టిసాదనఁ - దసరుచును
అగణిత హరిభక్తి - నలరెడు ప్రహ్లాదు
బిగియ సందువేసి - పెనఁగిరి.

ప్రహ్లాదుని మాట:- హరి హరి! చాణూరమర్దన!

వా. ఇట్లు జగజెట్లు పెనంగిన, ప్రహ్లాదుండు యాదవచక్రవర్తి దివ్యమూర్తి భావించి, భావంబునకు రావించి, చాణూరమల్లుల గెలిచిన వల్లవీవల్లభ, యీమల్లుల తుత్తుమురుగా నణఁపవే యని విన్నవించెనఁట యెటువలెను.

ప్రహ్లాదుఁడు చదివేపద్యం:-

క. జగజెట్లు తూరి నాపై
బిగియంగా సందువేసి పెనఁగెద రణఁపన్
దగదే చాణూరాంతక!
జగదీశ్వర, సుప్రసన్న, సంపఁగిమన్నా!

వా. అని విన్నవింప నాచిన్నికొమరుని హృదయంబులో నున్న వెన్నుని కౌమోదకీ గదాఘాతపరిభూతులై వారా దితి కుమారునింజేరి యేమని విన్నవింపుచున్నారు.

జెట్లమాట:- ఓసామీ, ఆబాలునితోఁ బెనంగి పెనంగి మా
దేహంబులు గులగుల లయ్యెనయ్యా. నీపట్టి మట్టుపెట్ట
మాచేతఁ గాదయ్యా.

హిరణ్యకశిపుమాట:- అయి తేపోరాంటరి ! ఓరికటికి ! మద
హస్తిఁ దెమ్మని మావంతుని కెచ్చరింపగా

కటికివాక్యం:- అయ్యయ్య ! ఆలాగే తెప్పించెదనయ్యా.
ఓహో మావంతుఁడ ! ఏలినవారు మదపుటేనుఁగును
దెమ్మనేరు కొమ్ముకత్తులు కట్టుకొంచు రావోయి.

వా. అని బాగుదారుండు పిలువ బలవంతుడైన మావంతుఁడు కక్కసంబునఁ జాలవెక్కసంబగు నొక్కదిక్కరిరాజంబు రక్కసిరాయనిసమ్ముఖంబునకుఁ గొనివచ్చెనఁట యెటువలెను.

జతి॥ ద॥ కన్నడ॥ రూపకము॥

మదవాసనలకుఁ దు - మ్మెదలు ఝుమ్మనిరాఁగ
మదపుటేనుఁగు దెచ్చె - మావంతుఁడపుడు॥

మావంతుని వాక్యము:-

గవురు వచ్చెనయ్యా దానవలలామ !

గీ. అయ్యా యిదిగో లునకుఁ జెయ్యియందగించి
యెంత మదసింధురమ్మైన నెదిరిపోడుచు
గబ్బినగమించు గొబ్బిమెకంబునైన
మీటి చూపించినంతనే కీటణంచు.

హిరణ్యకశిపువాక్యం:- ఓయి మావంతుఁడ ! యీమదదంతిచేఁ బ్రహ్లాదుని మదమణంచి రానోయి.

మా:- అయ్యయ్య.

వా॥ అనిన మావంతుఁ డావైష్ణవోత్తమునిపై మదహస్తిని హత్తించెనఁట యెటువలెను.

జతి॥ ... ... ... ...

వా॥ ఇవ్విధంబున నమ్మహాగజంబు కొమ్ములఁ గుమ్మిన నమ్మహాభాగవతుండు తన నిండుమనంబుననుండు పుండరీకాక్షునిఁ దలంచి "యోశరణాగత వజ్రపంజర ! కువలయాపీడకుంజరభంజన ! నన్ను రక్షింపవే!" యని విన్నవించెనఁట యెటువలెను.

ప్రహ్లాదుండు చెప్పేది:-హరిహరి ! కువలయాపీడభంజన !

క. మదసింధురంబు నాపైఁ
గదియింపఁగఁ జేసెఁ దండ్రి గడుసరి యహహా !
మది నేనెటువలెఁ దాళుదు
సదయా శ్రీకృష్ణ ఘనుసుపవన్న, సంపఁగిమన్నా!.

వా. అని యాదేవుని పరిభానంబునఁ గక్కసపుటేనుంగు మొక్కలంబునకు నొక్కింతయుఁ జెక్కుచెమరకయున్న యక్కుమారుని త్రొక్కించలేక మావంతుఁ డావృత్తాంతం బన్నిశాచరేంద్రునకు విన్నవింప మగిడెనఁట యెట్టులనెను.

ద. ఘంటారవము॥ ఏకతాళము॥

పోరనిసువు మీఁదఁ – బోరాడింపఁబంపిన
వారణమును మా – వంతుఁడు దెచ్చె.

మావంతునివాక్యం:- ఓసమరవిక్రమకంఠీరవ, ఈసమదనాగ
జంబుచే నాచిన్నిబాలుని దూలించరాదయ్యా.

హిరణ్యకశిపుమాట:— అయితే నీచేతఁగాదు పోరాపోరా!
రారా కటికి! పురోహితులఁ దోడుకరారా.

కటికి :- అయ్యయ్యా! అలాగేదోడుక వచ్చెదనయ్యా! ఓహో
పురోహితులు! ఏలినవారు పిలిచేరు రారయ్య. అని
వేత్రపాణి పిలువఁగాను ధాత్రీసురులు తమలోఁ దా మే
మను చున్నారు.

పురోహితులమాటలు:-

అష్టావధానిమాట:- సర్వావధానిగారు, నగరివారు మనలఁ
బిలిపించిన కార్యమేదో!

లుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయం

సర్వావధాని ప్రత్యుత్తరం:- అష్టావధానులుగారు! క్షణం
ఉండు, నేను నగరిలోనికిఁబోయి విచారించి వస్తే
గాని.

సర్వావధాని :- అదేందిరా పడుచుసుడియ ! పెద్ద పిన్నయం తరువు లేక యెదురుమాటలాడుచున్నా(డవు. నీవు రాజాస్థానానకు యోగ్యుండవపరా ?

ఎష్టావధాని : ఓరీ వజ్రిశుంఠ ! వయసు చెల్లితేనే నీవొక పెద్దవపరా ? నావలె వేదశాస్త్రిలు పరీక్షయిచ్చేవు ?

సర్వావధాని : ఓహోహో పడుచునరక ! నిన్నునే సరిచేసు కొని వేదశాస్త్రిలు పరీక్షయిస్తేగాని మాకు ప్రితిష గాదేమో ! ఇషువలె యద్వాతద్వాలాడక యూరకే యుండ(గదరా.

కటికివానిమాట :- ఓయీ మీాలో మీారేల కొట్లాడుచు న్నారు ? నగరివారు మిమ్మిద్దరినిన్ని పిలువ మన్నారు రారోయి.

ద॥ రేవగుప్తి॥ ఏకతాళి॥

గంగ మట్టి( బెట్టి నీరు - కావిధోవతులు గట్టి
కెంగేల దర్భముళ్ళు - పంచాంగముల(బూని
పొంగుచు వచ్చిరి విప్రి - పుంగవులప్పుడు
బంగారు పేరుగల్గిన - బలశాలికడకు.

ఆశీర్వాదం : అఖంపభూమండలాధి పత్యమస్తు.

హిరణ్యకశిపు వాక్యం : ఓ భూమిసురులార, మీారాభిచార హోమము చేసి యీామొక్కాలి సుడియని యుక్కణ(గించరయ్యా.

పురోహితుల మాట : మహాభాగ్యమాయెను. అట్లువలె హోమము చేసెదమయ్యా.

సంకల్పము : (శ్రీ) హిరణ్యా హిరణ్యా. హిరణ్యకశిపో రాజ్ఞయా ప్రవర్తమానకాలే నారాయణ ప్రహ్లాద విజయాయాభిచార హోమం కరిష్యే. హిరణ్యాయస్వాహా హిరణ్యాయేదంనమమ, దానవేంద్రాయస్వాహా దానవేంద్రాయేదం నమమ. దివిజాంతకాయస్వాహా దివిజాంతకాయేదం నమమ. మహాక్రూరాయస్వాహా మహాక్రూరాయేదం నమమ.

శ్లో. ఏహి శక్తే మహాశక్తే ప్రహ్లాద విజయం కురు
దానవేంద్రస్య సంతుష్ట్యై మహాఘోరతరాకృతే ॥

వా. అని వారాచరించు ఘోరాభిచార హోమకుండంబున నుండి బ్రహ్మాండభాండంబు గబళించు నుద్దండ మస్తకంబుతో మండలాగ్రమండిత హస్తంబుతోఁ గొండంత దేహంబుతో చండ సాహసోత్సాహంబుతో నొక మహాశక్తి వెడలి వచ్చెనఁట యెటువలెను.

జతి॥ ద॥ రామక్రియ॥ రూపకము॥

నిప్పులు గుప్పించుచు నేత్ర - గోళములతో
గొప్పముమ్మొన వాలుతోఁ - గుప్పిగంతులతో।
నుప్పరంబుదాఁక పెరిగి -- హోమకుండంబు వెడలి
కప్పుమేని యుగ్రశక్తి - కదలి వచ్చెనపుడు ॥

శక్తి వాక్యం : ఓబ్రాహ్మణులార ! నన్ను రప్పించిన కార్య మేమి ? కొండలు పిండిసేతునో ? అఱచేత మిన్ను చఱచి చుక్కలు జలజల రాల్తునో ? సప్తసముద్రాలు కలంతునో ? తెలుపరయ్యా.

బ్రాహ్మలమాట : ఓమహాశక్తీ ! ప్రహ్లాదుని మట్టిపెట్టిరమ్మా.
శక్తిమాట : ఓయి బ్రాహ్మణులార ! నన్ను పంపు పెట్టఁదగిన దిక్కుకు పంపక యీ బాలునిమీఁదనా పంపు పెట్టేది ?
బ్రాహ్మలమాట : ఓమహాశక్తీ ! నీకీ బాలుఁడు లయము గాఁడు. అయినా రాజాజ్ఞ మీఱరాదుగదా ! ప్రహ్లాదుని మట్టుపెట్టిరమ్మా.

శక్తిమాట:- అయితే మహాలెస్సాయెను.

వా. అని మేదినీదేవతలు పంపు పెట్టఁగా శక్తి ప్రహ్లాదునిపై నేవిధానతూఁలెను.

జతి॥ ... ... ... ...

వా॥ ఆమహాశక్తి డాసినఁ బ్రహ్లాదుం డేమని పలికెను.

ప్రహ్లాదుండు చెప్పేది:-హరిహరి ! చక్రాయుధ !

క. గుంపులు గట్టిన బాపలు
పంపుడు వెట్టంగ శక్తి పైకొనె నను ర
క్షింపు పరాకొనరింపక
చంపకవాటీనివాస, సరసవిలాసా !

వా. అని పలుకు సమయంబున ప్రహ్లాదుని దేహం బవగాహించిన చక్రిచక్రప్రహారంబున శక్తి యశక్తయై యామహాభాగవతుని విడిచి ధరాస్థలిం ద్రెళ్లెనంట యెటువలెను.

వా. ఇవ్విధంబునఁ ద్రెళ్లి శక్తి తుళ్లి పడి లేచి యాచేరువ నున్న బ్రాహ్మణులంజూచి "యోరీ ! మీరు నన్ను పంపు పెట్టఁదగిన దిక్కునకుఁ బంపక పరమభాగవతుండైన ప్రహ్లాదుని మీఁదనా పంపుపెట్టేది".

వా. అని గర్జిల్లుచు, నమ్మహీనిర్జరులు తత్తరంబునఁ బరువు లెత్తి నుస్వోత్తుగా హత్తుకొనెనంట యెటువలెను.

ఎఱ్ఱావధానిమాట:- ఓయి సర్వావధాని, నాకుళ్ళాయి యే దోయి !

సర్వావధానిమాట:- ఓయి యెఱ్ఱావధాని, నీకుళ్ళాయికి వాం డాడుచున్నావు నా శిరస్సేదోయి !

ఎఱ్ఱావధాని:- నీ శిరస్సెటుబోతేనేంది నేనేదోయి ?

సర్వావధాని:- ఓయి నీవే నేను గాదషువోయి ?

ఎఱ్ఱా :- నీవే నేనైతే నేనేదోయి !

సర్వా :- ఓయి ! అషుగాదోయి, శక్తి కన్ను వేసి నన్నెత్తుక పోయెనో.

ఎఱ్ఱా :- ఓయి, నన్నెవ్వరెత్తుక పోయిరోయి !

సర్వా :- నిన్నెవ్వరైనా యెత్తుకపోతే మాట్లాడే వారెవ్వ రోయి.

ఎఱ్ఱావ :- అయితే నే నున్నాఁడనంచున్నాఁడవు. నన్ను జూపుమా నీకు దర్భపవిత్రి మిచ్చేగాని.

సర్వావ:- నేనుండిగదవోయి నిన్ను జూపవలెను. నన్ను జూపుమా నీకు దర్భ చక్కిల మిచ్చేగాని.

ఎఱ్ఱా :- అదిగో నీవు, ఇదిగో నేను. ఇదిగో నీవు, అదిగో నేను. నీవుఁబదిలం, నేఁబదిలం. నేఁబదిలం నీవుఁబదిలం.

వా. అని యిటువలె శక్తికరాఘాతభీతులైన భూసురు లయ్యసురేంద్రుని సమ్ముఖంబునకు వచ్చి యేమనుచున్నారు.

బ్రాహ్మణులమాట:- అయ్యయ్యా మదీయాభిచారహోమంబున నావిర్భవించినశక్తి యయ్యర్భకునిఁ జెనకలేక మాపైఁ గుప్పించిన దప్పించుకురాఁ బష్టపాటు ఎంపైనాకర్గయ్యా.

హిరణ్యకశిపువాక్యం:- హోహోహోయి ! మీరొక బ్రాహ్మణుని కొడుకులఁట ! మెడఁ బట్టి నూకరా.

హిరణ్యకశిపువాక్యం:- రారా కటికి, ప్రహ్లాదునిఁ దోడితేరా.

కటికి:- అయ్యయ్యా ఆలాగే తోడితెచ్చేనయ్యా. ఓయికుమార కంఠీరవ, అయ్య పిలిచీని రావయ్య.

వా. అప్పుడా హిరణ్యకశిపుం డక్కుమారవరేణ్యుండు విష్ణుశరణ్యుండై తాఁజేయించు గాసికి నిసుమంతైనఁ గసిగందకయున్న చందంబున కచ్చెరువంది తనతనయుని నిగ్రహింపఁ దనచేతఁ గాని యితరులచేతఁ గాదని నిశ్చయించి బాగుదారునిఁ బంచి యామహాభాగవతుని రప్పించి, రూక్ష కటాక్షంబుల నీక్షించి యేమనుచున్నాఁడు.

హిరణ్యకశిపువాక్యం:- ఓరి, విపక్షపుచ్ఛమా ! దేవతలకు దేవతనై నేనుండఁగా దేవతాంతరంబు గద్దనేవు. వద్దన్నా వినవు. నీకీదుర్బుద్ధి యెట్లుసిద్ధించెఁ దెలుపరా.

ప్రహ్లాదవాక్యం:- ఏమయ్యా సర్వపరిపూర్ణుఁడైన దేవునిఁ దలఁచుట యిది దుర్బుద్ధి యందురా ?

హిరణ్యకశిపువాక్యం:- ఓరీ నీదేవుండు సర్వపరిపూర్ణుఁ డంటివి గదా ! అది యెటువలెఁ దెలుపరా.

ప్రహ్లాదువాక్యం:- అయితే విన్నవించేనయ్యా.

ద్వి. వనములయందు జీవనములయందు
ధనములయందు సాధనములయందు
నగములయందుఁ బన్నగములయందు
జగములయందును శౌరి దాఁగలఁడు.
అఖిల ప్రపంచంబు హరిమయంబగుట
నిఖిలమందు నతండు నిజముగాఁగలఁడు.
అతఁడు నీయందు నాయందుఁ గల్గుటకు
దితిజాధినాథ, సందేహ మేలయ్య !

వా. అనిన హిరణ్యకశిపుం డేమనుచున్నాఁడు.

ద. ముఖారి॥ ఆది॥

నిక్కముగా నోరి, నీయందు నాయందు
దిక్కులయందు నీ - దేవుండు
ఒక్కచందంబున - నున్నాఁ డంటివిగా యీ
యుక్కుకంబంబులో - నున్నాఁడా !

పల్లవి॥ తెలుపరాయోరి

తెలుపరాయోరి, నీదేవు డెందున్నాడో

వలవనిమాటలు – వదరేవుగా ॥తెలు॥

వా. అనిన ప్రహ్లాదుం డేమనుచున్నాఁడు.

ద. రక్కసరాయ సర్వజ్ఞుండవైయుండి

యక్కటా! యీమాట – లాడుదురా॥

దిక్కుల నన్నిట – దీపించు దేవు...

............. – నీవేచూచేవయ్యా॥

నీవేచూచేవయ్యా – దేవుఁడు కలఁడో లేఁడో

నేవిన్నవించనేల – యీవేళ॥ నీవే॥

వా. అనిన ప్రహ్లాదుని...........మున్న...అందు సమగ్ర ఘోరాగ్రహావ్యగ్ర దానవాగ్రేసర విగ్రహ జాగ్రన్నఖాగ్ర మండలాగ్రింబగు నుగ్రనరసింహ విగ్రహంబేవి............

తాళం॥ తకతకధిమిధిమియ నెడు

తాళగతి చెలంగుచును

పకపకనవ్వుచును బటుతరంబుగను।

తెక తెక నకు పా...............

..........చును – నరవి నటియించెన్॥

వా. ఇత్తెఱంగున హుంకమత్తుగా వర్తించు మర్త్యకంఠీరవు నిపైఁ గినుకయెత్తి యున్మత్తుడై త్యాగ్రణీ..................

... ... ... ... ... ...

హరిగె కత్తిఁబూని యాహేమకశిపుండు నరహరిఁ గదిసె నిబ్బరముగను.

నృసింహుని వాక్యం:-ఓరీదైత్యాధమ ! ఓడక నన్నెదిరించి....
............నిలు నిలురా నీశౌర్యము చూచెదగాని.

హిరణ్యకశిపువాక్యం:- ఓమనుజపంచవదన ! కదనములో లోక
మల్లా జయించిన నే.........................
పరాక్రమము చూడుమా.

వా. అని మనుజకేసరి డాసి యారక్కసునితోఁబెక్కు విన్నా
ణంబులఁ బెనంగి వానిని ద్రుక్కించే క్రమమె ..............

ద...............దూలి రణమున నరహరి
కక్కితం బెనఁగెను - గదిసి యావేళ॥

వా. ఆకనక కశిపుండు ... ... గనుక నావిన్నాణంబుగ

... ... ... ... ... ...

ఏటువలెఁ బెనఁగెను.

ద. పంతువరాళి॥ రూపకము॥
హత్తి దానవేంద్రు - నవలీలహరిసరి
బిత్తరమునఁ బెనఁగి వాని - బీరమణ.........

... ... ... ... ... ...

త్తరము దప్పించుకోగాను నారసింహుండు నారసింహ విధంబుల
వాని మట్టుపెట్టే క్రమమెటువలెను.

ద॥ ఆట॥ యదుకులకాంభోజి॥

.............కు గోళ్ళఁబట్టి డొక్కచీరి సుక్రక్క
పేగులు చుట్టి పట్టితీసి గ్రక్కున జన్నిదములుగాఁ
బూనెనపుడు. (ఈదరువాడి తీరుచున్న హిరణ్యకశిపు
ని కళేబరం త్రోసివేసేది).

వా. ఇటువలె బలురక్కసుని నులిచి గీటడఁగించియుఁ శాంతుండుగాకున్న నాయుగ్ర నరసింహుని శాంతి నొందించుకొఱకుఁ బ్రహ్మాదాది దేవత లేవిధాన వచ్చిరి.

ద॥ శ్రీరాగము॥ఆది॥

వారిజసంభవ – వాసవప్రముఖులైన
వారు దేవతలెల్ల – వచ్చిరావేళ॥

వా. ఆశంకర పంకజాసనులు వీరనరసింహునిఁ జేరనెఱిచి తమలోఁదా మేమనుచున్నారు.

ఈశ్వరునివాక్యం:– ఓపద్మసంభవ, యీ నారసింహస్వామిని
వేడుకోవయ్యా.

బ్రహ్మవాక్యం:–ఓమహాదేవ, నేనెఱితు,నీవతనిఁ బ్రార్థింపవయ్యా.

వా. ఆసమయంబున దేవేంద్రుండు పావకాదిదిక్పతులఁ జూచి యేమనుచున్నాఁడు.

దేవేంద్రునివాక్యం:– ఓదిక్పతులార ! ఈవీర నరసింహమూర్తి
యింతట శాంతుండు గాకున్న నితని కోపానలజ్వాల
పాలు గాక లోకంబులు నిర్వహించునా.

దిక్పాలకులవాక్యం:- ఓ దేవతా సార్వభౌమ, యీ దేవదేవుని కోపంబు దీరిన వెనుక వత్తుముగాని మన మీచేరువ నుండేది మేరగాదయ్యా.

వా. అని బ్రిహ్మాదు లొకరి కొకరు గుజగుజలుపోవుచుఁ దాము చేర నలికి యతని శాంతునిఁ గావింప సంపద్వధూటిని రావింపఁగోరి యాశంపాలతాంగి నేమని స్తోత్రిము చేసేరు.

దేవతలు చదివేది:

ద్వి. మత్తకోకిలవాణి, మన్మాదురాణి,
యలికుల నిభవేణి, యంబుజపాణి,
శ్రీచెంగమలవల్లి, చిత్తజుతల్లి.
క్షీరాబ్ధికన్యక, శీతాంశుచెల్లి,
కాంతలమేల్బంతి, కలుములదొంతి,
యరుదైనపూఁగొమ్మ, యపరంజిబొమ్మ,
ముద్దులరాచిల్క, మురునైనకొమ్మ,
జక్కవగుబ్బెత, చందనగంధి,
చంద్రిబింబానన, జగదేకమాత,
రక్షింపు మముఁ జాల రాజీవనయన !

వా. అని యీచందంబున నిలింపవర్గము నుతింప మహాలక్ష్మి యేవిధాన సాక్షాత్కరించెను.

ద॥ కేదారగౌళ॥ఆది॥

చెంగటఁ జేరి ది - వ్యాంగనలు గొల్వఁగా
బంగారు బొమ్మవలెఁ - జెంగమ్మ వచ్చెన్.

వా. ఇటువలెఁ దమ్మిదివాణంపుమచ్చెకంటెనిఁ జూచి ముక్కంటి మొదలైన తెలగంటిదొర లేమనుచున్నారు.

(బ్రహ్మరుద్రాదులు అమ్మవారికి విన్నపంచేసుకొనేది)

ఓజగన్మాతా, దైతేయవీరుని సంహరించియు నీ నృసింహ స్వామి కోపము దీఱకున్నది. నీవతని సన్నిధిం జేరి ప్రసన్నునిఁ జేయవమ్మా.

లక్ష్మీదేవివాక్యం:-ఓదేవతలారా! యీదేవదేవుని యవతార సహస్రంబులఁ జూచితి. ఇంతటికోపంబు మున్నెన్నఁడుఁ గాన. నేనీసమయంబునఁ జేర మేరగాదు. అతనిఁ బ్రార్థింపుమని ప్రహ్లాదుని వేడుకొనరయ్యా.

వా. అనినఁ బ్రహ్లాదునిఁ జేరి యరవిందభవాదిబృందారకు లేమని పలికిరి.

బ్రహ్మరుద్రాదుల వాక్యం:-
ఓయి ప్రహ్లాద! నీకుఁ బ్రసన్నుఁడైన యీయుగ్ర నర సింహుని యాగ్రహము దీర్ప నీచేతనేగాని యితరులచేతఁ గాదయ్యా.

వా. అని వేల్పులు వేడుకొనినఁ బ్రహ్లాదుండు తనదేవుని సన్నిధానంబున కేవిధాన వచ్చెను.

ద॥ పంతువరాళి॥ ఏకతాళము॥

నారసింహుని కినుక - తీరఁజేసెదనని
కోరి ప్రహ్లాదుండు - చేరెనావేళ॥

వా. అమ్మహాభాగవతకంఠీరవుండు హర్షగద్గదకంఠారవంబుతో వైకుంఠకంఠీరవునిఁ గొనియాడెనఁట యెటువలెను.

ప్రహ్లాదునివాక్యం:-

ద్వి. జయ రాజగోపాల, జయ దయాశీల,
జయ శేషఫణితల్ప, జయ నిర్వికల్ప,
జయ భక్తమందార, జయ నిర్వికార,
జయ పుండరీకాక్ష, జయ సురాధ్యక్ష,
జయ శార్ఙ్గకోదండ, జయ జగత్కాండ,
జయ రమాహృదయేశ, జయ చిత్ప్రకాశ,
జయ ఘనాఘనవర్ణ, జయ జగత్పూర్ణ,
జయ చక్రధౌరేయ, జయ జగద్ధ్యేయ,
జయ విహంగతురంగ, జయ కృపాపాంగ,
జయ దేవమూర్ధన్య, జయ జగన్మాన్య,
సాక్షాత్కరించి మా చనవు పాలించి
రక్షింపు మముఁ జాల రాజగోపాల.

వా. అని యాచిన్ని చెలువుండు సన్నుతింప నాపన్నశరణ్యుఁడైన యన్నరకేసరి ప్రసన్నుఁడై ప్రహ్లాదు నాదరించే క్రమ మెటువలెను.

నృసింహుని వాక్యము: ఓయీ ప్రహ్లాద, నీవు మామీఁదఁ
జాలా భక్తియుంచితివి గనుక మాభక్తులలో నీవే పరమ
భక్తాగ్రేసరుండవోయి.

వా. అని యాదేవుండు ప్రహ్లాదు నాదరించే సమయంబున
మహాలక్ష్మిదేవియు నరసింహస్వామి సేవిధానఁ జేరెను.

ద॥ కాంభోజి॥ ఆట:

కరమున నుదిరి బం - గరు తామరపువ్వు
ధరియించి శ్రీలక్ష్మి - నరహరిఁ జేరె॥

అమ్మవారు పెరుమాళ్ళ సన్నిధిఁ గూర్చుండెను.

వా. అప్పుడా కలకంఠకంఠీతిలకంబు నృకంఠీరవునితో నేమని
పలికెను.

మహాలక్ష్మివాక్యం:- ఓ భక్తమందార! పురందరాది
బృందారకులు మీపాదారవిందంబులు సేవింప వచ్చినారు
వారికిఁ బ్రసన్నుండవై రక్షింపరయ్య.

వా. అని యన్నలినసదన విన్నవింప వెన్నుండు ప్రసన్నుం
డౌటఁ దెలిసి దేవత లతని సేవిధానఁ జేరిరి.

ద॥ రేవగుప్తి॥ఏక తాళము॥

బలభేదిమొదలుగాఁ - గలదేవతలెల్ల,
జెలఁగి నారసింహునిఁ - జేరి రావేళ॥

బ్రహ్మరుద్రాదులవాక్యం:- శరణు శరణయ్యా శరణాగత వజ్ర పంజర, ప్రహ్లాదవరద !

వా. అని యీ బ్రహ్మరుద్రాదులు నృసింహస్వామినిఁ గొనియాడిరఁట యెటువలెను.

విన్నపము:-సత్యభామామనోహరా !మీరు పదారువేలగోపికా స్త్రీలతోఁగూడి జలక్రీడలాడిన మహిమవలన 'కృతఘ్నే నాస్తిమర్యాదా' అన్న వచన మున్నప్పటికిని,ఆకృతఘ్న త్వంబు పోఁగొట్టిన హరిద్రానదిని ఒకసారి స్నానంబు చేసినంతటనే సకలతీర్థంబుల నాడిన ఫలస్వారస్యంబు కలుగుం గావున, మీమహత్త్వంబు వర్ణింప నెంతటి వారము అయినను నాయందు దయయుంచి రక్షింపవే సహజగుణసంపన్న, సంపంగిమన్న.

వా. అని సుర లతని సమ్ముఖంబున నున్న నా నృసింహ స్వామి సంతుష్టాంతరంగుండై ప్రహ్లాదుని రాజ్యాభిషిక్తుఁజేయు సమయంబున బ్రహ్మాదిదేవతలు పుష్పవృష్టి గురిపించే క్రమ మెటువలెను.

ద॥పాడి॥ ఏకతాళి॥

వలపులపువ్వుల - వానలు హరిపైఁ
గులిశధరాదులు - గురియించిరపుడు॥

వా. అప్పుడా నరసింహస్వామి సమ్ముఖమున రంభోర్వశులు మంగళప్రదముగా నటించిరఁట యెటువలెను.

మన్నారుదేవికి మంగళం.

వా. ఇవ్విధంబునఁ బ్రహ్లాదునకుఁ త్రైలోక్యసామ్రాజ్య సింహాసనంబు పాలించిన నృసింహస్వామి అచ్యుతవిజయ రాఘవభూపాలునకు ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధియు ధన కనక వస్తు వాహన సమృద్ధియు అఖండ భూమండలాధిపత్యమును గలుగఁజేసి రక్షించుగాక.

ప్రహ్లాద చరిత్ర సంపూర్ణము

# పూతనా హరణము



విజయరాఘవ భూపాలుఁడు.

# పూ త నా హ ర ణ ము

## (విజయరాఘవ కృతము)

### ఉ పో ద్ఘా త ము

దీనిని రచించినవాఁడు విజయరాఘవుఁడు. ఇందలి కథ పూతనను శ్రీకృష్ణుఁడు సంహరించుట. ఇందు అంకవిభజన లేదు. రంగస్థలము మారదు, కథాపరిణతిగాని, ఫలసంపాదన యొక్క క్రమపరిణామముగాని లేదు. శిశువైన శ్రీకృష్ణునకు పాలిచ్చుటకు పూతనవచ్చుట, అది కృష్ణునిచేఁ జచ్చుట, దాని కళేబరమును గొల్లలు మోసికొనిపోవుటయే యిందలి కథావస్తువు.

ప్రస్తావనయందలి "స్వామివారు హావణించిన నాటకంబూ నటనపటిమ గనుపింప వినిపించెదము" అను వాక్యములనుబట్టి ఈనాటకము రాజసన్నిధిని ఆడినట్లు స్పష్టమగుచున్నది. ఇట్లే ప్రహ్లాద చరిత్రయందును, కాళీయమర్దనమునందును గలదు. ఇందుఁ బన్నిద్దరాళ్వార్ల స్తుతి గలదు.

ఇందలి నందవ్రజవర్ణనము, సూత్రధారాదులచేఁ గీర్తింపఁ బడి యుండవలెను. తరువాత యశోదాప్రవేశమును సూత్రధారుఁడు సూచించినాఁడు. ఆవర్ణన చేయునపుడు ఆరీతిని యశోద వేషము ప్రవేశించునని యూహింపవచ్చును. తరువాత యశోద

సను జెలికిని సంభాషణము. యశోద బాలునెత్తుకొని 'తత్తధిక త్తోం' అని కరతాళము లొత్తుచు నటియించెను. అనఁగా దరువులును, పదములును రెండువిధములుగాఁ బాడఁబడుచుండెడివి. నాటకములోని పాత్రధారులు తమ సంభాషణములో పాడునవి కొన్ని, వెనుక హంగుదారులైన పాటకాండ్రు పాడునవి కొన్ని.

ఇందు ప్రణవము, ద్వ్యక్షరి, షడక్షరి, అష్టాక్షరి, ద్వాదశాక్షరి, శతాక్షరి, సహస్రాక్షరి, వర్ణమాలిక, ద్వయము అనువానిని పేర్కొని వానిని గోపాలుని యలంకారములుగాఁ గవి వర్ణించినాఁడు. వేదములు, పాంచరాత్రము, భారత రామాయణములు, వేదాంగములు, పురాణములు, ఇతిహాసములు, షడ్దర్శనములు అనునవి విష్ణుస్తవపదములైన గ్రంథములుగాఁ బేర్కొనఁబడినవి.

దేవుని యలంకారములుగా వస్త్రములు, పూతలు, మొదలైనవి తమకాలమున రాజులుధరించునవియే ఆరోపింపఁబడినవి. "వలిపెచెంగావిదుప్పటి, చలువగందపుపూఁత, పతకము, కట్టాణిచౌకట్లు, కస్తూరితిలకము," మొదలగు నలంకారములు గోపాలుఁడుధరించినట్లు వర్ణింపఁబడినది.

పూతన బాలెంతరాలివేషమునవచ్చి, తాను ఋాదిమునియు, వాల్మీకి మొదలైనవారికందఱికిని బాలిచ్చి బాల

వర్ధని యనుపేరఁ బ్రసిద్ధికెక్కినదనియుఁ జెప్పుకొని శిశువులకు సామాన్యములగు బాలగ్రహపీడలు, పక్షిదోషము, సర్ప భయము మున్నగు వ్యాధులను బోఁగొట్టుదునని చెప్పెను. చెలులు లోనికిరావలదనియు, బాలునికి దృష్టిదోషముతగులు ననియుఁ దొలుత పూతనను నివారించిరిగాని తరువాత నంగీ కరించిరి. ఈసందర్భములోఁ గవివచనమను పేరున నొకపద్యము గలదు. దీనినిగూడ హంగుదారులే చదువుదురని తోఁచు చున్నది. నడుమ నడుమ నిట్లే పూర్వాపరకథాసందర్భమును పాత్రప్రవేశాదులను దెలియఁజేయుచు వచనములు గలవు.

పూతనాకళేబరమును పరిహరింపవచ్చిన గొల్లల పాట లును వారి వర్ణనమును ఆనాటి గొల్లలవేషభాషాచేష్టలను నిరూపించుచున్నవి. ఈసందర్భమున నడచిన గొల్లలచేష్టలు ఆనాటి హాస్యధోరణిని వారిభాషను దెలియఁజేయుచున్నవి.

ఇందొకచో కవిని "కోతిమోరకుళ్ళాయి బాపఁ" డని సంబోధించుటచేత ఆనాఁడు కవులు కుళ్ళాయిలు ధరించువారని తెలియుచున్నది.

ఇందలి పురోహితుల సంభాషణము హాస్యరసపరిపోష కమై వారిజీవితవిధానము నెఱిఁగించుచున్నది. నాఁటి స్వస్తి వాచనమిందు నిరూపింపఁబడినది. ఇందలి సంకల్పమును

ప్రక్రియయు నాఁటిపద్ధతిని తెలియఁజేయుచున్నది. ఆరోజు "వర్తమాన ఖరనామసంవత్సర ఉత్తరాయణ చైత్రమాసశుక్ల పంచమీ గురువాసర శుభతిథి" అని పేర్కొనఁబడినది. దీనిని బట్టి యీగ్రంథము రచనాకాల మూహింపవచ్చును. విజయ రాఘవుని పరిపాలనాకాలము క్రీ. శ. 1633–1673. అందు ఖర నామసంవత్సరము క్రీ. శ. 1658 సంవత్సర మగుచున్నది. చైత్రశుద్ధ పంచమి ఏప్రెల్ 18 వ తేది యగుచున్నది. వార మునమాత్రము భేదమున్నది. ఇందు గురువారమనిమాత్రము పేర్కొనఁబడినది. ఎఫెమిరెసునుబట్టి పంచమి మంగళవారమగు చున్నది. వ్రాఁతలో నేదైన తప్పుపడియుండవచ్చునేమో.

---

# పూతనాహరణము



సీ. భోజకన్యాముఖాంభోజ రాజమరాళ,
సత్యాఘనస్తన స్తబకభృంగ,
జాంబవతీ విలోచన చకోర శశాంక,
మిత్రవిందా తటిన్మేఘరూప,
భద్రావశావశ భద్రదంతావళ,
వరసుదంతామనోవనమృగేంద్ర,
లక్ష్మణారూప కలాపినీ పర్జన్య,
భానుసుతాలతా పారిజాత,
షోడశస్త్రీ సహస్ర చక్షుః పరిసార
హారసార మసార మోహనశరీర,
విజయ రాఘవభూపాల భజనలోల,
కేలు మోడ్చెద రాజగోపాల, నీకు.

వ. పరాకుస్వామి. శ్రీరాజగోపాల చరణారవిందభజనానందసాంద్ర! రఘునాథనాయకరత్న రత్నాకరావతీర్ణ సంపూర్ణపూర్ణిమాచంద్ర! పాండ్యతుండీరాది వైరివీరగజకంఠీరవకిశోర! కళావత్యంబికా కుమార! చంద్రోపేంద్ర సురేంద్రనందన కందర్పకోటి సౌందర్యధుర్య! జీర్ణకర్ణాటకసామ్రాజ్య

సింహాసన స్థాపనాచార్య! సమసమయ సమాచరిత సమస్త నిస్తుల తులాపురుషాది మహాదానోపదాన ప్రవర్తితకీర్తిధా రేయ! సంగరరంగగాంగేయ! ప్రతిదిన బ్రాహ్మణ బహుళ సహస్రాభీష్ట మృష్టాన్నదాన దీక్షాధురీణ! మానినీ నూతన పంచబాణ! విశ్వ విశ్వంభరాభార భరణ విచక్షణ దక్షిణ భుజాదండ! శాశ్వతైశ్వర్య ధౌరంధర్యమేరుకోదండ! దక్షిణ సింహాసన పట్టభద్ర! కలియుగరామభద్ర! చతుర్విధ కవితానిర్వాహసార్వభౌమబిరుదాంగదవిరాజమాన చరణాంభోజ! కవిసమాజభోజ! జనకచరణరాజీవసేవావిధాయక! విజయరాఘవ నాయక! పరాకు. స్వామివారు హావణించిన పూతనాహరణ నాటకంబు నటనపటిమ గనిపింప వినిపించెదము చూడ నవధరింప్రుడు.

ద్వి. శ్రీరాజగోపాల, శృంగారశీల,
ధారాధరశ్యామ, దనుజవిరామ,
దేవకీ వరపుత్ర, దివ్యచారిత్ర,
దేవతామూర్ధన్య, దేవేంద్రమాన్య,
బాణ బాహు సహస్రభంజనా వక్ర,
పాణి సరోజ సంపాదిత చక్ర,
గోపికానయన చకోరికా చంద్ర,
వ్యాపక విశ్వరూపానందసాంద్ర,

విజయంబు పాలించు విజయసహాయ,
విజయరాఘవు నేలు వేల్పులరాయ,
నీపాద పద్మముల్ నెఱి నమ్మినాఁడఁ
జేపట్టి నను గటాక్షించి రక్షించు.

ద్వి. సింధురాజకుమారి చికిలి కటారి
గంధ సింధురయాన కలుముల చాన
చంద్రసహోదరి చంద్రవర్ణాంగి
చంద్రికా సమహాస చంద్రబింబాస్య
చిలుక పల్కుల కొమ్మ చెంగమలమ్మ
కులుకు సిబ్బెపు గబ్బి గుబ్బల గుమ్మ
నారీ శిరోమణి నమ్మితి మమ్మ
కోరిన వరము గ్రక్కున నీయవమ్మ.
అపశబ్దగజముల నస్మత్కవిత్వ
విపులాద్రి గుహాలలో విహరింపకుండ
సూత్రవతీశ, మీ౯శుభకరకలిత
వేత్రంబు కదలించి విదళింపవయ్య.

వ. అని వాగ్వైఖరీ విజితభోగేంద్రుఁడగు విజయరాఘవ దేవేంద్రుఁడు తనయిష్టదైవంబులైన యాదిమదంపతులఁ గొని యాడి శుకాచార్యుల నాచార్యులఁ బన్నిద్దఱాళ్వార్ల నేమని కొనియాడుచున్నాఁడు.

ద్వి. భాగవతంబను పరమాంజనమున
భాగవతులకెల్లఁ బరతత్వ నిధిని
ప్రకటంబుగాఁ జూపి ప్రఖ్యాతిగన్న
శుకయోగి కులధుర్యు శుభచర్యుఁదలఁతు.
పరమ చతుర్వేద పారీణు లగుచు
గరిమ మీఱఁగ శతక్రతుయాజు లగుచు
వీరవైష్ణవులన వెలసిన ఘనుల
సారెకుఁ దాతయాచార్యులఁ గొలుతు.
రవి తులారాశిఁ జేరఁగ వచ్చినపుడు
శ్రవణతారను హస్తి శైలాఖ్యపురిని
గాంచనాంభోరుహ గర్భగోశమునఁ
బాంచజన్యాంశ సంభవుఁడై చెలంగి
వాసికెక్కి ప్రధాన వైష్ణవుండైన
కాసారయోగికిఁ గరములు మోడ్చి,
వనధి తీరంబున వరమల్ల పురిని
మను ధనిష్ఠను తులా మాసంబునందుఁ
గలువలో హరిచేతి గద నుదయించి
వెలయు భూతయతీంద్రు వేనోళ్ళఁ బొగడి,
మాయూరపురి తులామాసవికాస
దాయక శతభిషక్తారక యందు

నందకాంశంబున నందనభావ
మొందిన యా మహాయోగిని గొలిచి,
అకలంకమగు భార్గవాన్వయమునను
మకర మాసంబున మఖయందు విష్ణు
చక్రాంశమున మహీసారాఖ్య పురిని
చక్రేశుఁడగు భక్తిసారుని గొలిచి,
జననుతంబైన వైశాఖమాసమున
ననుపమంబగు విశాఖాఖ్యతారకను
గోవిందుఁడై పుట్టి కురుకా పురమున
ద్రావిడోక్తులఁ బ్రబంధము నిర్వహించి
సన్నుతి కెక్కిన శఠగోపయతికి
మన్ననతోడ నమస్కృతుల్ సేసి,
మేలైన కేరళ మేదినియందుఁ
గోలపురంబునఁ గుంభమాసమున
రాచూలియై పునర్వసు తారయందు
నాచక్రధరు కౌస్తుభాంశంబు వలన
వెలయుచు నావిర్భవించిన యట్టి
కులశేఖరునకు మొక్కులు సంఘటించి,
శ్రీవిలిపుత్తూర జ్యేష్ఠమాసమున
కోవిదుండై మును కూఁకటితోడ

స్వాతిని హరి రథాంశమున జన్మించి
దైతేయవైరికిఁ దాసుఁడై యగుచు
విష్ణు భక్తులలోన విఖ్యాతిగన్న
విష్ణుచిత్తునిఁ జిత్తవీథిలో నిల్పి,
మానిత చోళరమాకుచహార
మైన మండంగుడి యగ్రహారమున
సింగాణి నెలయందు జ్యేష్ఠతారకను
రంగేశు కైంకర్యరచన గావింప
వనమాలికాంశంబు వలన జన్మించి
వనమాలి కృపచేత వర్ధిష్ణువైన
భక్తాంఘ్రి రేణునిఁ బంకజనాభ
భక్తధురీణునిఁ బ్రస్తుతిచేసి,
యవనిపై నిచుళాపురాధిరాజ్యమున
దివిజులు పొగడఁ గార్తికమాసమునను
రూపసంపన్నుఁడై రోహిణియందు
దీపించు శ్రీవత్స దివ్యాంశమునను
జనియించి హరిగుణస్తవపరుండైన
మునివాహనాహ్వయమునికిఁ గేల్మోగిచి
కార్తికంబునఁ గృత్తికా తారయందుఁ
గార్తస్వరాంబరు కార్ముకాంశమున

నావిర్భవించి యయ్యాదిదేవునకు
వేవేలు కైంకర్య విధులొనరించి
పరిహాతంబుగా పద్యప్రబంధముల్ చేసి
మహిఁ జతుష్కవిశిఖామణి యనఁబరఁగు
పరమవైష్ణవ పట్టభద్రుఁ డైనట్టి
తిరుమంగ యాళ్వారిఁ దిరముగాఁ గొలిచి,
పరమ పావనమైన పాండ్యదేశమున
మెరవడి గాంచిన మేషమాసమునఁ
దగిన చిత్తాహ్వాయ తారకయందు
జగదీశ్వరుని గు[1]ణాంశమున జన్మించి
యధిక భక్తి పరాంకుశాఖ్యుఁడైన
మధురకవీంద్రుని మహిమలు పొగ
తొలినెల నార్ద్రను తుండీరభూమి
తలమున శేషాంశ ధౌరేయుఁ డగుచు
జనియించి దర్శన స్థాపకుండైన
యనఘుని రామానుజాచార్యుఁ గొలిచి,
పరివిమలభక్తి దెబ్బది నల్వురైన
కవి వరేణ్యుల భాష్యకర్తలఁ గొలుతు.

---

1. గణాంశమున.

వ. అని గురుచరణ పరిచరణంబు గావించి, విజయరాఘవ కుంభినీజంభారి యారంభించిన పూతనా మథన కథా సంవిధాన చాటుధారాధాటికి శృంగాటకంబగు శృంగార నాటకంబునకుఁ బ్రథమవర్ణనాభాజనం బగు నందవ్రజం బేరీతిఁ బ్రఖ్యాతి కెక్కెను.

ద్వి. శ్రీదళు క్రొత్తఁగాఁ జెలువమన్నారు
పాదసంచారియై బలభద్రుఁ గూడి,
బాలుఁడై గోపాల బాలురతోడ
వేలుపుల్ గొనియాడ విహరించు కతన
నభినవ హలకలశాది చిహ్నముల
శుభరేఖ లందంద చూపట్టుచున్న
దినకరనందనా తీరకాంతార
ఘనతర సైకతాగ్రములఁ జూపట్టు
పారిజాత కుడుంగ బాలరసాల
నారికేళ లవంగ నాగ పున్నాగ
చందన పాటల చంపక వకుళ
మందార భూరుహ మధ్యరంగమున
దివ్యమై యొప్పు వీధీదృశ్యమాన
నవ్యరత్నవ్రజంబు నందవ్రజంబు.

అందొకానొకనాఁడు హరువులు మించు
కుందనంబు పసిండి గొప్ప యుప్పరిగ
నుదిరి జీనికడాని యుయ్యెలలోన
మదిరేక్షణ యశోద మక్కువమీఱ
బాలగోపాలునిఁ బవళింపఁజేసి
జోలపాడెదనంచు సొంపునవచ్చె.

వా. ఇవ్విధంబున యశోదాలీలావతి బాలగోపాలునకు జోలోత్సవము గావింపఁ కేళీగృహాంతరాళమున నీలంపుఱాతి దూలంబునఁ గీలుకొల్పిన జాళువాగొలుసులఁ దేలియాడు లాలిపాలికి వచ్చెనఁట యెటువలెను.

ద॥ కేదారగౌళ॥ఏక తాళము॥

బాలగోపాలుని – బంగారుతొట్లలో నుంచి
జోలలుపాడ య – శోద వచ్చెనపుడు॥

వా. ఇవ్విధంబున మందిరంబు వెడలివచ్చిన నందసుందరి ముందటికి నొకచందనగంధి నందగోపాలబాలుని గొనివచ్చెనట యెటువలెను.

ద॥ రేగుప్తి॥ఆట॥

గోపాలబాలకుని – గుఱిచ్చియెత్తుక యొక్క
గోపకన్యక యశోదా స – మీపమున చేరవచ్చెను॥

యశోదవాక్యము:- రారాగోపాల ! రారా ముద్దుకృష్ణ! రారా చిన్నికృష్ణ ! నీకు చందమామను చూపేగాని, చక్కెర పెట్టెదనుగాని రారా మాయయ్య! నామీదకోపమా? రారా మాయబ్బ !

చెలివాక్యము:- అవునే ఓయమ్మ, నీవు చన్నీయని కోపాన బిడ్డ రాకున్నాడే ఓయమ్మ.

యశోద:- ఓయమ్మ వీడెన్ని నేర్చినాడే ! చూస్తివా ఓయక్క!

చెలి:- అలాగందురా ఓయమ్మ ! లాలించవే ! రమ్మనవే ! వేడుకోవే ! వెన్నఁబెట్టెద సనవే !

యశోద:- అయితే పాలుపోసెద రారా గోపాల.

పల్లవి॥ పాలుపోయవె యమ్మా పాలుపోయవె।
పాలుపోయవే యమ్మ పైఁడిగిన్నెలో।
మేలైన కమ్మని మీఁగడతో-పాలుపోయవేయమ్మ
పాలుపోయవే. ॥౧॥

పండువెన్నెలబైటఁ గండచక్కెర నించి
వెండిగిన్నెలోఁ జాల వెన్నపెట్టవే. ॥౨॥

పాలుపోసెదరారా బాలగోపాల
పాలుపోసెదరారా బంగారయ్య. ॥3॥

మేలైనకమ్మని మీఁగడతో
పాలుపోసెదరార బాలగోపాల. ॥౪॥

పండువెన్నెలబైటఁ గండచక్కెర నించి
వెండిగిన్నెలోఁ జాల వెన్నపెట్టెదరా॥పాలు।

వా. అవురా యీరీతిఁ జెలిచేతనున్న కుమారుని జేకొని యశోద చెక్కిలినొక్కి యక్కునఁజేర్చి ముద్దాడి యొక్కదరువు పాడుచుఁ జక్కనికోపులు రహికెక్క నటించెనఁట యెటువలెను.

ద॥కన్నడ॥ఆటతాళము॥

పొత్తులలో బాలుని యశోద-యెత్తుకొనియప్పుడు
త త్తధిగ ణో మని తగు కర-తాళంబు లొత్తుచు నటియించెను।

వా. ఈరీతి యశోదానారీతిలకంబు నటించి కుమారుని లాలించి లాలినుంచి జోలపాడెనఁట యెటువలెను.

జోల॥శంకరాభరణము॥ఆటతాళము॥

జోజోనాకులదేవత - జోజో మన్నారయ్య
మావారునినుగొల్చి - మన్నారయ్య॥
జోజో నిష్కపట వినోది - జోజోనిష్కపటవినోది
జోజో సుదర్శనశాలి - జోజో సుదర్శనశాలి
జోజో సత్యభామాసమేత - జోజోసత్యభామాసమేత।

యశోదవాక్యము:-

రారేచెలులార, నాకుపనికద్దు, ఈముద్దుగోపాలునిచెంత
వింతవారిని రానీక మీరుకాపాడుకొని యుండరే।

చెలి:- అమ్మమ్మ అలాగే యుండెదమమ్మా.

వా. ఇవ్విధంబునఁ బలికి యవ్వధూమణి యబ్బాలుని పాల నిద్దరు బాలికలనుంచి దధి మథనవ్యాజంబున గృహారాజంబున కరిగెనఁట యెటువలెను.

వా. ఆసమయంబున ఆతియ్యవిలుకానిఁ గన్నచిన్నయ్య నయ్యేలనాగ లుయ్యేలనుంచి సారసుధారసధారలు జాలువాఱ జోలలుపాడిరఁట యెటువలెను.

జోల ॥నీలాంబరి॥

శ్రీరాజగోపాల చిన్మయానందశీల
కారుణ్యగుణాలవాల కనకాబ్జనాయికాలోల॥
నాపాలిభాగ్యంబ నా పెన్నిధానంబ।
గోపికాచిత్తచోర గోవర్ధనోద్ధార॥
రత్నమందిరమున రక్తాబ్జనాయికనుగూడి
రత్నశయ్యపైఁ గామినీరత్నంబులు జోలయసంగ॥
విహరించు నీవేడుక వివరించి నన్నింతు।
రహిమీఱ నవధరింపు రాజగోపాలదేవ॥ ॥౧॥
సరిపెణల్ మురుగులు చౌకట్లు నటియింప
నరజాఱు సిగచెంప నసియాడుచుండఁగను
చరణంబులొత్తుచు న్నరుణాబ్జనాయిక
మెఱుఁగుఁ జెక్కులఁ దనమేని నీడలుచూచి
యురమున నన్నుంచినట్ల యువిదలనిద్దఱనుంచినాఁడని
పరికింపఁ దెలిసినప్రౌఢగోపాల లాలి॥ ॥౨॥
నారాయణాష్టాక్షరి నటియించుచౌకట్లు గాఁగ
సారమైన ద్వాదశాక్షరి సరిలేని కంటసరిగాఁగ

తోరమైన షడక్షరి తురుముత్తైపుఁగుచ్చుగాఁగ
తీరైన ప్రణవంబు దివ్యకౌస్తుభరత్నంబుగాఁగ ॥3॥
మురువైన ద్వ్యక్షరి మురువుపూసలై రాణింప
నోరపైన శతాక్షరి యుత్తరిగెయై దీపింపఁ
దిరమైన సహస్రాక్షరి దివ్యరత్నహారముగాఁగ।
వరుసగా వర్ణమాలిక వనమాలికగాఁగ॥ ॥౪॥
తేజమున నేకాక్షరి దివ్యనాసామణిగాఁగ
బీజాక్షరములెల్ల బిరుదు పెండెము గాఁగ॥
వేదకోవిదులెల్ల వినుతించు మీ ద్వయము
పాదద్వయమున మించు బంగారు మించుగాఁగ।
ప్రేజదువు టుయ్యాలపై రక్తాబ్జనాయికనుగూడి
రాజిల్లు మంత్రమయమూర్తి రాజగోపాల లాలి॥ ॥౫॥
చొక్కపు ముత్తెములపేరు చుక్కలబారుగాఁగ
నక్కున నున్న కౌస్తుభము చుక్కల రాజుగాఁగ
గ్రక్కునఁ బరమవైష్ణవుల కనుగలువలు వికసింపఁ
జక్కని హేమాబ్జవల్లినిగూడి శయ్యనున్న స్వామిలాలి॥౬॥
ప్రేజదువుల కోళ్లుకోఁ బ్రణవము మంచమై మించఁ
బ్రేజిలువ మన్నిఁడు పానుపై రాణింప॥
చేరిన పాంచరాత్రాదులు జీనిబటువు దిండ్లుగాఁగ।
భారతి రామాయణాదులు బంగారు గొలుసులుగాఁగ॥

పావన వేదాంగములు పగడపుఁ గంబాలుగాఁగఁ ।
దావుకొన్న పురాణములు దంతపుఁ జప్పరములుగాఁగ
చిరతరేతిహాసములు సింగంపుఁబ్రతిమలు గాఁగ।
పరఁగు షడ్దర్శనములు పట్టు కురాళంబు గాఁగ॥
నలువచేఁ బాగఁ దొందు నాలాయిర ప్రబంధంబు
చలువలు వెదచల్లుచు పైనున్న చందువా గాఁగ॥
ఆది కావ్యనాటకంబు లపరంజి రేకలు గాఁగ
దేదీప్యమానమై మించు దివ్యశయ్యపై నుండి॥
చేపట్టి యేలుకొన్న శ్రీభూమీ నీళలెల్ల
రూపింప హేమాబ్జవల్లీ రుక్మిణీసత్యలై కొలువ
వెంబడించి పాయని విమలాది శక్తులెల్ల
జాంబవతి మొదలైన సతులై యూడిగములు సేయ॥
ఆనందడోలోత్సవ మంగీకరింపుచున్న
భానుకోటి సంకాశ పరబ్రహ్మమూర్తిలాలి॥ ॥౭॥

భూరి భుజశాఖలతోఁ బొదలు కెంగేలుచిగురులతోఁ
జారు నఖకోరకములతో శంఖచక్రప్రసవములతో॥
కారుణ్యంపుఁబూఁదేనెతోఁ గస్తురిబొట్టుగందుఁదేఁటితో
గారవంపు హేమాబ్జవల్లితోఁ గనకాంబర పరాగంబుతో॥
కాయచ్ఛాయాదళములతోఁ గౌస్తుభరత్న ఫలముల తో
పాయక కోరికలిచ్చు భక్తపారిజాతంబ లాలి॥ ॥౮॥

వలిపె చెంగావిదుప్పటి వలెవాటుతో
చలువగంధపుఁబూఁత పైఁదోఁచు చనుగుమ్మలమెమ్మెతో
పలక వజ్రింపుఁ దిరువుపనిహారువు పదకంబుతో॥
కలలు దేఱుచెక్కుల నటించు కట్టాణి చౌకట్లతో।
తీరుగాఁ గొనగోరఁదీసిన తిన్నని కస్తూరితిలకంబుతో।
కారుణ్యము వెదచల్లు కడకంటి చూపులతో
శ్రీరక్తాబ్జనాయికా చిత్తము కరఁగింపుచు
నారజపు సొగసు మీఱిన శ్రీరాజగోపాలలాలి॥ ॥౯॥

వా. అప్పుడు భద్రిగజయానల గానలహరీసముద్రంబులో నోలలాడుచు యోగముద్రానిద్రితాత్ముండైన బలభద్రానుజుని హింసించెద నని కంసప్రేషితయై చేతనాచేతనభూతజాత భీతిహేతుభూతయైనపూతన బాలెంతరాలి వేషంబును బూని వచ్చెనఁట యెటువలెను.

ద॥ సావేరి॥ ఆట॥ బాలెంతరాలి రూపముఁబూని పూతన
బాలగోపాలుని పాలికి వచ్చె॥

చెలులవాక్యము:-ఓయమ్మ! నీయూరేమి? పేరేమి? యిందురాఁ
గారణంబేమి తెలుపుమా ?

వా. అనినఁ బూతన యేమనుచున్నది.

ద్వి. వినఁగదవమ్మ నావృత్తాంతమెల్ల
వినిపింతు నీకు సవిస్తరంబుగను
ఆదిరాజులయిండ్ల ననిశంబు నేను
దాదినై వర్తింతు ధవళాయతాక్షి !

బాలురఁ బెంప నేర్పరివైనకతన
బాలవర్ధిని యనఁ బ్రఖ్యాతిఁ గంటి.
వేడుకతీయని వీటవర్తించు
పోడిరాసుతుల పంపున సంచరింతు.
పుడమిపైఁ బుట్టకుఁ బుట్టినాతనికిఁ
గడవలోఁ బొడమిన కతల పారునికిఁ
బురుషుని కడుపునఁ బొడమినదొరకు
విరిబోణి, యేటిలో వెడలినాతనికిఁ
గనుఁప జొంపములోనఁ గలిగినాతనికిఁ
జనుఁబాలొసంగి నే సాఁకితి నమ్మ.
లలితాంగి, నేను బాలగ్రహపీడ
తొలఁగింప నేర్తు జోతు లమర్పనేర్తు
పక్షిదోష చికిత్స పాటింపనేర్తు
రక్షగట్టఁగ నేర్తు రాకుమారులకు.
కీరసల్లాప ! మీకృష్ణుని యడుగు
నీరు గ్రమ్మెడుఁ పక్షినీడ పాఱినది
ఆొమ్మున నొకమచ్చ రూపింపఁ గంటిఁ
గొమ్మ, యీతనికి నాగులపట్టు గద్దు.
భేరుండ మొకటి యీబిడ్డని మీఁద
నూరక కనువైచి యున్నదోయమ్మ !

ఎడఁబాయకున్న యాదృష్టిచే నితని
యొడలెల్ల గఱుపారి యున్నదోయమ్మ !
ఏలాలతాతన్వి, యిది మొదల్గాఁగ
బాలగ్రహంబుల భయములు కొన్ని
వనిత, సర్పభయంబు వర్షభయంబు
ఘనతరాగ్నిభయంబు గజముచే భయము
జెట్టిపిరులపోరుచేఁ గొంత భయము
పుట్టంగ నున్నదీబుడుతని కిఁకను.
చెలియ, నేనితనిఁ బోషించితినేని
తొలఁగింపనేర్తు నీదోషంబులెల్ల.
రాజీవనయన, యీ రాకుమారునకు
ఈజీవమిచ్చిన నీవచ్చునమ్మ.
సకియ, యీనిసువు నాచనుఁబ్రాలు వెనేని
పెకలించి కొండలు భేదింపఁ గలఁడు.
రాకేందు బింబాస్య, రత్నాకరంబు
నీకుమారుండు చేయీఁత నీదెడిని.
ఎలమి నేఁ బెంచిన నీకుమారుండు
పొలఁతి, చుక్కలు మొలపూసగాఁ బెరుగు.
కావున ననుఁదాదిగా సంతరించి
నావిధంబు లెఱింగి నడపుకోవమ్మ.

వా. మఱియు హంసగమనలఁ జూచి కంసదూతిక యేమను చున్నది.

ద॥కాంభోజి॥ఆట॥

పల్లవి॥ ఆదిమరాజుల యిండ్లను నేను
దాదినై వర్తింతు ధవళాక్షులార ! ॥౧॥
తరుణి, నాచనుఁబాలు ద్రావినవారు
చిరకాలమును చిరంజీవులై యుందురు
నరపాలబాలురు నాచనుబాలఁ
బెరిగినవారలు పెక్కండ్రు గలరు ॥౨॥

వా. అని నిశాటవధూటి పెనుజూటుతనంబునఁ దన చాటు వచనంబులు పచరింపఁ గనుబాటు తాఁకునని యాదుమాదుని చెంతఁ జేరనీక యాకాంత లాబాలెంతరాలిని జూచి యేమను చున్నారు.

పదము॥కాంభోజి॥ఆట॥

బాలగోపాలుని పాలికి రావద్దు
బాలెంతరాల చలమేల పోవచ్చు॥ ॥౧॥
వనిత, యీడకు వింతవారు రారాదమ్మ
పెనఁగకు పిలువని పేరంటమునకు।
కినిసి రావద్దమ్మ కిసరుసోఁకునమ్మ
కనుబాటు దాఁకెనమ్మ కడకుఁబోవమ్మ॥ ॥౨॥

నిన్న దృష్టితాఁకె నేమో చన్నంట కుండఁగాను
చిన్నికృష్ణునకొక్క సిద్ధునిచేత।
కన్నెరో రచ్చరేకు గట్టించితిమమ్మ మేము
నిన్నురానిచ్చిన నేరము రాదా॥ ॥3॥

శ్రీకృష్ణదేవుండు చిట్టడుగు పెడితే
సాఁకఁబెట్టేమని మాజాతివారెల్ల।
ఏకవీరమకు మీఁదెత్తి మొ్రక్కుకున్నారమ్మ
రాకేందుముఖి, యిందు రాకురాకమ్మ॥ ॥ర॥

వా. అని వారించు వారిజముఖులఁ దనమాయ నాపెను మాయలాడి మచ్చుగప్పి సొక్కించి యక్కుమారుని గ్రుచ్చి యెత్తి యక్కునహత్తించి యొక్కదిక్కునఁ గూర్చుండి గరళ సామాన్యంబగు నిజస్తన్యంబు గ్రోలింపఁబూని యేమనుచున్నది.

పూతనమాట:- రారా చిన్నికృష్ణ! చన్నిచ్చెదఁగాని నాచన్ను
దాఁకితే నీకు వన్నెవచ్చెడిని రారాగోపాల!

దరువు॥ఘంటారవము॥ఆది॥

చన్నుదా్రివరా కృష్ణమ్మ చన్నుదా్రివరా – నా
చన్నుదా్రిగితే నీకువన్నె వచ్చుఁగదరా॥ ॥౧॥

ఒకనవ్వునవ్వరా యుగ్గుపట్టెదరా
మొకమెత్తి చూడరా ముద్దుగోపాల॥ ॥౨॥

కవివచనము:

క. ఆలోన నయ్యశోదా
బాలుఁడు జగజంత వింతబాలెంత విష
జ్వాలాభీలంబగు చను
బాలానుచు దానిప్రాణ పవనం బెగిచెన్॥

వా. ఇవ్విధంబున యశోదాకుమారుండు ప్రాణమారుతంబు లాకర్షింపఁ బూతన యాతన సహింపఁజాలక యేమనుచున్నది.

పదము॥జయంతసేని॥ఆదితాళము॥

చనుధారవకుందురో చన్నిచ్చు దాదిని
పెనుగావు గొందురో బిడ్డలెందైన॥ ॥౧॥

పల్లవి॥ విడువిడు నాచన్ను విడువిడురా యోరి
బడలితిరా చాల బాలగోపాల।
పగదీర్ప లేనైతి భళిభళి నీవు నా
మొగమైతే నేను సగమైతిఁ గదరా॥ ॥౨॥
అమ్మకనే చెల్ల యది యేమిరా నీవు
ఱొమ్మెక్కితేఁ దలకు దిమ్మెక్కెఁ గదరా॥ ॥3॥
చిన్నవాఁడనియుంటిఁ జెల్లఁబో నీవు నా
చన్నంటితే యుసురు మిన్నంటెఁ గదర॥ ॥౪॥

వా. ఇవ్విధంబున విలపింపుచు వసవల్చు నిసువుచే నుసురు గోల్పడి యసురవనిత పసరంబుకైవడి వసుధాస్థలి దెళ్ళి,

మూర్ఛిల్లిన చప్పుడాలించి కప్పుడాలిమేని బాలుని పాలిబాలి కలు హాహాకారంబులు సేయుచుఁ దమలోఁ దా మేమనుచున్నారు.

పదము ॥ ఘంటారవము ॥ రూపకము ॥

ఏమిసేతా మేమిసేతా మమ్మలారా । యీ
గాముసేఁ డెందుండి వచ్చె నక్కలారా ॥౧॥
ఎన్నఁడీ వింత లెఱుఁగమమ్మ యమ్మలారా - యీ
చిన్నికృష్ణున కెన్నిబాములె యక్కలారా ॥౨॥
కన్ను తెఱవని నిసువుమీద నమ్మలారా - ఆ
యన్నెకారి కంసుఁ డంపెనో యక్కలారా ॥3॥
దోసకారి పంపు వచ్చెనె యమ్మలారా - యెంత
మోసము రాఁ దిరిగె నమ్మ యక్కలారా ॥౪॥
ఎందుఁబోదా మెందుఁ బోగా మమ్మలారా -యీ
మంద నెట్లా యుందుమమ్మా యక్కలారా ॥౫॥
తల్లివింటే తాళే దెల్లే యమ్మలారా - గొల్ల
పల్లె కెంత భయము వచ్చెనె యక్కలారా ॥౬॥
బావబిడ్డని పాలఁగల్గి యమ్మలారా -ఆ
దేవుఁ డీవెత దీర్చెనమ్మ యక్కలారా ॥౭॥

వా. ఇవ్విధంబున నవ్వధూమణులు హాహా కారంబులు సేయ నాయార్భటి చెవులనాలకించి యశోదా కృశోదరి యచ్చటికి వచ్చేక్రియ మెటునలెను.

వ॥ కాంభోజి॥ ఆట

చప్పుడాలించి యా కప్పుడాలుబాలునిఁ గన్న
కప్పురగంధి వచ్చెను గడుచోద్యమంది ॥

యశోద : ఓయమ్మ ఓయమ్మ యిదేమిచోద్యమే. మీరేలాగు నుంటిరే.

చెలి : ఈవింతలు మేమేమని చెప్పేమే యోయమ్మ.

యశోద : అమ్మ నే నేమిసేతునే యీలాగైతే.

పదము ॥ ఆహారి ॥ ఏకతాళము ॥

అమ్మ నేనేమి సేతునే నావిభుని
నెమ్మోమేలాగు చూతునే ।
నమ్మినదైవము హా నేఁటిపట్ల నగుఁ బాటుచేసెఁగద ॥౧॥

ఏమని దూఱుదునే నా విధిని
ఏమని దూఱుదునే – కృష్ణుని కెట్లా
సేమము గోరుదునే –
ఏమరించి వచ్చెనో యీజగజంత
యెట్లా నాయిల్లు చొచ్చెనో ॥౨॥

ఎంత మాట వింటినే బిడ్డనుబాసి
యింత ప్రొద్దేల యుంటినే ।
వింతవారు వత్తురా వచ్చిన ఈ
జంతను రానిత్తురా ॥3॥

పదము ॥ కాంభోజి ॥ ఆటతాళము ॥

సద్దుసేయకురే మీరెవ్వరు సద్దుసేయకురే ।యీరకసి
వద్ద డాయకురే - ఓ చెలులారా
ముద్దుగోపాలుండు దద్దరించేని ॥౧॥

రప్పించరమ్మా మానందుని రప్పించరమ్మా ।
మీరీ సుద్ది చెప్పించరమ్మా - యీబారి
తప్పించరమ్మ ధవళాక్షులారా ॥౨॥

వా. ఇవ్విధంబున విలపింపుచు నందసుందరి నందునిఁ బిలువ
నంప నా చిదానందుని పాలి కతఁడు వచ్చే క్రమ మెటువలెను.

దరువు ॥ ముఖారి ॥ ఆది ॥

నందనుఁ డున్నట్టి చందమంతయు విని
మందనుండి వచ్చె నందుఁ డావేళ ॥

వా. ఇవ్విధంబున వచ్చిన నందుఁ డానందనుఁ జూచి యే
మనుచున్నాఁడు.

నందుని వాక్యం ॥

పదము ॥ ఆహారి ॥ ఆట ॥

ఏలాగు గాసికిఁ దాళితివో నీవు బాలకృష్ణ-మీదాదులు
చేలకుఁ బోయిరో పాలకుఁ బోయిరో బాలకృష్ణ ॥౧॥
వద్ద వారికేల బుద్ధి లేదాయెనో ముద్దుకృష్ణ - యీ
పొద్దున నేనెటువంటిసుద్ది వింటినయ్యో ముద్దుకృష్ణ॥౨॥

కన్నతల్లి యెంత కన్నురాలాయెనో చిన్నికృష్ణ-యింత
పున్నెముం గట్టు కొన్నవారెవ్వరో చిన్నికృష్ణ ||3||

వా. అని మఱియు సేవించుచున్నాఁడు.

నందుఁడు చదివేపద్యం :

క. ఓతనయా ! పూతనచే
యాతనలకుఁ దప్పితివిగదా దైవకృపచే
నాతండ్రి నేఁడుగదా
మాతండ్రి కులంబు వెలసె మేదిని మీఁదన్||

క. పుట్టక పుట్టిన ముద్దుల
పట్టీ, నాపుణ్యఫలము పరఁగం దిరుగం
బుట్టితివసి వింటిఁ గదా
చుట్టములకు నాకు నేఁడు శుభము లభించెన్||

వా. ఇవ్విధంబున వచ్చిన వల్లవపురవల్లభుండు పూతనా చేతనాపహారియైన యాతనయుని దిగిచి తన నాతిచేతికొసంగ నయ్యంగన కుమారునిఁ గౌఁగిటఁ గదియించి మఱియు సేవను చున్నది.

పదము|| మధ్యమావతి|| ఆటతాళము||

ఎందుండి వచ్చెనో గోపాల - యెందుండివచ్చెనో|
మందకు నేఁడీ మటుమాయలాడి ||౧||

ఏలాగు తాకితివో నీపై యిచ్చిన
చను బాలు గోలితివో ||౨||

మము రమ్మని చాటిరో మీాదాదులు
తముఁ దప్పించుక దాఁటిరో ॥౩॥

కొడుకా వెఱచితివో దీనిఁజూచి
జడిసె యెంత వాచఱచితివో ॥౪॥

కన్నీరు నించితివో నన్ను - గన్నయ్య నీ వెంత
కళవళించితివో ॥౫॥

మదినేమి తలఁచితివో గోపాల
బెదరి నన్ను పేరఁ బిలిచితివో ॥౬॥

ఆఁకొని బడలితివో దీని
యాకారము చూచి యడలితివో ॥౭॥

బాలగోపాల చనుబాలు
గ్రోలవయ్యా నీవీ వేళ ॥౮॥

వా. ఆసమయంబునఁ బూతనాకళేబరంబు పరిహారింప నందుఁ డాభీరకుమారులఁ బిలువనంప, యమునాతీరముననుండి వారు వచ్చేక్రమమెటువలెను.

జతి॥ సౌరాష్ట్రము॥ ఆది॥

కోలలు చేఁబూని గొంగళ్లు ముసుఁగులువైచి
పాలకుండలు మూఁపుపైని రాణింప।
చేలలోనుండి గోపాలకులు వచ్చిరి
వేళంబె నందుని పాళెంబుచేర. ॥౧॥

గొల్లపదాలు: భూపాలము – రూపకము॥

ఓటికిన్నెర మీటుకొంట గొల్లలారో – ఆ
యేటి సాయెనె నేటిమాపు గొల్లలారో ॥౧॥

తందనాలు పాడుకొంట మనము రాఁగా – ఆ
మందలో నొక్క సద్దురేఁగె గొల్లలారో ॥౨॥

నందయ్య పిలిచెనఁట గొల్లలారా – మన
మందఱముఁ బోదము రారో గొల్లలారో ॥3॥

గొల్లలు బెదరి తమలో తాము ఆడుకొనే మాటలు:

ఒకఁడు:– ఒరే ఒరే యిదేటి గామురా!

మఱొకఁడు:–ఒరే మన కిచ్చమ్మకు చన్నియవచ్చిన దాదిరా

మఱొకఁడు:–ఒరే ఓయబ్బ! యిది దాదిగాదు ఏమీగాదు రాకాసేరా.

మఱొకఁడు:–ఒరే నానేతికావడేదిరా!

మఱొకఁడు:–నాపాల కుండేదిరా?

మఱొకఁడు:–ఒరే ఒరే నాబడికిన్నెర యేదిరా?

మఱొకఁడు:– ఒరే ఒరే నాచద్దిచిక్కమేదిరా?

దరువు॥ చద్దికిచిక్కము జారవిడిచి గొల్లలారో – ఆ
పెద్దబొమ్మఁడు జరిగెఁగదర గొల్లలారో ॥౧॥

గుడ్డితిమ్మఁడు కూసెఁగదర గొల్లలారో – దీని
నడ్డివిఱుగ దుడ్డెగదర గొల్లలారో. ॥౨॥

సింగపైతె చెదరిపాతె గొల్లలారో - బొజ్జ
గంగప్పైతె కసికెగదర గొల్లలారో ॥3॥

బొమ్మ డదిగో బొబ్బరించె గొల్లలారో - దీని
దొమ్మతెవులు మొత్తివిడువ గొల్లలారో ॥౪॥

బూసి సూసి కేకవేసి గొల్లలారో - వాడు
గోసివిడగ దూసెగదర గొల్లలారో ॥౫॥

ఉత్తసుద్దులె ఊప్పెట్టకురె గొల్లలారో - దీని
నెత్తిసదియ మొత్తివిడువర గొల్లలారో ॥౬॥

నేతికావడి నేల వాలేర గొల్లలారో - దీని
మూతిమీసలు పొసికివిడువర గొల్లలారో ॥౭॥

పాలకుండలు పగిలెగదర గొల్లలారో-దీని
కాలుబట్టి తియ్యగదర గొల్లలారో ॥౮॥

నల్లమూతి కాలెగదర గొల్లలారో-మన
వల్లవు లెంతవణకినారొ గొల్లలారో ॥౯॥

ఇల్లెల్ల నిండె గదర గొల్లలారో-దీని
వెళ్ళదీసి వేయగదర గొల్లలారో ॥౧౦॥

నందునిమాట:-రారోయి గోపకుమారులార ! ఈరక్కసురాలి
కళేబరము పరిహరింపరోయి.

గొల్లలమాట:-ఆలాగే సేసేమయ్యా.

వా. అని నందుడు పంచిన నీలికాసె బిగియించి పూతనా
కళేబరంబుసంధించి,పగ్గంబులబంధించి తిగిచిరట యెటువలెను.

దరువులు:- ఏలల్లా గోపాల - ఎంతబరువురా గోపాల ॥౧॥
బ్రతికియుందిరా గోపాల-బయమయ్యేర గోపాల ॥౨॥
కదియఁబోకురా గోపాల-కఱచినఁ గఱచుర గోపాల ॥3॥
మోవలేమురా గోపాల-మోఁకులుదేర గోపాల ॥౪॥
బండిఁజేర్పరా గోపాల-బయలుదేరరా గోపాల ॥౫॥
కొండగదలెరా గోపాల-కొంత మెదలెరా గోపాల ॥౬॥
ఊరుగడచెరా గోపాల-దూరము నడచెర గోపాల ॥౭॥
పారవేయరా గోపాల॥

గొల్లలమాటలు:- ఒరే ఒరే దీనిని పారవేసి మనమందరమును ఇక్కడ పండుగుసేతాం.

దరువు॥ పండుగుసేయర గోపాల ॥౮॥

గొల్లలభాష:- ఒరే ఒరే చిన్నెంక ! ఒరే ఒరే పెద్దెంక ! ఒరే ఒరే నూక ! ఒరే గుడ్డిబొమ్మ ! ఒరే అమాసపెద్దు ! ఒరే మాంబాకతిమ్మ! ఒరే గంగ! మనకిచ్చమ్మకు వచ్చిన గాచారం తీరెనే మన కాయిసారం వద్దు రారోరి.

మఱొకఁడు:- ఒరే కిచ్చమ్మకు ఏమిగాచారం వచ్చెరా?

మఱొకఁడు:- ఒరే నువ్వేడ నుంటివిరా ?

మఱొకఁడు:- ఒరే నేనే పొనపొనపొనా కోడెమ్మ గుంటకాడ గొల్లలమంద యుండదే ఆ గొల్లలమందకాడ ఒక గుడ్డి మానిసి మరకపోతా వుండగా ఆ అంటా చూస్తూ ఉంటిరా.

మఱొకఁడు:- ఒరా ఒరా నువ్వేడ ఉంటివిరా?

మఱొకఁడు:- ఒరా నేనే సామిదారంకాడనే కాచుకవుంటిరా. నీవు దారం కాచుకవుంటే నేను సూది యెతుకులాడుతూ ఉంటిరా.

మఱొకఁడు:-ఒరే నువ్వేడ ఉంటివిరా?

మఱొకఁడు:-ఒరే నేనే ఆ సంకచక్కిలాలు గలిగిన సామి ఉండాఁడే ఆనామిని తలుసుకాడుతా ఉంటిరా.

మఱొకఁడు:-ఒరే ఒరే నాకు రెండు సక్కిలాలు ఏపిసరా.

మఱొకఁడు:-ఒరే ఒరే గుజ్జిబొమ్మ నువ్వేడ ఉంటివిరా?

గుజ్జిబొమ్మ:- అదేమిరా ఓరి, మమ్ముల నందఱినిన్ని నువ్వేడ వుంటివిరా నువ్వేడవుంటివిరా నువ్వేడవుంటివిరా అని అడుగుతావుండావే! ఒరే గొల్లలల్లా గూడుకొని, బందు కట్టు చేసుకొని, సంబళమల్లా యెత్తుకొని నాకంబళిపాత నాచుకుకొని దిమిక్కిదద్ద దిమిక్కిదద్ద.

మఱొకఁడు : ఒరే ఒరే గుజ్జిబొమ్మ బందుకట్టు బందుకట్టు అంటూ నలుగుతూ ఇనేట్టుగా ఇట్లా బయలుసేతురటరా ఓరి. ఒరే ఒరే అంక, ఆ యెజ్జిగొల్లవాఁడు అల్లా చెప్పితే నీకేమి బయమురా! నువ్వే నేను కాదటరా!

మఱొకఁడు : ఒరే నువ్వే నేనైతే మఱినేనేదిరా?

మఱొకఁడు : నువ్వే నేను నేనే నువ్వు.

మఱొకఁడు : ఒరే ఒరే మఱొకసుద్ది యింటివటా!

మఱొకఁడు : ఏమిసుద్దిరా ఓరి ?

మఱొకఁడు : ఒరే నేనే ఆకోతిమోరకుల్లాయబాపనివద్ద సదుచ్చుకుంటేనే నాకు ఏమోయేమో శోస్తాందిరా!

మొదటివాఁడు : ఒరే నీకు కబిస్త్రరం తోస్తుందేమో

మఱొకఁడు : అవురా ఓరి అళ్ళం జెప్పరా

మొదటివాఁడు : నా మనసెరిగి చెప్పితివేరా యోరి

మఱొకఁడు : అయితే ఒకరాగం వూళబెట్టి రెండు పదాలు గొణగరా ఓరి.

దరువు ॥ సౌరాష్ట్రిము । రూపకము ॥

రెండు రెండు యిప్పగింజలే తుమ్మగిలో
రెండువేల మాయావులమందల్ తుమ్మగిలో
మూడు మూడు యిప్పగింజలే తుమ్మగిలో
మూడువేల మా యావులమందలె తుమ్మగిలో ।
కుడుములు పిండికూర వెన్నెలాహే
కూకుండి తినఁగదే వెన్నెలాహే ।
నల్లేరు దురకంట నెన్నెలాహే
నమల వెఱచునె మాగంగ వెన్నెలాహే ।
పల్లేరు ముండ్లంట వెన్నెలాహే
పాఱ వెఱచునె మాగంగ వెన్నెలాహే ।
సాఁకఁబెట్టి నీకు మొ్రక్కేమేకవీర - మమ్ము

సాకి సంతరించవమ్మ యేకవీర ॥ (తిరుగ పాడేది)
ఎట్లో పాఱెడి యెజ్జని గంగ
పాలలో నుండేటి పచ్చటిగంగా ।
ఎట్లో మా యెజ్జన్న యెచ్చరించంగ
పాఱెడి గంగ వచ్చి పవ్వళించంగ ।
చల్లని తల్లి మీకు జాతరలు సేసేమమ్మా
నల్లావులపాలు పొంగళ్ళు పెట్టేమమ్మా ।
గొల్లలకెల్లను కొలము దేవర్వై
యెల్లమ్మ యెల్లమ్మ యేలుకోవమ్మ ।

**మాటలు :** ఒరే ఒరే బొమ్మా నీవటుండరా. నక్క (?) మన దేవరమీఁద నేమో యేమో వచ్చి విడిచెరా,

**మఱొకఁడు :** అయితే సెప్పికాడరా ఓరి.

**దరువులు :** తన్ను వేసివాఁడు నన్నెత్తుకొనిపోయె
కన్నగాఁడు చూడు కాటేసినితోడు ॥౧॥
దూడలు మేపుతా ఆడనున్న నన్ను
ఈడకుఁ దెచ్చినవాఁ డెవ్వండురా ॥౨॥
గొంగడి గానము కోపము వచ్చెని
గంగఁడు చేసిన కపటముగాదా ॥3॥
నా ముక్కులోపల నాలుకగానము
ఏమిచేసిపోయె నెట్టిండు వస్సి ॥౪॥
అక్కలమ్మకు నేఁడు మొక్కుచెల్లింతాము
వక్కలాకులు వేగ వండరా వోరి ॥౫॥

మాటలు : ఒరే ఒరే మాంబాక తిమ్మా మీరు ఎత్తైత్తి కూతలు కూస్తూ ఉండారు. అట్లాగాదురా ఓరి. నేను రామాయణ బావుతాలు చదుచ్చుకొన్న పదాలు పాడే గాని యినరా నోరి.

మఱొకఁడు : అయితే అనుకోరా

పదాలు: నల్లని దేవర నామము సాతిన
బళ్లారాయుఁడు బసవయ్య కొడుకు ॥౧॥
నారదమయు సుప్పనాతిని పెండ్లాడి
బారతకతసెప్పె బైర దేవరకు ॥౨॥
రంబకు పుట్టెను రావణుండనగాను
కుంభకర్ణుని పెద్దకొడుకు గాదటరా ॥3॥
అతికాయుఁ డంగదుండల ధర్మరాజుతో
అతివకై పోరాడి రదివింతగాదా ॥౪॥
మనకు వరాలిచ్చే మైలారు దేవర
అనుమంతు దేవర కన్నొండు గాఁడా ॥౫॥

మాటలు:- ఒరే ఒరే గుడ్డిబొమ్మ మన సామిమీద పదాలు పాడితే సివాలు వస్తావుండదిరా.

మఱొకఁడు:- ఎట్లా వస్తావుండదిరా.

మఱొకఁడు:- నక్కెవుళ్ళంగాల్నుండి పుచ్చందల దాకా యెక్కె వస్తూ ఉండదిరా.

మఱొకఁడు:- ఎట్లా ఎక్కివస్తా ఉండదిరా ?

మొదటివాఁడు:- చిమచిమా, జిలజిలా, జుమ్మంటా, ఒళ్ళు ఒకత్రోయమె, తలసాళశ్త్రకొని వస్తావుండదిరా.

మఱొకఁడు:-ఏడనుండి వస్తావుండదిరా ?

మొదటివాఁడు:-అదిగో వచ్చె, ఇదిగో వచ్చె.

మఱొకఁడు: అయితే మన సామిని తలంచకాడరా వోరె.

(అని సివమాడఁ గూర్చుండేది)

ఓంకారము॥ ఓకాటమరాజా.

కరకరకర పొద్దుపొడిచి కారెండలు గాసి
బిరాన్న బీరెండ బిరుదు గొట్టంగ వన్నెలాహే॥
తూర్పున మీాయావులు తుంగలుమేసి
పడమట మాయావులు పచ్చికలుమేసి వన్నెలాహే॥

గొల్లలు మొక్కుకొనేది:

ఓయెల్లమ్మ యెల్లమ్మ। ఏకవీరమ్మ, ఓపెద్దేవర,
మాకోరికలెల్లా సేకూరిసి మమ్ము రచ్చించుకోవమ్మా।
అని మొక్కేది.

దరువులు:

మఱ్ఱిమాని కిందనున్న మాతంగిరావె
యెల్లమ్మ చెరువు చేయించేను గాని ॥౧॥
చింతమాని కిందనున్న సివసత్తిరావే
సంతబైటనున్న ఓసాంబవీ రావె ॥౨॥
బత్తితో తిరువళిక యెత్తేను నీకు
బుత్తి ముత్తి లియ్యవమ్మ పోలేరమ్మ ॥3॥

సత్తైము గల్గినతల్లి సమకూర్పు మేలు
పత్తి చేని బైటనున్న ముత్తేలమ్మ నీవు ॥౮॥
పల్లెండు నేతదీపము పెట్టేను నీకు
సిల్లాడెనమ్మ ఓకొట్లారి గంగ ॥౯॥

ఈతీరున మొదటిగొల్ల లేచి నిలుచుండి సివమాడుచుండఁగా
దగ్గఱనుండే గొల్లలు: ఒరే ఒరే మాకును సివం వచ్చెరా
అనికొంతసేపు తామును సివమాడి అంతటసివముని ల్చెది.

వా. ఇవ్విధంబునఁ బేరెములు వాఱు నాభీరకుమారుల
వారించి నందుఁడు వారి కుడుగర లిప్పించి పంచెనఁట యెటు
వలెను.

వా. అప్పుడానందుఁడు సంభృతానందుఁడై నందనునకు
భూతావేశజాతభీతి విమోచనంబునకు స్వస్తివాచనం బొనరింపఁ
బురోహితులఁ బిలువనంప వ్రజనాయకుని కడకు ద్విజనాయ
కులు వచ్చిరఁట యెటువలెను.

దరువు॥ గుమ్మకాంభోజి॥ ఆట॥

నందపురోహితు లానందము మీఱఁగ
నందగోపాలుని నగరికి వచ్చిరి ।

పురోహితులు దమలోఁ దాము ఆడుకొనే మాటలు.

సింగా :— ఓయి రంగావధానులు?

రంగావ :— ఏమయ్యా సింగావధానులు?

సింగావ :— నేడు నందుడుగారు మనలను పిలువనంపిన ప్రయో
జనమేదో ? ఏమైనా పెండ్లిపేరంటాలు సాగెనో ?

రంగావ :- సాగితేనో ?

సింగావధా :- కొన్ని తప్పుమంత్రాలుచెప్పి దబ్బరహోమాలు చేసి నాలుగు పాడియావులు గ్రహించుకోవచ్చునే.

రంగావధాన్లు :- అవుంచున్నాడవో ? నీమార్గమల్లా నే బయలు చేస్తేనో ?

సింగావధాన్లు :- అవుందురా వెఱ్ఱి, నే నీకు సగంపంచి యిచ్చే గాని యూరకుండరా.

రంగావధాన్లు :- అప్పా నాకు సగం చాలదు. మూడు పాళ్లు ఇచ్చేవు నే వూరకుండేగాని.

సింగావధాన్లు :- అదేంపిరా అయిదు తరాలకు పురోహితుం డను నే నవుండఁగా నీకు మూఁడు పాళ్ళు అనగా నేం పిరా ?

రంగావధాన్లు:-ఓరీ వజ్రశుంఠ, నీకు ఒకపాలు చాలదపరా ?

సింగావధాన్లు :-ఓరీ యిపువలె పెద్ద పిన్నంతరువు విచారించు కోక యెదురు మాట్లాడకురా. నీవడిగినట్లల్లా యిచ్చేము గాని వూరకుండరా.

రంగావధాన్లు : అవుయితే నాకు వృత్తిరువులందుకొనే కాదంచు న్నావా ?

గొల్లమాట :-ఒరే ఒరే బాపనకేసు గాండ్లాల, మీారేలకొట్లా డేరు ? ఇద్దరు రండండ్రా.

పురోహితులు :- ఆశీర్వాదం చేసేది – మంగళాని భవంతు.

నందునివాక్యం :- రారయ్యా పురోహితులారా. ఈకుమారునకు
స్వస్తి వాచనం బాచరించరయ్యా.

పురోహితులు : అయ్యయ్యా మహాప్రసాదం అలాగే సేసే
మయ్యా.

వా. ఈరీతి వచ్చిన భూసుర పురందరులు నందుని పంపున
నందనందనునకు స్వస్తి వాచనం బాచరించిరట యెటువలెను.

శ్లో. శుక్లాంబరధరం విష్ణుం
శశివర్ణం చతుర్భుజం ।
ప్రసన్నవదనం ధ్యాయేత్
సర్వ విఘ్నోప శాంతయే ॥

సంకల్పము : శుభేశోభనేముహూర్తే అద్యబ్రహ్మణః ద్వితీయపరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే, ద్వాపరే చతుర్థపాదే జంబూద్వీపే భరతవర్షే భరతఖండే అస్మిన్ వర్తమానే వ్యావహారికే చాంద్రమాన [1]ఖరనామసంవత్సరే ఉత్తరాయణే వసంతర్తౌ చైత్రమాసే శుక్లపక్షే అద్య పంచమ్యాం శుభతిథౌ గురువాసర సంయుక్తాయాం, శుభనక్షత్రే, శుభయోగే, శుభకరణే, ఏవం గుణ విశేషణవిశిష్టాయాం శుభ

1. క్రీ శ. 1651 సంవత్సరమునకు సరిపోవును.

తిథౌ అస్యకుమారస్య సర్వారిష్టశాంత్యర్థం కలశపూజాం కరిష్యే. శ్రీహేమాబ్జనాయికా రాజగోపాలాభ్యాం నమః శ్రీలక్ష్మీనారాయణాభ్యాం నమః సీతారామాభ్యాం నమః ధ్యాయామి ఆవాహయామి సర్వోపచారాన్ సమర్పయామి. భూతావేశభీతి నివృత్తిరస్తు, ఆయుష్యమస్తు, ఆరోగ్యమస్తు, ఐశ్వర్యమస్తు, అనేన కలశోదకమార్జనేన అస్యకుమారస్య సమస్త పీడాపరిహారోస్తు, అస్మిన్గృహే శోభనపరంపరా వాప్తిరస్తు.

శ్లో. అస్మాక మాశిషామోఘై
రమోఘై రఘుహారిభిః ।
చిరంజీవ చిరంజీవ
సుఖీభవ సుఖీభవ ॥

వా. ఆసమయంబున గోపాలదేవుని పాలికి నవాళికచలు నివాళి పళ్యంబులు దెచ్చిరట యెటువలెను.

దరువు ॥ ఆరతులు గొనివచ్చి రంగనామణులు
ఆరాజగోపాల మన్నారు దేవునికి ।
మంగళము చెంగమల వల్లిరమణునకు
మంగళము మహనీయ మహితునకును ।
మంగళము నిచ్చలు మమునేలు దేవునకు
మంగళము సంపంగి మన్నారునకును ।

దక్షిణద్వారకాధ్యక్షునకు మంగళము ।
దక్షిణనాయకుండైన ధన్యునకు మంగళము ।
పక్షీంద్ర వాహునకు భక్తజనములనెల్ల
రక్షించు రుక్మిణీ రమణునకును
జయమంగళం శుభమంగళం ॥

వా. ఇవ్విధంబున నానందంబు చెందిన యానందనందనునిపై దివ్యదుందుభి ఘోషంబుతో మందారపుష్పవృష్టి గురిసెనట యెటువలెను.

వా. ఇవ్విధంబునఁ గుమారునకు శుభాచారంబులు నడిపించిన యుత్సాహబాహుళ్యంబున యశోద రంగమధ్యంబున మంగళప్రదముగా నటియించెనట యెటువలెను.

భరతవాక్యము : మన్నారుదేవికి మంగళం. ఇవ్విధంబున పూతనా భంజనంబు చేసిన సనాతన దేవతాచక్రవర్తి రాజగోపాలమూర్తి యచ్యుత విజయరాఘవేంద్రున కాచంద్రార్కంబుగా విశ్వ విశ్వంభరాధిపత్య నిత్యాయురారోగ్య భాగ్యంబులు పాలించి రక్షించుఁగాక.

---

# కాళీయమర్దనము



విజయరాఘవుఁడు

# కాళీయమర్దనము

## విజయరాఘవనాయక కృతము

### ఉపోద్ఘాతము.

ఈనాటకము "నృత్తగీత వాద్య పద్య గద్య విద్యావైశారద్యంబు గనిపించునుద్యోగంబున విజయరాఘవునిచే రచియింపబడినది."

ఇందు రాజగోపాలదేవునివర్ణనయు, నతనికయి విజయరాఘవుఁడు నిర్మించిన శిలామంటపము గోపురప్రాకారములు వైకుంఠసభయుఁ జేర్పఁబడినవి. రాజగోపాలుఁడేవచ్చి కొలువున్నట్లు వర్ణింపఁబడినది. ఈవర్ణనయందు కవియగు విజయరాఘవుఁడు తాను కొలువుండు లీలలనుగాని తనతండ్రి సభనుగాని మనసునందుంచుకొని వర్ణించెనని యూహింపవచ్చును. ఆతని కొలువుకూటమునకు వచ్చిన మునులు "రాజగోపాలుని కాళీయభుజంగభంగనాట్యప్రసంగంబు" నొకపరి చూపింప వేడుకొనిరి. అంత నాతఁడు గోపికలతోఁబయలు వెడలి కాళిందిని జలక్రీడసేయఁ బిలువఁగా, వారు కాళీయుండను పెనుచిలువవలని వెఱపును దెలియఁబఱచిరి. అతఁడు నీటిలోదుమికి కాళీయఫణిఫణాగ్రంబులఁ బాదంబులహత్తించి

తద్వాలంబు కేలఁగీలించి నటించెను. అతనిఁ జంపవలదని ప్రార్థించిన భుజంగరాజాంగనలమాట నాలించి యాతనిని సంరక్షించెను. తరువాత జలక్రీడవర్ణింపఁబడినది. అటుపై నాతఁడు జలక్రీడసేసినట్లును దక్షిణద్వారకకు వచ్చినట్లును నీరేజ ముఖులు నీరాజనము లిచ్చినట్లును బేర్కొనఁబడినది.

ఇది యెట్లు ప్రదర్శింపఁబడియెడిదో యూహింపవీలు గాదు. జలక్రీడసల్పుట, కాళీయ ఫణాగ్రమందలి నాట్యము, యమునానదియందు దుముకుట మూఁడును రంగప్రదర్శనము లగుట యెట్లో ఊహింపవలెను. ప్రాయశః ఇందు పాత్రలు వేషముధరించి వచ్చినను, మునులుచేరి యడుగుట, గోపాంగ నలువచ్చి ప్రార్థించుట, అతివలు నీరాజనములిచ్చుటమాత్రము రంగమునఁ బ్రదర్శింపఁబడియుండునేమో యనిపించును.



# కాళీయ మర్దనము



సీ. భోజకన్యాముఖాంభోజ రాజమరాళ
సత్యాఘన స్తన స్తబకభృంగ
జాంబవతీ విలోచన చకోర శశాంక
మిత్రవిందాతటి న్మేఘరూప
భద్రావశావశ భద్రదంతావళ
వర సుదంతా మనోవన మృగేంద్ర
లక్షణారూప కలాపినీ పర్జన్య
భానుసుతా లతా పారిజాత

తే. షోడశ స్త్రీసహస్రచక్షుః ప్రసార
హారసార మసార మోహాన శరీర
విజయరాఘవభూపాల భజనలోల
కేలు మోడ్చెద రాజగోపాల, నీకు.

పరాకు నిరాకుల మనీషా విశేషావతారు......ప్రద్యుమ్న సాంబాదులకన్న ముద్దుగా కనకాబ్జనాయిక గన్న మించిన్నకుమారుండు గనుక తన కవితావితానశృంగా..................పేర హావణించిన కాళీయమర్దన నాటకంబు నృత్తగీతవాద్య పద్య గద్య విద్యావైశద్య వైశారద్యంబు గనిపించు నుద్యో........

ద్వి. శ్రీరాజగోపాల, చిరకీర్తిజాల,
కారుణ్యగుణశీల, కల్యాణలోల,
గోవర్ధనోద్ధార, గోపకుమార,
భావజసమరూప, బహుళపరితాప,
నందగోపకుమార, నవనీతచోర,
చందనమందార, సమకీర్తిహార,
కరుణారసాపాంగ, గరుడతురంగ,
పరమవచోవేద్య, భవరోగవైద్య,
దక్షిణద్వారకా, స్థలకృతలీల,
రక్షింపఁ గదవయ్య, రాధికాలోల !

అని రాజగోపాలస్వామిని ప్రార్థించి చెంగమలనాంచారమ్మ నేమని కొనియాడుచున్నాఁడు.

ద్వి. కలశాంబునిధి కన్య, కల్యాణధన్య,
సలలితసౌజన్య, జగదేకమాన్య,
వందారు శర్వాణి, వారిజపాణి,
మందరధరు రాణి, మధుకరవేణి,
పరమదయాలోక, పాలితలోక,
నిరతగజానీక, నియతాభిషేక,
భారతీ పార్వతీ, భామలకైన,
గోరిన వరమిచ్చు, కువలయనయన,

శ్రీ చెంగమలవల్లి, చెలువైనతల్లి,
కాచి రక్షింపవే, కనకాబ్జవల్లి.

వ. ఇవ్విధంబున విజయరాఘవభూపాలుండు......రచింపఁబూనిన నాటకంబునకుఁ బ్రథమకథాసంవిధానంబేర్పరించిన నేర్పెటువలెను.

ద్వి. శ్రీరమణీమణి చెలఁగి నటించు
...... బ్బలికి యామ్యదిగంతరమున
... ... ... ...
పాంచితంబై మించు భరతవర్షమున
శుభవిభవంబగు చోళదేశమున
నభిరామమగు చంపకారామమునను
మునుపు గోపప్రియాఖ్య మునిశిఖామణికి
సాక్షాత్కరించి ప్రసన్నుఁడై భువన
రక్షకుండై మీఱు రాజమన్నారు
చినచెవ్వయాచ్యుత శ్రీరఘునాథ
జనవరార్ణవ పూర్ణచంద్రాయమాన
విజయరాఘవ దత్త విత్త నిర్వృత్త
రజత కాంచన దివ్యరత్నసంఘటిత
రమణీయగోపుర ప్రాకారమధ్య
సమధిక మణిమయస్తంభ సహస్ర

పటుశిలామంటప పశ్చిమభాగ
ఘటిత గర్భగృహోపకంఠదేశమున
హేమాబ్జనాయికా గృహాసమీపమున
హైమచిరత్న రత్నాంశు విశాల
భానుకోటిప్రభా భాసురాకార
మైన వైకుంఠ సభాంతరాళమున
నిత్యనివాసియై నిండుకొల్వుండి
నిత్యోత్సవంబుల నెగడెడు వేల్పు
దివ్యహారిద్రనదీ కృష్ణతీర్థ
భవ్యకుంజర తీర్థ పావకతీర్థ
దివిజార్హ్య రుక్మిణీ తీర్థాధిరాజ
కవినుత ... సాగరముఖ్యతీర్థ
సంపాదిత ప్లవోత్సవశాలియగుచుఁ
జంపకారామ వాసనలఁ దేలుచును
భూజనకల్పక భూజమై యెపుడు
రాజగోపాలుండు రాజిల్లుచుండు.

వ. అవ్వరా...మన్నారు కొలువుసింగారమై యొకనాఁడు కొలువుకూటమునకు వచ్చెనట యెటువలెను.

జతి॥ దరువు॥ సౌరాష్ట్రము॥ ఏకతాళము॥

శృంగారనాయకుఁడై (శ్రీ)రాజగోపాలుండు
చెంగమలతోడ సేవకులకుఁ జెంగటిపారిజాతమై।

ముంగిటి నిధానమై॥
కొంగుబంగారమై కొలువునకు వచ్చె॥

వ. ఈరీతి వచ్చిన రాజగోపాలస్వామి హేమాబ్జనాయికా సమేతుండై రత్నసింహాసనాసీనుండయ్యెనట యెటునలెను.

వ. అవురా యీరీతిఁ బేరోలగంబున్న శౌరి సముఖమునకు గోభిల గోపస్త్రీయులు వచ్చిరఁట యెటువలెను.

జతి॥ దరువు॥ ముఖా॥ ఏకతాళము॥

ఆభీరభీరు మోహనమూర్తి చెంగటికి
గోభీల గోపస్త్రీయులు కొలువుసేయ వచ్చిరి॥

వ. ఇవ్విధంబున వచ్చిన భూదేవత లాదేవతాచక్రవర్తినిఁ గీర్తించిరఁట యెటువలెను.

ద్వి. జయ రాజ గోపాల, జయదయాశీల,
జయశేషఫణితల్ప, జయనిర్వికల్ప,
జయభక్త మందార, జయనిర్వికార,
జయపుండరీకాక్ష, జయసురాధ్యక్ష,
జయశార్ఙ్గకోదండ, జయజగత్కాండ,
జయరమాహృదయేశ, జయచిత్ప్రకాశ,
జయ ఘనాఘనవర్ణ, జయజగత్పూర్ణ,
జయచక్రధారేయ, జయజగద్గేయ
జయ పతంగతురంగ, జయ కృపాపాంగ,

జయ దేవమూర్ధన్య, జయ జగన్మాన్య,
సాక్షాత్కరించి మాచనవు పాలించి
రక్షించు మముఁ జాల రాజగోపాల.

వ. అని మఱియు నేమని కొనియాడుచున్నారు. శరణు శరణయ్యా కరుణాసముద్ర.

విన్నపము ॥ రుక్మిణీప్రాణవల్లభా, ద్రౌపద్యభిమాన రక్షక, గజేంద్రవరద, అహల్యా శాపవిమోచన, కాళీయఫణి ఫణా రంగనాట్య లీలావినోద, విశాలవక్షస్థల కౌస్తుభాభరణ, నీలమేఘశ్యామ, పద్మాక్ష, నీదయ మాయందుంచి మమ్ము రక్షింపవే సహజగుణసంపన్న సంపంగిమన్న.

వా. ఇవ్విధంబునఁ గొనియాడి యామునిరాజులు రాజగోపాలస్వామిని జూచి మఱియు నేమనుచున్నారు.

మునీశ్వరులమాట. రాధికారమణీరమణీయశీల, రాజగోపాల, మాపాలఁ బ్రసన్నులై మున్ను మీరు నటించిన బాల లీలలు చూపితిరి కద. కాళీయ భుజంగభంగ నాట్య ప్రసంగం బిఁకొకపరి చూడ వేడుకగుచున్నది, మమ్మనుగ్రహింపవయ్యా.

వా. అని ప్రార్థింప నట్లకానిమ్మని సమ్మతించి యమ్ముని పురందరులఁ గల్పిత కాళిందీతీరంబునకు నంపఁ గానిపించుకొని యమ్మునులు యమునకువచ్చే క్రమమెటువలెను.

వా. ఇవ్విధంబున యదుకుల సార్వభౌముండు మునిసార్వభౌముల నంపి తదనంతరంబ యంతఃపురంబు ప్రవేశించే క్రమమెటువలెను.

వా. ఈవిధంబున శుద్ధాంతంబుఁ జేరిన వేదాంతసిద్ధాంత మూర్తి రాజగోపాలరూపవిస్ఫూర్తిగో గోపాలబాలికలఁ గూడి నగరువెడలి వచ్చెనఁట యెటువలెను.

దరువు॥కల్యాణి॥ఆటతాళము॥

బాలసూర్యుని లీల భాసిల్లుచు నపుడు
బాలకృష్ణుఁడై రాజగోపాలుఁడు వచ్చె॥

వా. ఇవ్విధంబున వెడలి కడలిరాచూలినేలిన బాలగోపాల శౌరి కాళీయఫణిభంజనకేళీవినోదార్థియై కాళిందీతీరంబుఁజేర వచ్చెనఁట యెటువలెను.

ద॥ఆహరి॥ఏకతాళి॥

యమునానదీతీరముఁ జేరఁగావచ్చె
గమలామనోహరి కంసారి శౌరి॥

వా. ఇవ్విధంబున వచ్చిన మన్నారుదేవుండు ఆయమునా వైభవంబు కన్నారఁజూచి గోపాంగనలతో నేమనుచున్నాఁడు.

స్వామిమాట:-రారే గోపికలార, సారంబగు యమునానదీ పూరంబులో విహారంబు సల్పుదమా.

గోపాంగనలమాట:-అయ్యయ్య మీరానతిచ్చినట్లె యమునా జీవనంబు పరమపావనంబగును. అయిన నిది కాళీయుం డను పెనుచిలువ నెలవుగనుక కనకాంబరధర మనకుఁ బనికిరాకున్నది. అటుగాన వానినెడలించి మాభయంబు సడలింపవయ్యా.

వా. అని విన్నవింప మన్నారుదేవుం డన్నదిఁ జేరవచ్చి యందున్న పన్నగేంద్రు ఫణామండలంబుపైఁ గుప్పించిన క్రమ మెట్టువలెను.

ద॥ రేవగుప్తి॥ ఏకతాళి॥

పీతాంబరపుచుంగు బిగియంగఁ గట్టి
చేతిచెంగులు మొలను జెలువుగాఁ జెక్కి
కౌతూహలంబునఁ గాళిందిలో శౌరి
వాతాశనేంద్రుపై వడిమీఱ డిగ్గె॥

వా. ఇవ్విధంబునఁ గుప్పించి తజ్జలంబులఁ గలంచి యాడినఁ జలించి యన్నదీ సలిలాంతర్గతుండైన కాళియుండు బయలుదేరి శౌరిపై నిగిడెనట యెట్టువలెను.

ద॥నాట॥ఏకతాళము॥

బాలకృష్ణదేవునిపైఁ జాల మచ్చరించి
కాళియుఁ డావేళఁ గనిపించుకొనియె.

వా. ఈవిధంబునఁ గదిసిన కాళీయుఫణిఫణాగ్రంబునఁ బదాగ్రంబు హత్తించి తద్వాలంబు కేలఁ గీలించి బాలగోపాలుండు నటించెనట యెట్టువలెను.

దరువు॥కాంభోజి॥ఆటతాళము॥

అందెలు గజ్జెలు నందంద మెఱయంగ
కుందనపుసొమ్ములు గునిసి యాడంగ
కందుమీఱఁగఁ గాళీయుఫణముపై
నందనందనుఁడు నటియించె నపుడు॥

వ. ఇటువలె నటించుచుఁ గుటిలదానవవిరోధి శిరోధిపై నిలిచి నిజాధీశ్వరు నొంపఁ గంపమానమానసలై కాళీయాంతః పురకాంత లాగోపాలచూడామణిని వేడుకొన వచ్చిరఁట యెటు వలెను.

దరువు॥మధ్యమావతి॥ఆది॥

మన్నారుదేవ మా మగనిఁ గావుమనుచు
పన్నగాధీశుని భామలు వచ్చిరి॥

వా. ఇవ్విధంబున వచ్చిన యప్పన్నగాధీశ్వరునికాంత లా పన్నగరాజశాయినిఁ బ్రార్థించే క్రిమ మెటువలెను.

శరణు శరణయ్యా కరుణాసముద్ర.

ఆ. వె. మమ్ముఁ బెండ్లిసేయు మాప్రాణనాథుని
ప్రాణ మిచ్చి నేఁడు భక్తవరద
నీవు సేయుపెండ్లి నిక్కంబు భద్రంబు
పిన్ననాఁటిపెండ్లి పెండ్లిగాదు.

వా. అనిన భుజంగరాజాంగనలఁ జూచి యంగజగురుం డేమనుచున్నాఁడు.

మన్నారుసామిమాట :

లేరే భామలార, మీ మనవిగైకొని మీవిభుని ప్రాణంబు గాచితి భయపడక సుఖంబున నుండరే.

వా. అని కమలోదరుం డాకాకోదర శాతోదరుల నాదరించి కాళీయుని కాళిందిమడుఁగు వెడలించి, గరుడభయంబు సడలించి పంచిన వారు మగిడేక్రిమ మెటువలెను.

వా. వారి నటువలెఁ బంచి పంచశరగురుండు జలక్రీడ సలిపే క్రియ మెటువలెను.

ద॥ గుమ్మకాంభోజి॥ ఆటతాళము॥

1 జరుగుపేటల జాఱుచు నపుడు
శౌరి గోపికలతో జలకేళి సలిపె॥

వా. ఇటువలె జలక్రీడసల్పి గోపాలుండు గోపాంగనలతోఁ దత్క్షణంబ దక్షిణద్వారకా నగరంబు ప్రవేశించెనఁట యెటువలెను.

దరువు॥ సావేరి॥ ఆటతాళము॥

జలకేళి చాలించి జలజనాభుఁ డావేళ
వలనొప్ప దక్షిణ ద్వారకకు వచ్చె॥

వా. ఇవ్విధంబున నిజరాజధానిఁ జేరిన రాజగోపాలస్వామికి నీరజముఖులు నీరాజన మిచ్చిరఁట యెటువలెను.

దరువు॥ వసంతభైరవి॥ ఆది॥

హారతులు గొనివచ్చి రంగనామణులు
ఆ రాజగోప మన్నారు చెంగటికి॥
మంగళము శ్రీ చెంగమల వల్లిరమణునకు
మంగళము మహానీయ మహితునకును।
మంగళము నిచ్చలును మముఁనేలు దేవునకు
మంగళము సంపంగి మన్నారునకును ॥౧॥

---

1. జారుడుపేటలై యుండునేమో.

దక్షిణ ద్వారకాధ్యక్షునకు మంగళము
దక్షిణ నాయక ధన్యునకును ।
పక్షివాహనుఁడైన భక్తలోలునకు
రక్షించు రుక్మిణీ ప్రాణేశునకును ॥౨॥

వా. ఇవ్విధంబున నీరాజనంబులు గైకొని యారాజగోపా లుండు హేమాబ్జ నాయికాసమేతుఁడై శుభోదర్కంబుగా నటిం చెనఁట యెటువలెను. మన్నారుదేవికి మంగళం.

వా. ఇటువలె నటించిన నటనంబునకు మెచ్చి వియచ్చ రులు గురియించు పుష్పవర్షంబులకు హర్షించుచు విజయరాఘవ భూపాల భవనంబున రత్నసింహాసనాసీనుండై రక్తాబ్జనాయికఁ గూడి నిండుకొల్వుండు రాజగోపాలస్వామి, తనకు నాటక చాటుకవితాకన్యక నొసంగిన విజయరాఘవ భూమండలాఖండ లునకు నవఖండమండిత మహీమండలాధిపత్యనిత్యాయు రారోగ్య భాగ్య దిగ్విజయంబులు పాలించి రక్షించుఁగాత.

కాళీయమర్దనము నాటకము

సంపూర్ణము

# హేమాబ్జనాయికా

# స్వయంవరము



మన్నారుదేవుడు

# హేమాబ్జనాయికా స్వయంవరము

(మన్నారుదేవ కృతము.)

## ఉపోద్ఘాతము.



ఈయక్షగానమును రచించినవాఁడు మన్నారుదేవుఁడు. ఈతఁడు తాను విజయరాఘవభూపాలచంద్రుని కుమారుఁడ ననియు, "విజయరాఘవాభ్యుదయాది ప్రబంధనిబంధనచాతురీ ధౌరేయుఁడ" ననియుఁ జెప్పికొనియున్నాఁడు. విజయరాఘవ భూపాలుఁడు రఘునాథనాయకాభ్యుదయమును యక్షగానము గాను ద్విపదకావ్యముగాను రచించియున్నాఁడు. అందు తన తండ్రి కీర్తిప్రతాపములు, చరిత్ర, దినచర్య మున్నగునవి వర్ణింపఁబడుటయేగాక, ఆతనిపై నొకవారిజలోచన మరులు కొనుటయు, ఆతనికై పరితపించుటయుఁ దరువాత విప్రలంభమును మున్నగునవి నిండుగావర్ణింపఁబడినవి.

ఆరమణీమణి కేలు కేలఁగీలించి రఘునాథభూపాలుండు కేళీభవనంబు ప్రవేశించి పంచశరకళాప్రపంచం బెరింగించి యమ్మోహనాంగి బోఁడిని కరిగించి "యచ్చట ముచ్చటదీరనమ్మ చ్చె కంటెఁబచ్చవింటిదొరతనంబునకు గురిసేసి యేలుచు నిజలీలా

విలాసశృంగాటకంబు పావణించిన తన ముద్దుపట్టియగు విజయ రాఘవపట్టభద్రునకు" అనివ్రాసెను. ఇట్లు తండ్రిశృంగారమును విజయ రాఘవుఁడాకరీతిని వర్ణింపఁగాఁ గుమారుఁడాతని ననుక రించి మార్గాంతరమున నిందు వర్ణించినాఁడు.

ఇందలి కథ :- రాజగోపాల హేమాబ్జనాయికావివాహము విషయముగాఁగలది. దక్షిణద్వారకలో (మన్నారుగుడియందు) నవతరించిన రాజగోపాలస్వామి కొలువుండ దేవతలువచ్చి సముద్రము మథింపవేఁడిరి. ఆతఁడంగీకరించి దేవదానవులను వాసుకినిబిలిపించి సముద్రమును మథింపఁగా, అందుండి పారి జాతాది నిస్తులవస్తుజాతంబు లుద్భవిల్లినవి. లక్ష్మియునందుఁ బొడమి రాజగోపాలునిజూచి మరులుకొని మనసుగొనియుండఁ గడలిరాజచటికివచ్చి తన కొమార్తెను దీసికొనిపోయెను. తరువాత సుధారసంబు హరించుటకు దేవదానవులవివాదము, మోహినివచ్చి సురాసురులకుసంధియొనర్చి యమృతమును బంచియిచ్చుట, విష్ణువు అత్తరి మత్తులగు దైత్యవీరుల నవక్ర చక్రధారల నుక్కడంచి సరోజభవవాసవాదుల నిజనివాసంబు లకుఁ బంచి తానునాక్షణంబె దక్షిణద్వారకానగరంబు చేరుట, హేమాబ్జనాయికయైన లక్ష్మి రాజగోపాలునిగూర్చి విప్రలంభ మనుభవించుట, శృంగారవనముప్రవేశించుట, కుసుమాప చయము, ఒక సఖీమణీ యామె విరహబాధనుచూచి సహింప

లేక కారణమొకటేఁగీ విజయరాఘవుని దోడితెత్తునని కానికల పట్టించుకొని దక్షిణద్వారకానగరంబునకువచ్చుట, ఆమె స్వామికిఁ గానికలర్పించి యాతనినుండి గుఱుతుగా ముద్దుటుంగరమును, కానుకలుగా రతనంబుసొమ్ములు దివ్యాంబరంబులును గొని తిరిగివెడలుట, నాయిక యిందు కందర్పుల దర్పంబుపైరింపఁజాలక వానినినిందించుట, విజయరాఘవేంద్రులు స్వామినిదర్శింపఁబోవ ఆతనితో స్వామి తనకోర్కి చెప్పుట, విజయరాఘవుఁడు కడలి రాజునుదర్శించి యాతని కొమార్తెను స్వామికిచ్చుటకునిర్ణయించుట, నారదుఁడు వచ్చుట, విష్ణుమూర్తులలో స్వయంవరము, తరువాత వివాహము, వివాహవేదికమీఁద పురోహితులు, పేరటాండ్రను హాస్యపోషకమైన ప్రసంగములు గావించుటతో కథ ముగియుచున్నది.

వివాహముహూర్తమునందుఁ జెప్పఁబడిన సంకల్పము "అస్మిన్ వర్తమాన వ్యవహార చాంద్రమానే సౌమ్యనామ సంవత్సరే ఉత్తరాయణే వసంతర్తౌ చైత్రమాసే శుక్లపక్షే" అని యుండుటంజేసి క్రీ. శ. 1669 సంవత్సరము మార్చి 21 తేదినుండి ఏప్రెల్ 5వ తేదీలోగా సరిపోయెడి దివసము ఇందుఁ జెప్పఁబడినది. కాఁబట్టి యీగ్రంథము, పూతనాహరణము రచింపఁబడిన 18 సంవత్సరములకు, అనఁగా విజయరాఘవుని

పురణమునకు నాల్గుసంవత్సరములు ముందు వ్రాయఁబడ్డట్లూ హింపవచ్చును.

విజయరాఘవుఁడు వ్రాసిన రఘునాథాభ్యుదయమున కును ఈగ్రంథమునకును గొంతభేదమున్నది. రెండిటి యుద్దేశ మును కుమారునకుఁ దండ్రియందుఁగలభక్తిని నిరూపించు టయే. రఘునాథాభ్యుదయమున ఈ రాజులవంశవర్ణనము, విజయరాఘవునితండ్రియగు రఘునాథుఁడు "మాయవతా రమై మహినుదయించి" యని విష్ణ్వవతారముగానుదయించి నట్లు చెప్పుట, ఆయనచేసినదానములు, సంపాదించినవిజ యములు, పరాక్రమము, ఆయనసభ, అందలి కవితాగోష్ఠి, ఆయనపోషించినకవయిత్రుల గొప్పదనము మొదలయినవి వెలయించుట, చిత్రరేఖ యనుయువతి యాతనిఁ జూచి మోహించుట, వారి వివాహము ననునవి వర్ణితవిషయములు. ఈగ్రంథమునందు రఘునాథరాయుల పరిపాలనక్రమము, మణి యములు మొదలగువారి వివాదములు మున్నగునవి నిరూ పింపఁబడినవి. ఈగ్రంథమును రఘునాథరాయలు రాజుగా నుండినపుడు యువరాజైన విజయరాఘవుఁడు రచించెనా, లేక తాను రాజ్యమునకు వచ్చినపుడు రచించెనా యను ప్రశ్న యుదయించుచున్నది. ప్రస్తావనలో: "విజయరాఘవ పట్టభ ద్రుఁడు భద్రసింహాసనాసీనుండైన క్రమమెటువలెను" అని చెప్పుటచేతను, కలలో దేవుఁడు విజయరాఘవునుద్దేశించి

"తొలుదొల్త నీమేన దురితంబులెల్ల
దొలఁగించి రాజ్యంబు ధ్రువముగా నొసఁగి"

అని చెప్పినట్లు వ్రాయఁబడుట వలనను, గ్రంథము తుదిని "విజయరాఘవపట్టభద్రునకు సామ్రాజ్యపట్టంబుగట్టి" అని యుండుటవలనను, ఈగ్రంథము వ్రాయునప్పటికి విజయరాఘవుఁడు పట్టాభిషిక్తుఁడయ్యెనని తెలియుచున్నది.

"ఈరీతి మెఱుఁగుమంచములమీఁదఁ గూర్చున్న తండ్రి పాలికి వచ్చి విజయరాఘవభూపాలుం డాతనిచరణారవిందంబులకు వందనంబుగావింప, రావోయి కుమారకంఠీరవ!" అని చెప్పుటచే తానప్పటికి యువరాజుగామాత్రి ముండెననియు నూహింప వీలగుచున్నది. కాఁగా విజయరాఘవుఁ డీగ్రంథమును ప్రాయశః తానుయువరాజుగా నున్నప్పుడు వ్రాసి యుండెననియుఁ, దరువాత నందుఁ గొన్నికొన్ని తత్కాలోచితములైన మార్పులుచేసి యిది తనయెదుటఁ బ్రదర్శింపఁ జేసెననియు నూహించుట సమంజసమని తోఁచుచున్నది.

హేమాబ్జనాయికాస్వయంవర మన్ననో మన్నారుదేవుఁడు యువరాజుగా నున్నపుడు వ్రాసి ప్రదర్శింపఁబడినదనుట నిస్సంశయము. ఇందు రాజగోపాల హేమాబ్జనాయికల శృంగారము వర్ణింపఁబడినది. తండ్రియగు విజయరాఘవుఁడు రాజ

గోపాల హేమాబ్జనాయికలకు ప్రతిసంవత్సరము నొనరించు కల్యాణమహోత్సవముల మనస్సునందుంచుకొని, సముద్ర మథనము, లక్ష్మి యుత్పత్తి మొదలైన విషయములతోఁ గలిపి యీగ్రంథమునందలి కథావస్తువు సంపాదింపఁబడినది. విజయ రాఘవుఁడు కడలిరాజును దర్శించుటయు, అతనిచే గౌరవింపఁ బడుటయు విషయముగాఁగల వర్ణనలు, కవి మనోగత పితృ విషయక రతిప్రదర్శకములై యున్నవి. కొమరుఁడు తండ్రి యొక్క శృంగారమును వర్ణించుట యను ననౌచిత్యము రఘు నాథాభ్యుదయముననున్నది. దీనియందు లేదు. ఇందు నారికేళ రాయబారము సరసముగ నుచితముగనున్నది. అందు చిత్ర రేఖ శుకముచే రాయబారముల నడిపించినట్లు కల్పింపఁబడి యున్నది. విజయ రాఘవుఁడు తనకల్పనచే ఆత్మీయమైన శృంగార పరవశత్వము నప్రయత్నముగా నిరూపించెననియు, మన్నారుదేవుఁడు తన తండ్రియందలి భక్తియే ప్రధానముగా నిరూపించెననియుఁ గల్పనలఁబట్టి విశదమగుచున్నది.

ఈకృతి కాలమునకు విజయరాఘవుఁడు కడువృద్ధుఁడు. విష్ణుభక్తి ప్రధానుఁడై యున్నవాఁడు గావున అతనికీకల్పనయు గొంత హృదయంగమముగా నుండియుండును. రఘునాథా భ్యుదయమునందు సమస్యాపూరణము, కవితా చమత్కృతియు నధికముగా వర్ణింపఁబడినవి.

ఇందలి స్వయంవరక్రమము మిక్కిలియుచితముగా వర్ణింపఁబడినది. విష్ణువుయొక్క మూర్తులైన స్థలదేవతలే యిందు వరులగుట ఔచిత్యమును బోషించుచున్నది. ఇందు మతీ స్వయంవరము, దమయంతీస్వయంవరము మొదలగు వర్ణనలు ఈకవికి వరవడిగానోపు. ప్రౌఢములై శృంగారరసప్రధానములైన పద్యకావ్యములందలి విప్రలంభశృంగారములు, దౌత్యము, వివాహము, చంద్రమన్మథోపాలంభము, నగసవర్ణన మొదలైనవి ఈ యక్షగానములందుఁ బ్రవేశించినవి.

వివాహవేదికయందు పురోహితులు అమ్మలక్కలు ఆత్మీయసదోషములను అల్పత్వమునువివరించుచు హాస్యప్రసంగములుసేయుట ఆనాటి యక్షగానములందు సాధారణముగాఁ జూపట్టుచుండును. అవియిందును గలవు. తక్కిన యక్షగానములందువలెనే ఆనాఁటి రాజుల జీవితము లిందును బ్రతిబింబించుచున్నవి.

కృతికర్తయైన మన్నారుదేవుఁడు రాజ్యముచేసినట్లు లేదు. తుదివఱకుఁ దండ్రిచేఁజెఱనుంపఁబడి యాతనితోఁగలసి శత్రువులతో యుద్ధముచేసి మరణించినట్లు తంజావూరి నాయకరాజుల చరిత్ర నుడువుచున్నది.

---

# హేమాబ్జనాయికా స్వయంవరము



సీ. శ్రీరమణీ సముజ్జృంభమాణకటాక్ష!
హారమణీ లసద్భూరివక్ష !
వార్తాచమత్కార వైభవప్రదనామ!
మార్తాండమండల మహితధామ!
మాణిక్య కేయూర మండితభుజదండ!
చాణూరగర్వ శిక్షాప్రచండ!
తంజాపురాధిప స్తవనీయచారిత్ర!
కంజాతపత్ర సంకాశనేత్ర!
ద్వారకాధీశ ! కాంచనవసనవేశ!
పాకరిపుమిత్ర ! చెంగమలాకళత్ర!
మముఁగటాక్షించి శుభలీలమనుపుచాల
రాజగోపాల ! రాధికారతివిలోల!

పరాకుస్వామి !

ద్వి. శ్రీరాజగోపాల, జితదైత్యజాల,
నారదస్తుతిలోల, నవనీతలీల,
ఫుల్లాంబురుహనేత్ర, పుణ్యచారిత్ర,
యుల్లసన్మణివేత్ర, యుర్వీకళత్ర,

బాణబాహువిదార, పర్వతోద్ధార,
వేణుగానవిహార, విబుధమందార.
కాళీయమదభంగ, ఘనకృపాపాంగ,
నీలవర్ణశుభాంగ, నిగమాంతరంగ,
రక్తాబ్జవల్లీశ, రమ్యప్రకాశ,
భక్తచిత్తనివేశ, భానుసంకాశ,
నారీమనోహారి, నవ్యశృంగారి,
కారుణ్యగుణహారి, కౌస్తుభధారి,
గజరాజసంరక్ష, కంసవిపక్ష,
విజయరాఘవదేవ, విమలప్రభావ,
నీపట్టి పట్టైనె, నెగడిన నన్నుఁ
జేపట్టి రక్షించు, చెండలంకార! ?
కనకాంబురుహవల్లి, కాంతామతల్లి.
ననుగన్నతల్లి, యానతకల్పవల్లి,
కడలిరాజుకుమారి, కలిమిమిటారి,
వెడవిల్తుఁ గన్నమ్మ, నెలతేనిసొమ్మ,
తళుకుబంగరుబొమ్మ, తావులరెమ్మ,
చెలువ మన్ననికొమ్మ, చెంగమలమ్మ!
నిరతంబు భావింతు, నిన్నె సేవింతు,
గరుణమీఱంగ నన్ను, గడుఁ గటాక్షించు.
హరిదళవాయి, సర్వాభీష్టదాయి,

పరమవైష్ణవధుర్య, పావనచర్య,
సూత్రవతీనాథ, సుగుణసనాథ,
చిత్రచారిత్ర, యాశ్రితపద్మమిత్ర,
కరమున రాణించు, కనక వేత్రమున,
దురితంబు లన్నియుఁ దొలఁగింపవయ్య.

వ. అని వినతులొనర్చి, యనంత గరుడుల కనంత నమస్కారంబు లాచరించి, పంచాస్త్రజనకుని పంచాయుధంబుల నుతించి, నన్నెమీఱ పన్నిద్దఱాళువార్ల నిత్యసూరుల నారాధించి, యాదిమ కవుల నాదరించి, కుకవిలోకంబు నిరాకరించి, యతులితాశ్చర్య తపశ్చర్యులగు శతక్రతు శ్రీనివాస తాతయాచార్యులకు గంభీరసూక్తులకు సంభావనమీఱ నమస్కరించి, నిజవంశకర్తయై వార్తకెక్కు-చెవ్వభూభర్తను గీర్తించి, తనదు ప్రపితామహుని మహామహుని వీరవైష్ణవ సార్వభౌముని అచ్యుతాళ్వారుల నభినుతించి, తనదు పితామహుని అభినవభోజుని రఘునాథ జననాథ బిడౌజుని సన్నుతించి, శాశ్వతైశ్వర్యంబున వెలయుచు విశ్వవిశ్వంభరాచక్రం బాచంద్ర తారార్కంబుగా బాలింపుచు, చాల వర్ధిల్లుచున్న తనతండ్రియగు విజయరాఘవ భూపాల చంద్రుని యుదార పదారవిందములకు వందనంబు గావించి, యతని యనుమతి గాంచి, హెచ్చుగా వెలసిన యల చినచెవ్వయాచ్యుతాధిప ప్రపౌత్రుండును, రఘునాథ జన

నాథ పౌత్రుండును, విజయరాఘవ భూపాలక ప్రియపుత్రుఁ డును, రాజగోపాలకాంబికా గర్భ కలశజలధి కువలయ మిత్రుఁ డును, అతుల కనకతులాప్రముఖ నిఖిలమహాదాన దీక్షా ధురీ ణుండును, అనేకాగ్రహార ప్రతిష్ఠాపన ప్రవీణుండును, విజయ రాఘవాభ్యుదయాది ప్రబంధ నిబంధన చాతురీ ధౌరేయుం డును, అతులిత పితృభక్తి గురుభక్తి భాగధేయుండును, మహా తానుభావుండును నగు మన్నారుదేవుండు భువనస్తవనీయం బుగా హావణించు శృంగార రసగర్భసందర్భ విభాసురంబగు హేమాబ్జనాయికా స్వయంవరంబను నాటకంబునకు కథా సంవిధానం బెటువలెను.

ద్వి. వర కవీంద్రులు మెచ్చ వసుమతి మీఁద
తిరమగు నమరావతీ పురం బనఁగ,
బ్రాగైననెఱదంట పంట వాల్గంటి
పైగోవ రతనాల పతకం బనంగ,
పట్టిన దిక్పాల పట్టణంబులకు
దట్టంపు మెఱుఁగునిద్దపుటద్ద మనఁగ,
ప్రజలకుఁ గన్నుల పండువు సేయు
గుజరాతి కెంపురాగుంపు రాణించు
మెచ్చుల గోడల, మేటి కిరీటి
పచ్చల మేడల, బటువు నీలంపు

నిగరాల కోటల, నిండుఁ జెక్కడపు
మగరాల పేటల, మానికంబులను
దీరినవీథుల, తేజంబుచేత
మీఱిన జోదుల, మేలి కడాని
తీరులచేత, ముస్తీబైన మస్తు
గారులచేత, చొక్కపు విరిదేనె
కొలఁకుల కెలఁకుల, క్రొత్త నెత్తావి
కలువల చలువల, కలికిరాచిలుక
పలుకుల కులుకుల, పటువీరభటుల
కలుముల బలుముల, కవిబుధోత్తముల
మాటల తేటల, మరులు పుట్టించు
బోఁటుల నీటుల, పొలుపొందు రాయ
బారుల బారుల, బ్రహ్మజ్ఞులైన
పాఱులఁ బౌరుల భాసురంబగుచు
జగతీసతీమణి చరణనూపురము
గగన పరిస్ఫురత్కనక గోపురము
శరధికన్యా విలాసముల దాపురము
ధరనొప్పు దక్షిణద్వారకాపురము.

వ. ఆరాజధానిఁ బాలించు వేయంచులకైదువదాల్పు, విజయరాఘవు పాలివేల్పు, కన్నెలకన్నుదోయి వెన్నెలపులుఁ

గుల వలపించు కలువలరేఁడు, కరుణారసము పెదచల్లు కడకంటి చూపులవాఁడు, రాధావధూమోహనశీలుఁడు రాజగోపాలుఁడు, చెలువుమీఱఁ బదియారువేవురు చెలువలు గొలువఁ గొలువునకు వచ్చెనఁట యెటువలెను.

పదము॥ మధ్యమావతి. ఆది॥

కొలువుకు వచ్చెను – గోపాల దేవుండు
చెలువైన రతనాల – కొలువు కూటముచేర॥
బంగారు చాయల – బాగుమీఱిన చుట్టి
చెంగులు కెంగేలఁ – జెలువుగాఁ బట్టి।
రంగుగా సిగను సం – పంగి సరులుచుట్టి
పొంగుచు హొయలుగ – బురుసా రుమాలుగట్టి ॥ ౧॥

వ. ఈదారి రాజగోపాలశౌరి చెలువు పొంగారఁ గొలువు సింగారమైన పదారువన్నె బంగారు కొలువు కూటమునకు వచ్చి, యందుఁ జెన్నొందు వినూత్న నవరత్న సింహాసనంబు చేరి, చెలువు మీఱిన సుళువు పట్టుగద్దియపైఁ గూర్చుండి, యిరుగడలఁ బదియారువేవురు చెలువలుగొలువ, నొక్కచక్కనికొమ్మను చొక్కపుమాటలఁ దేలింపుచు, ఒక్క జక్కవగుబ్బెతకుఁ బుక్కిటివిడెము పాలింపుచు, ఒక ముద్దులగుమ్మ సుద్దులకుఁ జొక్కుచు, ఒక యిందుముఖి మోవివిందుకై మొక్కుచు, ఒక మిటారి చెక్కిలి గోరఁజీఱుచు, ఒక జవ్వనితో నవ్వుచు, పేరఁ

జేరుచు, ఇత్తెఱంగున శృంగారలీలలఁ దేలుచున్న బంగారు మన్నారు తన చెంగటనున్న యొకయంగనను జూచి యేమను చున్నాఁడు.

గోపాలుఁడు:- రావే యోబరాబరి! మన నాటకశాలలోని బిరుదు పాత్రిను రప్పించవె.

బరాబరిమాట:- ఓస్వామి ఆలాగే కోడి తెచ్చేనయ్యా.

వ. అని పలికి యాచెలువ పిలువ నయ్యంగజజనకుని చెంగటికి సంగీతమేళంబుతో నొక యంగనామణి వచ్చెనట యెటువలెను.

దరువు॥ బిలహరి॥ ఆది॥

సంగీతమేళంబు జతచేసికొని యొక తె
శృంగార నాయకునిఁ జేరవచ్చె నపుడు॥

వ. ఈరీతిఁ జేరి యానారీతిలకం బాకనకవనవిహారునకు జోహారు చేసెనట యెటువలెను.

మొ్రక్కెను మొ్రక్కెనయా
చక్కని మన్న॥

వ. ఇక్కరణి మ్రొక్కిన యక్కనకాంగితో చక్కనిమన్నఁ డేమనుచున్నాఁడు.

స్వామిమాట:- రావే ఓబాలిక! ఇంచుకసేపు పదకేళిక విని పించుమా.

(అంతర్నాటిక) చెలిమాట:-ఓస్వామి ! మహాభాగ్యము ఆలాగే నేర్చినయట్లు వినిపించేనయ్యా.

వ. అని మందలించి యాకెందలిరుఁబోఁడి కుసుమాంజలి యొసంగెనట యెటువలెను.

(కేళిక వినిపించే పాత్రచదివే శ్లోకము)

శ్లో॥ రాజగోపాయ విజయరాఘవాభీష్టదాయినే।
రాజద్గుణకలాపాయ రచయే కుసుమాంజలిమ్॥

వ. ఇవ్విధంబున నవ్వధూటి విరచితకుసుమాంజలియై రంజిలి యాకంజలోచనుని యెదుటఁజేరి యుదుటు మీఱి, దరువుల హొరువులఁ బాటలనీటులఁ బలుకుల కులుకులఁ గన్నులసన్నల వన్నెమీఱి కొంతసేపు వింతకోపుల యేపుచూపునైపుణి గనుపించ పదకేళిక వినిపించెనట యెటువలెను.

పదము॥ తోడి॥ ఆది॥

వలచిన దానినంటినా - వాదు సేసేవు
చెలువమన్నారు మ్రొక్కెరా-చెలిమితో నన్నేలుకోరా॥
సారె వేడుకొన్నా రాక - చలముసేతురా యిందాఁక
జారార నాపై దయలేక - యలయించే వేమి పరాకా॥

వ. ఇటువలె నటించిన యల పాటలగంధి యాటపాటలకు మెచ్చి, యెంచఁ దగురతనంపుసొమ్ములు కాంచనాంబరమ్ములు పాలించి లాలించి నారీమణులతోఁ బేరోలగం బుండెనట యెటు వలెను.

వ. ఈచెలువున నిండుకొలువున నుండు చిలువబోనంపు కంఖాణంపు తేజీ నెక్కు జేజేవజీరుసమ్ముఖమ్మునకు సమ్మదమ్మున నవసరమ్ములవారు వచ్చిరట యెటువలెను.

దరువు॥ముఖారి॥రూపకము॥

బంగారుమన్నారు - చెంగటికి వచ్చిరి
పొంగుచు నవసర - మ్ములవార లపుడు॥

వ. ఈరీతిఁ జేరిన యవసరమ్ములవా రానవసరోజాక్షునితో నవసరోచితవార్తల నేమనుచున్నారు.

అవసరాలవారిమాట:స్వామీ! దేవాదిదేవ ! పరాకు. తామర చూలి మొదలైనదేవతాధీశులు దేవరసమ్ముఖమ్ము పొడగనఁ దలంచి వచ్చి కాచుకయున్నారు. స్వామి చిత్తము.

గోపాలస్వామిమాట:-ఆలాగే వారిని రప్పించరోయి.

వ. అనిన విని వారు పిలువఁ జెలు వమరఁ జెలువ మన్నని కొలువునకు నలువ మొదలైనతెలుఁగంటిదొరలు వచ్చిరట యెటువలెను.

సారంగ॥ఆది॥దరువు॥

జలజభవుం డాదియగా - సకలదేవతలెల్ల
చెలువమన్నారుకొలువునకు - చేరవచ్చి రపుడు.

వ. ఇవ్విధంబున వచ్చిన యవ్వేలుపువజీరు లాజగద్గురువునకు హారువుగా మ్రొక్కిరట యెటువలెను.

దేవతలమాట:- మొక్కేము మొక్కేమయా
చక్కెర విల్తుని గన్న సంపంగిమన్నా॥

వ. ఈచందంబున వందనములొనర్చు నరవిందభవపురందరాది బృందారకవీరుల వేఱువేఱ చూపి కటికవారు వారివారి పెంపు లెచ్చరించిరట యెటువలెను.

కటికవారు చదివేపద్యము:-

సీ. పరమేష్ఠి యదె నీకుఁ బ్రణతు లొనర్చెని
రాజగోపాల, పరాకు దేవ!
సంక్రందనుఁడు నమస్కారంబు చేసెని
రాధికాలోల, పరాకు దేవ !
హవ్యవాహనుఁడు నీకంజలి గావించె
రాజీవనేత్ర, పరాకు దేవ!
దక్షిణాధీశుఁడు దండంబు వెట్టెని
రతిరాజజనక, పరాకు దేవ!

గీ॥ నైరృతుఁడు నీకు సల్లా మొనర్చె దేవ !
వరుణవాయు కుబేరులు వందనములు
చేసి, రీశానముఖ్యులై చెలఁగు సురలు
నీకు మ్రొక్కెదరయ్య పరాకు దేవ!

వ. అని కంచుకులు విన్నవించ మన్నారుసామి వేలుపు మన్నీల మన్ననమీఱఁ జేసన్నల నుచితరత్నఖచితపీఠమ్ములఁ గూర్చుండ నియమించి దయమించి మంజులకటాక్షవిలాసంబులఁ మందహాసంబుల గారవింపఁగ నుప్పొంగి వారలలోఁ దద్దయుఁ బెద్దయగు విరించి హరింగుఱించి యేమని కొనియాడఁ జున్నాఁడు.

ద్వి. జయరాజగోపాల! జయ రమాలోల!
జయ చంపక నివాస! జయ చారుహాస!
జయ రుక్మిణీనాథ! జయ దివ్యబోధ!
జయ సత్యసంకల్ప! జయ భోగితల్ప!
ఆ నారదసనందనాది మౌనులకు
మానసవీధి సమాధి మార్గమునఁ
జిక్కని చక్కని చిన్మయమూర్తి!
మొ్రక్కెము మీపదాంభోరుహంబులకు
కదిసి మీసముఖంబు గాంచినయపుడె
కొదవలు తీఱె మాకోర్కెలీడేరె
నీ కసాధ్యంబేమి నేఁడు మామనవి
చేకొని రక్షింపు చెలువమన్నారు.

వ. అనిన విని ప్రసన్నుండై రాజమన్నం డారాజీవగర్భాదులగు జేజేవజీరులఁ జూచి యేమనుచున్నాఁడు.

పదము॥ సావేరి॥ ఆది॥

సేమమా సురలార చేరవచ్చిన కార్య
మేమి మాకుఁ దెల్పుఁడీ వేగమీరు ॥౧॥

ఇందఱు వచ్చుచందము ముందుగాఁ దెలిసినాము।
మంద లింపుఁ డైనను మక్కువమీఱ ॥౨॥

ఎంతటి పనికైన నేఁ గల్గ మీకింత।
చింత యేటికి కోర్కి చేకూర్తు నిపుడె. ॥౩॥

వ. ఈ చందంబున నందనందనుండు మందలింప నుల్లంబున నుల్లాసంబు పల్లవింప నల్లన దేవతావతంసు లాకంసవైరికో నేమనుచున్నారు.

పదము॥ పంతువరాళి॥ ఆది॥

విన్నపము గలదొకటి - వివరించెదము మేము
మన్నించి చిత్తగింపు - మన్నారు దేవ ॥౧॥

నిను నమ్మినారము - నెనరుంచి నేఁడు మా
మనవి చేకొనుమయ్య - మరునిఁ గన్నయ్య ॥౨॥

అమృతాబ్ధి మథియించి - యమరవర్యులకెల్ల
అమృతము పాలించి - యాదరింపవయ్య. ॥౩॥

వ. అనిన విని యపార కృపారసతరంగంబు లంతరంగంబున దురంగలింప విహంగపుంగవతురంగుండు వారిమనవి యంగీకరించి యేమనుచున్నాఁడు.

గోపాలస్వామి చదివేపద్యం :—

తే. అమృతజలధి మధించి యయ్యమృత రసము
విందు గావింతు మీకు నో వేల్పులార!
ఇందుకై యింత సందియంబేల యిపుడె
చేరుదము రండు కలశాబ్ధి తీరమునకు.

వ. అని లాలించి యభయము పాలించి యా వేలుపులఁ దోడ్కొని వేడ్కతో గోపాలదేవుం డాపాలమున్నీటి చేరువకుఁ జేరవచ్చెనట యెటువలెను.

దరువు॥ సౌరాష్ట్రము॥ ఆది॥

చెలువ మన్నారు సామి – జేజేలు గొలువంగఁ
గలశాబ్ధి చెంగటికిఁ – గదలి వచ్చెనపుడు।

వ. ఇవ్విధంబున వచ్చి యచ్యుతుండు చెంగటనున్న కటిక వారింజూచి యేమనుచున్నాఁడు.

స్వామిమాట : రారోయి కంచుకులార! యీక్షణమే రాక్షసుల నిటకుఁ దోడి తేరోయి.

కటికవారిమాట :- ఓస్వామీ అలాగే తోడితెచ్చేమయ్యా.

వ. అని పలికి యా కటికవారు పిలువ సముచిత సంరంభముతో నముచి జంభ నికుంభ శంబర హేతి ప్రహేతి కాలనాభ పౌలోమ కాలకేయ నివాతకవచాది దైత్యవీరు లభంగుర సంగరశూరులు జలధిమథనాయత్తచిత్తులై భుజబలోన్మత్తులై యచ్చటికి వచ్చిరట యెటువలెను.

జతి॥ దరువు॥ నాట॥ ఆది॥

చేకత్తు లెగఁజిమ్ముచుఁ - జెలఁగి మీసాలుదువ్వుచు
కేకలు వేసి నవ్వుచు - మూకలు గూడి।
భీకరాకారులైనట్టి - బిసుమారక్కసవజీరు
లాకలశాబ్ధిచెంతనున్న - హరిఁ జేరవచ్చిరి॥

వ. ఇవ్విధంబున వచ్చునప్పు డప్పాలదిండి బలుదండిమగ లొండొరులు తమలోఁ దా మేమనుచున్నారు.

రాక్షసుల మాటలు :

ఒరే యిప్పుడు మనమేడకు వస్తాఉండాముఠా?

మరియొకఁడు :-ఏరా ఒరే మరిస్తివి; ఆ పాలసంద్రం దేవ ళ్లంతా మథియిస్తా ఉండారఁట. మనకు ఇబ్బందే మంటే కిచ్చమ్మ పిలిపించిందే గదరా.

మరొకఁడు :-కిచ్చమ్మ మాయలు ఒరే నమ్మరాదురా. ఒరె అందుకుతోడు జంభారిగాఁడు కూడినాఁడురా. దొర కిన అమృతం లంకించుకపోదుజ్జా. ఒరే వాండ్లంతా విసపాలవిత్తులు, పోటిరా వార్ని నమ్మరాదురా.

మరొకఁడు :-ఆహా! ఛీరి నాముందరనా? గద తీసుకొనివేయనా!

మరొకఁడు:-ఓరీ నన్నేల కొట్టితివిరా ?

మరొకండు:- నువ్వాదా దొంగ్రడా, నీపేరుదా యేమిరా?

మరొకండు:- నేనా నాపేరా? నీవేనేరా.

మరొకండు:- నన్ను నీవంటూ ఉండావా? ఒరే వీనికి వెఱ్ఱి పట్టెనేమో?

మరొకండు:- నాకు వెఱ్ఱెప్పస్టే. నీకెట్ల దెలిసెరా? అహాహా ! సెబాసు! వగకంటివిలే.

మరొకండు:- నీకన్నా వెఱ్ఱివాండగనక నాకుదెలిసెరా.

మరొకండు:- ఇప్పుడిప్పుడురా వీనికి వెఱ్ఱి సోకుతావస్తూఉండది.

మరొకండు:- ఒరే అందుకేమాయెరా, మనచేతగాదంటరా! రారా.

వ. ఇవ్విధంబునఁ బలుకుచు వచ్చినయవ్వియచ్చరవైరు లచ్యుతునకు సముల్లాసంబున సలాముచేసిరట యెటువలెను.

దరువు॥పంతునరాళి॥ఆట॥

సల్లాము సల్లామయా - సంపంగిమన్నా।
సల్లాము సల్లామయా।
వల్లవీమోహనాకార - వసుదేవకుమార॥

వ. అనిన విని కనకవసీవినేత యాదైతేయవ్రాతంబుఁ జూచి కౌతుకంబున నేమనుచున్నాఁడు.

గోపాలస్వామిమాట:-రారోయి దైత్యవీరులార! మీర లమరులతో సరిగాఁగ నమృతరసంబు సరుసుకొందురుగాని యీసుధాజలనిధిమథనంబునకు పెన్నుద్ధులై సన్నద్ధులై యుండరోయి.

రాక్షసులమాట:- మహాభాగ్యం. ఆలాగే ఆనతిచ్చినబుద్ధి విని నడుచుకునేమయ్యా.

వ. అనిన విని వారినాదరించి యామురవైరి సురవీరులఁ జూచి సమ్మోదంబున నమ్మహార్ణవం బేమని వర్ణింపుచున్నాఁడు.

గోపాలస్వామి చదివే ద్విపద॥

శ్రీకరంబగుచు, నశేషసత్త్వముల
కాకరంబగుచు, దివ్యారామతతుల
భవ్యమై సనకాది పరమయోగీంద్ర
సేవ్యమై సరిలేని చెలువంబుఁ బూని
కిన్నరగంధర్వగీర్వాణయక్ష
పన్నగ చారణప్రముఖు లెల్లపుడు
బహుశైఖరులు మించ పడఁతులఁగూడి
విహరించు మణిమయద్వీపముల్ గలిగి,
కుటిల తుంగతరంగ ఘుమఘుమారావ
పటలిచే మీఱు నీపాలమున్నీరు
పంటలజనరాలి బటువు ముత్తియపు
గంటల మొలనూలికరణి రాణించి
చూడ్కికిఁ గడునింపు సొంపు ఘటించు
వేడ్కఁ గన్గొంటిరే వేలుపులార!
గరిమ నయ్యమృతంబు గైకొనఁబూని
సరిలేని యిమ్మహాజలరాశి డాసి
మనమందరము గూడి మథియింత మిపుడె
మనమంధరము డెండు మనసు రంజిల్ల.

వ. ఈచందంబునఁ జిందంబుదాలుపు వేలుపు మండలిం గ
నానందంబు కందలింపఁ గొండఱు సురాసురవరు లమందరయం
బున మందరనగంబు చేరవచ్చిరట యెటులనెను.

ద॥ శంకరాభరణము॥ ఆది॥

అసురులు దివిజులు - నట్టహాసములు సేయుచు
మసలుచుఁ జేరిరా - మంథరనగము॥

వ. ఈరీతిఁ జేరి వార లుల్లంబు రంజిల్ల నల్ల ధరాధరంబు
పెల్లగించు క్రమం బెటులనెను.

ద॥ ఏలల్లొ గోపాల మందర మెత్తర గోపాల ఓరి
ముందర హత్తర గోపాల ॥౧॥
ఎంతఘనమురా గోపాలా యీ
వింత గనుమురా గోపాల ॥౨॥
చేతుల నానర గోపాల నీ
జాతులు మానర గోపాల ॥౩॥
జరిగి పోకురా గోపాల యిది
యొఱగ నీకురా గోపాల ॥౪॥

ఇక్కడ ఒకఁడాడేమాట:-

ఒరే ఒరే పెల్లగిలెరా పెల్లగిలెరా
ఓరి వస్తుందిరా వస్తుందిరా
సన్నలు సేయర గోపాల (యిఁక)
నన్నిట డాయర గోపాల ॥౫॥

సరుసుకోగదరా గోపాల దీని
సరసకె పదరా గోపాల ॥౬॥

చాల గొప్పరా గోపాల యీ
మూల దిప్పరా గోపాల ॥౭॥

కడలికిఁ జేర్పర గోపాల నా
బడలిక దీర్పర గోపాల ॥౮॥

వ. ఇవ్విధంబునఁ బెల్లగించిన యల్లధరాధరంబు నసురవిసర సహితంబుగా సురప్రకరంబు సుకరంబుగాఁ దెచ్చిన క్రమం బెటువలెను.

ద॥ కేదార॥ ఆట॥

మందరశైలంబు - మహిమచేఁ గైకొని
కొందఱు బృందార - కులు దెచ్చిరప్పుడు.

వ. ఆసమయంబున వాసుదేవుండు దలంప వాసుకి తన నిల యంబు వెడలి ప్రళయకాలానల జ్వాలాభీల విషదంష్ట్రికరాళ వదనుండై యచ్చటికివచ్చెనట యెటువలెను.

ద॥ రేగుప్తి॥ఆది॥

ఘోరవిషధారలుగురియు-కుటిలము లాకోరలతో
వారిజాక్షునిచెంతకు-వాసుకివచ్చె॥

వ. ఇవ్విధంబున వచ్చిన యవ్వాసుకినిం జూచి సురాసుర వరులు చెదరి పటాపంచలై పాఱిరట యెటువలెను.

బ్రహ్మమాట:

ఓయి సురాసురులార ! చెదరక వాసుకిని దెచ్చి తరి త్రాడుగా హావణించరోయి.

దేవతలున్ను రాక్షసులున్ను ఆడుకొనేమాటలు:

ఒకరు:- ఓసామి, దీనివిసానకుఁ దప్పిగద మాకమృతము గావలె. మే మటు రానెఱతుము పోరయ.

మరొకరు:- ఓరి, యిదెంత పాముురా అబ్బా! చేర వెరపౌ చున్నదిరా. కిచ్చమ్మ దీనిచేత కరపించ పిలిపించెనేమో మనముల.

మరొకరు:- ఓరి కిచ్చమ్మకు మంత్రం కద్దురా కాగానే వాడు ఏవేళా పాముమీదనే పడుకున్నాడు. వానికిభయంలేదు.

మరొకరు:- ఆమంత్రం బొమ్మదేవరా నేర్చుకున్నాడేమో కాఁగా భయంలేక దగ్గరనేఉన్నాడు.

మరొకరు:- ఓరీ, నాకున్నూ పాముమంత్రం వచ్చురా. ఇదుగో పట్టుకో వస్తున్నానుచూడు. (అనిపడెను)

మరొకడు:- ఓరీ, పడ్డవాణ్ణి లేవనెత్తరా లేవనెత్తరా.

బ్రహ్మమాట:- ఓయి సురాసురులార, ఈపామును మేము తడకట్టినారము. మీరు వెరవక రారోయి.

(రాక్షసులున్ను దేవతలున్ను ఆడుకొనే మాటలు)

ఒకరు:-ఓరి, యింత మంత్రివాది కొడకవు. ఆపాముువద్దకి చేరు చూతాం, దూరానానుండి సుద్దులుచెప్పేవు.

మఱొకడు:-ఓరి, యిదంతవట్టన్ను ఇంద్రుడు చేసేవగలు. ఉసురూ
 గలిగితే ఉప్పమ్ముక బ్రతుకవచ్చును. పదపదండ్రా.

బ్రహ్మ:-జడియకురోయి నమ్మిరారోయి.

మఱొకడు:-అయితే చూతాం రారోయి.

వ. ఆసమయంబున నాసరోజాక్షుండు తనచెంగట మ్రొక్కి నిలిచిన భుజంగపుంగవుని జూచి యేమనుచున్నాఁడు.

స్వామిమాట :-ఓయి వాసుకి, యీసముద్ర మథనంబునకు
 నీవు తరితాడుగా నిలువవోయి.

వాసుకిమాట :-ఓస్వామీ, అలాగే కానీవయ్యా.

వ. అవ్వేళ కవ్వంపుకొండ నా సుధాజల నిధానంబులోన నానించి కాకోదరలోకాధిపతిని అత్తఱి తరితాడుగా హవణించి కట్టాయితంబై శూరులగు దేవదానవ వీరులు పొంకంబుగా నిరువంకల తీరుగా బారుగా నిల్చి రంగదుత్తుంగ తరంగ సంఘ ఘుమం ఘుమ ఘోషవిశేషంబుచే దిక్కులు పిక్కటిల్ల మకర నికరంబులు సుడివడ, మత్స్యకచ్ఛపంబులు తడఁబడ, మతంగజంబులు కొట్టువడ, భుజంగమంబులు మొట్టువడ, కల్లోలంబులు హల్లకల్లోలంబులై ఘూర్ణిల్ల నమ్మహాంబుధి మథించి రట యెటువలెను.

పదము. శ్రీరాజగోపాల - చిత్తగింపు మీవేళ
 గారవంబున చాల - కరుణింపు మాపాల (1)
 యేలేలో యేలేలో - అయ్యా యేలేలో యేలేలో (2)

బలమొసంగి పలుమారు - పనిగొంటిరా మీరు
చెలువొందు దయమీరు - చెలువమన్నారు (3)
సంసంగిమన్న - సరసప్రసన్న
సొంపొందుచున్న - సుగుణ సంపన్న (4)

దేవతలమాటలు:-ఒరేఒరే మంథరపర్వతం ఒరిగెరా ఒరిగెరా!
మరొకడు:- ఓరి చెలువమన్నడు నిలువనెత్తెరా. నిల్చెరా నిల్చెరా.

వ. ఇవ్విధంబున మథియించు సమయంబున మంధర ధరాధరంబు క్రిందుపడ గోపాలుండు కూర్మరూపంబు వహించి యద్ధరణీధరం బుద్ధరించి సురాసురసమూహంబునకు వాసుకి దేహంబునకుఁ దానె బలంబు ప్రబలంబు గావించుకతన అప్పుడు కోలాహలంబు మీర జనించుహాలాహలంబు భద్రుండగు రుద్రుండు కబళించెఁ గనుక ఆవెనుక పారిజాతాది నిస్తుల వస్తుజాతంబు లాపయఃపయోధిగర్భంబుననుండి యావిర్భవించెనట యెటువలెను.

ద॥ ఖ్మరంజి॥ రూపకము॥

వెలిమావు చౌదంతి - వేలుపుటావు
కలువల చెలికాఁడు - కల్పతరువులు।
తలఁపు మానిక మమృత - కలశంబు కౌస్తుభము
జలరాశిలోనుండి జనియించి వచ్చె.

వ. ఆసమయంబున నాసుధాజలనిధానంబుననుండి శ్రీవిఁ
గనకాబ్జదేవి యవతరించెనట యెటువలెను.

ద్వి. పొంగెడు నల సుధాంభోనిధానమున
రంగ దుత్తుంగ తరంగ మధ్యమునఁ
గనకారవిందంపు గర్భగోళమున
జనియించి దివ్య తేజంబున మించి
నిద్దంపు నవరాలు నీలంపురాలు
పొద్దు కూఁతురిజాలు పోనాడఁజాలు
జగజంపు నిడువాలు జడచుడివేలు
సొగసు గల్గిన మేలుచూపుటెల్లాలు
పచ్చపైకపుపంట భక్తులయింట
నిచ్చలుఁ గడకంట నిగుడించుదంట,
దిగ్గజంబులబారు దెచ్చుబంగారు
నిగ్గు బిందెలజాఱు నీరాడఁగోరు
చిగురాకుబోణి, యాజీనికడాని
నిగరంపు జిగిమేని నెఱదొరసాని,
మొలకనవ్వులజోటి, ముదితలమేటి,
కలికిపల్కులయింతి, కమ్మపూబంతి,
చిలుకరాతుకటారి, చికిలిమిటారి
ఎలజవ్వనపుఁజాన, యిభరాజయాన,

వలపులదీవి, సంపంగినత్తావి
చెలువంబుగల కొమ్మ, చెంగమ్మ యపుడు
కాంచనాంభోజముల్ కరముల మెఱయ
మించుబంగరుఛాయ మేనిడాల్ నెఱయ,
సకలభూషావిశేషము లింపునింప,
చికిలి కస్తురిబొట్టు చెలువురాణింప
అచ్చెరు వంది సురాసురుల్ చూడ,
నచ్చరచెలులతో నావిర్భవించె.

వ. ఈవిధంబున నావిర్భవించిన యాబాల యాపాలకడలి నెడలి యొయ్యారంబుమీఱఁ దీరంబుచేరవచ్చెనట యెటువలెను.

ద॥ రేవగుప్తి॥ ఆది॥

వేలుపుటొయ్యారులు-నెయ్యారులు గొలువంగ
బాలామణు లిద్దరు-చేలాగు లీయంగ।
పాలమున్నీటినుండి-బయలుదేరి హొయలుమీఱి
జాళువానెత్తమ్మి-జవరాలువచ్చె॥

వ. ఈలాగున వచ్చు పాలమున్నీటిరాచూలి దివ్యతేజో విశేషంబుచేఁ గన్నులు మిఱుమిట్లుగొన నశేషసురాసుర బృందంబులు డెందంబుల నచ్చెరువొంది నివ్వెఱపాటుచెంది చూచుచున్న సమయంబున నల బృందారక సందోహంబుల

నెంచక వైదైతేయవ్రాతంబు విలోకించక నచ్చి యచ్చేరువ నిర్వికారుఁడై మేరుధీరుండై యున్నచెండలంకారుని జగన్మోహనాకారంబు విలోకింపుచుఁ దదేకాయత్తచిత్తయై యున్నయత్తఱి నలకెందమ్మిబిత్తరి ముందఱ చేరి వందనము లొనర్చి యరవిందభవ పురందరాదిబృందారకులు కానుకలు దెచ్చి పొగడిరఁట యెటువలెను.

దరువు॥ పూరిచి ॥ఆది॥

పద్మాక్షి మాతల్లియని – పద్మభవుండావేళ
పద్మమాలిక దెచ్చి – పద్మకు నొసఁగె ॥౧॥

చెలికత్తెమాటలు :

ఓ చెలువలమేలుబంతి, నలువ యిదె పరాకు.

ద॥ భువనత్రయము నేలు – పురుహూతుఁడాయింతికి
నవరత్నసింహాస – నము దెచ్చి యొసఁగె ॥౨॥

మాటలు॥ ఓ చంద్రముఖి, యిందుఁడిదె పరాకు.

ద॥ కెంపురాచాయల – సొంపొందుననలుండు
కెంపులతాళి యొసఁగె – సంపదలచెలికి ॥3॥

మాట॥ కనకాబ్జవల్లి, అనలుండిదె పరాకు.

ద॥ బిలహరి ॥ఆది॥

ఇనతనయుఁడావేళ–హేమాబ్జదేవికి
కనుపట్టు నీలాల – కడియము లొసఁగె ॥౪॥

మాట॥ ఓమానినీమణి, భానునందనుం డిదె పరాకు.

ద॥ రక్కసులమన్నీఁడా - రక్తాబ్జవల్లికి
చెక్కడపుపచ్చల - చేసరు లొసఁగె॥

మాట। ఓ జక్కవగుబ్బెత, రక్కసరా జిదె పరాకు.

ద॥ కేదారగౌళ ॥ఆది॥

వరుణుఁ డావేళ న - య్యరు హాబ్జదేవికి
సరిలేనిముత్యాల - సరులు కానుకచేసె ॥౬।

మాట : ఓతరుణీమణి, వరుణుం డిదె పరాకు.

ద॥ గోమేధికపుపావలు - గొంచు వచ్చి పవనుండు
హేమాబ్జదేవికి - నిచ్చె నావేళ ॥౭॥

మాట : కమ్మ దమ్మి కొమ్మ, తెమ్మెరదొర యిదె పరాకు.

ద॥ గౌడిపంతు ॥ఆట॥
కిన్నరాధీశుఁడా - కిన్నరకంటికి

నెన్నదగు కనకాంబరంబు - లెన్నైన నొసఁగె ॥౮॥

మాట : ఓ రాజముఖి, రాజరా జిదె పరాకు.

ద॥ ఇగురాకుఁబోఁడి కా - యీశానుఁ డావేళ
మగరాల కమ్మలు - మఱి కాన్కచేసె.

మాట : ఓశరధికన్య, ఈశానుం డిదె పరాకు.

వ. ఈచందంబున బృందారకబృందంబులచేఁ బూజలంది యానందంబున మించు కనకారవిందంపుటందంపుమచ్చకంటి

పచ్చవింటినెఱదొర యరవిరితూపుల మించుచూపులఁగోపుల నా గోపాలదేవునిఁ గనుఁగొని పెనఁగొనిన దట్టంపువలపు రెట్టింపఁ జొక్కమా నతనిచక్కఁదనమునకుఁ జొక్కి దక్కి మిక్కిలి యరుదంది మొలకచన్నుల గగుర్పాటు దిలకింప నెమ్మేను పులకింపఁ జిరుచెమ్మట దులకింప నెంతయు సంతసించి తనచెంత నున్న కాంతను జూచి యేమనుచున్నది.

పదము॥ ఎరుకలకాంభోజి॥ రూపకము॥

శ్రీమించు రతనంపుఁ - జెంగులవాఁడు
నీలంపుఁజాయల - నెమ్మేనివాఁడు ॥౧॥
ఈ జగన్మోహనాంగుఁ - డెవ్వాండు తెలుపవె
ఓ జవ్వని యితని - యూరేమి పేరేమి ॥౨॥
కస్తూరి తిలకముచేఁ - గనుపట్టువాఁడు
కౌస్తుభ మురముపైఁ - గలిగినవాఁడు ॥౩॥
పొలఁతి, చుక్కలలోనఁ - బూర్ణచందురుని రీతి
నల వేల్పుదొరలలో - నలరెడు వాఁడు ॥౪॥

వ. అని పలుకు కలిమిజోటియుఁ జెలిమిబోఁటియు వెండియుఁ దేటలగుమాట లాడిరఁట యెటువలెను.

సాంగత్యము॥ ఎరుకలకాంభోజి ॥ఆట॥

చెలువైనశ్రీవత్స - చిహ్నంబు ఉరముపైఁ
గలిగి రాణించుఈ - ఘనుఁ డెవ్వాఁడే చెలియ।

బదులు॥

పోలఁతి మీనరూపముఁ - బూని యానలువకుఁ
దొలిపల్కు- లొసఁగిన - దొర యీతఁడమ్మా (1)

మధ్యమావతి ॥ఆట॥

చెలఁగుచు రతనాల - చెండు తన కరమున
నెలమితోఁ బూనిన - యితఁ డెవ్వఁడే చెలియ।

బదులు॥

నెలఁదిరో కూర్మమై - వేల్పువజీరుల
నెలయించి మించిన - విభుఁ డీతఁడమ్మా (2)

ముఖారి ॥ఆట॥

మోదమునఁ జిఱునవ్వు - మురువుచే మెఱసిన
ఈ దేవాదిదేవుఁ - డెవ్వఁడే చెలియ ।

బదులు॥

ఆదివరాహమై - యసురేంద్రు ఖండించి
మేదినిఁ బ్రోచిన - మేటి యితఁడమ్మా (3)

బిల్హారి ॥ధ్రువం॥

మెఱుఁగు బంగరు సాల్వ - మేలివలెవాటుచే
హారువుగా విలసిల్లు - నతఁ డెవ్వఁడే చెలియ।
విరిఁబోఁణి వింటివా - నరసింహమూర్తియై
సురవైరి నణఁచిన - శూరుఁ డితఁడమ్మ (4)

ఆహిరి ॥ఆది॥

కరుణారసము చల్లు – కడకంటిచూపుల
సరిలేక మెఱయు నీ – సరసుఁ డెవ్వఁడె చెలియ।
తరుణిరో వినవమ్మ – తను గొల్చువారికి
వరములు పాలించుగో – పాలుఁ డితఁడమ్మ (5)

వ. అని యయ్యిందుముఖితో సఖి మఱియు నేమను చున్నది.

పదము॥ పంతువరాళి॥ఆది॥

తలిరుఁబోణి దక్షిణ – ద్వారకాపురిని
జెలువు మీఱినయట్టి చెలువ – మన్నఁ డితఁడె (1)
వెలఁదిరో పదియారు – వేవురు జవ్వనుల
వలపించి యేలుకొన్న – వన్నెకాఁడె యితఁడు (2)
కనకాంగి, విజయరాఘ – వునింట వెలయుచు
దినదినము పూజలందు – దేవుండే యితఁడు (3)

వ. అనిన విని కమ్మఁదమ్మిదివాణంపుఁగొమ్మ తననెమ్మనంబున సమ్మదంబుఁజెంది యమ్మగువతో మఱియు నేమను చున్నది.

పదము॥ కాంభోజి॥ఆట॥

ప్రేమతో నీవిభుని – బిగువుఁగౌఁగిట నుండు
భామిను లెటువంటి – నోము నోచినారో। (1)

తోయ్యాలి యీతని - తొడలపైఁ గూర్చుండ
నొయ్యారు లెంతతపము - లొనరించినారొ (2)

జలజలోచన యితని - జతగూడి యున్నట్టి
కలకంఠు లెంతటిభా - గ్యము చేసినారొ (3)

మొలక నవ్వుగులుకు నీతని- ముద్దుమోముఁబోడగన్న
వలచి పైకొననట్టి - వనితలు గలరె (4)

ఓయమ్మ యీతని - హొయలు గనుఁగొన్నపుడె!
రాయబార మంపని - రమణు లున్నారె (5)

వ. ఆసమయంబున నాసరోజాక్షి రూపరేఖా విలాసంబులు గనుఁగొని చొక్కి యనంగునకుఁ జిక్కి యూచక్కనిమన్నారు తనమనంబున నేమని వితర్కింపుచున్నాఁడు.

మా॥ స్వామి అమ్మవారినిఁ జూచేది.

ద్వి. అవురౌర ! యీసతి యందచందములు
వివరింప నెందును విని కని యెఱుఁగ.
తొలఁగక నిలిచిన తొలకరిమెఱుపు
వలె మిటారించె నివ్వనితాలలామ.
ఈ విలాసంబులు నీరూపరేఖ
లీవికాసంబు లేయింతికి లేవు.
తలఁపఁగ నిటువంటితలిరాకుఁబోణిఁ
గలియుటకన్న భాగ్యము వేఱె కలదె !

ముద్దుగా నీభామ ముచ్చటలాడి
పొద్దు పుచ్చుటకన్నఁ బుణ్యంబు గలదె!
తొడలపైఁ జేరి యీతొయ్యలి నన్ను
దడఁబాటు మాటలఁ దమిరేఁచు టెపుడొ!
ఉదుటు సిబ్బెపుగుబ్బ లురమెల్ల నిండఁ
గదిసి యెప్పుడు దీనిఁ గౌఁగిటఁ జేర్తు!
నామనోరథము లెన్నఁడు నెఱవేఱు
కోమలి నన్నను గూర్చువా రెవరు.

వ. అని యూహించి మోహించి చిత్తజగురుం డత్తఱి నా బిత్తరిపై హత్తినచిత్తంబుతోఁ జెలంగు నవ్వేళఁ బాలమున్నీటి మన్నీఁడు తనముద్దు కన్నియయగు చెంగమ్మ చెంగటికిఁ గెంగేల నొకబంగారుకమ్మ నెత్తమ్మిపూదండపూని వేదండయాన లతో నచ్చటికి వచ్చెనఁట యెటువలెను.

ద॥ శంకరాభరణము॥ ఆది॥

ఇరువంక నదులెల్ల నింతులై గొలువంగ
సరిలేనిరత్నభూషణములు మెఱయ।
మురువు మీఱఁగఁ బాల మున్నీటిమన్నీఁడు
అరుణాబ్జనాయిక సరస చేరవచ్చె.

వ. ఈచందంబున నిజమందిరంబు వెడలివచ్చి యాకడలి రాజు చాతురి మీఱ నాతఱిఁ దనకూఁతురి నాదరించి యసమ కుసుమమాలిక యాబాలికకేలి కొసంగి యేమనుచున్నాడు.

పదము॥ శ్రీరాగము॥ జంపెతాళము॥

రావమ్మ ముద్దుపట్టి రక్తాబ్జవల్లి (1)
కోడికన్నియలఁ గూడి యాడుదువుగాని॥
ఈడ నొంటిగ నుండనేల యింటికి రావమ్మ ॥ (2)
చెలులు నీవు బొమ్మపెండ్లి సేయుదువుగాని
చెలఁగున బంగారుమేడ చేర రావమ్మ (3)

వ. అని పలికి యాజలధిరాజు తన తనయయగు కనకాబ్జ దేవిని కీవిని దోడ్కొని వేడ్కమీఱ నిజమందిరంబు చేరెనట యెటువలెను.

దరువు॥ గుమ్మకాంభోజి॥ ఆది॥

మున్నీటిమన్నీఁడు తనముద్దుపట్టిని దోడ్కొని
చెన్నుమీఱఁ దననగరు చేరె నావేళ॥

వ. ఇవ్విధంబున నవ్వనధిరాజు త్రోడ్కొనిరా నెంతయు వేడ్కతో నంత హేమాబ్జనాయికాకాంత నిజాంతఃపురంబు ప్రవేశించి రత్నాకరుం డొసంగిన రత్నసింహాసనంబునఁ జెలులఁ దానుఁ జెలంగుచు నుండె. అనంతరకథాసంవిధానం బెటువలెను.

వ. ఆసమయంబున నాసుధారసంబునకై సురాసురవీరులు భుజగర్వదుర్వారులై మట్టుమీఱి యట్టహాసంబులు సేయుచు రోసంబున డాయుచు, బాహుసంబులు చేపట్టుచు, మీసంబులు వడివెట్టుచు, కరవాలములు పెరుకుచుఁ గదిసినవారిపై నుఱు

కుచు, విజృంభించి, ప్రళయకాలాంభోధరగంభీరస్వరమున గర్జింపుచుఁ, దర్జింపుచు, రోషద్వేషంబులు నెఱయ నన్యోన్య భాషావిశేషంబులు మెరయించిరట యెటువలెను.

రాక్షసులమాటలు:-

ఒకరాక్షసుఁడు:-ఓరి జంభారి,యమృతకుంభం బేల వేలనంటేవు. ఈసంరంభంబులు నాముందఱనా ?

ఇంద్రుఁడు:-ఓరి నికుంభ, యెన్ని డంభంబులు చేసేవు ? నాదంభోళి నెఱుంగవా ?

నిసుంభుఁడు:-ఓరి యెగ్గుసిగ్గులు లేక యెన్నివగలఁ బోయేవు నిలు నిలువరా.

అగ్ని:-ఓరీ తారకా ! మీఱిక ఊటకే నోరుమూయరా.

రాక్ష:-ఓరీ దండధర, యీచండితనంబు లటుండ నీరా.

యముఁడు:-ఓరీ శంబర ! నీయాడంబరంబులు కట్టిపెట్టరా.

రాక్ష:-ఓరీ నైర్రృతి, గొట్టెవలె ఏల వెట్టికూతలు కూసేవురా?

నైర్రృతి:- ఓరిసుమాలి ! మైసిమాలి యేమి గొణిగేవురా?

రాక్ష:-ఓరి పాశి ! గాసిపడక తీసిపోరా.

వరుణుఁడు:- ఓరి బాణ, నీదుత్రాణ నేనెఱుంగనా ! నాదు బాణంబుల పాలుగాక తొలంగిపోరా.

రాక్ష:-ఓరి పవమాన! అవమానపడక యడంకువతో నుండరా.

వాయువు:-ఓరీ హేతి! నాచేతిహేతి నెఱుంగవేరా ?

దుందుభి:-ఓరి కుబేర ! నీకు బేరజంపుమాటలేలరా?

కుబేరుఁడు:-ఓరి దుందుభి! ఇందు నీతలకిందు చెల్లునా ?
కాలనేమి:-ఓరి యీశాన ! యీసేనలోఁ దగులక నీదేశానికి పోరా.
ఈశానుడు:-ఓరి కాలనేమి ! ఈవేళనేమి వదరేవు ? నాశూలంబు పాలుగాక తొలంగిపోరా.

వ. ఈదారి నాదేవదానవవీరభటులు ఆరభటులు మీఱ సముద్భటులై వీరసంవాదం బొనర్చి యీరసంబున సుధారసంబునకై తారసంబై పోరు సంఘటించి ఘోరసంగరం బొనరించిరట యెటువలెను.

దరువు॥ శంకరాభరణము॥ ఆది॥

అమృతముకొఱకై - యమరులు నసురులు
సమర మొనర్చిరి - సంభ్రమ మమర.

వ. ఈక్రమంబున విక్రమంబునమీఱి సురాసురచక్రంబులొండొకటి నాక్రమించుసమయంబున, నమరవరనికరంబుల నిరాకరించి యఖర్వబాహుగర్వదుర్వారులై సుధారసంబు హరియింపనెంచు నసురవీరుల పంచాస్త్రజనకుఁడు వంచింపఁ దలఁచిన క్రమంబెటువలెను. (మోహిని వచ్చేది)

ద్వి. ఆసమయంబున నలమన్ననారు
వాసవముఖులఁ బ్రోవఁగ మదినెంచి
సరిలేని తనమేనిచాయను మించు
నెఱికప్పు కేలొప్పు నీటు మీఱంగ,

తనచేతి శార్ఙ్గంబు దారినెంతయును
గనుపట్టి నందంపుఁ గనుబొమల్ మెఱయ,
తనదైన ప్రథమావతారంబు లీలఁ
గనుపించు నిడువాలుకనుదోయి సెలఁగ,
సతతంబు తాఁ దాల్చుసంపంగిమొగ్గ
వితమున నాసిక విలసిల్లుచుండ,
సొగసైన తనదు కౌస్తుభమణికరణి
జిగిమించు కెమ్మోవి చెలువు రాణింప
పరికింపఁ దన నాభిపద్మంబురీతి
మురువైన ముద్దునెమ్మోము చెన్నొంద,
భావింపఁ దనచేతి పాంచజన్యంబు
కైవడిఁ గంఠంబు కడుమిటారింప,
తన వైజయంతికాదామం బనంగ
నొనరెడు భుజలతాయుగ మింపునింప,
జగతిఁ దాఁదాల్చిన శైలరాజముల
పగిది నబ్బురపు సిబ్బెపుగుబ్బ లమర,
ననువొందఁ దన నృసింహాకృతిలీలఁ
గనఁజేయు సన్నంపుఁగౌను రాజిల్ల,
తిరముగాఁ దానున్న తెలిదీవికీవి
గరిమఁ బ్రకాశించు కటిచక్ర మమర,

తనదైన కూర్మావతారంబు లీల
మినుకులు వెదఁజల్లు మీఁగాళ్ళు నలర,
తనదు చిహ్నములెల్లఁ దనయంగములనె
గనుపట్ట మోహినీకాంతయై నిలిచె.

వ. ఇత్తెఱంగున నిలిచినయయ్యంగనామణి కాఱుమొ
యిలుమఱుంగు దోఁఱంగుమెఱుంగు తెఱంగునఁ దుఱంగలిం
పఁగా నరమావిమోవి చందురకావికీవి గ్రమ్ముబొమ్మంచు
కెమ్మోవిపై చిఱునవ్వు చెంగలింపఁగా నిరుల తెరల దువాళించు
కురులపెరల గుబాళించువిరులసరులఁ బిసాళించు నెఱసాము
కప్పుకీల్కొప్పు మిటారింపఁగా, తనరువారంబు లచ్చరమచ్చె
కంటులఁ దుటారింపఁగా, నాజగన్మోహిని వచ్చెనట యెటువలెను.

దరువు॥ కాంభోజి॥ ఆది॥
మురిపెంపుసిగ్గుతోను-ముద్దునెన్నడలతో
మెఱుంగువాలుచూపుతో-మేలిసొగసుతో।
చిఱునవ్వునెమ్మోముతో-జిలిబిలిపలుకులతో
మురసైరి యపుడు జగ-న్మోహినియై వచ్చె॥

వ. ఇవ్విధమ్మున వచ్చి కమ్మదమ్మిదోదుమ్మి యెమ్మెకాని
సమ్మోహనాస్త్రంబు చందంబున నందంబుమీఱి యావంచనా
కాంచనామోద యామోదభరంబు మించ తన యంచనున్న
మించుబోణితో నేమనుచున్నది.

పదము॥కాంభోజి॥జంపెతాళము.

ఇదియేమివింతయో యిప్పుడు।
సుదతిరో నామదిని చోద్యమయ్యెని॥ (1)
వెలఁదిరో వీరలెవ్వారో వీరు
కలహింపుచున్నట్టి కారణ మదేమొ॥ (2)
ఓరమణీ వీరిజగడములు।
వారింపఁగానేర్చు వార లెవ్వారో॥ (3)

వ. అని పలుకు మటుమాయలసటలకత్తెతో నల కుటిల కుంతల యేమనుచున్నది.

పదము॥మధ్యమావతి॥ఆది॥

నెలఁది దేవదానవ వీరులె వీరు।
కలహించెద రమృతము గైకొనఁబూని॥
చెలరేఁగి రక్కసులు జేజేల నదలించి
అలసుధ తాము చేకొనఁ దలఁచియున్నారు.

వ. అనిన విని యావన్నెలాడి యా కన్నులకలికితో నేమనుచున్నది.

పదము॥కాంభోజి॥ఆట॥

పందెముగద్దా ఓచెలియ పందెముగద్దా।
అందచందములచే నసురుల నెలయించి
విందు సేతు నమృతము వేల్పులకెల్ల॥

నీవె మెచ్చేవు ఓచెలియ నీవె మెచ్చేవు।
కావరంబునమించు కడిందిరక్కసుల
భావములఁ గరగింతు హావభావముల॥

వ. ఈరీతిఁ బలికి యా నారీతిలకంబు తన యందచందంబు లకుఁ జొక్కి డెందంబున నాశ్చర్యంబు నొందు సురాసురబృందంబుల వివాదంబు నిజకరారవిందంబున వారించి మోదంబున వారితో నేమనుచున్నది.

పదము॥ కేదారగౌళ॥ ఆది॥

రారోయి వేలుపులార రక్కసులార
ఈరీతిఁ బోరాడ మేరగాదు మీకు (1)
ఇందఱికే నమృతంపువిందు గావింతు॥
నిందుకై సందియమేల యే వింతదాననా॥ (2)
మనసున నిటువంటి మచ్చరంబులు మాని।
అనురక్తి మీరంద ఱొకటై యాదరింపరాదా॥ (3)

వ. అని యొడఁబడఁ బలికి యాకలికి చిలుకల కొలికి తొలివేలుపుల నలవేలుపుల నిండువేడుక రెండుతెఱంగుల నేర్పమర నేర్పఱించి యసురవీరులఁ దనవిలాసంబుల నెలయించి సురవరులకు సుధారసం బొసంగి, వెలయించెనట యెటువలెను.

ద॥ కల్యాణి॥ రూపకము॥

రమణీమణి దనుజుల బ్రమయించి యావేళ।
అమరవీరులకెల్ల నమృతము నొసఁగె॥

వ. ఇవ్విధంబున నవ్వధూరూపంబునఁ జూపట్టి పరిహాస దర హాసవిలాసంబుల దైతేయ నికాయంబు నెలయించి సొలయించి సారసుధారసధారల బృందారక బృందంబులకు విందుగావించి వారికి పారిజాతాది సమస్త వస్తుజాతంబు నొసంగి తాను నిజ రూపంబుఁ బూని నిస్తుల ప్రభంబగు కౌస్తుభంబు కరంబు వేడుక నురంబున హత్తించి యత్తఱి మత్తులగు దైత్యవీరుల నవక్రచక్ర ధారల నుక్కడంచి యల వాసుదేవుండు ఆ సరోజభవవాస వాదుల నిజనివాసంబులకుఁ బంచి తాను నాక్షణంబె దక్షిణ ద్వారకానగర వరంబుఁ జేరి మంతనంబున నతఃపురంబునఁ జెలు వలఁ గూడి కొలువైన యుండె. అనంతర కథాసంవిధానం బెటు వలెను.

వ. అంత హేమాబ్జనాయికాకాంత యేకాంతంబుగా నిజాంతఃపురంబునం దొకగందంపుమాప్రనిదండ యిందుకాంత వేదికాంతరంబున నుండి యా నందనందనుని యందచందములు డెందంబునఁ దలంపుచు నిలుపరాని వలపుపొలుపున తాళఁజా లక చాలఁ గలంగి యొక నీలనీలాలకతోఁ దనముచ్చట విచ్చల విడిగా దెలిపెనట యెటువలెను.

పదము॥కాంభోజి॥ఆది॥

మన్నారుసామిపై-మాటికినేనేల
మరులుగొంటినే-చెలియః।
ఎన్నరాని ప్రేమ వానిచక్కఁదన
మేనేల కనుఁగొంటినే॥ (1)

కనుఁగొన్న యప్పటినుండి నానెన్మేనఁ-
గాక హెచ్చెనే - చెలియ।
ననవిల్తుఁడంతలోఁ జాలమచ్చరించి -
నాపై దాడివచ్చెనే॥ (2)
హృదయేశుఁగలియక యింతిరో యీ రేయి
యెట్లు తెల్లవాఱునే। చెలియ
ముదిత వానిమోవి తేనె లానక యెట్లు
ముచ్చట లీడేరునే॥ (3)

వ. అని వెండియు నల నిందుజన్యాని తనదండనున్న వేదండ గమనతోఁ నేమనుచున్నది.

పదము॥ భైరవి॥ఆది॥

మగువరో వినవమ్మ-మన్నారుదేవుండు
మనసిచ్చి యెన్నండు-మాటలాడునో।
చిగురుఁబోఁణి వినవె యా-శృంగారనాయకుని
చిత్తము రా సేవ-సేయు టెన్నఁడో॥ (1)
చెలువ మన్నని జేరి-చెక్కిలి గోరఁ జీరి
కులుకుగుబ్బలరొమ్ము గుమ్ము టెన్నఁడో।
చలువవెన్నెలబైట-సంపంగిపూఁదోఁట
చెలి వానికౌఁగిటఁ-జెలఁగు టెన్నఁడో॥ (2)
కలకంఠి మన్నారు-గారవంబున నన్ను
కళలంటి సమరతులఁ-గలియు టెన్నండో।

కలికి వానియురమున-కౌస్తుభంపుటుయ్యేలపై
నెలకొని యుపరతుల నల-యించు వెన్నఁడో॥ (3)

పల్లవి॥ తాళఁజాలనె। వానిపై మేలుదాననె।
బాలరమ్మని నన్ను బంగారుమన్నారు
చాల లాలించి నన్నేలు వెన్నడో॥ (4)

వ. అనిన విని యాకాంతను జూచి చెంత నున్నయంతరంగపుఁజెలు లామెఱుంగుఁబోఁడితో నేమనుచున్నారు.

పదము॥ కలికిరో నీవిట్లు-కలఁగేది న్యాయమా।
కులకాంతలకు నిది కొదవగాదటవె॥ (1)
చెలియరో నిన్నఁటి-చిన్నదానవు నీవు
భళిభళి నీ కింత-వలపేలనమ్మా॥ (2)

వ. అనిన విని హేమాబ్జవల్లి ఆభామలతో నేమనుచున్నది.

పదము॥ ఘంటారవము॥జంపెతాళము॥
ఓ వెలఁది నావలపు నన్నింతసేయంగ
నొకరి దూఱఁగ నేలనే।
నావిభుఁడు రాకున్న హితులెల్ల నహితులై
నన్నెంచెదరు కంటివా॥ (1)
ఇన్నాళ్ళు తనకిరవైన యీకమ్మతామరలె
కన్నుల విల్తుతూపులై న న్నలయించెనె।
ఎన్న నాతోఁబుట్టువౌ - యీచందమామయె
వెన్నెలకాఁకలు - వెదచల్లెఁ గదవె॥ (2)

వ. అనిన విని యొకలతాంగి భంగ్యంతరంబునఁ జెంగమ లాకాంతవంత దీర్చనుపాయంబు చింతించి యేమను చున్నది.

(చెలికత్తె చదివేపద్యం)

సీ. కోమలి, వింటివా గుజ్జుగొజ్జఁగి పొదల్
చిన్ని మొగ్గలచేతఁ జెలువుమీఱె
మగువరో, వింటివా మకరందరసములఁ
దేలియాడెడినమ్మ తేఁటిగములు
సుదతిరో, వింటివా సురపొన్నగున్నలఁ
గోయిలల్ గానంబు సేయఁ దొడఁగె
బిత్తరి, వింటివా పేరెముల్ వాఱె నీ
గందంపు గుబ్బలి గాడ్పు రేఁడు
చిగురుఁబోఁణి, యల్లశృంగారవనమున్న
చెలువమెన్నఁ దరమె నలువకైన
వేడ్క నచట మనము విహరించి వత్తము
గాన వేగరమ్ము కలికి లెమ్ము.

వ. ఇవ్విధంబున నవ్వధూరత్నంబు యత్నంబునఁ దోడ్కొనిరా వేడ్కతో నలకెందమ్మిజవరాలు ముందఱ వెనుక కొందఱు చెలువలు గొలువఁ జలువతెమ్మెర లెదురుకొని పొదరిండ్ల

పూవులతావులకై కానుక లొసంగ శృంగారవనంబు చేరవచ్చె నట యెటునలెను.

పదము॥ తోడి॥ ఆది॥

కలకంఠు లిద్దరు – కైదండ లియ్యంగ।
ఎలదోటకు వచ్చె – హేమాబ్జవల్లి।

వ. ఇవ్విధంబున నవ్వనిఁ జేరుజవ్వనిం జూచి మచ్చికతో నెచ్చెలు లేమనుచున్నారు.

పదము॥ సావేరి॥ ఆది॥

అంగన కనుఁగొంటె – యాకార నేఁటి।
శృంగార వనమెంత – చెలువు రాణించె॥ (1)
పొగడఁగావచ్చు నీ – పొగడల పెంపు
సొగసాయెఁ గురువీర – జొంపము సొంపు।
బుగులుకొను సంపంగి – పొంతనె కెంపు
జిగిమించెనదె మావి – చిగురుల గుంపు। (2)
గరిమ మిటారించె – గాడ్పుచే మెదలు
సురపొన్నవలగొన్న – సొగసు తుమ్మెదలు।
అరుదాయె కంతుని – యమ్ములపొదలు
హరువునఁ బొదలు – నీయలరుల పొదలు (3)

వ. ఆ సమయంబున నొకసఖియు నాయిందుముఖియు సరసంపుమాట లాడిరట యెటువలెను.

పదము॥ కాంభోజి॥ ఆట॥

చెలి :— తెలుప నేఁడిచ్చోట – తిలకవిలాసంబు
హరువొందెఁ గనుఁగొంటివా చెంగమ్మ ।
చెం:— తిరమైన యదువంశతిలకవిలాసంబె
నిరతముం జూచెదనే ఓ చెలియ॥ (1)

చెలి:— ప్రీతిలేక రాణించు పాటలవైఖరి
జతమించెఁ జూడ వమ్మా చెంగమ్మ।
చెం:— పతి వేణునాదంపుపాటల వైఖరి
హితవుగ వినఁ జూతునె ఓచెలియ। (2)

చెలి:— వనజాక్షి యిచ్చటి వకుళాతిశయమెల్ల
కనుఁగొనఁ గదవమ్మా చెంగమ్మ।
చెం:— వనితరో యలమాధవకులాతిశయమెల్ల
కనుఁగొన మనసయ్యెనే ఓచెలియ॥ (3)

చెలి:— ఇందీవరాక్షి, యీకుందవైభవము
పొందుగాఁ గనుఁగొనవె చెంగమ్మ।
చెం:— అందము మీఱు ముకుంద వైభవమె
ముందుగాఁ గనుఁగొంటినే ఓచెలియ (4)

చెలి:— ఎనలేనివేడుక నీనవమాలిక
కనుఁగొని చొక్కవేమే చెంగమ్మ।
చెం:— అనువుగా మొదలింటియక్షరంబులు రెండు
వెనకముందుగఁ బల్కవే ఓచెలియ (5)

వ. ఆవేళ జాళువాతామరగద్దియ ముద్దియవద్దనున్న ముద్దుగుమ్మ లమ్మగువకు పొద్దుపోకగా ముద్దులసుద్దులుమెఱయ పుష్పాపచయంబు సల్పిరట యెటువలెను.

పదము॥ ఘంటారవము॥ రూపకము॥

ఈ మొల్ల పూబంతి యేమొల్లమే యింతి
ఆ మల్లెకై తేఁటి దామల్లె బోటి (1)
ఈ పారిజాతమె యేపాఱఁ జూతమె
ఏపెన్నఁదగు హత్తి యీపొన్నగుత్తి॥ (2)
చిగురాకు చేఁబూని నగరాకు వేలేని
జగడాలు మానుమదె జగడాలుమాను॥ (3)
భామ, యీవిరవాది ప్రేమనంటకు మాది
లేమా, విలోకింపు లేమావిగుంపు (4)

వ. ఇత్తెఱంగున నమ్మెఱుంగుఁ బోణు లచ్చట ముచ్చటలు దీఱఁ బలుకులఁ దేలుచుఁ జిలుకలఁ దోలుచుఁ, బాటలుపాడుచు బోఁటులఁ గూడుచు పరువులు వాఱుచుఁ దరువులఁ జేరుచు, కొమ్మలు వంపుచు రెమ్మలు త్రుంపుచు, క్రోవల డాయుచుఁ బూవులఁ గోయుచు, చెలువలఁ జీరుచుఁ జలువలు గోరుచు, నివ్విధంబున విహరించు సమయంబున నంతంత కుప్పొంగెడు కంతుసంతాపంబునఁ బరిక్రాంతయై విభ్రాంతయై యున్న హేమాబ్జనాయికాకాంతచెంతఁజేరి యాచెలువలు చలువలు చేసిరట యెటువలెను.

భైరవి॥ ఆది॥

కన్నియకు నేమైన కపురంపుఁదిన్నెపై।
సన్నజాజులశయ్య సవరించె నొకతె। (1)

కలిగి గుబ్బలమీఁద కమ్మగందము నలఁది
యలరులదుప్పటి హావణించె నొకతె (2)

జవ్వనిమైనిండఁ జలువపన్నీరు నించి
పువ్వులసురఁటులు పూని విసరె నొకతె (3)

వ. ఈలాగున బాలామణు లొనస్చచలువలచేఁ గలువ కంటికి నలరువింటిరాయల మాయలవిరాళి జాలి హెచ్చెఁగనుక కనకాబ్జవల్లి యాకనకవనస్వామి తన కన్నులఁ గట్టినట్లున్న నతనిఁ బేరుకొని దూఱుకొని యేమనుచున్నది.

పదము॥ కాంభోజి॥ ఆట॥

ఏలరా చలమేలరా । చాలా వలచితి నీకు
సంపంగి మన్నా । యేలరా చలమేలరా॥ (1)

మదనుఁ డమ్ములనేయ, చేరి – మత్తకోకిల గూయ।
చెదరెరా నామనసు – చెల్లఁబోనను నీవు।
కదిసి కౌఁగిటఁ జేర్చి – గారవంబునను॥ (2)

వెన్నెల కాఁక మించెరా నా – చన్నులు పులకరించెరా।
వెన్నయై నామనసు – వేమాఱుకరగేని।
కన్నడసేయక – కరుణమీఱంగ॥ (3)

వ. ఈచందంబునఁ గెందమ్మియింటివాలుగంటి యొంటిమై వెడవింటిరాయల మాయలఁ దూలి విరాలి జాలిపడుచు పడు చులఁ జేరఁజీరక, పరిమళంబులుగోరక, చిలుకలకుఁ బలుకులు నేర్పక, చెలులమాటలు చెవిఁ జేర్పక, కొనగోరఁ జికిలి కిన్నెర పలికించక, కొమ్మలనాట్యమ్ములు విలోకించక, పంతువగఁ బదాలుపాడక, యింతులతో సగసంబులాడక, విన్నఁబాటుతో వింతనీటుతో నున్న యావన్నెలాడికడకు వేడుకతోడ రూపవతి యను ప్రోడనెచ్చెలి వచ్చెనట యెటువలెను.

దరువు॥పంతువరాళి॥ఆట॥

పొంగుచు సంపంగిపూబంతి చేఁబూని।
చెంగమ్మచెంగటికిఁ జెలియ వచ్చెనపుడు॥

వ. ఇవ్విధంబున వచ్చిన యాయింతి తెచ్చిన పూబంతి మచ్చికతో కానుకయిచ్చి యామున్నీటిమన్నీని చిన్నికన్నియ విరహంపుచిన్నెలు చూచి యాచెలియ తెలియనడుగు చందం బున కాయిందుసోదరి తనడెందంబు దాఁచి మందలించు నందం బునకు వారికిఁ బరస్పర వచనరచనలు నడచెనట యెటువలెను.

పదము॥మధ్యమావతి॥ఆట॥

మొలకనవ్వులాడి నీ-ముద్దునెమ్మోముపై
కలికి చెమ్మటగ్రమ్మ-గారణమేమొ
చెలువలఁ గూడి నే-చెండు గోరింపఁగ
చెలియ, నానెమ్మోము-చెమరించెనమ్మ॥

నారీమణి, యంచలకు నడకలునేర్పక
యూరకె బడలి నీవున్నావదేమొ।
కూరిమిచెలులతో గుజగుజ రేకులాడి
ఓరమణి, నే బడలియున్నానమ్మ॥
చలమేల తెల్పు నీచక్కనినెమ్మేను
కలువకంటి, యింత కందువాటెనే।
ఎలదోఁట విహరింప నెండకాకలచేత
కలికిరో నామేను కందువాటెనే॥

వ. అనిన విని యారాజవదన రాజనాయికతో నేమను చున్నది.

ద్వి॥ జలజాక్షి, నీవున్నచంద మిదేమి?
భళిభళి మనసిచ్చి పలుకవదేమి?
కన్నెలఁ జీరవు; కపురంపుఁబలుకు
తిన్నెలుచేరవు; దిట్టకోయిలలఁ
బాడింప నొల్లవు; పడఁతులఁగూడి
క్రీడింప మళ్ళవు; కిలకిలమనుచు
నవ్వుచుఁ గులుకవు; ననుపుఁజిల్కలను
దువ్వుచుఁ బలుకవు; తొయ్యలుల్ పిలువ
మొగమెత్తి చూడవు; మోడితోనున్న
వగ హత్తిపీడవు; వదలినకొప్పు

ఘటియింప నోపవు; కలికి నెమ్మొలను
నటియింపఁజూపవు; నను జేరఁదీసి
మాటలాడ వదేమి మాచెలి, భయాన !
పాట పాడవదేమి భద్రేభయాన;
ఈవిన్నఁబోతేమి! యిటుతలవంచి
నీవున్న నీకేమి! నిక్కంబుగాఁగ
నాతోడ నీదుడెందము తెల్పవమ్మ !
నాతోడదాఁచకే నాతోడునీడ!
నెలఁతరో నావంటి నెనరైనచెలియ
కలుగంగ నీ వింత కలఁగంగ నేల !
ఇంతిరో నీతలంపెఱిఁగించి తేని
ఎంతటిపనినైన నే నొనఁగూర్తు.

వ. అని పలికి యాబోఁటి యవ్వనూటి వలపుపొలుపు తన తలంపులో నూహించి, యామోహనాంగి పజ్జఁజేరి, లజ్జాభరం బుజ్జగించి యేమనుచున్నది.

పదము|| గుమ్మకాంభోజి|| ఆట||

మగువరో యిటుచూడవమ్మ । యిఁకనైన నీ
మనసిచ్చి మాటలాడవమ్మ । నీమదిలోని
నెగులేఁ దీర్పలేన తగునైనదానఁ గాన|| (1)

రమ్మని చేపట్టవేమమ్మ । నేఁదెచ్చిన
కమ్మవిరులు చుట్టవేమమ్మ ! ఔరౌర యీ
ముమ్మరపుహా కాక లేమి మోహంపుడాకలేమి॥ (2)
తలఁపు దెలుపవేమమ్మ । చిన్ననాఁటి
చెలిమియింత తలఁపవేమమ్మ ।
నెలఁతయెంత కోర్కెనా నేనె చేకూర్చెదాన॥ (3)

వ. అనిన విని యెంతయు సంతసించి కొంతవంతదీరి యా
కమలాంతఃపురకాంత యచ్చెలిని మెచ్చి యేమనుచున్నది.

ద్వి. లలితాంగి, నీవింతలాలించి నపుడె
తలఁపు లీడేరె నంతయుఁ దీఱె నమ్మ.
నీకన్న నెనరైన నెచ్చెలు లెవరు ?
ఈకోర్కె చేకూర్ప నీ నె నేర్పరివి.
సుకృతిరో, నీవంటిచుట్టముల్ గలరె !
హృదయంబు దాఁచక యెఱిఁగింతు వినుము.
మున్నీటిచెంగట మొన్న మన్నారుఁ
గన్నులపండువుగాఁ గనుంగొంటి.
అతని జగన్మోహనాంగ శృంగార
మతివరో, కనుఁగొన్న యప్పటినుండి
వలపు రెట్టించఁగా వలరాజుచేతి
ములుకుల తూపుల నసుకసురైతి.
కాంతుని ననుగూర్చి కలఁకలు దీర్చి
యింతిరో నాకోర్కె నీడేర్పవమ్మ.

వ. అనిన విని బోఁటి యా సంపద్వ్యధూటిఁ గో నేమను చున్నది.

పదము॥ సావేరి॥ ఆది॥

ఔరౌర కొండంత కోరిక కోరితివి।
ఈ రాయబారంబు లెవ్వరిచే నమరు॥ (1)
మగవారు వలచిన మర్యాదైయుండు।
మగువలు వలచిన మిగులఁ జౌకగాదా॥ (2)
పదియారువేవురు పడఁతుల వలపించు।
హృదయేశు పొందు నీకేలాగు హస్తు॥ (3)
చెలువమన్నరుసామి చెల్లఁబో మనకింత
సులభుఁడ యీకోర్కి సుదతి, చాలింపు। (4)
ఓజవ్వని యిటువంటియూహాలు చెల్లున
రాజకన్యల కిది యోజ గాదమ్మా॥ (5)

వ. అనినవిని కనకాబ్జవల్లి యాకనకాంగిఁ గో నేమను చున్నది:

ఉ. అక్కట నీవె నాపలుకు లారడిఁబెట్టెస నెట్టులోర్తునే
చక్కెరవిల్తుడాకకును చందురుకాఁకకుఁ దాళనేర్తునే
మక్కువమీఱ నెట్లయిన మన్నరుసామిని నన్నుఁగూర్పవే
(మొక్కెద నీకు నోచెలియ,మున్మరమైనవిరాళి దీర్పవే.

వ. అనిన విని యుల్లంబునరంజిల్లి యల్లసఖీమణి యా భామను జూచి యేమనుచున్నది.

పదము॥ కేదారగౌళ॥ ఆది॥

నీయంద మీవలకు నేఁదెలియనైతి
దోయలి, నీవిభునిఁ దోడితెచ్చేనమ్మ। (1)
మంతనమున నాతో నీమనసు దెల్పఁగా
ఇంత మేలుదానవని యిపుడు దెలిసేనమ్మ। (2)
చెలఁగి నీకోరిక చేరిక గావింతు
నెలఁత యీయలఁతమాని నెమ్మది నుండవమ్మ (3)

వ. ఇవ్విధంబునఁ బలికి యాకలికి యవ్వనధిరాట్కన్య పను పున వేడ్కతో గ్రామారామ నదీతటాకానేకమహారణ్య పుణ్య ప్రదేశంబులు గడచి నడచి శుభనిమిత్తంబులకుఁ జిత్తం బున నానందింపుచు, ముందఱ వెనుకఁ గుందరదనలు కొందఱు దెచ్చు హెచ్చు కానికలు మానికపుఁ దట్టలఁ బట్టించుకొని యాక్షణంబె దక్షిణద్వారకా నగరంబునకు వచ్చెనట యెటు వలెను.

దరువు॥ కల్యాణి॥ ఆది॥

చెలులు కొందఱు కానుకల్ చేకొని వెంటరాఁగ
తలిరుఁబోఁణి దక్షిణద్వారకఁ జేరె ।

వ. ఈరీతిఁ జేరి యప్పుడా కప్పురగంధి యప్పురంబున విజయ రాఘవ పట్టభద్రుండు గట్టించిన గుజరాతిజాతి కెంపుచెక్క డంపుఁబనుల మిటారించు నత్యున్నతప్రాకారంబులగు గోపుర

ప్రాకారంబులు, శ్రీవైష్ణవపుంగవగేహంబులు, శృంగారవన సమూహంబులు, హరిద్రానది మొదలుగాఁ బొదలు ననేక తటాకంబులు, హాటకమయమంటపానీకంబులు, నాలోకింపుచు సొంపొంది యా సంపంగిమన్నారు నగరివాకిలిఁ జేరి యామిటారి యచ్చట నున్న యవసరంపుమచ్చెకంటినిం జూచి, మందర ధరుని సమయంబు దెలుపుమని మందలింప, నాకాంత యిప్పు డేకాంతసమయమని పరిహరింప, నాదారికి వారికిఁ బరస్పర వచనరచనలు నడచెనట యెటువలెను.

పదము॥ ముఖారి॥ ఆట॥

ప॥ జలజాక్షి, యీవేళ సంపంగిమన్నారు
సమయ మేమి తెలుపవే।

బ॥ నెలఁదిరో పదియారువేవురు చెలులతో
విహరించువేళ గాదా॥ (1)

ప॥ భామరో, మన్నారుసామితో నొకసారి
నామనవి వివరింపవె।

ప॥ కోమలి యలసత్యభామ పొలయల్కదీర్చి
కూడియున్న వేళగాదా॥ (2)

బ॥ కన్నెరో, నేవచ్చుకార్యము శౌరికి విన్నవింపఁగదవె।
మన్నారుదాసుని మానసపూజల
చెన్నొందువేళ గాదా॥ (3)

వ. అనిన విని యప్పు డప్పడంతి యొడఁబడఁ బలికినపలుకు లంగీకరించి యంగజగురునిచెంగటఁ జేరి యామదావళగమన పరిసంగం బెఱిఁగించెనట యెటువలెను.

హెగ్గడికత్తెమాట:

ఓస్వామి పరాకు. ఒకపడంతి దేవరను పొడగనఁదలంచి కైకానుకలు చేకొని వాకిటను గాచియున్నది. నీసమ్ముఖమ్మున కాకొమ్మను రమ్మందునా!

స్వామిమాట:- ఆలాగే రమ్మనవే.

హెగ్గడికత్తెమాట:- ఓభామిని, స్వామి పిలిచేని రావే.

వ. అనినవిని యా చిగురాకుఁబోఁడి నగధరుని నగరుప్రవేశించి యచ్చట హెచ్చులగుపచ్చలగచ్చుల నిచ్చలంబగు శాతకుంభ స్తంభ సహస్రంబుల మించు విజయరాఘవభూపాల మంటపరాజంబుచేరువ తేజంబుమీఱుచు మేరుసమానంబై భానుకోటి ప్రభాభాసమానంబగు స్వాయంభువ విమానంబున నందంపుగందంపుఁ జప్పరంబున నొప్పువినూత్న నవరత్న సింహాసనంబునఁ గూర్చుండి చెలువలతోఁ గొలువున్న చెలువమన్న నిసమ్ముఖమ్ముఁ జేరి సమ్మదమ్మున మొ్రక్కి తెచ్చిన కైకానుక లిచ్చి నిలిచిన యాచెలినిం బిలిచి యాదరించి యాదొ్రర యేమనుచున్నాఁడు.

(స్వామి చదివేపద్యం)

క. ఎవ్వరు పోషింతురు ? నీ
వెవ్వరితెగ ? యెచటనుండి యిటువచ్చితి ? నీ

వెవ్వరు నిన్నిటు పంచిరి
యవ్విధ మెఱిగింపు మాకు నంతయుఁ జెలియా !

వ. అనిన విని యాచెలువ యాచెలువమన్ననితో నేమను చున్నది.

(చెలికత్తె స్వామితో మాటాడే ద్విపద)

ద్వి. అవధరింపుము దేవ, యతులప్రభావ,
భువనరక్షణదక్ష, పుండరీకాక్ష !
భోజకన్యాలోల, పుణ్యసంశీల,
రాజద్గుణావాల, రాజగోపాల!
మొన్న దేవరవారి మున్నిటిదరిని
కన్నులపండువుగాఁ జూచి చొక్కి
కన్నుల విలుకాని గాసికిఁ జిక్కి
కన్నియలమిటారి కడలికుమారి
కాంతామతల్లి మాకనకాబ్జవల్లి
యంతరంగమున నీయందచందము లె
య్యూహించి మోహించి యోర్వంగరాని
మోహసాగరమున మునిఁగి తేలుచును
నిను దోడితెమ్మని నేఁడు మాయింతి
నను నిట్టు పంచె నోనలినాయతాక్ష !
మానినీమదన, నామనవు లాలించి
యేను వచ్చినకార్య మీడేర్పవయ్య.

వ. అని పలికి యాకలికి చిలుకలకొలికి చెండలంకారునితో వెండియు నేమనుచున్నది.

పదము॥ఘంటారవము॥ఆది॥

చక్కనివారిలోఁ - జక్కనిది మిగుల
చొక్కమా పలుకుల నిన్ను - జొక్కించ నేర్చు (1)
వింతకవిత పావణించు - వీణె వాయించు
ఎంతయు సరసురా - యెల్ల విద్యలను (2)
అన్నిట నెఱజాణ - యందచందములచే
వన్నెలాడి సాటియెవరు - మన్నారుదేవ। (3)

వ. అని యా చెలువ కలువచాయలచెలువురాయలతో మఱియు నేమనుచున్నది.

పదము॥కాంభోజి॥ఆట॥

నీకెతగురా ముద్దుబాల।
రాకేందువదన ఓరాజగోపాల॥ (1)
తేటైన విరిదేనె యొలుకు । మిగుల
మాటల నీటుల మఱిముద్దుగులుకు।
మేటియగా నాటపాటలకు । అల్ల
ఆటదైన లోనౌను ఆయింతివలకు॥ (2)
ఉదుటుగుబ్బల వింతమురువు । మా
యొయ్యారికే తగు నెంతైన పారువు॥

పదపద్యములఁ జాలనేర్చు । ఆ
భామను నీయురమునఁ బ్రేమనుఁ జేర్చు (3)
కామించి పిలిచెను నిన్ను । జాణ
వేమాఱు చొక్కెను నినుజూచి మున్ను॥
స్వామి, యీజవరాలినేలు । ఇంత
చలమేల చేసేవు మేలుమేలు॥ (4)

వ. అని యావన్నెలాడి సన్నజాజినరాజమన్నీనిం గన్న. య్యతో మఱియు నేమని విన్నవింపుచున్నది.

సీ. ముద్దులుగులుకురా సుద్దుల చిలుకరా
బంగారు తళుకురా పలికిచూడు,
కమ్మపూబంతిరా కామునిదంతిరా
వలపులదొంతిరా యెలమిఁ జూడు,
కలువనెత్తావిరా కపురంపుదీవిరా
తేనెలసోనరా యానిచూడు,
మరుకేళిజాణరా మాటలజూటురా
వలపించ నేర్చురా పిలిచిచూడు,
వనజనేత్రిలమేటి మావనితసాటి
బోఁటి గలుగునె భువి నెఱనీటులందు
అలరు విలుకానికేళిని అలరులీల
బాలనేలుము రాజగోపాల దేవ !

వ. అని యామిటారి చిగురుకటారిరాయలఁగన్న య్యాఁకో మఱియు నేమనుచున్నది.

పదము॥ ఎరుకలకాంభోజి॥ ఆది॥

వనిత నేలుకోర – వగలేల చేసేవు
ఎనలేని తమి నున్నదిరా – యేమిరా సంపంగిమన్న (1)
కన్నెపాయమునీకు – జన్నెవట్టిన దాని
కన్నడ సేయక – కరుణ మీఱంగ॥ (2)
కురులుకూడని నాఁడె – మరులుకొన్న దాని
సరికొఁగిటఁ జేర్చి – చక్కెర మోవియాని॥ (3)

వ. అనిన విని యాకనకవనస్వామి యాభామనుజూచి యేమనుచున్నాడు.

గోపాలస్వామి చదివేపద్యం:-

తే॥ సుదతి, యానాను మేమును జూచినార
మావధూమణి రూపరేఖావిలాస
మంగనరో, నీవు వేఱె తెల్పంగవలదు
కలికికోరిక చేకూర్తుఁ గలఁకదీర్తు.

వ. ఓచెలియ, యాకలశాంబుధి చెంత నాయింతిని జూచి నప్పటినుండి కంతునిబారికిఁ జిక్కి యెంతయుఁ జింతిలుచుండఁగా, నాకొమ్మను మమ్మును గూర్చెదనని నీవువచ్చిపలికితివి గనుక నుల్లంబురంజిల్లె. ఓభామా ! యిఁక మేమటువచ్చు నుపాయం బేమి తెలుపుమా.

రూపవతిమాట:-ఓస్వామి, మామున్నీటిమన్నీనికి విన్నవించి రేపెల్లి మిమ్ము స్వయంవరమునకు రప్పించెదము. అప్పుడు పరాకుసేయక దేవర యటువిచ్చేసి మా నెచ్చెలి నేలుకోవయ్యా. ఇందుకు గుఱుతుగా మీకరంబున నున్న ముద్దుటుంగరముఁ బాలింపవయ్యా.

స్వామిమాట:-ఓకుటిలకుంతల, యటువలెనే వచ్చి మీ నెచ్చెలి మనోరథంబుచేకూర్తు. ఆయంగనకు ఈముద్దుటుంగరము నొసంగవె.

వ. అని యాదరించి రతనాలసొమ్ములు దివ్యాంబరంబు లొసంగి సొంపున సంపంగిగుంపుదివాణంపుజేజేవజీరుం డొసంగు ముద్దుటుంగరంబు చేపట్టి యారూపవతి యాపాలకడలికుమారికచేరికకు మరలె. అంత హేమాబ్జనాయికాకాంత తన డెందంబు చిందఱవందఱసేయునిందుకందర్పులదర్పంబు సైరింపఁజాలక, వారిని నిందించెనఁట యెటువలెను.

ఏలపదము॥ కురంజి॥ ఆట॥

ఎంచిచూడఁ దమ్ములకు నెపుడు పగదాయవు నీవు।
మంచివాఁడవా చెల్లెండ్రికు । వెన్నెలరాజ
ఇంచుకయు నీవగ మానవు॥ (1)

విరులు నీతమ్ములని వింటి వింతగా నామీఁద నేఁడు।
మెఱుఁగువాఁడితూపు లేసేవు । ఓవలరాజ
తరుణుల నిట్లలయింతురా॥ (2)

వ. ఈలాగున బాలామణి రజనీనాయకుని రాజీవనాయకుని నిందించి, కాంతునిచెంతకుఁ బంచిన యింతిరాక కెదురుచూచి వేసరి యొక కేసరిమధ్యతో నేమనుచున్నది.

దరువు॥ ఆహరి॥ అట॥

చెలువ మన్నారుసామి చెంతకు నింతకు
చెలిచేరునో లేక చేరఁగాలేదో॥ (1)
చేరిన నామాట చిత్తగించి వినునో।
యారడిఁ బెట్టునో యందఱిలోన ॥ (2)
ఏతీరు నాకోర్కె లీడేరు నమ్మ ।
నాతిరో విభుఁడెట్లు నను జేరునమ్మ॥ (3)

వ. అని చింతింపుచున్న యయ్యింతిచెంతకు గోపాలుని దండనుండి రూపవతీ సతి వచ్చెనట యెటువలెను.

గుమ్మకాంభోజి॥ అట॥

మురవైరి యొసఁగిన ముదుటుంగరముపూని
యరుణాబ్జదేవిచెంత కప్పుడా చెలివచ్చె॥

వ. ఇవ్విధంబున వచ్చినయాభామ హేమాబ్జనాయికతో నేమనుచున్నది.

పదము॥ కల్యాణి॥ ఆది॥

చాల లాలించెనె । రాజగోపాలుఁడు
నీమనవు లాలించెనే (1)

ప్రేమ నీమనవు లాలించెనే । నీకిమ్మని
భామ, యీ ముద్రిక పాలించెనే । (2)

కలఁకలన్నియుఁ దీఱెనే । ఈప్రొద్దు
నెలఁత, నీకోరిక నెఱవేఱెనే॥ (3)

వ. అని పొసఁగఁబలికి యయ్యంగన యొసఁగిన ముద్దుటుంగరంబు చేకొనియు చెంగమ్మ బత్తితో హత్తి తనకన్నుల నొత్తి చెలిఁ జూచి తలయూఁచి మేలుమేలని మేలెంచి లాలించి యేమనుచున్నది.

పదము॥ కాంభోజి॥ ఆది॥

హృదయంబు చల్లనాయెనే - యీవేళ తనకు
సుదతి, మాటవాసెల్ల - నీ సొమ్మాయెఁ గదవె॥ (1)

చపలలోచన నీవు - సవరించినట్టి
యుపకారమునకు ప్ర - త్యుపకారమేమి॥ (2)

సకుల నెందఱినైన - సంతరించితిగా
ఒకరైన నీవలె - నొదవి[illegible]యిప్పుడు॥ (3)

నీవంటి నెనరైన - నెచ్చెలి గలుగ
ఈవేళ నాకోర్కె - లీడేరె నమ్మ॥ (4)

వ. ఈరీతి నా నారీతిలకంబు నాదరించి యా చంగమలాకాంత వంతమాని యెంతయుసంతసించి నీరాకరశాయిరాక గోరుచునుండె. అనంతర కథా సంవిధానం బెటులనెను.

వ. ఆవేళ గోపాలదేవుఁ డారూపవతీసతి పలికిన పలుకులు తన తలంపులో నూహింపుచు, మోహంబు నెఱయ, దేహంబునఁ బులకలు మొలకలు మెఱయ, యల కెందమ్మిజవరాలి యందచందమ్ములు తన చిత్తమ్మునఁ గీలించి నెత్తంబును జాలించి తిలకంబుదీర్పక కలపంబు గూర్పక వేదండగమనలఁ జేరక, పూదండలుగోరక, చిలుకల పలుకుల కులుకుచు, చెలులు పిలువకే పలుకుచు, పలికి యంతలో బెళుకుచు, తాళరాని విరాళిజాలిదేలి, యా మున్నీటిమన్నీనికన్నియ తన కన్నులకుఁ గట్టినయట్లు తోఁచిన యా చెలింజూచి యేమను చున్నాఁడు.

పదము॥ ఘంటారవము॥ ఆట॥

ఏమనేవె ముద్దుగుమ్మ – యేలుకోనవె బంగారు
బొమ్మా (1)
నెలఁతరో నీపాదమాన – నీ సరసకు రాకమాన
చలముసేయ న్యాయమానా–చాల నమ్మిన బంటగాన(2)
దక్కితిఁ జొక్కితిఁ జాల – దయఁజూడవె నన్ను బాల
మక్కువతోఁ బిలువవేల–మరునిబారికిఁ దాళఁజాల(3)
మగువ నాపైదయలేద – బిగువుకౌఁగిటఁ జేర్పరాదా।
పగలు రేలును నాతోవాదా నా–పలుకు నీచెవి కింపు
గాదా (4)

వ. అని యాసరోజేక్షణతో దక్షిణ ద్వారకాధ్యక్షుఁడు మఱియు నేమనుచున్నాఁడు.

పదము॥ కాంభోజి॥ ఆది

ఇంత యేఁతురా నన్ను పంతసేతురా।
యింతిరో మ్రొక్కెను న - న్నేలుకోవె॥ (1)

కన్నెరో నీముద్దుమోము - కనుఁగొనిన యప్పటినుండి
కొన్నిన వాఁడాయెనే యీ-పండువెన్నెల వేడాయెనే
నిన్నెడఁ బాసియున్న - నిముస మేడాయెనే॥ (2)

ముదితరో నీదుచక్కెర - మోవి విందుసేయకున్న
నిదురరాదె నాకంటికి - నే తాళఁజాల
మదనుని చెఱకువింటికి వాని
దండి బారెదిరించె నేనోర్వ నొంటికి (3)

వ. అని మఱియు నేమనుచున్నాఁడు.

సీ. చెలుల నెవ్వరినైనఁ జేరి నే పిల్చిన
నీపేరె వచ్చునే నీరజాక్షి,
ఇంపు మీఱంగ నే నేదిక్కుచూచిన
నీయందమే తోఁచు నీలవేణి,
ఘల్లను నాసాముకత్తి పల్కులె నీదు
చేతిగాజుల సద్దురీతిఁ దోఁచు
గజనిమ్మపండ్లను గనుఁగొన్న యపుడె నీ
వలిగుబ్బపాలిండ్లు తలఁచుకొందు,

ఇంక నిన్నెడఁ బాసి నేనెట్టులోర్తు
పచ్చవింటి వజీరుని బారిఁ జిక్కి—
హత్తి దయమీఱ నీమీఁద బత్తిచేత
మరులు కొంటిని నన్నేలు మచ్చెకంటి.

వ. ఇత్తెఱంగున నవ్విహంగపుంగవతురంగుండు అంతరంగంబునఁగంతుసంతాపంబున నెంతయుఁ జింతింపుచు, చెంగమలాసతి సంగతిఁ గోరుచున్న తత్సమయంబున, నుత్సహించి యాచెలువ మన్నని గొలువఁదలంచి నేమంబుమీఱ నామతీర్థంబై సంచపురేకుల నిగనిగల తెగలుమించు తనమేన ద్వాదశోర్ధ్వపుండ్రంబులు మిటారింప, తన నిష్ఠామహిమ వశిష్ఠాదుల దుటారింప, నంతరంగంబున నామోదరస తరంగంబులు తురంగలింప, వింతచిఱునవ్వుమోవి చెంగలింప, నాశ్చర్యచర్య దులకింప, నంగంబు పులకింప ఆనంద బాష్పాంబుధారలు నెఱయ, అపారభక్తిపారవశ్యంబు మెఱయ, మన్నారుదేవుని సన్నిధానంబునకు మన్నారుదాసుండు వచ్చెనట యెటువలెను.

కేదారగౌళ॥ ఆట॥

శృంగారవతులు తన – చెంగటఁ జేరికొలువ
సంగీత మేళంబు – సరస రాణింప ।
రంగు మీఱంగ విజయ – రాఘవేంద్రుఁ డావేళ
బంగారు మన్నారు – పజ్జకు వచ్చె॥

వ. ఇవ్విధంబున మన్నారుసన్నిధి చేరవచ్చి పెన్నిధిఁగన్న చందంబున నానందంబుఁ జెంది, పునఃపునః ప్రణామంబులు గావింపుచు మనఃపదంబునకు రావింపుచు, తన్మూర్తి భావింపుచుఁ, దనలోనె సంభావింపుచు, తదీయ దివ్యనామంబు లుచ్చరింపుచుఁ, దరుణులకు హెచ్చరింపుచుఁ, గైకానుక లొసంగుచు, గడుభక్తి నెసంగుచుఁ, బూజలు సేయుచు, బొంగుచు డాయుచు నంజలి కృతాంజలియై విజయరాఘవేంద్రుఁ డావిజయసహాయుని వినుతించెనట యెటువలెను.

నాయుండు చదివే ద్విపద:—

ద్వి. జయదేవకీపుత్ర, జయపద్మనేత్ర,
జయ మోహనాకార, జయ యదువీర,
జయ దైత్యసంహారి, జయ కీర్తిహారి,
జయ రాజగోపాల, జయ దయాశీల!
చేరి మీపాదముల్ సేవింపఁ గంటి
కోరిక లీడేరెఁ గుతుకంబు మీఱె
తపము ఫలించె నే ధన్యుండ నైతి
నిపుడు వేడ్కచెలంగ హృదయ ముప్పొంగ
నీకటాక్షంబున నిరుపమశ్రీలు
చేకొని యభివృద్ధి చెందంగఁ గంటి
పాయని బహుపుత్ర పౌత్రాభివృద్ధి
యాయురారోగ్య భాగ్యములందఁ గంటి

వారిజభవ భవ వాసవాదులును
సారె కింతింతని చర్చింపలేని
మహిమచేఁ జెన్నొందు మన్నారుసామి నీవె
సహజ సత్కరుణచే సాక్షాత్కరించి
నాపీట నెలకొని నన్ను నీకీర్తి
నేవేళఁ బోషింప నింపొందఁ గంటి
నీముద్దు పట్టపు నెగడిన నన్ను
ప్రేమతోఁ జేపట్టి వెలయింపవయ్య.

వ. అని మస్తకన్యస్తహస్తుఁడై ప్రస్తుతించి, తన శుభసూక్తుల కభిముఖుండుగాక, యూఱక వేఱొకపరాకున విన్ననై యున్న చెండలంకారునిదండఁ జేరి దండంబు లర్పించి ప్రార్థించి యెండియు చోళభూమండలాఖండలుం డేమని విన్నవింపు మన్నాఁడు.

పదము॥ భైరవి॥ ఆట॥

స్వామి, నేఁడీలాగున్న చంద మిదేమి।
వేమాఱు వేడెదను వివరింపవయ్య (1)
సమయము తెలియక యప్పుడు సముఖానకు నేవచ్చిన ।
క్రమముతో విజయరాఘవ రమ్మనటంచు ।
మమత మీఱఁ బలాలించి మనవు లాలించి ప్రేమ
యమరఁ జనవు పాలించి - యాదరింతురుగా (2)

పొలఁతులపైఁ బొలయల్కఁ - బూనియున్న చందమో।
ఎలమి నారదగానముచే - నింపొందు సమయంబొ।
అల సనకాదిమహానుల - యభినుతు లాలించేరో ।
అలరంగ మీచిత్తమేమి - యానతియ్యరాదా॥ (3)

వ. అని పలుకు తనముద్దులపట్టి సుద్దులకు నుప్పొంగి నిజ ప్రభావంబు భావంబునఁ దలంపుచు, సంపంగి మన్నఁడు దయా సంపన్నుండుగానఁ బ్రసన్నుండై వత్స, రా రమ్మని వాత్సల్యంబునఁ గరంబు పేర్కొని పిలిచి, శిరంబు మూర్కొని, వీపు మూపు హస్తంబున మస్తరింపుచు వింతపలుకులఁ గుస్తరింపుచు, నఖిలచింతలు నిస్తరింపుచు, నామోదంబు విస్తరింపుచు, నత నితో నేమనుచున్నాఁడు.

స్వామిచదివే ద్విపద:—

మన్నారుదాస, యోమంజు విలాస,
చిన్నారి పట్టినై సేవచేయుచును
బహువిధ గోపురప్రాకారములును
మహనీయ మణిమయ మంటపంబులును
కనక రథములు శృంగారవనములు
ఘన విభూషణములు గజతురంగములు
మాకు సమర్పించి మాపేరఁ గృతుల
నేకముల్ వెలయించి నిత్యోత్సవములు
బహువైభవంబులు ప్రకటించు నీదు

సహజ సద్భక్తికి సంతసించితిమి.
తనయుండు మంత్రియు దళకర్తనీవె;
అనురక్తుఁడును భక్తుఁ డాప్తుండు నీవె;
పరమ బంధుఁడును మాప్రాణంబు నీవె;
అరయంగ హితుఁడును నన్నిట నీవె.

వ. అని మందలించి కెందలిరుమోవిపై మందహాసంబు చిందులుద్రొక్క చెందినసిగ్గుతో ప్రియనందనుంజూచి యాల మంద చెలులడెందంబులు గరంచు సౌందర్యశాలి మఱియు నేమనుచున్నాఁడు.

పదము॥ సావేరి॥ జంపెతాళము॥

వినవోయి నాపలుకు — విజయరాఘవవత్స।
తనకు నీకన్న మిగుల — తగునైన వారెవ్వరు॥ (1)
కలనైననీకు దాఁచు — కార్యమేమున్నది।
తెలిపెద వినుము నా — తెఱఁగెల్ల నిపుడు॥ (2)
మున్నిటిరాజుకన్నియను—మొన్నకనుఁగొన్నది మొదలు
కన్నులవింటివాఁడు నాపైఁ—గలహింపుచున్నాఁడు॥ (3)
రయమున నీప్రొద్దు కడలి — రాజుతో మాటలాడి
ప్రియముగా మాక యీ—పెండ్లి యొనగూర్పుము (4)
మక్కువ మీఱంగనిపుడె — మగువనునన్ను గూర్పుము।
నిక్కముగ నీకార్యము నీవల్లనే యమరు॥ (5)

వ. అనిన విని సంజాతమహోత్సాహుండై కంజాతనేత్రు నితో తంజావురేంద్రుం డేమనుచున్నాఁడు.

నాయఁడు చదివేద్విపద:-

దేవాదిదేవ, యోదేవకీ తనయ,
దేవర యిపు డానతిచ్చిన యట్లు
నడచెద నింతకన్నను భాగ్యమేమి ?
అడియనితో నింత యానతీవలెనె !
జౌనయ్య ప్రద్యుమ్నసాంబుల తోడి
వానిఁగా నన్ను దేవర కటాక్షించు
గరిమచే నీకార్యఘటనం బొనర్చి
యిరువురఁ గూర్చి యభీష్టముల్ గాంతు.
ఇంతమాత్రమున కింతేల చింతింప ?
కొంతసేపు వినోదగోష్ఠి మైఁజెలఁగి
యింపుగా దేవర, యిందుంటిరేని
సొంపుతో నీహద్దె శుభవార్త దెత్తు.

వ. అని పలికి యాకంతుజనకునిచెంతనుండి యతని యను మతిఁ గాంచి, యానగరాజధీరుండు తన నగరు ప్రవేశించి చెలువలుకై సేయఁ గొలువుసింగారం బవధరించెనట యెటు వలెను.

నాయకుని కొలువుసింగారం ద్విపద:-

ద్వి. విజయరాఘవ మహీవిభు చిత్తమెఱిఁగి
గజరాజగమన యొక్కతె చెంతఁజేరి
తిరముగాఁ గస్తూరి తిలకంబు దిద్ది
విరిసరుల్ సిగనిండ వింతగాఁ జుట్టె;
పొలఁతి వేఱొక్కతె బురుసా రుమాలు
చెలువుగాఁ గట్టె నాచెలువరాయనికి
అతివ వేఱొక్కతె యారాజు కపుడు
రతనాల హెచ్చుతురాయి గీలించె;
చవుల హెచ్చగుపెద్దచౌకట్లు నతని
చెవులను హత్తించెఁ జెలువ యొకర్తు.
మురువులు హవణించె మురువుగా నొకతె;
మెఱయించె నొక్కభామిని కంటసరులు;
సుళువు పట్టుహిజారు సొగసుగాఁ బూన్చె,
యలరు ముత్యపుజంటి యఱచట్ట దొడిగి
వలుద నీరాజిదుప్పటి కటిఁగట్టె
మొలకకెంపులవంకి మొలచెక్కె నొకతె;
చిలుకల తాళీలు చేసరంబులును
తళుకుటుత్తరిగెలు తగుబాహుపురులు
విడి కెంపురవల హంవీరతాయెతులు

కడుమించు నక్షత్రి కంఠమాలికయు
మొదలైనసొమ్ములా మోహనాంగునకు
ముదితలు కైసేసి ముదమంది రప్పుడు.

వ. ఈచెలువునఁ జెలువలుకైసేయ హాయములుమీఱి తన నగరుబయలుదేరి పాఠకులుదీవింపఁ బౌరులు సంభావింపఁ దురంగంబునెక్కి చతురంగబలంబులుగొలువ నిరర్గళ వేగంబున మార్గంబునిర్గమించి గజరాజనరమని పనుపున విజయ రాఘవేంద్రుఁ డాపాలసంద్రంపువజీరునిదివాణంబు చేరవచ్చె నట యెటువలెను.

దరువు॥ కల్యాణి॥ ఆది॥

వెలలేని తేజినెక్కి విజయ రాఘవేంద్రుండు
కలశాబ్ధిరాజు నగరికిఁ గదలి వచ్చెనప్పుడు॥

వ. ఇవ్విధంబున వచ్చిన యచ్యుతాధిపపౌత్రుని నదీకళత్రుండు హయంబునెక్కి రయంబున నెదుర్కొనెనట యెటువలెను.

పదము॥ పున్నాగవరాటి॥ ఆది॥

సరగున విజయరాఘవ చంద్రుని రాకకుప్పొంగి
శరధి రాజెదురుగా వచ్చెఁ బరిజనుల్ గొలువ॥

వ. ఇవ్విధంబున నవ్వనధిరాజెదుర్కొని ముదముతో హయంబు రయంబున డిగ్గి, ఆచెంగట తురంగమును డిగ్గి

యొయ్యారంబుమీఱ వచ్చు నయ్యచ్యుత విజయరాఘవ ఘామండలాఖండలుని దండఁజేరి కైదండగొసంగి వేడ్కతో నతనిఁ దోడ్కొని వచ్చెనట యెఱువలెను.

ద. ఘనతమీఱఁ గడలిరాజు కైదండయొసంగి
తనదు నగరికి మన్నారు దాసుఁదోడి తెచ్చె॥

వ. ఇవ్విధంబునఁ దోడ్కొనివచ్చి యగరుధూపవాసనలఁ బొగడుమీఱు తన నగరుప్రవేశించి, చాయగారుత్మతచ్ఛాయానికాయ దంతురంబులగు కొన్నికక్ష్యాంతరంబులు గడచినడచి, యందు వివిధకీరశారికాపుంజంబుల రంజిల్లు మంజుతరకనకపంజరమ్ములు, వేలుపురాచ ఱాచలువల నెలుపలఁ బొలుపలరఁదీర్చిన మదకుంజరమ్ములు రంగారుపదారువన్నె బంగారు కంబంబులు, రత్నమయ నూత్న సౌధవీధికానికురుంబంబులు, మగరాల నిగరాల నిగనిగలఁ తెగలఁ జాలమెలంగు జాలమార్గంబులు, మానికంపుఁ జెక్కడంపుఁ బనులఁ జొక్కటంబులై మించుకాంచనపాంచాలికా వర్గంబులు గొప్పసువ్వాణిముత్యాల సరాల చందువాలఁ బరఁగు మెఱుంగు సరిగజంటి నునుకుట్టుపనులఁ గనుపట్టు నునుపట్టు దట్టంపు మేలుకట్టులు, రువారంబులఁ గులుకు సిబ్బెపు గబ్బిగుబ్బెతల యుబ్బురంపు నిబ్బరంపు నెన్నడలఁ దడఁబడు పసుగుకెందమ్ముల నందంబులగు కుందనంపుటందియల ఘుణాంఘుణధ్వనుల మరిగి యంచలఁ దిరుగు రాయంచల సంచారంబులు

పెడఁద నిడుఁదయంకణంబుల పొంకణంబులు, విశాల చంద్రశాలాకనత్కనకపర్యంకంబులు, సాంద్రతరచంద్రకాంత కాంత వేదికాంతరనిరంతరరాజద్రాజోపచారనిస్తులసమస్త వస్తుజాతంబులు, శాతకుంభకుంభ రంభాస్తంభ రంగవల్లికామతల్లికారంగదుత్తుంగశృంగాటకవారితంబులుఁ గలిగి చెలఁగి చెలువు మీఱు కొలువుకూటంబుఁ జేరి యందుఁ జెన్నొందు భద్రపీఠంబుపై నవ్విజయరాఘవ పట్టభద్రునుంచి యుపచరించి గారవించి యేమనుచున్నాఁడు.

పదము॥ సావేరి॥ ఆది॥

సుదినమాయె నేఁడు మిమ్ముఁ జూడఁగల్గినపుడె।
మదనవిలాస చక్కని మన్నారు దాస। (1)
నిరుపమకీర్తులుగాంచి నిత్యాన్నదానముచే
ధరణివెలసెదవనుచుఁ దాను విన్నాఁడ। (2)
తలఁచుగాఁ బదియూరు దానముల్ గావించు
పరమపుణ్యుండ వెంతయు బ్రహ్మణ్యుండ వీవు (3)
మచ్చికమీఱ మీరిటకు వచ్చుకార్యమేమి।
అచ్యుతరఘునాథతనయ ఆనతీవయ్య॥ (4)

వ. అనిన విని యాపట్టభద్రుం డాసముద్రునితో నేమనుచున్నాఁడు.

పదము॥ జోడి॥ ఆది॥

మున్నీటిరాజ వినుము మన్నారుసామికి మీా
కన్నియయగు చెంగమ్మను గ్రక్కునఁ బెండ్లిసేయు (1)
కులశీలసౌందర్య గుణవైభవము లెన్నఁ
జెలువమన్నారు సామికిఁ జెంగమ్మకే తగును॥ (2)
ప్రేమతో నిరువురకుఁ బెండ్లికావింపు
తామసముసేయవలదు ఈముహూర్తమున నె॥ (3)

వ. అనిన విని యాగుణరత్నాకరునితో రత్నాకరుఁడేమను చున్నాఁడు.

సముద్రుని ద్విపద :

విజయరాఘవ, ధీర, విజయావతార,
విజితారివీర, కోవిదజనాధార,
విన్నపంబొక్కటి వినఁగదవయ్య
మన్నారుదేవుండు మహితానుభావుఁ
డెక్కువౌ కీర్తుల నింపొందువాఁడు
చక్కనివారిలోఁ జక్కనివాఁడు,
అతులిత గుణముల హరువొందు మేటి
అతనికి మాతనయ నొసంగి వేడ్క
లందుటకన్న భాగ్యము వేఱగలదె!

ముందుగాఁదగు విష్ణుమూర్తులఁ బిల్వ
నంపించినాము స్వయంవరమునకు
సంపంగిమన్నారుసామియు నిటకు
వచ్చినఁ జెంగమ్మ వరియించు నాదు
ముచ్చటయునుజెల్లు ముద్దుసెట్టియును
ఎంతయు ముదమందు నియ్యర్థమునకుఁ
జింతింపఁ బనిలేదు చేకూడురేపె
అన్నిట ధన్యుండ వఖిలమాన్యుఁడవు
వన్నెవాసియుఁ గల్గు వర్ధిల్లు దొరవు
నీయంతవాఁడు పూనినయట్టి కార్య
మోయయ్య యెట్లైన నౌనఁగూడు టరుదె!

వ. అని పలికి యాకలశాబ్ధిరాజు నేశ్వార గర్వారతాం బూల కనకాంబరాభరణంబుల బహుమతులు గావించి గౌర వించిన నుప్పొంగి యప్పుడావిజయరాఘవపట్టభద్రుం డా సుభద్రాసోదరునిచెంతకు మరలి తరలివచ్చెనట యెటువలెను.

దరువు॥ కన్నడ॥ ఆది॥

మున్నిటి మన్ననింగోను - ముదమున మాటలాడి
మన్నారుదాసుఁడు వచ్చె- మన్నారు చెంగటికి.

వ. ఇవ్విధంబున వచ్చిన యచ్యుతవిజయరాఘవభూపాలుం డా గోపాలదేవునికి మ్రొక్కి- యేమని విన్నవింపుచున్నాఁడు.

పదము॥ ధన్యాసి॥ ఆది॥

కోరికలెల్ల ఫలియించె గోపాలదేవ।
ఔరౌర మీసొమ్మయ్యె నరుణాబ్జవల్లి॥ (1)

అవనధిరాజు వద్దియాప్తులగు మంత్రులు।
ఈవేళనె మిముఁ బిలువ- నిటువచ్చెదరయ్య (2)

ఉల్లమునఁగలుగు చింత-లెల్లఁ దొలఁగింపుము
కల్లగాదు నేఁడె మీకుఁ-గల్యాణమగును (3)

వ. అనినవిని యెంతయు సంతసించి యా రాజమన్నం డారాజచంద్రునితో నేమనుచున్నాఁడు.

రాజగోపాలస్వామి చదివేపద్యం:-

క. రారమ్మ విజయరాఘవ
ధారుణి నీవంటి ముద్దుతనయుఁడు గలుగన్।
సారెకు మామదిలోఁగల
కోరిక లొనఁగూడుటరుదె గుణరత్ననిధీ.

వ. అని భుజగశాయి విజయరాఘవభూపాలుని మేలెంచి,-లాలింపుచున్న యా సమయంబున, నా సంద్రంపుమన్నీఁడు తన చిన్నికన్నియయగు కనకాబ్జదేవియున్న విన్నఁదనంబు సఖీపరంపరలవలన విన్నవాఁడై, యాతఁడే దనకూఁతురికి సన్నెహంబుగా వివాహంబుసేయనూహించి స్వయంవరమహోత్స

వముచాటించి వార్తకెక్కిన భగవన్మూర్తుల వారివారిఁ
జేర్వఁ బిలువ నియోగుల నియోగించెఁ గనుక నతనిపంపున
సొంపున నీరదవర్ణునికడకు నారదమౌనివచ్చెనట యెటువలెను.

దరువు॥ ఖాచి॥ ఆది॥

శ్రీరాజగోపాలుని చెంగటి కావేళ
నారదమౌనిచంద్రుండు- చేరఁగావచ్చె.

వ. ఈరీతిఁ జేరిన యాకయ్యంపు నెయ్యంపు సువారంపుసవా
రంపుటరినారంపుజడదారి సొంకముగాఁ బంకజాక్షునిపై సంకీ
ర్తనపాడినటియింంచెనఁట యెటువలెను.

పదము॥ భైరవి॥ ఆట॥

జయము జయము నీకు సంపంగిమన్న। నన్ను
దయఁజూడు దక్షిణద్వారకాధీశ॥ (1)
మదిలోన నేనునీ పదములే నమ్మితి।
మదనజనక నన్ను మన్నింపనయ్య॥ (2)
యదువంశచంద్ర, నిన్ను ముదమునఁ బొడగంటి
హృదయము రంజిల్లె నిపుడు ధన్యుఁడనైతి॥ (3)

వ. ఇవ్విధంబునవచ్చిన వియచ్చరమునీంద్రుని యచ్యుతుం
డెదురుకొని యర్ఘ్యపాద్యాదిసత్కారంబుల గారవించి కాం
చనపీఠంబుననుంచి యుపచరించి యేమనుచున్నాఁడు.

స్వామి:- రావయ్యా మౌనివర్య మీరిటువిచ్చేసిన కార్యమేమి దెలుపవయ్యా.

నారదుఁడు:- ఓస్వామి గోపాలదేవ! ఆ పాలమున్నీటిమన్నీఁడు తన కన్నియయగు చెంగమ్మస్వయంవరమునకు దిక్పాల నున్న విష్ణుమూర్తుల నందఱినిన్ని పిలువనంపినవాఁడై దేవరను గోడితెమ్మని నన్ను నిటకుఁ బంచి తమ వగ నియోగిచే పసుపుపత్రిక యంపించినాఁడు. విన నవధరింపవయ్యా.

వ. అనిన విని మన్నారుదేవుండుకనుసన్న సేయ నొక రాయసంపుకొమ్మ యాకమ్మ చేకొని సమ్ముఖమ్మననిలిచి చదివె నట యెటువలెను.

కమ్మవక్కణ:-

శ్రీమన్మహాగుణస్తోమ సంపన్నుండై భాసిల్లు రాజగోపాలశౌరి పాదంబులకు మ్రొక్కి పాలకడలిరాజు వేడ్కఁజేయం గల విన్నపంబు. సౌమ్యసంవత్సర చైత్రశుద్ధాష్టమి మా పట్టి యగు చెంగమ్మకు స్వయంవరమహోత్సవం బొనరింప నుద్యుక్తులైనాము. తామిటు విచ్చేసి యీ మహోత్సవంబు నెఱవేర్పం గావలె. స్వామిసమ్ముఖానకు నారదునివెంట మానియోగి నంచితిమి. వారి పల్కులాలించి మీరువేగనిటు సాగివచ్చేది విన్నపంబు.

వ. అని యిటువలెఁ గన్నియ చదివిన మున్నీటిరాజు విన్న పపత్రంబు వక్కాణ వినసవధరించి నెమ్మది సమ్మదంబుఁజెంది యమ్మునివరునితో నమ్మురవైరి యేమనుచున్నాఁడు.

గోపాలస్వామిమాట:- ఓమునిపుంగవ, ఆలాగే యిదిగో కదలి వచ్చేము. ముందుగా మూరాక నీరాకరేంద్రున కెఱిఁ గింపవయ్యా.

వ. అని సబహుమానంబుగా నతనిఁబంచి యంచితవైభవం బుతో కాంచనవనస్వామి హేమాబ్జనాయికాస్వయంవరంబు నకు నుత్సహించి, చెలువుపొంగారుకొలువు శృంగారంబు పూనెనట యెటువలెను.

(స్వామికొలువు శృంగారం ద్విపద)

ద్వి. ఆరాజగోపాలుఁ డప్పుడుత్సహించి
తీరుగాఁ గస్తూరితిలకంబు దిద్ది
జగజంపు సంపంగిసరు లరజాఱు
సిగఁ జుట్టి యూపైని జీని కడాని
సరిగ ముత్తెపు జంటి సవరణ రొయింటి
పొర బురుసారుమాల్ పొలుపొందఁ గట్టి,
బలుడంబు చలడంబుపై రహిమీఱు
సుళువు పట్టుహిజారు సొగసుగాఁ దొడిగి,
సింగపుపనివా్రిత జిలుఁగు కంగోరు

బంగారు సరిగ దుప్పటి వలెవాటు
నీటుమీఱఁగ వైచి, నిగనిగల్ దేరు
తేట సుప్పాణి ముత్యాలచౌకట్లు
ధరియించి యల శమంతకకౌస్తుభములఁ
దఱచైన చిలుకల తాళీలుపూని
నెమ్మేన జవ్వాది నెత్తావులీన
ఘుమ్మను జాతికుంకుమగంధ మలఁది
మురువైన తాయెతుల్ ముద్దుటుంగరము
కరకంకణంబులు గండపెండెంబు
సరిపణీలును కంటసరులుఁ జేసరులు
మురువులు హారముల్ మొదలుగాఁ గలుగు
సమధిక రత్నభూషణములు దాల్చి
కమనీయ వైభవగరిమతో నిట్లు
కొలువు సింగారమై కోటికందర్ప
లలితసౌందర్యవిలాసుఁడై మెఱసె.

వ. ఈదారి హొయలుమీఱి మురవైరి భేరీప్రముఖ భూరితూర్యరవంబులు దశదిశలబోరుకలంగ, చెంగట సంగీతమేళంబులు చెలంగ, వందిబృందంబులందంబు దైవాఱఁ గైవారంబులుచేయ, రువారంబు మీఱ వారకాంతలు తన చెంత వింతగాఁ బంతువిధంబునటియింప, నింతంతటఁ బారు

దారులు బరాబరులు గావింపఁ బాఱులు దీవింపఁ బౌరులు సంభావింప రాజసంబున రతిరాజసమానుండై మున్నీటిమేటి పీటికిఁ గదలివచ్చెనట యెటువలెను.

దరువు॥ వెడవిల్తుఁ గన్నయ్య విభవంబు మీఱంగ
కడలిరాజు పీటికిఁ గడువేడ్కవచ్చె॥

వ. ఇత్తెఱంగున రంగుమీఱి వచ్చుచో, నచ్యుత విజయ రాఘవమహీవిభుండు తనదండఁజేరి కైదండయొసంగ, నెఱ రాజసంబున వచ్చు రాజగోపాలు నప్పుడప్పయోధిరాజు ముద ముగదుర నెదురుకొనెనట యెటువలెను.

దరువు॥ కేదార॥ ఆట॥

చెలఁగుచు దొరలుగొలువఁ - జెలువ మన్నరుసామి
కెలమితోఁ గడలి రా - జెదురుగా వచ్చె।

వ. ఇవ్విధంబున నెదురుకొని యవ్వనధిరా జతని నుచిత సత్కారంబుల గారవించి యుపచరించి తపనీయమయంబై తేజంబుమీఱు స్వయంవరమంటపరాజంబున నుచితరత్న ఖచితపీఠంబున నుంచి భావంబురంజిల్ల నామహానుభావునితో నేమనుచున్నాఁడు.

పదము॥ గుమ్మకాంభోజి॥ ఆట॥

ఏమయ్య గోపాలదేవ। స్వామి యిటకు విచ్చేయఁగా
నామందిరము పావ నంబయ్యె నేఁడు। (1)

తపములెల్ల నెఱవేఱె ధర్మంబు లీడేఱె ।
ఇపుడు నాముచ్చటలు చెల్లె
హృదయము రంజిల్లె॥ (2)
భువిలో ధన్యుండనైతి - భువన మాన్యుండనైతి-నే
నవరించు ఈ వేడుక - సఫలమాయె నేఁడు (3)

వ. అని పలుకు సమయంబున నతిధవళ దేహుండగు నాది వరాహుండును, రంగత్కృపాతరంగితాంతరంగసనాథుండగు కస్తూరి రంగనాథుండును, పంకజాస్త్రసంకాశుండగు వేంకటేశుండును, సరస సద్గుణమణిశ్రేణియగు శార్ఙ్గపాణియును, పాలిత ద్విరదరాజులగు వరదరాజులును, చారుతరవైభవుండగు వీరరాఘవుండును, నీలమేఘనిభుండగు నీలమేఘప్రభుండును, మొదలుగా దిక్కులఁ గీర్తులఁగన్న భగవన్మూర్తులార త్నాకరేందుని రత్నమందిరమునకు వచ్చిరఁట యెటువలెను.

దరువు॥ శంకరాభరణము॥ ఆది॥

వెన్నుని మూర్తులందఱు - వింతవింత హొరాయలుంగ్నో
మున్నీటిరాజు నగరికి - ముదమున వచ్చిరి.

వ. ఇవ్విధంబున వచ్చిన యవ్విష్ణుమూర్తుల నవ్వనధిరాజు శుభోదర్కంబుగా నెదురుకొని సగౌరవంబుగా వారలఁ దోడి తెచ్చి కాంచన పంచానన పీఠంబుల నుంచి యాదరించు నా సమయంబున చెంగమ్మ కొలువుసింగారంబు పూనెనఁట యెటువలెను.

చెంగమ్మవారి కొలువు శృంగార ద్విపద:—

ఆవేళ నయ్యరుణాంబుజ వల్లి
సేవలు గావింపఁ జెలు లిరువంక
కురులుదువ్వి మిటారి కొప్పమరించి
సరిలేని యరవిరిసరములు చుట్టి
జలజాక్షి యొక్కతె సరసవహించు
నిలువుటద్దములోని నీడ గన్గొనుచు
తెలివొందఁ గస్తూరితిలకంబు దిద్ది
కలికి వాల్గన్నులఁ గాటుకదీర్చి,
వగమించు సరిగపావడ ధరియించి,
జిగి బురుసాచీర చెలువొందఁ గట్టి,
సింగారమమరంగ జిలుగు బంగారు
రంగుల కంగుల రవికధరించి,
పొలుపొందు కపురంపు బుగబుగల్ మించఁ
గులుకుగుబ్బలను కుంకుమగంధ మలఁది
ముత్తేల కుతికంటు ముంజేసరాలు
ఉత్తరిగలు మేల్మియుదురి గాజులును
ఇంద్రాణికడియంబు లింద్రనీలముల
సౌందర్యంబులగు కంటసరి బిన్నసరులు,
పదకముల్ మగరాల పాపటబొట్టు,

కుసుమకెంపుల మించు ముక్కుకంటెయును
ముంగర బవిరెలు ముత్యాలసరులు
నుంగరాల్ సరిపెణ లొడ్డాణముమరు
సందిట దండలు చంద్రసూర్యులును,
అందియల్ మట్టియ లాదిగాఁ గల్గు
సకలభూషా విశేషంబులచేత
చికిలి నెమ్మేనున్గైసేసి యెంతయును
సరిలేని తన రత్నసౌధంబు డిగ్గి
సరగ స్వయంవరస్థలిఁ జేరవచ్చె.

దరువు॥ సౌరాష్ట్ర॥ ఆది॥

బంగారుచాయలఁ - బరఁగు పల్లకియెక్కి
చెంగమ్మ యాసభ - చేరంగ వచ్చె॥

వ. ఇవ్విధంబున వచ్చి యవ్వధూమణి పల్లకి డిగ్గి మెల్లనె యల్ల స్వయంవరరంగంబుచేరంగ నలచెంగమ్మ చెంతఁజేరి రూపవతికాంత యావిష్ణుమూర్తుల వేఱువేఱఁ జూపి వారివారి పేరు పెంపు లాసంపదజవరాలికిఁ దెలుపునప్పు డప్పడంతి ప్రత్యుత్తరంబిచ్చునాదారికి వానికిఁ బరస్పర వచనరచనలునడచెనట యెటువలెను.

పదము॥ సావేరి॥ ఆది॥

చెంగటి పారిజాతమై - సేవకుల రక్షించు
రంగ నిలయుండె యితండు - బంగారు బొమ్మ!

పొంగుచు నామదిలోని - పూనికనెఱవేర్పు మనుచు
నంగనరో యితనికి - నంజలి చేసేనె (1)
ఆదైత్యవీరుని గెల్చి - యవని దెచ్చినిల్పిన
యాదివరాహుండె యితఁడు - అలరుఁబోఁడిరో॥
నాదుప్రాణ వల్లభు ననుగూర్చుమని వేడి
యీదేవునికి మొ్రక్కెనె యిందువదన (2)
శరణన్నవారలఁ - గరుణచే వెలయించు
వరదరాజు ఇతఁడె - వనజలోచన।
తరుణిరో నావిభునిపైఁ - దగిలిన నామనసు
మరలనేర్చున యిటువంటి - మాటలేలనే। (3)
పొంకముగ భక్తులను - బోషింపఁ జాలిన
వేంకటరమణుఁడె - యితఁడు విరిబోఁణిరో।
పంకజలోచన నాదు - పతిని జూచిన కన్నుల
నింక వేఱొకరిని జూడ - హితవు గాదమ్మ॥ (4)

కాంభోజి॥ ఆది॥

చక్కని వారిలోఁ జక్కని వాఁడమ్మ।
జక్కవ గుబ్బెతలఁ జొక్కించువాఁడు।
చక్కెరవిల్తునిఁ గన్న సంపంగి మన్నండె।
గ్రక్కున నీతని నీవు గనుఁగొనవమ్మ (5)
మున్ను చూచిన వాఁడె వీఁడు।
వీనిపైఁ జాల మరులు కొంటినె।
మగువ వీనిపై మనసు హత్తెనే॥

వ. అని పలికి తనచెంగట మంగళతూర్యరవంబులు చెలంగఁ బొంగుచు జనులుకనుంగొనంగ వేలుపులు విరులసోనలు గురియింప, విబుధతతులు సన్నుతులు నెరయింప, నలకలకంఠకంఠి యదుకులకంఠీరవునియుపకంఠంబుచేరి యుత్కంఠమీఱ నతని కంఠంబునఁ దనకెంగేలనున్న బంగారువిరులసరంబు హత్తించె నట యెటువలెను.

ద॥ కల్యాణి॥

కనక ననాధీశు కంఠంబునందుఁ
గనక మాలికచేర్చెఁ గనకాబ్జవల్లి।

వ. అంత హేమాబ్జనాయికాకాంత నిజాంతఃపురంబు ప్రవేశించిన యనంతరంబ రాజగోపాలుండు రాజవీధులబయలుదేరి హొయలుమీఱి బంధురంబగు గంధసింధురంబెక్కి వచ్చెనట యెటువలెను.

ద॥ మదగజేంద్రము నెక్కి మన్నారుదేవుండు
ముదమునఁ గడలిరాజు సదనము చేరవచ్చె॥

వ. ఆసమయంబునఁ జెంగమ్మ యాసభారంగంబు చేరవచ్చె నట యెటువలెను.

ద॥ చెంగటఁ జెలులు చేరి తనుగొలువంగ
చెంగమ్మ పెండ్లిచవికె చేరంగవచ్చె॥

వ. అప్పుడుప్పొంగి యప్పయోధిరాజు బంగారుపెండ్లిచవికె లోన హావళ్లైన నవరత్నమయంబులగుపెండ్లిపీటలపై నారక్షాబ్జ నాయికా రాజగోపాలకులనుంచెనట యెటువలెను.

ద॥ చెంగమ్మను చక్కని - చెలువ మన్నారును
బంగారుపీటపై నుంచెఁ - బొంగుచుఁ గడలిరాజు॥

వ. ఆసమయంబున నానందప్రింపు మన్నీఁడు పిల్వనంప భాసురామోదంబుతో భూసురాగ్రణులగు పురోహితులాసభఁ జేరవచ్చిరట యెటువలెను.

ద॥ సౌరాష్ట్రి॥ ఆది॥

పంచాంగములు చేపట్టి - పట్టెనామములు పెట్టి
యంచితముగఁ బురోహితు - లటువచ్చి రపుడు ॥

వ. ఈరీతిని వచ్చిన పురోహితు లావాహినీపతినిదీవించి యేమనుచున్నారు.

పురోహితుల మాటలు:- మంగళానిభవంతు. అఖండిత ప్రతాపోస్తు. దీర్ఘాయుష్యమస్తు. ఓమహానుభావా, దేవరవారు మమ్మింత శీఘ్రముగా నిప్పుడు రప్పించిన కార్యమేమి? అనతీవయ్యా.

సముద్రుని మాటలు:- రారోయి పురోహితులార! రాజగోపాలస్వామికి మాపట్టియగు చెంగమ్మను పెండ్లిచేస్తున్నారము. మీరు ముహూర్తము నిర్ణయించి వివాహమహోత్సవం బారంభించరోయి.

పురోహితుల మాట:- స్వామి, అషువలెనే నిర్ణయించినారం. శుభస్యశీఘ్రం అన్నాఁడు గనుక, మనోజయంతు మాండవ్యః అన్నట్టు ఇదే సుముహూర్తము. అలాగే వివాహోత్సవం ఆరంభించేమయ్యా. ఓహోహో ఏలినవారు సిద్ధసంకల్పులు కారా, అలాగే సంకల్పం చెరకుండాం రారోయి.

సంకల్పము : శుభే శోభనే ముహూర్తే ఆద్యబ్రహ్మణః ద్వితీయ పరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వత మన్వంతరే, కలి యుగే ప్రథమపాదే జంబూద్వీపే భరతవర్షే భరతఖండే అస్మిన్ వర్తమాన వ్యవహారే చాంద్రమానే సౌమ్యనామ సంవత్సరే ఉత్తరాయణే వసంతర్తౌ, చైత్రమాసే శుక్లపక్షే అద్య శుభనక్షత్ర శుభయోగ శుభకరణ యుక్తాయాం అస్యాం శుభతిథౌ రక్తాబ్జనాయికా రాజగోపాలయోః ఉద్వాహాఖ్యం కర్మ కరిష్యమాణః తదాదౌశుద్ధ్యర్థం వృద్ధ్యర్థం అభ్యుదయార్థంచ శోభనార్థం నాందీ దేవతాహ్వానం కరిష్యే. తదేవలగ్నం సుదినం తదేవ తారాబలం చంద్రబలం తదేవ,విద్యాబలం దైవబలం తదేవ లక్ష్మీపతే తేంఘ్రియుగం స్మరామి॥

సుముహూర్తోస్త్విత్యనుగృహ్ణాంతు।
సుముహూర్తోస్తు॥

వ. ఇవ్విధంబునఁ బురోహితులు సంకల్పంబుగావించు సమయంబున పొంకమగుకుంకుమబొట్టు నిటలతటంబున రాణింపఁ

పసుపురసపునిగ్గులు నెమ్మేన మిటారింప, జాతిశృంగారంబు పొంగార భాసురోల్లాసంబున భూసురాంగనలువచ్చిరట యెటు వలెను.

ద॥ సౌరాష్ట్రి॥ ఆట॥

పగడంపుఁ జొకట్లు బారికుంకుమబొట్లు
జిగిదేరు పొంకవన్నెల చీరలతీరు।
మొగమునఁ పసుపుడాలు ముసుగురవికెల తేలు
సొగసుమించ ముత్తైదువలు సొంపునవచ్చిరి॥

వ. అప్పుడప్పాటలగంధులు పాటలుపాడుచువచ్చిరట యెటు వలెను.

లక్ష్మీకల్యాణము॥ దరువు॥

శృంగారమమరంగఁ జెలువమన్నారు।
చెంగమ్మ పెండ్లికిఁ జెలులార రారె॥ (1)
నిత్యకల్యాణంబు పచ్చతోరణము।
హెచ్చైన కడలిరాజింట నేపారిన॥ (2)
కన్నులు చల్లఁగాఁ గనుఁగొందమమ్మ।
మన్నారుసామిని మనచెంగమ్మను॥ (3)

వ. ఈరీతి వచ్చిన పేరఁటాండ్రచ్చట ముచ్చటలాడిరట యెటువలెను.

ముత్తైదువల మాటలు:-

రావే ఓ కౌసల్నాటి తిమ్మక్క. (1)

మరొకరిమాట:- ఇదిగో వస్సుందానసే పేరూరి కామక్క (2)

వింటివో షే జందేల బుచ్చక్క (3)

ఒకతె:- అదేందే ఓబారతాల సూరక్క (4)

వస్తివా షే పుల్లగూర పేరక్క, మన సముద్రరాజు నగరను చెంగమ్మవారికి పెండ్లిచేస్తున్నారష. పాటలు పాడిన ముత్తైదువలకల్లా కట్నవిస్తున్నారష పుచ్చుకుందాం వచ్చేరొషే. (5)

ఇంకొకతె:- అందుకేకాదుషే వచ్చింది. ఓసెమ్మ వింటివోషె. మావారు ఏమేమొ ఏషేషో యేందేందో అంచుందారే (6)

మరొకరు:- ఏమంచుందారే ఓసెమ్మ (7)

మావారు ఇందుకుమాత్రం ముసలివారష. ఎట్లైనా నన్ను గడించిపెట్టుమని పోరుకతించుందారే ఓసెమ్మ.(8)

ఇంకొకతె:- ఓశమ్మ అట్లాననకువే. "పురుషుండే దైవంబు, పురుషుండే తండ్రి, పురుషుండే నాపాలి పురుషోత్తముండు" అన్నాడే ఓశమ్మ. అషుగనకనే మావారిని బిడ్డకన్నా విశేషంగా పోషింతునే. (9)

మరొకతె:- మీవారిని బిడ్డకన్నా విశేషంగా పోషింతునంటివే,
అట్లైతే ఇసుగువారూ పొసుగువారూ ఏంగావాలే నీకు
ఓసమ్మ. మీవార్నీ మావార్నీ మార్చుకొందామషే?
ఓసెమ్మా నీకు నడుమేల బట్టుకొనెనే (11)
ఓసెమ్మా వింటివాషే మావాసు నిన్నరాత్రి గంపెడేసి
బందాలు పట్టించేశే. (12)
అవునే చాలుచాలు పెండ్లిపందిట్లో ఒకనుడుగు అన
రాదుషే (13)

వ. అని ముచ్చటలాడి యచ్చటన ప్పుడమివేల్పుజవరాండ్రు కట్నంబులకై కొట్నంబు దంచుచు అమ్మహోత్సవాలయాంగణంబున సువ్వాలపాడిరట యెటువలెను.

సువ్వాల:- సువ్విమోహనాకార సువ్వి భక్తమందార సువ్వి
చెండలంకార సువ్వి సువ్వి। (1)
బాసవాలుదొరలుచూడ పసుపులేటిదరులజాడ రాసకేళి
సలుపుచున్న రాజమన్న॥ (2)
పాలకడలిరాచపట్టి- బాళిమీఱజేపట్టి
శ్రీలఁజాలఁ జెలఁగునట్టి- చెలువమన్న॥ (3)
విజయరాఘవుని పీట-వెలయుచున్న రాజమన్న
గజరాజగమననేలు- కరుణమీఱఁగా॥ (4)

వ. ఆవేళ వసిష్ఠ వామదేవ నారద కపిల మార్కండేయ ప్రముఖ నిఖిల మహర్షులు సహర్షులైవచ్చిరట యెటువలెను.

దరువు॥మధ్యమావతి॥ఆట॥

నెఱసిన గడ్డాలు - నీర్కావి దోవతులు
పరఁగు పట్టుసాలువులు - పట్టెనామములు।
వరరత్నకుండలము - లరుదైన జడలును
హాసకంఠ మహానీంద్రు - లటువచ్చిరప్పుడు॥

వ. ఇత్తెఱంగున వచ్చిన మునిపుంగవులు అయ్యంగజ గురునిపై మంగళాశాసనశ్లోకంబు లనేకంబులు, చూర్ణికయుఁ జదివిరట యెటువలెను.

శ్లో. రుక్మిణీరైన కస్తూరీ కుంకుమాంకితవక్షసే ।
రాధామోహనరూపాయ రాజగోపాయ మంగళమ్ ॥

శ్లో. మహర్షి మహితం జ్యోతిర్మంగళానాంచ మంగళం।
త్వమేవ చంపకారామధామన్ స్వామిన్ నమోస్తు తే॥

శ్లో. సత్యభామాభిరామాయ సర్వాభీష్ట ప్రదాయినే।
యదువంశ ప్రదీపాయ రాజగోపాయ మంగళమ్ ॥

శ్లో. సురాధిరాజకోటీర రత్న నీరాజితాంఘ్రయే।
రతీశ కోటిరూపాయ రాజగోపాయ మంగళమ్ ॥

శ్లో. మన్నారుదాస భూపాల మణిమందిర వాసినే।
మహనీయ ప్రతాపాయ రాజగోపాయ మంగళమ్॥

చూర్ణిక : శ్రీరాజగోపాలదేవ, దేవతావతంస సంస్తూయమాన మహనీయ నిజప్రభావ, భావసంభవకోటి మోహన లీలామానుషవిగ్రహ విగ్రహమహీ నిగృహీత దైతేయలోక, లోకరక్షణవిచక్షణ కృపావిలోక, లోకాలోకవలయిత ధరణీ మండల మండనాయమాన కనకాటవీ కృతవిహార, హార నీహారసార ఘనసార పటీరసదృశ విశదవిశాల యశోనిరంతరిత సకల జగదంతర, తరణిసహస్ర విభావిభాసమాన ప్రతాప, తాపస సముదయ హృదయ నివేశ, దక్షిణద్వారకాధీశ, నమస్తే నమస్తే నమస్తే నమః ॥

వ. ఆ సమయంబున మహోల్లాసంబు రాణింప పాణిగ్రహణ మహోత్సవం బవధరించిన రక్తాబ్జనాయికా రాజగోపాలకులపై వేలుపుదొరలు విరులవానలు గురియించిరట యెటువలెను.

ద॥ పూవులవానలు పొంగుచుఁ గురియించి ।
రావధూవరులపై నమరులావేళ ॥

వ. అప్పుడప్పురోహితులు నిజస్వాతంత్ర్యంబులకై పరస్పర సంవాదంబునడపించిరట యెటువలెను.

పురోహితులు :

రంగయమాట :- ఏమోయి బోదనం తిమ్మయ్యగారు.

తిమ్మయమాట :- ఏమంచున్నాఁడ వోయి అనడ్వాహం రంగయగారు.

రంగయమాట:- అదేందోయి బృహస్పతి, సంభావన రూకలు నీవు అపహరించుకొని యెషువలె 'యద్వాతద్వాదులు' చెప్పుచున్నాఁడవోయి.

తిమ్మయమాట :- భళాభళా మహాలెస్సాయె కొంగుముడి రూకలున్ను ధారపోతరూకలున్ను నీవు గ్రహించుకొని యిషువలె "ఏషాగాథలు" ఆడేది లెస్సమవోయి ?

రంగయమాట :- ఓహోహో ! నన్నే అంచున్నాఁడవు మంచి ప్రాజ్ఞుఁడవులే.

తిమ్మయమాట :- ఓరి వజ్రిసుంత, న్యాగ్రుతరాలనుండిన్ని నే తగువైనవాఁడ నుండఁగా నిన్నటి సుడుపండవు నీకు స్వాతంత్ర సామ్యాలనఁగా ఏందిరా?

రంగయమాట:- ఓహోహో ! కాదామరి ! నీగుట్టల్ల బయలు సేతునా !

తిమ్మయమాట:- సేయిరా.

రంగయమాట:- ఏమోయి, నీకొడుకు ఇంట్లో సొమ్ముల్లా ఎత్తు కొని తొత్తుల పాలుచేసి నలుగురిచేతా కాదనిపించు కోలేదా.

తిమ్మయమాట:- ఓరి మమ్మాలనేది ! చెంపశుద్ధిచేతుమో!

రంగయమాట:- ఓరి, మిమ్ముఁరా కాలుపట్టి తీతుమో.

' వ. అత్తఱి ముత్తైదువలు నీటుపాటలపాటలు పాడిరట యెటువలెను.

ధవళము :

జయ జయ హేమాబ్జవల్లీ
జయ జయ కాంతామతల్లీ
జయ జయ రాజగోపాల
జయ జయ రమణీయశీల
జయ జయ కలశాబ్ధికన్య
జయ జయ భువనైకమాన్య
జయ జయ నందకుమార
జయ జయ మోహనాకార.

శోభనము: శ్రీరాజగోపాలునకు
శృంగార విలోలునకు।
చారుముఖోల్లాసునకు
చంపక వనవాసునకు॥
నీలాంబుద వేణికిని
నిత్యకల్యాణికిని
జాళువా బొమ్మకును
చక్కని చెంగమ్మకును॥

వ. ఆసమయంబున రక్తాబ్జనాయికా రాజగోపాలకులు వేడుకతో జోడుగూడి నటియించిరట యెటువలెను.

దా॥ చెంగమ్మను జతగూడి – చెలువమన్నారుస్వామి
పొంగుచు నటియించె – బాలలుతులు మహోల్లాసంబున
గొలువ॥

వ. ఇవ్విధంబున వివాహమహోత్సవంబవధరించిన రక్తాబ్జ నాయికా రాజగోపాలకు లాజలధిరాజులపూజలంది దక్షిణ ద్వారకాపురంబుకన్న దాపురంబై సకలసంపత్పరంపరల నిక రంబగుతంజనగరంబుచేరవచ్చి తమ ముద్దులపట్టియగు పట్ట భద్రుండు సవరించు వివిధోపచారములనుల్లసిల్లుచు నతనికి దీర్ఘాయురారోగ్యభాగ్యంబులు శాశ్వతైశ్వర్యములు పాలింపుచు బంగారుసింగంపుమోముగద్దియపై పేరోలగంబుండి తమ సమ్ముఖంబున సమ్మోదంబున మ్రొక్కినిలిచిన యవ్విజయరాఘ వేంద్రునిఁ జేరఁబిల్చిగారవించి వారలేమనుచున్నారు.
గోపాలస్వామి చదివేపద్యం:-

గీ. విజయరాఘవవత్స, యీపెండ్లి నీవు
సంఘటింపంగ మామది చల్లనయ్యె
ప్రబలి నీవాయురారోగ్య భాగ్యములను
ధరణి వర్ధిల్లు మాచంద్రతారకముగ.

వ. అని యనురక్తిమీఱ నాదరించు రక్తాబ్జనాయికా రాజ గోపాలకులకు వందనంబుగావించి యా విజయరాఘవేంద్రుం డేమని విన్నవింపుచున్నాఁడు.
నాయఁడు చదివేపద్యం :-

క. తలిదండ్రులు మీరలు నను
పొలుపుగఁ బ్రియతనయుఁడంచుఁ బోషింపంగా।
వలయు శుభంబులు చెందుచు
వెలసెద ధరలోననెప్పుడు విజయము లెసఁగన్.

వ. అని మందలించ ప్రియనందనుండగు మన్నారుదాసుని లాలింపుచు, చాల సమ్మోదమ్మున రాజిల్లు ఆరక్తాబ్జనాయికా రాజగోపాలకుల సమ్ముఖమ్మున నీరాజనమ్ములు చేకొని మంగళప్రదమ్ముగా దివ్యాంగనలిద్దఱు నటియించిరంట యెటువలెను.

ద॥ మంగళము సంపంగి మన్నారుదేవునకు
మంగళము మహితానుభావునకును
మంగళము సరిలేని బంగారు బొమ్మకును
మంగళము చక్కని చెంగమ్మకు।
జయమంగళం శుభమంగళం॥

భరతవాక్యము॥ ఇవ్విధంబున చినచెవ్వయాచ్యుతాధిప ప్రపౌత్రుండును, రఘునాథ జననాథ పౌత్రుండును, విజయ రాఘవభూపాలక ప్రియపుత్రుండును, రాజగోపాలాంబికాగర్భ కలశజలధికువలయమిత్రుండును, అతుల కనకతులాప్రముఖ నిఖిలమహాదానదీక్షాధురీణుండును, అనేకాగ్రహారప్రతిష్ఠాపన ప్రవీణుండును, విజయరాఘవాభ్యుదయాది ప్రబంధనిబంధన చాతురీపారీణుండును, అతులిత పితృభక్తి గురుభక్తి భాగధేయుండును, మహితానుభావుండును, నగు మన్నారుదేవుఁడు భువనస్తవనీయంబుగా రచియించిన హేమాబ్జనాయికా స్వయంవరంబను నాటకంబునకు కథానాయకులగు రక్తాబ్జనాయికా రాజగోపాలకులు తమ ప్రియపుత్త్రుఁడై ధాత్రిఁ బాలింపుచు చాల సంతసించుచున్న విజయరాఘవభూపాలునకు సర్వసర్వంసహాధిపత్య సంతతాయురారోగ్య భాగ్యంబులు పాలించి రక్షింతురుగాత॥

మన్నారుదేవికి మంగళం

సంపూర్ణము

Andhra University Series No. 56

# యక్షగానములు

## ( తంజావూరు )

సంపుటము ౨

---

పరిష్కర్త

విద్వాన్

గంటి జోగిసోమయాజి, ఎం. ఎ., ఎల్. టి.,

ప్రొఫెసరు, ఆంధ్రవిశ్వకళాపరిషత్తు.

---

ఆంధ్ర విశ్వకళా పరిషత్తుచే ప్రచురితము




కాకినాడ : జాగ్జి ప్రెస్సునందు

శ్రీ పట్ట్రమట్ట్ర శేషగిరిరావుగారిచే ముద్రితము

Price Rs. 2-8-0] 1956 [ వెల రు 2-8-0

# విషయసూచిక



# ఉపోద్ఘాతము

మొదటి సంపుటమున నాలుగు యక్షగానములు ముద్రింపఁబడినవి. ఇందు మూఁడుయక్షగానములు చేర్చఁబడినవి. ఆనాల్గును విజయరాఘవునిచేతను, అతని కుమారుఁడు మన్నారుదేవునిచేతను వ్రాయఁబడినవి. ఇందలి మూఁడును ఆస్థానబాలమండలి కవులచే రచింపఁబడినవి.

ఈ యక్షగానములలో ఆనాఁటిభాషావిషయికములైన కొన్నివిశేషములు గోచరించును. విజయరాఘవనాయని ఆస్థానమున కన్నడము, అరవముకూడ వ్యవహారములో నుండియుండినవి. అరవముమాట్లాడు కణకపిల్లలు, కన్నడదేశమునుండి వచ్చిన బ్రాహ్మణులు తమ భాషలో మాట్లాడుచుండిన ప్రసంగములిందుఁ గన్పించుచుండును. ఆయాభాషలు, నాఁటి వ్యావహారికములైన పలుకుబడులతోఁ గూడియుండును. అవి యథాతథముగా ముద్రింపఁబడినవి.

తెనుఁగు విషయమునను ఆనాఁటి వివిధవర్గములయొక్క వ్యావహారికభాష అన్ని పొందుపరుపఁబడినది.

ఈ యక్షగానముల శుద్ధప్రతులు తయారుచేయుటలోను, సంస్కరణమునందును, ఈపనిలో సహాయుఁడుగా నియమింపఁబడి మిక్కిలిగా ఉపకరించుచున్న చిరంజీవి కొమ్మనమంచి జోగయ్యశర్మను పేర్కొనకతప్పదు.

విద్వాన్ సోమయాజి.

# విజయరాఘవ చంద్రికావిహారము

## ఉపోద్ఘాతము



విజయరాఘవుని పట్టంపుఁగవియగు కామరుసు వేంకటపతిసోమయాజి ప్రభువున కంకితముగా నీయక్షగానమును రచించినాఁడు. గ్రంథారంభమునఁ జేయఁబడిన కైవారములో విజయరాఘవుని శౌర్యసాహసాది గుణములభివర్ణింపఁబడినవి.

చోళదేశవర్ణనము, తంజాపురీవర్ణనము లొనర్చి నాయకుఁడగు విజయరాఘవునిఁ గవి "విక్రమార్కాపరావతారుఁడు మావిజయరాఘవు"డని పొగడినాఁడు.

విజయరాఘవుఁడు ఒకనాటిరేయి పాదచారియై కొందఱునారీరత్నంబులుగొలువ నిజరాజధానిలో సానికూఁతుల వీథికివచ్చుట, ఆతనిఁజూడఁగోరి పౌరకాంతలు మేడలపై బారులు దీరియుండుట, వారాతని కందర్పరూపముగాంచి మోహించి యతనిఁ గవయవలెనని తమలోఁ దాముచ్చిళులూరుట, విజయరాఘవుఁడు వెన్నెలవిహారము చాలించి తననగరుచేరుట, అంత నొకమిటారి యాతనియందలి మోహాతిశయమును సైరింపఁ

బాలక చంద్రశాలఁ జేరి విజయరాఘవుని రూపంబు హత్తించి యున్న చిత్రపటంబుగాంచి విరహమభినయించుట, ఇందు కందర్ప మందానిలముల నుపాలంభనము సేయుట, చెలికత్తెయగు చకోరిక యామెయొద్దకువచ్చి విరహకారణమడుగుట, విజయ రాఘవునిపైఁ దనకుఁ గలిగిన మోహము నామె వివరించుట, "పదియాఱు వేలకామినుల నేలు నా విజయరాఘవుఁడు నన్ను ప్రేమించునటే" యని యా చెలికత్తె కనకాంగి నుపలాలించుట, కనకాంగి తనకొకనాఁడు విజయుఁడు కలఁ గానుపించి "భామా లలామ, నాఁడు నేను విజయుఁడను నీ వూర్వశివి. ఆనాఁడు నీకోరికను నిరాకరించితిని. కలియుగమున నన్ను గలయఁగలవని పలిశధనుఁడు నీకు వరమిచ్చినాఁడు. కలియుగమున విజయ రాఘవనామముతో విజయుఁ డవతరించి [illegible]ము నేలఁ గలఁడు. నాఁటి పట్టపుదేవి ననుగూడి చంపకవల్లియయ్యె. నీవు ననుగోరి యాతంజనగరమున కనకాంగివై జన్మించితివి. కావున నిను బొట్టుగట్టి చేపట్టి యేలనున్నాఁడ" నని [illegible] యనంత విమాన మెక్కించి నను దోడుకొని తన నగరికి నచ్చి[illegible] యాకల నిక్కమగునట్లు సేయుమని మ్రొక్కి [illegible]టయు, [illegible]వునను వనమున విహరించుటయు, మలయానిలాదులఁ జిక్కి పరవశయైయున్న యాలీలావతి నూరడించి విజయ రాఘవు పాలికిఁబోయి యాతని నెట్లైనఁ దోడితెచ్చెదనని చకో రిక పల్కుటయు, కనకాంగి కమ్మలిఖించి యామెను విజయ

రాఘవునిసాలికిఁ బంపుటయు, దారిలో శుభశకునములగుటయుఁ లీలావతి విరహము, ఎఱుకత యెఱుకచెప్పుట, చకోరిక కమ్మ గైకొని విజయరాఘవుని కర్పించి

"అలచంద్రికా విహారాపదేశమునఁ
గేరికివచ్చి మాకీరసల్లాప
నీ రేయి రతిరాజ్య మేలింపవయ్య."

అని యడుగుటయు, విజయరాఘవుఁడు ముద్దుటుంగర మొసఁగుటయు, నాతఁడు చంద్రికాసముచయమున లీలావతియున్న కేరికి వచ్చుటయు, భూసురపుంగవులు మంగళాశాసన శ్లోకంబులు చదివి వివాహముగావించుటయు వర్ణింపఁబడినది.

ఈ గ్రంథమునందలి విశేషము చోళదేశవర్ణనము, ఆనాటికి చోళదేశము తృణకాష్ఠ జలసమృద్ధమై, అగ్రహార దేవళముల సంయుక్తమై యెట్లలరారినదో కవి మన కన్నులకుఁ గట్టినట్లు చక్కఁగ నిరూపించినాఁడు.

తాను విజయరాఘవ పట్టంపుఁ గవినని కవిచెప్పుకొన్నాఁడు. ఈనాటకములోని కథావిధానము కేవల విజయరాఘవునియొక్క ప్రీతిని సంపాదించుటకొఱకే కల్పింపఁబడినదనుట స్పష్టము. విజయరాఘవుని శృంగారలీలలను వర్ణించునట్టి యితర యక్షగానములు నీరీతినేయున్నవి. కథ, వర్ణనము,

రసము, సన్నివేశములతీరు నన్నియు నొకదానినొకటి పోలి యున్నవే, ఆనాఁటి యభిరుచులు, రాజాస్థానముసందలి జీవితము మున్నగునవి వీనినిబట్టి స్పష్టముగా నూహింపవచ్చును.

ఇందు "ఆసమయంబున లీలావతీ విజయరాఘవులు మంగళంబుపాడుచు నటియించిరట యెటువలెను. మన్నారు దేవికి మంగళం" అని యొకవాక్యము గలదు. ఇది రంగమున నెట్లుప్రదర్శింపఁబడునో యూహ్యము.

ఈగ్రంథరచనాకాలము క్రీ. శ. 1633–73 నడుమనై యుండవలయును.

# విజయరాఘవ కల్యాణము

## ఉ పో ద్ఘా త ము.

---

విజయరాఘవుని యాస్థానకవులలో నొకఁడగు కోనేటి దీక్షితచంద్రుఁడు ఏతద్గ్రంథకర్త. ఈతఁడు తన్నుగూర్చి "రామానుజాచార్యతనయాగ్రగణ్యుఁడ" నని చెప్పుకొనుటచే వైష్ణవుఁడేగాని స్మార్తుఁడు కాఁడని తోఁచుచున్నది. ఇంతియ గాక యితఁడు "గురురాజశతక్రతు శ్రీనివాసదేశిక ప్రతిష్ఠాపి తోపాధ్యాయవైభవ ధుర్యుండు"నై యున్నాఁడు.

ఇతఁడు "శ్రీమదామ్రాయణోపదేశ సంతుష్టాంతరంగ విజయరాఘవభూపాల కృపాపాంగ వీక్షణానుక్షణప్రాప్తసారా గ్రహార తారహారచిరత్న రత్నకంకణోదార తారానురూప ముక్తాకలాప హృద్యతర బిరుదవాద్య నానావాహనాది సమ్మాన నీయ, శాశ్వతైశ్వర్యధుర్యుండ" నని చెప్పుకొనెను. తనగ్రంథ మును మహానాటకమని పేర్కొనెను. ఇందలి రాజవివాహము సౌమ్యనామసంవత్సర ఉత్తరాయణ వైశాఖమాస శుక్లపక్ష మందు జరిగినట్లువ్రాసెను. ఇది క్రీ.శ. 1669 వ సం॥రం ఏప్రిల్ 21 వ తేది మొదలు మే 7 వ తేదిలోగా నుండు దిన ములకు సరిపడుచున్నది. అనఁగా హేమాబ్జనాయికా స్వయం వరములో చెప్పిన కాలమునకు ఒక మాసముతరువాత.

ఇందలికథ:- తంజాపురవర్ణనము, విజయరాఘవుఁడు శ్రీరామసౌధమునఁ గొలువుండుట, జవ్వనుల సంగీతము, పదకేళిక, అన్నగారులువచ్చుట, చెంచులువచ్చి ఆటవికవస్తువులు కానుకలుపెట్టి విన్నపముసేయుట. ఇందు చెంచులవర్ణనము, వారివేషములు, వారిభాష, స్వభావోక్తులున్నది. తరువాత గొల్లలు వత్తురు. "మీరువచ్చిన కార్యమేమి" యని నాయని వారుకోరఁగా వేఁటకొలకు రమ్మని ప్రార్థింతురు. రాజమార్గంబుననుండి వేఁటకుబయలుదేరుఁగా, రాజునుజూచి పౌరకాంతలు శృంగారము నటించుట, వనవర్ణనము, వేటవర్ణనము, చెంచుల పాటలు, పంబవాఁడువచ్చి ధర్మరాజునకు శివము రప్పించుట, చాకలిమల్లుగాని గాడిద యేడఁబోయినదని యితని నడుగుట, విజయరాఘవుఁడు సంపంగితోఁటలో విహరించుట, ఆవనమునకు మదనమంజరియను రాజపుత్రి వాహ్యాళివచ్చుట, చెలికత్తెలతో సల్లాపము, వారిజలకేళి, తరువాత వారొక సురపొన్నతరువుఁజేరి విశ్రమించుట, అంత నొకయింతివచ్చి మన్ననారులు నుతులనంటిమగనిని బెండ్లియాడుటకై మన్మథునిఁ బూజింపుమని చెప్పుట, మన్మథపూజ, కందర్పనామములతోడి యర్చన, అట్లు తాను పూజ సమాప్తమొనరించుకొని పోవుతఱి విజయరాఘవునిజూచి మన్మథుఁడని భ్రాంతిచెంది ప్రేమించుట, విజయరాఘవుండును ఆమెనుజూచి విరాళిగొనుట, తరువాత నెవరియిండ్లకువారుపోవుట, మదనమంజరివిరహవర్ణనము, నెచ్చెలులోదార్చుట, ఇందు కందర్పమందానిలాదుల నిందించుట, శైత్యోపచారములు, కనకాంగియను నొకనెచ్చెలివిజయరాఘవు

సముఖంబునకు దౌత్యముసేయఁ బోవుట, ఆసమయమున విజయరాఘవుఁడు వైష్ణవార్చనంబుచేసి రామాయణశ్రవణంబు గావించుట, విద్వాంసులయాశీర్వాదము, తెనుఁగువిద్వాంసులు నరవవిద్వాంసులు విద్యాపరిసంగములు సేయుట, శ్లోకములు చెప్పుట, అందుఁదోషములు నిరూపించుట, వ్యాకరణశాస్త్ర విషయికమైన వివాదము, సమస్యాపూరణము, ప్రాకృతములోఁ గవిత్వము, మాగధిపైశాచి చూళికాపైశాచి, యపభ్రంశ భాషలయందు సమస్యాపూరణము, కవిత్వము, శాస్త్రపరిసంగము, పండితులవాగ్వాదము, కవులు పద్యములు చదువుట, విద్వాంసులను గౌరవించుట, తరువాత నంతఃపురప్రవేశముచేసి భోజనమైనవెనుక కనకాంగివచ్చి, తనచెలిపడుబాధనువర్ణించుట, అదివిని యాతఁడును దనబాధను దెల్పుకొనుట,తరువాత మదనమంజరియింటికి చెంగమ్మ యెఱుకతవేషమున వచ్చుట, యెఱుకతనర్తనము, ఎఱుకచెప్పుట. విజయరాఘవునే తప్పక వివాహమాడుదువని చెప్పిన యామెమాటలకు సంతసించుట, మదనమంజరి మదనబాధ నటించుచుండ కనకాంగి తిరిగివచ్చుట, కనకాంగిచెప్పినవార్త విని యామె సంతసించుటయునైనతరువాత విజయరాఘవనాయకుని విరహతాపము, గురువైన శ్రీనివాసదేశికుఁడువచ్చి యాతనిస్థితి తెలిసికొని "నిజనందనుని మేను కరారవిందమున నిమిరి" యొకకథచెప్పెను.

పూర్వమున కుంభుఁడనువాఁడు తన ప్రియపుత్రిని మన్ననారనసతఁడు వివాహముచేసికొనఁగా నామె యాతని యష్టమహిషులలో సమముగా గౌరవింపవలసినదని కోరెను.

ఆతఁడు ఇదితగదు, కలియుగమున నేను విజయరాఘవనాయ కుఁడనై పుట్టుదును. నీవు కళానిధియను రాజునకు మదనమంజరి యనుపేర జన్మింతువు. అపుడు నిన్ను తృప్తిపఱచెదను" అని చెప్పెను.

ఇట్లుచెప్పి ఆయన కళానిధిగృహంబునకేఁగి యాతని నడిగి వివాహమునిశ్చయించును. తరువాత పురోహితులు వచ్చుట, ముత్తైదువలు కొట్నంబులు దంచుట, ఎదురుసేసలు చల్లుచు పెళ్ళివారువచ్చుట, వివాహము, మదనమంజరి సకల విద్యాప్రవీణురాలుగనుక పదకేళికవినిపించుటతో గ్రంథము సమాప్తమగును.

కవి తన్నుగూర్చి "ప్రతిపక్ష కవిశిక్షణ విచక్షణుండును సకలసద్గుణ సాంద్రుండును నగు కోనేటిదీక్షితచంద్రుఁడు" అని చెప్పుకొనెను.

ఈ యక్షగానము విజయరాఘవుని యాస్థానమున వెలసిన యితర యక్షగానములవలెనే యున్నది. పద్యప్రబంధ ములయందలి కథావిధానము, వర్ణనలు, శృంగారము నిందు వర్ణింపఁబడినవి. కథానిర్మాణచాతురి లేదు. దరువులు, ఏలలు, సువ్వాలలు మొదలగువానితో నృత్యము వేషము,కూడిన రచ నయే దృశ్యముగా నిరూపింపఁబడినది. విజయరాఘవుని శృం గార వర్ణనము, ఆతని మహిమను పొగడుట, రాజగురువైన శ్రీనివాసతాతయాచార్యుల నర్గించుటయు నిందలి ప్రధాన విషయము.

# తంజాపురాన్నదాన మహానాటకము

## ఉపోద్ఘాతము.

ఈగ్రంథముపేరు తంజాపురాన్నదాన మహానాటకము. దీనికే సత్రమరులు నాటకమని మరియొకపేరు. దీనికర్త పురుషోత్తమదీక్షితుడు. ఇతడు విజయరాఘవుని కాలముననుండిన కవియనియు, ఈగ్రంథము విజయరాఘవాంకితమనియు నిందే వ్రాయఁబడియున్నది. కవి యీగ్రంథము వ్రాయుటకు విజయరాఘవుని అనవరతశతలక్షవిప్రాభీష్ట మృష్టాన్నప్రదాతృత్వము వలనఁ గలిగిన హర్షమే కారణమని తెలియుచున్నది. కవి మతము ననుసరించి యిది శృంగార హాస్యాద్భుత రసప్రధానము. ఇందులో కరణముచెప్పిన లెక్కల ననుసరించి దీని రచనాకాలము కీలకవర్షం పంగునిమాసం పండ్రెండవతేదియని తెలియుచున్నది. వీనినిబట్టి విజయరాఘవుని పరిపాలనకాలములో కీలకసంవత్సరము క్రీ.శ. 1618. అనగా ఈగ్రంథము 1618 తరువాత 1673 లోపల వ్రాయబడియుండవచ్చు.

కథాసారము:–తంజావూరి సత్రమున నెల్లూరి యెల్లమరాజు అధికారిగా నుండగా అనేక బ్రాహ్మణులు ప్రతిదినమును

వచ్చి భుజించి వెళ్ళుచుండిరి. అక్కడి కరణములు మొదలైన వారువచ్చి యాతనివద్ద లెక్కలుచెప్పు క్రమము, వంటవాండ్రు మొదలగువారువచ్చి సేవచేసేవిధము ఇందు వర్ణింపబడినవి. పప్పుతిప్పాభట్లు అను బ్రాహ్మణుడు భార్య కుమారులతో సత్రమునకువచ్చి భుజించి, తుదకు భోగముబోటుల పొందు గోని వెళ్ళుట యిందలి ప్రధానకథాంశము.

ఇందలి పాత్రలును సన్నివేశములును కల్పితములే యైనను, ఆనాటి తంజావూరి సత్రములోని పద్ధతులను, అనాథ ఆగంతుక బ్రాహ్మణుల జీవనవిధానమును, వారియాశలు మొదలగువానిని కొంత అతిశయముగాచేసి, హాస్యరసపోషకముగా వ్రాయుట కేర్పడినవి.

దీనినిబట్టి తెలియువిషయములు:- బ్రాహ్మణబ్రువులు కొందరు విద్యాదూరులయ్యును యజ్ఞోపవీతధారణ మాత్రము చేతనే అచ్చట భోజనముచేయుచుండెడివారని తెలియుచున్నది "మనయేలికవారు బ్రాహ్మణ్యాప్రభువులు. అన్నదానాదులసత్కీర్తి కొదవవచ్చిన తాళరు. తంతుమాత్రపువాడైనా తంజావూరి ఉపవాసముండరాదు" "మాయేలినవారు బ్రాహ్మణ్యప్రభువులు, గనుక మేము బ్రాహ్మలపరీక్షింపరాదు. నీవు ఎట్లున్నా పూజ్యుడవే. అటుగనుక సకలమైనవారున్నూ పసాపడవిచ్చేయరయ్యా." అని యధికారి చెప్పుచున్నాడు.

(2) అక్కడికివచ్చిన తిప్పాభట్లు మొదలగుబ్రాహ్మణులు వేదము చెప్పుమన్నపుడు "కోశం దక్షిణః పక్షః కుప్పఉత్తరః

పక్షః నులుపెశాంతం తూర్వ్యేక్షుశ్లోకోభవతి గంపంనింపయతి"
అని వేదమును,

(3) "భరణి పెట్టెలోను మేషం మేకలమందయందును"
అని జ్యోతిషశాస్త్రమును వచ్చినట్లు పఠించుటనుబట్టి వారి
యజ్ఞత తెలియుచున్నది.

(4) వీరి స్నానసిష్ఠాదులు, తిప్పాభట్లు తన స్నానమును
గూర్చి తనభార్యతోను కుమారునితోను చేసిన ప్రసంగమును
బట్టి తెలియుచున్నవి.

(5) కొందరు బ్రాహ్మణులను పిలవగా తానే ఆయా
బ్రాహ్మణుడనని చెప్పుకొని తిప్పాభట్లు భోజనమునకు సిద్ధమ
గుటనుబట్టి ఆయాబ్రాహ్మణుల సత్యదీక్ష తెలియుచున్నది.

(6) ఈ తిప్పాభట్లకును ఆతని పెళ్ళాము బిడ్డలకును జరి
గిన సంభాషణనుబట్టి వారి కుటుంబపరిస్థితులు నాగరికత మొద
లైన విషయములు తెలియవచ్చును.

(7) సత్రములో భోగాలవారు చుక్కలరంగసాని వెంగ
సాని మొదలైనవారి వర్ణన చూడగా ఆకాలమున తంజావూ
రులో సామాన్యులనేకు లుండిరనియు, అట్టివారు సత్రమధికారి
నాశ్రయించుచుండిరనియు తెలియుచున్నది.

(8) ఆనాడు లెక్కలువేసెడి కరిణములు సరిగాలెక్కలు
వ్రాయకయు, వ్రాసినవి సమయమునకు చూపింపకయు, తప్పు
లెక్కలువ్రాసి వస్తువులను హరించుచుండినట్లును దీనినిబట్టి
గ్రహింపవచ్చును.

(9) వైదికబ్రాహ్మణుల శృంగారభావమును ఇందు తెలిసికొనవచ్చును.

(10) తంజావూరి గ్రంథములనుబట్టి సామాన్యముగా కరణములు కనకపిళ్ళలు అరవవారే యుండెడివారట.

(11) "అడతిప్పాభట్ట! నీ తెలిగేంది! యేదో కొరళినాల్ ఎనక్కు తెరియుమొ" అని యరవవాడనుటయు,

తిప్పాభట్లు, "అరవవాడేమిచ్చెని" అనుటచేతను అచ్చట నుండెడి తెనుగువారికిని అరవవారికిని అప్పుడప్పుడు చిన్నచిన్న వివాదములు వచ్చుచుండిన ట్లూహింపవచ్చును.

(12) ఆనాటి సత్రములో ఊరుగాయలు, ఊరుబిండ్లు, వేపుడుగూరలు, తాళదాలు, పిండిమిరియములు, పుల్లగూరలు, పప్పు, పాయసము, కజ్జాయలు మొదలైన పదార్థములు బ్రాహ్మణులకు వడ్డించెడివారనియు, వారు భోజనముచేసినతరువాత తాంబూలాదు లిచ్చెడివారనియు,

"ఇషువలె మృష్టాన్నముగా సత్రముపెట్టేరాజును కాశీరామేశ్వర పర్యంతములో ఎక్కడనైనాచూస్తిమా! సన్నబియ్యమన్నమేంది! కందిపప్పేంది! దొన్నెకొద్దీ నెయ్యేంది! పచ్చిడేసికూరలేంది! వలసినంత పరమాన్నమేంది! వడలేంది! అతిరసాలేంది ! మీగడపెరుగేంది!" అను తిప్పాభట్లు స్తోత్రమునుబట్టి తెలియుచున్నది.

(13) ఆనాటి వైదికుల వస్త్రాభరణములు, మాటల తీరు, వారప్పుడప్పుడు పట్టునటువంటి హీనమైనదానములు మొదలైనవియు ఇందు అచ్చటచ్చట వర్ణింపబడినవి.

రసవిషయము:— "శృంగార హాస్యాద్భుత రసప్రధానముగా నొనర్చెద" నని కవి చెప్పుకొన్నాఁడు. ఇందలి శృంగారము, తుదిని తిప్పాభట్లు మన్మథుఁడై వెంగసానితో నృత్యము సేయుట, అంతకుముం దీసానులతో నృత్యముసేయుట. అను సందర్భమున నుద్దేశింపఁబడినది. శృంగారశబ్దముచేత రసము, రసాభాసము మొదలైనవన్నియును వాచ్యములేగనుక, ఇందు కొంతశృంగారచ్ఛాయ లేకపోలేదు. ఉత్తమనాయికా నాయకనిష్ఠమై ఔచిత్యపరిపుష్టమై రసికులకిష్టమైన ఉత్తమ శృంగారరసము ఇందు పుష్టినందెనా యని ప్రశ్నించుకొనువారికి ఆశాభంగము కలుగకతప్పదు. ఇందలి శృంగారసందర్భము పాఠకులకు ఎంతవరకు నానందముకలుగఁజేయు ననునదియే ప్రశ్న. ఇది హాస్యమునకు పరిపోషకముగా నుండుటచే పాఠకులలో కొందరికైనను సంతుష్టిని గలిగించును.

ఇఁక, "అద్భుతరసము ఏసందర్భమున కవి వెలయించెను?" అనునొక ప్రశ్న వేసికొనకతప్పదు. ప్రాయశః తిప్పాభట్లు మన్మథుఁడై నటియించిన సందర్భమనవలె. అదియును అంతసరిగాలేదు. పైగా నిందు హాస్యమే ప్రధానముగా కన్పట్టుచున్నది. వైదికబ్రాహ్మణు లాలంబముగా వారియజ్ఞత-

వారి భోజనప్రీతి, రాజుగారి సూదార్యమువలని పరిస్థితి మొద లైనవి యుద్దీపనములుగా హాస్యరసము పోషింపబడినది.

ఇందలి యనౌచిత్యములు:— ఇందు కొంత మోటు హాస్యము. గ్రామ్యప్రయోగ, అనాగరికుల యజ్ఞత, అచ్చటచ్చట కొన్ని అసభ్యపు అభ్యాసములు మొదలైనవి కన్పించుచున్నవి. ఇట్టివానిలో కొన్నిటినైనను కొందరు సహృదయులు ఇష్టపడరు. అందుకుకారణము లేకపోలేదు. కాని యీతీరు వాఙ్మయమును విమర్శింపవలసివచ్చినప్పుడు మనము జ్ఞాపకముంచుకొన వలసిన విషయమొకటికలదు.

నేటి వీధిభాగవతములలోను యక్షగానములలోను పామరజనరంజకముగా నుండుటకై కొన్ని అసభ్యపదములు చేర్పఁబడుచువచ్చుచున్నవి. అవి యొకతరగతిజనుల ప్రశంసింపఁ బడినవి. అట్టివారు గ్రామ్యపరిహాసమును సేవింతురు. వారికది యభిలషితమే. కాని మంచియభిరుచిగల్గిన సరసుల యున్న విమర్శకులకు నిది రుచింపదు. ఇట్టి ఆంధ్రప్రబంధ వాఙ్మయములోని అనేకములైన రతివర్ణనఘట్టములు సుకు మారమైన శృంగారరసమును ఆస్వాదించువారికి ఇష్టములుకాకపో వచ్చును. "భిన్నరుచిర్హి లోకః" అని యాప్తుల నానుడి.

ఈగ్రంథము ఈతీరునే రాజాస్థానమున ప్రదర్శింపఁబడి నదా? రాజుగారామోదించిరా? పండితలోకము నిరసనవహించెనా? అను ప్రశ్నలకు సమాధాన మూహ్యము.

# విజయరాఘవచంద్రికా విహారము



కామరుసు - వెంకటపతిసోమయాజి

# విజయరాఘవచంద్రికా విహారము



శ్రీరాజగోపాల కరుణాకటాక్ష వీక్షాలబ్ధ విశ్వవిశ్వంభరా, శాశ్వతైశ్వర్యధుర్యా, నేపాళ భూపాల స్థాపనాచార్యా, సకల సామంతరాజన్యకోటి కోటీర కోటిరమణీయ చిరత్నరత్న సూత్నప్రభారాజినీరాజనా, రారాజదరుణచరణాంబుజ, చండ మార్తాండమండల సముద్దండ నిజభుజ తేజ, చినచెవ్వ నృపాలాన్వయకలశజలధిసంపూర్ణ పూర్ణిమాసుధాకర, పాండ్య తుండీరాది సమదవిరోధియోధయూధభీకర, సరసకలా విలాసనిస్తంద్ర, సత్యభాషాహరిశ్చంద్ర, కళావత్యంబికా గర్భశుక్తి కాముక్తికాకార, సారఘనసారహారహీరమందార కుందేందుతుందిలకీర్తివిహార, నిఖిలనాటకచాటుకావ్య నవ్య ప్రబంధ నిబంధన లీలాధురంధర, నృపతికుల గంధసింధుర, సాహిత్యసంగీత భంగీ తరంగీకృత విజ్ఞానసాంద్ర, సంతత విభవ దేవేంద్ర, చోళసామ్రాజ్యసింహాసనసునాసీర, భువనైక వీరాధివీర, రఘునాథ భూపాలకుమార, రత్నాకరగభీర, రత్న సానుధీర, రమణీరమణీయాకార, విమలకల్యాణగుణశీల విద్వజ్జనవిలోల, విదళితరిపుజాల, విజయరాఘవభూపాల, పరాకు॥..........................సార్వభౌముండనై పద్య గద్య విద్యాభిరాముండనై, అభినవనాటక చాటుకావ్య కల్పనా

చణుండవై అశేషభాషామనీషావిశేషగుణగ్రాహివై మీయు నిన్ను వచనకుసుమంబులఁ బూజింపఁగోరెదఁగాని పారిజాతంబునకుఁ గుసుమగుచ్ఛం బొసంగు తెఱంగున, పర్జన్యునకు జలకలశంబు సమర్పించు చెలువున, బంగారు గుబ్బలికి బచ్చపైకమిచ్చువిధంబున, రత్నాకరునకు రత్నశకలంబు కానుకసేయుసోయగంబున, బహువిధ ప్రబంధ నిబంధ లీలాధురంధరుండవైన నీకుఁ బ్రబంధంబొసంగి మెప్పించెదనని యెంచినవాఁడఁ గానని విన్నవించి, యిన్నరలోక పాకశాసన కృపాపరిపాకసామరస్యంబు వడసిన కామరుసు వెంకటపతి సోమయాజి విజయరాఘవచంద్రుని చంద్రికావిహార శృంగార లీలావిలాసంబు వక్కాణించి విజయరాఘవచంద్రికా విహారంబను పేరహావణించి, కవిసింహ జిహ్వారంగ శృంగాటకంబులఘాటి సల్పు భారతి ఘోటకంబుగా, శృంగార రసవర్షావిర్భావంబునకు గర్భోటకంబుగా నొకనాటకంబు నిర్వహింపఁ బూని తన యిష్టదేవతయైన రాఘవస్వామియే విజయరాఘవస్వామి గనుక నతనిఁ బ్రార్థించి నాందీశుభాచారం బాచరించెనఁట యెటులనెను.

దII మధ్యమావతి II ఆది II

శ్రీరాజగోపాల సేవాలోల మ్రొక్కేను మ్రొక్కేనయా
నారీపాంచాల వైరి విభాళ మ్రొక్కేను మ్రొక్కేనయా ॥౧॥
భుజ విక్రమాధార భోజావతార మ్రొక్కేను మ్రొక్కేనయా
విజయ రాఘవధీర వీరాధివీర మ్రొక్కేను మ్రొక్కేనయా ॥ ౨॥

రతిరాజ మోహనాకార రఘునాథకుమార మ్రొక్కేను
మ్రొక్కేనయా ।

వితరణకర్ణావతార విజయరాఘవధీర మ్రొక్కేను మ్రొక్కే
నయా ॥3॥

తంజాపురవాస కందర్పవిలాస మ్రొక్కేను మ్రొక్కేనయా
మంజుల మందహాస మన్నారుదాస మ్రొక్కేను మ్రొక్కే
నయా ॥౪॥

వ. అని కొనియాడి యతని యిష్టదేవతయైన రాజగోపాల హేమారవిందేందిరావిష్వక్సేనులఁ బ్రార్థించెనఁట యెటువలెను.

పదము॥ శంకరాభరణము॥ రూపకము॥

శ్రీరాజగోపాల శౌరిని శిశుపాల భూపాలవైరిని।
పారిజాతాపహారిని నే భావింతు లోకోపకారిని ॥౧।

రసదాడి సింగాణి వీరునిగన్న రాధామోహనాకారుని।
వసుదేవకుమారుని నేవర్ణింతు చెండలంకారుని॥౨॥

భజియింతు భక్తులఁబాయని
పరమదయా ధౌరేయుని।
విజయరాఘవనాయని యిల్లు
విడువని వేలుపురాయుని ॥3॥

మున్నీటిమన్నీని దేవిని చాల
మూర్తీభవించిన తావిని।

మన్నారు పట్టంపుదేవిని
మదిలోన భావింతు శీవిని ॥౪॥
వరువంపు మరువంపు రెమ్మకు
పదివన్నె బంగారు బొమ్మకు!
మురహైరి ముద్దుల గుమ్మకు నే
మ్రొక్కెను మా చెంగమ్మకు ॥౫॥
భావంబులోఁ జింత తీఱను
పరమానందంబు సేరను।
సేవింతు నే సొంపుమీఱను
శ్రీచెంగమల నాంచారను ॥౬॥
మురవైరి కే లెడఁబాయని
ముదుటుంగరముగొన్న రాయని
హరి వాకిటదళవాయిని
నర్చింతునేఁ జేదోయిని ॥౭॥

వ. అని యిష్టదేవతలఁ బ్రార్థించి విజయరాఘవ పట్టభద్రుని పట్టంపుఁగవి తత్కథాసంఘటనంబునకు మొదలఁ గనుపట్టు పట్టణం బేమని వర్ణించుచున్నాఁడు.

పదము॥ సౌరాష్ట్రము॥ ఆటతాళము॥

కవులెంతురు చోళదేశము కావేరి వారిప్రకాశము।
నవరత్నములున్న కోశము సురనాయక రాజ్యసంకాశము ॥౧॥
చెఱకు రాజనంపుఁబైరులు కాఁపుసేమము గలిగిన యూరులు।
తిరముగాఁ బ్రవహించు నేరులు చోళదేశమున వెయ్యారులు॥౨॥

ఆరాజ్యరమకు మంజీరము ఆయమరావతికన్న సారము!
భూరమణీమణిహారము తంజపురము సంపదలకొటారము ॥3॥

నవరత్నంబుల పేటలు దివ్యనారి కేళంబులంకోటలు।
నవరణచేసిన కోటలు విటసరసులు నూటారుకోటులు ॥౪॥

వలరాయని మీఁద నేలలు చాల వర్ణింప నేర్చినబాలలు॥
విలసిల్ల నాటకశాలలునందు వింత వింతలు కృష్ణలీలలు ॥౫॥
పరుల గెల్చినపోఁజులు మెచ్చఁబాలింతురు దినరోజులు
సరిలేని విద్యాభోజులు వీట సడిసన్న రాజాధిరాజులు ॥౬॥

వ. ఆరాజధానికి రాజై రాజిల్లు రాజచంద్రుని నతనిపట్టంపుఁ గవి యేమని కొనియాడుచున్నాఁడు.

ది. శ్రీరాజగోపాల సేవచేఁ జాల
బేరుగాంచిన శేఁడు బిరుదుమన్నీఁడు,
లక్షణాన్వితుఁడు కళావతీసుతుఁడు
దాక్షిణ్యశాలి యుత్తమరాజమౌళి,
రణముల జగజెట్టి రఘునాథుపట్టి
గుణరత్నములదీవి గురుజనసేవి
బహుదానపరుఁడు భూపాలశేఖరుఁడు
సహజకీర్తిస్ఫూర్తి సర్వజ్ఞమూర్తి
రతులకు రతిరాజు రాజులరాజు
వితరణగుణహారి విభవ జంభారి

జగదుపకారి వైష్ణవ మతోద్ధారి
తగవుల వీడు చింతామణిజోడు
నీతికి మాంధాత నియమసంధాత
జాతివార్తలమేటి శౌర్యకిరీటి
సరసుండు నెఱజాణ చక్కనివాఁడు
పరమవైష్ణవుల చేపట్టు కుంచంబు
బాహువిక్రమశాలి భరతకోవిదుఁడు
సాహిత్య భోజుండు సంగీతవేది
కోరినవారికిఁ గొంగుబంగారు
చేరువమేరు వాశ్రితవర్గమునకు.
పేదలపాలిటి పెన్నిధానంబు
వేదకోవిదులకు వెలలేనిసొమ్ము
పలికిబొంకనిరాజు పరమవివేకి
నిలుకడ గలవాఁడు నిత్యాన్నదాత.
పట్టభద్రుండు కృపాసముద్రుండు
చుట్టాల సురభి రాజులమేలుబంతి
వర శరణాగత వజ్రపంజరుఁడు
నరుల పాలింటి పున్నమచందమామ
యేకవీరుఁడు జగదేకవదాన్యుఁ
డాకార మన్మథుం డసమసాహసుఁడు
మానినీ నూతన మకరకేతనుఁడు

భానుసమానుఁడు పరతత్త్వవేది
అనుమానమునఁ దేలి యౌవనమాలి
చనవరియిల్లాలి చనుఁబ్రాలుఁగ్రోలి
పెరిగినయన్న గోభిలమానికన్నఁ
బరతత్త్వ రుచిగన్న ప్రాయంపుమిన్న
విజయరాఘవ శౌరి విద్యావిహారి
భుజబల కంసారి పూర్ణసంహారి
అన్నిట నవధాని యారాజధాని
మన్ననఁ [illegible] నేలు మహిమలమేలు.

వ. అని మఱియు నతని హారువులు దరువుల వర్ణించెనఁట యెటువలెను.

ఎఱుకల కాంభోజి॥ ఆటతాళము॥

నారీమదనవిలాసుఁడు వాఁడు, నన్నేలు మన్నారుదాసుఁడు।
వీరులలో నెల్ల వీరుఁడు మా, విజయరాఘవ ధీరుఁడు ॥౧॥
రాజుల గెల్చిన శూరుఁడు వాఁడు, రాజగోపాలకుమారుఁడు।
రాజిత శుభచారిత్రుఁడు, రక్తాబ్జవల్లిపుత్రుఁడు ॥౨॥
రతిరాజమోహనాకారుఁడు వాఁడు, రఘునాథవిభుని కుమారుఁడు।
వితరణ కర్ణావతారుఁడు మా - విజయరాఘవ ధీరుఁడు ॥3॥

చక్రిహస్తుని పాటిసేయరుఁడు వాఁడు – జగదేక మోహనా
కారుఁడు ।

విక్రమార్కావతారుఁడు మా – విజయరాఘవధీరుఁడు ॥౪॥

చిన్ననాఁడే పరుల గెల్చెను రత్న – సింహాసనంబున నిల్చెను
మన్నారుదేవునిఁ గొల్చెను వాఁడు – మన్నె దేవేంద్రుఁడై
వెలసెను ॥౫॥

వ. ఇవ్విధంబున విశ్వవిశ్వంభరా సామ్రాజ్యధారియై విజిత వైరియై విద్వజ్జనోపకారియై విభవజంభారియై విజృంభించు విజయరాఘవశౌరి యొకనాఁటి రేయి పాదచారియై చంద్రికా విహారియై కొందఱు నారీరత్నంబులుగొలువఁ జెలువుమీఱి నిజరాజధానిలో సానికూఁతులఁ గేరి దారిగా వచ్చెనఁట యెట్టు వలెను.

కేదారగౌళ॥ ఆటతాళము॥

కొలువు సింగారమై కులశైలధీరుండు
కోటి మన్మథాకారుండు
వెలఁదులు గొలువంగ విజయరాఘవేంద్రుఁడు
వీధి వెంట వచ్చెను ॥౧॥

బంగారు చెఱఁగులపై తాణెదుప్పటి
చుంగులు జీఱాడఁగా
పొంగుచుఁ బౌరులు పురసౌధవీధులఁ
బొంచిపొంచి చూడఁగా ॥౨॥

పదనుగా నలఁదిన పైగోవ జవ్వాది
పరిమళములు మించఁగా।
ముదురకెంపులతాళి ముత్యాలపేరుల
మురువులు రాణించఁగా ॥3॥

జవ్వను లెదుటను సంగీతమేళంబు
జతనేసికొని పాడఁగా ।
దవ్వు దవ్వులనిల్చి తగునైన దొరలెల్ల
తనవెంట నడయాడఁగా ॥ర॥

కృష్ణధ్యానశ్లోకము :-

భువన భవసదీపం * * * *

వ. ఈరీతి వచ్చిన కుంభినీజంభారాతిని జూడఁగోరి పౌర కాంతలు సౌధాంతరంబుల నిల్చి చూచిరఁట యెటువలెను.

దరువు॥ మోహన॥ ఆదితాళము॥

బంగారు మిద్దెలమీఁదఁ బౌరకాంతలునిలిచి
శృంగారనాయకుని సేవించిరపుడు ॥౧॥

వా॥ ఇవ్విధంబున వచ్చిన జవ్వనులలోనొకపువ్వుఁ బోఁణి యవ్విభునిఁ జూచి యువ్విళ్ళూరుచుఁ జెలితో నేమను చున్నది.

ఎఱుకలకాంభోజి॥ ఆది॥ పల్లవి॥

సుదినమాయెనే యీపొద్దు సుదినమాయెనే। యీ
మదనావతారునిసేవ మనకుఁ గల్గెఁగా।

పొద్దున నిలువుటద్దము పొడగన్న ఫలము – ఇతని
ముద్దుమోము చూడఁగల్గె ముద్దులగుమ్మ ॥౧॥

ఈపొద్దు పూర్ణకుంభము లెదురైనఫలము – ఈ
భూపాలకుంజరు నేఁ బొడగంటినమ్మా ॥౨॥

ద్విజరాజులసేవించిన దివ్యశకునముచేత
విజయరాఘవశౌరిని వీధిలోఁ గంటి ॥౩॥

వ. ఆసమయంబున వేఱొకకోరకస్తని తనచెలినిఁజూచి యేమనుచున్నది.

పదము॥ ముఖారి॥ ఆటతాళము॥

చెఱకు వింటి రాయలో యీచెలువరాయలు।
చెఱకు వింటిరాయలైతే చెంగటనుండడా।
చెఱకు సింగాణి రా చిల్క-పటాణి ॥౧॥

పల్లవి। ఈరాజు రేరాజో రారాజో ।
ఆరాజులకీ రాజు తీరు గల్గనేర్చునా॥
పంకజనాభుండో యీ పట్టభద్రుండు
పంకజనాభుండైతే పజ్జనె యుండడా
పొంకమైన గుడుసుకత్తి పులుఁగు మదహత్తి ॥౨॥

దేవేంద్రుఁడో యీరాజ దేవేంద్రుఁడు
దేవేంద్రుఁడైతే యిందుఁ దావుకొనియుండఁడా
దేవతల దుముదారు తెరగన్నులబారు ||౩||

వ. మఱియొక యుత్తమాంగన యుత్తమామల మఱుంగుసఁదిరుగు మెఱుంగుఁబోఁణి గనుక తన కన్నులకఱవుదీఱ ఆజగన్మోహనాకారునిజూడనోడి యొక ప్రౌఢచేడియఁగో నాడుకొనె నఁట యెటువలెను.

కాంభోజి॥ రూపకము।

వేడుకైనఁ జూడఁగూడదు వింతవారిని నా
గోడికోడలు నన్ను తొంగిచూడనియ్యదు
పాడిదప్పి మగఁడుమిగుల పగచాటును ఈ
మేడమీఁదికి వచ్చేనంటే మెదలనియ్యఁడు ||౧||

వంచనచేసి యితనిజూడ వచ్చేనంటేను
పొంచియుండు మఱఁది యిరుగుపొరుగుపంచల।
పంచశరుని మించిన యీపట్టభద్రుని
ఇంచుకసేపు చూడఁ గూడదేమిసేతును ||౨||

అట్టిచేతఁ గోరుమిగుల నధికమాయెను
కట్టిమీఁదిసొమ్ము నాకుఁ గడురాదుగా।
బట్టిగో విజయరాఘవ పార్థివేంద్రుని నేఁడు
కొత్తగాఁ జూచినవారు కోటిసేయుదా ||౩||

వా. వెండియుఁ గొండొకసారి యంపుఁగోమలి కుసుమకోదండ దీక్షాగురుండు చండకాండంబులచెండు బెండాడనోర్వఁజాలక యామండలాధీశ్వరునిజూచి సుండాడుకొనెనఁట యెటువలెను.

పదము॥ ఘంటారవము॥ ఆది॥

నగరువెడలివచ్చి నీవు నామనసు లాగించుకమగిడిపోతే
నేమిసేతురా । విజయరాఘవ
తగవరి వౌదువు మేలురా ॥౧॥

నీరూపు చూచినప్పుడె నిలువెల్లఁ బులకించి
నీరుగా నామనసు కరఁగెరా – విజయరాఘవ
చేరదీయ వేమి సేతురా ॥౨॥

తొలఁగిపోనిచ్చేనా నిన్ను దొరకైతేనేమాయె ।
కలనైనఁ గూడకమాననను – విజయరాఘవ
కలిసి నన్ను గారవింపరా ॥౩॥

వ. మఱియు నొక మించుఁబోణి యారూపపాంచాలునిఁజూచి మోహించి యేమనుచున్నది.

పదము॥ ముఖారి॥ ఆటతాళము॥

నడివీథిలోరానేల నీవు నన్నుజొక్కించి యీవేళ।
విడనాడిపోయేది మేలా యోరి –
విజయరాఘవ భూపాలా ॥౧॥

పచ్చవిల్తునిపాదమాన నీపక్కకు నేరాకమాన।
అచ్చకు డీకొంటేనేనా యోరి -
రాజగోపాల సమాన ॥౨॥

నీవెంట నే వచ్చేరా యోరి- నెనరుంచి నన్నేలుకోరా।
పూవింటిదొరవు నీవేరా-యోరి భువనైక వీరాధివీర ॥3॥

వా. ఆసమయంబున నాసార్వభౌమునిఁ జూచి కాముని బారికిఁ జిక్కి యొక్కజక్కవగుబ్బెతి తనవలపునిలుపఁజాలక కేళిసేయుబాలికలఁ దనవాలుఁగన్నుల గదుముచు నొక పదము పాడెనఁట యెటువలెను.

పదము॥ ముఖారి॥ రూపకము॥

కటకట యీరాజకందర్పుని నాకన్నులఁజూచినప్పుడె నా
బటువు గుబ్బలుబ్బి పట్టురవికెకీలు పటుక్కనవీడెఁగదే॥౧॥
కోమలి యితనిపైఁ గోరికదాఁచి నేగుట్టుననుండే నంటే
నామోహము మీఱి నల్వురునవ్వంగ నన్నింతసేసెఁ
గదే ॥౨॥

వలపుదాఁచి సరివారిలోన నన్నెవాసితో నుండేనంటే
నిలువెల్లఁబులకించి నెలఁతలుసూడ నావలపెల్ల బయ
లాయెఁగా।
గఱితలముందఱ గనిపించుకోక నేగరిమతో నుండేనంటే
కరఁగించి విజయరాఘవుఁడు నామేనికిఁ జెఱుచెమటలు
దెచ్చెఁగా ॥3॥

వా. ఆసమయంబున లీలావతియను బాలికారత్న మా భూపాలచూడామణిని జూడఁగోరి యొక మేడఁజేరి సోరణగండ్ల దారి నాదునేదారినిఁ జూచి యేమనుచున్నది.

పదము॥ కాంభోజి॥ ఆది॥

నాఁడు నాకలలోవచ్చి నమ్మికలిచ్చినవాని
నేఁడునేఁ జూడఁ గంటిఁగా ।
వేల్పులనెల్ల వేడుకొంటూ ఉంటిఁగా ।
యీకోరిక చేకూడునో కూడదో యంటిఁగా-ఇన్నాళ్లకు॥

పల్లవి॥ నోముఫలమీడేరెఁగా - ఇన్నాళ్ళకు నా
నోముఫల మీడేరెఁగా ।
ప్రేమతో విజయరాఘవ - స్వామిని జూచినప్పుడె
నోముఫలమీడేరెఁగా । ॥౧॥

నాఁటినుండి మట్టుమీఱి - నామోహము బయలుదేరి
పూటపూటకు హెచ్చెఁగా నాదేవుఁడే
నీటుకాని దోడి తెచ్చెఁగా - నేనాడుకొన్న
మాటలెల్ల సరివచ్చెఁగా - ఇన్నాళ్ళకు ॥౨॥

చిన్నప్పుడె యీతని నేఁ - జిత్రపటమునవ్రాసి
కన్నుల నొత్తుకొందుగా- కౌఁగిటఁగుచ్చి
చన్నులపై కెత్తుకొందుఁగా- వలరాచ
చిన్నలకే హత్తుకొందుఁగా ॥౩॥

వా॥ అంతట విజయరాఘవచంద్రుఁడు చంద్రికావిహారంబు గావించి, చిగురుఁబోండ్లతో తననగరుప్రవేశించెనట యెటు వలెను.

పదము॥ శంకరాభరణము॥ ఆది॥

విజయరాఘవశౌరి వేడుకమీఱ
నిజమందిరముఁ జేరి నెలఁతలఁగూడె

వా॥ అప్పుడా మిటారి చిగురుకటారి రాయలు తుటారింప సైరింపఁజాలక, దిగ్గున సెజ్జడిగ్గి, యొకచంద్రశాలఁ జేరి విజయ రాఘవశౌరిరూపంబు లిఖించిన చిత్రపటంబునఁ దనచూపులు హత్తించి యేమనుచున్నది.

పదము॥ఘంటారవము॥ఆది॥

మోహసాగరములో మునుఁగుచుఁ దేలుచు
దేహము తల్లడింపఁగా।
మోహనాకార నీ మోముఁజూడఁగఁ గొంత
ముచ్చటదీఱెఁ గదా ॥౧॥

పల్లవి॥ ఎన్నఁడు వచ్చేవో యెన్నఁడు మెచ్చేవో।
యెన్నఁడు కౌఁగిలించేవో।
వెన్నవైన నామనసు కరఁగేని యీవేళ
విజయరాఘవ భూపాల ॥౧॥

నిదురలో నొకనాఁడు నినుజూచినందుకే
నిలువునఁ గరఁగితిఁగా।
ఎదురుగావచ్చి నన్నెలయించి పోతేను నే
నేలాగు వేగింతురా ॥౨॥

వలపువక్కణజాబు వ్రాసియంపెదనంటె
వద్ద నెవ్వరు లేరుగా।
చెలులెల్ల నను గేలిసేసేవారేగాని
చేరఁదీసే వారుగారుగా ॥౩॥

వా॥ అని యా పూర్ణచంద్రవదన మదనవేదనా దోదూయమానమానసయై మఱియు నేమనుచున్నది.

ఏలపదము॥ కేదారగౌళ॥ మట్టెము॥

చిలుకరౌతు కనుమదాఁటె ఝళిపించె సంపంగియీఁటె
కలువతూపు నామీఁదనాటె విజయరాఘవ,
బలియించు నీకౌఁగిలికోట ॥౧॥

మరుఁడు నామజాదుచేసెఁ గరువలిపాళెము వేసె
బిరుదుకోయిల భేరిమ్రోసె విజయరాఘవ,
మెఱుఁగుఁజూపు పంపులంపరా ॥౨॥

చందమామ మింటఁబొంచె కెందమ్మితుపాకివంచె
నందు వెన్నెలమందునించె విజయరాఘవ, నీ
సందిటి చాటుకు వచ్చేరా ॥౩॥

అదిగో మరుని బారుచాలఁ గదలివచ్చెరా యీవేళ।
ఎదిరించి నేఁదాళఁజాలరా విజయరాఘవ,
ముద్దుటుంగరము పాలించరా ||౪||

జవ్వనంపు నీరునిండెఁ జనుగుబ్బల పంటపండె
దవ్వుదవ్వుల నన్నుంతురా విజయరాఘవ,
బువ్వంపువిందుకుఁ బిల్వరా ||౫||

వలపుమబ్బు బయలుదేరెఁ దలఁపుమెఱుపుఁదీఁగెపాఱె,
పులకపైరు మొలకదేరె విజయరాఘవ,
చలికప్పు నామీఁదఁ గప్పరా ||౬||

బావావిచేసికోరా నానద్దకుఁజేర రారా
మోవితేనె లంచమిచ్చేరా విజయరాఘవ,
ఈవేళ నన్నేఁచేది మేలా ? ||౭||

వలపుతావి గాలివీచె వయసుజాజిపూవుపూసె
బలుకోరిక మానుగాఁజేరె విజయరాఘవ,
వలరాయలు పొంచిచూచేరా ||౮||

వా|| అని మఱియు నేమనుచున్నది.

శంకరాభరణము||ఆది||

కటకట నేఁడునా గర్వమెందుఁబోయె
కందర్పుఁడే పిచ్చిబోయె।
ఎటువంటిదో యతని మొగమాయె
హేరాళమైన మోహమాయె|| ||౧||

వలరాయఁడైనఁ గల్వలరాయఁడైన
వానికి సరివచ్చేనా।
చెలియై పుట్టితే వానిసేవచేయవద్దా
చెల్లఁబోయా పుణ్యమువద్దా॥ ॥౨।
ఎవ్వరున్నారు నాకు నెనరైనవారు
ఈరాయబార మెట్లుదీరు।
జవ్వను లతనికి నాకొద్దివారా
సవతులఁ జేర నిచ్చేరా॥ ॥౩॥
అతనికౌఁగిలిచేతి[illegible]కందనిపండు
ఆసపడితే నెట్లాయుండు।
ఇతవైన చెలియను గానను నేను
ఎవతెను వేడుకొనేను॥ ॥౪॥
వానిని నేనేల వలచితినమ్మ
వాఁడొక జవరాలి సొమ్మా।
ఆనాయకుని పొందు లేనిజేటభామ
అది నోచిననోము నోమ॥ ॥౫॥

వా. అని యాచెలువరాజునికి వలవఁగానేమి ! పిలువఁగానేమి ! యామన్నె పున్నమచందమామ పొందిక చందమామ గుక్కిళ్ళుగాక యెక్కడికెక్కడ ! అతని సమాగమం బతిదుర్లభం బని వితర్కించి యేమనుచున్నది.

ఆహిరి॥ ఆది॥ పదము॥

సన్నంపుఁ జెఱువులో నున్న నీరుపాపకు
మున్నీటి నీటనుండే మురువు గలుగునా।
మన్నారు దాసుండు మగువలలోఁ గొలువున్న
చిన్ని నగరు చేరెదనంటే చేరశక్యమా ॥౧॥

అడవిలోని తేఁటికి నాకాశగంగనున్న
కడవన్నె తామరతావి గలుగ నేర్చునా।
అడియాస లింతేగాని యక్కటా నాకు వాని
విడి యంపుమోవి తేనె విందుగల్గునా ॥౨॥

సీమ గొల్లపడుచులకుఁ జిగురువిల్తుని గన్న
స్వామిచేతి వెన్నముద్ద చవులు గల్గునా।
ప్రేమతో నావంటిభామకు విజయరాఘవ
స్వామిపొత్తుల భోంచేసే చనవు గల్గునా ॥3॥

వా॥ ఇత్తెఱంగున వితర్కించి లీలావతి యొక హంసగమన యుంసభాగంబునఁ గరంబు హత్తించి చిత్తజశరవేదనాపరవశయై యున్న తెఱఁగెఱిఁగి చకోరికయను మెఱుఁగుఁబోఁడి యంతరంగంబుచెలి గనుక కనకాంగిపాలికిఁ గేళికారామంబు వెడలి వచ్చెనఁట యెటువలెను.

దరువు॥ సౌరాష్ట్రము॥ ఆటతాళము॥

తుమ్మెదముక్కు సోఁకని కమ్మని విరులుగొంచు
కొమ్మవచ్చె లీలావతి సమ్ముఖంబునకు ॥౧॥

వా॥ ఈరీతి వచ్చిననెచ్చెలి యచ్చెలికిఁదెచ్చిన విరులసరులు-గానుకగానిచ్చి యామచ్చెకంటి పచ్చవింటిరాయల మాయలకు లోనైన తెఱఁగెఱింగి వనవిహారంబున కారాజముఖని అఫ్ముఖినిఁ జేయఁబూని యేమనుచున్నది.

ఆహిరి॥ ఆటతాళము॥ పల్లవి॥

వనజాక్షి నీకింత వగపేల లేవె యీ.
వనశైఖరిని జూచి వత్తాము రావె।
విరిదేనెలు జాలువాఱేని।
వికసించి పొదలింపు మీఱేని।
కరువలి పేరెములు వాఱేని।
గండుతేఁటులు బారుదీఱేని ॥౧॥

గోరువంకలు మాటలాడేని కోయిలజవరాలుపాడేని।
చెఱకువిల్తుఁడు మల్లాడేని చిలుకలెల్లగుంపుగూడేని॥౨॥
కాముని బలములు వాలేని కపురంపుదుమ్ములు రాలేని।
ఆమని వనరాజ్యమేలేని ఆనందంబునఁ దేలేని ॥౩॥

వా॥ అని పలికిన మాటకు మఱుమాటలాడకున్న పాటలగంధినిఁ జూచి యాబోఁటి యేమనుచున్నది.

కాంభోజి॥ఆట॥

ఏమేమాటాడవు ఓచెలియ ॥ఏమే
ఏమేమాటాడవేమే చూడవు
మోమేల వాడెనె ముద్దులగుమ్మ ॥౧॥ ।ఏమే।

మేనేల చెమరించెనె ఓ చెలియ మేనేలచెమరించెనే।
మేనేల చెమరించె నేనేలవెగ్గైతి
నీనేలమీఁదికి రానేలనమ్మా ॥౨॥
కురులేలవీడెనమ్మ ఓ చెలియ కురులేలవీడెనమ్మా।
కురులేలవీడెనే విరులేలవాడెనే
సరులేలగూడెనే మరులేలె నీకు ॥౩॥
నీవేల బడలితివే ఓ చెలియ నీవేలబడలితివే।
నీవేల బడలితి వీవేళ లోనికి
రావేల నీకీతా వేలనమ్మ ॥౪॥

వా. అని పలికిన యాకలికిచిలుకలకొలికి యాశీలావతి మోమునఁ బొడము చిఱుచెమటలగోటమీఁటి కురులఁగూడ దువ్వి, కురులపొరల విరులసరులు మఱల దుఱిమి, గుబ్బచన్నుల మీఁదమెలిగొన్నబన్నసరంబులచిక్కు దీర్చి, కఱంగినతిలకంబు తీరుగఁ దీర్చి, తదీయగుణంబులు విస్తరించి, మూపు మస్తరించి, కొంతకుస్తరించి యేమనుచున్నది.

చెలికత్తెమాట॥ ఇంతవంత నీకేలబాల!
ఎంతపనికైన నేఁగలుగఁ గలఁగఁదగవా? మగువా
నగ వామతించు కటాక్షాంచలంబు నాపైనుంచి
నీవున్న విన్నఁబాటు దెల్పవమ్మా కొమ్మా.

లీలావతి ప్రత్యుత్తరం॥ అయితే వినవే చెలియ.

వా. అని యేమనుచున్నది.

ఘంటారవము॥ఆదితాళము॥

వెన్నెలలో బయలుదేరి విజయరాఘవశౌరి
వన్నెకాఁడై మీఱివచ్చెనే యీరేయి ॥౧॥

కనకాంబరముఁగట్టి కమ్మవిరులు చుట్టి
ఘనమైన సొమ్ము పెట్టి కైదువ చేపట్టి ॥౨॥

నెఱనీటుగా జీనినేవళముపూని
పరఁగ నీరాజధాని పాలించు భూజాని ॥3॥

పరిజనంబులతోడఁ బౌరులందఱుచూడ
మరునిగెల్చిన ప్రోడ మనవీధిజాడ ॥౪॥

లీలావతిమాట॥ ఆ మోహనాకారునిఁ జూచి మోహించినప్పటి నుండియు పచ్చవిలుకాఁడు మచ్చరించినాఁడు. తఱువాతి పనులు నీ వెఱఁగవా! నన్నేమడిగేవు పోవే.

వా. అనిన నాచంద్రముఖితో సఖి యేమనుచున్నది.

కేదారగౌళ॥ జంపెతాళము॥

దినదినము సారెరాఁడో యావిభుఁడు మనపాలిశౌరిగాఁడో।
వనితలందఱు చూడరో యతనిపై వలపుదరువులు పాడరో ॥౧॥

ఈరీతి వలచినారా యెవరైన నీతలఁపు తలఁచినారా।
మేరగాదమ్మ కొమ్మా యిటువంటికోరికలు గోరకమ్మా ॥౨॥

అజగజాంతరముగాదా మనకు శ్రీవిజయరాఘవ శౌరికి।
గజరాజగమన వినవె నాబుద్ధి నిజముగా దెలిసికొనవె ॥3॥

వా॥ అని మఱియు నేమనుచున్నది.

కాంభోజి॥ ఆటతాళము॥




చెలియ యీకోరికకేల అసఁట కేసనికి చెలియ
తెలియఁ బల్కెవారు దినకర యేలేయింత కరకర॥౧॥
బటువుగుబ్బల యొయ్యారము అతనికి నయ్యారులు
అటువంటిపొందునీకబ్బునా యాదొపచిత్తముబ్బునా॥౨॥
సవతులలోనే పోరాటము ఏలెయీా జంఝాటము
నవమోహనాంగుని మాలిమి గలిగినప్పుడె మేలిమి ॥3॥
కలగంటి నితనిసింగారము కన్నెలకు బంగారము।
వలచేనంటే నమ్మవచ్చునా యెవతైనైనా మెచ్చునా॥౪॥

వా॥ అనిన లీలావతి యాబాలికతో నేమనుచున్నది.

లీలావతిమాట: ఓచెలియ, నీవన్నమాట నిజమౌనమ్మ. అమ్మ హీాపతికి నాకు జన్మాంతర సంబంధ వశంబున నీయను బంధంబు సంధిలెఁ గాని కాని యీగోపవిశ్వవిఖ్యాతలన్న గునా. ఇందు కనుగుణంబుగా వ్యత్రితకాలదయులగని యుందు. నీతో మందలింప స్వప్నోపబోధితుమ్ముంది. వా...
42899

పుగ వచ్చినవెనుక నే దాఁచరాదుగా. తెల్పవె
చెలియ.

వా. అని యాయువతి యేమనుచున్నది.

ద్వి. లోలాక్షి, యీమేడలో నొకనాఁడు
మేళవించిన వీణెమీటుచునుండి
మృదుశయ్యపై మెల్లమెల్లన తనకు
నిదుర వచ్చిన శయనించితి నమ్మ.
అపుడొక కలగంటి నలినీలవేణి
యిపుడు నీకా తెఱంగెఱిఁగింతు వినుము.
పూర్ణచంద్రానన స్ఫురణంబువాఁడు
కర్ణాంత దీర్ఘపక్ష్మ కనుదోయివాఁడు
ఆజానుబాహుల యందంబువాఁడు
రాజలక్షణముల రాజిలువాఁడు
వర్ణనీయ విశాలవక్షంబువాఁడు
స్వర్ణవర్ణపు మేనిచాయలవాఁడు
కవినుత ధ్వజవజ్రకలశాది చిహ్న
భువనమోహన పదాంబుజములవాఁడు
గంధసింధుర రాజగమనంబువాఁడు
సింధుగాంభీర్యంబు చేకొన్నవాఁడు
చక్కనివారిలోఁ జక్కనివాఁడు

చక్కెరవిలుకాని సరివచ్చువాఁడు
భువనమోహనుఁడైన పురుషుఁడొక్కరుఁడు
కవచెలుల్ గొలువ నాకలలోన వచ్చి
ముందఱ నిల్చిన ముద్దునెమ్మోము
చందమామకుఁ గందుచాయలొసంగు
మృగనాభితిలకంబు, మెరవడి సిగను
భుగభుగ వెదచల్లు పూవులసరులు,
మేనసంచపు రేకు మినుకుల జినుఁగు
జీనికుంకుమపూఁత, చెవుల జవ్వాది
ముదురు కెంపులతాళి ముత్యాల యొంట్లు
పదకంబు చేసరుల్ పాదాంగదములు,
మొదలైనసొమ్ముల ముస్తీదు చూచి
మదనుండొ మదనునిమామయో లేక
నలుఁడొ జయంతుఁడొ నలకూబరుండొ
కలికి కంతునిదళకర్తయో లేక
రాజగోపాలుఁడో రఘునాథసుతుఁడొ
ఈజగన్మోహనుం డెవ్వండొ యనుచు
నూహించి మోహించి యుత్సాహమంది
దేహంబు పులకింపఁ దిమిరెక్కి సొక్కి
చేమోడ్చి యుపచరించిన నన్నుఁ జూచి

యామహాపురుషుఁ డిట్లని యానతిచ్చెః
"భామాలలామ ద్వాపరయుగాంతమున
నేము నీవెవ్వర మెఱుఁగఁ జాలుదువె ?
అరుదుగాదఁటవె జన్మాంతరలీల
లెఱిఁగింపకున్న నీవెట్లెఱుంగుదువు.
విజయుండనై నాఁడు విఖ్యాతి గంటి
విజయరాఘవుఁడనై వెలసితి నేఁడు.
గుచకుచ, యింద్రుని కొలువుకూటమున
నారపరివై యున్న యూర్వశివీవు
రాకేందుముఖి, నీవు రతులకు నన్ను
బైకొని రమ్మని బలిమిచేసితివి.
నీరజానన, నాఁడు నీమనోరథము
పూరింపరాదని పొమ్మంటి నేను.
కలియుగంబున నన్ను గలసెదవనుచుఁ
గులిశధరుండు నీకు వరంబొసంగె.
విను మటుగావున విజయశబ్దంబు
మునుకొన్న రాఘవముఖ్య నామమున
భూచక్రమునఁ జాలఁ బొగడిక కెక్కి
యీ చోళసామ్రాజ్య మేలుచున్నాఁడ
నాఁటి పట్టపుదేవి నను జోడుగూడి

పాటలగంధి చంపకవల్లి యయ్యె.
మున్ను నేఁగొల్చిన మూర్తియే గాదె
మన్నారు దేవుఁడై మన్నించె నన్ను
రథము నాఁటికి మనోరథము నేఁటికిని
పృథుశక్తితో నడిపించె నాకతఁడు.
వనజదళాక్షి, యూర్వశివైన నీవు
నను గోరి యీతంజనగరంబునందె
రతి విలాసమున భారతి వికాసమున
నతివ, లీలావతివై జనించితివి.
కావున నిను బొట్టుగట్టి చేపట్టి
నా విలాసినిఁ జేసి నడపనున్నాఁడ.
ఈ లీలలెల్ల నీకెఱిఁగింపఁ గోరి
లోలాక్షి, నీకలలో వచ్చినాఁడ"
అని పల్కి చతురంతయాన మెక్కించి
నను దోడుకొని తన నగరికి వచ్చె.

వా. అని యా కాంతారత్నంబు చిన్ననాఁటి స్వప్నవృత్తాంతం బేమని తెల్పుచున్నది.

పదము॥ ఎఱుకలకాంభోజి ॥ఆది॥

గుజగుజ రేకులాడే వేళను నాగుజ రాతి కెంపుమోవిగోరిలను ।
విజయరాఘవశౌరి వెన్నెలలో బయలుదేరి ।
ఋజుగు సేయక నన్నేలెనే ॥౧॥

పల్లవి॥ కలకంఠి యిటువంటి కలగంటినే నా
తలఁపులో నిన్నాళ్ళు దాఁచుకొంటినే ॥౨॥

జడనిండ విరుల సరులు చుట్టెనే నన్ను
పడుచ రమ్మని చేపట్టెనే।
విడిదికిఁ దానేవచ్చి వెలలేని సొమ్ములిచ్చి
కడవన్నె పైఁడి బొట్టు గట్టెనే ॥౩॥

వా. అని పలికి యక్కలనిక్కలసేయుమని మొక్కపలికిన యక్కనకాంగితోఁ జెలి యేమనిపలుకుచున్నది.

ద్వి. ఓచెలి, వినవమ్మ యొకరహస్యంబు
సూచించెదను నీకుఁ బోద్యంబుగాను
అలికులనిభవేణి, యది నీవుగన్న
కలకను రూపంబుగా నుండునమ్మ,
రమణి, కళావిశారదుఁడను యోగి
సమధిక విజ్ఞాన సంపన్నమూర్తి
దినకరోదయవేళ దివినుండి వచ్చి
మన యెలఁదోటఁ దామర కొలంకునను
స్నానంబు గావించి జడలు విదిల్చి
మౌనియై కొంత సమాధి సాధించి
కనువిచ్చి ననుజూచి కదళీఫలాది
వనవస్తువులు గొనివచ్చి నేనొసఁగ

నారగించి ప్రసన్నుఁడై నన్నుఁబిలిచి
యీరహస్యంబెల్ల నెఱిఁగించెఁ గనుక
విజయుండు నీకోర్కి వెలయింపఁగోరి
విజయరాఘవ మహావిభుఁడై జనించె
నతనిఁ గోఁబొందు నీకబ్బు నిందులకు
శతపత్రనేత్ర, సంశయము లేదమ్మ.

వా. అని చకోరిక యా చకోరలోచనతో మఱియు నేమను చున్నది.

చెలికత్తెమాట॥ ఓయమ్మా దైవసంకల్పంబున నయ్యే పనికి మనకు విచారంబేల ! కాలవిలంబంబునఁగాని యీ పూనిక నెఱవేరునా ? నేఁడు నామాటవిని వనవిహారమ్మునకు రావమ్మా.

వా॥ అని మందలింప నల కెందలిరాకుఁబోఁణి కందర్ప దర్పంబు సైరింపఁజాలక చాలఁ గంపించి కాలవిలంబంబునఁ గాని యీపూనిక నెఱవేఱునా యన్న పలుకుల కులికి చెలితో నేమనుచున్నది.

కాంభోజి॥ ఆటతాళము॥ పదము॥

చెలువుని దోడితెమ్మంటే నీచేతఁ గాదనేదానవు ।
నలువలు సేయవచ్చేవు నీ చందముచాలుఁ జాలునే
పట్టకు సను ముట్టకు చెడనోట్టుసుమీ నీకునో చెలి॥ ॥౧॥

నిద్దురరాదు కంటికి నీపాొద్దు నేనోర్వనొంటికి ।
బుద్ధులు చెప్పరాకువే నీసుద్దులు చాలుఁ జాలునే ।
చేరకు పేరఁ జీరకు నన్ను దూఱకు నీవు తొయ్యాలి ॥౨॥

అచ్యుతవిజయరాఘవేంద్రుని దెచ్చేవో తేవొ నెచ్చెలి ।
ఇచ్చకాలాడ రాకువే యెన్నిగచ్చులే యేటిమెచ్చులే
తలమంటే యీపాలమంటే నీచలమంటే నాకుసైఁచదే ॥3॥

వా. అని మఱియు నేమనుచున్నది.

పదము॥ ముఖారి॥ రూపకము॥ ఆటతాళము॥

బుద్ధులుచెప్పవచ్చేవా నావద్దకు వానిఁదోడితెచ్చేవా।
ముద్దుగుమ్మా నాపైనెనరు గద్దొలేదో (దెలుపవమ్మా।)
ఇద్దఱిమనసు లొకటిసేసి యిన్నాళ్ళనినుసంతరించిన।
ముద్దుచెల్లించుకొనేది కద్దొలేదో (యేమనేవు।)
తెలుపవమ్మా చిన్ననాఁటి చెలివాదువా గావా।
వెలఁది, యచ్యుతవిజయరాఘవ, విభునిఁదోడితెచ్చేవా
తేవా (తెలుపవమ్మా) ॥౧॥
వంటకమొల్లక విడెమొల్లక వలపుమున్నిటమునిఁగినదానికి
కంటికినిద్దుర రప్పించేది కద్దోలేదా।
ఇంటివారునవ్వకుండ నిందువానిఁ దోడితెచ్చి
కంటెగట్టుకొమ్మనేది కద్దోలేదా ॥౨॥

ముమ్మరంపు వలపువక్కణముద్రించి నీచేతికిచ్చెదఁగాని
కమ్మ వానికిఁ జదివించేది కద్దో లేదా।
నమ్మఁదగిన చెలివినీవు నన్ను వానికిఁ బెండ్లిసేసి
కమ్మవిల్తుని కాఁకదీర్చేది కద్దో లేదా। ఏమనేవు
తెలుపవమ్మ. ॥౩॥

వా॥ అని కొమ్మపలికినపలుకులకు సమ్మతించి యాలాగే కానిమ్ము, వేళరానిమ్ము, నేనమ్మహీపాలునిఁ దోడితెచ్చెదన? నమ్మికలిచ్చి యుబుసుపోకగాఁ గొంతసేపు శృంగారవనాంతరంబున విహరింతము రమ్మని చెలిపిలువ ఆచెలి యొడఁబడనిదానికి వారికిఁ బరస్పరవచన రచనలు నడచెనఁట యెటువలెను.

దరువు॥ కాంభోజి॥ ఆటతాళము॥

వనజాక్షి నీకింత వైరాగ్యమేలె యీ
వనవైఖరిఁజూచి వత్తామె।
వనిత మన్మథుని జవ్వనమెగాని యీ
వనమంటే నేఁడు నామనసురాదె చెలియరో ॥౧॥

ఇందువదనా యింత కుందనేలే యీ
నందనారామంబునకుఁ బోదమా।
అందైతె రానొల్ల నచ్యుతరఘునాథ
నందనారామంబునకు వచ్చేనే చెలియరో ॥౨॥

వా. అని పలుకు వ్రీడావతిని వేడుకొని చూప్రోడ చేడియ క్రీడావనంబుజాడకు వచ్చునపుడాలీలావతి యనుకూల బాలా

నీలాది శుభనిమిత్తంబులఁజూచి చిత్తంబు హర్షాయత్తంబు సేసి కొని యత్తతికి నాబిత్తరితో నేమనుచున్నది.

పదము॥ రేగుప్తి॥ఆదితాళము॥

అనుకూలశకున మాయెనమ్మ నేనిందురాఁగ
అనుకూలశకునమాయెనమ్మ యీమాపటికి
నను విజయరాఘవభూనాయకుఁడేలే నేమో ॥౧॥

విరులుఝల్లని రాలెనమ్మ నాకొప్పుమీఁద
విరులుఝల్లని రాలెనమ్మ యావిభుఁడు నా
శిరసున ముత్యాలసేస పెట్టేనేమో ॥౨॥

చిలుకమోవిపండు నొక్కెనమ్మ నేఁజూడఁగ
చిలుకమోవిపండు నొక్కెనమ్మ ఆవిభుఁడునన్ను
కళలఁజొక్కించి నామోవి గంటుసేసేనేమో ॥3॥

చలువగాడ్పు విసరెనమ్మ నాకెదురుగ
చలువగాడ్పు విసరెనమ్మ నన్నుబైకొన్న
చెలువునికిఁ బైఁటకొంగుచేత విసరఁగలైనేమొ ॥౪॥

వా. ఇవ్విధంబున నలసి సొలసి వలసి యొల్లమిగా సవ్వనికి వచ్చినజవ్వనిచేరికనుండి చకోరిక యేమనుచున్నది.

పదము॥సౌరాష్ట్రము॥ఆది॥

చిగురాకుఁబోఁడి, యీపొగడ చూచితివె।
మగనిగుణంబులు పొగడఁజూచితివె ॥౧॥

శుకవాణి, మారేడు చూచితివేమె।
సకి, యిందు మారేఁడు చనుదెంచినాఁడు ॥౨॥
మగువ, కేసరమైతే మనసురాదఁటవె।
మగనిచేసరమైతే మనసాయెనమ్మ ॥౩॥
సతి, మోవికే యింతసన్నాహమేలె।
పతిమోవికేయింత ప్రతిమాలితినే ॥౪॥
ఎలఁదోఁట మాధవుండేలీనమ్మ
ఎలఁదోఁట మాధవుండేలీది హెచ్చా ॥౫॥
పున్నాగసేవకుఁ బోదము రావే।
పున్నాగసేవకేగాద నిన్ను వేఁడేది ॥౬॥
కలియుగపారిజాతముఁ గనుఁగొంటివేమె।
కలియుగపారిజాతముఁ గనుఁగొంటినమ్మ ॥౭॥
కళావతి, సంతానముఁ గదియరావమ్మ।
కళావతిసంతానమె గదియవచ్చెనె ॥౮॥

వా. అని యారమణీమణి భూరమణీరమణుండన్యకాంతాసక్తుండై వచ్చిన చిన్నెలకోఁ గన్నులఁగట్టినట్లున్నఁ గోపంబు నిల్పనోపక యేమనుచున్నది.

పదము॥ముఖారి॥ఆటతాళము॥

ఔర యింతయారజము మీాటి తిరిగేవు
కానిలేరా లేనిమేరా దాని
చీరపల్లెవాటాయెనా శ్రీవిజయరాఘవేంద్ర ॥౧॥

వన్నెకాఁడవైన నీవా నాలుఁగంటి వెంటనంటి
యెన్నఁ డైతివి నీవిచ్చిన మొన్నఁటిబాస। మానఁజాలవా
కన్నెపైనాస జాణవౌదువు మన్నారుదాస ॥౨॥

అద్దమరేతిరి దాని యిన్నుండి వచ్చినావా
సుద్దులాడేవు కన్నులనిద్దురదేర ఓరి నీకు
పొద్దుపోదేర, రఘునాథేంద్రు ముద్దుకుమార ॥౩॥

మాటికి నీవు సన్నలిన, మాటవాసి మఱచిదాని
పోటిసేసేవు। నీవాడిన మాటలేమాయె। నోరారియా।
బోటిదేమాయ। మేలు కర్ణాటక రాయ ॥౪॥

వా. అని యావనిత జనితానురాగయై మఱియు నేమనుచున్నది.

ద॥ ముఖారి॥ జంపె॥

గమకించి రేరాజుకమ్మఁదమ్మిపటాణి
జముదాడి సానదీరె। నలరాచ
దుముదారు బయలుదేరె। కోయిలలు
దముకులై వెడలఁ బాఱెఁ॥స్వామి॥ ॥౧॥

పల్లవి॥ విజయరాఘవధీర విక్రమార్కావతార।
యిజాకు సేయకుమయ్య వేఁడుకొనెదయ్య ॥ ౧॥
బిరుదు చిల్కపటాణి తరటుసేసెఁ గదయ్య।
చెఱకు సింగాణిరాతు ఇంత ము-

స్మరమైతే యేమిసేతు। వలపుదే
వరకు నే నెట్లు దాతు॥స్వామి॥ ॥3॥

దండిగా రతిరాజు దళవాయిదిగియున్న
పండువెన్నెలగుడారు, బయటనదె
బొండుమల్లెలబిడారు, ఇట్లయితే
గుండె దిగులెట్లు దీఱు. ॥౪॥

వా॥ అని పలికి యాలీలావతి తనవిరాళిఁ జూచి గేలిసేయు
బాలికలదూఱినఁ జకోరిక యూఱడించెనఁట యెటువలెను.

పదవు॥ ఎఱుకలకాంభోజి॥ ఆటతాళము॥

మనుమని చెలులెల్లననుదీవించే వారు
మనసిచ్చి నేఁడేల మాటాడరమ్మా॥
అనుమానమేలమ్మ యచ్యుతభూపాలుని
మనుమని చెలులెల్ల నినుదీవించేరె ॥౧॥

కనకాంగి, వినవె నాకన్నులముందఱ
తనయునికిచూపెనే తలిరువిలుకాఁడు।
వనఁబోఁణి, నిన్ను రఘునాథభూపాలుని
తనయునికిఁ జూపేది తగవు గాదఁటవె ॥౨॥

మగువలారా నేను మరులు గొంటేనేమాయె।
నగరని మిమ్ముఁజాల నమ్మితిఁ గదరె।
చిగురుఁబోఁణి యీపాద్దె శ్రీవిజయరాఘవుని।
నగర నీవుండేవు నవ్వేవారెవ్వరె ॥3॥

తరుణి, సింగారంబు తరువాతనయ్యోని।
సరిపెణ లిప్పటికి సైఁపవు పోనె।
విరిబోణి యచ్యుతవిజయ రాఘవేంద్రునితో।
సరిపెనలై తేగాని సైఁచునా నీకు ॥౭॥

దొరకు నామనవు లెవ్వరువిన్నవించేరు
తరుణు లెవ్వరు బారిదప్పించేరమ్మ
నిరతంబు మీఁదఁగాక నీవింత పదరితే।
దొరకునె యీలోనె దొరపొందు నీకు ॥౫॥

మారుఁ డల్లదిగో నాచేరికఁ గనుపించె।
నేరీతి సైరింతు నేమిసేతునమ్మ।
రారమ్మని నిన్ను రఘునాథ విభునికు
మారుఁ డాలిగనేలితే మారుఁడేమిసేసెనె ॥౬॥

కళావతి సంతానము గదియరమ్మని నన్ను
బలికినమాట తప్పకుమమ్మ నీవు।
మలయజగంధి, నామాట తప్పునా నిన్ను
కళావతి సంతానముఁ గదియించె నమ్మ ॥౭॥

సవతు లేక * * *
* * * * *

వా॥ అని తన నాయకునిపేరు పేరుకొనుచుఁ జకోరిక కోరిక సీమూర్చెదననియూఅడింప నారడివలపున వీరిడియై మారుని

పోరుడుపఁ జాలక యానీలాలకభూపాలకందర్పుని డెందంబునఁ గీలించి పాలమున్నీటితెరలుపొరలివచ్చి భూలోకంబు ముంచి నట్లు చాలహేరాళంబుగా నిండుపండువెన్నెలలు గాయు చంద మామచాయలఁ గుందియు, నతని నిందింపక ప్రియోక్తుల మంద లించెనఁట యెటువలెను.

రేగుప్తి॥ ఆటతాళము॥ పదము॥

వెన్నెల వెదచల్లకు చందమామయ్యా
వెన్నెల వెదచల్లకు
పున్నమజాతరచేసి నిన్ను వేడుకొందుఁగాని॥ వెన్నెల॥౧॥

పాలయుబ్బుదీరి నాచెలువుఁడు నన్ను జేరి।
కళలఁ జొక్కించి నన్ను గౌఁగిట నుంచి
కులుకుగుబ్బలమీఁదఁ గుచ్చినగోరులకు
నెలవంకలంచును నీపేరు పెట్టెదఁగాని ॥౨॥

తొడలపై నన్నుంచి దొరల పట్టభద్రుండు
బుడిబుడి నాగుబ్బలు పుణుకుచును।
విడిగెంపుసెజ్జలోన విహరించుచున్నపుడు
కడగంటి నిగ్గుల నీకందుదీర్చెదఁగాని ॥3॥

వెలఁది రమ్మని నన్ను విజయరాఘవశౌరి
యలముకొన్నప్పుడు నాయులమటదీఱ।

చలువలు వెదచల్లు జాజిబంతి మాయుగా।
కలువలరాజా నిన్ను కన్నులనొత్తెదఁగాని ॥౪॥

వా. అని యాకలికి కలువలచెలికిఁ బ్రియోక్తులు పలికి యతని మేనల్లునిఁ బేరుకొని దూఱుకొనెనఁట యెటువలెను.

ఘంటారవము॥ జంపెతాళము॥పల్లవి॥

మేలువద్దా మేలువద్దా మేలువద్దా నీకుమీాలుడాలు వజీర ।
ఈలాగు నీవు నన్నేఁచ సాఁగితివి॥ మేలువద్దా॥
మానగరు నుంచి నీ మరుతు మావులకెల్ల
చీని చక్కెర పెట్టి నేనే సాఁకితిగా ॥౧॥
అలరు విల్కాఁడ నీయాయుధంబు లటన్నఁ
దలమీాఁద నుంచుకొని తగవు నడపుదుఁగా ॥౨॥
వలరాజ, నీనగఁదళవాయి వచ్చెనని
యెలఁ దోటఁ విడిది సేయింతుఁ గా నేను ॥౩॥

వా. అని యాభద్రగజగమన విజయరాఘునపట్టభద్రుని మీాఁదిమోహంబున రేయెల్ల నిద్రాహారంబులులేక యా కాంతార మధ్యంబున నొకచంద్రకాంతశిలామయవేదికాంత రంబున వేగింపుచున్న లీలావతిపాలి కొకబాలికామణి వచ్చి మజ్జనభోజనాదులకు రమ్మని పిలుచుచందంబునకు నాకొమ్మ

సమ్మతింపని యందంబునకు పరస్పర వచనరచనలు నడచెనఁట యెటువలెను,

ఘంటారవము॥ ఆటతాళము॥

రాకేందుముఖి. యింతరారాపు నీకేల ।
నాకుఁ దెల్ప రాదఁటవె యోయమ్మ।
నీకుఁ దెల్పఁగా నేమి యీరాకఁ దీర్చేవా
నాకోర్కె లీడేర్చేవో ఓచెలియ ॥౧॥

పలుగఱ చేసికోవె జలకము వోసికోవె ।
తెలతెలవాఱ వచ్చెనే యోయమ్మ ।
పలుగఱ నేనొల్ల జలకము నేనొల్ల
బలిమి సేయరాకువే యోచెలియ ॥౨॥

సరిగ చీరగట్టవె మెఱుఁగుసొమ్ము వెట్టవె ।
అరజాము పొద్దాయెనే యోయమ్మ।
సరిగ చీరనేనొల్ల మెఱుఁగుసొమ్ము నేనొల్ల
దరముసేయ రాకువే యోచెలియ ॥3॥

జాలిపీఁటకు రావె జవ్వాది పూసుకోవె
చాలపొద్దు వోయెనే యోయమ్మ।
జాలిపీఁట నేనొల్ల జవ్వాదినేనొల్ల
నేల నాకోఁ బోరేవో యోచెలియ ॥౪॥

తిలకము దీర్పవే కలపంబుఁ గూర్పవే
కొలువుకు వేళాయెనే యోయమ్మ ।
తిలకంబునేనొల్లఁ గలపంబు నేనొల్లఁ
గలహమునకు రాకువే యోచెలియ ॥౫॥

ముడిపూలేలచుట్టవే విడెమేల ముట్టవే
గడియలు పది సెల్లెఁగా ఓయమ్మ।
ముడిపూలునేనొల్ల విడెమందుకో నొల్ల
గడిదేరి వాదించకే యోచెలియ ॥౬॥

పానుపు దిగిరావె బోనముఁ బెట్టిరి లేవె
భానుండు పడమటఁ జేరెనే యోయమ్మ ।
పానుపు డిగ నేనొల్ల బోనము నేనొల్ల
లేని జగడ మేటికే యోచెలియ ॥౭॥

వా॥ ఇవ్విధంబున మజ్జనభోజనాదు లొల్లక యాయల్లక భరంబునఁ దదేకాయత్తచిత్తయైయున్న మత్తగజగమన నూరార్పకయాదర్పక సమానునితోఁ గూర్పకున్నఁ గొదువ వచ్చునని మదినెంచి యా చకోరలోచనపాలికిఁ జకోరికవచ్చి యేమనుచున్నది.

ద॥ శంకరాభరణము॥ ఆదితాళము॥

వనజాక్షి, నేఁ బోయి వచ్చేనమ్మ యీ
దినములో శుభవార్త దెచ్చేనమ్మ ॥౧॥

వలపువక్కణకమ్మ వ్రాయింపవమ్మ
చెలి, యిల్లు సవరణ సేయింపవమ్మ ॥౨॥
కులుకు గుబ్బల వాని గురిచ్చేనమ్మనా
మెలఁకువగని నీవె మెచ్చేవమ్మ ॥౩॥
తెలుపఁ దగినమాట తెలిపేనమ్మ।
నెలఁత, వానిఁదెచ్చి నిలిపేనమ్మ ॥౪॥
తగినట్లు మనవి పద్యము చెప్పవమ్మ।
నగరికి రమ్మన్నావో చెప్పవమ్మ ॥౫॥

వా॥ అని చెలి పచరించిపలికిన లీలావతి యుపచరించి పలికెనఁట యెటువలెను.

లీలావతి విన్నించేది.

ద్వి. నారీ శిరోమణిః, నాకు నీకన్నఁ
జేరికయైన నెచ్చెలు లెవ్వరమ్మ.
నీదిగాదఁటవమ్మ నెలఁత, నాయలఁత
భేదమేమున్నది ప్రియసఖి, మనకు.
వెనుకకు నీవు నా వెత చూడఁజాల
వనియుందు నీవంటి యాప్తురాలుండి
యొక విచారంబుతో నుండఁగాఁ దగునె!
అకట! నాకుఁబనేమి యన్నట్లు నీవె

యూరకుండితి వేని యెరులెవ్వరైనఁ
గోరిన కోర్కె సేకూర్పఁ జాలుదురె !
తెలుప, నాపతినిఁ దో తెచ్చెదననుచు
నలిమలిదీర్చి నాకభయమిచ్చితివి.
మదిరాక్షి, నీవింత మాటాడినపుడె
గొదవలుదీఱె నాకోర్కెలీడేరె.
కీరసల్లాప, వాకిటివారికెట్లు
పేరుపేర్వరుసలఁ బ్రియము సెప్పెదవో
గోలాక్షి, యేలాగు లోనికేఁగెదవో
ఏలాగుదాటకునో యేకాంతవేళ!
పడుచుల నేలాగు బండుగట్టెదవో!
పొడగను టేలాగు పొంకమయ్యెనో
చిగురాకుఁబోఁడి యాచెలువునివద్ద
మగువ నేలాగున మచ్చుగప్పెదవో
లలన, నామనవి యేలాగుదెల్పెదవో!
చెలియ, యెట్లాడఁబాటు సేయనున్నావో!
సెలవక యేలాగు విన్నవించెదవో!
దొరను నీవేలాగు దోడితెచ్చెదవో!
నీకు బుద్ధులుసెప్ప నేనెంతదాన
నీకార్యమీడేర్ప నీవెనేర్పరివి.

కలకంఠి, యీయుపాకన్యకవద్ద
నల చిత్రరేఖ నీకరవాసి దిగుడు.
దమయంతికొఱకు దౌత్యము చేసినట్టి
కమలజు తేజి నీకన్న నేర్పరియె!
పూర్ణేందుముఖి, నీవుపూనినయపుడె
పూర్ణమయ్యో మదీయపూజాఫలంబు
వలపుమున్నీటిలో వరదపోకుండ
నలివేణి, యొకతెప్పవైతివినీవు.
ఈప్రొద్దు సుముహూర్త మీకమ్మగొనుచు
భూపాలుపాలికిఁ బోయిరావమ్మ.

వా॥ అని తత్సఖీరత్నంబున కుత్సాహంబుఁ బొడమించి యా కొమ్మ కమ్మకేదంగిరేకుపై వలపువక్కణవిస్తరించి కస్తూరిచే గోర్వ్యాగజను లిఖియించి, సిఖాచేసిన యాకమ్మ సఖిచేతి కొసంగి పోయిరమ్మని పొసఁగఁబలికి యాలింగనంబుగావించి పంచిన, నబ్బాలిక భూపాలునిపాలికిఁ బోవుచుఁ దనలోఁ దా నేమనుచున్నది.

పదము॥ రేగుప్తి॥ ఆది॥

అనుకూలవార్తలు వింటేఁగా నీ[illegible]
నను కూలవార్తలు వింటేఁగా। ఈ
మనుజదేవేంద్రుఁడు నాతోమాటలాడేనేమొ ॥౧॥

ధవళములువినవచ్చేఁగా ముత్తైదువల ధవళములువిన
వచ్చేఁగా। ఆభువనమోహనుఁడు చెలికి బొట్టుగట్టె
నేమో ॥౨॥

నిమ్మపండ్లడురాయేఁగా ఈప్రొద్దు గజనిమ్మపండ్లడురా
యేఁగా। ఈ-కొమ్మ బటువుగుబ్బలతండు గ్రుచ్చిపట్టె
నేమొ ॥3॥

పాలబిందెలుగంటేఁగా ఈదోవలోఁ
బాలబిందెలుగంటేఁగా-భూ
పాలుండు బాలకుమోవి పాలించేనేమొ ॥౪॥

విరులకావడివచ్చేఁగా నాకెదురుగా
విరులకావడి వచ్చేఁగా।
విరులశయ్యనేలేనేమొ విజయరాఘవేంద్రుఁడు। మా
వెలఁదిని విరులశయ్య నేలేనేమొ ॥౫॥

వా॥ అని మార్గంబున శుభవస్తుదర్శనంబున కాసందిం
చుచుఁ, బుష్పకందుక ఖర్జూరద్రాక్షాఫలంబులు జీనికట్లలఁ
బట్టించుకొని యాపట్టభద్రుని నగరివాకిలిఁ జేరెనఁట యొటువలెను.

వా. అప్పుడు లీలావతి విజయరాఘవేంద్రునిసమ్ముఖంబు
నకు నిజవయస్యనుబంచి, యీమనోరథఘటనం బతిదుష్కరం
బనియెంచి తనలోఁ దా నేమనుచున్నది.

పదము॥ శంకరాభరణము॥

పలుమాఱు వేడుకొంటేఁగా వానివద్దకుఁ
జెలిని బోయిరమ్మంటేఁగా ॥౧॥

సముఖము చేరఁగూడునా-చేరినవాఁడా
రమణితో మాటలాడునా ॥౨॥

అనువైనవేళగాదుగా ఇప్పుడీకమ్మ
వినిపింపఁ బోరాదుగా ॥౩॥

విన్నా చౌకసేసునో చౌకసేయక
నన్ను జేరఁదీసునో ॥౪॥

నానోములీడేరునా ఈపనులెల్ల
దీనివలనఁ దీఱునా ॥౫॥

వా॥ ఆసమయంబున నూర్వశి పూర్వసఖియైనరంభ యా విరహాసంరంభమెఱిఁగి మెఱుఁగుఁబోణి నూరార్చి, భావి శుభంబుసేకూర్చి వచ్చెదనని మాయాశబరియై యా నీలకబరి యున్న కేరిదారిగావచ్చెనట యెటువలెను.

కొరందరువులు॥మాళవి॥త్రిపుట॥

జింకపొక్కిటి యసలుదీరిన చిన్నితిలకము మించఁగా
సంకుకడెములు నూరువ్రజపుసందెదండలు మెఱయఁగా
వచ్చెనెఱుకత ॥౧॥

వచ్చెనెఱుకత విజయరాఘవవసుమతీపతివీటికి
రచ్చసేయుచు రాజవీధులఁ రాజవదనలు చూడఁగా॥౨॥

ఆరజముగా నెఱికవోసిన యరిది చీరచెఱంగులు
పారుటాకులచీరతీరునఁ బాదములజీరాడఁగా ॥౩॥

గుబ్బచన్నులమీఁదఁ జేర్చిన గోవకెంపులపేరులు
గబ్బిగాగురుగింజపూసలు కంటసరులై మించఁగా ॥౮॥

వ. ఇవ్విధంబున సాక్షాత్కరించిన శకునాల చెంచుమించుఁ
బోఁడిరాక విని లీలావతితో నొకబాలిక యేమనుచున్నది.

సఖిమాట॥ ఓరాజీవలోచన, ఓరాకేందుబింబానన, ఓరమణీ
శిరోమణి, యొకవిన్నపంబు వినవమ్మ.

లీలావతి॥ ఏమే, యేమనెదవే! ఏమి విన్నవించెదవు తెల్పవే
చెలియ !

సఖి॥ నేఁడొక యెఱుకత మనవీధిగోవగావచ్చి, యడిగినవారికి
దలఁపుతార్కాణగాఁ దెల్పుచున్నది. తోడి తెత్తునా ?

లీలావతి॥ అయితే తోడి తేవే చెలియ.

చెలికత్తె॥ ఓచిగురాకుఁ బోఁడి, మాయక్కపిలిచేనిరావే.

వా॥ అని లీలావతిపంచిన చెలి పిలువ నెఱుకు మెఱుంగులఁ
బోణి యాబాలికామణిపాలికి వచ్చెనంట యెట్టులనెను.

ద॥ వచ్చెను దరువుపాడుకొంట – తాను
విచ్చలవిడి రాజ వీధులవెంట ॥వచ్చెను ॥౧॥
తీరైన బుట్టిచేపట్టి – మంచి
పారుటాకుల చీరగట్టి పచ్చబొట్టువెట్టి ॥వచ్చెను ॥౨॥

వా. వచ్చిన శబరను లీలావతిచూచి యేమనుచున్నది.

లీలావతి॥ ఏమే యెఱుకత, నీయూరేమి ? పేరేమి ? నీవిధంబు
దెల్పవే.

ఎఱుకత॥ అయితే తెల్పెద వినవమ్మా.

వా॥ అనినయెఱుకత యేమనుచున్నది.

పదము॥ యదుకులకాంభోజి॥ ఆటతాళము॥

ఎఱుకో యెఱుకో యెఱుకో యవ్వ ।
ఎఱుకడఁగవె నీ కెఱుక సెప్పేను ॥౧॥
మందారముననుంకు మలయాద్రినుందు ।
పొందుగా మాయాపురి నుందునమ్మ ॥౨॥
ద్వారకనుందుఁ గేదారంబుననుందు
మారకపురినుందు మధురలోనుందు
చిఱుతనై హరిపూజ సేతునోయమ్మ-
సురలకు శకునాలు చూతునోయమ్మ ।
నెఱవక గుఱిచూచి వేతునోయమ్మ॥
కొరవంజి మన్నారుకోడలినోయమ్మ ॥3॥
కలికి, మున్నెపైనఁ గడతునోయమ్మ।
నలుదిక్కులయందు నడతునోయమ్మ॥
విలుఁబూని యమ్ములు విడుతునోయమ్మ।
పులుల సింగంబులఁ బొడుతునోయమ్మ ॥౪॥

ఎల్లరాజులపేరు లెఱుఁగుదునమ్మా।
తెల్లదీవిలోనేఁ దిరుగుదునమ్మా।
చల్లని మాటాడుకుంటా జరుగుదునమ్మా।
అల్లుని యల్లునికొల్వోకు నరుగుదు నమ్మా ॥౫॥

ఎఱుక సెప్పేవారి నేలుదు నమ్మా ।
సరివచ్చు మాటాడఁ జాలుదునమ్మా ।
వరుసఁ గలిగినయింట వాలుదునమ్మా ।
దురితంబులెల్లఁ బోఁదోలుదునమ్మా ॥౬॥

దినపయనముల పంగుని తిరునాళ్ళు సేవింప
వనిత, దవ్వులనుండి వచ్చితినమ్మా ॥౭॥

వా॥ అని పలుకుచు వచ్చిన యెఱుకతను మరకతపీఠంబున నుంచి తానొక వజ్రశిలాఫలకంబుపైఁ గూర్చుండి, దాని ముగ్ధసందిగ్ధవచనంబులకు నవ్వుచు, నవ్వెరిబోణి యెవ్వరికేఁదార్కాణాగాఁ జెప్పితివి తెల్పవే యనియడిగినఁ జెంచుమించుఁబోణి యేమనుచున్నది.

ద॥ యానాదుల వంగడమున నేలికసూ పారునికడ।
కానలలో నడయాడుచుఁ గస్సుపైయుండఁగను।
కానుపుగనియెదవేయని కాంతునిఁ జేరెదవేయని
ఈ నేలకుఁ బొడమినదొరసానికిఁ జెప్పితినే ॥౧॥

బురుకల కాపరిపేరిఁటి పురుషునకే యీవలెనని
బరవసముగఁ దోఁబుట్టువు పలికినపలుకులకు ।
నెఱిచిన యారుకుమమ్మకు నెన్నునిఁ బెండ్లాడెదవని
సరిగరితలనే లెదవని శకునము చెప్పితినే ॥౨॥

తెల్లని దాసరి కానుక తెచ్చిన నారుకుమమ్మకు
నల్లనిదేవరయిచ్చిన నాఁడలిగిన చెలికి
తల్లి, యీవులమాన తాఁదెచ్చియిచ్చినని
గొల్లలయేలిక రెండవ కొమ్మకు సెప్పితి నే ॥3॥

వా॥ అనిపలికి తనవంశవృత్తాంతంబు విన్నవించెనఁట యెటు
పలెను.

దరువు॥ కేదారగౌళ॥ ఆది॥

నెలఁది, సింగపుమోముదేవర వియ్యమందినచెంచులు
కొలముసాములుగాని వేఱొకకొలమువారని యెంచకే ॥౧॥

పలుకులేటికిఁ గొమరుసామికిఁ బడుచునిచ్చినయెఱుకలు ।
పొలఁతి వినవే మాకుఁగంచపుఁ బొత్తుగలసిన బలగమే ॥౨॥

వా. అనిపలికి యాకలికిశో మఱియు నేమనుచున్నది.

ద॥ నాట॥ అమ్మాయమ్మ

ద॥ మధ్యమాది॥ మొక్కియడుగవమ్మ సేయెత్తి
మొక్కియడుగవమ్మ ।
మొక్కియడుగకుంటే మూకాంబిక వచ్చి

ముందర నిలువదమ్మా ।
యోయమ్మ మ్రొక్కి యడుగవమ్మా ॥౧॥
తలఁసుకోవమ్మ నీమనసులో తలఁసుకోవమ్మ ।
తలసినతలఁపెల్లఁ దార్కాణగాఁజేప్పేనే। యోదుండి తలఁసుకోవమ్మ ॥౨॥
ముత్యాలు దెప్పించవే యోదుండి ముత్యాలు దెప్పించవే
ముత్యాలుదెప్పించి మొరఁటెలో నించునీ
ముచ్చట చెప్పేదనే యోదుండి ॥3॥

వా. అనిన లీలావతి నీలాలమొరఁటెలో వజ్రవైడూర్యమరకత మాణిక్య గోమేధిక పుష్యరాగ పద్మరాగ మౌక్తికంబులు పిడికిలించి త్రిభాగంబులుగా నుంచి తన యిష్టదేవతను ప్రార్థించి నిజలక్షణంబులుపరీక్షింపుమని హస్తంబుసిగిడింప నెఱుకత తదీయాభిమత కథాకథనోన్ముఖయై తనదేవతలఁ బ్రార్థించెసఁట యెటువలెను.

ఎఱుకతమాటలు॥ అమ్మాయమ్మ॥ సామీ మన్నారుసామి !
మంగళగిరినాథ ! సన్నిగరాయ ! ఓసెల్లపిళ్ళరాయ !
బదరినున్న గోపాల ! పండరంగి విఠల !
కదిరి వోబుళనాత ! కంచి వరదప్ప !
కావేటిరంగనాత ! కాకులము నారసింహా !

భావనారాయణ ! భద్రాద్రి రామ !
వీరరాఘవసామి ! వెంకటగిరినాథ !
ద్వారకాపురివాస ! ధర్మపురీశ !
చక్కని వాకిచ్చి చల్లనివాకిచ్చి అక్కతలంచిన తలంపు
లానతీరయ్య. బంగారపువాకిచ్చి భాగ్యముల వాకిచ్చి
సింగారపు వాకిచ్చి సేమము దెలుపరయ్య.

వా. అని పలికి లీలావతికరంబు నిజకరంబునగీలించి యే మనుచున్నది.

ఎఱుకతమాటలు॥ అమ్మాయమ్మ, సెయిసూపు, సెయి సూపు
సెయిసాప వేయమ్మ. బంగారుసెయ్యి బాగ్యముగల
సెయ్యి ధనముగలసెయ్యి, ధాన్యముగలసెయ్యి.

పదము॥ కొమ్మబంగరువాన గురియించుసెయ్యి
రమ్మనిసుట్టాల రప్పించుసెయ్యి!
నమ్మినవారికి నడపేసెయ్యి
అమ్మలక్కలకెల్ల సొమ్మిచ్చుసెయ్యి ॥౧॥
పతి కన్నులనొత్తు బంగారుసెయ్యి
రతనాల ముంగాముురాముల సెయ్యి!
ఇతవుగా వీణెవాయించేటిసెయ్యి
వితరణగుణముల నెలసినసెయ్యి ॥ ౨॥
కడవన్నె బంగారుగాజులసెయ్యి

విడి కెంపుబటువుల విలసిల్లుసెయ్యి।
పుడమి వేల్పులనెల్లఁ బోషించుసెయ్యి
ముడుపులఁ బాలించు ముద్దులసెయ్యి ॥౩॥
కుటిలాలక, యేగురు రాజులయిండ్ల
నిటువంటిసెయి సూసియెఱుగనోయమ్మ ॥౪॥

వా. అని యెఱుకత మఱియు నేమనుచున్నది.

దరువు॥ కన్నడగౌళ॥ మట్టెం॥

ముదితరో వినవె మొ(క్కితినసనె
సెదరనివాకు సెప్పెద నీకు।
ఎదలో నింత యేలేసింత
ఇదిగో తానె యీడేరేనె ॥౧॥

ఎఱుకతమాట: అమ్మాయమ్మ। ఇంకా సెప్పె వినవేయమ్మ.
పతిచేత బిరుదులందెదవె పచ్చలపల్లకి నెక్కెదవె।
రతనాలసొమ్ము వెట్టెదవె రంగులచీర గట్టెదవెయవ్వ॥౧॥
దిక్కుల వార్తకెక్కెదవె దేవుల సానివయ్యేవె।
యెక్కువ విద్య నేర్చేవె యెచ్చుగా నడచేవెయవ్వ॥౨॥
నాయకురాలవయ్యేవె నలుగురుకొడుకులఁ గనేవే।
వేయేండ్లు వర్ధిల్లేవె విభుని మెప్పించేవె, యవ్వ ॥౩॥
అల్లారుముద్దయ్యేవె అగురారాలు సేసేవే।
చల్లంగా వర్ధిల్లేవె సవతులగారవించేవె యవ్వ ॥౪॥

బవిసి గలిగేనే బాగ్యముగల్గేనే,
మేలుగల్గేనే మెచ్చులందేవె యవ్వ ॥౫॥
ఎఱుకలబుట్టితోడె యీబురుకనింతోడె।
తరకటబురకటగాదె తారాౘణయ్యానే యవ్వ ॥౬॥
గాసము కోసముగాదె కల్లలాడేదాని గాదే।
నీసరివారిలో నెఱదొరసానివయ్యేవే యవ్వ ॥౭॥

వా. అని మరియు నేమనుచున్నది.

దరువు॥ కాంభోజి॥ ఆటతాళము।

చెలియరో యొకమేలు తలఁచుకొంటివి నీవు సెప్పేనువినవమ్మ
పొలఁతి, యాటదయితే ముంగరముత్యము పురుషుఁడయితే
మీసమే ॥౧॥

ఎలనాగ యాదిక్కేటువంటిదిక్కంటే నిటువంటి దిక్కమ్మ। నీవు
తలఁచినాతఁడు సీమాంతరము వాఁడుగాఁడు దక్షిణరాయ
లమ్మ ॥౨॥

నమ్మిన యేనూరుగరితల సొమ్ము నీదిగావలెనంటివి। యో
కొమ్మ నీకోరిక కొండంతపనిగాని కొంచెపుపనిగాదె ॥3॥

వా. అని యెఱుకత మఱియు నేమనుచున్నది.

దరువు॥ కాంభోజి॥ రూపకము॥

బలుకోరికగోరితి నీపనిచేకూడీనా యని
నిలువునఁ గరఁగేవకట నిష్ఠురగానవుగా ।

తలఁచిన తలఁపెల్లఁ దార్కొన్నైసరివచ్చిన
చెలి, ననుమెచ్చేవా నీచేసములిచ్చేవా ॥౧॥

వేసరకువమ్మ యొకరాసుతుని మీఁద
నాసపడి బగుదినాలాయె నోయమ్మ ॥౨॥

రేయిపగలును నిదురసేయనోయమ్మ
ఆయిసోరంబు గనమాయె నోయమ్మ ॥౩॥

నెనరుగల పడుసొకతె నీకుఁ గలదమ్మ యీ
పనులెల్ల దానిచేతనె దీరునమ్మ ॥౪॥

ఒకయేడు సెప్పితే ఓపజాలవుగా
ఒకనెలంటే యందు కోర్వఁజాలవుగా ॥౫॥

ఒక్కపున్నమగడువు కోర్చుకోవమ్మ
నిక్కముగ నీవంత నిడివికోర్చెదవె ॥౬॥

వనిత, యాలాగైతే వద్దువద్దమ్మ
వినుము రేపెల్లిటనే వేడుకచెల్లినె ॥౭॥

రేపెల్లి యన్న నీవోపఁజాలవుగా
ఈపొద్దు గడువుకే యొఱుక సెప్పినె ॥౮॥

ఇది నీకు సరివచ్చెనేని నను మెచ్చి
సుదతి, రేపొకవరుస సొమ్మియ్యవమ్మ ॥౯॥

పోయి వచ్చెదనమ్మ పొద్దునోయె నమ్మ।
ఓయమ్మ సల్లంగ నుండవోయమ్మ ॥౧౦॥

వా॥ ఆసమయంబున విజయరాఘవమహీకాంతుని చేరి కకుఁ బోయినచకోరిక యానగరాజధీశుని నగరుప్రవేశించి నగరిమగువలలో మొగమెఱుకమైన యనసరంపుఁ బడుచును జూచి యేమనుచున్నది.

దరువు॥ కేదారగౌళ॥ ఆటతాళము॥

కామిని, విజయరాఘవనాయని వారేమి సేసెదరమ్మా।
నామతీర్థంబునకు వచ్చి మన్నారుస్వామిని బూజించేరె ॥౧॥
ఎలనాగదెల్పవె యిపుడెందున్నారో యిఁక నైన వేళగాదా।
కొలువుసింగారమై గొప్పచప్పరములో,గూర్చున్నారమ్మ ॥౨॥
జవ్వని నేవచ్చి జామాయె నిఁకనైన సమయముగాదఁటవె।
ఎవ్వరుఁ బోరాదిపుడు ఏలినవారి కేకాంతసమయమమ్మ ॥3॥
ప్రముఖులందఱువచ్చి బయలుదేరిరింక సుముఖముదొరకదఁటె।
రమణీమణి పల్లేరము పెట్టినారఁట రావచ్చునా యిపుడు ॥౪॥
పొలఁతి, నాయనివారు భోంచేసెరనివింటిఁ బొడగానరాదఁటవె।
భళిభళి గరితలు పడకింటనున్నారు పవళించేవేళగాదా ॥౫॥
ఉప్పవడంబై యున్నారనివింటి నొకమాట దెల్పవమ్మా।
ఇప్పుడేలినవా రేకాంతమైయుందు రిఁక విన్నవించెదనమ్మ ॥౬

వా. అని పలికి యామదావళగమన తదాగమనంబన్న రేంద్రచంద్రునకువిన్నవించి యతని యనుజ్ఞగాంచి తన్నుం

బిలువ నాచెలువ యాచెలువరాయుని సమ్ముఖంబునకు కైకాను.
కలుగొంచు వచ్చెనఁట యెటువలెను.

ద॥ శుభవస్తువులు గొంచు సొంపుతో వచ్చెను
ఇభయాన విజయరాఘవేంద్రుని కడకు॥

వా. వచ్చి తెచ్చిన కైకానుకలు సమ్ముఖంబుననుంచి కేలుమొగిచి యేమని విన్నవించుచున్నది.

ద్వి. అవధరింపుము దేవ, యతులప్రభావ
నవమన్మథాకార, నగరాజధీర
భుజగర్వదుర్వార, భోజావతార,
విజయరాఘవధీర, వీరాధివీర
నిన్న దేవరవారు నెఱనీటుమీఱ
వెన్నెల ప్రొద్దుల వీధిలో వెడలి
సారిగా మేమున్న జాళువా కేరి
దారిగా వచ్చినతఱి మిమ్ముఁజూచి
యెలదీఁగ బోఁణి మాయేలికసాని
లలనాలలామ లీలావతిభామ
మీమీఁద దయఁబడి మిక్కిలిచొక్కి
స్వామికి విన్నపపత్రింబువ్రాసి
పంపఁగా వచ్చితి పచ్చవిల్కాఁడు
తెంపుసేయకమున్నె దేవరవారు

కలకంఠి కమ్మవక్కణ చిత్తగించి
యల చంద్రికా విహారాపదేశమునఁ
గేరికివచ్చి మా కీరసల్లాప
నీరేయి రతిరాజ్య మేలింపవయ్య.

వా. అని యాకన్నియ విన్నవింప చిన్నినవ్వునవ్వి యవ్వి జయరాఘవభూపాలుండు రాజగోపాలోపాసనావాసనాలబ్ధ దివ్యజ్ఞానమహిమంబునఁ దన చిరంతనవృత్తాంత మెఱుంగుఁ దనుక నా మెఱుంగుఁబోఁడి మనవి యంగీకరించి, యా కొమ్మ చేవ్రాలు కమ్మ యాప్తురాలైన రాయసంపుఁ బడుచు చదువఁగా విన నవధరించెనఁట యెటువలెను.

(కమ్మవక్కణ పద్యం)

సీ. (శ్రీ)రాజగోపకుమారులౌ విజయరా
ఘవ నాయ నయ్యవా రవధరింపఁ
గదరయ్య దేవర పదపద్మములకు మీ
పైట నాటకశాల పడుచనైన
లీలావతిని పదివేల దండంబులు
పెట్టి సేయుఁగలవిన్నపంబు
కలలోన ననుమీరు గలిసినదాదిగాఁ
గనుఁగొని సారిగాఁ గదలిరాఁగ

గీ. ఆసపడి చూచి నగరిసొమ్మైనదాన
మాచకోరిక నంపితి మనవి దెల్ప

గట్టిగా మీరు నన్ను చేపట్టకున్న
నించు విల్కాఁడు మఱి నిర్వహింపనీఁడు.

వా. అనిన విని యా కొమ్మవ్రాసిన కమ్మవక్కాణకు మెచ్చి యచ్యుతవిజయరాఘవుం డాచకోరికకొక వరుసనొసఁగి ఇచ్చి యీ రేయివచ్చి మీనారీమణి మనోరథముఁ బూరించెదను పోయిరమ్మని లాలించి ముదుటుంగరంబు పాలించి పంచెనఁట యెటువలెను.

దరువు॥ కన్నడ॥ ఆటతాళము॥

విజయరాఘవమహీవిభుని ముద్రికఁ గొంచు
గజరాజ గామిని కదలి వచ్చెనపుడు ।

వా. ఇవ్విధంబున వచ్చినచకోరిక తనరాకకెదురుచూచు రాకాచంద్రముఖి కాముద్రికనొసంగి యాపట్టభద్రుం డానతిచ్చిన భద్రాలాపంబులు దెలిపెనఁట యెటువలెను.

ద్వి. నీమనోరథమెల్ల నేఁడు ఫలించె
జాములో నేకాంతసమయంబు దొరకె.
పురుషవరేణ్యుని బొడగంటి నమ్మ
తెఱవ, నీమనవులు దెల్పితి నమ్మ
కలికి, నీకమ్మ వక్కాణచూచి యతఁడు
భళిభళి యని మెచ్చుపాటించె నమ్మ
ఈ రేయివచ్చి నిన్నేలెద ననుచు

నీరత్నముద్రిక నిచ్చెనోయమ్మ
కోదవలు తీఱె నీకోర్కెలీడేర
మదిరాక్షి, యింకను నెమ్మది నుండవమ్మ.

వా. అని శుభవార్త తెచ్చిన యంగనామణి నాలింగనంబు సేసి లీలావతి చాలలాలించి యేమనుచున్నది.

లీలావతిమాట॥ రావే యో చెలియ, నీవుసేసిన యుపకార
మునకుఁ బ్రత్యుపకార మేమిసేసే నే.

అని మఱియు నేమనుచున్నది.

పదము॥ ఘంటారవము। ఆది॥

ఒయ్యారి, నీవుసేసిన యుపకారమునకు
నెయ్యారులిచ్చిన వెలకాదుగా ॥౧॥

ముమ్మాటికిని నేనే నీసొమ్మైయుండఁగా
కొమ్మా యీసొమ్ములెల్ల నీసొమ్ములేగదా ॥౨॥

నేను నీమేలు మఱచేదానఁ గానమ్మా। యో
మానిని, వేళకొద్ది మాట గాదమ్మ ॥3॥

వా. అంతట విజయరాఘవచంద్రుండు చంద్రికాసమయం బునారగించి దివ్యాంబరాభరణంబులుధరియించి పరిమళం బులుపూసి సైసేసి కొందఱువాడిగంపుఁ బడుచులిరుఁగడల నడవ నడపంపుఁ జెలియొసఁగు మడుపులుగైకొని యేకాంతలీలా విహారహారియై లీలావతియున్న కేరికివచ్చెనఁట యెటువలెను.

ధవళము॥ చంద్రునికి రెండవచంద్రుఁడై.

చంద్రబింబాననయున్న ।

చంద్రశాలకు విజయరాఘవ

చంద్రుండు వచ్చెనావేళ।

శ్లో. భువనభవన దీపం * * *

* *

* *

వా. ఆభూపాలుని పాలికి నవాళిచికుర నివాళిపళ్ళెంబు పట్టించుకొని వచ్చెనఁట యెటువలెను.

దరువు। కాంభోజి॥ ఆటతాళము॥

మదన విలాసుని మన్నారుదాసునిఁ జేర

మదగజగామిని యెదురుగా వచ్చె ॥

వా. ఇవ్విధంబున మదిరాక్షి యెదురుగావచ్చియతనిపాదంబులుపన్నీటఁ గడిగి పయ్యెదచెఱఁగులఁ దడిీయొత్తి యూరగతులెత్తెనఁట యెటువలెను.

ఆరతి॥ మంగళము సంపంగి మన్నారుదాసునకు

మంగళము మానినీ మన్మథునకు।

మంగళము చోళసామ్రాజ్యధౌరేయునకు

రంగుమీఱిన విజయరాఘవునకు ।౧॥

నగరాజధీరునకు నయగుణాధారునకు

జగదేకవీరునకు జయమంగళం॥

అగణితోత్సాహునకు ఆజానుబాహునకు
జగతీవరాహునకు జయమంగళం ।౨।

వా. అప్పుడా వేదండయాన కైదండయొసంగఁ దదీయపాణి గ్రహణంబుగావించి యాకుందరదన మందిరంబుఁజేరి యానారీమణితో రత్నసింహాసనమునఁ గూర్చుండెనఁట యెటువలెను.

వా. ఆసమయంబున భూసురపుంగవులు మంగళాశాసన శ్లోకంబులు చదివిరఁట యెటువలెను.

శ్లో. తదేవలగ్నం సుదినం తదేవ తారాబలం చంద్రబలంతదేవ।
విద్యాబలం దైవబలంతదేవ లక్ష్మీపతే తేంఘ్రియుగంస్మరామి॥

శ్లో. శ్రీరాజగోప వపుషా పరిదృశ్యమాన
పాథోనిధానతనయా పరిణీరజస్రం
నిత్యోత్సవం నృపశిఖామణయే దదాతు
విద్యావతీ విజయరాఘవనాయకాయ.
సమాధానా । ఆయమా సర్వాయత్తం ।

శ్లో. హేమారవింద కుహరాహ్వాయగర్భగేహా
దావిర్బభూవ జగదభ్యుదయాయ యాసౌ
సారాజగోపమహిషీ విజయాయ భూయా
ద్విద్యానిధే ర్విజయరాఘవనాయకస్య।

సమాధానా॥

శ్లో. దుర్యోధనాది నృపతీ న్సమరే విజిత్య
యోధర్మరాజ మకరోదధిరాజ ముర్వ్యాం ।

రక్తారవింద రమణీ రమణీయమూర్తి
రాజ్యం దదాతు రఘునాథనృపాత్మజాయ॥

శ్లో. సశర్వాణీవాణీ కమనసుమనోరాజవిభవా
యదీక్షా క్షీరోదప్రభవ నవపాథః కణలవాః।
కళత్రం కంసారేః కనకకమలాంతఃపురగతం
కళావత్యాస్సూనోః కలయతుమనః కామితశతం॥

వా. ఆసమయంబున లీలావతినెచ్చెలు లామహోత్సవాలయంబున సువాలపాడిరంట యెటువలెను.

సువాల॥సువ్వి విజయరాఘవేంద్ర చన్నానృపతివంశచంద్ర
సువ్వి భోగామరేంద్ర సువ్వి సువ్వి ॥౧॥
చపలలోచన విరాళిజాలిచేత చాలబడలె
నుపచరించి తొడలమీఁద నుంచుకోవయ్యా ॥౨॥
భావభవుని కాఁకదీఱ మోవిసంచదారలిచ్చి
హావభావముల మిటారి నలముకోవయ్యా ॥3॥
ముదురు కెంపుచెక్కడంపుఁ జదురుపెండ్లిచవికెలోనఁ
గదిసి మాచెలిని బొట్టుగట్టుకోవయ్యా ॥౪॥
మగువవిన్నవించుకొన్న మనవులిచ్చి చనవులిచ్చి
నగవునుంచి గారవించి నడపుకోవయ్యా ॥౫॥
రాజగోపాలశౌరి రాధనేలుకొన్నదారి
నీజగన్మోహనాంగి నేలుకోవయ్యా ॥౬॥

వా. శోభనాంగులు శోభనంబులు పాడిరంట యెటువలెను.

శోభనము॥రతిరాజాకారునకు రఘునాథకుమారునకు
విత్తరణగుణహారునకు విజయరాఘవధీరునకు ॥౧॥

చక్రాయుధశౌర్యునకు శాశ్వతజయధుర్యునకు
విక్రమపారీంద్రునకు మావిజయరాఘవేంద్రునకు ॥౨॥

అభినవగోపాలునికి హరిసేవాలోలునికి
విభవదేవేంద్రునికి మావిజయరాఘవేంద్రునకు ॥3॥

వా. ఇవ్విధంబున విశ్వవిశ్వంభరాధీశ్వరుండు తదీయ పాణి గ్రహసుభాచారంబాచరింప నా రజనీసమయంబున నీరజ ముఖులు నీరాజనంబిచ్చిరంట యెటువలెను.

శోభనము॥శోభనమె శోభనమె, ప్రాభవయుతునకురఘునాథ
సుతునకు శోభనమె శోభనమె ॥౧॥

పరరాజులగెల్చి పాళెముల చెరంబట్టించిన
శ్రీరఘునాథ వరపుత్రుండై మించి వర్ణనగాంచిన
నెఱదొరయైనట్టి నృపమణికి । శోభనమె ॥౨॥

మనవులకై గడిమన్నె రాజులు
గొనివచ్చి యిచ్చిన కొమ్మలచే
దినదినము విద్యలువిని మెచ్చివారికిఁ
జనవులు పాలించు సరసునకు ॥3॥

తుండీరదేశంబు దొరకగాఁతుదు
పాండీని పట్టియైన పద్మలోచన।
కొండొకపాయంపుఁ బెండ్లికొఁతుప్తై సేవసేయు।
నిండువేడుకనుండు నెఱజాణకు ॥౮॥

వా. ఆసమయంబున లీలావతి విజయరాఘవులు మంగళంబు పాడుచు నటియించిరఁట యెటువలెను.

మన్నారుదేవికి మంగళం॥

భరతవాక్యము॥

ఇవ్విధంబున విజయరాఘవ పట్టభద్రుని పట్టంపుఁ గవియైన కామరసు వెంకటపతిసోమయాజి హానఁశించిన విజయ రాఘవచంద్రికావిలాసనాటక చాటుకావ్యంబునకుఁ గథానాయకుండైన విజయరాఘవస్వామికి నతని యిష్టదేవతయైన రాజగోపాలస్వామి యాచంద్రార్కంబుగా విశ్వవిశ్వంభరాధిపత్య నిత్యాయురారోగ్య భాగ్యంబులు పాలించి రక్షించుగాత॥

విజయరాఘవచంద్రికా విహారం సంపూర్ణం.

# విజయరాఘవ కల్యాణము



కోనేటి దీక్షితులు

# విజయరాఘవ కల్యాణము



సీ. శ్రీవత్సకౌస్తుభ శ్రీసమన్వితవక్ష
చక్రనిర్దళిత నిర్జరవిపక్ష
నీలనీరద విభానిభ రమణీయాంగ
మానిమానసపద్మమత్తభృంగ
దక్షిణ ద్వారకాస్థలకృతబహులీల
కటితటీ విలసిత కనకచేల
బ్రహ్మాదిదైవత ప్రణుతపాదాబ్జాత
భక్తజనాంగణ పారిజాత

గీ. ఇందురవినేత్ర, కరధృత హేమవేత్ర
యమితగుణధామ చెంగమలాభిరామ
చేరి రక్షింపు మేవేళ శ్రీవిశాల
భవ్యగుణహారి రాజగోపాలశౌరి !

పరాకుస్వామి - జైవారము॥ శ్రీరాజగోపాల సేవాధురీణ ! సీమంతినీ జనమోహన పంచబాణ ! రమ్యతర శృంగార రూపరేఖావిలాస ! రమణీయ చంద్రికా రాజితహాస ! మత్తారి మహీధర ఖండనాఖండల ! మహిత సకల దిశా

రంజన కీర్తిమండల ! సకల ధరాభార ధరణసముద్దండ భుజాదండ ! శౌర్యవిజిత గాండీవకోదండ ! అతులతులాపురుషహిరణ్యగర్భాది దానధౌరేయ ! అఖిలవిద్వజ్జనభాగధేయ ! శతక్రతుచతుర్వేది తిరుమల శ్రీనివాసతాతయార్యపదపద్మభృంగాయమానాంతరంగ ! చతుర విలాసినీరంజిత నాట్యరంగ ! అఖండ చోళమండల రక్షణదీక్షా విచక్షణ ! అఖిలావయవ సంశోభిత శుభలక్షణ ! విజయరాఘవ మహీపాల ! విజయలక్ష్మీ విశాల ! పరాకు, దత్తావధానుండవై చిత్తగింపుము.

శ్రీమద్రామాయణోపదేశసంతుష్టాంతరంగ భగవత్కృపాపాంగ వీక్షణానుక్షణ ప్రాప్తసారాగ్రహార తారహార చిరత్న కంకణోదార తారానురూప ముక్తాకలాప హృద్యన బిరుద వాద్యనానావాహనాదిసన్మానమాననీయ. శాస్త్రోపశాస్త్ర ధుర్యుండును, బహువార రచితయాగభాగ సంతర్పితాఖిల దేవతావర్యుండును, సంగీత సాహిత్య విద్యాధురీణవరేణ్యుండును, రామానుజాచార్య తనయాగ్రగణ్యుండును భారతభాగవతాది శిక్షావిచక్షణ్యా విజితవిబుధాచార్యుండును, గురురాజ శతక్రతు శ్రీనివాసదేశిక ప్రతిష్ఠాపితోపాధ్యాయ వైభవధుర్యుండును, సకలసద్గుణసాంద్రుండగు కోనేటి దీక్షితచంద్రుండు కందళదర్సగర్భ సందర్భంబుల నందంబుగా హవణించిన విజయ

రాఘవకళ్యాణం బనునాటకరాజంబు నటనపటిమఁగనుపింప వినిపించెదము విననవధరింపుఁడు. అని విజృంభించి యారంభించు కథాసంవిధానంబునందు ప్రధానకథానాయకజనకుండును, జగజ్జనకుండు నైనశ్రీరాజగోపాలస్వామిని ఏమని కొనియాడు చున్నాఁడు.

ద్వి. శ్రీరాజగోపాల, శ్రీసతీలోల
నారదస్తుతశీల, నత జనపాల
కాంచన వనవాస, కమనీయహాస,
యంచితాంగవిభూష, యతులితవేష,
వారిధిగంభీర, వరగుణోదార,
ధీరమానససేవ్య, దివిజసంభావ్య,
గోపికాజనజార, కువలయాధార,
పాపసంఘ విదూర, బలిదర్పహార.
సౌవర్ణరుచిచేల, జయపరమాపాల,
సేవకావనదక్ష, శ్రీవత్స వక్ష,
కౌస్తుభలలితాంగ, గరుడ తురంగ,
హస్తీంద్ర శుభదాయి, యఖిలాతిశాయి,
సారెకు నినుగొల్తు సదయానుభావ.
కోరిక లొసగుమాకు గోపాలదేవ!

అని గోపాలదేవుని బ్రశంసించి యతని పట్టంపుదేవిని ఏమని
కొనియాడుచున్నాఁడు.

కవివచనం ద్విపద:-

కనకాంబురుహవల్లి కాంతామతల్లి
వనజాత నిభపాణి, వరనీలవేణి,
కమనీయగుణధామ, కమలాభిరామ,
యమిత కృపాపాంగ, యతిశోభనాంగ, (?)
దక్షిణ ద్వారకాస్థల వాసజనుల
రక్షింప వెలసిన రాజీవనయన!
సుజనులు గొనియాడ సొంపొందునట్టి
విజయరాఘవమహీవిభునిఁ జేపట్టి
నీపట్టిగాఁగ మన్నించి లాలించి
పాప్రుదాపై మించుబంగారుతల్లి
సేవించి యేవేళఁ జిత్తంబులోన
భావించి మీపాద పద్మముల్ గొలుతు.

వ. అని యీచందంబున నందంబుగా విశిష్టేష్టదేవతా
వందనంబుగావించి యారంభించు నవరసశృంగాటకంబగు నాటక
రాజంబునకుఁ బ్రిధమకథనీయంబుగారంజిల్లు తంజాపురంబు
వర్ణించెనట యెటువలెను.

కవివచనం ద్విపద.

శ్రీవిలాసముచేతఁ జెన్నొందుచుండు
కావేరికాతీర ఘటితాగ్రహార
వైభవములఁ జాల వన్నెమీఱుచును
శోభనాస్పదమగు చోళదేశంబు
ఆదేశమున నయోధ్యాపురమునకు
నాదేశమిదియని యందఱుఁ బొగడ
దంజాపురంబున ధరణిలోపలను
రంజిల్లుచుండుఁ బురంబు వేడుకను
ఆపట్టణంబున నమరెడుకోట
చూపట్టు వలయాద్రిసొంపు నింపుచును;
కమనీయ హేమప్రకాశంబుచేతఁ
గొమరు మీఱినకోటకొమ్మలచ్చటను
గనుపట్టుచుండును గగనలక్ష్మికిని
దనరారు సంపంగిదండలో యనఁగ,
ఆరసాతలమంటు నగడతలందు
వారిధిరాజు గర్వము నవ్వుచుండు.
ఎడపక తిరిగెడు నినచంద్రులకును
బడలికల్ తీర్చు నుప్పరిగ లచ్చటను
అప్పురంబేలు నాయకుఁడు వైష్ణవుల

కెప్పుడు దానంబు లిచ్చు గేహములు
వడిగ జన్నములకై వచ్చు జేజేల
విడుదులో నుసగను వెలయుచు నుండు.
జగతి నన్నూరిం గ్రాబు సత్రంబు పేర
నెగడుచు నుండును నిఖిల యాగములు;
పన్నగ పతికైన బ్రహ్మకునైన
సన్నుతింపం దరంబె చాల నామహిమ.
వేదనిధానస్థలిని వెలయు విప్రులను
మేదిని సరిలేక మీఱు రాజులను
గోటిలాభములం గైకొన్న వైశ్యులను,
మేటిసంపదలచే మించుపాదజులం,
జక్కదనాన నచ్చర ప్రన్నం బోల్ప
నక్కజంబుగ గెల్చు నలవారసతులం,
గులశైలములమించుకుంజరేంద్రముల
నలఘుజవంబులౌ హయరత్నములను
సరిలేని కాంచన స్యందనంబులను
హరి పరాక్రమ ధుర్యాగు వీరభటుల
నలరి భేరీమృదంగాది ఘోషములు
గలిగి యొప్పగుం జాలకడలి యానగ.

వ. ఇవ్విధంబున రంజిల్లు తంజాపురంబు నిచ్చలు నెచ్చనాం బాలించు నచ్యుతవిజయరాఘవమహీపాలుండొక శుభదినం బున సకలవైభవంబులు మెఱయ నకలంకశశాంకవదనలు ముదం

బంకురింప నలువంకల బలిసి కొలువుసేయ నలరాయ వలరాజ
జారి, హాయములుమీాఱి కొలువుకు వచ్చెనట యెటువలెను.

సౌరాష్ట్రము॥ ఆది॥

కొలువుకు వచ్చెను – గోపాలుండనంగ।
చెలఁదులు గొలువఁగ – విజయరాఘవేంద్రుఁడు
శృంగార నాయకుఁడై – చెలువము మీాఱఁగ
చెంగట నెచ్చెలులు – కైదండలొసంగఁగ
అంగనలు కొందఱు – హారిగలు పూనఁగ।
సంగీత మేళంబు – సరస రాణింపఁగ॥

తెలుగు విశ్వవిద్యా గ్రంథాలయ సంఖ్య 428 7-2-

వ. ఇవ్విధంబున వచ్చిన యశస్విశ్రీవిజయరాఘవమహీ-పాలుండు సింహవేడుకమీఱ వేంచేయుమాన [illegible]కుదండలం గొలువఁ బ్రేమమీఱ శ్రీరామాభిరామంబగు శ్రీరామ సౌధంబునఁ గలువరాచలువచెలువంబుగల చలువరాజగతిపై నూత్నరత్నసింహాసనంబునసుఖాసీనుండై చెలంగుచుఁ గొలువై యుండెనట యెటువలెను.

*   *   *   *   *

వ. ఈ చెలువునఁ గొలువైయుండి మన్నారుదాసమహీ-పాలుండు చేయుచున్న బరాబరినిం జూచి యేమనుచున్నాఁడు.

నాయనిమాట : రావోయి బరాబరి! ఈవేళ కేళికచూడ
వేడుకై యున్నది. నాటకశాలవారిని బిలువవోయి.

బరాబరిమాట : అయ్యా ఆలాగే తోడి తెచ్చెదనయ్యా.

వ. అని విన్నవించి బరాబరిపిలువ సంగీతసాహిత్యభరతాదివిద్యలచేతఁ జాతురిమీఱి ఖ్యాతిచే బిరుదులుగాంచిన యిందువదనలు విజయరాఘవపురందరుని చెంగటికి నాట్యాసంరంభంబుమెఱయ రయంబునవచ్చిరఁట యెటువలెను.

కళ్యాణి॥ ఏకతాళి॥ దరువు॥

భరతాది విద్య లీభామిను లానన
బిరుదు పాత్రలు వచ్చి రాధరణీశుఁజేర॥

వ. ఇవ్విధంబున వచ్చిన జవ్వను లావిజయరాఘవభూవల్లభునకు సలాముచేసిరఁట యెటువలెను.

ఖాచి॥ ఆట॥ ద॥

సల్లాము సల్లాము రే జవ్వమే రే ॥సల్లాము॥
సల్లాము విజయరాఘవసాహేబు మే రే ॥౧॥
సంగీతలోలా రే ఆహా మే రే సాహిత్యభోజు రే।
సంగర విజయు రే జగదేక వీరు రే ॥సల్లాము॥

వ. ఈలాగున సల్లాముచేసి యామదవతులు పదకేళిక విం-పించిరఁట యెటువలెను.

ఖాచి॥ ఆట॥ పదము॥

సామిరారా మదనునిసామీ రారా।
వేమాఱునిన్ను వలచినదాన
విజయరాఘవధీర హంవీర ॥౧॥

వలపు నేడాఁచ నేరర వగకాఁడ నీకు మ్రొక్కెదర।
చెలఁగుచు నీకౌఁగిలీర దయమీఱ
చలముసేయక బంగారుసామి ॥౨॥

బాలప్రాయముదానఁ బాయఁజాలనిదాన।
మేలుదాన నేఁచ నీకు మేరగాదుర చక్కనిసామీ ॥3॥

నెఱజాణవు నీవేర నీమోవికె యాసయ్యేర
మరుకేళిఁదమిమీఱ మన్నారుదాస, నన్నేలు ॥౪॥

పదము॥ నేరమేమినావల నెఱజాణ, పలుకవు నేఁజెల్ల।
రా రావు సేతురా విజయరాఘవవజీర ॥౧॥

మురుసైననీ కెమ్మోవి మునిపంటనొక్కెదర।
అరమరసేయక నెయ్యమ్ముగరమ్మని కౌఁగిలియ్యర ॥౨॥

వ. ఈలాగునఁ గేళికవినిపించిన బాలికామణులకుఁ గుంకుమ సంకుమదజాంబూనదాంబరకదంబకంబులుబహుమానంబు గా వించి పంచెనఁట యెఱువలెను.

వ. తదనంతరంబ యథోచితప్రసంగంబుల సంతుష్టాంతరంగుండైయుండు మన్నారుదాసమహీపాలుచెంగటికి నించువేడుకఁ జనుదెంచినచెంచులరాక విన్నవించుటకై యన్నగారులువచ్చిరఁట యెఱువలెను.

శంకరాభరణము॥ .ఆది॥

సరిగంచుకుళ్ళాయలు అరచట్లదుప్పట్లు
హరువుగ మెఱయంగ నన్నగారులువచ్చిరి.

ఈరీతివచ్చిన యన్నగారు లన్నరనాథునితో నేమనివిన్నవించుచున్నారు.

అన్నగళమాట: స్వామీ పరాకు. దేవరవారికిఁ బొడగనేట్టుగా కానుకలుపట్టుకొని చెంచుదొరలువచ్చియున్నారు.

అని విన్నవించిన యన్నగారలతో మన్నారుదాసమహీపాలుం డేమనుచున్నాఁడు.

నాయనిమాట: మంచిదే కోడితేరోయి.

అన్నగళమాట: అయ్యా అలాగే కోడితెచ్చెదమయ్యా. అని విన్నవించిన కంచుకులుపిలువఁ జెంచుదొరలు సన్ని క్రమ మొఱువలెను.

ద్వి. ఆవేళఁ జెంచులు హస్తంబుమీఱ
భూవరశేఖరుఁ బొడగనుటకును
జిలుకపంజరములు జీనువాయిలును
పలటీలు వెలిచెలు బైరిడేగలును
జవ్వాదిపిల్లులు జాగిలంబులును
సివ్వంగులును లేళ్ళు చిఱుతదుప్పులును
నెమలిపిల్లలును వెన్నెలపులుఁగులును
చమరీమృగంబులు జాలెడేగలును
కాఱెనుములును సింగములకూనలును
కాఱుగోళ్ళును బట్టి గాండ్రు కౌఁజులును

పులిజున్ను నిండెట్లు బొంగుకప్పెరలును
తలముళ్ళు పసంచిగందంపు మానులును
సెలవిండ్లు బదనికల్ జీవదంతములు
పులిగోళ్ళు గసగసల్ పట్టుతేనియలు
చారపప్పులును ద్రాక్షలు జీడిపప్పు
దారికట్టేనుంగుత్తలల ముత్తెములు
మొదలైనకానికల్ ముదముతోఁ గొనుచుఁ
గదలివచ్చిరి చెంచుగమికాండ్రు వేగ.
అపురా మటియువారు వచ్చే విధమెటువలెను.

జతి। సావేరి। ఆట।

పల్లమీసములు పాదుటాకుదుప్పటులును
నల్లనిమేనులు నారకాసెలు మెఱయ ॥వచ్చిరిచెంచులు॥
వచ్చిరిచెంచులు హైఖరిమీఱంగ।
అచ్యుతవిజయరాఘవాధీశుకాలుపుకు ॥వచ్చిరి॥
జేగురుబొట్లును జీవదంతములు।
బాగైనకడెములు బదనికలునుబూని ॥వచ్చిరి॥
సెలవిండ్లును మేలి చిల్లకోలలును।
తలచుట్టు పించపుదండలు మెఱయఁగ ॥వచ్చిరి॥
బిరబిరనడచుచు బెదరిచూచుచును।
పరిపాటి నరుఁడైన దొరయని మొక్కుచు ॥వచ్చిరి॥
జంగనడలు తమజాతి కిన్నరలు।
పింగళు కోరల చేఁడమ్ములు పూని ॥వచ్చిరి॥

వ. ఇటువలెఁ జేరవచ్చి యన్నగరియశేషవైభవమ్ములఁ జూచి యాచెంచుదొరలు తమలోఁ దామేమనుచున్నారు.

చెంచుల మాటలు: వొారెవొారె సిన్న, వొారెవొారె లక్క, వొారెవొారె పెదకాట, వొారెవొారె సినకాట, వొారెవొారె బుక్క, వొారెవొారె నూక, వొారెవొారె లకుమ, వొారె వొారె కుళ్ల, ఈమొగసాల వాకిలి యెంతపొడవుర!

మరొకఁడు॥ వొారే యెజ్జీనరక, యీపొలాన ఇంతలేసిమానులు తిరుగుదుజ్జి!

మఱొకఁడు॥ వొారేవొారే పోగా పోగా ఎన్నికొంకరవంకర లురా!

మఱొకఁడు॥ ఈకొొంకర వంకరలు యింతవారెవరైనా యింతవస్తే తగిలిస్నుక యిగిలిస్నేతుజ్జా.

మఱొకఁడు॥ వొారేవొారే ఆమానిసిసెవుల తెల్లంగా అల్లాడుతా వుండేదేమిరా!

మఱొకండు॥ శిలల్ల వుప్పిపంప్లు గాదంటరా.

మఱొకఁడు॥ వొారేవొారే సూడు. ఈమానిసికి ఆకుమేపుతా వుండాజ్జా.

మఱొకఁడు॥ ఇదామాసిమెకమురా. వీరు నడిమికి సుట్టుకొన్న పారుటాకులు వన్నెలై వున్నదిరా.

మఱొకఁడు॥ ఏమానునబుట్టెనో మాకు తెలియదురా.

మఱొకఁడు॥ వొరే యీ గాదెబుట్టలోను రెండుపాశాలామూసి కొట్టేదేమిరా !

మఱొకఁడు॥ వొరే అవేకమూ ! నేరముసేసినమానిసిని ఈ బుట్టలోయేసి రెండుపాశాలామూసి, కట్టియేసి గుండెలు దీసుకకొట్టితే కూసికాదురా.

మఱొకఁడు॥ వొరేవొరే మన మనుబోతులనోటికి తాళ్ళ్వా తగులూతగిలిస్సి పైని యేమోయేసికొని, కాళ్ళ సందున ఇరికిస్సికొని పారెదరు సూడరా.

వ. అని యొకరొకరు మాటలాడుచుఁ గొన్నివాకిళ్లు గడచి వచ్చుచు, దుడ్డుకోలలు చేఁబూని నల్లగొంగళ్ళు ముసుఁగులిడి పట్టెనామములు పెట్టుకయుండే గొల్లలఁజూచి భిల్లవల్లభు లేమనుచున్నారు.

చెంచులు విన్నవించే దరువులు :

ముఖారి॥ ఆట॥

ఎదురుకోలలిచ్చి మెలుఁగులఁబట్టి తెచ్చి।
యిదిగో వాకిట నిల్పిరిది వింతగాదా ॥౧॥

అరచట్ట కుళ్లాయలందముగా మేన
మెరయ మానిసికోఁతి మెకము తిరిగేర ॥౨॥

అనుమంతుఁడాదిగా మనసాములనుబట్టు।
కొనివచ్చి యిచ్చటనుంచి నారిదిగో ॥3॥

వ. ఇవ్విధంబునఁ బలుకుచువచ్చి యవ్వసుంధరాపురందరు సమ్ముఖంబుఁ జేరి సాగిలమ్రొక్కి తాము తెచ్చినట్టి కానికలు ముందరనుంచి యొకదండనిలుచుండి మించినభయంబున మేనులు వంచి యడుగులుతడఁబడ నల్లనల్లన వెనుకకునడచుచు నప్పు డప్పుడమి రేనితో వారలేమనుచున్నారు.

(చెంచులు చదివే ద్విపద)

ద్వి. మన్నారుదాస, మామనవులన్నియును
విన్నవించెదమయ్య వినచిత్తగింపు
సామిదేశంబున సరుదైన యడవి
సీమలగేములఁ జెలఁగుచుండుదుము
తాతముత్తాతల తరములనుండి
పాఁతరికముతైన బంట్లము మేము
దవ్వుల నున్నయంతనె మమ్మువీర
లెవ్వరోయని మదినెంచఁగా వలదు
జననాథ, గుహుని వంశంబువారలము
గనుక మీకును దగుల్గానుందు మెపుడు
దేవరమనసుకాఁ దిరిగెడువార
మేవిధంబున మమ్ము నేలుకోవయ్య.

వ. అని మఱియు నేమనుచున్నారు

(చెంచులు వినిపించే దరువులు)

కాంభోజి। ఆట।

దేవరవారిటు దెమ్మనఁ గరువలి–దేవర జింకనే తెచ్చే
మయ్య ॥౧॥

మమ్ము రమ్మనిపిల్చి మదపుటేనుఁగునైనఁ
దెమ్మనఁ జెవిఁబట్టి తెత్తుమీవేళ ॥౨॥

సింగమునైనను జేరి తెమ్మనినఁ
జెంగట నుంతుము సెలవీయవయ్య ॥3॥

వ. అనిన నామనుజదేవేంద్రుం డేమనుచున్నాఁడు.

నాయనిమాట : అవునౌను చెంచుదొరలార, మానగరికిఁ దర
తరములనుండి తగులైనవారలుగారా ఇప్పుడిచ్చటికి
వచ్చిన కార్యమేమి తెలుపరోయి.

వ. అని యానతిచ్చిన యానగనాథునితో వనచరపతు
లేమని విన్నవింపుచున్నారు.

సీ. స్వామివారలు మమ్ముఁబ్రేమఁ బోషింపంగ
గోరంతయైనను గొదువలేదు
మాకునునెల్లైన మలలఁ గానసముల
గుహలను బొదరిండ్లఁ గోనలందు
గుంపులు గుంపులు గూడుక మేయుచు
మడిగోఁకలిడుచు (!) మార్మలయుచుండు
నెన్నఁడు నటువంటి వన్నె మెకంబులు
కన్నవి విన్నవి గావు దేవ !

గీ. కానదుష్టమృగాళి రాఘవుఁడుమున్ను
వేఁటలాడుటగాని యీవెనుకగాన
మిపుడు దేవరయిటువచ్చి యింపుమీఱఁ
జేరిక్రూరమృగాళి శిక్షింపవలయు.

వ. అని విన్నవించిన మన్నారుదాసమహీపాలుండు మన్నన మీఱ నాయెఱుకుదొరలతో నేమనుచున్నాఁడు.
నాయఁడుచదివే పద్యము:

గీ. చెంచుదొరలార, మీమదినించునటుల
నచ్చటికివచ్చి భుజబలమతిశయిల్ల
వీఁకమీఱంగ మృగములవేఁటలాడి
యెంతయేనియు వేడ్కగావింతుమీకు.

వ. అనిపలికి యా యెఱుకుదొరలకు వింతవింతవగలఁ గను పట్టు కట్టువర్గంబులఁ బాలించి లాలించి చెంతనున్న కటికివారిని జూచి యేమనుచున్నాఁడు.

నాయనిమాట: రారోయి కటికవారు ! రాణువవారిని హెచ్చరించి వేఁటకాండ్రను ఆయత్తపడి రమ్మనరోయి.

కటికివారిమాట: అయ్యా ఆలాగేరప్పించేమయ్యా.

వ. అంత నవ్విజయరాఘవమహీకాంతుండు అంతఃపురంబు ప్రవేశించెనఁట యెటువలెను.

వ. ఆసమయంబున మన్నారుదాసమహీపాలుండు వేటసన్నా హంబునకు రంగుమీఱ శృంగారించు కొనెనఁట యెటువలెను.

కవివచనము :—

ద్వి. మన్నారుదాసుఁ డింపలరనావేళఁ
బున్నమ చందురుని బోలు మోమునను
పోలుపొందఁ గస్తూరిబొట్టు తీర్చుచును
చెలువు మీఱఁగ నొంట్లు చెవులధరించి
సరిలేనిచుట్టి బుర్నాపాగఁ జుట్టి,
హారువుగాఁ గుంకుమ యరచట్టదొడిగి
తారహారంబు లెంతయు వింతగాఁగఁ
జేరురంబునఁ దాల్చి పెరిమ దీపింపఁ
జాల రాణింప హిజారును దొడిగి
మేలు బంగరుదట్టి మెఱయంగఁ గట్టి
వలనొప్ప వజ్రాల వంకటుచెక్కి-
తులలేని సరిగంచు దుప్పటిగట్టి
కేడెంబు కత్తియుఁ గీలుకొల్పుచును
వేడుక మీఱంగ విపులశౌర్యమునఁ
గరమొప్ప మూఁపునఁ గవదొనల్ పూని
కరముల మేలిసింగాణి ధరించి
వేటసన్నాహంబు వింతయై చెలఁగ
నీటుకోవచ్చె నానృపశేఖరుండు.

వ. ఇవ్విధంబున నవ్వసుంధరా పురందరుండు కొందఱు చనవరులగు దొరలు దండఁజేరి కైదండలొసంగఁ గక్ష్యాంతరంబులు గడచి లక్ష్మీనివాసంబు చేరవచ్చిన యవసరంబున, నిగనిగలం గనుపట్టు మగరాల మొగముట్టును రంగారుబంగారు సింగంపుఁ బల్లంబును, ఈలంపునీలంపుఁ బనులఁ జొక్కంబగు పక్కెరయును, తీరుగల పేరోజంబుల మెండుగల దిండువాగెయును, ఈడులేని వైడూర్యముల చాలుగల మేలువాగెయును, వాటంబులగు పుష్యరాగంబుల తలాటంబును, డాలుగల పగడాల కళ్లెంబును, అందంబులగు కెంపుల యందియలును, నివ్వటిల్లు రతనంబుల మువ్వలును, ఉల్లసిల్లు మౌక్తికంబుల జల్లులును రాజిల్లు నొకతురంగరాజంబును దెచ్చి యొకసాహిణి ముందఱ నిలుప నందంబుగాఁ గరారవిందంబునఁ గందంబప్పళించి యారాజపురందరుండు తురంగరాజంబునకు మొక్కి చౌకళించిన నేర్పుచూచి, యెదుట నిల్చి వేత్రహస్తులు హస్తంబులు చాచి 'అవధానము సాహో జతనము పరాకు దేవ!' యని సారెకు హెచ్చరింప, రాజకుమారవర్గంబు లిరుగడలఁ జామరలు వైవ, మన్నె దొరలు తురంగంబుల నెక్కి యిరుచక్కి నింగొలువ, జోడన రవగాలు చుట్టు కేడెంబు దనర రాజమార్గంబునఁ దేజంబు మెఱయ వచ్చెనఁట యెటువలెను.

ముఖారి॥ ఆది॥ దరువు॥

విజయరాఘవ మహీవిభుఁడు వచ్చెను।
ప్రజలకుఁ గన్నుల పండువుగఁ దేజినెక్కి ॥౧॥

తీరైన నడలుగలుగు తేజీలనెక్కి
వీరాధివీరులు వజీరులు గొలువంగ ॥౨॥

పరరాజులగెల్చి పట్టితెచ్చిన
సురమాయిజల్లులు సూర్యచంద్రులు మెఱయ ॥3॥

భేరీలు డమామీలు మీఱి చెలఁగఁగ।
సారెకు వందిబృందము సన్నుతిసేయ ॥౪॥

వ. ఈచందంబున వచ్చు నచ్యుత విజయరాఘవ మహీపాలునియెదుట నిల్చి వేత్రహస్తులు హస్తంబులు చాచి యేమని పొగడుచున్నారు.

(కటికివారు పొగడేది)

రంగత్తురంగ పుంగవారోహణ నిషధరాజ !
రాజాధిరాజ ! సన్నుతప్రతాప దినరాజ !
భామినీ మనోజ ! పరరాజ భయంకర తేజ !
సకల యాచకసురభూజ ! సాహిత్య కళాభోజ !
సంగరాంగణ ప్రచండ రిపుభయద భేరీవిరావ !
సామదాన భేదదండ చతుర్విధోపాయ చతురప్రభావ!
పరిపాలిత చోళధరామండల! బహుభోగనిర్జితాఖండల!
పాదావధాన ! దృష్టిముష్ట్యష్టావధాన !
రాజపరమేశ్వర ! అష్టదిగ్రాజకుల మనోభయంకర !
మహనీయ యశోవిలాస ! మన్నారుదాస !

పరాకుస్వామి !

వ. ఆసమయంబున దొరలు గొలువఁ బచ్చవిస్తుని దారి మీఁది వచ్చు నచ్యుత విజయరాఘువేంద్రునిఁ జూచు వేడుక సప్పురంబునం గలుగు కప్పురగంధులు ఈడులేని వేడుక మేడల మీఁదికిఁ జేరవచ్చిరఁట యెటువలెను.

ఖాబి। ఆది।

మన్నారు దాసుని మగువలు చూచువేడుకఁ
జెన్నొందు సౌధముఁ జేరవచ్చిరపుడు॥

వ. ఇవ్విధంబున వచ్చిన జవ్వనులలో నొకపువ్వుఁబోఁడి మదన వేదనాదోధూయమాన మానసయై యామదనావతారుం జూచి కోరికచేరిక యయ్యెనని యొక చేడియతో నేమనుచున్నది.

(పౌరకాంత వినిపించేద్విపద)

ద్వి. ఎలనాగ, చూచితే యీరాజు చెలువు
అల జయంత వసంతులందును గలదె!
ఈ చెలువునియందె యింపు మీఱఁగను
నాచిత్త మిప్పుడు నాటి యున్నయది
వలరాజు బలముతో వచ్చెఁగదమ్మ
నెలకొన్న వలపు నే నిలుపలేనమ్మ
ఒకవంక మకరాంకుఁ డొకచాయశుకము
నొకచక్కి తెమ్మెరయును నేఁచసాగె

తెలిసి యెవ్వరు తోడితెచ్చెదరమ్మ
కలనైన నెడఁబాయఁగాఁ జాలనమ్మ
సారిగా వచ్చినచందమా యితఁడు
వారి జాక్షులనెల్ల వలపించవచ్చె
బలిమి నేఁ బిలిచినఁ బలుకునో కాక
చులకదనంబునఁ జూచునో యితఁడు
తెఱఁగొప్ప నేను ప్రతిజ్ఞ చేసెదను
మఱవకు మపుడు నే మందలించెదను
వెలఁదిరో నేను ఏవితమునన్నైన
నెలయంగ నితనినే విభునిఁ జేసికొని,
వలపించుకొని నాదువలలకుఁ దీసి
కళలఁ జొక్కించి రాగరసాబ్ధియందుఁ
దేలించి మఱి తఱితీపి పుట్టించి
చాల నాకెమ్మోవి చవులదక్కించి
కులుకుగుబ్బల రొమ్ముగుమ్మి పైకొనుచు
మలయుచు సొలయుచు మక్కువమీఱ
వదలక నాశయ్యవద్దనే వీనిఁ
బదిలంబుగా నుంచి బాళిఁ బుట్టించి
యడపంబు గట్టింతు నందఱుఁ జూడఁ
బడఁతిరో యిపుడు నాపంతంబు చూడు.

వ. అని మఱియు నాకాంతామణి విజయరాఘవ మహీకాంతునిం జూచి యింతింతనరాని కంతుసంతాపంబునఁ జెంత నున్న యింతితో నేమనుచున్నది.

జులావు॥ ఆది॥

కంటిరానీసొగసెల్లఁ గన్నులుచల్లఁగా
జంటితేనెవంటిమోవి గంటుసేయర ॥౧॥

చిన్నిచన్నులపైనఁ గొనగోర జీరలుంచరా।
మన్నెహంపీర, నన్నురమ్మని మాటలాడరా ॥౨॥

ఘంటారవము॥ ఆట॥

ప్రాణేశ, నాగుబ్బపాలిండ్లపై గోర
నేణాంకుని గుఱుతు లిపుడుసేయర।
వీణెను నినుజాలవేడుకఁ జొక్కించుతు
జాణ, రారాయిపుడు నాసరసకురారా ॥౧॥

ఏమిర విజయరాఘవేంద్ర, మ్రొక్కెదరా।
ఈమోహము నేనెటువలెఁ జాళుదురా ॥౨॥

వ. మఱియు నొకయిందువదన యారాజకందర్పునింజూచి డెందంబున నానందంబు సందడింప నేమనుచున్నది.

ధన్యాసి॥ ఆది॥ దరువు॥

కలికిరో వీనిఁగలిసిన దెక్కొమ్మ-చెలులలోన దెమేలు చెలియమ్మ ॥౧॥

కలనైనవీనిఁ గలయఁకమానలేనె
పలుకుఁబంతము నాబాళిచూడవె ॥౨॥

లలితపంచమం॥ ఆట॥ దరువు॥

చాలమేలుదాన నీతో సరసములాడకమాన।
బాలాపాంచాల చలమేలయేలరా ॥౧॥

మరులుకొనినదాన మరునిపాదమాన
కరుణించియేలరా గారవమువిూఱ ॥౨॥

వ. మఱియు నొకకలకంఠి యారాజకంఠీరవునిం జూచి మనసునిలుపలేక యొక కుటిలకుంతలతో నేమనుచున్నది.

కాంభోజి॥ జంపెతాళము॥ దరువు॥

వలపురెట్టించెనేకొమ్మ వలరాజు పగవాఁడోయమ్మ
చెలువుని నిటుతోడి తెమ్మా।
చెలియరోనామనవి చేకొనవమ్మా ॥౧॥

వలపునామదిదాఁచరాదు। వనితరో యిదికల్లగాదు
చెలరేఁగె మరువింటినాదు–చేకొనవెనామనవి
యేటికెవాదు ॥౨॥

కేదార॥ ఆట॥ దరువు॥

మ్రొక్కెరా రారా నీచక్కెర–మోవి తేనెలీర।
చక్కని విజయరాఘవ–జాణరాయయేరా ॥౧॥

ఏలర నాపైనింతచల – మేల తాళఁజాలర।
చాల నిన్ను నమ్మినార – సరసుఁడ వేగరారా ॥౨॥

వ. మఱియు నొకభద్రగజయాన మారామభద్రానుజునిం జూచి యేచినతమి నేమనుచున్నది॥

ఎరుకలకాంభోజి॥ ఆది॥ దరువు॥

సామి నీవిటురారా నీచక్కెరమోవీర।
నామనసునీపైఁజాల నాటియున్నదిరా ॥౧॥

విటరాయ నిన్నుజూచి వేమాఱుచొక్కితిరా।
బటువుగుబ్బల నీరొమ్ము పలుమారు గ్రుమ్మరా ॥౨॥

దరువు॥ ఆహిరి॥ ఆది॥

ముమ్మరించిన మోహమాయెరా – మోహనాకార చేర రారా।
ఎమ్మెలు సేయఁగమేర – యేర నారీచిత్తచోర ॥౧॥

వ. ఈరీతిఁ బౌరనారీతిలకంబులు తమతమ విలాసవిభ్రమ వైచక్షణ్యంబులు మీఱి విలోకించుతఱి మన్నారుదాసుండును ఆమగువలఁ గ్రేగంటఁ జూచుచు వచ్చుసమయంబున గాటంబుగా వేఁటకాండ్రను డేగలు జాగిలంబులును జిగురుకండెలు సెలవిండులు వల లురులు పందిపోటులు పికిలిపువ్వులయీటెలు బోనులు లోనుగాఁగల సాధనంబులు గైకొని తనవెంట నంటి కొలువ నింపుసొంపునింపుచంపకవనంబుచేరి నివ్వటిల్లు నవ్వన వైభవంబువీక్షించెనఁట యెటువలెను.

కవివచనం పద్యం :

సీ. మందార ఖర్జూర మాకందజంబీర
పున్నాగ వకుళాది భూరుహాములు,
కీరమయూర కోకిలభృంగ చక్రాంగ
సారసముఖ పక్షి సంఘములును,
హర్యక్ష శార్దూల హస్తీంద్ర భల్లూక
హరిణముఖ్యానేక వరమృగములు,
కైరవ సారస కాదంబ నికురుంబ
సారంబులైన కాసారములును

గీ. చాలవేడుక నెఱయించు శైలగుహాలు
గాటముగఁ బాఱు నలసెలయేటిగములు
మంజులామోదరమ్య నికుంజములును
నించు వేడుకతోడ నీక్షించె నృపుఁడు.

వ. ఇవ్విధంబున నివ్వటిల్లు నవ్వన వైభవంబువీక్షించుచు వచ్చి, యపుడు విజయరాఘవభూపాలుండు ఎంచఁదగు చెంచు మన్నీలను మేటితనంబుగల వేఁటకాండ్రను అచ్చోఁ హెచ్చరించి, పొలములకుఁ బలుమేర వాఁగుపాఱించియును, ఓదంబులుత్రవ్వించియు, వలలొడ్డించియు, నురులుపన్నించియు, బిసలుపోసఁగించియు, బోనులాసించియు, చిలుకుములుకులుఁ గల పలకలు పెఱతెరువుల నెఱయించియు, నట్టహాసంబులు సేయించి చోపు నెట్టించి,

ఒక్కొకచోట చక్కడిగి యచ్చటిజనుల హెచ్చరించుచు, నొకొక్కయెడ తురంగంబు నెక్కి సంచరించుచు, నన్నిదిక్కుల దానయైయున్నయట్లు మెలంగుచు, కూఁతలునెఱయించి యును వాద్యంబులుమొరయించియును, ఆకులపడఁ బలుతుపాకులు ముట్టించియును, ఈరీతి బెదరుపుట్టించియు. నదరిపడి నిదురచెడి సొంపుపీడి గుంపుగూడి నెలవులుగడచి చలములు విడిచి సింహశరభశార్దూలగండభేరుండాదు లొండొండ కలంగి బెండుపడి మెండుచెడి సంచరించుసమయంబున నాటవికులను వేఁటకాండ్రను హెచ్చరింపుచు నచ్యుతవిజయరాఘవేంద్రుఁడు నీటుమీఱి వేఁటలాడెనఁట యెటువలెను.

బిలహరి॥ జంపెతాళము॥ దరువు॥

సింగార మమరంగ సింగాణి యెక్కిడి
సింగముల నేసె మగసింగమా విభుఁడు ॥౧॥

వాలమ్ము గైకొని వాలుచు నున్నట్టి
కోలము సేసెను కువలయాధిపుఁడు ॥౨॥

నిబ్బరమైనట్టి నేజ కోలపూని
బెబ్బులిని బొడిచెనాగబ్బిమన్నీఁడు ॥౩॥

వ. అంత నావిజయరాఘవమహీకాంతుఁడు చెంతనున్న చెంచుదొరలకు వేఁటకాండ్రకు సెలవిచ్చిన మచ్చరంబుమీఱి క్రిచ్చక యచ్చటిమృగంబులంజూచి యొకరినొకరు హెచ్చరించు కొనిరఁట యెటువలెను.

చెంచులమాటలు॥ వోరేవోరే యీకెలవాండ్లల్లా యీపార్శ్వనకు పోండండ్రి. తుపాకుల వాండ్రిందఱున్ను అటు నిలువండ్రి. ఉరులవాండ్రందఱు నొకదిక్కుగా నిలువుండ. వలవాండ్రు బోనులవాండ్రిందఱున్ను వెనుకదిక్కున వుండండ్రి. సింగా, సింగంవచ్చేదోవ సూసుకోనేవుండు. ఓనందిబావా, పందివచ్చే దారిపదిలంగా పొంచికాచుకయుండు.

న. అని యీచందంబున వేఁటకాండ్రొకరొకరిని హెచ్చరింపుచు సూటిగా వేఁటలాడిరఁట యెటువలెను.

మంగళకైశిని॥ ఆట॥ దరువు॥

బెబ్బులియదుగో బొబ్బరింపుచువచ్చె
బొబ్బరింపకురా గబ్బి తిమ్మ!
అబ్బబ్బ యిది దొడ్డ దబ్బె యీమెకమును
గొబ్బునఁగ్రుమ్మి నేయుబ్బణంచెదను॥ తానందనా
ననా తానతానా నందనతాన ॥౧॥

చెంచుమాటలు ॥ వోరెవోరె వెరవుకుర వోరే నేనుండా వెరవుకర నే సూచివచ్చెద గాని వెఱవకురా.

మరొకఁడు : వోరి, వెరపించంబోయి వెరచినట్లా నీవేపడి తన్నుకొంటా వున్నావు. నన్నుజూడరా నే బోయి పొడిచి వచ్చేను.

మరొకడు : ఓరి, పడ్డాలేచినా నాచేతనయ్యేకార్యం మీచేత నౌనా ? యిప్పుడుచూడరా నామొగతనం నేపులిని బొడుచుకుంటావస్తావున్నాను.

మరొకఁడు : అయ్యో అయ్యో సామి, పులిని బొడిచినవాడు వాడంటూవుండవద్దు. నేనైతే పులిని బొడిచినవాఁడు. వాఁడు వుత్తవాఁడు. బహుమానం నాది. వొరే కోఁతి ఆడితే జోగి పోసుకపోయినట్టు కాదురా. నా స్వామి వారి వారిమేలిమి యెఱుంగును.

మఱొకఁడు : సామి, నాయిన్న పంవినుండ. వీఁడనంగానెద్ది పులిని బొడిచేదనంగానెద్ది. పులిని బొడిచినవాణ్ణు నేను.

మఱొకఁడు : అవురా పులిని బొడిచినవాణ్ణు నేను గాదంటివి.

మఱొకఁడు : ఓరి నీవనంగానెద్ది ! పులిని బొడిచేదనంగానెద్ది! పులినిజూడంగానే విలవిలపడి తన్నుకొంటివే. నేను గాదంటూవి నీకువెఱపుదీర్చినది !

దరువు ॥ బెబ్బులి యదుగో బొబ్బరింపుచు వచ్చె
బొబ్బరింపకుర గబ్బితిమ్మ।
అబ్బబ్బ యిది దొడ్డ దబ్బెయీమెకమును
గొబ్బున గువ్విమ్మి నే మబ్బణంచెదను ॥౧॥
సింగమదిగో చెంగునదాఁటుచు
రింగునవచ్చె నా ముంగలను।

సింగ, యిప్పుడు నా యంగునబడె దీని
సంగునగుర్రిమ్మి నేపొంగణంచెదను తానా ॥౨॥

పంది యదిగో బలుపందినపొదవుంశో
నందందపొడసూపె నందిబావా।
పందియదెంత నాపందిపోటున పర్రక-
సందిగుర్రిమ్మెదు నిఁక సందియమేల॥ తానా ॥౩॥

మాయమెకమునలె మాయమైతిరిగితిని
మాయలే డందుకే మాయెలేరా।
మాయలన్ని నేమాయము సేతును
మాయది సూడుము మాయంద మిపుడు॥ తానా ॥౪॥

వ. ఈచందంబున నానామృగబృందంబులఁ గొందలమందఁ జేయుచు డొక్కలు పక్కలు కాళ్ళును వేర్లును శిరంబులు కరంబులును భేదంబుదెలియరాకుండ నుఱుమాడి పేరువాడి యందఱు నవ్విభునిముందఱ గుంపుగూడి సొంపుమీఱి యమ్మాంసఖండంబులఁ గఱకుట్లుగావండి, కాచేర్రిని ముందఱ నుంచి యందఱుభుజియించి, గట్టునఁ దేర్రించుచు బొజ్జలు నిమురుచుఁ దమ సామిలీలలు చాలఁ బాడిరఁట యెటువలెను.
మాట॥ వారెవారె నాకు సుమాళం వస్తావుండది కాటమ రాజుపదాలుపాడెద యినరా.

మఱొకఁడు : అయితే పాడుకోరా.

కాంభోజి॥ ఆట॥ దరువు॥

కుంభములోఁ బుట్టినట్టి కుంభకర్ణుని కొడుకవై
కుంభమల్లా డింటివిగదరా ఓ కాటమరాజ !
కూరనార వెతకవుగా॥
అంబాలిక నాగసాన అంబుధిదాఁటువేళ
పంబలువాయింపుచును - ఓకాటమరాజ
కంబళి నాచు కొంటివిగా॥
సుప్పనాతి ముక్కుపోయి - నొప్పిచేత మూలుగంగ
ఇప్పపూల దండవేసి - ఓకాటమరాజ
అప్పుడే కూడితివి గదర॥

వెంచుమాట ॥ వారెవారె నాకే కంబమురాయనిమీఁది పదాలు వస్సిరా.

మఱొకఁడు॥ అయితే అరిచందకత చదుచ్చుకున్నావో, ఇంత అల్లికోరా.

మంగళకైశిక॥ ఆది॥ దరువు॥

సరిగ పార కేలఁబూని - వెలుగుమీఁది తొండవలెను
ఎలుగురాజు మీఁదనెక్కి - ఓకంబమురాయ
జలదారి దాఁటితివేర॥

మంచము నెత్తిఁబెట్టుక - కంచము వాయించుకొంటి
మంచుకొండ మీఁద నెక్కి - ఓకంబమురాయ
వెంగలికూర దెచ్చితివిగా॥

మాట॥ వోరే నాకు కూనలమ్మమీఁది పదాలు వస్తేరా.

మల్లోకఁడు॥ అయితే పాడుకోరా.

ఘంటారవము॥ఆది॥

బూరుగమానుగని-బూచియని వెఱచుకొని
బొబ్బరింతువుగదమ్మ- పోలేరమ్మ ॥౧॥
వాలుజన్ను లల్లాడంగ-నాలుక వెళ్ళఁబెట్టుక
వ్రాళబెట్టుదువుగదమ్మ-పోలేరమ్మ ॥౨॥

మాట॥ వోరే యిదేవిరా కూనలమ్మమీఁది పదాలుపాడు
మంటే పోలేరమ్మమీఁద ననేవు.

మల్లోకఁడు॥ వోరే వీనిచేతగాదు, నేననేరా.

పున్నాగ॥ ఆది॥ దరువు॥

కుండనిండ కొండగోఁగు-కూరవండి
కూకుండి తిందువమ్మ-కూనలమ్మ ॥౧॥
కోతికూన చంకఁబెట్టి-కోటయెక్కి
కొక్కిరింతువుగదమ్మ-కూనలమ్మ ॥౨॥
కూటికుండ తెరచివేసి-గునిసియాడుచు
కుక్కలదోలుదువమ్మ-కూనలమ్మ ॥౩॥

మాట॥ వోరే నేను దరమరాజుమీాది పదాలు అనేరా.

మఙొ్కఁడు॥ వోరే నీవు కుసలవపురాండం సనికినావో?

మునుపటివాడు॥ సటికితే నెద్ది సనకుం౦టే నెద్ది.

ప్రత్యుత్తరం- అయితే సనకటించరా?

కాంభోజి॥ ఆట॥ దరువు॥

ఉడుములఁబట్టి తెచ్చి నడుములకు త్రాడుగ్రుచ్చి
కొడవలిచేతికిచ్చి-ఓదరమరాజ
అడవులలో నాడితివిగా।
బొద్దికూర సద్దిగొంచు-మద్దెలనెత్తిఁబెట్టుక
మద్దిమానిమీాఁద నెక్కి--ఓదరమరాజ
యెద్దులను మేపుదువుగా॥

మాట॥ వోరే నాకు దరమరాజుమీాది పదాలుపాడగానే శివం
వస్తావుండదిరా.

మఙొ్కఁడు॥ వోరేవోరే వీనికి నిబద్దిగా దరమరాజుశివం వస్తా
వుండదిరా. మన చాకలిమల్లుగాఁడు తనకుంటిగాడిద
పారిపోయెను కానమనెనె. దరమరాజుశివంయెక్కించి
అడుగుదాముగాని పంబమూ_ర్తిగాణ్ణి పిలువరా.

ప్రత్యుత్తరం॥ మంచిది పిలుచుకవచ్చెదనయ్యా. వోరే పంబ
మూ_ర్తిగా, చెంచురాయఁలు పిలుస్తావుండాడు రారా
వోరి వడిగా రారా.

వ. అని వాఁడుపిలువఁగా సంబరముగా పంబమూర్తిగాఁడు వచ్చినట యేటువలెను.

వ. కంబమురాయనిమీఁది కవులు పాడుకొంట।
పంబమూర్తిగాఁడువచ్చె బాగుమీరఁగను॥

వ. ఈరీతిఁ జేనవచ్చిన పంబమూర్తిగాఁడు చెంచుదొరను జూచి యేమనుచున్నాఁడు.

పంబవానిమాట॥ ఏమయ్యా చెంచు రాజులు, సుమ్మొరప్పించిన కార్యమేమనుచు.

చెంచురాజులమాట॥ మేమందఱము గూడుకొని యొక కాసు ఇచ్చేదముగాని మాదరమరాజును వొకటి అడగవలసి యున్నది. శివం రప్పించరా.

పంబవాఁడు: మంచిది అయితే యీడ అలుకుండ.

ప్రత్యుత్తరం: అలికితి.

పంబ: పిళ్ళారిని పెట్టుండ.

ప్ర: పెట్టితి.

పంబ: పిళ్ళారినెత్తిమీఁద గరికపెట్టు.

ప్ర: గరికపెట్టితి.

పంబ: పండ్లు టెంకాయలు కొంటరా!

ప్ర: కొంటనస్తి.

పంబ: వక్కలాకులు కొంటరా?

ప్ర: వస్తి, ఇంతాచేస్తిమే శివంబట్టించు.

పం౦బ: అలాగే పట్టించేమయ్యా.

మల్లో౦కడు: ఎట్టాపట్టించేది.

దరువు॥ ఘంటారవము॥ ఆది॥

వుప్పులేనిసంగంజ వోదర్మరాజ!
వూదుకతాగుదువయ్య వోదర్మరాజ ॥౧॥

వుట్టిమీదకెగరబోయి వోదర్మరాజ
కాలువూనమాయెఁగద వోదర్మరాజ ॥౨॥

వొడ్డిమానిమీదనున్న వోదర్మరాజ
వూగివూగి యాడుమయ్య వోదర్మరాజ ॥౩॥

వుల్లంకిపిట్టవలె వోదర్మరాజా
వులికికులికి యాడుమయ్య వోదర్మరాజా ॥౪॥

వూసరవెల్లివలె వోదర్మరాజ
తలవూచియాడుమయ్య వోదర్మరాజ ॥౫॥

మాట: వారేవారే వీనికి శివం గుబగుబలుగావస్తాఉండది.
దూపంతేరా దూపంతేరా. ఓఅయ్యలారా, యిప్పుడు
మీరనేకార్యం అడిక్కొండ.

మల్లోకడు: అయితే అడిక్కనేమురా.

తిరుగ చెంచుమాట: ఓసామీ ధర్మరాజయ్యా! చాకలిమల్లు
గానిగాడిద యేడబోయింది తెలీదు. సామీ సెప్పి
కాపాడవయ్యా.

ధర్మరాజుమాట: అవురావోరి, అయితే యేంబెట్టేవురా?

చెంచు: సామీ, నీవుసూసి యేంబెట్టుమన్నా పెట్టేమయ్యా.

ధర్మరాజు : లెస్స పెట్టేవా ?

చంచు : లెస్స 'పెట్టేమయ్యా.

ధర్మ : అయితే చెప్పేవినరా . వోరేవోరే ఆసందులోకిపో,

చెంచు ; సామీ, పోతి.

ధర్మ : అడనుండి ఆడకుఁబో.

చెంచు : అయ్యా పోతి.

ధర్మ : ఆడాడ సూడు

చెంచు : సూసికాడితి, కాన.

ధర్మ : అయితే ఆవొంటిగుంటి మీఁదనెక్కి పెంటిగాడిదవలె కూసి కాడు; పోతుగాడిదతా నేవస్సిరా.

చెంచు : సామీ నాసేతగాదు. దేవర ఆడకువస్సికూసికాడి సూపవయ్యా.

ఒకడు : ఓరీ, సామి లెస్స తెలియసెప్పెరా.

మరొకఁడు : ఈశివంసాలు నిలువవయ్యా.

ధర్మ : నిలదు నిలదు.

చెంచు : నీకు నీకండ్లా నిలు; తన సొట్టపాదాలమీఁదనేనిల .

ధర్మ : నిలదురా, నిలదురా.

చెంచు : అయితే జాట్లుతేరా.

ధర్మ : అయితే నిలిసెరా. నిలిసెరా.

వ. అంతట నాచెంచులు పులిగోరులు, నేనుంగుతలలో ముత్తియమ్ములు, చమరీవాలమ్ములు, సింహశరభశార్దూల గండభేరుండాది చిహ్నంబులు కైకానుకలుగా దెచ్చియిచ్చిన మెచ్చుచు నచ్యుతవిజయరాఘవమహీపాలుం డాచెంచు దొరలకు హెచ్చుబహుమానంబులు సేసి, యచ్చట సొంపు సంపాదించు తనబిడారంబగుగుడారంబునకువచ్చి, భోజనాది కృత్యంబులుగావించి యుంటవిల్లు కేలంబూని తుంట వింటి దొర యందంబుగనుప్పట్టు, నాపట్టభద్రుండు చెంగటం జెన్నొందు పున్నాగ నారంగ జంబీర నారికేళాదితరువుల నీడలనాడాడ సంచరింపుచు వినోదింపుచు నుండెనట యెటు వలెను.

హుశాని॥ ఆట॥ దరువు॥

ఒఱపు మీఱినయట్టి యుంటవిల్లు చేబూని
పరిగదుప్పటి కటిం జక్కంగాం గట్టి।
మరుని దేజము గెల్చు మన్నారుదాసుండు
దురుసుగా సంపంగితోంటలో విహరించె॥

వ. ఆసమయంబున సుగుణాంబునిధియగు కళానిధి రాజపుత్రియైన మదనమంజరియనుజగన్మోహనగాత్రి జవ్వనులు గొలువ నవ్వనంబునకు వేడుకలుమీఱ, విహారంబు గావింపుచు వచ్చేక్రమం బెటువలెను.

కవివచనం :—

ది. ఆవేళ నొకకొమ్మ యపరంజి బొమ్మ
తాావైన పూారెమ్మ తగు ముద్దుగుమ్మ
భామాలలామ సౌభాగ్యంపు సీమ
హేమాంగరుచిధామ హితగుణారామ
కమ్మవిల్తునిదివి కప్పురంపుఁ గోవి
తమ్మి నెత్తావి కుందనములకీవి
వనితలనేల్బంతి వలపులదొంతి
మనసిజు మదదంతి మరువంపుబంతి
చెంగావి పావడ చెలువుమీఱంగ
రంగారు కనకాంబరంబు ధరించి
యోణిముత్తెపుజంటి హారువున నంటి
రాణించి మించినఱవికయుఁ దొడిగి,
యలరులు కొప్పునహావణించి నుదుటఁ
దిలకంబు కొనగోరఁ దీరుగా దిద్ది
పచ్చముంగరఁ బెట్టి బటువుముత్తెముల
హెచ్చైన కుతికంటు నెంతయు మెఱయ,
పలక వజ్రమ్ములఁ బాపటబొట్టు
తులకింప సూర్యచంద్రుల నేర్పరించి,
కరమొప్ప రతనాల కమ్మలు వెలయ

మురువులుఁ బవిగెలు ముద్దుకంటెయును,
సరిపెనల్ పదకముల్ సందిదండలును
మురువైన యొడ్డాణమును మొలనూలు,
మెట్టెలు పిల్లాండ్లు మించుల మించు
నట్టి కెంపులయందియలు పైఁడిగజ్జె
లతి రయంబునఁ బూని యందచందముల
నతనుని సమ్మోహనాస్త్రమో యనఁగ
నడపంబు పావడ యరవిరి సురటి
పడఁతులు పూని వెంబడిని గొల్వంగఁ,
గలికి మిటారులు కైదండలొసఁగఁ,
గలకంఠ శుక శారికల రవంబులకు
హృదయంబు రంజిల్ల నెలఁదోఁటకపుడు
మదనమంజరి వచ్చె మహిమ దీపింప.

బిలహరి॥ ఆది॥ దరువు॥

చెలువలు గొలువఁగఁ జెలఁగుచు మదనమంజరి
చెలువైన యెలదోఁటఁ జేరఁగా వచ్చె।

వ. ఈరీతిఁ జేరవచ్చిన యారామను జూచి వద్దనున్న రామామణులు అభిరామంబుగాఁ గనుపట్టునారామంబుచూడు-మని హెచ్చరించి మచ్చికమీఱ నేమనుచున్నారు.

చెలికత్తె చదివే ద్విపద)

ద్వి. ఎలనాగ, చూచితే యెలమావిసాగను
అలరువిల్తుని సౌధమనఁ జెన్నుమీఱె.
పొలఁతిరో చూచితే బొండుమల్లియలు
అలరారె మకరాంకుహారంబులనఁగ.
చెలియరో చూడుమీ సేమంతి బంతి
వలరాజు గొడుగుల వైఖరిఁ దనరె.
కొమ్మరో వాసించు కురువేరు చూడు
కమ్మవిల్తుని కుంచె కైవడి మించె.
పడఁతిరో యిపుడుసంపగివిరుల్ చూడు
నెడవిల్తు బంగారువిరిదండ లయ్యె.
మల్లెలు జాజులు మాధవీలతలు
మొల్లలు కురవకములు గన్నేరులును
గుజ్జుమామిళ్ళును కోవిదారములు
గొజ్జఁగుల్ నోదుగుల్ కురువిందపొదలు
నారికేళంబులు నారంగములును
పారిజాతంబులు పాటలంబులును,
గలిగి యెంతయుఁ జాలఁ గనుపట్టెనిపుడు
అలచైత్రరథమన హరువున మీఱి
ఇందిరాదేవికి నింపు సొంపెసఁగు

కెందమ్మి కొలఁకులు కెలన గన్పట్టె.
కొలఁకులఁ గెలఁకులఁ గోయిల లళులు
చిలుకలు హంసలు చెలఁగి పల్కెడిని.
కలకల ధ్వనులు న్గడలందు నెఱయఁ
జెలఁగుచు నున్నది చెలువ, చూచితివె!

వ. అని నెచ్చెలితో హెచ్చరింపుచు నెల నవ్వులు నివ్వటిల్ల నాపువ్వుఁబోఁడియుఁ దామును బువ్వులు చిదుముచు సరస వచనరచనలు మెఱయింపుచు విహరించిరఁట యెటువలెను.

సావేరి॥ ఆట॥

కొమ్మ యిాసంగి కొమ్మచూచితివె చే
కొమ్మ యిదె నీకు సమ్మతమమ్మ. ॥౧॥

సౌరాష్ట్రము॥ ఆట॥

సరములు భళిరె మాసరములు ఇవి చే
సరములు గూర్పుము సకియ ॥౨॥

సావేరి॥ ఆట॥

కన్నెరోయిప్పుడు – కన్నెఱ్ఱసేయనేల
కన్నెపొన్నవిరులు – గైకొనవమ్మా ॥3॥

సౌరాష్ట్రము॥ ఆట॥

తావికినెల్లను – తావిదివోనేల
తావిరి బంతివింత....................... ॥౪॥

సావేరి। ఆట॥

సన్న సేసెదవు ఈసన్న జాజులకును
సన్నుతాంగి మనసెన్న దగువిరులు ॥౫॥

వ. ఈరీతి నారీతిలకంబులు వనవిహారంబులుగావించి,మించిన వేడుకలంబొడమిన బడలికలుదీర నప్పుడంతుకఁ దోడ్కొని కాసారంబు చేరవచ్చి యాసింహమధ్యలు పద్మాకరమధ్యంబున నిల్చి యొకరినొకరిం చేరుకొనుచు, అండెలునందంబగు చిమ్మన గ్రోవులు కేలఁబూని వారి విహారంబు సలిపిరఁట యెటువలెను.

కేదార॥ ఆట॥ దరువు॥

చిమ్మనగ్రోవులు చిమ్మెద నిప్పుడు
ఎమ్మెలు సేయక యెదురుగ రావె ॥౧॥

అరవిరులను నేను అండెల నించుకొని
తరుణిరో చల్లెదఁ దప్పించుకోవె ॥౨॥

పూవుఁబోఁడిరో నేను పుష్పాదుల గుప్పెద।
నావలఁ బోనిత్తునా నావగఁజూడు ॥౩॥

జారుడు పీఁటలెక్కి సారసముఖులార।
సారెకు నాడుదాము చేరంగరారె ॥౪॥

కలువకంటిరో యిపుడు కలువపూవులచేత
నెలమిగో నాడుదము ఇటు చేరరావె ॥౫॥

వ. ఈరీతి వారివిహారంబుగావించి తీరంబు చేరంగవచ్చి, రంగుమీఱ శృంగారించుకొనినంట యెటువలెను.

సీ. చెంగావి పావడ శృంగారమమరంగ
రంగారు కనకాంబరములు దాల్చి
కురులు నున్నగ దువ్వి కొప్పులొప్పుగఁ బెట్టి
మురువుగా విరవాదిసరులు చుట్టి
తిన్నని మోములఁ దిలకముల్ మెఱయించి
పొలుపొందఁ దాటంకములు ధరించి
రాణించు ముత్తెపురవికలపై కంట
సరులు నుత్తరిగలు నెఱయ జేసి,

గీ. సరిపెణలు బన్న సరములు సందెదండ
లుంగరంబులు మొలనూలు నొనరు కంక
ణమ్ములందెలు మొదలైన సొమ్ములెల్లఁ
జెలులు దాల్సిరప్పుడు చెలువమమర.

వ. ఇత్తెఱంగున మెఱుంగుఁబోఁడులు శృంగారించుకొని యంగనామణిం దోడ్కొని మున్ను తామున్న కప్పురంపుఁదిన్నియపై హరువుమీఱు సురపొన్నతరువుచేరవచ్చిరట యెటువలెను.

కన్నడ॥ ఆది॥

సరసిజముఖి యపుడు సకియలు గొలువంగ।
సురపొన్న నీడకు సొంపుతో వచ్చె॥

వ. ఇటువలె వచ్చి కుటిలాలకలో నాపాటలగంధులాట పాటలఁ గొంతసేపు ప్రొద్దుపుచ్చుచున్న సమయంబున నా కాంతామణినింజూచి చెంతనున్న యొకయింతి యేమనుచున్నది. చెలికత్తె చదివే పద్యము.

గీ. నేఁడు శుభమగు దివసంబు నీరజాక్షి,
మన్ననారుల సుతునంటి మగని నీవు
పెండ్లియాడి జగంబులఁ బేరుగనుట
కించువిస్తునిఁ బూజింత మిప్పుడమన్నము.

వ. అని యాలోలలోచన లీలావతిలోఁ దెలుప నాబాలిక లించుఁబోఁడిచేతఁ బంచబాణుని పూజసేయింప నుద్యోగించి, పూజాద్రవ్యంబులు గొంచు వచ్చిరంట యెటువలెను.

తోడి॥ ఆట॥

తెలుకుఁ జూపుల ముద్దుగులుకంగా నవ్వుచు
కలువకంటి యొకతె కలువలు దెచ్చెన్ ॥౧॥

మొలక నవ్వులు మీఱ ముద్దియయొక్కతె।
పొలుపు మీఱఁగ మొల్లపూవులు దెచ్చె ॥౨॥

ఖాచి॥ రూపక। ఆటతాళము॥ దరువు॥

మగువ యొక్కతె తావి మిగుల రాణింపంగ।
పొగడంగఁ దగినట్టి పొగడపూవులుదెచ్చె ॥3॥

నటనలు మెఱయంగ బటువుగుబ్బలు గదల
కటిలకుంతల యొకతె కురువేరుదెచ్చె ॥౪॥

మల్లారు॥ ఆట॥

సరసిజముఖి యొకతె సరిలేక రాణించు
సరసిజములుదెచ్చెఁ జాల వేడుకను ॥౫॥
రాజీవముఖి యొకతె రంజిల్లు సన్న
జాజులుదెచ్చెను సరగున నపుడు ॥౬॥

హుశేని॥ ఆది॥

చందనకుంకుమ సంకుమదంబులు
ఇందుముఖి యొక్కతె యెలమిఁ దెచ్చెన్ ॥౭॥
బంగారు పళ్లెమున ఫలములక్షతములు
అంగన యొక్కత యందముగఁ దెచ్చె ॥౮॥

వ. ఈచందంబునఁ బరిమళఘనసారకుంకుమ సంకుమదఘనసార గంధసారాది నిస్తులవస్తువులు దెచ్చి పచ్చవింటిదొరను పూజ సేయింప నమర్చిన సంవిధానం బెటువలెను.

కవివచనము :

సీ. రామలందఱుఁ గూడి లేమావినీడను
దిన్నెఁగాఁగపురంపుఁ దిన్నె మర్చి
కురువేరు దవనంబు విరవాదిసరములు
హారువులు మెఱయఁ జప్పరమమర్చి

యొఱపైన చిగురాకు పఱంబట్టుపఱుపుపైఁ
దెలిదమ్మి ముద్దుగద్దియ యమర్చి,
చెలువుమీఱినయట్టి చెంగల్వవిరియను
మెఱుఁగు సూర్యపుటంపుటూరఁగుచేర్చి

గీ. మొగలిరేకను పటమున మృగమదమున
కీరకోకిల కలహంస కేకిభృంగ
హిమకరవసంత మలయానిలములతోడ
నొనర రతిమన్మథుల వ్రాసి యునిచి రపుడు.

వ. ఈచందంబునఁ గందర్పపూజాసంవిధానంబమర్చి యమ్మో ఱుంగుఁబోఁడి తమ్మిదోదుమ్మివేల్పువారముందఱ సుఖాసీనయై యాసఖీమణులందిచ్చు సువస్తుజాతంబులఁ బూజసేసెనఁట యెటువలెను.

మన్మథపూజ॥ చిత్తసంభవం ధ్యాయామి, రతిరాజమావా హయామి, శీతలానిల స్యందనాయనమః సింహాసనం సమర్ప యామి, అనఘశీలాయ నమః అర్ఘ్యపాద్యాదీని సమర్పయామి, వసంతసఖాయనమః వస్త్రగంధాక్షతాన్ సమర్పయామి, కుసు మాయుధాయనమః నానావిధకుసుమాని సమర్పయామి, అప్ర తిమప్రతాపదీపాయనమః ధూపదీపానిసమర్పయామి, ఇక్షు కోదండధరాయనమః హృద్యతరనైవేద్యాని సమర్పయామి, నీరజాస్త్రధరాయనమః నీరాజనంసమర్పయామి.

వ. అని యానీరజవదన రతిరాజపూజ గావించి నిటలసంఘ టితాంజలి పుటయై సుమనోరథసిద్ధికై యా యనిరుద్ధజనకునిఁ బ్రార్థించెనఁట యెటువలెను.

(నాయకురాలు చదివేపద్యం)

గీ. చెంగమలవల్లి కరుణచేఁ జెలఁగువాని
మన్ననారుల దయగల్గి మనెడువాని
నీవసుంధరనెల్లను నేలువానిఁ
బతినిఁగా దయసేయుము పంచబాణ!

వ. అని యా వనజగంధి మఱియు నేమనుచున్నది.

బిలహరి॥ఆది॥దరువు॥

రతిరాజ, నీవంటి - రమణీయమూర్తిని
పతిఁజేసిరక్షింవు - పలుమాఱు వేడెదను।

వ. ఈకైవడి నా కీరవాణి పంచశరారాధనంబు గావించి, సంతోషితస్వాంతయై, యిందువదనలుఁ దాను నిజమందిరంబుఁ జేర నుద్యోగించుతఱి, మవ్వంబున నివ్వటిల్లు నవ్వనంబున నందంబగు నొక సురపొన్నతరువుక్రింద నుంట విల్లుగైకొని తుంట వింటిదొరదారి నీటుమీఱి సంచరించుచు తమ విలాసవిశేషం బులు విలోకింపుచునున్న మన్నారుదాసభూపాలునిం జూచెనఁట యెటువలెను.

కవివచనం:—

సీ. కొమరు నీలపురంగు కుంతలద్యుతివాని
ముద్దుగుల్కెడు నవ్వుమోమువానిఁ
దెలిదమ్మిరేకులఁ దెగడు కన్నులవాని
వలమురి నిరసించు గళమువానిఁ
బసిఁడితాల్పు నదల్చు బాహాంతరమువాని
నురగేంద్రు గెలుచు బాహువులవాని
సింహావలోకనశ్రీలు గాంచినవానిఁ
గమలరేఖాంకపాదములవానిఁ

గీ. జెలుల ముచ్చటలొనగూర్చు చెలువువాని
నించువేడుక నట సంచరించువాని
విజయరాఘవమేదినీ విభునిఁజూచె
భామినీమణి కన్నులపండువుగను.

వ. ఈచందంబునఁ జూచుచు మున్ను తనయెదుటఁ బ్రసన్నుండైయున్న మదనునకు మన్నారుదాసునకు నించుకయు భేదంబు నెంచఁగూడక యా చంచలాక్షి యచ్యుతవిజయరాఘవుని నొక నెచ్చెలికిఁజూపుచు నాపడంతితో నేమనుచున్నది.

(నాయకురాలు వినిపించేది)

దరువు॥ పంతువరాళి॥ ఆది॥

చెలువ, మనముపూజచేసిన చెఱకువింటిరాయలు
నెలకొని ముందఱనిలిచినాఁడమ్మ ॥౧॥

ఉంటవిల్లుగైకొని హాయలుగ సంచరించు
తుంటవింటిరాయడీదొరగాఁబోలు ॥౨॥

కుందనపుఁజాయలఁ గోమలైననెమ్మేని।
యందముచూచితే యంగజుఁడుగాఁడమ్మ ॥౩॥

పున్నమచందమామఁబోలు వీనినెమ్మోము
కన్నులపండువుగాఁ గనుఁగొంటినమ్మ ॥౪॥

ఉన్నదియురమున మన్నారుదాసముద్ర
మన్నారుదాసుఁడే మనువరోయితఁడు ॥౫॥

వ. అనిన మదనమంజరితో నొకమంజువాణి యేమను చున్నది.

(చెలికత్తె చదివేపద్యం)

క. వలరాజు మించుచెలువము
గల రాజులలోన నితఁడు ఘనుఁడెవ్వఁడొకో
తెలియఁగ నేటికి పదవే
చెలియరో, మనసదనమిఁకను జేరఁగనలయున్.

వ. అని యీచందంబున నొకసుందరవదనమందలింప నయ్యిందువదన మేనుపులకరింప మనసునుపలింపనేరక వెనుక నిలిచిన చెలులఁబిలుచు నెపంబున నందియఁబరవళికి వెంటనంటి వచ్చు రాయంచల నదలించుచందంబున మరలిమరలిచూచుచున్న తఱి నామన్నారుదాసుండును ఆవన్నెలాఁడిచెలువంబును కన్నుల

పండువుగాఁ గనుంగొనుచు ననంగుని విజృంభణం బోపనోపక షోలఁతిమీఁది నలపునఁజిక్కి చొక్కి ప్రేమమీఱ నేమను చున్నాఁడు.

(నాయకుఁడు వినిపించేది)

సీ. అకలంకమైన యీయలివేణి మోమున
కిందుబింబము సాటి యెట్లువచ్చు
నెడ లేకయుండు నీయింతి చన్నులకును
జక్రవాకము లెంచ సములుగునె
మృదువులై మెఱయు నీ సుదతి పెందొడలకు
నరఁటికంబము లెనయగుట యెట్లు
అందమౌ నీయింతి మందయానమునకుఁ
బఱచు నంచల నీడు పలుకుటెట్లు

గీ. ఈజగన్మోహనాంగి యేరాజసుతయొ
యింత చక్కనిసుదతి నేనెందుఁగానఁ
జూచినంతనె నామది చొక్కెనిప్పుడు
ఈమగువఁ గూడఁగ నుపాయ మెట్లుగలుగు.

వ. అని యావన్నెలాడి విలాసవిభ్రమంబులు మాటిమాటికి మనంబున నెన్నుచు మన్నారుదాసభూపాలుండు చేర వచ్చినపరిజనంబులుగొలువఁ బురంబుప్రవేశించెనఁట మొఱు వలెను.

దరువు॥ భైరవి॥ ఆట॥

వెలఁది పైఁ దలఁపున విజయరాఘవశౌరి
చెలువొందు పురమును జేరఁగా వచ్చె॥

వ. ఈచందంబున హజారంబుఁ జేరవచ్చి వారివారి తారతమ్యంబులు దెలిసి కనుసన్నల చేసన్నల నుచితసంభాషణంబుల సరసమందహాసంబుల దొరల మరల నిజనివాసంబులకుఁ బంచి యంతఃపురంబు ప్రవేశించి రాజవదనలొనర్చు నీరాజనోపచారంబులు విలోకింపుచుఁ జంపకగంధులెల్లఁ గొలువై యుండియు నాబాలికామణిమీఁది భ్రాంతి మీఱి యుండునంత. నామదనమంజరియును జెంత నింతులుఁగొలువ నిజనివాసంబు చేరవచ్చెనఁట యెటువలెను.

తోడి॥ ఆది॥ దరువు॥

వనితలు గొలువంగ ఘనవైభవము మీఱఁ
దన నగరు చేరవచ్చెఁ దరళాక్షి యపుడు.

వ. ఈచందంబున నామందయాన తనమందిరంబు చేరి మీఱినవిరహాభారంబునఁ జెలువలఁ జేరక చలువలఁ గోరక యాహారంబులెంచక యవ్విభునిపై మనసుడించక నిదుర చాలింపుచు నిట్టూర్పులు నిగిడింపుచు నావన్నెలాడి మన్నారుదాసభూపాలునిపై వలపుతలంపున నతని రూపరేఖావిలాసంబులు వర్ణింపుచు నొకకలికిచిలుకలకొలికితో నేమనుచున్నది.

నీలాంబరి॥ ఆట॥ దరువు॥

మదన వేదనచేత - మనసు కరగీని
సుదతిరో యెలదోఁట చూతము రావె ॥౧॥

వలరాజు గెలిచిన - వన్నెకాఁడు నన్ను
మొలకనవ్వులచేత - మోహపుట్టించె నమ్మ ॥౨॥

సొగసుగా నుంటవిలు - సొంపుతోఁ బూనిన
వగకానికి నేను - వలచితి నమ్మ ॥౩॥

మన్నారుదాసుండు - మచ్చికమీఱఁగ
కన్నెచూపుల చేతఁ - గరగించెనమ్మ ॥౪॥

వ. అని పలికిన మచ్చెకంటితో నెచ్చెలు లేమనుచున్నారు

ముఖారి॥ ఆట॥ దరువు॥

ఇంత మోహముగలదా - యేమందమమ్మ
వింతాయె నీమాటలు - వెలఁదిరో యిపుడు ॥౧॥

ఎలఁదోఁటలందును - గులసతీమణులకుఁ
బలుమాఱు సంచరింపఁ - బాడిగాదమ్మ ॥౨॥

నిన్నవచ్చిన చెలువు - మన్నారుదాసభూవిభుని
గన్నెరో చూతమని - కద యెంచినావు ॥౩॥

చెలువుని జూతమని - పలుమాఱు లెంచేవు।
నెలఁతరో యిది నీకు - నీతిగాదమ్మ ॥౪॥

పగలు రేలును వానిపై - బాళితోనుండఁగా।
మగువరో యిది నీకు - మర్యాదగాదు ॥౫॥

వ. అని మదవతు లదలించిపలికిన మదనమంజరి విని విన ములుచేసి యామదనావతారునిపై మమతమీఱ నావారిజాక్షు ంత్రో నేమనుచున్నది.

ముఖారి॥ ఆది॥ దరువు॥ పాములనాగసరము॥

ఎన్నరాని మోహమాయె నేమిసేతునే।
సన్నుతాంగి, వాని నేనెన్నఁడు గనుఁగొందునే ॥౧॥
మోముమోమునఁజేర్చి ముద్దుగులుకు ముద్దుపెట్టి
ప్రేమరెట్టింపఁగ బిగిఁ గౌఁగిటఁజేర్చి।
భామరో నాప్రాణవిభుని బాళిమీఱఁ జొక్కించి
కాముని కేళి వానిఁ గరగించు టెన్నఁడో ॥౨॥
తేనెసోనలు గురియు తేటైన కెమ్మోవి।
ఆనుచు గుబ్బలగుమ్ముచు నరమర తీఱ।
మానిని యావగలమాటలఁ దేలించి
పూని వానితొడలమీఁదఁ బొందుగా నుండుటెన్నఁడో ॥౩॥

ముద్దుగుమ్మ రమ్మని మోహముమీఱంగ
నిద్దంపు వానిచెక్కిలి నీటుగానొక్కి
అద్దమరాతిరిదాఁక నలయించి తేలించి
ఒద్దికగా వాఁడునేను-హాయలుగాఁగూడుటెన్నఁడో॥౪॥

వ. అని మందలించి యాయిందువదన వద్దనున్నముద్దియతో మఱియు నేమనుచున్నది.

కాంభోజి॥ ఆట॥ దరువు॥ జతి॥

వలపు దాఁచఁగ నేరనే వాఁడు నావద్దికెన్నఁడు వచ్చునే।
కలికిరో విజయరాఘవసామిపై నుంచిన ॥౧॥

వనితరో వాఁడు నావద్దికిఁ జేరవచ్చి
నెనరున చెక్కిలి నొక్కి నీటుమీఱంగ।
కనుసన్న చేయుచుఁ - గౌఁగిట ననుజేర్చి
మనసురంజిల్లఁగ నాతో - మాటలాడినట్లయ్యనే ॥౨॥

వ. అని మఱియు నేమనుచున్నది.

సావేరి॥ ఆది॥

కలికిరో మావిజయరాఘవుఁ దోడితేవే।
నిలుపరాని మోహమాయె నిముసమొక్క యేడాయె॥౧॥

చక్కని వారిలోఁ - జక్కనివాఁడోయమ్మ
దక్కితినేవానికి నా - తమినిలుపఁ జాలనమ్మ ॥౨॥

చిలుకతేజీరౌతు చెలఁగి - దాడివచ్చెనమ్మ।
కలనైన వానిబిగి - కౌఁగిలెడఁబాసనమ్మ ॥౩॥

ముందఱవచ్చినిలిచి - ముచ్చటాడి నట్లయ్యెనే।
మందగమన, వానిపై మమత ఘనమాయెనమ్మ ॥౪॥

వ. అని పలికి యాచిలుకలకొలికి వేఱొకకలికితో నేమనుచున్నది.

హుశాని॥ ఆది॥

వెలఁదిరో రమ్మనవె – విజయరాఘవసామిని।
నిలుపరాని మోహమాయె–నేనేమి సేతునె ॥౧॥
తళుకుఁ జెక్కులునొక్కి – తమిమీఱఁగఁజొక్కి
కలుకుగుబ్బలఁ గ్రుమ్మి–కూడియుండమనసయ్యానె ॥౨॥
పలుచని వానిమోవి – పలుమొన గంటునేసి
యెలమిఁ గౌఁగిటఁజేర్చి–యెప్పుడు గూడమనసయ్యానె॥౩॥

వ. ఇట్లాలింగునఁ జిత్తజాయత్తచిత్తయై విజయరాఘవమేదినీ కాంతునిపై మోహవిభ్రాంతిఁ జేనున్న యందంబుచూచి చెంత నున్న కాంతామణు లేమనుచున్నారు.

జంపు॥ భైరవి॥ ఆది॥

ఈరాజముఖివలపు హెచ్చాళమాయె।
నూరకుండఁగ మనము మేరగాదమ్మా ॥౧॥
మగువపై మలసిన మలయమారుతమును
ఇగురుఁబోఁడులార, యిపుడు వేడుదమ ॥౨॥

రామకవి॥ ఆది॥

కలువచెలికాని గాకసేయకుమని
చెలఁగుచుఁ బ్రార్థనసేయుదమమ్మ ॥౩॥
అలరులవిలుకాని దళకర్తయైనట్టి
యలవసంతునిఁ గొనియాడుదమమ్మ ॥౪॥

వసంతభైరవి॥ ఆది॥

చక్కెరవిలుఁబూనుసామికి నీవేళ।
మక్కువ మీఱంగ మొక్కుద మఁటరె ॥౫॥
చిలుకలకుఁ గోయిలలకు నంచలకు
వెలఁదులార, చాల ప్రియము పల్కుదమా ॥౬॥

వ. అని యాలోలలోచన లాలోచనలు సేయుసమయం బున నాకుందరదన కొందలమందించు నిందుకందర్పమందాని లాదుల నేమని నిందించుచున్నది.

సౌరాష్ట్రము॥ ఆట॥ ఏలలు॥

పాలకడలిలోన వెలసి పద్మాసహోదరుఁడవై
యేల యిట్లానన్నేఁచేవురా ఓవెన్నెలరాజ
స్త్రీలనేఁచ మేరగాదురా ॥౧॥
చల్లనిరాజవై జగమెల్ల రంజిల్లఁగఁజేసి
పల్లవాధరుల నేఁతురా ఓవెన్నెలరాజ
చెల్లఁబోయింత కాకుసేతురా ॥౨॥
వెన్నునికిఁ దనయుఁడవై కొన్నిన్నవిలు చేఁబూని
కన్నెలపై దాడివత్తురా ఓవెన్నెలరాజ
నిన్ను వేఁడుకొంటిఁ గదరా॥

వ. ఈచందంబున నిందుకందర్పుల నిందింపుచు విరహ భారంబునఁ గుందుచునున్న యాకుందరదనను నొకచంద్రకాంత

శిలామయవేదికాంతరంబున నుంచి చంద్రవదనలు శైత్యోప-చారంబులు సవరించిరఁట యెటునలెను.

ముఖారి॥ ఆట॥ దరువు॥

కలకంఠి యొక్కతె కలువపువ్వులచేతఁ
గలికి కన్నులనొత్తేఁగాఁక తీరఁగను ॥౧॥
సన్నుతాంగి యొక్కతె సరసకుఁజేరి
పన్నీరు చిలికించె భామపై నపుడు ॥౨॥
మగువయొక్కతెచేరి చిగురాకుఁబోఁడికి
సొగసైన యరవిరిసురఁటిచే విసరె ॥౩॥
జలజలోచన యొకతె చలువగంధము తెచ్చి
చెలియ నెమ్మేనను గలయంగ నలఁదె ॥౪॥
విరిబోఁడి యొకతె యావేలఁదికి నపుడు
విరులదుప్పటి గప్పె వేడుక మీఱ ॥౫॥
తరుణి వేఱొక్కతె తలిరుఁబోఁణికిని
హారువుగనుమ్మ్రాణాలహారముల్ వైచె ॥౬॥
చపలలోచన యొకతె సరిలేక మించిన
కపురము గుప్పెను కలికిపై నపుడు ॥౭॥
వారిజముఖి యొకతె వరుసగా ముత్యాల
హారములుంచెను అతివనెమ్మేన ॥౮॥

వ. ఇత్తెఱంగున నత్తలోదరులుసేయు శైత్యోపచారంబు లత్యంతసంతాపకరంబులైన విన్ననై చెంతనున్నయింతులఁ జూచి యాకన్నియ యేమనుచున్నది.

(నాయకురాలు చదివేపద్యం)

సీ. కనుఁగవఁ జేర్చిన కలువపూబంతులు
నీరజాస్త్రునిచేతి నేజలయ్యె
అలరంగ విసరెడు నలరులసురఁటులు
డంబైన మరుని కేడెంబులయ్యె
తనువునఁ జేర్చిన తామర తూఁడులు
కుసుమసాయకుని లకోరులయ్యె
చెలువంబు మీఱిన చిగురాకు పానుపు
అలరువిల్తుని యంపములుకులయ్యె

గీ. సకియ, నామేన నలఁదిన చందనంబు
మదనకీర్తి ప్రకాశంబు మాడ్కిఁ దనరె
కలికి, నామేన గుప్పిన కప్పురంబు
మరుని మోహనచూర్ణంబుకరణి మీఱె.

వ. అని యుస్సిసపలికి యాకలికిచిలుకలకొలికి తన కన్నులఁ గట్టినట్లున్న మన్నారుదాసుపైఁ దలఁపునిలుపుచు నేమనుచున్నది.

గౌడిపంతు॥ ఆట॥ రబాబు॥ పదము॥

విజయరాఘవ నిన్ను వేడుకొనేర
గజయాన, రమ్మని కౌఁగి లీయర ॥౧॥
నిలుపరాని మోహమాయె నిముస మొక్కయేడాయె
చలముసేతుర సారె యేఁతుర
తలిరువిల్తుని దాడి తాళ లేనుర ॥౨॥

వ. అని మఱియు నేమనుచున్నది.

సావేరి॥ ఆది॥

వింతదాననా యచ్యుతవిజయరాఘవ
కంతుబలమునఁ గలిగితిఁ గౌఁగిలిదయసేయవేర ॥౧॥
నిన్ను నమ్మినదానరా నిక్కము కల్లగాదుర
మన్నారుదాసహంవీర మక్కువతోఁ జేరరారా ॥౨॥

వ. అని మఱియు నేమనుచున్నది.

ఏలరా - నీమోవి తేనెలియ్య వేలరా నాసామి
చాల వలచినదాన చక్కని మన్నారుదాస ॥౧॥
తాళలేనురా చాల దక్కినదానరా।
బాలనురా నీపైఁజాల బాళినిలుపలేనుర ॥౨॥

వ. అని మఱియు నేమనుచున్నది.

కాంభోజి॥ ఆది॥

ఎంతసేపని తాళుదురా
రంతుకాఁడ వౌదువు విజయరాఘవధీర ॥౧॥

ముమ్మరించిన మోహమాయె మోహనాకారయిది
నీమాయ।
కమ్మవిల్తుఁడు ననుడాయఁ గౌఁగిలీయవు విటరాయ॥౨॥

వ. అని మఱియు నేమనుచున్నది.

యదుకులకాంభోజి॥ ఆది॥

ముచ్చటయ్యేర నీచక్కెర - మోవితేనె లియ్యర
అచ్యుతవిజయరాఘవ - యీవగల మెప్పించేర ॥౧॥

మేనుపులకరించేర నీమీఁద మేలుదానర
మానినీచిత్తచోర - మన్నారుదాస ధీర ॥౨॥

వ. అని యీవనిత తనలోఁ దానేమనుచున్నది.
నాయకురాలు చదివే ద్విపద:

ద్వి. ఆరాజదేవేంద్రు నభినవచంద్రు
నారామసీమ నేనటు చూడనేల।
చూచితే నేమాయె సుజనమందారుఁ
డేచినతమిని నన్నేఁచ నేమిటికి!
వానిఁ జూడనియట్టి వనితలెవ్వార

నైన నావలెఁ జొక్క నతివలు గలరె !
చొక్కితే నేమాయెఁ జూచినచెలులు
అక్కటా నను వాని హత్తింపరాదె !
ఏరీతి నైనను ఏప్రుమీఱంగఁ
జేరి నామనవులు చేకూర్పరాదె !
ఏమిసేయుదు నింక నెట్లువేగింతు
నేమని తెల్పుదు నెవ్వరితోను.
వీరాధివీరుఁ డావిజయరాఘవుఁడు
చేరరమ్మని పిల్చి చేపట్టినన్ను
మక్కువఁ జెక్కుల మకరికల్ వ్రాసి
పుక్కిటివిడెము నేర్పున నిచ్చునెపుడు.
ముదముతో మోమున మోముచేర్చుకొని
కదిసి ముద్దాడు భాగ్యము గూర్చునెపుడు
చక్కెరకెమ్మోవి చవులకుఁ జొక్కి
యక్కఱతో మోవి యాను టెన్నటికి !
వాటపుఁ నాగుబ్బపాలిండ్లుగోట
మీటుచుఁ గౌఁగిట మెలఁగు నెన్నటికి !
కళలంటి చౌసీతిగతులను వాఁడు
గలిసి వినోదింపఁగాఁ గల్గునెపుడు !

వ. అని యావిజయరాఘవునిఁ దలంపుచు మోహావిభ్రాం తిచే నున్న యాకన్నియనుజూచి తోడిచెలియలలో నొకభామ యేమనుచున్నది.

(చెలికత్తె చదివేపద్యం)

సీ. పలుమాఱు పిలిచినఁ బలుకదు మనతోడఁ
జెలువమన్నరుదానుఁ బిలుచుఁ గాని
పడఁతి రాయంచల నడపులు నేర్పదు
వసుమతి బొటవ్రేల వ్రాయుఁగాని
సుదతి రాచిల్కలఁ జదివింప నొల్లదు
పతిమీఁది పదములు పాడుఁగాని
మీనలోచన వీణెమీటదు కొనగోట
మీఱిన కన్నీరు మీటుఁగాని

గీ. ఎన్ని శైత్యోపచారంబు లిపుడు మనము
చెలికిఁ జేసినఁ గాఁకయగ్గలమె యాయె
నేమి సేయంగఁ గలవార మిపుడు మనము
కుటిలకుంతల కీవంత యెటులఁ దీఱు.

వ. అని శుకవాణి లోకరోకరితోడఁ దలఁకి పలుకుచుఁ గలంకఁ జెంది యిందుముఖి విరహభారంబుదీర్ప నేర్పులేక యొండొరులమోముఁ జూచుచు నూరకయున్నతఱి నాకోక స్తనికోరిక చేకూర్చుజవ్వని యెవ్వతె? యీమారు బారిఁ దప్పించువారెవ్వరు, ఈజాలి యేలీలఁ దీఱుననుచు నాలోచన సేయుసమయంబున, నానుచనమంజరి హృదయకంజంబు రంజిల్లఁజేయ కనకాంగియను అనుంగునెచ్చెలివచ్చెనఁట యెటువలెను.

కల్యాణి॥ ఆది॥

కనకాంగియనునట్టి యనుఁగు నెచ్చెలియపుడు
వనజలోచనఁ జేరవచ్చె వేడుకను.

వ. ఈరీతిఁ జేరవచ్చి యాయిందువదనయున్న చందంబుఁ జూచి డెందంబునఁ గుందుచు నాయంగనామణితోఁ గనకాంగి యేమనుచున్నది.

(ప్రధాన చెలికత్తె వినిపించేది)

పదము॥ఆహరి॥ఆట॥

ఇదియేమిచందమో యెలనాగ, నీవు
ముదమున నెప్పటివలె ముచ్చటలాడవేమి ॥౧॥
పిలిచినఁబలుకవు ప్రియముచేకొనవు
అలసతఘనమాయెఁ దలఁప్రవింతాయె ॥౨॥
వెలఁదిరో యిప్పుడీవిత మేలగలిగెను।
తెలుపవే దాఁచితే తీరునా యిఁకను ॥3॥

వ. అని మఱియు నేమనుచున్నది.

(చెలికత్తె ద్విపద)

ద్వి. ఎలనాగ, యీచింతయెందుండివచ్చెఁ
దెలుపవే! నీవున్న తెఱఁగేమియిపుడు!
పొలఁతిరో నిలువెల్లఁబులకింపనేల?
మొలకక్రొంజెమటలు పొడమనేమిటికి

నడపులోఁ దడఁబడ నడవంగ నేల?
చిడిముడి మోమునఁ జెందఁగానేమి?
చెలియరో చెక్కిటఁ జెయ్యది యేమి?
పలుచనినీ మేను బడలఁగానేమి?
భూరమణుని వరపుత్రివినీవు
ఊరకె నిట్టూర్పులొదవింప నేల?
ఎంతకార్యంబైన నేనున్నదానఁ
జింతసేయఁగ నేల చిగురాకుఁబోఁడి?
చిన్ననాఁడాదిగాఁ జెలిమిగాఁ గూడి
యున్నవారముగాని యొకవింతగాదు.
నాచిత్తమూఱడ నాతోడ నీవు
దాఁచక తెల్పుమా తరుణీలలామ!

వ. అనిపలికిన సుదతినిజూచి మదనమంజరి యేమనుచున్నది.

(నాయకురాలు చదివే ద్విపద)

ద్వి. వారిజానన, నీవువచ్చినయపుడె
కోరినకోర్కి చేకూరినట్లయ్యె.
తలఁచినయటువంటి తలఁపులేడేరెఁ
దెలిపెదవినవమ్మ తేటపడంగ.
ఆరామమున నిన్న నందంబుమీఱ
నోరామ, విహరింపుచున్న యావేళ

కల్యాణి॥ ఆది॥

కనకాంగియనునట్టి యనుఁగునెచ్చెలియపుడు
వనజలోచనఁజేరవచ్చె వేడుకను.

వ. ఈరీతిఁ జేరవచ్చి యాయిందువదనయున్న చందంబుఁ జూచి డెందంబునఁ గుందుచు నాయంగనామణితోఁ గనకాంగి యేమనుచున్నది.

(ప్రధానచెలికత్తె వినిపించేది)

పదము॥ఆహిరి॥ఆట॥

ఇదియేమిచందమో యెలనాగ, నీవు
ముదమున నెప్పటివలె ముచ్చటలాడవేమి ॥౧॥

పిలిచినఁబలుకవు ప్రియముచేకొనవు
అలసతఘనమాయెఁ దలఁప్రవింతాయె ॥౨॥

వెలఁదిరో యిప్పుడీవింతమేలగలిగెను।
తెలుపవే దాఁచితే తీరునా యిఁకను ॥3॥

వ. అని మఱియు నేమనుచున్నది.

(చెలికత్తె ద్విపద)

ద్వి. ఎలనాగ, యీచింతయెందుండివచ్చెఁ
దెలుపవే! నీవున్నతెఱఁగేమియిపుడు!
పొలఁతిరో నిలువెల్లఁబులకింపనేల?
మొలకక్రొంజెమటలు పొడమనేమిటికి

నడపులోఁ దడఁబడ నడవంగనేల?
చిడిముడి మోమునఁ జెందఁగానేమి!
చెలియరో చెక్కిటఁ జెయ్యది యేమి?
పలుచనినీమేను బడలఁగానేమి?
భూరమణుని వరపుత్త్రివినీవు
ఊరకె నిట్టూర్పులొదవింపనేల?
ఎంతకార్యంబైన నేనున్నదానఁ
జింతసేయఁగనేల చిగురాకుఁబోఁడి?
చిన్ననాఁడాదిగాఁ జెలిమిఁ గూడి
యున్నవారముగాని యొకవింతగాదు.
నాచిత్త మూఱడ నాతోడనీవు
దాఁచక తెల్పుమా తరుణీలలామ!

వ. అనిపలికిన సుదతినిజూచి మదనమంజరి యేమనుచున్నది.

(నాయకురాలు చదివే ద్విపద)

ద్వి. వారిజానన, నీవువచ్చినయప్పుడె
కోరినకోర్కి చేకూరినట్లయ్యె.
తలఁచినయటువంటి తలఁపులీడేరెఁ
దెలిపెదవినవమ్మ తేటపడంగ.
ఆరామమున నిన్న సందంబుమీఱ
నోరామ, విహరింపుచున్న యావేళ

విజయకేళీసాంద్రు విక్రమోపేంద్రు
విజయరాఘవచంద్రు విభవదేవేంద్రుఁ
గన్నులపండువుగాఁ జూచుచుండఁ
గన్నులవిలుకాఁడు కేడుగాసిసేయ
మనసు చెల్వునిమీఁద మరలింపలేక
వనిత, యావిభుఁ దెచ్చువారలు లేక
యేదిదిక్కని మదినెంతయువగచి
దాదులఁ జెలుల నీతటి వేడుకొనిన
నెక్కడిమోహంబు లెక్కడివలపు
లక్కరో చాలింపుమని రింతేకాని
చెలువునినన్ను గూర్చినవారు లేరు
చెలియ, వచ్చితివి నాజీవమిచ్చితివి.
ఏరీతి నైనను ఈకార్యమిపుడు
కూరిమిమీఱఁ జేకూర్పనోయమ్మ.

వ. అని మందలించిన యాయింగనను జూచి కనకాంగి యేమనుచున్నది.

(కనకాంగి వినిపించే పదం)

కేదారగౌళ॥ ఆది॥ పాములు నాగస్వరం॥

కులసతికిటువలెఁ గోరరాదమ్మ
తెలుపఁదగినమాట తెలుపవలెనమ్మ॥ ॥౧॥

మగువరో నీవింత మట్టుమీఱిన మోహాన
పగతురా యిది యేటిపడుచుఁదనము ॥౨॥
తగవుగాదిపుడు పెద్దలువిని రేనియు
మిగులనేమందురో నేరగాదమ్మ ॥3॥
పట్టభద్రుఁడు నిన్ను వరముగాఁగోరి కన్న
పట్టివిగావ యింతబాళియుంతురా ॥౪॥
చుట్టాలువిసిరేసి చుల్కఁగాఁజూతురు
ఇట్టివలపునఁ జిక్కనేటికో యమ్మ ॥౫॥
తరుణిరో తలిదండ్రులనుఋంగున నుండేదానవు
అరిమిసేతురా విన్న యున్నదమ్ములు।
సరివారలైనను సారె నిన్నెంతురా
వరునిఁగూర్పుమనియింత వగనేమిటికే ॥౬॥

వ. అని దూఱిపలికిన వారిజాక్షికిఁ దనపైఁ గరుణతోఁప
నావిరిఁబోణి యేమనుచున్నది.

## (నాయకురాలు విన్పించేది)

ధన్యాసి॥ ఆది॥ పదము॥

కుటిలకుంతల, నీవుఇటువలెఁబలికితే
నెటువలె నాకోర్కెలీడేరునమ్మ ॥౧॥
చెలులు నామాటలుచేకొనరైరి
అలివేణి యామలు అదలించిరమ్మ.
పిలిచినఁబలుకవు పెంచినచిలుకలు
కెలనున్నయంచలు కేరడములాడేని.

వ. అని నెనరుమీఱఁ బలికిన వనజగంధిమనసు రంజిల్లఁ గనకాంగి యేమనుచున్నది.

(కనకాంగిపద్యం)

క. బోఁటిరో వినునాపంతము
మాటలఁదేలించి వానిమది నీమీఁదన్
నాటించి పెండ్లిసేసెద
మాటికి ననుమెచ్చవమ్మ మదగజయానా!

వ. అని పంతగించి పలికిన నాయింతితో నాకాంతామణి యెంతయుఁ బ్రియంబుమీఱ నేమనుచున్నది.

కాంభోజి ||ఆది||పదము||

ఏరీతివిన్నవింతువో- యెట్లునన్గూర్చెదవో।
నారీలలామ, మన్నారుదాసునీవు ||౧||
చెలియరోవినవె నా- చెలువుని సమయము।
తెలుసుక వద్దనున్న- తెఱవలకెల్ల
పలుమాఱు ప్రియములు- పలుకుచు వారిని
ఎలకులోఁజేసికొని- వానికి నెనరుగలుగ ||౨||
కలికిరో నామనవి- తెలుపునప్పుడు మనసున।
నలుకు లేక యితఁడు దొరయని బెదరక।
యెలమితో నావిభుని-హృదయము రంజిల్ల।
మలయజగంధి, నాపై - మక్కువగలిగి నీవు ||3||

నీకుబుద్ధులు దెలుప - నేనెంతదానను
రాకేందువదన, పరాకు సేయక।
యీకార్యమిప్పుడు - ఏరీతినైనను
జేకూర్పవలెనని - చిత్తమున నెంచునీవు ||౮||

వ. అనిన విని యౌవనజగంధి యేమనుచున్నది.

(కనగాంగి విన్పించేది)

పదము|| రేగుప్తి|| ఆది||

ఇదెపెండ్లి సేసెద నింతివగవకువె।
మదనావతారుఁడైన - మన్నారుదాసధీరుని ||౧||
చెలులలో నన్ను మి - క్కిలి గారవింపుచు
నలినాక్షి, హెచ్చు మ - న్నన సేతువు
చెలియకే యుపకారము - సేయుదునో యని
తలఁచుచునుందు నీ - తఱి నన్నుజూడుము ||౨||

వ. అని యివ్విధంబునఁ బలికిన యవ్వీరిఁబోఁడిని మించు
ప్రేమఁ గౌఁగిలించుకొని యాయంగననుబనుప నావన్నెలాఁడి
మన్నారుదాసుని జేరవచ్చు సమయంబున నామన్నారుదాస
భూపాలుండును మన్ననాయుల సన్నిధికి తీర్థమునకు వచ్చెనఁట
యెటువలెను.

సౌరాష్ట్రము॥ ఆది॥ దరువు॥

గజరాజగమనలు కైదండ యొసఁగఁగ
విజయరాఘవ మహీవిభుఁడు వచ్చెఁ గొలువకు ॥౧॥

వ. ఇవ్విధంబున వచ్చిన విజయరాఘవభూపాలుండు గోపాలుని సన్నిధింగూర్చుండి నేమంబున నామతీర్థంబులు అష్టాక్షరీజపంబు గావించి, తిరుశతగోపంబునకుఁ దిరువారాధనంబు చేసి, హేమాబ్జనాయికా రాజగోపాలకులఁ బూజించి సేవించి, తీర్థప్రసాదంబులు గైకొని యంతరంగంబున నింతింతనరాని సంతోషంబు పొదలఁ జెలువుమీఱఁ గొలువుశృంగారంబై రామాయణ శ్రవణంబు గావించునవసరంబున, నవసరంబుల వారుపిలువ విద్వాంసులుఁ గవీశ్వరులు వచ్చిరఁట యొలువలెను.

బిళహరి॥ ఆది॥ దరువు॥

పట్టెతిరుమణులును పట్టుకుళ్ళాయలు
పట్టుదుప్పటు లరచట్టలు మెఱయ
దిట్టలౌ విద్వాంసులు ధీయుతౌకవులును
పట్టభద్రుని కొలువుకు వచ్చిరావేళ॥

వ. ఈచందంబునఁ దోదోపులమీఁది నామేదినీశ్వరుని సముఖంబునకు వచ్చి యచ్యుతవిజయరాఘవస్వామికి నాశీర్వాదంబులు చేసిరఁట యొటువలెను.

విద్వాంసులు॥ మంగళాని భవంతు, శ్రీరాజగోపాలస్వామి పరిపూర్ణకృపాభివృద్ధిరస్తు. అరుణాబ్జనాయికా కరుణాభివృద్ధిరస్తు. ఆచార్యకృపాభివృద్ధిరస్తు. అఖండభూమండలాధిపత్యమస్తు. సకలదిగ్విజయోస్తు.

నాయనిమాట: అయ్యగార్లు కూర్చుండరయ్యా.

వ. అనివలుకు జనపాలకుని సమ్ముఖంబున వారలు గూర్చుండు క్రియ మెటువలెను.

(అయ్యగార్లు తమలోఁ దామాడుకొనే మాటలు)

అప్పావయ్యంగారె యిప్పాలె యిరుం
అణ్ణావయ్యంగారె నణ్ణాయిరుక్క
పిళ్ళయ్యంగారె మెళ్ళయిరుం
అమ్మాళయ్యంగారె శెమ్మయాయిరుక్క
అయ్యావయ్యంగారె కయ్యాలె యిడిక్కిఱేరెన్న
అప్పనయ్యంగారె వుమ్మడదుప్పటి యెంగె.

తెలుంగు విద్వాంసులు ఆడుకొనే మాటలు.

మాధవశాస్త్రి, మీద పడకువోయి
గోపాలభట్లు, మీపాగ యేదోయి ?
పెద్దిభట్లు, నిద్దుర యేందోయి ?
కల్లైనరసంభట్లు, నీకుళ్ళాయి యేదోయి
దేవరాజుభట్లు దావళెందుఁబోయె ?
కొండుభట్లు, నీకుండలా లేవి ?

వ. ఈచాలున శ్రోత్రోద్దోవులమీద నొండొరుఁగడచి యా భూమండలాధిపుని దండఁగూర్చుండి తమతమ విద్యాప్రసంగంబులు చేసిరఁట యెట్టువలెను.

చిట్టిబళ్ళ సోమయాజులుగారు :

శ్లో॥ మన్నారుదాసభూపాల, మహనీయగుణాంబుధే
అచంచలాభక్తిరస్తుభవాన్ గోపాలపాదయోః॥

గోవిందభట్లు॥ హేఅత్రోచ్యతే అచంచలాభక్తిర్భవానిత్యత్రస్త్రియాః పుంవదితిసూత్రేణ పుంవద్భావేకృతే అచంచల భక్తిరితివక్తవ్యే కథమచంచలా భక్తిరిత్యుచ్యతే. యద్యస్తి శక్తిః వక్తవ్యోత్రపరిహారః

సోమయాజి॥ అహోభవద్భిస్సూత్రార్థస్సమ్యక్ జ్ఞాతః భవదుక్త సూత్రేఏవ అపూరణీప్రియాదిష్వితి ప్రియాదిషుపరతః పుంవద్భావస్య నిషిద్ధత్వేన ఆచంచలాభక్తిరిత్యేవ వక్తవ్యం జితమస్మాభిః.

మధ్యస్థుఁడు: ఓహో నిలువుండ ఎన్నిగంతులు వేస్తిరి! మీపక్షమైన స్త్రీకి పుంవద్భావం కలదనేరా? మీపక్షమైన స్త్రీకి పుంవద్భావం లేదనేరా?

మఱొకమధ్యస్థి: ఇది కద్దనసూరాదు లేదనసూరాదు. ప్రయోగవశాన తెలుసుకోనేది.

వేలోకడు: ఓయీ సోమాభట్లు, మీవారిషువలెనే ప్రయోగింతురా?

మహాలోకడు: మావారిషువలెనే ప్రయోగించేది. దృష్టాదుల యందు కద్దని చూచినాము. అదృష్టాదులయందు లేదని చూచినాము.

చిట్టిబళ్ళసోమయాజులు: ఆప్రసంగం అటువుండనిండు, అవునోయి గోవిందభట్లు, ఇందరనుమించి దొరముందర కూర్చున్నాడవే. కవిలైతేవవిద్యాయని కవిత్వంగదా ప్రధానవిద్య. నేనొకసమస్య యిచ్చెదఁగాని యిచ్చుటనే పూరించగలవా?

గోవిందభట్లుమాట: చిట్టిబళ్ళసోమయాజులు, ఈమాత్రపుమాట నన్నుజూచి ఆడేవాడు కలిగెనేకద. ఏదినీదారిచూతాం

చిట్టిబళ్ళసోమయాజులు ఇచ్చే సమస్య:

"విద్యానిధిర్విజయరాఘవ సార్వభౌమః"

గోవిందభట్లు సమస్య పూరించేది:

శ్లో. సద్యోదదాతి సుకవిప్రకరేప్సితార్థాన్
హృద్యానవద్యతరపద్య రసేష్వభిజ్ఞః।
ప్రద్యోతన ప్రతిమబాహు మహాభిరామో
విద్యానిధి ర్విజయరాఘవసార్వభౌమః॥

మధురకవి: ఈభోగదేవేంద్రుని సముఖాన విద్వాంసులుమెచ్చే ట్టుగా మాగధిభాషను సమస్య యిస్తున్నాను లెస్సగా రచనసేయవలె.

సార్వభౌముఁడు: మేలుమేలు! ఆ భాషామార్గముదెలిసి నీవు సమస్య యిస్తున్నావంటే మెచ్చగలనోయి నిన్ను.

మధురకవిమాట: అయితేవిను. (సమస్య)

"విఁజుము పదాళూఢ శాహావేజయది"

సార్వభౌముఁడు:

మాగధి: శ్లో. శోహణ బంహాణ శంఖం
లుకందె లజ్జలఖ్ఖణో వేదో।
అన్నాళియ మహిమనిహీ
వియయు పవాళూఢశాహావో జయది॥

ఛాయ॥ శోభనబ్రాహ్మణసంఘం
రక్షన్ రాజలక్షణోపేతః।
అన్యాదృశ మహిమనిధి
ర్విజయ పదారూఢరాఘవో జయతి॥

మధురకవి: ఎంతవింతాయెనోయి! ఈవరకు నానాదేశాల పిశాచ ప్రభువులవద్ద సంచరించిన క్లేశమంతాతీరెను. పైశాచి చూళికాభాషల రెండుసమస్యలు నిచ్చేగాని మెచ్చుగా చదువవలె.

సమస్య: "తురుసమోనద్ది భూతలం మికయూ" ॥౧॥
"మన్నలతాసో కునాదిబూమిపయీ" ॥౨॥

సార్వభౌముఁడు సమస్యపూరించి చదివేది.

పైశాచి॥

వెన్ను సరిఛో విజ్జే, పున్నమ చందొద్దె దంసనంమితుమం
దహునాథ తమాయ పునోతురు సమోనద్దిబూత
లమ్మికయూ.

ఛాయా॥ విష్ణుసదృశో వీర్యే పూర్ణిమచందో౽పి దర్శనేత్వం।
రఘునాథ తనూజపునస్త్వసమోనాస్తిభూతలేకవిః॥

అనుటగాదా యీశ్లోకము.

చూళికాపైశాచి॥ దవతి వన్నదమ్మే తేతి
తుచాతిన కంకితాయిం పలాయిం।
బత్తాస నాహీలూదో
మన్నలుతాసో కునాదికో బూమిపయీ ॥

ఛాయా॥ స్థాపయతి వర్ణధర్మాన్
దదాతి ద్విజాతీనాం కాంక్షితాని ఫలాని।
భద్రాసనాధి రూఢో
మన్నరుదాసో గుణాధిపో భూమిపతిః ॥

అనుటగదా! లెస్సాయెనయ్యా.

మధురకవిమాట : సెబాసు సకల విద్యాసార్వభౌమ! నామనసు వశ్చువోయి. అదెంతలేదు. అపభ్రింశమని వేరేయర్థము సేయక ఈభాషకే ప్రికిృయాభాగమధికం అపభ్రింశ భాషను సమస్యవినుమా

సమస్య. "రావ్రా వియయ రాహవ్రా"

సార్వభౌముడు సమస్యపూరించేది.

శ్లో. వెణ్ణుపావు పయోజాద భమరికియ మానసు
సయా జయది తంకేసు రావ్రా వియయరాహావ్రా॥

ఛాయా॥ (మరొక విద్వాంసుడు వినిపించేది)

విష్ణుపాద పయోజాత భ్రిమరీకృతమానసః
సదా జయతి తంజేశో రాజావిజయరాఘవః॥

అనుటగదా ! మహోలెస్సాయెనయ్యా,

మధురకవి మాట : భళానోయి మాయయ్య సకలవిద్యాసార్వ భౌముండనే పేరు నీకు చెల్లునోయి. అట్లావుండవలె.

సార్వభౌముని మాట : వట్టి సుద్దులకీ పందిలిపెట్టి పాండిత్యం జేసి జరిగేవాడవో ఖాండీరభాషకు సమస్యయిస్తే రచన సేయగలవో.

మధురకవిమాట : మంచిమాట అవునే. అష్టభాషలు నేము చ్చినవానికి గద్దు నాచేత నేర్చుకోవలె. అది యటుం డనీ. నాచేతనేర్చుకొని నన్నే శిక్షిస్తున్నావు.

శ్లో. కాంభోజా మాగధీగౌడీ మహారాష్ట్రీకళింగజా।
గైర్వాణీ మిశ్రితాభాషా భాండీరీతిప్రకీర్తితా॥

అనేలక్షణం వున్నది గనుక యొక్క-భాండీరానకే యిన్ని భాష లుంగలవు. ఇందునగదా పెద్దలచేతను జౌననిపించుకోవలె ఏదీ సమస్యనిమ్మా.

సార్వభౌముడు ఇచ్చేసమస్య :

"రాయ గోప్పాళు చెసయా"

మధురకవి పూరించేది : శ్రీకృష్ణవానందకరు
తుహామన్నారుదాసురే ।
తుహామానంద కరుహే
రాయగోప్పాళు చెసయా ॥

ఛాయా॥ హేమన్నారుదాస
తవ శ్రీకృష్ణ ఆనందకరః।
త్వం రాజగోపాలస్య
తథా నందకరస్సదా॥

చిట్టాబళసోమయాజులు మాట: అహోసభ్యాః! అలమేతైః కవిత్వప్రసంగైః, శాస్త్రప్రసంగః కవే రుద్ఘాటన మంత్రః। రే గోవిందభట్ట,శ్రూయతాం మయా తర్కే- ప్రసంగః క్రియతే। త్వయాక్షిప్యతాం.

అనన్యథాసిద్ధ నియతపూర్వభావిత్వం కారణత్వం।

గోవిందభట్టు : అనన్యథాసిద్ధ నియతపూర్వభావిత్వం కారణత్వ మితి కిమర్థముచ్యతే? పూర్వభావిత్వం కారణత్వ మిత్యేవాలం.

చిట్టాబళసోమయాజులు : హే కూ్రిషుతాం ఘటాదికార్యం ప్రతి దైవాదాగతస్య రాసభస్య పూర్వభావిత్వమస్త్యేవ. రాసభః కారణం వా?

గోవిందభట్టు: గర్దభః కిముదాహరణ ముచ్యతే !

సోమయాజులు: ఏవంవృథా కథనేన త్వమేవగర్దభః।

గోవింభట్టు : ఏవంవృథా కథనేన త్వం శునకః ।

సోమయాజులు: త్వం శూకరః

గోవిందభట్టు : ఈమాటలు మధ్యస్థులు వింటిరా ?

మధ్యస్థ: ఈమాటలు నీవు విన్నదిగాక మధ్యస్థులూ వినవలెనా

సోమయాజులు: అదిగాదయా, నేను సమానాధికరణంగా ప్రసంగంచేస్తే వీఁడు వ్యధికరణంగా కూతలు పెట్టు చున్నాడు. ఓరీ నీవేవిద్వాంసుని కొడకవురా ?

గోవిందభట్టు : ఓరి, నీవు నిన్నటివరకు పిళ్ళగాడితనముచేసి నేడు కుళ్లాయపెట్టుకుంటేనే విద్వాంసుని కొడకనైతివా?

సోమయాజులు : ఓరి నీవు నామంతుని పాళేననుండి కాలికి గజ్జెలుకట్టుకొని సత్రానికి కట్టెమోపులు మోస్తివే.

నేను తలపాగచుట్టి నెత్తికట్టుకొంటేనే సభలోమాట్లాడే టట్టాయెనా ?

గోవిందభట్టు : ఓరి, నీవు నిన్నటివరకు సత్రాన్నపుల్లాకుల గంపలు మోచిమోచి తెలబట్టగట్టిందే. కాగానేకద కుళ్లాయనెత్తిఁబెట్టుకొంటివి. కుక్కనలె నిక్కడనేమి మొరిగేవురా ?

సోమయాజి : ఏమికూసేవురా పోతుగాడిదవలెను.

గోవిందభట్టు : ఓరి లొకికాలా ! చెంపవేతునో.

సోమయాజి : ఓరీ అట్టాపంగ్తు రాల్తునో

మధ్యస్థుఁడు : దొడ్డపరిసంగం చేస్తిరోయి. మీరిద్దరు నిద్దరే.

వ. అని వారించు సమయంబున కందళిత మందహాసవదనారవిందుఁడై మన్నారుదాసభూపాలుండేమనుచున్నాఁడు.

నాయనివారిమాట : వీరిపరిసంగాలకేమి ఉన్న దేకద! పరిసంగం సేయమంటే సిగలుపట్టుకొని తన్నులాడుదురు. కవీశ్వరులు మీరుపద్యాలు చదవరోయి.

కవీశ్వరుడు చదివేపద్యం:

క. హృద్యానవద్య వర్తన
విద్యాధిక తారతమ్య విజ్ఞానకళా
విద్యోతమాన, వర్థిలు
పరిద్యోతన తేజ, విజయరాఘవభోజా !

మఱొక కవీశ్వరుఁడు :

క. ఈధరణీతలమంతయు
శోధించిన నిన్నువంటి శూరుఁడుగలఁడా !
సాధించితి వరివీరుల
రాధేయోదార, విజయరాఘవధీరా !

మఱొక కవీశ్వరుండు చదివేది :

సీ. నీదు విద్వాంసులవాదుకు మదినల్కి
శేషుండు పాతాళ సీమఁజేరె;
వివిధభాషల భవత్కవుల ప్రౌఢిమఁజూచి
వాణి కాననసీమ వదలకుండె ;
తావక సైనిక ప్రావీణ్యమును గాంచి
సురముని నిలువక తిరుగుచుండె ;
భవదీయ నట నాట్యపటిమరామదిఁగోరి
ధర మహానటుఁడట్లు తపముసేసె

గీ. నిట్టి విద్యాధికులు మెచ్చ నెల్లవిద్య
లమర నౌరౌర నీయందె యతిశయించె ;
కననజితభోజ, మహితవైభవ బిడౌజ,
విజయరాఘవభూపాల, విజయశీల !

మఱొకరు విన్పించేది :

చ. చతురవచో విశేషములు శాశ్వతవైభవ శోభనంబులున్
వితరణ గౌరవంబులు నవీనయశంబు లుదార తేజముల్

క్షితిఁ గవిరాజకోటికిని జేయుచునుండు దృఢవ్రతంబుగా
బ్రతిదినమున్ గృతిన్ విజయరాఘవభూమిపతి న్నుతించినన్.

వ. ఆసమయంబున మఱియుఁ గొందఱువిద్వాంసులు ప్రసం
గంబు చేసిరఁట యెట్టునలెను.

మఱొకవిద్వాంసుఁడు చదివేది:

చూర్ణిక : జయతి సదా సకలభువన మండలాఖండలో లలిత
నిజభుజాటోప సంపాదిత ప్రతాపమహిమా, మహి
మాన్య సౌజన్యాద్యనన్య జనసాధారణ గుణజన్యకీర్తి
లతా సుమనస్తబకాయమాన పూర్ణిమా హిమకరో,
మకరోదంచిత ప్రభాకరప్రభా నిశితకరకృపాణ విరచిత
రిపువిజయో, విజయోచిత నిత్యకల్యాణ పరంపరా
సమేధమాన మానసవిలాసో మన్నారుదాసః॥

డిండిమం॥ ఇందిరాతవరాజతే మందిరేబుధవందితా
భూజనస్తుతభోజ నవ్యవిలాస మన్నరుదాసనిత్యం॥

స్వామిపరాకు॥ మావిద్వాంసులలోఁ గొందఱు నట్టువలయి
వింతవింతగాఁగొన్ని కోపులు వినిపించుచున్నారు వినుండ.

రూపకము॥

శారదా ఘనసార చందన
సారపాదప శారదాంబుద
తారహార తుషారభూధర
చారుకీర్తి మురారివిక్రమ॥

స్వామిపరాకు॥ అందమున్న మోగములో అద్దమెయిబట్టితే
నాకొడుకు నడుములో అద్దమెయిబట్టి చున్నాఁడు.
ఈనగకొప్పులు ఇంకా చాలా ఉన్నవి. నానాటికి విని
పించుచున్నాఁడేకద. ద్రావిడాసన్నించి పిఁపించితురె.
ఆనగకొంత నేర్చియున్నారము విను నవధరించుండు.

వర్ణము॥ వినయపరికాశ సనయునస్వదేశ
రవితేజ కవిభోజ సురరాజభోగ
వాగీశభోగీశ యోగీశ సాహిత్యపాండిత్య
ధీరాతిశయాతి భాసురా।
విజయరాఘవ నృపాలశేఖరా॥

వా. ఈచందంబున విద్యలు వినిపించిన విద్యాధికుల
కుదారంబులైన హారంబులు జాంబూనదాంబరకదంబకంబులు
పాలించి పంచెనంట యెటువలెను.

క. ఈధరణీతల మంతయు
శోధించితి, నిన్నువంటిశూరుఁడు గలఁడా
సాధించితి వరివీరుల
రాధేయోదార విజయరాఘవధీరా॥

వ. ఆసమయంబున విజయరాఘవభూపాలుండు నగరు
చేరవచ్చి వెంటనంటి వచ్చుదొరల నిజనివాసంబులకుఁ బంచి
రాయసంబులతోడఁ గొంతతడవు మంతనంబైయుండి, యంతః

పురప్రవేశంబు నటించి భోజనాదికృత్యంబులు తీర్చి తేజము మెఱయఁ గూర్చున్నయావేళ మదనమంజరియనుంగు నెచ్చెలియైన కనకాంగి విజయరాఘవుని సరసకుఁజేరవచ్చిన సమయంబున నెదుటఁదోఁచు దివ్యశకునంబుల కుప్పొంగుచు నేమనుచున్నది.

దరువు॥ కాంభోజి॥ ఆట॥

గజరాజునుగంటిని ఈత్రోవలో గజరాజునిగంటిని।
విజయరాఘవునితో వేగమాటాడఁ గలుగునో ॥౧॥

పాలకడవలు గంటిని ఈవేళనేఁ బాలకడవలుగంటిని।
భూపాలుడు నామనవి యాలించునేమొ ॥౨॥

కదళీఫలములు గంటిని ఎదుట నిపుడు
కదళీఫలములు గంటిని,
ముదముతో వాఁడు మాచెలికి బొట్టుగట్టునేమొ ॥౩॥

వ. ఇవ్విధంబున నెదుటఁ దోఁచు దివ్యశకునంబులకు మెచ్చుచు, నచ్చిగురుఁబోఁడి యచ్యుతవిజయరాఘవుని నగరు చేరవచ్చి దగ్గఱనున్న హెగ్గడికత్తెకుఁ దనరాకదెలుప నారాకాశశాంకవదన ముదముతో మన్నారుదాసభూపాలుని సముఖంబుఁజేరి విన్నవింప నామన్నెపున్నమచందమామ యారామనుఁదోడితెమ్మనిన నమ్మగువ వచ్చెనట యెటువలెను.

దరువు॥

విరులబంతి చేఁబూని వేడుకఁగనకాంగి ।
సరగున విజయరాఘవుని సముఖమునకు వచ్చెన్॥

వ. ఈరీతిఁజేరవచ్చి విరిబంతి కైకానుకచేసి మ్రొక్కి నిలుచున్న కన్నియంజూచి యేమనుచున్నాఁడు.

నాయని వారు చదివే పద్యం॥

క. ఎవ్వరు పంపఁగ వచ్చితి
వెవ్వీట వసింతు నామమెయ్యదియగు నీ
కివ్వేళవచ్చు కార్యము
జవ్వని, మాతోడఁ దెలుపు సరగఘటింతున్॥

వ. అనిన నా మనుజవల్లభునితోఁ గనకాంగి యేమనుచున్నది.

ప్రధానచెలికత్తె కనకాంగి వినిపించే ద్విపద :

ద్వి॥ అవధారు నగధైర్య, యతులితశౌర్య,
భువనమోహనరూప, భూరిప్రతాప,
యెలదోఁటలోన మీరింపుమీఱంగ
వెలయు వేడుక నిన్న విహరించువేళ
కలికి నీటుమిటారి కంతుకటారి
చలువలకొంకి వాసనల పూవంకి

కలికి వగలజాణ కస్తూరిపీణ
కులుకు ముద్దులగుమ్మ గొజ్జంగిరెమ్మ
పగడంపు లతకూన పన్నీటిసోన
మిగులఁ జక్కనికాంతి మెఱయునాయింతి
అల కళానిధియను నవనీశ్వరునకుఁ
బొలుపు మీఱిన వరపుత్త్రికయైన
మదనమంజరి యను మహిళాలలామ
ముదముతో నపుడు మిమ్మును గనుఁగొనుచు
నీరూపరేఖకు నెమ్మదిఁ జొక్కి
మారుని శరముల మాటికిఁ జిక్కి
మనసు మీపైనుంచి మరలింపలేక
దినమొక యేడుగాఁ దెలివిగైకొనక
వనజాక్షి యున్నట్టివగఁజూచి కలఁగి
కనికరంబునఁ జేరి కలికియు నేను
జిన్ననాఁడాదిగాఁ జెలిమితోఁ గూడి
యున్నవారము గాన నువిదనూరార్చి
వచ్చితి నిప్పుడో వసుమతీనాథ
మచ్చికమీఱ నామనవిగైకొమ్ము
సరస కవిత్వప్రసంగంబు నందు
భరతాది విద్యల ప్రౌఢిమయందు

నాట పాటలయందు సత్రిసకునెందు
సాటిలేదిప్డు డీజగత్రిలోపలను
మాట మాత్రిముగాను మన్నారుదాస !
మేటియన్నిట నిన్ను మెప్పించనేర్చు.

వ. అని మఱియు నేమనుచున్నది.

ఘంటారవము॥ ఆట॥ పదము॥

పచ్చవిల్తుఁడు దాడివచ్చెర।
వచ్చి మూఁకను సెలవిచ్చెర।
నెచ్చెలికిని దాప మెచ్చెరా ॥౧॥

కన్నెనేఁచ మేరగాదుర । ఆ
కన్నెపాయము నీకు మీఁదురా।
కన్నుల నిదుర లేదుర
మన్నెరాయ, నినుబాయలేదుర ॥౨॥

కెరలి చిలుకలు కేరెరా।
నరసతేఁటుల బారుతీరెరా।
మెఱసి యంచలు పేరెమువాఱెరా। ఆ
మెఱుఁగు గుబ్బలిప్పుడు మీఱెరా ॥3॥

ఇంచుఁబోఁడిని మన్నించరా । నీ
పంచదారమోవి పాలించరా।
మించువేడుక లాలించర।
పంచబాణుని కేళిఁదేలించరా ॥౪॥

వ. అని మందలించిన యాకన్నియనుంజూచి మన్నారు దాసభూపాలుం డేమనుచున్నాఁడు.

నాయఁడు చదివే ద్విపద:

ద్వి. సుదతిరో యానాను జూచితిమేము
మదిరాక్షి యిప్పుడు మమ్మును జూచె.
ఆయింతి చెలువ మేమనవచ్చుఁ దెలియ
* * * * *

కాముని చికటారి కైవడి మెఱసె
కలికిలోఁ గూటమి గలుగునాయనుచుఁ
దలఁపుచు నుండఁగాఁదమణి, వచ్చితివి
ఏనున్న భావంబు నింతికిఁ దెలుపు
సూనసాయకు చేత సుశిక్షి యున్నాఁడ
ఎలమి మీఱంగను ఇప్పుడు నేను
అలినీలవేణిఁ బెండ్లాడెద ననుచు
మఱవక తెలుపుము మనసురంజిల్లఁ
దెఱవకు నిప్పుడు తేటతెల్లముగ.

వ. అని మందలించి యామానవేశ్వరుండు బహుమానం బులు సేయఁగైకొని ముదముమీఱఁ గనకాంగి కదలి వచ్చు సమయంబున, నామదనమంజరియును విజయరాఘవ మహీ కాంతునిపై నంతంతకు బాళిమీఱ నింతింతనరాని విరహవేదనచే

గరంగుచునున్న నాపల్లవాధరయుల్లంబు రంజిల్ల విజయవిక్రమ శాలియగు నావిజయరాఘవునిఁ దగఁబెండ్లియాడుదువని భావి కార్యంబు దెలుపుటకై యాయుంగన చెంగటికిఁ జెంగమ్మ యెఱుకల కలకంఠియై వచ్చెనఁట యెటువలెను.

కొరవంజి॥ ద్వి॥

శ్రీలచే విలసిల్లు చిన్ని నెమ్మోము
చాలరాణింప వజ్రాలచే మించు
మలచిన యపరంజి మాందాళిపూని,
తిలకంబు తీరుగా దిద్ది చెన్నొందు
సన్నజాజిసరంబు సవరించి కురుల
వన్నెఁగా గీల్గంటు వైచి యందముగ
దంతపు కమ్మల ధవళిమమించు
కాంతిచే ముత్యాలకమ్మలు మెఱయ,
పొంకమౌ తగు హారముల జంటగలిగి
సంకుపూసలదండ చందంబుపూన
సరిలేని కెంపులసరముల హొయలు
గురిగింజదండల కొమరు వహింప
కరము రంజిల్ల బంగరుకాసె నెఱిక
హారుపు మీఱిన పారుటాకులచీర,
మురువొంద రతనాల బుట్టచేపట్టి

శృంగార మమరంగఁ జెంగమ్మ యపుడు
పొంగుచుఁ దనయుప్పైఁ బూనిన ప్రేమ
గొరవంజి వేషంబుగోరి ధరించి
పురవీధికిని వచ్చెఁ బొగడంగ జనులు.

వ. అప్పురా మఱియు నేవిధాన వచ్చెను.

మాళవి॥ ఆట॥ దరువు॥

వచ్చె నెఱుకత బెళుకుగులికెడు వాలుచూపులుచూచుచు
హెచ్చుపచ్చల బుట్టిసైకొని యింపునటనలు మించఁగా॥
సరిగసనులను హరువుమించిన
జిలుగు చందుర కావిచేలటు
హరువుగా పారుటాకువలువలు
యందచందము మీఱఁగా ॥౨॥

మెఱుఁగు గుబ్బలమీఁదఁ గెంపుల
మేలిసరములు మెఱయఁగా!
కురులఁ జుట్టిన తావిసంపఁగి
విరుల సరములు గదలఁగా ॥3॥

వ. ఈచందంబున వచ్చి యాచెంచుమించుబోఁడి తన్ను జూచు చంచలాక్షులతో నేమనుచున్నది.

దరువు॥ కొరవంజి॥ ఆట॥

ఎఱుఖాడు గెఱుఖాడు గెఱుఖాడుగదోయమ్మ
యెఱుక నేఁజెప్పెదనమ్మ!

గుఱిగాను ననుజేరి కోరినవారికి
కోరిక చేకూర్తునమ్మ

వ. ఈరీతిఁగోరి తనుంజేరి పేర్కొనువారికిఁ దార్కాణగాఁ బలుకుచు మెచ్చులందుచు వచ్చునామెచ్చులాడినిజూచి యొక సుదతి మదనమంజరిచెంగటికివచ్చి యేమనుచున్నది.

చెలికత్తెచదివే ద్విపద:

ద్వి. ఓరామ, వింటివా యొకవింతనేఁడు
ఈరాజవీధిలో నె ఒకతయొకతె
తలఁచిన తలఁపెల్ల దార్కాణగాఁగఁ
దెలుపుచునున్నది తేటతెల్లముగ.
అక్కరో కోరి నేనడిగినదెల్ల
నిక్కంబుగాఁబల్కె నేర్పుమీఱఁగను.
వారిజాక్షులు వచ్చి వరుసతోనడుగ
వారి వారికి నిటువలెఁ బల్కెనమ్మ.
ఎఱుకతలం జూచి తెందఱినైన
హరిణాక్షి, యిటువంటి యతివను గాన.
నామాటనేర్పులు నావిలాసములు
నామోహనాకృతి యరుదు వీక్షింప
అంగన నెమ్మోము నందంబుచూడఁ
జెంగమ్మపోలికఁ జెలువొందుచుండు

చెలులకు నిటువంటి చెలువంబు గలదె!
చెలువమన్నారు ఈచెలువ గాంబోలు !
ఆయింతిఁ బిలిపించి యడిగితివేని
యీయెడ నీకోర్కె లీడేరునమ్మ.

వ. అని పలికిన నెచ్చెలితో నాయచ్చెకంటి యేమను చున్నది.

నాయకురాలిమాట॥ అయితే మంచిదే ఆచెంచుమించుఁబోఁ
డిని ఈడకుఁ దోడితేవే.

వ. అని మందలించిపంచిన నెచ్చెలిపిలువ నాయెఱుకత వచ్చెనఁట యెటువలెను.

సౌరాష్ట్రము॥ ఆట॥ దరువు॥

తరుణి కోరినకోర్కె తారార్కగాఁగ
మెఱయింప నల చెంచుమించుఁబోఁడివచ్చెన్.

వ. ఇవ్విధంబున వచ్చిన యాచెంచుబోఁడి, యాయంచనడ లాఁడింజూచి, యేమనుచున్నది.

చెంచుకాంభోజి॥ జంపెతాళము॥ దరువు॥

ఎఱుకడగవె కొమ్మ యెఱుకలసానినేను
తరుణిరో నీవెంచు తలఁపు దెలిపెదనె ॥౧॥
కొమ్మరో నీకోర్కె కొంగుబంగారముతె
సమ్మతమైన నొకవరుస సొమ్ములిచ్చెదవ ॥౨॥

నీమనసు రంజిల్ల నేఁబలక నేర్తునె।
నామాట తార్కాణమైనను మెచ్చుకొనవె ॥3॥
వాడవాడలనున్న వనితలను మెప్పింప।
ఈడులేని సొమ్ములివె యిచ్చిరమ్మ ॥౪॥

వ. అని పలికిన యెఱుకలకలకంఠితో నాకలికిచిలుకలకొలికి. యేమని పలుకుచున్నది.

నాయకురాలిమాట : ఏమీ యెఱుకలసాని, నీవుండే రాజధానియేమి ? నీపేరేమి తెలుపవే.

వ. అని యడిగిన నాయెఱుకలమోహనాంగి యేమనుచున్నది.

దరువు॥ మంగళకైశిక॥ ఆట॥

వన్నెగా దక్షిణద్వారకా పురమున
మన్నారు సన్నిధి నుందు।
నన్నుగోరి వేడు ననఁబోఁడులకెల్ల
నెన్నిన తలఁపులు దెలుపుదు ॥౧॥
వెలఁదిరో యచ్యుతవిజయరాఘవుఁడు
వేవరుసల నన్ను మెచ్చి।
పలుమాఱుగావించు బహుమానములంది
యెలమి తంజాపురినుందు ॥౨॥

కడలిరాయని ముద్దు కన్నియ పేరను
పుడమిలో జనులెల్లఁ బిలుతురు।
అడిగిన శకునము లతివ, తార్కాణగ
కడువేడుక మీఱఁ దెలుపుదు ॥3॥

వ. అని యీరీతిం బలికిన యాయెఱుకలనారీశిరోమణిని నూత్నరత్నసింహాసనాసీనం గావించి నిద్దంపుబంగరుగద్దియపైం దాం గూర్చుండి యాముద్దులాడి వచనరచనా చమత్కృతులం గందళితమందహాసవదనారవిందయై నీ వెవ్వారికిం దార్కాణగా వివరించితివని యడిగిన మించినవేడుక నాచెంచుమాయలాడి యేమనుచున్నది.

దరువు॥ రామకవి॥ ఆది॥

వెలయఁగా నీసీమ యేలు విభుని గరితలకు
చెలువమన్నారుని సేవింపుచు మీవిభుఁడు
ఇలయెల్ల నేలునని యెన్నైన వరుసలఁ
గలికిరో నేను తార్కాణగాఁ జెప్పితినే॥

వ. అని పలికి యాశకునాలకలికి యాబాలికతో నేమనుచున్నది.

ఎఱుకతమాట॥ సేసూపు సేసూపు సేసూపవే దుండి; బంగారు
సెయ్యి, భాగ్యముగల సెయ్యేయమ్మ.

అని మఱియు నేమనుచున్నది.

కాంభోజి॥ ఆది॥

నేనూ ౘ నేనూౘ నేనూపగదవె।
వాసిగా నొకమేలువార్త దెలిపెదనే ॥౧॥

పదుమపు రేకల భాసిల్లుపెయ్యి।
ముదమునఁ జుట్టాలఁబోషించు పెయ్యి ॥౨॥

కోరినవారికిఁ గోర్కెలిచ్చే పెయ్యి।
చేరి నమ్మినవారిఁ జేపటు పెయ్యి ॥౩॥

అని మఱియు నేమనుచున్నది.

దరువు॥ తోడి॥ ఆట॥

ముదితరో బంగారు మొరిఁటెలోపలను
ముదముతో గురినూడ ముత్తేలు దెమ్మిపుడు ॥౧॥

కలికిరో ముత్తేలు కరమునఁ గైకొని
తలఁచవే నీ వెంచు తలఁపుదెలిపెదనే ॥౨॥

వ. అని యాకుందరదన యిందువదనలందిచ్చు కుందనపు మొరిఁటెలోని ముత్తియంబులు హస్తంబునహత్తించి బత్తితో నిష్టదేవతల నేమని ప్రార్థించుచున్నది.

ఎచ్చరికతమాటలు। శ్రీరాజగోపాల! పెండలంకార! దక్షిణ ద్వారకావాస! చక్కనిసామి! చెంగమలవల్లినాయక! విజయ

రాఘవ వరద! నీవేనన్నైన. నావాక్కునవిలిపి, నాకలప్రునవిలిసి, పల్లని వాకిచ్చి, చక్కని వాకిచ్చి. యీవమ్మ తలచినతలంపు తార్కాణగా పలుకవయ్య.

వ. అని పలికి యీయెఱుకలకలికి యాకలకంఠినిఁ జూచి యేమనుచున్నది.

ఎఱుకతమాట : అమ్మాయమ్మ, ఎఱుకాడు గెఱుకాడుగే గోయమ్మ. చెయ్యంటె మగసు; భుజమంటె కోడు; కడుపంటెబిడ్డ నీయాలో సెన సెప్పేగాని, యీబుఱుకనికి ఈబుఱుకనికి బువ్వపెట్టవే బువ్వపెట్టవే మండి!. అది యెటువంటిదని అడుగుతావుండావే; సెయ్యే. నీమగ డెటువంటివాడని అడుగుతావుండావె. అయితే సెప్పే వినవేయమ్మ.

దరువు॥ ఎఱుకలకాంభోజి॥ జంపెతాళము॥

తరుణిరో పదియారు దానములు గడియలో
మెరయఁ జేసినయట్టి మేటిరో యితఁడు॥
గోపాలదేవుఁడే కులదైవమనుచు
నేప్రొద్దు మదిలోన నెంచునె యితఁడు ॥౨॥
సమరాన నెదిరించు చండిమన్నీలను
విముఖులుగఁ జేయు భీమసముఁడె యితఁడు ॥3॥

రమణులను బదివేల రంజిల్లు ప్రేమతో
సమముగఁ బాలించు సామియే యితఁడు ||౮||

హేమాబ్జనాయికకు హితఫతుఁడనఁగను
ఈమహినివర్ధిల్లి యింపొందు నితఁడు ||౯||

అని మఱియు నేమనుచున్నది.

ఎఱుకతమాట : ఓకుటిలాలక, యీకోరిక యేరీతిఁ జేరిక యయ్యాఁకని అడుగుతావుండావె. అటూ యిటూ సూడక వ్రాకొని వినవేదుండి! వొంకె, రెంకె, వొందు. ఈదినంబులలోననే నీనెచ్చెలివల్లనుండి నీకోరిక వొన గూడేనే. నీమగడు నీచేరువకు వచ్చినాడని యెంచు కోవే. ఈసంతోసాన నీవు నన్ను మరవకువే. నన్ను తలసుకోవే దుండి !

వ. అని తార్కాణగాఁ బలికిన యెఱుకలకలకంఠికి నా వాలుగంటి జాంబూనదాంబరతాంబూలములు బహూకరించిన నాయెఱుకలసాని నిజనివాసప్రవేశంబుచేసెనట యెటువలెను.

వ. అంత నామదనమంజరియును విజయరాఘవ మహీకాంతుని చెంగటికిఁబంచిన యాపంకజాక్షి యింకా రాదాయె. ఆదొరల పట్టభద్రుని వొడగనుప్రదొఱకునో దొఱకదో ! ఈ కోరిక యేరీతి చేరికఁయగునని యాభామినీమణి యేమను చున్నది.

ద॥ కాంభోజి॥ ఆట॥

వెలఁదిని వేడుకొని విజయరాఘవుని
వేగనేఁ దోడి తెమ్మంటిఁ గా।
చెలువుని సమయము గలిగిన నెటువలె
నామనవులఁ దెలుపునో ॥౧॥

వినిన నాదరించునో లేకవాఁడు
విని వినములు సేయునో ।
చెస మొక్క యేడాయెఁగా వాఁడు ఇది
తెలిసి యిందు రాఁడాయెఁగా ॥౨॥

స్వామి యిందు వచ్చెనని వానివద్ది
సవతులిందు రానిత్తురా ।
నామనోరథము లేఁక నెన్నటికి నీడేరునో ॥౩॥

వ. అని యామహీపతిమీఁది మోహపారవశ్యంబున నున్న సమయంబున నామంజువాణి చెంతకుఁ గనకాంగి వచ్చెనట యెటువలెను.

దరువు॥ సారంగ॥ ఆది॥

మదిలోన సంతోషము మాటికి చెలఁగఁగ
ముదమునఁ గనకాంగి ముదితను జేరె ॥౧॥

వ. ఈవిధంబున వచ్చిన నెచ్చెలి మదనమంజరి చెంగటికిఁ జేరి యావిజయరాఘవమహీవిభుఁ డొసతిచ్చిన మాటలా ఁగోటికి వీనులవిందుగా వినిపించెనఁట యెటువలెను.

కాంభోజి॥ ఆది॥ పసుపు॥

మన్నెహంపీరుని నోచెలియ మన్నారుదాసుని॥
కన్నుల పండువుగాఁ జూచితినే ॥౧॥

నీరాభిషేకుఁ విభవదేవేంద్రుని
శ్రీరఘునాథ కుమార శేఖరుని ॥౨॥

చిఱునవ్వు మోమును జెలువొందు జాల
గణియించు మోహనాకారుని సామిని ॥౩॥

రమణుల నేవేల రంజిల్లు చేయుచు
సమముగా నేలెడు చక్కని సామిని ॥౪॥

కంతుజనకుం డనఁదగు మీఱి
మంతుకెక్కిన రూపవంతుని ॥౫॥

వ. అని మఱియు నేమనుచున్నది.

గీ. నీవువల్కిన పల్కులన్నియును నేను
విజయరాఘవవిభునకు విన్నవింప
నతఁడు ముదమున నామాటలాదరించి
వనిత, నినుబెండ్లియాడంగ వత్తుననియె.

వ. అని మందలించిన నయ్యిందుముఖి కందళిత మందహాస వదనారవిందయై గారవంబుమీఱ నేమనుచున్నది.

(నాయకురాలు విన్పించే పదం)

ముఖారి॥ ఆది॥

నానోముఫలియించె నామనసురంజిల్లె నాకోర్కెలీడేరెనే
మానినీ! సదనుండు మన్నారుదాసుండు నామనవిగైకొనె
గనుక ॥

పదివేలజన్మముల బంగారు చెంగమ్మను
పలుమారు పూజసేయఁగా।
కదిసి యీవిజయరాఘవ సార్వభౌముండు
ఘనత నన్నేలుఁ గదవె ॥౧॥

ఇంతుల నెందఱినైన నేలు మన్నారుదాసుండు
వింత నన్నాదరించెనే।
ఇంతగుణవంతుడు ఇంతిరోయిప్పుడు
ఎలమిఁ బతి యాయెగనుక ॥౨॥

వ. అని మఱియు నేమనుచున్నది.

ద॥ ధన్యాసి॥ ఆట॥

తెలఁది నాకోర్కులు వెలయఁజేసిన నీకుఁ
జెలఁగి యేయుపకారము సేయుదునమ్మ ॥౧॥
ఎలమితో నవనిధానములిచ్చిన నీడుగాదు
కలికిరో నిన్ను నేగౌఁగిలించెదను ॥౨॥

వ. అనిన విని యావనజగంధితోఁ గనకాంగి యేమను
చున్నది.

కాంభోజి॥ ఆది॥

మానిని, నీవంటి నిధానము గలుగంగ
పూనిక నవనిధానములు పొందఁగాఁ గలిగె॥
ఎన్నఁటికిని నీవు ఈ నెనరు మది నెంచి
నన్ను మఱవకుమమ్మ ననబోఁడి నీవు ॥౨॥

వ. అని మందలించిన కనకాంగిని ముదముమీఱ మదనమంజరి కౌఁగిలించుకొని కనకాంబరంబుల ఘనభూషణంబుల బహుమతులుగావించి మఱియు మఱియుఁదనప్రియునిగుణంబులు గణుతింపుమని వినుచుండె. తదనంతర కథాసంవిధానం బెటువలెను.

వ. అంత నావిజయరాఘవ నృపపుంగవుండును కనకాంగి చేత మదనమంజరి మంజుతర రూపరేఖావిలాస విశేషంబులు హృదయంబురంజిల్ల విన్నవాఁడు గావున సయ్యింతి తనచెంత నిలిచినట్లుండ నంతకంతకు నింతింతన రానికాఁక యెంతయు హెచ్చఁ గంతుబారికిఁ జిక్కి యేమనుచున్నాఁడు.

నాయకుఁడు విన్పించే విరహపదాలు:

ఎఱుకలకాంభోజి॥ఆట॥ (పాములనాగస్వరం విన్పించేది)

బాలరో నీపైఁ జాలమేలువాఁడనె ।
యీవేళ నీకౌఁగిలిఁ బాలింపవే ॥౧॥
నీదాసుఁడనుచును నెమ్మిమీఱఁగ నన్ను
ఆదరించి నీకెమ్మోవి ఆననియ్యవె ॥౨॥

వలపుదాఁచనేరనె వనితగోయిప్పుడు
ఎలమిమీఱ రతులనన్నేలుకోవె ॥3॥

వ. అని మఱియు నేమనుచున్నాఁడు.

ఘంటారవము॥రూపకము॥అటతాళము.

చలముసేయకయిప్పుడు సంపంగిమన్నారుదాసారమ్మని।
చెలువనీవేటికిఁ జేరరావు ॥౧॥

నీరజాక్షి, నిన్నుబాసినిముసమైనఁ దాళనే।
ఒయ్యారిరానె నీమోవియానవియ్యవె ॥౨॥

చక్కెరవిల్తునికేళి సరసాన నేలుకోవె।
దక్కినానె నీవలలఁ జిక్కినానె ॥3॥

అని మఱియు నేమనుచున్నాఁడు:

మధ్యమావతి॥ఆది॥దరువు॥

ఏమేమోముద్దులగుమ్మ ఎందాకతాళుదునె।
రామరో నేవిజయరాఘవుఁడనే ॥౧॥

ముద్దుగులుకునీమోవి మొనపంటనొక్కె నె
వద్దచేరికౌఁగిలించే వనితనీకుదక్కితినే ॥౨॥

వ. అని మఱియు నేమనుచున్నాఁడు.

సావేరి॥ ఆట॥ దరువు॥

ఏలాగుతాళుదునె యీమోహ
మెంతని విన్నవింతునె।

బాలరో నీమోవి పండు [illegible] యివ్వగ
పలుమారు ఆశ్రయించినవే యోలలన ‖౧‖
సందుకన్నె లగ్గముగా నీకేయి
బాళినీపై మోహించెనే।
సిందుమోహమువిరాజ నేనుకోగారవించి।
నెలఁతా నీకౌఁగిలించెనా ఓలలన ‖౨‖
విరవాదివిరిశయ్యను సన్ను జేరి
వేమారు మరుకేళిని।
తరుణిరో మన్నారుదాస రమ్మనిపిల్చి
కరుణ నన్నేలవే యోకొమ్మ ‖౩‖

వ. ఇత్తెఱంగున మోహవిభ్రాంతిచే నున్న కాంతునిజూచి చెంతనున్న యింతులు తమలోఁ దామే యనుచున్నారు.

దరువు॥ సావేరి॥ ఆది॥

ఎంతని తెలుపుదు నీవిభునకు మోహంబు
వింతయైయున్నది వెలఁది, చూచితివె ‖౧‖
చూచిచూడకమున్నె చొక్కినాఁడమ్మ
యాచెలిభాగ్యమే మనియందుమమ్మ ‖౨‖

ఘంటారవము॥ ఆది॥

చిగురుఁబోఁడివలలఁ జిక్కెమన్నారుదాసుండు
మగువనేఁబిల్చిన మాటాడఁడమ్మ ‖౩‖
అచ్యుతవిజయరాఘవుఁ డాచెలినిగూడితె
మచ్చికంటిరో యెంతమన్ననసేయునో ‖౪‖

వ. అని యీ చందంబున నాయిందుసదనలు నుతియించు
చున్న యానమంటపంబున మీఁదరంబుగా దిగ్గగనాంతరంబుల
నన్నంబుగా మ్రోయు హెగ్గాళెలును బూరగాళెలును నూత్న
రత్నకలశప్రభాసచిత్రంబులగు వాజపేయచ్ఛత్రంబులును సౌవర్ణ
కాండప్రకాండ శ్రీ చామరంబులును శుభమహాన్యం
బులుఁ బ్రాఘలు నిగిడింప, నింతగ కుమారప్ప సంతతపనుల
నెంతయు మెఱయు దంతిపుంబ్బకీ నెక్కి చెంబడిగ శ్రీవైష్ణవుల
సంఘంబు లసంఖ్యాంబులై శీని మెఱయ సేవింప, చతుర్వేద శత
క్రతు శ్రీనివాస తాతయాచార్యవర్యులా రంగమాంబికా
వరతనయుని చెంగటికి విచ్చేయించిరంట యెటువలెను.

దరువు॥ హుశాని॥ ఆది॥

స్థిరకీర్తి శ్రీనివాసదేశికుఁడువచ్చె
గురురూపమునవచ్చు గోపాలుఁడనఁగ ॥౧॥

ముసనుమీఱిన పట్టి ముత్యాలకుళ్ళాయి
సరిలేనిరతనాలజంటి యురచట్ట।
హరువైనబంగారు తిరుమణివడములు
మెఱయఁ గనకాంబరము మిగులరాణింపఁగా ॥౨॥

వ. ఈతీరునఁ జేరవచ్చిన గురురాయచంద్రుండు విజయ
రాఘవేంద్రుండున్న చందంబుచూచి తనవద్దికివచ్చి వందనం
బాచరించిన ముద్దియలతో నేమనుచున్నాఁడు.

(ఆచార్యులు విన్పించేది)

శంకరాభరణము॥ ఆది॥ దరువు॥

ఎపుడు నేవచ్చిన నెదురుకొన్ని ప్రేమతో
నుపచరించేవాఁడేల యూరకేయున్నాఁడమ్మ ॥౧॥
కన్నియలార దెలుపరమ్మ గ్రక్కునమాతోను।
మన్నారుదాసుఁడేటికి- మాటలాడఁడమ్మ ॥౨॥
ఏకార్యమైనను హెచ్చరించి మాయనుమతి।
గైకొనువాఁడు తెలుపని కార్యమిదేమమ్మ ॥౩॥
హృదయమిటువంటిదని యించుకమాతో మీరు
ఇదియని తెలిపినఁజాలు నిపుడెయొనగూర్తుము ॥౪॥

వ. అని యానతిచ్చిన గురురాయపట్టభద్రునితో నాభద్ర
గజయాన లేమనుచున్నారు.

బిలహరి॥ ఆది॥

ఏమగునయో వచ్చి యీవిభుని చెంతఁ జేరి।
యేమొ విన్నవించె నేముగనుంగొనంగ ॥౧॥
ఆచార్య శేఖర యది మొదలుగానితఁడు।
ఈచందమున నున్నాఁడు ఇదిమీరె తెలియరయ్య॥౨॥

వ. అని యిందువదనకు మందలించినఁ గందళితమందహాస
వదనారవిందుఁడై ముందటి రాఁగలశుభంబులు దెలిసి నిజనంద
నునిమేను కరారవిందంబున నందంబుగానిమురుచు నేమను
-చున్నాడు.

(ఆచార్యులు విన్నపించేది)

ద్వి. విజయరాఘవభూప, విపులప్రతాప,
సుజనసన్నుతశీల, శుభగుణాలోల!
ఎనయ నీమదిలోన నెంచునీకార్య
మొనగూడుటకును మున్నొకకథగలదు
వినిపింతు నెంతయు వివరంబుగాఁగ
వినఁగదవయ్య సవిస్తరంబుగను
తలఁపఁగ నలయుశోదకును దాఁబుట్టి
కులగుణవంతుఁడౌ కుంభుఁడన్వాఁడు
నియమవంతుండల్ల నీలాంశయగుచు
ప్రియపుత్రియైన యప్పిన్నపిరాటి (?)
చెలఁగ గన్నెకుఁ బెండ్లిసేయఁగఁ దలఁచి
యల సప్తవృషభంబు లంటఁగట్టినను
ఎలమితోఁ దనపుత్రి నిచ్చెదననుచు
వలనుమీఱఁగ స్వయంవరము చాటింప
నప్పుడు మన్ననా రచటికివచ్చి
యప్పెనువృషభంబు లంటంగఁ గట్టి
యానీరజాక్షిఁ బెండ్లాడినయంత
మానినీమణి యష్టమహిషులలోన
నన్నను సరిగాఁగ నడపుమటన్న

ఁ మన్నారు[illegible] దాసుఁ [illegible]నియె
“ఈ యుష్మన్మహిమంబు కెసఁగ వేడ్క
నాయిక మన్నింప నాకెరో. తగదు;
కలియుగంబందున ఘనకీర్తి చేతఁ
బొలుపొందు రఘునాథభూమిపాలునకుఁ
దనయుఁడనై నేను దనరుచుండుదును.
తనరంగ మన్నారుదాసుండనంగ
ఘనునిఁ గళానిధియను రాజునకును
కువలయేక్షణ, నీవు కూఁతురవగుచు
మదనమంజరనునామమున వర్తిలుము.
మానవతి, యిప్పుడు నిన్ మహిని బెండ్లాడి
సాటిలేకుండంగ జగమెల్లఁ బొగడ
మేటిగా నడపింతు మెలఁతలలోన”
అని శౌరిపల్కె నీయతిశయంబెల్ల
నెనరున నిదె కళానిధికి నేఁదెల్పి
మన్నారుదాస, యీమదనమంజరిని
జెన్నుమీఱఁగఁ బెండ్లిసేతు నీకిపుడు.

వ. అని యానతిచ్చి యచ్యుతవిజయరాఘవేంద్రుని హృదయారవిందంబునకు నానందంబు గావించి కాంచనమణి సముల్లసితంబగు పల్లకి నెక్కి సకలవైభవంబులు మెఱయ రయంబున

మహానీయు డగు కళానిధియను రాజా శిష్యగణ సహితుఁడై వచ్చు
సమయంబున నారాయణదేవేంద్రుఁడు ఇంటివాఁడుండఁగుచు ముద
మున నెదుర్కొనె నటఁ యెలుపలెను.

కేదారగౌళ॥ ఆది

కళానిధి యావేళ స్వకీయ భవనము మీఱ
నెలమి(తో)ఁ దాతాచార్యుల నెదురుగావచ్చె॥

వ. ఈచందంబున నెదుర్కొని ముదియుమీఱ సాష్టాంగ వందనంబాచరించి యాయాచార్యవర్యుని యంతఃపురంబునకు దోడ్కొనివచ్చి యింతులుఁ దానును వివిధోపచారంబులాచరించి రత్నసింహాసనాసీనుంజేసి తాను నతనియనుమతి నుచితాసనాసీనుండై యేమనుచున్నాఁడు.

(కళానిధి యనురాజు విన్పించే ద్విపద)

ద్వి. శ్రీనివాసాచార్య శేఖర, మీరు
పూని నామందిరంబునకును వచ్చు
కతమున నధిక భాగ్యముగంటి నేను
ప్రతిలేని కీర్తి సంపన్నుండ నయితి.
అల మన్ననారుల యవతారమగుచు
వలనొప్పు మీకృపవర్ధిల్లఁగంటి.
చెలఁగుచు మీరువచ్చిన కార్యమిపుడు
తెలుపంగఁ గదరయ్య దేశికవర్య
తడయ నొనర్తు నెంతటికార్యమైన
నడిపనికిని నిప్పుడానతీరయ్య.

వ. అని మందలించిన యారాజపురందరుంజూచి తిరుమలా న్వయాభినందనుండైన యయ్యాచార్యవర్యుం డేమనుచున్నాఁడు.

(ఆచార్యులు చదివేద్విపద)

ద్వి. నృపతిశేఖర, కళానిధి, వినవయ్య
యిపుడు వచ్చిన కార్యమెల్లఁ దెల్పెదను
ఘనుఁడైన విజయరాఘవశౌరి నీదు
తనయను బెండ్లాడఁ దామదినెంచి
మముఁ బంచె మీతోడ మాటలాడంగ
సమరంగ నతని మహత్వంబువినుఁడు
చిన్న చెవ్వ నృపాలశేఖరు నప్త,
యెన్నంగ నలయచ్యుతేంద్రు పౌత్రుండు,
శ్రీరఘునాథ ధాత్రీనేత సుతుఁడు,
వీరాధి వీరుఁడు విజయరాఘవుఁడు
అతుల సాహిత్యవిద్యల భోజరాజు
ప్రతిలేని యట్టి సంపదల రారాజు.
ఆశ్రితజనపోషణాగ్రగణ్యుండు
విశ్రుత సాహస విక్రమార్కుండు
సోమార్కకీర్తి తేజోధురీణుండు
తనరు షోడశ మహాదానప్రదాత
యనివారితాన్నదానాఖిలత్రాత

వైష్ణవధర్మ నిర్వాహణ పావనుఁడు
జిష్ణునఖాంఘ్రి రాజీవసేవనుఁడు
మన్నారుదాస నామాంక వక్షుండు
సన్నుత నీతి పరిచారదక్షుండు
అటువంటివాఁడు నీయల్లుఁడౌ కతన
ఘటియిల్లెనౌర భాగ్యములెల్లనీకు.

వ. అనిన యా బోధనిధితోఁ గళానిధి యేమనుచున్నాఁడు.

దరువు॥ మధ్యమావతి॥ ఆది॥

ఆచార్యవర్య మీాయానతిమీాఱక
నాచిన్నిపట్టి మన్నారుదాసునకొసఁగుదు ॥౧॥
ప్రేమతో మీారలె - పిన్నపెద్దలగుచు
నీమహోత్సవమెల్ల - నీడేర్పరయ్య ॥౨॥

వ. అని మందలించిన యన్నరనాథునితో మన్ననమీాఱ నాచార్యు లేమనుచున్నారు.

(ఆచార్యులు చదివే పద్యం)

తే. గీ. ధరణివర నేఁడుశుభముహూర్తంబుగనుక
విజయరాఘవవిభునకు విన్నవించి
పొసగ నిశ్చయతాంబూలమునకు నిపుడు
ఎలమిమీాఱంగను పురోహితులను బనుతు.

వ. అని యా తపోనిధి యా కళానిధితో మందలించి యత నిచే బహుమానంబులుగాంచి మరలి యా విజయరాఘవ భూపాలుని జేరవచ్చిన నా నరనాథుండును గురురాయశేఖరు నెదురుకొన వచ్చెనంట యెటువలెను.

భైరవి॥ దరువు॥ ఆది॥

తరుణులుగొల్వ మన్నారుదాసభూపాలుండు
గురురాయశేఖరు నెదురుకొనవచ్చెనపుడు॥

వ. ఈతీరునఁ జేరవచ్చిన యచ్యుతవిజయరాఘవభూపా లుఁడు అతని పాదారవిందంబులకు వందనంబాచరించి తదా శీర్వాదంబునుం గైకొని కనకసింహాసనాసీనుం జేసి యా మహా మహు ననుమతి నుచితాసనంబునఁ గూర్చుండినసమయంబున నానృపాలునిఁజూచి యాచార్యు లేమనుచున్నారు.

దరువు॥ మధ్యమావతి॥ ఆది॥

మన్నారుదాస, నీమదిలోనికోర్కులు
ఎన్నఁగ నీడేర్పుచు నేమువచ్చితిమి ॥౧॥

నృపవర్య, వేగమె నిశ్చయతాంబూలమునకు
నిపుడ వేగమె పురోహితుల రప్పింపు ॥౨॥

వ. అని మందలించి పురోహితుల రప్పింప వారలువచ్చిరఁట యెటువలెను.

దరువు॥ రేగుప్తి॥ ఆది॥

చెలువమన్నరుదాసు చెంగటికిని వేగ
నెలమిమీఱఁ బురోహితులువచ్చిరపుడు॥

వ. ఇవ్విధంబున వచ్చిన పురోహితులఁజూచి యాచార్యు లేమనుచున్నారు.

ఆచార్యులమాట: రారోయి పురోహితులు. కళానిధిమహారాజు
వారి నగరికిఁబోయి విజయరాఘవస్వామి వివాహానకు
నిశ్చయతాంబూలంబులఁ జేసి రారోయి.

పురోహితులమాట: అయ్యా అలాగే నిశ్చయతాంబూలంచేసి
వచ్చేమయ్యా.

వ. అని విన్నవించి యా పురోహితులు కళానిధి నగరికిఁ బోయి నిశ్చయతాంబూలం జేయించి మగిడివచ్చి విన్నవించిన తదనంతరంబ యయ్యాచార్యవర్యుండు ప్రియనందనుండైన విజయరాఘవచంద్రుని శుభముహూర్తంబునఁ బెండ్లిపీఁటపైఁ గూర్చుండనియమించి హృద్యంబులగు శోభనవాద్యంబులు మ్రోయ కాళ్ళగోళ్ళు దిద్దించు నత్తఱి ముత్తైదువలు కొట్నంబులు దంచవచ్చిరఁట యెటువలెను.

ద. హెచ్చైనసొమ్ములు నింపుతో సింగారించుక
ముచ్చటలాడుచు ముత్తైదువలువచ్చిరి॥

వ. ఇవ్విధంబునవచ్చి యచ్చటనిలిచి తమతమ ముచ్చటలుఁ మెఱయఁ బల్కి-రఁట యెటువలెను.

ముత్తైదువ తిప్పావఝులమల్లమ్మమాట: ఏమమ్మ ముత్తైదువలు ఇంతసేపు రాకుండవలె.

ఎల్లమ్మమాట: ఏమి సేతుమమ్మ పురోహితులు మమ్ము విడిచిన కద నేము రావలె.

మల్లమ్మ: ఏమమ్మ మీకన్ను అషువలెనేనా ?

ఎల్లమ్మమాట: మామాత్రమేందమ్మ, యీముత్తైదువలందరి కిన్ని అషువలెనే.

మల్లమ్మమాట: ఔనా నాగావధానుల యెల్లమ్మ, పెండ్లిపందె ట్లోకి వచ్చి యొకపాటనుడుగు పాడ్రాదు. ఎన్నిమార్లు పిలిపించుకున్నావె!

ఎల్లమ్మ: అవునషె తిప్పావఝులయెల్లమ్మ! నేను అషువలె పలుమాఱున్న పిలిపించుకునేదాననమ్మ. మాయింటి యాయన ఉదయాన కదలి ఊరల్లాతిరిగి పురోహితాలు చేసి ఆకలిగొని అసురుసురై వచ్చేవేళ నేయింట్లోఉండకుంటే మావారేమందురు! భళా లెస్సాయె!

నాగావధానులయెల్లమ్మ: మీవారు కోపగించుకొంటే మీ వారికి నేను ఉత్తరువుచెప్పుకొనేగాని లేచి యిషు రావమ్మా.

ఎల్లమ్మమాట: అవునమ్మా మల్లమ్మ! అవును నీవు మీవారి కిన్ని ఉత్తరువు చెప్ప నేస్తవు. మరిన్న షువలె పదిమంది మనుషులకున్ను ఉత్తరువు చెప్ప నేస్తవు. నీ త్రాణ నే నెరుగ. అవునవే రంగుభట్లనాగమ్మ! నీకు ఇచ్చిన వక్కలాకులల్లా యెషుదాచుకొంటివి! ఆరికెబియ్యం తవుడు బుక్కినదానివలె నోరు తెల్లంగా బెట్టుకొన్నావు.

రంగుభట్లనాగమ్మ: అవునవో వదినగారు! మీరిషువలె పరియాచకాలు సేయవలె. నాకు ఇంట్లో పనిపాటులతో తీరగను పీడెలు వేసుకోను ప్రొద్దువున్నదమ్మ. విడెమనే వికారమేగాని గానిగపిండికి గలిగినంత కమ్మదనం వున్నాదమ్మ.

వ. అని యొకరికొకరు ముచ్చటలాడుచు అచ్యుతవిజయ రాఘవునియెదుట కొట్నంబు పెట్టి సువ్వాలలు పాడిరంట యెటు వలెను.

సౌరాష్ట్రిము॥ రూపకము॥ ఆటతాళము॥

ప్రణుతిగాంచినయట్టి యచ్యుతరఘునాథభూపాల
తనయుండై మహిని వెలయు వినయనిధికిని ॥౧

సువ్వి విజయ రాఘవునకు సువ్వి దానకర్ణునకు
సువ్వి రూపమన్మథునకు సువ్విసువ్వి ॥౨

కొలుచువారికోర్కెల్ల కొంగుబంగారముగను
చెలువముగను జేకూర్చు చెలువరాయనికి ॥3॥

రాజాధిరాజులెల్ల రంజిల్లి తెచ్చియిచ్చు
రాజముఖులఁ బెండ్లియైన రాజచంద్రునకు ॥4॥

వ. అని యీవిధంబున పువ్వుఁబోఁడులు సువ్వాలలుపాడి పొంకంబుమీఱ సుంకులు చెరిగిన తదనంతరంబ తనయునకు మంగళస్నానంబుసేయించి వివాహమంగళోచిత శృంగారంబు లలర నాపట్టభద్రుని భద్రగజారూఢుంజేసి సకలసన్నాహంబు మెఱయ దొరలిరుగడలనడవ ఆ యాచార్యపుంగవుండును వారలకు ముంగలనడచె. అప్పుడు హృద్యంబులగు భేరీమృదంగాదివాద్యంబులును తీరుమీఱు దీపంబుల బారులును, పొగ లేని పగలు వత్తులును, రాణగల బాణవిద్యలును, పొడవులగు ముత్తియమ్ముల గొడుగులును, అరుదులై కనుపట్టు పువ్వుల బిరుదులును, రువారంబుమీఱు వారనారీతిలకంబులును, వందిమాగధబృందంబును క్రందుగా నందంద నడవ, వేత్రహస్తులు ముందటఁ సందడి తొలఁగింప, నంగనామణుల సంగీతమేళంబు చెలంగ నీచందంబున విజయరాఘవచంద్రుండు మహేంద్ర వైభవంబున ముదముమీఱ నూరేఁగి వచ్చెనఁట యెటువలెను.

దరువు॥ సౌరాష్ట్రిము॥ ఆది॥

గజరాజుపై నెక్కి ఘనవైభవముమీఱ
విజయరాఘవమహీవిభుఁడు వచ్చెన్॥

వ. ఈచందంబునఁ జేరవచ్చిన యచ్యుతవిజయరాఘవమహీపాలుని గుణాంబుధియైన కళానిధి యెదురుకొన వచ్చెనఁట యెటువలెను.

శుద్ధసావేరి॥ ఆది॥

మనుజదేవేంద్రుని మన్నారుదాసుని
నెనలేనివేడుకతో నెదురుకొనెనపుడు॥

వ. ఈవిధంబున నెదురుసేసలుసల్లుచు నెదురుకొని యామదనావతారుని ముదముమీఱఁ దననగరికిఁ దోడితెచ్చి తదనంతరంబ తన తనయయైన మదనమంజరిని దోడితెచ్చెనఁట యెటువలెను.

లక్ష్మీకళ్యాణము.

కన్నడగౌళ॥ ధృవతాళము॥

సుదతుల కైదండ సొంపుఁశోభూని
మదనమంజరివచ్చె మలయుచునపుడు ॥౧॥

మంగళవాద్యముల్ మాటికిఁజెలఁగ
రంగుమీఱఁగవచ్చె రాజీవనయన ॥౨॥

ఎదురుసేసలుచల్ల నింతులెల్లరును
మదనమంజరివచ్చె ముదముమీఱఁగను ॥3॥

వ. ఆసమయంబున మన్నారుదాసభూపాలుండు పెండ్లిచవికె చేరవచ్చెనట యెటువలెను.

ధవళము॥ కాంభోజి॥ ధృవతాళము॥

మన్నె దేవేంద్రుఁడైనట్టి మన్నారుదాసభూవిభుఁడు
సన్నుతులుసేయఁగా పెండ్లిచవికెకు విజయించెనపుడు
ఆపెండ్లి చవికెలో నప్పుడమరులు పూలవానలు గురి
యఁగను॥
భూపాలుండు పెండ్లిపీఁటపైఁ బాలఁతితోఁ గూర్చుండె
నపుడు॥

వ. ఈచందంబున విజయరాఘవ భూపాలుండు మదనమం జరితోఁ గూడఁ బెండ్లిపీఁటమీఁదఁ గూర్చున్న సమయంబున హితులగు పురోహితులు వివాహసంకల్పంబు నడిపించిరట యెటువలెను.

సంకల్పము॥ శుభేశోభనే ముహూర్తే అద్యబ్రహ్మణః ద్వితీయ పరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే కలి యుగే ప్రథమపాదే జంబూద్వీపే భరతవర్షే భరతఖండే అస్మిన్ వర్తమానే వ్యావహారికచాంద్రమానే సౌమ్య నామసంవత్సరే ఉత్తరాయణే వసంతఋతౌ వైశాఖమాసే శుక్లపక్షే అద్యశుభనక్షత్ర శుభయోగ శుభకరణ యుక్తాయాం అస్యాంశుభతిథౌ అచ్యుతభూపాలకుమా రస్య విజయరాఘవభూపాలస్య వివాహాఖ్యంకర్మ కరిష్యమాణస్తదాదౌ శుభఫలార్థం వృద్ధ్యర్థం అభ్యుదయా

ర్థంచ మహోజనైస్సహ స్వస్తిపుణ్యాహవాచనం కరిష్యే తదేవలగ్నం సుదినం తదేవతారాబలం చంద్రబలం తదేవ॥ విద్యాబలం దైవబలం తదేవలక్ష్మీపతే తేంఘ్రి యుగంస్మరామి. సుముహూర్తోఽస్త్విత్యను గృహ్ణంతు సుముహూర్తోస్తు.

వ. అని యీవిధాన దేవతావాహనాది శుభకర్మంబు లాచరించి మంగళసూత్రధారణ వివాహప్రధాన లాజహోమంబులు మొదలైన శుభకర్మంబులు సేయించి యాశీర్వదించునప్పటి ముత్తైదువలు వైభవంబులు మెఱయ శోభనంబులు ధవళంబులు పాడిరట యెటువలెను.

శోభనము: మంగళకైశిక॥ ధ్రువతాళము॥

శ్రీరాజగోపాల సేవాధురీణునకు
వీరాధి వీరునకు మావిజయరాఘవేంద్రునకు ॥౧॥
జనలోకాధారునకు జగదేకవీరునకు।
వినుత ప్రతాపునకు మావిజయరాఘవేంద్రునకు ॥౨॥
ఇభరాజగమనునకు హిమకరవదనునకు
విభవదేవేంద్రునకు మావిజయరాఘవేంద్రునకు ॥3॥
కదన హంవీరునకుఁ గనకాంబరధారునకు
మదనావతారునకు మామన్నారు దాసునకు ॥౪॥

ధవళము॥ జయజయ కమనీయహాస

జయజయ మంజువిలాస
జయజయ పాలితదాస
జయజయ మన్నారుదాస ॥౧॥

జయజయ సద్గుణాధార
జయజయ కీర్తివిహార
జయజయ మదనావతార
జయజయ రఘునాథకుమార ॥౨॥

వ. ఈచందంబున వివాహమహోత్సవంబు సేయించిన తదనంతరంబ యావిజయరాఘవచంద్రుండు సాంద్రవైభవంబు మెఱయ యశోనిధియగు కళానిధి యొసఁగు భద్రగజ తురంగమ పదాతిప్రముఖ విజయోదాహరణంబులగు అరణంబులు గైకొని రంజిల్లుచు మదనమంజరితోఁగూడ నారాజశేఖరుండు పురజనులు పొగడ నగరు ప్రవేశించెనఁట యెటువలెను.

దరువు॥ కల్యాణి॥ ఆది॥

మన్నారుదాసుఁడు మదనమంజరితోఁగూడి
చెన్నొంది తననగరు చేరవచ్చెనపుడు॥

వ. ఇవ్విధంబున నగరుప్రవేశించి శ్రీరామాభిరామంబగు శ్రీరామసౌధంబునఁ గొలువైయున్న సమయంబున మదనమంజరి సకల విద్యాప్రవీణురాలుగనుక ముదముమీఱ పదకేళిక వినిపించెనఁట యెటువలెను.

పదము॥ కాంభోజి॥ ఆది॥

కంటివిలే మన్నారుదాస కనుఁగొనలేదంటివా
కల్లలాడేవు ॥౧॥

కలికి నీమోవినుంచిన కెంపులలీల
యెలమి నీవుదాఁచఁగ నిఁకనేల।
వలెవాటు వైచినదాని వన్నెచేల
చెలువుఁడ వింతాయె నీవేళ ॥౨॥

కొమ్మసందిట నుంచిన కొనగోరు
గురుతులు విదియచందురుఁ గేరు ।
ఎమ్మెకాఁడ నీనుదుటహొయలుమీఱు
నింతి పదములనున్న లత్తుకతీరు ॥౩॥

నిన్న రేయి దానిఁగూడి నీటుమీఱి
నిదురమంపున వచ్చితివౌరయోరి ।
మన్నె హంవీర యిప్పుడు నన్ను జేరి
మచ్చుగప్పంగ వచ్చిన నీదారి ॥౪॥

భరతవాక్యము॥

అని యివ్విధంబున శ్రీమద్రామాయణోపదేశ సంతుష్టాంతరంగ విజయరాఘవ భూపాలకృపాపాంగ వీక్షణానుక్షణ ప్రాప్త సారాగ్రహార తారహార చిరత్నరత్నకంకణోదార తారానురూప ముక్తాకలాప హృద్యతరబిరుద వాద్యనానావాహ

నాది సన్మానమానసీయ శాశ్వతైశ్వర్య ధుర్యుండును ......
......రచిత యాగభాగ సంతర్పితాఖిలదేవతావర్యుండును, సంగీతసాహిత్య విద్యాధురీణధౌరేయుండును, రామానుజాచార్య తినయాగ్రగణ్యుండును, భారతభాగవతాది శిక్షా వైచక్షణ్య విజితవిబుధాచార్యుండును, గురురాజశతక్రతు శ్రీనివాసదేశిక ప్రతిష్ఠాపితోపాధ్యాయ వైభవధుర్యుండును, ప్రతిపక్ష కవిశిక్షణవిచక్షణుండును, సకలసద్గుణసాంద్రుండును నగు కోనేటిదీక్షితచంద్రుండు కందళదరసగర్భ సందర్భంబుల హావణించిన విజయరాఘవకల్యాణంబను మహానాటకంబునకుఁ గథానాయకుండును నిజనాయకుండునునైన యచ్యుత విజయ రాఘవునకు హేమాబ్జనాయికా రాజగోపాలకులు ఆయురారోగ్యసమృద్ధియు నైశ్వర్యాభివృద్ధియు, సర్వశాత్రవ నివృత్తియు, సకలసామ్రాజ్యప్రాప్తియును గలుగఁ బాలించి లాలింపుచురుగాత అను ఆశీర్వాదము వేదతుల్యముగా వెలయుఁగావుత॥

విజయరాఘవకల్యాణ నాటకము సంపూర్ణము

---

# తంజాపురాన్నదాన మహానాటకము



పురుషోత్తమ దీక్షితుఁడు

# తంజాపురాన్నదాన మహానాటకము



కైవారము.

శ్రీరాజగోపాల కరుణాకటాక్ష వీక్షాలబ్ధశాశ్వతైశ్వర్య! ఘోరాహవ పరాభూతవీరవర్య! పాండ్యతుండీర మండలాఖండల ఖండనోద్దండదోర్దండ! చండతరప్రతాపమార్తాండ! వీరాధివీర! వితరణకర్ణావతార! విజయరాఘవధీర! పరాకు! స్వామి! పరాకు!

కృతయుగంబున నికృత్తశత్రుండగు మరుత్తుండును, త్రేతాయుగంబున మహాభాగుండగు నాభాగుండును, ద్వాపరయుగంబున మద్రరాజాంతకుండగు కుంతీసుతుండును, కలియుగంబున వితరణజితరాధేయుండవై విలాసినీజనమోహనరూపధేయుండవై విజయరాఘవ నామధేయుండవై వెలయు నీవును, అనవరత శతలక్షవిప్రభీష్ట మృష్టాన్నప్రదాతలు గావున సకలజనశ్లాఘాపాత్రంబగు నీదుమహాసత్రంబున భుజియింపవేంచేసిన సేతుకాశీతాచలాంతర నిరంతరిత మతత్రయధరిత్రీ సుపర్వులకు ఘృతగుడపాయసాపూపదధ్యన్నదుగ్ధవ్యంజనరంజితంబగు తదీయారాధనంబు నతిహర్షంబునఁ బురుషోత్తమదీక్షితుండు

విశిష్ట దేశికాభీష్ట దేవతారూపుండైన శ్రీనివాసస్వామిని నిజ మానసనివాసునింజేసి శృంగారహాస్యాద్భుత రసప్రధానంబుగా భావణించిన తంజాపురాన్న దాననామక మహానాటకంబునకుఁ గథాసంవిధానం బెటువలెను.

దరువు॥ సౌరాష్ట్రము॥ ఆదితాళము॥

చిరుతపాగచుట్టి – చేతబెత్తము పట్టి
సరగునవచ్చెనా – సత్రిమధికారి॥

వ. ఇవ్విధంబున వచ్చిన సత్రిమధికారి నెల్లూరి యెల్లమ రాజు ఏమనుచున్నాడు.

సత్రాధికారి యెల్లమరాజుమాట: అడెవట్టా ! అణ్ణాగుట్టి ?

అణ్ణాగుట్టిమాట:– అయ్యయ్యా !

అధికారిమాట:– పోనమాసత్తు నిలవయుంయిం దమాసత్తు కణ్ణా కణ్ణం వహాయాంబడి, యెత్తువా యిట్టుకొణ్ణావేణుం. కణక్కప్పిళ్లై అళయడా.

అణ్ణాగుట్టిమాట:– అయ్యా ! అళచ్చివారే ! యిందోరుంగాణుం తిరుమలకొళంది యాపిళ్లై అయ్యనళక్కిరార్ వారుం.

వ. ఆసమయంబున సత్రం కణక్కపిళ్లై వచ్చెనట యెటు వలెను.

ద॥ సావేరి॥ ఆది॥

గంటమోరగాఁ గట్టి – కవిలెకట్టచేపట్టి
కుంటుకొంచు కణక్కపిళ్లై – గొబ్బునవచ్చె॥

వ. ఈలాగున వచ్చిన కణకపిళ్లెనుంజూచి సత్రమధికారి యేమనుచున్నాడు.

అధికారిమాట:- వాఴంగాణుం ! తిరుమల కొళందియాపిళ్లె. పోనమాసత్తు నిలువయుం పేరవయిల్లె. ఇందమాసత్తె కణక్కుం వరాయిల్లాప్పడి యెత్తొహక్కండు యెళిద యిల్లె, యేమగాణుం, యెరిమెప్పాల్ కుడిచ్చాప్పోవె, శొరింజుకుండు శివ్వాయిరిక్కిరీర్.

కరణం తిరుమలకొళందిమాట:- దేవరీర్, పాప్పారుంగిప్పారుం కూత్తడిమాళుం కొడంగట్టి యుక్కోడెం పేశుక్కొండు యిఱుందాల్. అడియెనారుక్కుకణక్కుచ్చొల్ల అడియేన్ మేలేఱిరువాలూర్ చిమేయుంతచ్చినత్తిలె అంజి మాగాణముం నడక్కురప్పళుదు. అత్తాంతరక్కణక్కప్పిళ్లె అరమనెక్కెక్కణక్కుచ్చొల్లి వృత్తిరిచ్చిపోట్టుప్పోవాన్. అడియేనుక్కు యిదొరుకణక్కావచ్చెదో. ఆదెట్టా నల్లయనాన్ కణక్కెడుత్తువాడా.

హస్తాంతరం కరణం నల్లనయనాంమాట:- అయ్యా, యెడుత్తు వాఱెన్ యిండాఴుం.

మొదటికరణం తిరుమలకొళందె చదివేది:-

కీలకవష్ల అపంగునిమాసం పనిరేండాం తేదీ రామానుజ కూటత్తుక్కు అరిశివిట్టదుక్కువివరం. పదినెట్టు మాగాణిక్కాలే ముదర్ప్పడి అంజిగుళ్ళండాగావె విట్టఅరిశిమున్నూత్తు ముప్పదిం

గలనె ముక్కురుణియీరాళి. యిందువుంమేల్పడి మధ్యకూటత్తుక్కు విట్ట అరిశియిన్నాత్తు అంబదుంగలనె యిరుధూణిప్పదక్కు. యిదువుంపెరియ సత్రిత్తుక్కు విట్టఅరిశిరెండాయిరత్తు అన్నాత్తు అరవవింగలనె తూణిప్పదక్కు. ఆహామున్నాత్తు ముప్పదింగలనె తూణిపదక్కు అన్నాత్తు అంబ్బదింగలనె; యిరుదూణిప్పదక్కు అహానాళ రవరెక్కి మువ్వాయరత్తు యెణ్ణూత్తుముప్పదింగలనె తూణిపదక్కిరాళి. యిదువుం స్వయంపాకియలే పడియరిశి వివరం. స్వయంపాకిరాయఁ ముక్కుఱుణి మేల్పడిపెత్తవన్ తూణిపదక్కిరాళి శుత్తిరామంజ సలనాలుక్కుయిరుపహాణిప్పదక్కు అడియేన్ పత్తుతూణి అర్నాళి.

హస్తకంకరణం చెప్పేది:- పిళ్లె.

మొదటికరణంమాట:- యెంబిళాయి. పిళ్లెపిళ్లెయెన్ను తిడింగిత్తింగు రాయిళొల్లు.

హస్తకునిమాట:- నేత్తుకణంజత్తిలె యిరుందుం, సత్రిత్తుక్కు అరిశివరుగురపోళుదు అంజిపాది, పోరంబా, శాంజదే, అదుయిరవశక్కట్టి యెళిదివిక్క.

మొదటికరణంమాట:- యెంబిళాయ్ నముడమేలెతానె, వ్యాక్యానమో.

హస్తకునిమాట:- అప్పడి యెల్లాప్పొరుళుం, కూట్టికెళిక్కర పోళుదు, వేణుదాహంరదు. యిప్పకణక్కిలె పదింజ, యిరుక్కవేణుమె అదుక్కువళియెన్న.

మొదటికరణంమాట:-అయ్యర్ బ్రాహ్మణపిళ్లై, అన్నాగుట్టియో క్కెళ్ళరాదా.

హస్తకునిమాట:- మెల్యాశిక్క అయ్యన్ పత్తుకలనె యిరు దూణిప్పదక్కు.

అధికారి మెల్లమరాజుమాట : ఇరత్తుక్కుకణక్కు కొట్టుంగా ణుంపాప్పా......నేరమాచ్చి. యెవ్వరోయి స్వయం పాకులు ?

స్వయంపాకులమాట : అయ్యయ్య.

అధికారిమాట : అదేనట్టా మంచినీళ్లవాండ్రు

స్వయంపాకి : అయ్యయ్య.

అధికారి : అదేవట్టా సుద్దివాండ్లు.

సుద్దివాండ్లమాట : అయ్యయ్య.

అధికారిమాట : మనయేలినవారు బ్రహ్మణ్యప్రభువులు వీర వైష్ణవసార్వభౌములు అటుగనుక బ్రాహ్మణులకు అన్న పానాదులపట్ల కొదవవచ్చెనా తాళరు. తంతుమాత్ర పువాడైనా తంజాపూర ఉపవాసం ఉండరాదు. అటు గనుక ఘడియలు పండెండాయెను. రామానుజకూటము మధ్వకూటము, పెద్దసత్రము పరామర్శిస్తిరా ! పొడి అమరెనా ? వంటఅవుచున్నదా ? తళిఘాకులు అమ రిస్తిరా ? ఉప్పు, ఊరుగాయలు, ఊరుబిండ్లు, పచ్చళ్లు,

వేపుడుగూరలు, తాళదాలు, పిండిమిరియాలు, పు
గూరలు, పప్పు, పాయసం, కజ్జాయాలు మొదలై
పదార్థాలకల్లా సోపస్కారాలు అమరిఉంచా ?

స్వయంపాకులమాట : అయ్యా ! అంతా అమరిఉంది.

వ. అని మరియు నేమనుచున్నాడు.

పదము॥ శంకరాభరణము॥ ఆది॥

వచ్చినారు విప్రులు వచ్చినారు – సత్రానకు
వచ్చినారు విప్రులు వచ్చినారు ॥వ॥
అంగవంగకళింగ మహారాష్ట్ర –
బంగాళకాశ్మీరపాండ్యభూములనుండి ॥౧॥
కాశీకురుక్షేత్ర – కాంభోజపాంచాల ।
దేశాలనుండి – తీరని కరువుచేత ॥౨॥
బదరికేదార ప్ర – భాసనైమిశములు
మొదలైన పుణ్యస్థల – ములనుండి యిప్పుడు ॥౩॥

వ. అనిన విని స్వయంపాకులు ఏమనుచున్నారు.

స్వయంపాకులమాట:–ఓయయ్యా, రాజగోపాలస్వామి కృపవల్ల
తదీయారాధన మమరియున్నది. దొమ్మిగాకుండా
విడువుడయ్యా.

వా. అప్పుడు పప్పులిప్పాభట్లు మొదలైన కోటివిప్రులు
వచ్చిరట యెటువలెను.

దరువు॥ రేవగుప్తి॥ ఆది॥

గుప్పిగంతులు వైచుచు - గునిసియాడుచు
పప్పుతిప్పాభట్లు వచ్చె - పప్పి పప్పుఅనుచు ॥౧॥
వంపులు ముంపులు కుం - డేడు కడివెండు
పప్పి పప్పి అనుచు ॥౨॥

వా. వచ్చి యాపప్పుతిప్పాభట్లు మంచిగానింజూచి యేమను చున్నాఁడు.

తిప్పాభట్లుమాట:- ఆదెవత్తా! మంచిగా!

మంచిగాఁడు:- ఓపలేనే!

తిప్పాభట్లు:- ఏమిరా పిలువకమునుపే ఓపలేనవేవు!

మంచిగాఁడు:- పనిలేక పిలుతువఁటె!

తిప్పాభట్లు:- కాదురా! మంచిగా!

మంచిగాఁడు:- ఏమే అన్నగారు!

తిప్పా:- అదెవరే సోది!

సోది:-ఏమే అన్నగారు!

తిప్పా:- మీఅమ్మ వచ్చెనటవె! మీపిన్నివచ్చెనషవె? పిన్న భిక్షాలుగాఁడు పెద్దభిక్షాలుగాఁడు వచ్చిరషవె?

సోది:- అన్నగారు, అందరున్ను వచ్చినారు.

తిప్పా:- ఈఊళ్లరిసత్రిమధికారి మహాధర్మాత్ముఁడష! ఆకొన్న వారిముఖం చూడఁడష! వార్ని ఆశీర్వాదముచేసి వత్తాముర౦డండోయి!

మంచి:- అన్నగారూ! ఆకొన్నవారి ముఖం చూడడంటికే! కొట్టితరుమునో!

వా. అనుచు సత్రిమధికారి వద్దకు వచ్చి పప్పుతిప్పాభట్లు ఏమని ఆశీర్వాదము చేస్తున్నాఁడు.

తిప్పాభట్లు ఆశీర్వాదంచేసేది:- మంగళాని భవంతు.

అధికారి:- నమస్కారమయ్యా.

తిప్పా:- హరిః ఓం. కోశందక్షిణః పక్షః కుప్పఉత్తరః పక్షః, నులుపెశాంతం తూర్పెత్తశ్లోకో భవతి,గంపం నింపయతి.

అధికారి:- పప్పుతిప్పాభట్లు! ఇది ఏ వేదమయ్యా?

తిప్పా:- యెల్లమరాజుగారు! అయిదో వేదమయ్యా.

అధి:- తిప్పాభట్లుగారు! లోకమందు నాలుగు వేదాలుకద్దు అయిదో వేదమెక్కడనుండి వచ్చెనయ్యా? ఆ అయిదో వేదములో ఇది ఏఅట్టమయ్యా?

తిప్పా:- ఇదా! ఎనిమిది అట్టాలకు అవతలి అట్టమయ్యా!

అధి:- భళాభళా! మంచిబ్రాహ్మడవయ్యా! అవును తిప్పాభట్లు గారూ! పంచాంగమేమైనా చెప్పనేర్తురా? ప్రశ్నఫల భాగాలు చెప్పుదురా?

తిప్పా:- ఓహోహో! మహాచెప్పుదుమే.

అధి:- నేటి దినశుద్ధి చెప్పండి.

తిప్పా:- ఓహోహో ! మహాచెప్పేమే తదనం సంవత్సరం తాటేటుమాసం అరవక్త్రెట్టిందేది పంచమీశుక్రివారం పంచమీ నూటడెబ్బై రెండున్నరాబరక. మరిన్ని మంచిగా ఈఅక్షరమేందిరా తెలియలేదు.

మంచి:- అన్నగారూ ఈఅక్షరం 'బా' గాదమవే!

తిప్పా:- ఓరీ ఆగుడిసేదిరా!

మంచి:- అదా, చాకుగుల్లో దీర్ఘమిస్తే చీ

తిప్పా:- నీవంటికొడుకు కలిగినందుకు తండ్రిని 'చీ'అనక మరేవతి ననేప ! ఓరి, అదిగాదురా! 'పా' వలె ఉందిరా.

మంచి:- అన్నగారూ! ఆఅక్షరం 'పా' అవునే.

తిప్పా:- ఓరి! ఆగుడుసేదిరా ?

మంచి:- అన్నగారూ! పాకు గుల్లో దీర్ఘమిస్తే 'పీ'.

తిప్పా:- ఓరిమంచిగా! చిఱ్ఱ్యా పిఱ్ఱ్యా పేడదేరా శుద్ధిచేసి చూతాం.

(మరిన్ని తిప్పాభట్లు పంచాంగం చెప్పేది)

పంచమీ శుక్రివారం పంచమి నూటడెబ్బై రెండున్నరా బరక. మూలానక్షత్రం నూటెనభైతొంభై రెండున్నరా బరక. పోగా ఉపరిపూర్వాషాఢ పడమటింటి వీరాంభట్ల కొడుక్కు అతిగండనామయోగం ఆతనికే చతుష్పాత్కరణం నన్నారు. రాత్రి త్యాజ్యం పదహారు ఘడియలమీదను.

అధికారి అడిగేది:-పప్పుతిప్పాభట్లుగారూ! ఒకప్రశ్న చెప్పండి.

తిప్పా: ఓహోహో ! మావుహాచెప్పేమే. ఉపయాగూఢ ఛత్రాలు చూచిచెప్పేము. ఉదయం తూర్పునను, ఛత్రం రాజుదగ్గరను, ఆనూషంమేషం, అశ్వని భరణి కృత్తికాః పాదంమేషం. భరణి పెట్టెలోను, మేషం మేకలమందలోను, వృషభంఆవులమందలోను,మిథునం స్త్రీపురుషులుగూడినచోటను, కర్కాటకం బొక్క లోను, సింహం అడవిలోను, కన్య పుట్టింటను, తుల సెట్టివానియింట్లోను, వృశ్చికం పిడకలపచ్చెలోను, ధనుస్సు పట్టినవానిచేతను, మకరం సముద్రంలోను, కుంభం కుమ్మరివానియింట్లోను, మీనం చెరువులోను, పండ్రెండు రాసులున్ను యెక్కడికక్కడనే ఉండేది.

అధికారి: ఓయి తిప్పాభట్లు! పొంతనాలుచెప్పనోయి.

తిప్పా: చెప్పేము మీపేరేమి?

అధికారి: మాపేరు యెల్లమరాజోయి.

తిప్పా: ఎల్లమరాజా? ఆ ఈ ఊ ఏ కృత్తిక. కృత్తికాస్త్రయోః పాదం రోహిణి. రోహిణి మృగశిరార్ధం వృషభం కార్తి 'హాయాడుమైలత్తి' అని పుర్వముపయాంను చెప్పినాడుగనుక, మీరు వృషభం, మీకు వాహనం శునకం.

అధికారి: కొట్టు కొట్టు పప్పుతిన్నే బ్రాహ్మడా, పొంతనాలుచెప్పు మంటే యేమేమిచెప్పుచున్నావోయి.

త్రిప్పా: పొంతనాలుచెప్పేమయ్యా.

శ్లో. నాపేరజ్జుః కన్యకా కంఠసూత్రం, అన్నాఁడు గనుక నాడి వైద్యునికి తెల్సును. రజ్జు నిమిత కాంద్ర చేతఉండును. స్త్రీదీర్ఘం అడగనేపనిలేదు. పదహారుపొంతనాలున్ను ఆలాగునేడున్నది.

వా. అనిన సత్రమధికారి యేమనుచున్నాఁడు.

అధి: ఓయి త్రిప్పాభట్లు! మీరు ఎవ్వారెవ్వారు వస్తిరోయి?

త్రిప్పా: మేము, పుల్లగూర యెల్లంభట్లు. పుల్లాకుల మల్లుభట్లు, పెనుగొండ కొండుభట్లు, కుంటి సర్వాభట్లు, గుడ్డితిరుమలభట్లు, చెవుడు సింగరిభట్లు. తల్లంభట్లు, సత్యమంగలం నాణ్ణంపు, సుత్తిమల్లి అంబిరాయిశాస్త్రి, కొపాలంగుడి అప్పంవాధ్యారి, కష్టనూరి ఆచాంబిళ్ళై, మాతెల్లుభట్లు, మా పెదభిక్షాలుగాడు, పినభిక్షాలుగాడు, మంచిగాడు, మాయింటిఆడువారు, వీరు మొదలైన సారం వస్తిమయ్యా.

ప్రతీహారి: మహామేలయ్యా; ఎండసక, వానసక, మంచసక, మూలసక, మహావస్తిరయ్యా, సత్రంవేళయితే విడి, పేముగాని అటుఁగూర్చుండుండ.

వా. ఆసమయంబున సత్రమధికారి చెంతకు త్యాగానకు రాగభోగాలవారు వచ్చిరట యెటువలెను.

ద్వి. అంతట నావేళనాయధికారి
చెంతకు నొకయింతిచెంగల్వబంతి
మగువలమేల్బంతి మారునిదంతి
సొగసుకత్తె మిటారిసొంపులనెలవు
ఆటలపాటల నారంభపాటి
బోఁటి, యూర్వశిపాటి పోణిమిగలది
తనవగ వారకాంతలఁగూడివచ్చి
యనువుగాశ్రుతిగూర్చి యధికారిపజ్జ
రాగముల్ పదములు రహిమీరఁబాడి
చాగముల్ గైకొన సరగునవచ్చె.

ద॥ ముఖారి॥ ఆటతాళము॥

వాలుఁగొప్పునుబెట్టి – పూలసరులనుజుట్టి
జాలువాసాలువ – మేలిముసుఁగుఁబూని ।
నీలాలకలు తన్ను – నెమ్మిగ్రొల్వఁగసాని
వాలుఁగంటియొకతె – వడిగఁ దావచ్చె॥

వా. ఆవేళ తాటోటుసటల తుటారి వచ్చెనట యెటువలెను.

ద. మిట్టపండ్లు మెట్టకండ్లు , సొట్టమూతి యాడించుక
మిట్టిపడుచు మిండల – మిత్తి వచ్చెనపుడు ॥౧॥
నే గదా మేలు నెలత లిందరిలోన
బాగుగా సొట్టపాద మొక్కటెగాని। ॥౨॥

నేగదా మేలు నెలతలందరిలోన -
బాగుగా మిట్టిపండ్లు ఒక్కటెగాని ॥3॥

వా. వచ్చి యీసానిమచ్చెకంటులు సత్రిమధికారికి సల్లా
ములుచేసిన, వారలఁజూచి సత్రిమధికారి యేమనుచున్నాడు.

(భోగాలవారు సలాముచేసేది) సలాము సలామయా.
(హాస్యం) తెండన్ తెండన్

అధి : ఎవ్వరో మీారు ఏడనుండివచ్చినారో ?

వా. అనిన నానవనజగంధులు ఏమనుచున్నారు.

భోగాలవారు : అయ్యా, తంజావూరి సత్రిమధికారి నెల్లూరి
యెల్లమరాజు దొడ్డ యీావికలవాడనివిని మాసీమనుండి
వస్తిమిమేము విద్యావతులము. మిమ్ము ఆటపాటలచేత
మెప్పించి నీచేత త్యాగమందవచ్చినారము.

అధికారి : మంచిదే భాగ్యమాయెను. మాయేలినవారి పాదా
లకు అంకితమైన పదములలో ఒకపదం అభినయం
పట్టుండ మీాకు సకల బహుమానాలున్ను చేసేము.

వా. అనిన విని కనకాంగిముదమంకురింప పదకేళిక వినిపించె-
నట యెటువలెను.

పదము॥ ఘంటారవము॥ ఆది॥

పంతమేలరారా - వింతదానగారా
రంతుసేయమేరా విజయ - రాఘువ, మొక్కేర ॥౧॥

దక్కితి దయసనీర నే - సొక్కితి విడెమీర నీ
పక్కబాయలేరా నన్ను - బాళినిచేకోర ॥౨॥

నిన్నేమదినికోరి - యున్నారా ఓరోరి।
కన్నులవిల్తునిబారి- ఘనమాయెనీసారి ॥౩॥

సరా నన్నుచాల -నేలరా యీవేళ, రతుల
రారాపునేయమేరా విజయ - రాఘవ భూపాల ॥౪॥

వా. ఆసమయంబున పస్పుతిప్పాభట్లు ఏమనుచున్నాడు.

తిప్పాభట్లు : ఓయి యెల్లమరాజ ! ధంధంయేంది ? ఘుం ఘుం యేంది ? అర్భాటమేంది ? శద్దాలేంది ? అదేంటోయి ?

అధికారి : భోగాలవారు మూవస్తుకు త్యాగాలకు వచ్చినారయా

తిప్పా : భోగాలనారనగా ఆడవారేనా ? అంతాఆడవారో, కొంతఆడవారో ?

అధికారి : భళానోయి తిప్పాభట్లు ! ఎంతరసికుడవోయి !

తిప్పా : ఘుంఘుం అని ఆడేవారు లంజమ్మగారా ?

అధి : లంజమ్మగారనగా నేంటోయి ? లంజను అమ్మగారందురోయి ?

తిప్పా : ఓహోహో ! మహాఅందురె.మారకమ్మ, పోలకమ్మ, నూకలమ్మ, పుట్టలమ్మ, ఎక్కలమ్మ, లంజమ్మ, అని యిన్ని అమ్మగాళ్లుకద్దు. మీకు తెలుసునా! భోగాలవారనగా నేమిసేతురోయి ?

అధి :- భోగాలవారు పైకిదీసేవారు.

తిప్పా :- పైకితీసేవారేకాని పెండితీసేవారులేరా ?

అధి :- నిద్రకు పైకిదీసేవారోయి.

తిప్పా :- నిద్రకుపైకితీస్తే మేలుకుంటే పెండితీతురే.

వా. ఆసమయంబున భోగాలవారు సప్పాతిప్పాభట్లనుజూచి మొక్కుచున్నారు.

(భోగాలవారు సప్పాతిప్పాభట్లతో చెప్పేది)

అవురా సప్పాతిప్పాభట్లరాయ, అగ్నిహోత్రచింతామణి, వేదమూర్తి, వేదనారాయణ, మాకు త్యాగమిప్పించవయ్యా.

తిప్పా :- త్యాగమా ! సడమటింటి వీరంభట్లు కొడుక్కు ప్రాణత్యాగమే. మంచిదే. త్యాగము ఇచ్చేముగాని ఒకపదం పాడండిమాతాం.

ద॥ ఘంటారవము॥ ఆది॥

చెనకివానితో నామోడి - చేసుకొమ్మనేరు
చనవులేనిచోట నింటి - చనపెట్లుఈడేరు ।
వనజాక్షి దానికోసమై - దినదినముపోరు
కనివినియుండి మీరైనా - కాదనంగాలేరు ॥౧॥

తిప్పా :- ఓరిమంచిగా ! ఈలంజమ్మగారిచేత ఉండేది అబక పరా ?

మంచి :- కాదే అదితెల్లె.

తిప్పా :- ఓరి తెగ్డ్తే తబకకాదషరా? ఓరి అదిగాదురా అందులో నుండి మేమే అనేదియేందిరా.

మంచి :-అన్నగారూ ! అందులోనుండి పిల్లి మేమే అంచుండే.

తిప్పా :-ఓరి, అపనరా.

వెంగసాని :- రంగసాని, పలుకసాని ముద్దు, ఈతిప్పాభట్లు మంచి రసికుని కొడుకుగాడు. వీనివద్దవచ్చి వినిపిస్తినే మనకు త్యాగంవచ్చినట్టే. మనసీమకు మనంపోదాంరారే.

రంగ :-వెంగసాని, మనంవీని......శియెరంగక వచ్చినందుకు వానికి తగ్గపాటలుపాడి యిచ్చింది రాబట్టుకొని పోవ లెనో ఊరికేపోదురో (తిరిగిన్ని దర్వు వినిపించేది)

ద. చెనకి వానితోగూడి...

వెంగసాని :-తిప్పాభట్లు, నీవు తంబురచూచి అబకకాదా అన్న ప్పుడె నీరసికత తెలిసె. చాలని కొదవక(?) తలాడించవలె తలాడించేది యిక చెయ్యింగదలించవలె.

హాస్యం—కూతురా, తిప్పాభట్లుకు వాయువేతీరేది.

తిప్పా :-ఓహోహో ! నీలి, చలమేంది? పులమేంది? పోరేంవి? గీరేంది ? ఇది నామనసురాదు. ఊహూ.

భోగాలవారు :-అయితే మీామనసువచ్చే పదమేమయ్యా.

తిప్పా :-అయితే చెప్పేం వినుండ.

ద. పట్టెవర్ధనముపెట్టి – పట్టెండక్షింతలుపెట్టి
దిట్టతనమున పప్పు – తిప్పాభట్టు రారా ॥౧॥

అంచున్నమీరు యిషువలె పాడితే మీకుధోవతి యిచ్చేను.

భోగాలవారు:- తిప్పాభట్లుగారూ! మీరు ఇన్నిచుట్లు పెట్టు చున్నారు. మాచేత ఇన్నిచుట్లుకాదయా.

తిప్పా :- అయితే మీకు ధోవతియిచ్చేదిలేదు.

భోగా:- అయితే పదం వినిపించేమయా.

ద. పట్టెవర్ధనము.

వా. అనిన తిప్పాభట్లు మరియు నేమనుచున్నాడు.

తిప్పా:- ఇషువలె పాడుచున్న నట్టువంవేసుకుని పెద్దతాళం యెత్తుకొని చేతులుతిప్పుకొంచున్న గుడ్లుబిరబిర తిప్పుకొంచున్న అభినయంచేసికొని కాలుకదలింపు కొంచున్న ఆడుండ.

హాస్యకాడు అనేది:- పెద్దరోలు మెడకట్టుకొని మీరు ఆడుండ.

భోగా:- ఈలాగు మీరు ఆడిచూపుండ.

తిప్పాభట్లు ఆట విన్పించేది.

ద. పట్టెవర్ధనము పెట్టి - పట్టెండక్షింతలు పెట్టి
దిట్టతనమున పప్పు - తిప్పాభట్టు రారా॥

త్రయ్యక త్రయ్య. త్రయ్యక త్రయ్య. త్రయ్యత్రయ్య. తైతైతై తకతై. తకతై. తైయక తైయక. తైయక తైతైతై. ఇషు వలె మీరు ఆడుండ.

భోగాలవారు:- ఆడేమయ్యా.

(ఆతీరున్నే బోగాలవారున్నూ ఆడేది)

ద. పట్టెవర్ధనముపెట్టి పట్టెండక్షింతలు పెట్టి

ఇషువలె బోగాలవారు విన్పించగా తిప్పాభట్లు చెప్పేది:- అషు వలె గాదమ్మ లంర్షమ్మ ఇషువలె కోపులు పట్టండు.

బోగా:- తిరుగ విన్పించేది.

ద. పట్టెవర్ధనము పెట్టి (కోపులు పట్టేది)

తిప్పా:- అషువలె గాదేలంర్షమ్మ. ఇషువలె మండలంపట్టుండు.

హాస్య:- కూతురా, యిషువలె మండలంపట్టి ఆడవే.

(బోగాలవారు మండలంపట్టేది. తల్లుభట్లు తిప్పాభట్లుతో చెప్పేది)

ఏమయ్యా! పప్పుతిప్పాభట్లుగారూ! వంగిసంగిచూచే దేంది? శివమాడేటట్లు తలకాయ ఊచేదేంది! ఇదేమీాలెస్స ఉండలేదే.

(తిప్పాభట్లు తల్లుభట్లుతో చెప్పేది)

ఓరి తల్లుభట్లుగా! ఉత్తరాది వెంగసాన్ని జక్కులరంగ సాన్ని చూస్తే ఒడలు యెమషో పోచున్నదిరా.

హాస్యకాండు:-వడలు ఎమెషోపోతే అప్పాలు యిషపేవచ్చును.

తిప్పా:- ఓరి, అదిగాదురా! మరిన్నిపట్టే వస్సున్నదిరా.

తల్లుభట్లు:- అదేమయో! తిప్పాభట్లుగారూ! పైత్యమా మీాకు పట్టివచ్చేది.

హాస్య:- పైత్యం బట్టివస్తే నాచేతదుస్తుగోల ఉన్నదే. నడ్డివిరుగ వడ్డింతును.

తిప్పా:- అదిగాదురా! యెత్తుక యెత్తుక వస్తుందిరా.

తల్లుభట్లు:- అదేమయ్యా తిప్పాభట్లు! పేగులా యెత్తుకవచ్చేది.

హాస్య:- ఎత్తుకవచ్చేది నెత్తిమీద గంపా.

తిప్పా:- ఓరి, అదిగాదురా! వస్తుందిరా, వస్తుందిరా!

తల్లుభట్లు:- అదేమయ్యా! పడమటింటి వీరంభట్లుకొడుక్కి-
చేటువచ్చేది.

తిప్పా:- అది అవునేకదా. మరివస్తుందిరా వస్తుందిరా.

తల్లు:- అదేందోయి తిప్పాభట్లు! లంఝమ్మగారి తల్లిచేతిదుడ్డు
గట్టిచూస్తే అల్పాచమనమా వచ్చేది.

తిప్పా:- ఓరి, పట్టుపట్రి.

తల్లు:- అదేమయ్యా తిప్పాభట్లు! నగరగోదానమాపట్టేది?

హాస్య: ఓరి నన్నుగూడా పట్రా. కాలువిరగబడుచున్నాను.

తిప్పా:- ఓరి గిరగిర తిరుగుచుందిరా. ఉత్తరాది వెంగసాన్ని
జక్కులరంగసాన్ని పటకసాని ముద్దునుంజూస్తే జంగాల
బిళ్లవలె తిరుగుచుందిరా.

తల్లు:- అదేమయ్యా బొంగరమా తిరిగేది!

తిప్పా:- ఓరి, అదిగాదురా. లంజమ్మగారినిచూస్తే మోహా
మెత్తుక వస్తుందిరా.

వా. అనితిప్పాభట్లు సానికూతునింజూచి యేమనుచున్నాడు.

(తిప్పాభట్లు రాగానచదివేపద్యం)

శంకరాభరణ — ఆటతాళం

కూస్సున్నన్నవి కోకిలంబులవిగో కోలాహల(ప్రక్రియన్
వేస్సున్నాడు మనోభవుండషిషుగా వేమారునీవున్ననున్
చూస్సుందానవు నీకుధర్మమషవే శుద్ధాత్ముడన్ బ్రా
హ్మణున్
తెస్సున్నానిదెగూర్త మొక్కటిరతిం దేలింపవేలంఝమా

హాస్యకాడు:— ఒకగూర్తమా తెచ్చేది? నూరుమాళ్ళు తెస్తే తెస్తివి, లేకుంటే నష్టివిసుస్తున్నాను.

వెంగసానిమాట:— నిన్నురతిం దేలించేది మీాయింటి యాపె.

వా. అనిన మరియు నేమనివనరుచున్నాడు.

ద. ప్రక్కకు రాగదవేనాదర్భ-పవిత్రిమిచ్చెదనే।
మొక్కెను నీపాదములకు నేను ఓ—మోహానాంగిరావె॥

వెంగ :—తిప్పాభట్లు నీవు బ్రాహ్మణుడవు. లంఝలకు మొక్కుదురా! మాకేల దోసంకట్టేవయ్యా?

హాస్యకాడు:— వారు అట్టేఉండనీ నాకాళ్ళకు మొక్కేవు బ్రతికేవుగాని.

వెంగసాని:— తిప్పాభట్లుగారు! నెమరు పెట్టేదేందయ్యా?

తిప్పా:— అదా, గానుగపిండి నమలుచున్నాడ.

వెంగ:— తిప్పాభట్లు! గానుగపిండి నమలకుంటే ఒక విడెంవేసుకోరాదూ.

తిప్పాభట్లు:- వెంగసాని వీద్యం వేసుకుంటేను మరిన్ని కెల్లించి నవ్వండును.

హాస్య:- జలదారా కెల్లించేది ?

తిప్పా:- అదా గానుగపిండికి తలగిరగిర తిప్పుకవచ్చును.

వెంగసాని:- తిప్పాభట్లు, మీాకు యించుక పైత్యశరీరమో ! తలగిరగిర తిప్పుక వస్తుందంచున్నారు.

తిప్పా:- వెంగసాని అషువ లెగాకుంటే మాయింటియాపె నన్ను తన్ని యేల ఛీ అనును.

తిప్పాభట్లు, పెండ్లాం యెల్లిమ్మమాట:-అవునోషూ మిా బతుక్కు నేతన్నేదిన్ని మీాలంఝులతో చెప్పవలె.

వెంగసాని:- తిప్పాభట్లు! నీవలపషుండనీ, నిన్ను జూస్తే నాకు పేగులెత్తుక 'వచ్చుందే.

ద॥ మంచిగానిశోడే నేటి - పంచాంగ మిచ్చెదనే।
వంచనసేయకలంఝుమగారొక - పారి అషనరాడషే॥

వెంగసాని:- తిప్పాభట్లుగారూ! అషనగానేందయూ!

తిప్పా:- వెంగసాని, అషనంగా అషంటకాదషో.

వెంగ:- సన్నషనేది! మీాయింటి ఆపెనే అషందువు.

హాస్యకాడు:- వారినీ అషనవద్దు; మీాయింటి ఆపెనూ అషన వద్దు. నన్నషనుమా బ్రతికేవుగాని. అయ్యో వయసా, అయిదుమాళ్లు దిశేదినాలు పోయంగా (?) వారివెంట పడేది నావెంట పడరాదు.

తెల్లుభట్లు:- ఎందుకో హాస్యకాఁడు, వారింట్లో చెంబెత్తుకః పోతినంటే.

వెంగసాని:- రంగసాని, యీ తిప్పాభట్లు నావెంటనే పడు చున్నాడు నీ వెంటనే పడరాదు.

రంగసానిమాట:- నీమీాద అతనికి వలపుకాగా నీ వెంటపడు చున్నాడు.

వెంగసాని:- వానివలపు అట్లుండనీ వాన్నిజూస్తే నాకు వేగఁ లెత్తుకవస్తుందే. తిప్పాభట్లు, మాకు ప్రిదక్షిణంచేసేది

కోవెలకు ప్రిదక్షిణం చేయరాదు.

తిప్పాభట్లు:- మాపాలింటికి కోవెల, దేవుండు అంతానీవే.

వా. అనిన ఉత్తరాది వెంగసాని పప్పుతిప్పాభట్లును జూచి మరియు నేమనుచున్నది.

వెంగసాని:- ఏమయ్యా పప్పుతిప్పాభట్లుగారూ, మీాదు పెద్దలుు ఇట్లు మాట్లాడుదురా.

తిప్పాభట్లు చదివేపద్యం:

ఏషాగాధము లేలే
భాషింపవదేమి మిట్టిపడెదవదేలే
కాషాయవస్త్రమిచ్చెద
రోషంబులు మాను మేము రుగ్వేదులమే.

హాస్యకాడు:- దానికిచ్చే కాషాయివస్త్రం నాకుఇమ్ము. కొత్తైను సానివలె చుట్టుకొనేగాని.

వా. అనిన పప్పుతిప్పాభట్లు మరియు నేమనుచున్నాడు.

ద. మంచిమాటలాడవే నాజందేలు-తెంచుకుందునవే।
కంచిగరుడసేవ సేవించుఫలమెల్ల-కలికిధారబోసెనే।

హాస్యకాఁడు:- నీవు గడ్డము తెంచుకుంటే నేదుడ్డుగోల విఱిచి వేతును.

నెంగసాని:- తిప్పాభట్లూ, నాకు ధారబోసేది మీయింటిదానికి ధారబోయి.

వా. ఆసమయంబున కావాలంగుడి అప్పంవాధ్యారి, నాజ్జిండు అంబిరాయండు మొదలైనవారితో వచ్చెనట యెటువలెను.

ద. తప్పుగంతులవేయుచు - తలతలే యూచుచు
అప్పంవాధ్యారివచ్చె - అందరు చూడ॥

వా. ఆవేళ పప్పుతిప్పాభట్లు అప్పంవాత్యారినిజూచి యేమను చున్నాడు.

తిప్పాభట్లు:- అప్పంవాత్యారి యింగేయిరుం.

అప్పంవాత్యారిమాట:- యెదుబిళెనాంజిన్, తిప్పాభట్టనింగే యిరుక్క-చోలాగిన్. యిదుపరిశుద్ధమానస్థలమో.

నాంజినిమాట:- ఆప్పంవాత్యారె, యిదుపరిశుద్ధమానస్థలమా.

అప్పంవాత్యారిమాట:- అదెప్పాడి భిళెనాజ్జన్.

నాంజినిమాట:- యిదిప్పమహాజనమాణిక్యత్తాళ్ ప్రసరిచ్చేడం

అప్పంవాత్యారిమాట:- భళాభళా యిన్నెక్కో-న్నో మనశ్శుద్ధి యాచ్చి.

అంబిరాయనిమాట:- అప్పంవాత్యారె, నెవ శంకుశిచ్చిరో. మలశుద్ధి యాఘురుముక్కు.

అప్పంవాత్యారిమాట: అడ అప్పిడి యల్లబిళాయి. మనశ్శుద్ధి యాచ్చి యంగిరేన్. అప్పిడియన్నో లింగపురాణత్తిలే శొల్లి యిరుక్కురుదు.

వేశ్యాయాదర్శనం పుణ్యం స్పర్శనంపాపనాశనం
శయనేసర్వతీర్థాని సురతంమోక్షసాధనం॥

ఎన్నుసొన్నాప్పాలె, అద్యామేసఫలంజన్మ యన్నాప్పాలె, యింగెధానె సకలతీర్థంగళుం యిరుక్కురదు, ఘట్టియా హాయిరుక్కురుధానె యిరుం.

అప్పంవాత్యారిమాట: అదెండా తెలుంగా పప్పుతిప్పాభట్టితనిక్క శరి పార్కురాయో.

తిప్పాభట్లుమాట: వుమ్మాల్లె కుట్టినాప్పాలె పార్కులేన్.

అప్పంవాత్యారిమాట: వునక్కొండా యిత్తినెరశావళి. అహా వారుమ్మిణె మహాజనమాణిక్యత్తాల్.

బోగంది: యేనయ్యా అప్పంవాత్యారయ్యనే, యెత్తినపొట్టు అలక్కురీర్.

అప్పంవాత్యారిమాట: నిదానో మహాజన మాణిక్యత్తాళావదు.

బోగంది: ఆమయ్యా.

అప్పన్వాత్యారిమాట: అహా మహాజనమాణిక్యమెయివళేర్

మహాజనమాణిక్యంమాట: వాత్యారయ్యా, పెర్నాట్టు మాణిక్యత్తాళరి యీరో. వుమక్కుం అవళుక్కుం యిబ్బడి యాపోచ్చా. యివళ్ శామత్యం యిట్టబోదు. కన్నియ శిచ్చి మూళువష్టం అవళీశూత్తుం బారహోతిరింజిర్. మరందిరో.

పెర్నాట్టుమాణిక్యంమాట: అయ్యానుక్కకం దెరియిమో. అంగెయిల్లోనాట్లం, అవళ్ అళక్కిరాళ్ వుమ్మొత్తై డ్రాళీపాం.

అప్పన్ వాత్యారిమాట: ఓహోహో. తెర్నాట్టుమాణిక్యమో, నన్నో యిరుక్కిరాయో!

పెర్నాట్టు మాణిక్యంమాట: అయ్యానుక్క యిప్పర్దాకం దెరింజెదె. వుంగుళాయి వుమ్మొత్తడ్రాళ్ విట్టుక్కానాల్ తెడికొక్కండుఫాలాం. అడపోడా వరడా.

అప్పంవాత్యారిమాట: అడఅడా అంబిరాయ పెర్నాట్టుమాణిక్యత్తాళ్ పాదతాడనం పణ్ణినాల్ ధన్యోస్మి.

వా. అని మరియు కావాలంగుడి అప్పంవాత్యారి మహాజనమాణిక్యమునుం జూచి యేమనుచున్నాడు.

అప్పన్ వాత్యారిమాట: పళపళా మహాజనమాణిక్యమో మహాగస్సియా యిరుక్కరాయిమ్మిణి నటనం చిణ్ణువాయో, అందఅగ్రహారత్తిలె చవ్వప్పనాయకన్ కయిలెఅస్మనోడపితామహాన్ అరెఅరక్కాల్ భాగం పరిగ్రహం

పణ్ణియిరుక్కయిలె. అరకాల్ భాగకారన్ పప్పా తిప్పాభట్ట నండెనటనం బ్రణబెన్న. పోనవష్టం అంద శెత్తికారర్ విఘ్నంబణ్ణ యిలెనామెన్నో అర నెలం మెరయిల్ విడివిచ్చాం అరియారెయి.

మహాజనమాణిక్యం మాట: అయ్యా అర నెలం విడివిచ్చేదు అరి వెనయ్యా. అయ్యా వాత్యారయ్యనె యింగెవారు మయ్యా. యింగెవారుం బిళ్లె మాప్పిళ్ళె. అయ్యావాడా శెళవి యళక్కిరాటి యన్నాణెవా. వుంగురాయి యాణెవా. అః అః తన్నిఛిపోడా.

అప్పన్ వాత్యారిమాట: అడ అంబిరాయ మహాజనమాణిక్యత్తాళ్ కటీషిచ్చాల్ యిన్నెకొన్నొ దేహపవిత్ర మాచ్చిదు.

వా. అని నాల్గుదిక్కులున్న చూచి మరియు నేమనుచున్నది.

మహాజనమాణిక్యంమాట: అయ్యా అప్పన్ వాత్యారయ్యనే తెవరిమార్ లచ్చికపోరి యాయిరుక్కయిలెయిం గుం మంగుం పోయినామెన్రాడోం. శిత్తంవరకెచ్చికురాం.

అప్పన్ వాత్యారి మాట: అడనాంజన్. మాణిక్యత్తాళుక్కు మున్నెదు చిన్నెదు. ముదువుంపూరుం యల్లాంఅఖండ మాయిరుక్కురుదు.

హాస్యకాడు: అప్పన్ వాత్యారయ్యనే, యమ్ముదు వెప్పారుం, చందనక్కల్లుపోలె యిరుక్కురుదు.

నాజ్జనిమాట: అప్పన్ వాత్యారె, మహజన మాణిక్యత్తాళ్ తొప్పంకొండుప్పోడుండాళ్. ఆనాలుమ్మోవు మకుక్క శత్తై సత్యారివుండో. అస్మన్ కష్టైలెప్పారుం, అవళ్ మెత్త సుఖక్కారి యాయిరుక్కురాళ్.

అప్పన్ వాత్యారిమాట: ఆనాల్ వారుమ్మిణె. నటియిమ్మిణె, నమ్ముడమెలెవోరు శిందుపాడి నటియిమ్మిణె.

ద॥ తుప్పడిశెలింపల్ కొండుతొలయా విరహంతన్నాల్

అప్పంవాత్యారయ్యం వందారన్నమె పారడి॥

హాస్యకాడు: అప్పంవాత్యారె అవళె యెన్నెకు నింజకు నింజ పార్కురాయి. యెన్నెప్పారుం.

అప్పన్ వాత్యారిమాట :-

అడఅంబిరాయ మహజనమాణిక్యత్తాళ్ నమ్ముడయ తొప్పదుప్పటిక్కి వళియిట్టెళ్.యిందత్తుప్పటి అస్మనొడకొడ్డా ట్టన్. కృష్ణరాయంగెలె వస్త్రదానం ప్రతిగ్రహం పణ్ణినదు.

"అయం పటీ మే పితురంకభూషణం ।
పితామహాద్యైరుపయుక్తయౌవనం"

యెన్నాప్పాలె యెప్పిడి భిళాపాత్తు పాత్తుక్కుడుక్కురుదు.

అంబిరాయనిమాట :-

అప్పంవాత్యారె.అదుకొన్నానొరు వుపాయంచొల్లెన్. పాక్కువెత్తలె పాడుం.

అప్పంవాత్యారిమాట :-

కారుమ్మిగెౌ మహాజనమాణిక్యత్తాల్. పిడియిమ్మిగెౌ. పాక్కువెత్త లెపిడి. యింగెపిడి. అంగెపిడి.

హాస్యకాడు:- మహాజన మాణిక్యత్తాళుక్కు ప్పాడ్రిపాక్కు వెత్తిలె యిరుక్కట్టుం. మహాజనమాణిక్యత్తాళవళాయి యెనక్కు ప్పాడుం ప్పాక్కువెత్తలె. అప్పంవాత్యారె యిందప్పుళుత్తప్పాక్కు యెందసందయిలె పోరిక్కిక్కొండు వందిర్.

అప్పన్‌వాత్యారిమాట :-

తాయిక్కేళ విక్కియెత్తినె కుడుత్తాలుంనన్నివుంశో.

వా. ఈతీరున వినోదిచేటికియ్యంగా వినోది అప్పంవాత్యారిని ఏమని పొగడుచున్నాడు.

వినోదిమాట :-

ఓహోహోపోరుం పోరుమయ్యా ఘోరుంబిళె. అప్పాపోరుం. అడఅప్పచ్చిపోరుం సద్దు. ఆండవన్‌సభయు.యిప్పిడి యల్లా యిరుక్కవేణుం. ఆండవన్ ప్రితాపత్తినాలెయిన్నెం అప్పంవాత్యారయ్యన్ అప్పన్‌వాత్యారయ్యన్ గోత్రిం.

బోగాలవాడు :-

యేనయ్య అప్పంవాత్యారయ్యనె! వుంగళాయి కయిలె కూత్తుప్పాత్తు ప్పాక్కువెత్తిలె యోడెశెలవిట్టిర్. పోఘాదొవ్వు మ్ముడచ్చందం.

అప్పంవాత్యారిమాట :-

అడఅంబిరాయ కూత్తుప్పాత్తధుం విల్లంగమావందు విళుందథా యిదుక్కు-ప్పాం గెదుభిళాయ్.

అంబిరాయనిమాట :-

వాత్యారె ముందిక్కూత్తుప్పాత్తానె. అంద తెలంగన్. పప్పుతిప్పాభట్లన్ అవన్ పోడువానేవణత్తె.

తిప్పాభట్లుమాట :-

అదేమంచున్నావురా అరవసోదె.

అప్పన్ వాత్యారిమాట :-

అడఅంబిరాయ తెలంగన్ నైయ్యాతొక్కి-నానె

అంబిరాయనిమాట :-

వాత్యారె తెలుంగన్ దిండియన్. అవనోడెవాయిక్కు-డుక్క-వెండాం. వారుమయా. కూత్తుప్పాత్తాప్పోలె యాచ్చుధ పణందక్కి-త్తి మెళ్ళనళువుపోం వాఘుం.

వా. ఆసమయంబున పప్పుతిప్పాభట్లు ఏమనుచున్నాడు.

తిప్పా :-రావో లంఝుమగారు. అరవవాడేమిచ్చీని. అల్పుండు పరమలోభి. పటుపట్టవమ్మా లంఝుమ.

బోగందానిమాట :-ఏమయ్యా పట్టేది ?

తిప్పాభట్లు :-ఊరికేపట్టు అటుపట్టు. ఇటుపట్టు. ఒకఉత్తమదానంపట్టు.

భోగమాపెమాట :-మాకు దానమేలనయ్యా. త్యాగమియ్య్య వలె గాక.

తిప్పాభట్లు :-ఓరి మంచిగా !

మంచిగాడు :- ఏమే అన్నగారు ?

తిప్పా :-మొన్న కోమటివారిపడుచు సమర్తాడినప్పుడు గృహయజ్ఞంచేస్తె వీసంకాసులు దక్షిణయిచ్చేరే. ఆకాసులు కొంచురారా.

మంచి :-అన్నగారూ, ఆకాసులు గోచిపాతనుకట్టుకొని అగిడి తలో ఈదలాడబోయినప్పుడు పడిపోయనే.

తిప్పా :-ఓరి, వెట్టివాడా ! నీతోయేందిపోరా. పట్టుపట్టవస్త్రాలంర్ఘుమ.

భోగందానిమాట :-ఏమయ్యా పట్టేది ?

తిప్పా:- ఊరికేపట్టవమ్మా. రాయపాళెపు చిన్నకాసు.

భోగమాపెమాట :- కాసనంగ్గానేంది ? వీసమనంగానేంది? మీాథోవతి యిప్పించవయ్యా.

తిప్పా :-అదేవట్టా మంచిగా.

మంచిగానిమాట :-ఏమే అన్నగారు?

తిప్పాభట్లు :-మీాయమ్మ యెఘుబోయెరా ?

తిప్పాభట్లు పెండ్లాం యెల్లమమాట :-ఏమీా అవునషూ, వసరాన్కుకసవుదెస్తిరి ? అవునూ ఆవు కుడితితాగలేదు.

తిప్పాభట్లు :-ఓసే అప్పుపలెకాదె ఆవు పులిసినకుడితి తాగదషవే!

యల్లమమాట:అవునూ,కుడితిపులిసిందో చప్పడుందోచూడుండ.

తిప్ప :-అవునపె. సిన్నభిక్షాలుగాడు విస్తరాకులకు బోయెనే. వచ్చినాడషవే.

యల్లమ్మ :-అవునషూ, మీాకు అవుపాసనాన్కి సమిదలున్న కూడా తెమ్మంటిరి, కాగా యింకారాలేదు.అవునషూ, సత్రింవేళ యింకా యెంతసేప్పుపట్టు.

తిప్ప :-ఓసి, పాదచ్ఛాయవేసి అడుగులుకొలవవె.

యల్లమ్మ:-అవు. చాలు, నేనాఅడుగులు కొలిచేది. పెదభిక్షాలుగాణ్ణి కొలునమనుండ.

భిక్షాలుగానిమాట !-అన్నగారూ, పాదచ్ఛాయలువేస్తిని పడమట నాలుగడుగులున్నదే.

తిప్ప :అయితే పండ్రెండు ఘడియలాయెను. ఇప్పుడు సువర్ణ ఛాయగా కంచెపప్పువండి కుమ్మరిస్తున్నారు.

యల్లమ :-కొదువా చెప్పుండి నాకువశంగాదు.

హాస్యకాడు :-నాకు అంతకంటె వశంకాదు.

తిప్పాభట్లు :-సత్రింవేళకు ఇంకా నాలుగు ఘడియలుపట్టును.

యల్లమ :-అవునషూ, పిన్నభిక్షాలుగాడు ఆకలంచున్న పోరుపెట్టుచున్నాడు. ముంతయిచ్చేగాని యింతలో నాలుగిండ్లకు పోయివస్తేరు.

తిప్పాభట్లు:- ఓసి, అలౌకికమా! కూతుచూస్తున్నానే.

యల్లమ:- అవు చాలు మీాబ్రతుక్కు కూతువొకటి కొదవా ! దానిచేత కూతుచూస్తివే దానిచేతికి మీాధోవతియిచ్చి దానిముడ్డి వెంటనే పొండ.

తిప్పాభట్లు:- వోసి, అప్పువలెగాదె నీచీర అడుగుచున్నదె.

యల్లమ:- అవు, వలెవలె, మీాబ్రతుక్కు వొప్పని మొకానికి వేయి వికారాలంచున్ను ఇన్నివికారాలుగానలె మంచి గాని కొపీనమున్ను మీాధోవతిన్ని ఇచ్చి పొమ్మనుండి.

హాస్యకాడు:- మంచిగాని కొపీనమున్ను ఇయ్యవద్దు, నీచీరా యియ్యవద్దు, నాచీర యిచ్చేగాని యింద.

వ. అనిన విని తిప్పాభట్లు ధోవతి యిచ్చి బహుమానము చేసి యేమనుచున్నాడు.

తిప్పా:- ఓహోయి, ధర్మాత్ముండ! సత్రమధికారి,యీాలంఝమ ధోవతి దోచుక పోవుచున్నదయా.

అధికారి:- ఏమయ్యా, తిప్పాభట్లు ! కేళికచూచి బహుమానం చేసి ధోవతి దోచుక పోచున్నారు. భూయో భూయో దోచుక పోచున్నారని నీవేమొర పెట్టేవు. నీదింకితనము మానవుగద ! నేవలసిన దుప్పట్లు యిచ్చేగాని వూరకుండవోయి.

వ. ఆసమయంబున స్వయంపాకులు వచ్చి ఎచ్చరించఁగా సత్రమధికారి బ్రాహ్మలవిడిచే క్రమమెటువలెను.

అధికారి:- ఓయి కుంటిబ్రాహ్మణుండ, రావోయి!

వ. అది విని తిప్పాభట్లు ఏమనుచున్నాఁడు.

తిప్పా:- ఓరి మంచిగా! ఆకుంటి బ్రాహ్మణుణ్ణి పిలుస్తున్నాడు. ఆకుంటిబ్రాహ్మణుండు సత్రమధికారికి ఏమిగావలెరా?

మంచి:- వాడె అధికారికి మేనపిన్నమ మనమరాలి మొగని భావమరది.

తిప్పా:- అయితే మనమున్ను ఆకుంటి బ్రాహ్మణుని వలెనే వత్తామురా.

ద॥ సౌరాష్ట్రము॥ ఆది.

వెంటనంటి మంచిగాఁడు - వేదము చదువంగా
కుంటుకుంచు వచ్చె నూతి- కోలచేఁబూని॥

అధికారి:- ఓయి, కుంటిబ్రాహ్మణుణ్ణి పిలిస్తే నీవేల వస్తివోయి!

తిప్పా:- ఈవూళ్లో నాకంటే కుంటిబ్రాహ్మడు యెవరు?

అధికారి:- నీవు కుంటివాడవా? కొట్టు కొట్రా. వోయి పొట్టి బ్రాహ్మడ రావోయి.

తిప్పా:- ఓరి, మంచిగా! అధికారి అల్లపొట్టి బ్రాహ్మణ్ణి పిలుస్తున్నాడు. ఆయధికారికి వాడేమి కావలెరా?

మంచి:- వాడే వారిపినతండ్రికి తోడబుట్టిన యన్న.

తిప్పా:- మనమున్ను వానివలెనే వత్తామురా.

దరువు॥ గుమ్మకాంభోజి॥ ఆది॥

మిట్టనుదుట చేటంత - మేధావిబొట్టుపెట్టి
పొట్టిబాపడై వచ్చె - పొదలుచు నపుడు॥

అధికారి:- ఓయి, నీవు పొట్టివాడవా ? కొట్టు కొట్రా. ఓయి పొడుగాటి బ్రాహ్మండ, నీవురావోయి.

తిప్ప:- ఓరీ, మంచిగా ! అల్లపొడుగాటి బ్రాహ్మణ్ణి పిలుస్తున్నాడు వాడు యెవడ్రా,

మంచి: వాడా ! వారమ్మమొగడు.

తిప్ప: మనమున్ను అషువలెనేవత్తామురా.

ద॥ ముఖారి॥ ఆది॥

వడిగసోబెపడుచు శోభనాలు- పాడుచురాఁగా
పొడుగాటిబ్రాహ్మణుండై వు- ప్పొంగుచువచ్చె ॥౧॥
తంజాపురవాసునకు- దళితరిపూల్లాసునకు
మంజులదరహాసునకు- మన్నారుదాసునకు ॥౨॥

అధికారి: అదేమోయి, పొడుగాటిబ్రాహ్మణ్ణి పిలిస్తే నీవేల వస్తివోయి?

తిప్ప: నేదా మన్నారుకోవిలపురమంత పొడుగాటి బ్రాహ్మణ్ణే నాకన్నా పొడుగాటివాడు యెవడు?

అధికారి: నీవుపొడుగాటివాఁడవా? కొట్టుకొట్టు. ఓయి నత్తి బ్రాహ్మడ, రావోయి.

తిప్పా: ఓరీమంచిగా, ఆయధికారి అల్ల నత్తిబ్రాహ్మణ్ణి పిలుస్తు న్నాడు. వాడు ఆయధికారికి యేమిగావలెరా?

మంచి: వాడు వారన్నకు తండ్రి.

తిప్పా: మనమున్ను వారితండ్రివలెనే వస్తుమురా.

ద॥ శేవగుప్తి॥ ఆట॥

ముత్తైదువలతోడ- ముచ్చటలాడుచు
నత్తిబ్రాహ్మడైవచ్చె- నలుగురుచూడ॥

ముత్తైదువ: అవునస్వూ, నేనెవ్వవలెవున్నాను ?
తిప్పా: నీవా, వోసి ఆ రంభకువలెనే వున్నావే.

తిప్పా: ఓసి, నేనెవ్వవలె వున్నానే?

ముత్తైదువ: అవునూ, మీరు నాపాలింటి ఆ సీమన్నారాయణ వలెనే వున్నారు.

అప్పన్ వాత్యారిమాట: నీంగళె రెండుపేరుం పాతక్కణ్ణుక్క నానెప్పడి యిరుక్కరేన్.

తిప్పాభట్లుమాట: నీకొరంగుపోలె యిరుక్కరాయి.

అధికారి: అదేమోయి, అల్లనత్తిబ్రాహ్మణ్ణి పిలిస్తే నీవేల వస్తివోయి?

తిప్పాభట్లు: సీమలో నాకంటె నత్తిబ్రాహ్మడు యెవరు?

అధికారి: ఓయి, నీవు తెచ్చుకోలు నత్తివాడ వింతేకాని నిజ మైన నత్తివాడవా? కొట్టు కొటాహ్రివోరి.

అధికారి: ఓయి, కాశీకావడిబ్రాహ్మడ, రానోయి.

తిప్పా: ఓరి మంచిగా! అధికారి కాశీకావడిబ్రాహ్మణ్ణి పిలుస్తు న్నాడు. వాడు ఆయధికారికి ఏమిగావలెరా?

మంచిగాడు: వాడా? వానికి వొకశైన అబ్బ.

తిప్పా: ఓరి, మనమున్న వారిఅబ్బవలెనే వత్తామగాని తిప్పు భట్టుగాని చేతికావడి తియ్యరా.

జంపవు॥

కావేరిలోస్నానముచేసి— కాశీకావడి మూపునబెట్టి
ఈవేళతిప్పాభట్లు హరిహరీయనుచు వచ్చె॥

అధికారి: ఓయి, కాశీకావడిబ్రాహ్మడ, స్నానముచేసిరానోయి.

తిప్పా: ఓరి మంచిగా! అధికారి స్నానముచేసి రమ్మంచున్నాడు ఏటికిబొయ్యేమంటే యేరు దూరముగదా. అగడితలో నైతే మొసలి యీడ్చుకపోను. ఇంతలో సత్రివేళతప్పి పోకుండా కొనసిగఅయినా తడిపి ముడివేసికొందాము. ఇసుమంత అల్పాచమనము చేయరా.

మంచిగాడు: అన్నగారు, నాకు వుచ్చరాలేదే.

తిప్పా: ఓసి, మంచిగానికి వుచ్చరాలేదంచున్నాడు. ఎట్లునలెనే?

యల్లమ: అవునష్టూ, పదుచుసుడియనికి సమయానకు వుచ్చ రాలేదు. అందుకు నేనేమిసేతు?

తిప్పా: ఓరిమంచిగా!ఆపోశిలుభట్ల ముంతలోనీళ్లైనాతీసుకరారా

వ. అని సిగముడివేసుకొనివచ్చిన పప్పుతిప్పాభట్లునుజూచి సత్రిమధికారి యేమనుచున్నాడు.

అధికారి: ఏమోయి, అప్పుడే స్నానము చేసివస్తివా?

తిప్ప: ఓహోహో స్నానముచేసివస్తిమే! యిదిగో నాసిగచూడు

అధికారి: ఎక్కడస్నానం చేసివస్తివోయి?

తిప్ప: ఏట్లోను.

అధి: ఏరెక్కడ చెప్పుమా!

తిప్ప: ఏరా పిస్సనిమాకుల(?) బైటికి దక్షిణముగాను.

అధి: మంచిప్రామాణికుడవోయి. ఆడేదల్లా దబ్బరలే. కొట్టు కొట్రా. తాళు, తాళు, తాళు, రావోయి రావోయి మాయేలినవారు బ్రాహ్మణ్యప్రభువులు గనక మేము ప్రాస్నాల పరీక్షించరాదు. నీవుయెట్లావున్నా పూజ్యుడవే అటుగనక సకలమైనవారున్ను పసాపడవిచ్చేయరయ్యా.

దII ఎరుకలకాంభోజిII రూపకంII

అప్పాలువడలును- అతిరసములు
పప్పుభక్షింపను పప్పుతిప్పాభట్లువచ్చె II

మంచినీళ్ళవాడు: అయ్యాలాకు-అమ్మాలాకు
అయ్యాలకమ్మాల- కయ్యాలకమ్మాలకుII
పెద్దలకు పిన్నలకు శీతళపాతాళ
పచ్చకర్పూర పరిమళగంగామృతంII

ద్వి. ఆవేళనాసత్రమందు భూసురలు
వేవేలుచోట్లకుఁ బెనఁగెడువారు,
నొకరిముందర నొకరొకరినిఁద్రోచి
యొకరొకరినిబట్టి యీడ్చెడువారు,
వరుసగాఁ దమతమవారిని జోళ్లు
సరుదుకొమ్మని పంక్తిసాగెడువారు,
అంకణంబులుపట్టి యమరఁ గూర్చుండి
కొంకకబొప్పులు గుప్పెడువారు,
ఆకులువేసి పాత్రాభిఘారంబు
ప్రాకటంబుగఁజేసి వడ్డించువారు,
నూరుఁగాయలు నుప్పు నూరుబిండ్లమరఁ
జారులుఁ గూరలు సద్యోఘృతంబు
పప్పుశాల్యన్నముల్ పచ్చళ్ళు సిగర
లప్పడంబులు పరమాన్న మోగిరలు
అతిరసంబులు వడలంబళ్లు పెరుగు
చతురతమీఱంగ సవరించువారు
అమ్మలకయ్యల కన్నంబటంచు
నెమ్మివలసినది నిర్మించువారు.

వ. ఇక్కడ ఆశీర్వాదంచేసి ధారపోసి తిరుగద్విపదవిన్పించేది
" అనేన శ్రీవైష్ణవ తదీయారాధనేన భగవాన్ సర్వా

త్మకః శ్రీరుక్మిణీసత్యభామా హేమాబ్జనాయికాసమేత
శ్రీరాజగోపాల స్సుప్రీతో వరదోభవతు"

ద్వి. ఆపోశనంబిడి యారగింపుచును
బాపుసత్రంబని ప్రణుతించువారు

తిప్పాభట్లు స్తోత్రముచేసేది :

ఓరి తప్పుభట్టుగా, ఇప్పుడలె మృష్టాన్నముగా సత్రము పెట్టేరాజును కాశీరామేశ్వరము పర్యంతములో ఎక్కడనైనాచూస్తిమా! సన్నబియ్యమన్నమేంది! కందిపప్పేంది! దొన్నెకొద్దినెయ్యేంది! పచ్చిడేసికూరలేంది! వలసినంత పరమాన్నమేంది! వడలేంది! అతిరసాలేంది! మీగడ పెరుగేంది! ఓహోహో! ఎంతసంభరమోయి!

ద్వి. ఈతీరుభుజియించి యితవుగా "నన్న
దాతా సుఖీభవ త్వ"మనుచు లేచి
గట్టునతేంచుచుఁ గరములుగడిగి
బొజ్జలునిమ[illegible]చుఁ బొదలుచువచ్చి
వీడెముల్ దీ[illegible] వేడ్కతో గుంపు
గూడుకవచ్చిరి కుతుకంబుమీఱ.

వ. ఇవ్విధంబున మృష్టాన్నంబులు భుజియించి సంతుష్టాంతరంగులై సత్రమధికారిచెంగట పప్పుతిప్పాభట్లు అప్పంవాత్యారి మొదలైన కోటివిప్రులు మెచ్చుగా నచ్యుతవిజయరాఘవ భూపాలు నేమని యాశీర్వదించుచున్నారు.

ఆశీర్వాదము:—

అనేన శ్రీవైష్ణవ తదీయారాధనేన భగవాన్ సర్వాత్మకః శ్రీరుక్మిణీసత్యభామా హేమాబ్జనాయికాసమేత శ్రీరాజగోపాలస్సుప్రసన్నో వరదో భూత్వా అస్య యజమానస్య స్వాతీనక్షత్రే తులారాశౌ జాతస్య శ్రీరాజగోపాలస్వామి దివ్యానుగ్రహాలబ్ధ మన్నారుదాసాఖ్య నామధేయాలంకృత వక్షస్థలస్య అచ్యుతవిజయరాఘవాచార్య నామధేయస్య తస్యసహాకుటుంబస్య సపుత్రికస్య సబాంధవస్య సపరివారస్య క్షేమస్థైర్య ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధిః భూయాదితి భవంతోఽనుగృహ్ణంతు తథాస్తు. యజమానస్య స్వామ్యమాత్య సుహృత్కోశరాష్ట్రదుర్గబలాఖ్యానాం సప్తానాం రాజ్యాంగానా ముత్తరోత్తరం భూయాదితి భవంతోఽనుగృహ్ణంతు. తథాస్తు.

వ. అని యాశీర్వదించిన తదనంతరంబ సత్రమధికారి వారలకు యథోచిత బహుమానములు చేయంగా వారు సత్రమధికారితో నేమని తెల్పుకొంచున్నారు.

తిప్పాభట్లు మొదలైనవారు:- రావోయి సత్రమధికారి! ఏలినవారి కటాక్షాన ఈసత్రమందు మృష్టాన్నముగా భుజియిస్తిమి. మాకు ఇంకొకమనవి వున్నది.

అధికారి:- మహాభాగ్యమాయెను తెలుపరయ్యా.

తిప్పాభట్లు:- అడ అప్పంవాత్యారె అయ్యనోడె శొల్లి కొళ్వోం. వాయుం, వాయుంబిళె అప్పంవాత్యారి అడతిప్పాభట్ట యెనక్కు తెలుంగు తెరియాదె. నీదానేశొల్లు మహారాజనోడ సత్రత్తిలె మృష్టాన్నమా భుజియిచ్చాయిప్పోతె యాచ్చే, కొరయుంశొల్లివిడుం.

తిప్పా:- ఓయి సత్రమధికారి, మేము తెల్పమంటే సంకోచమవు చున్నదయ్యా.

అధికారి:- ఏలనయ్యా సంకోచం! ప్రారకే తెల్పండి.

తిప్పా:-అడ అప్పంవాత్యారె మేలేయెదుభిశా.

అప్పన్ వాత్యారి:- అడతిప్పాభట్టా, నీతెలింగిలె యేదోకొళరి నాల్, యెనక్కు తెరియుమో.

తిప్పా:- అయితే లంజ.

అప్పంవాత్యారిమాట:- అడ, మెలా, నాలుం శొల్లుం లంజా అలంజో, యెన్నోశొన్నియే, యింవకూట్టెళుత్తుయెరుక్క తెరియుంబిళె, సంకోచమేన్, పణంకుడామల్ కూత్తి యూన్ వందాల్ తావిళెయెన్నో ఘట్టియాశొల్లుం.

తిప్పాభట్లు:- అపహాడా వున్నోడ యేమ. వినవయ్యా యిల్లమహారాజయ్య లంఝమగారు...

అధికారి:- లంఝమగారు యేంది! అపతలచెప్పండి.

తిప్పాభట్లు:- లంఝమగారనంగా యేందే. లంఝమగారిచేత వొకసారి అపనిపించవలె నంచున్నారం. ఇదిమామనవి

వ. అనినవిని పత్రిమధికారి నవ్వి యేమనుచున్నాఁడు.

అధికారి:- అదెవరో వెంగసాని, యేమో జక్కులరంగసాని.. రావో పలుక సానిముద్దు, ఈ పప్పుతిప్పాభట్లు అన్నాఁ వాత్యారిగారు మహాదూరదేశాన్నుండి వచ్చినారు. మంచియోగ్యులు. వీరికి వూరికే వుండవశంగాదట. వీరిని సంతోషపెట్టుండ.

హాస్యగాఁడు:- వూరికేవుండ వశంగాకుంటే నాచేత దుడ్డుగోల వున్నది.

వ. అనిన విని సానికూఁతు లేమనుచున్నారు.

భోగాలవారిమాటలు:- రంగసానిచెప్పేది:- పరాకా యెల్లమ రాజుగారు? పప్పుతిప్పాభట్లుగారికి వుత్తరాది వెంగసాని యందే వలపు. మమ్మేల వార్ని సంతోషపెట్టుమంచు న్నావయా.

అధికారి:- జక్కులరంగసాని, పటకసానిముద్దు, ఇంతేనా విటుల వలపించేది? మీ కులవిద్యగాదా వలచి వలపించి, సొలసి సొలయించి, చొక్కిచొక్కించి, దక్కించుకొనిమందులా మాయలా అడ్డగించుకోవద్దా!

భోగాలవారి మాట ; అయితే మీచిత్తమే వచ్చేని.

అధికారి : తిప్పాభట్లుగారు, మీరు ఈరూపానవుంటే స్త్రీలు తీసిపోదురు. మీతపోమహిమ చేతను మున్ను చ్యవన

మహాముని రీతిని దివ్యరూపము ధరించి వేడుకగావీరితో విహారించవయ్యా.

తిప్పాభట్లు : అయితే మీమనసే వచ్చిని

భోగాలవారు : యల్లమరాజుగారు, మీరు మమ్ము తిప్పాభట్ల వెంటపొమ్మనేనే కాని మాచేత కేళికవిని బహుమానము శాయవద్దా.

అధికారిమాట : భాగ్యమాయెను. అతీరున్నే మీకు సకలమైన బహుమానాలున్ను సేసేము. మాయేలినవారు ఆన తిచ్చిన పదాలలో ఒకపదంపాడుండ.

భోగాలవారు : మహాభాగ్యమాయెను. అతీరున్నే వినిపించేము

పదము : అయిదువరాలిచ్చితి - నదియేమిరాయని యడిగితే
అయిదువరాలవు గావాయని- యతివ చతురులుపలికేవు
మాటనేర్పుల వాడుగదా - మన్నారుదేవుడు
బోటిరోయేమని - పొగడుదునేను ॥౨॥

సరిపెనలిచ్చితి నెంత - సరసుడవంటేను ।
సరిపెనలియ్యవాయని - సకియకందునలాడెనే ॥౩॥

ఏలరా నన్నింత - యేతువా యంటేను ।
ఏలరా నన్ననేది - యింతి, నీనైజమననె ॥౪॥

వ. అనిన విని సంతుష్టాంతరంగుండై సతిమధికారి ఆకంబు కంతులకు తాంబూలాంబరంబుల బహూకరించిపంచిన నా

మించుబోణులు దివ్యరూపముధరించిన నవ్యమదనావతారుం డావారునిఁ జేరవచ్చిన యనంతరంబ మదనకదన వ్యాపారుండు. వారుండు వచ్చెనఁట యెటువలెను.

ద. నీరజముఖులందఱు - నెమ్మితోఁ గొల్వఁగా
వారుండు మన్మథా - కారుండై వచ్చెను॥

వ. ఇవ్విధంబున వచ్చిన యానవమన్మథుండు ఆకనకాంగి నింజూచి యేమనుచున్నాఁడు.

పదము॥ కొమ్మరో నీగబ్బి - గుబ్బలుగోరంట నీవె
అమ్మకచెల్ల యోరి న - న్నంటరాకురా ॥౧॥
కలికి నీమీఁద మేలువాఁడనె - బిగి కౌఁగిలింపవే।
చెలువుఁడని దుడుకులేల - చెల్లదుపోరా ॥౨॥
మోవి తేనెలియ్యవె నా - ముచ్చటదీర ।
నీవగ దెలియునుర నెర - నీటుకాఁడ ॥౩॥
వన్నెలాడి మరుకేళి - వన్నెలుకోవె।
కన్నుల విలుకాఁడ నీమాయ - విన్నానులేర ॥౪॥

వ. అని మఱియు నేమనుచున్నాఁడు.

(మన్మథుండు వినిపించేది) తందనాతనతాన.

ఉత్తరాది వెంగసాని ?

వెంగసాని మాట : ఏరా ?

మన్మథుని మాట : జక్కుల రంగసాని !

రంగసాని మాట : ఏమిరా ?

మన్మథునిమాట : పటకసానిముద్దు ?

ముద్దుమాట : ఆదేరా ?

మన్మథునిమాట : మనం యెక్కడ వున్నామో ?

ముద్దుమాట : కోవిల్లో వుండాముర ?

మన్మథునిమాట : కోవిల యెక్కడనో ?

ముద్దుమాట : కోట్లోరా.

మన్మథునిమాట : కోట యెక్కడనో ?

ముద్దుమాట : తంజావూర్లోరా.

మన్మథునిమాట : ఆఁ హాఁ, మనయేలినవారు లచ్చ బాఁపలకు వంటకం వేసునే ఆతంజావూరా.

వెంగసాని : ఓరీ బాఁపఁడా ? నిన్న బంతులు సాగి పప్పూ పాశమూ కజ్జాలూ........నీవూ పెండ్లాం, బిడ్డలూ బోంచేస్తిరే మరస్తివా ? వూరికే వుండారి వోరి,

మన్మథునిమాట : వెంగసాని, నేనెవ్వరో !

వెంగసానిమాట : నీవే నవమన్మథుండవు గావటారి.

మన్మథునిమాట : అమ్మణ్ణోడూ లే, పట్టు, పట్టు, పల్లెం, పల్లెం, కేక వేసిఆఁహ్వో, మూరికలిగితే, అట్టే, కొబ్బెరా సారపప్పూ, గస్కగస్కలూ.

వెంగసానిమాట : ఓరి, గసగసలనరా.

మన్మథునిమాట : జాజికాయ, జాపత్రి, పోస్తు, ఆఫీను(?)చే తీరేది.

నిన్ను నెడబాసి నిమిషమైనను తాళ – నెలఁతా !
యెన్నరాని మోహాన – నింతి, నీమోవి తేనె
యియ్యవే ॥౧॥

వ. అనిన విని భోగాలవారు జోడుగూడి నటించిరి. వెనుక వచ్చెను

దరువు॥

పారులిరువురు సాని – పడఁతులతో గూడి
కూరిమి నటించిరి – నేమపులు మెఱయ ।

భరతవాక్యము

ఇవ్విధంబున ననవరత లక్ష్మీ బ్రాహ్మణార్చనాపాలకుఁడగు మన్నారుదాసనృపాలునకు శ్రీ విజయరాఘవనాయనింగారి రాజగోపాలస్వాములు ఆయురారోగ్యంబు లమితభోగభాగ్యంబులు సంతానసమృద్ధియు సామ్రాజ్యాభివృద్ధియు సకల దిగ్విజయంబును ప్రసాదించి రక్షింతురు గాక. మన్నారుదేవికి మంగళం॥

సత్రిమురులు నాటకం సంపూర్ణం.

# ANDHRA UNIVERSITY PUBLICATIONS.

## I. ENGLISH

### (A) Humanities and Sciences.

RAMALINGA REDDY SASHTYABDAPURTI COMMEMORATION VOL. Part I—Sciences (Rs.10/-)
Do. Part II—Humanities. (Rs. 15/-)

No. 46. CALENDAR THROUGH AGES AND COUNTRIES by Prof. M. N. Saha, (Rs. 1—8—0)

No. 54. Two Studies By Humayun Kabir, Education Advisor to Government of India and Chairman, University Grants Commission. Rs. 3—0—0

### (B) Economics and Politics

No. 36. PRACTICE AND LAW OF BANKING— by D. S. Sastry, M.A., C.A.I.B. (Rs. 1—8—0)

### (C) History

No. 3. BUDDIST REMAINS IN ANDHRA AND HISTORY OF ANDHRA BETWEEN 225 AND 610 A. D.—by Dr. K. R. Subrahmaniam, M.A., Ph.D., Ex. Principal, Maharajah's College, Vizianagaram. (Rs. 2—0—0)

No. 27. ADVANCED HISTORY OF INDIA—by the late Prof. P. T. Srinivasa Ayyangar, Ed. by Prof. G. V. Rao, M.A., LL.B., Professor in History, Andhra University. (Rs. 8—8—0)

No. 32. A FORGOTTEN CHAPTER OF ANDHRA HISTORY—by M. Somasekhara Sarma, Dept. of History, Economics & Politics, Andhra University. (Rs. 2—0—0)

No. 38. HISTORY OF THE REDDY KINGDOMS— by M. Somasekhara Sarma. (Rs. 15—0—0)

No. 40. FACTORS IN INDIAN HISTORY— by Prof. K. A. Nilakanta Sastry. (Rs. 2—0—0)

No. 48. STUDIES ON KRISHNADEVARAYA OF VIZIANAGARA—by Dr. O. Ramachandrayya. (Rs. 5—0—0)

## (D) Philosophy

No. 24. VIVARANAPRAMEYA SANGRAHA—(English Translation) Ed., by S. S. Suryanarayana Sastri, M.A., B. Sc., Bar-at-Law and Prof. Salleswar Sen, M.A., D.Litt., D. Phil. (Rs. 6—8—0)

## (E) Science

No. 22. AN OUTLINE OF THE MINERAL RESOURCES OF ANDHRA DESA—by Dr. C. Mahadevan, M.A., D.Sc., (Madras), F. A. Sc. (Re. 0—8—0)

No. 23. SCATTERING OF LIGHT AND THE RAMAN EFFECT-by Prof. S. Bhagavantham, M Sc., Hon.D.Sc.(Andhra), Ex-Professor of Physics, Andhra University. (Rs. 15—0—0)

No. 28. INTERMEDIATE PRACTICAL PHYSICS—by V. Appa Rao, M.A., L.T., (Rs. 0—8—0)

No. 31. NATURAL RESOURCES OF ANDHRA AREA & ALLIED SUBJECTS A Symposium. (Rs. 2—8—0)

No. 35. CHEMISTRY OF VITAMINS AND HORMONES—by Prof. Seshadri and Dr. Rangaswamy. (Rs. 12—0—0)

No. 37. THEORY OF GROUPS AND ITS APPLICATION TO PHYSICAL PROBLEMS-by S. Bhagavantam and T. Venkatrayudu. (Rs. 20/-)

No. 49. Memoirs in oceanography. (Rs. 15/-)

# II. TELUGU

## (A) Catalogues

No. 11. A DESCRIPTIVE CATALOGUE OF THE TELUGU MANUSCRIPTS IN THE TANJORE PALACE LIBRARY—Edited by P. P. S. Sastri, M.A., Govt. Oriental Manuscripts Library, Madras. (Rs. 1—8—0)

## (B) History

No. 39. INDIAN POLITY. A. D. 1600 to 1948—by Atmakuri Govindacharyulu.
[3 Volumes—Rs. 35/-, Each Volume—Rs. 15/-]

## (C) Criticism

No. 8. KAVITHWATHATHWAVICHARAMU—by Sir C. Ramalinga Reddy, M. A. (Cantab), Hon. D. Litt. (Andhra) (Rs. 3—0—0)

## (D) Grammar

No. 44. ANDHRA VYAKARANA SAMHITA SARVASWAMU—Part I—by Kalaprapurna Vajjala China Sita Ramaswamy Sastri (Rs. 25—0—0)

No. 47. ANDHRA VYAKARANA SAMHITA SARVASWAMU—PART II—by Kalaprapurna Vajjala China Sitaramaswamy Sastri. (Rs. 25—0—0)

No. 52. DRAVIDA BHASHA PARISEELANAMU—by Mr. V. Ch. Sitaramaswami Sastri.

Volume I. (Rs. 16—0—0)
Volume II. (Rs. 16—0—0)
Complete set of two volumes. (Rs. 30—0—0)

## (E) Literature

No. 2. THE UNIVERSITY LECTURES ON VEMANA—by R. Anantakrishna Sarma, Lecturer, Maharajah's College, Mysore. (Rs. 1—8—0)

No. 21. VYASAMANJARI OR COLLECTED ESSAYS (IN TELUGU)—by Sir C. R. Reddy, M. A (Cantab) Hon. D.Litt. (Andhra). (Rs. 2—8—0)

No. 30. DWIPADA BHARATAM-Vol.I-Edited by P.Lakshmikantam, M.A. (Rs. 10—0—0)

No. 41. DWIPADA BHARATAM—Vol. II—Edited by P. Lakshmikantam, M.A. (Rs. 12-0-0)

No. 42. Dwipada Bharatam—Vol. III Edited by Vidwan G. J. Somayaji, M.A., L.T. (Rs. 15—0—0)

No. 43. Dwipada Bharatam-Vol. IV Edited by Vidwan G. J. Somayaji, M.A., L.T. (Rs. 12—0—0)
Complete set of the four Volumes of Dwipada Bharatam (Rs. 40—0—0)

No. 45. Translation And Commentary of Sapthasathi Saramu-by D. V. Sitharamaswamy, M.A. (Rs. 3—0—0)

No. 50. Panchami-A thesis on Ranganatha Ramayana dika Vyasamulu—by Dr. C. R. Reddy—Edited by G. S. N. Acharya (Rs. 2—0—0)

### (C) Science

No. 33. A Text Book on Trignometry (in Telugu)—by K. Rangachari, M.A., B.L., M. R. College, Vizianagaram. (Rs. 4—0—0)

No. 34. Text Book on Zoology (in Telugu)—by R. V. Seshaiya, M.A., Annamalai University, Annamalainagar. (Rs. 5—8—0).

## III. SANSKRIT

### (A) Vyakarana (Grammar)

No. 6. Chitraprabha—A commentary on Haridikshita's Laghusabdaratna—by B. Hari Sastri—Edited with notes by Mahamahopadhyaya Kalaprapurna, Tata Subbaraya Sastri, Maharajah's Sanskrit College, Vizianagaram. (Rs. 3—0—0)

No. 26. Guruprasadam and Guruprasadasesham—Edited by Mahamahopadhyaya Kalaprapurna Tata Subbaraya Sastri and Peri Venkateswara Sastri—Part I. (Rs. 7—8—0)

Do. do. Part II. (Rs. 10—0—0)

No. 51. Paribhashendu Tippani Nagesagudartha Dipika, by Mr. P. Venkateswara Sastri. (Rs. 25—0—0)

### (B) Nyaya

No. 7. Sangameswarakrodum—On Jagadisa's Siddhanta-Lakshanam—by G. Sangameswara Sastri. (Re. 0-12-0)

### (C) Vedanta

No. 25. Vivaranaprameya Sangraha (Sanskrit Text) Edited by S. S. Suryanarayana Sastri, M.A., B. Sc., Bar-at-Law and Prof. Saileswar Sen, M.A. D. Litt., P. Phil. (Rs. 7—8—0)

---

THE FOLLOWING PUBLICATIONS ARE OUT OF STOCK.

## I. ENGLISH

### (B) Economics and Politics

No. 1. The Beginnings of Local Taxation in the Madras Presidency—A Study in Indian Financial Policy—1863-71—by Prof. M. Venkatarangayya, M.A., Ex.Professor, Andhra University. (Rs. 2—4—0)

No. 4. The World Economic Depression—A Plea for Co-operation—by Sir J. C. Coyajee, B.A., LL.B., Ex. Professor, Andhra University. (Re. 0—12—0)

No. 5. India and the League of Nations—by Sir J. C. Coyajee. (Rs. 2—4—0)

No. 12. Fedaralism in Government—by Prof. M. Venkatarangayya, M.A. (Rs. 2—0—0)

No. 17. Indian Politics since the Mutiny—by Sir C. Y. Chintamani, Editor "Leader", Allahabad. (Rs. 2/-).

## (C) History

No. 19. Modern Chinese History (Political, Economic and Social)—by Prof. Tan Yun Shan (Chief Organizer, Sino—Indian Cultural Society, Nanking). (Re. 0-8-0).

## (D) Philosophy

No. 16. Man—by Dr. Rabindranath Tagore (Re. 1—0—0)

# II. TELUGU

## (D) Grammar

No. 15. Vaiyakarana Parijatamu—by Kalaprapurna V. Ch. Sitaramaswami Sastri. (Rs. 3—0—0)

## (E) Literature

No. 10. History of Sanskrit Literature—Part I. Vedic Period (in Telugu)— by M. Suryanarayana Sastri, formerly Pandit, UniversityCollege of Arts.(Rs. 2-4-0)

No. 13. History of Sanskrit Literature—Part II. Laukic Period (in Telugu)—by the same author. (Rs.2—4—0)

No. 18. History of Telugu Language-by Dr. C. Narayana Rao, M.A., Ph. D., L. T., Retd. Lecturer, C. D. College, Anantapur (in two volumes) Each volume.( Rs. 6-0-0)

No. 29. Gona Budhareddy's Ranganatharamayanam—Edited by Veturi Prabhakara Sastri. (Rs. 7—8—0)

## (F) Phylosophy

No. 9. Andhra Mimamsa Nyaya Muktavali-(in Telugu)-A Treatise on Purva Mimansa Darsana- by K. Gopalakrishnamma M.A., L.T., formerly Lecturer in Oriental Languages, Government Arts College, Rajahmundry. (Rs. 1—8—0)

## (G) Science

No. 14. Viswarupam—(dealing with the Physical Universe) written in popular Telugu—by K. Kondayya, M.Sc., Chemistry Department, Benares Hindu University. Benares. (Rs. 2—0—0)

No. 20. Telugu Equivalents of Technical Terms in Physics—by A. Balankeswara Rao, B. Sc., (Hons), formerly Department of Physics, J. V. D. College of Science and Technology.
(Re. 0—12—0) (inclusive of Postage).

---

*Note—Copies of the publications in stock can be had from the Registrar, Andhra University, Waltair, on payment of the cost and Postage in advance. Book-sellers, School, College and district Libraries, Libraries situated in Villages and also School and College Book Stores will be allowed a trade discount of 15% on the published price.*

**Andhra University Series No. 57**

# యక్షగానములు

## (తంజావూరు)

సంపుటము 3

---

పరిష్కర్త

విద్వాన్

గంటి జోగిసోమయాజి, ఎం. ఎ., ఎల్. టి.,

ప్రొఫెసరు, ఆంధ్రవిశ్వకళాపరిషత్తు.

---

ఆంధ్ర విశ్వకళా పరిషత్తుచే ప్రచురితము




కాకినాడ : జాగ్రిప్రెస్సునందు

శ్రీ పట్టమట్ట శేషగిరిరావుగారిచే ముద్రితము

Price Rs. 2-8-0 ] 1957 [ వెల రు 2-8-0

# పీఠిక

విజయనగర సామ్రాజ్యమునందలి కళాపోషకత తంజావూరు రాజ్యమున నెలకొని రఘునాథ విజయ రాఘవ నాయకుల కాలమునందు మిక్కిలిగా పరిపుష్టమైనది. వారి గ్రంథములు ఇంతకుముందు వివిధ సంస్థలచేఁ గొన్ని ప్రకటింపఁబడినవి. మిగిలినవి చాలవఱకు తాళపత్రపుటములలో ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారిచె ముద్రింపఁబడినవి

విజయరాఘవ నాయకుఁడు మధురసేనా నాయకుఁడగు వెంకటకృష్ణప్పచే యుద్ధమున మడిసెను. తరువాతి పరిపాలకుఁడైన అళగిరిదగ్గర రాయసము వెంకన్న ప్రవేశించి విజయ రాఘవుని పౌత్రుఁడగు చెంగమలదాసును రాజ్యమున నిలిపి వెనుక నాతనిని తొలఁగించి ఏకోజియను మహారాష్ట్ర సేనాపతి చేతికి తంజాపూరు రాజ్యమును అప్పఁజెప్పెను. తరువాత ఈకృతఘ్నుఁడు వారిచేతఁ జంపఁబడెను. అప్పటినుండియు మహారాష్ట్రరాజుల పరిపాలనము తంజావూరిలో స్థిరపడి క్రీ. శ. 1675 మొదలు 1855 వఱకు సాగినది. ఈకాలమున పదునొకండుగురు మహారాష్ట్రరాజులు పరిపాలించిరి.

ఈరాజులు హిందువులు కళాపోషకులు అగుటచేతను, అంతకుముందే తెనుఁగువారనేకులు ప్రధానులుగా వచ్చి తంజాపూరిలో స్థిరపడియుండుటచేతను, అచ్చటి వాతావరణము ననుసరించి తెనుఁగు వాఙ్మయమును కవులను

నట్టువరాంధ్రను వాగ్గేయకారులను పోషింపవలసి వచ్చినది. పూర్వరాజులైన నాయకప్రభువులనే వీరును అన్నివిధముల ననుసరించిరి. కావున వీరును తమ మహారాష్ట్రభాషతోపాటు తాత్కాలికముగా ఆప్రదేశమున వాఙ్మయభాషయైన తెనుఁగును కైవసముచేసికొని తమకు ముందువారివలెనే గ్రంథములనుగూడ రచించుచు వచ్చిరనుట సిద్ధాంతము. ఇట్లనుటకు వీరి యాస్థానములోని కవులపేరను ఈరాజులపేరను వెలసిన గ్రంథములు ప్రమాణములుగా నేర్పడుచున్నవి.

ఈసందర్భమున నొక ప్రశ్నయుదయించు చున్నది. నాయకరాజుల మాతృభాష తెనుఁగు. రఘునాథనాయకుఁడు యజ్ఞనారాయణ దీక్షితులంతవానికి విద్యాగురుఁవు. ఆతని కుమారుఁడగు విజయరాఘవుఁడును తండ్రిని మించిన సాహిత్యకళాపోషకుఁడై యనేకగ్రంథరచయిత యగుట సహజమే కావచ్చును. ఒకప్పుడు ఈరాజులు గ్రంథరచనలో తమ పండితులసాహాయ్యముఁబొందుచునుండవచ్చునని మనమూహించినను ఊహింపవచ్చును. కాని మహారాష్ట్రము మాతృభాషగాఁగలిగి, అరవదేశమునడుమ నొకప్రధాన నగరమున మాత్రము వాఙ్మయభాషగా నెలకొన్న తెనుఁగును తాము కైవసముచేసికొని, అందు ఉత్తమగ్రంథములను రచింపఁగలిగినంత పాండిత్యమును, ఆంధ్రభాషాభిమానమును ఈ మహారాష్ట్రరాజులు కలిగించుకొని, యిన్నిగ్రంథములను రచింపఁగలిగిరాయని ఒకసందేహము కలుగవచ్చును. దీనికి మూఁడు విధములగు సమాధానములు గలవు.

1. వారికి తెలుఁగుభాషయందు కొంచెము మాత్రము శక్తియుండి తమకాశ్రితులైన కవులచేత గ్రంథములు వ్రాయిం చుకొని తమ పేర వెలయించుకొనిరనుట.

2. తాము వచ్చి స్థిరపడిన కొంతకాలములో అనఁగా సుమారు ఇరువది సంవత్సరములు జరుగుసరికి, అచటి భాష నేర్చిఁగి అన్ని భారతీయభాషలకును ఆధారమగు విజ్ఞానముగల సంస్కృతమును తత్సంప్రదాయములను ఎఱిఁగినవారగుటచేత ముందటి నాయక రాజుల మార్గముననుసరించి తెనుఁగు గ్రంథములను రచించుకోర్కెచేత పండితుల సాహాయ్యమున గ్రంథములను రచించి స్వనామాంకితములుగా వెలయించు కొని యుండవచ్చును.

3. తామును స్వయముగా బహుభాషాకోవిదులగుట చేతను, తెనుఁగుభాషను పూర్తిగా కైవసముచేసికొనుటచేతను స్వతంత్రముగానే గ్రంథములను రచించియుండవచ్చును.

మహారాష్ట్రరాజులగు 11 గురిలో శాహాజి, ఏకోజి, తుక్కోజి లేక తుళజరాజు, శివాజి అనువారి కర్తృత్వముతో వెలయు గ్రంథములు కనుపట్టుచున్నవి. పైని జెప్పిన మూఁడు తెగల కృతికర్తలలో ఎవ్వరు ఏ కోవకు చెందినవారని నిర్ణయించుటకు ప్రమాణములులేవు. ప్రమాణాంతరములు లభించినఁగాని గ్రంథమునందు స్పష్టముగా పేర్కొనఁబడిన కర్తృత్వమును వేఱొకరికి అంటఁగట్టుట యుక్తముగాదు. కావున వీరిలో కొందఱైనను స్వతంత్రముగా గ్రంథరచయితలై

పైని జెప్పఁబడిన మూఁడవ తెగకును లేక రెండవ తెగకైనఁ జేరియున్నవారని మనమూహించుట న్యాయ్యము. ఆరాజు లెక్కువగా యక్షగానము నెడనే మక్కువగలవారగుట యొక విశేషము.

## శహాజీ – అతని యక్షగాన కృతులు

ఆమహారాష్ట్రరాజులలోఁ బ్రాతఃస్మరణీయుఁడు శహాజి. ఇతఁడు భోసలవంశీయుఁడు. ఛత్రపతి శివాజీ సవతితమ్ముఁడగు ఏకోజీకి దీపాంబికయందుఁగలిగిన తనయుఁడు. క్రీ. శ. 1684 – 1712 సంవత్సరముల నడుమఁ దంజావూరి నేలినవాఁడు. ఇతఁడపర విజయ రాఘవుఁడు. అతనివలె నతిమాత్ర గీత సాహితీ ప్రియుఁడు, నాట్యకళాకోవిదుఁడు, శృంగార శూరుఁడు, హాస్యచతురాస్యుఁడు. అతని సాహిత్యమంతయు నాయాలక్షణములకుఁ బ్రమాణభూతముగా నున్నది.

శహాజీపేరఁ దదంకితములు గాక తద్విరచితములుగా నిరువదిరెండు యక్షగాన ప్రాయరచనలు గన్పట్టుచున్నవి. శహాజీ మహారాష్ట్రుఁడయ్యు నాంధ్రమున నన్నికృతు లన్యభాషయాస లేకుండ వ్రాయుట గమనింపఁదగినది. అతని యాస్థానమున యక్షగాన రచనచేసిన యాంధ్రకవు లనేకులు గలరు. ఎడనెడ వారి ప్రశంసయుఁ దఱచు వారి కృత్యవతారికలతీరును శహాజీ కృతులందుఁ గన్పట్టును. అందు రెండుకృతులసలతనివి కావనియే యనిపించును. కడమకృతుల విషయమునను శహాజీ తనయాస్థాన కవుల సాహాయ్యము గ్రహించి యుండును. కాని కొన్ని కృతుల ప్రతివిలేఖన కాలములనుబట్టిచూడ శహాజీ గ్రంథరచన

క్రీ.శ. 1704 ప్రాంతమున జరిగి యుండినట్లు తోఁచును. అనఁగా నప్పటికి శహాజీ తంజాపూరికి వచ్చి సుమారు పాతికేండ్లైనది. సింహాసనము నెక్కి నాఁటికి యుక్తవయస్కుఁడై యుండును. సహజముగా భాషాసాహిత్య ప్రియుండు భావుకుఁడగు నతని కట నింకను బ్రచారమందుండిన యాంధ్రభాష నభ్యసించుట కా పాతికేండ్ల కాలమును జాలకపోదు. ఇఁకఁ దదాస్థానకవి కృత్యవతారికా శ్లోకాదిక గ్రహణ విషయము — శహాజీయే స్వయముగాఁ బ్రియంపడి వానిని గ్రహించి యుండవచ్చును. లేదా యానాఁటి నగరి ప్రతివిలేఖకు లప్పటప్పటఁ దదాస్థాన కవులు చెప్పుచు వచ్చిన శ్లోకాదులందుఁ దమకు నచ్చిన వానిని గొన్నిటి నందందుఁ జొప్పించి యుండవచ్చును. ఏదెట్లయినను పైచిలుకు రెండిటి మాటకేమిగాని కడమ యిరువదింటను రచనలో శహాజీ భాగస్వామ్యప్రతిపత్తి యధికముగనే యుండును.

ఆయిరువదింటను బదునాఱు నాటకములుగను, నాలుగు ప్రబంధములుగను గ్రంథకర్తచేఁ బేర్కొనఁబడినవి. నాటకము లన్నియు 'ఉదారవేషభాషాభూషితము'లని పేర్కొనఁ బడినవి. అవి సంవాద శైలీక వచన ప్రచురములుగను, ప్రబంధములు నాట్యోద్దిష్ట గీతిబంధప్రకృష్టముగను నున్నవి. అవి యన్నియు నాఁడు ప్రదర్శింపఁబడినట్లు వానిలోఁగల సూత్రధారవచనము లును, గొన్ని ప్రయోగ సూచనలును విశదమొనర్చుచున్నవి.

శాహజీ, తదాస్థాన కవ్యుపజ్ఞములైన యక్షగానముల స్వరూపస్వభావము లీదిగువ సంగ్రహముగా నిరూపింపఁబడినవి

1. ద్రౌపదీ కల్యాణము:—

ఇందలికథ యర్జునుఁడు మత్స్యయంత్రము నేసి తన సోద రులతోఁ గూడి ద్రౌపదిని బెండ్లియాడుట.

2. రతి కల్యాణము:—

ఇందు మన్మథుఁడు సారి వెడలి రతినిజూచి మోహించి వివాహముఁ జేసికొనుట వర్ణింపఁబడినది.

3. శచీపురందరము:—

తపముచేసికొనుచున్న మునులను బాధించిన పులోముఁ డను రాక్షసుని సంహరించుటకై వెడలి, యాతని కుమార్తె యైన శచిని మోహించి యింద్రుఁడామెను వివాహమాడిన కథ యిందు వర్ణింపఁబడినది.

4. సతిదానశూరము:—

మహావిష్ణువుయొక్క మహోత్సవము సేవింపవలసి యొక మతంగస్త్రీ రాఁగా, ఆమెను జూచి యొక బ్రాహ్మణుఁడు మోహించును. ఆబ్రాహ్మణునకు ఆమెభర్త దానిని దాగ వోయఁగా, ఆతఁడు యథార్థస్వరూపము నెఱిఁగి మాయ దొలఁగి సరియైన మార్గమునకు వచ్చుట యిందభివర్ణింపఁ బడినది.

5. గంగా పార్వతీ సంవాదము:—

శివుఁడు గంగాసమేతుఁడై శృంగారవనములో విహ రించుచుండఁగా గౌరి యటకు వచ్చుట, సవతులిద్దఱు పోట్లాడ..

కొనుచుండఁగా శివుఁడు వారించి వారిద్దఱిని సమాధాన పఱచుట యిందలి ముఖ్యవిషయము.

6. జలక్రీడలు :—

గోపికలందఱు జలక్రీడ లాడుచుండఁగాఁ గృష్ణుఁడు వారిచీర లపహరించుటయు, వారు ప్రార్థింపఁగా వారికిఁ జీర లొసఁగి వారిని బెండ్లాడుటయు నిందు వర్ణితము.

7. కృష్ణలీలా విలాసము :—

దేవకీ గర్భమున శ్రీకృష్ణుఁడవతరించుట, ఆతని చిన్ననాఁటి చేష్టలును, ఆతఁడు సత్యను బరిణయ మాడుటయు నిందలి యితివృత్తము.

8. వల్లీకల్యాణము :—

కుమారస్వామి వేఁటకేఁగుట, అచటఁ జెలికత్తెలతో వనవిహారము చేయుచున్న వల్లీ దేవిని జూచుట, నాయికా నాయకులు పరస్పరము ప్రేమించుకొనుట, వారల వివాహము నిందలి ప్రధానాంశము.

9. రామపట్టాభిషేకము :—

శ్రీరాముఁడు కుంభకర్ణాదులను మర్దించి, విభీషణుని లంకకుఁ బట్టము గట్టి, సీతనుగైకొని యయోధ్యకువచ్చి పట్టాభిషిక్తుఁడగుట యిందు వర్ణితము.

10. విఘ్నేశ్వర కళ్యాణము :—

శివుఁడు పార్వతితోఁగూడి వచ్చుట, చెలికత్తె వినాయకునిఁగూర్చి తెల్పుట, గజవరదుని పెండ్లి గావింపఁ దలఁచుట,

నారదుఁడు వేశ్యోఱుకన్యల వృత్తాంత మెఱిఁగించుట, బ్రహ్మ దేవుఁడు వచ్చి విఘ్నేశ్వరునకుఁ గల్యాణము చేయించుట యిందలి యితివృత్తము.

11. సతీపతి దాన విలాసము :—

నారదుఁడు సత్యభామతో పతి దానమహాత్త్వమును గూర్చి తెల్పుట, ఆమె కృష్ణుని నారదునకు దానమిచ్చుట, అష్టమహిషులును నాథు నిమ్మని నారదునిఁ బ్రార్థించుట, రుక్మిణి తులసిదళము వైచి తులతూఁచుట, నారదుఁడు రుక్మిణికిఁ గృష్ణునిచ్చి దీవించుట యిందలి ముఖ్య విషయము.

12. సీతాకల్యాణము:—

జనకమహారాజు మంత్రినిఁ గనుఁగొని సీతాకల్యాణము నకు స్వయంవరము చాటింపుమనుటయు, రాజులు స్వయం వరమునకు వచ్చుటయు, రామలక్ష్మణులను వెంటఁబెట్టుకొని విశ్వామిత్రుఁ డరుదెంచుటయు, రాజులు విల్లు వంచలేక సిగ్గు పడఁగా, రాముడు ధనుర్భంగ మొనర్చి సీతను బరిగ్రహించు టయు నిందభివర్ణితము.

13. శాంతాకల్యాణము:—

రోమపాదుఁడు మంత్రి సామంతాదులతోఁ గొలువుండఁగా, ద్వాదశవర్ష క్షామముచే బాధపడుచున్న ప్రజలు వచ్చి యాతనితో మొఱపెట్టుట, రాజు మునులను బిలిపించి వరుణజపము చేయించుట, అంతకును వర్షములు లేకున్న రాజు

విచారించుచుండఁగా భృగుమహర్షి వచ్చి "ఋష్యశృంగునిఁ బిలిపింపుము వర్షము కురియు"నని తెల్పుటయు, రాజు కాంతలఁ బనిచి ఋష్యశృంగునిఁ దెప్పించుటయు, అంతతో ననావృష్టి దోషము నిర్తింపఁగా రాజు హర్షించి యాతనికిఁ దన కూఁతు రగు శాంత నిచ్చి వివాహము సేయుటయు నిందు వర్ణింపఁ బడినది.

14. కిరాత విలాసము:-

పరమేశ్వరుఁడు పార్వతితోఁ బగడసాలాడి యోడి చెంచువేషముపూని వెడలుటయు, పార్వతి శివుని వెదకుటయు, నిరువురును సయ్యాటలాడి యాడి యేకమౌటయు నిందలి కథ.

15. రుక్మిణీ సత్యభామా సంవాదము:-

సత్యా రుక్మిణులు శ్రీకృష్ణుని వలచి పరస్పరము వివదించుటయు, కృష్ణుఁడు వారికి సఖ్యమేర్పఱచి యిద్దఱను సమానముగాఁ బ్రేమించుటయు నిందుఁ బ్రధానవిషయము.

16. భక్తవత్సల విలాసము:-

బాణుఁడు శివునియొద్దకు వెడలి మున్ను తనకిచ్చిన వరముల ప్రకారము శివుని తన కోటవాకిటనుండ రావలయు నని కోరఁగా నతఁడు బాణుని నగరుచేరుట, గౌరి విరహిణియై ప్రియునిఁ బిలువఁ జెలినిఁ బంపుట, అది తెలిసి బాణుఁడు పంపఁగా శివుఁడు మరలివచ్చి ప్రియునిఁగూడి సుఖించుటయు నిందు వర్ణింపఁబడినది.

17. విష్ణుపల్లకి సేవాప్రబంధము:—

రమాదేవి ప్రాణేశ్వరునిఁ దోడితెండని ప్రాణసఖులను బంపఁగా వారు విష్ణుని దర్శింప నేఁగుటయు, నారాయణుఁడు కొలువైయుండఁగా వారచటికి వెడలి యాతనితో లక్ష్మీ ప్రార్థనముఁ దెల్పి యాతనిని బల్లకిలోఁ గూర్చుండఁబెట్టుకొని యామెయొద్దకుఁ గొనివచ్చుటయు, రమా నారాయణుల విలాస విహారములు నిందు వర్ణింపఁబడినవి.

18. శంకరపల్లకి సేవాప్రబంధము:—

చెలికత్తెలు శంకరుని శృంగారపుఁబల్లకిలో నుంచి తెచ్చి పార్వతీదేవితోఁ బరిణయము చేయు మహోత్సవ వర్ణన మిందలి ప్రధాన విషయము.

19. పంచ రత్న ప్రబంధము:—

ఇదియొక చిత్రమగు రచన. శాహరాజు కొలువులోని యుద్దఱు నట్టువకాండ్రు, నవసిద్ధయోగి, చెంచువారు, బిరుదబంటు, సాదన కాండ్రు, మున్నగువారు శివుని కొలువున కేఁగి తమతమ విద్యలు ప్రదర్శించి యానటశిఖామణిచే బహుమానములు వడసినట్లును, శివుఁడు తనభక్తుఁడగు శాహ మహారాజునకు సకల సంపదలొసఁగినట్లును ఇందభివర్ణితము.

20. త్యాగరాజ వినోద విచిత్ర ప్రబంధనాటకము:—

ఇది సంస్కృత మహారాష్ట్రాంధ్రభాషలమిశ్ర రచన. భద్రకాళి కొలువుదీర్చి యుండుట, నారదుఁడు వచ్చుట, వాద

ములో సౌందర్యములోఁ దనకంటె నధికులులేరని యామెఁ నారదునితోఁ జెప్పుట, నారదుఁడట్టి వారున్నారని పల్కి-యావిషయము పరమేశ్వరున కెఱిఁగించుట, పరమేశ్వరుఁడు కాళియొద్దకు వచ్చుట, కాళిక శాహజీ రచితమగు సంగీత ప్రధానమైన "త్యాగరాజ వినోద విచిత్ర ప్రబంధనాటకము" ప్రదర్శించుటయు నిందలి విషయము. ఇందు శాహజీకిఁగల సంగీత విద్యాప్రావీణ్యము ప్రదర్శితము.

శహాజీ ఆస్థానకవుల యక్షగానకృతులు:—

(ఇవి చాలవఱకు రాజాంకితములే, అన్నిట నతని ప్రశంసయుఁ గలదు.)

1. పార్వతీ పరిణయము:—

ఏతద్గ్రంథావతారికలో నొక సూత్రధారవచనమున నిది శాహరాజ ప్రణీతమని యున్నది. కాని, గ్రంథాంతమున శాహజీపరముగా నున్న మంగళగీతమున "శ్రీవాసుదేవకవి వచస్సంతుష్టాయ మంగళ" మ్మని యుండుటంబట్టియు, వాసుదేవ నామధేయుఁడగు నాంధ్రకవి యొకఁడు శాహజీ యాస్థానమం దుండి యుండుననియు, నతఁడే తద్గ్రంథకర్తయై యుండుననియు నూహింపఁబడుచున్నది. ప్రసిద్ధమగు పార్వతీపరమేశ్వరుల కథ యిందు వర్ణితము. రచన ప్రౌఢమైనదే కాని యనౌచిత్య మధికము.

2. శాహరాజ విలాసము:—

ఇది నివర్తి శేషాచలపతి యను కవిచే విరచింపఁబడి నది. సేతు యాత్రచేసికొని వచ్చుచున్న శాహరాజును జూచి

కాంభోజరాజపుత్రియైన లీలావతి యతనిని మోహించుట, యామె విరహవేదన, దౌత్యము, ఎలుక ఘట్టము, తదుపరి నాయికానాయక సమాగమము నిందలి కథావిషయములు ఇందలి రచన కవి ప్రౌఢపండితుఁడని నిరూపించుచున్నది. ఇందు శహాజీ యాస్థానమందుండిన త్ర్యంబకపుత్రాదులగు పండితులు రామకవి ప్రభృతులును పేర్కొనఁబడుటొక విశేషము.

3. సరస్వతీ కల్యాణము:—

అవతారికలో నొకచోనిది "శాహమహారాజ ప్రణీతం బైన" దని యున్నది. అందే కథాసంగ్రహ ద్విపదలో

"చిరపుణ్య రతమతి శేషాచలపతి
వరశాహ విభుపేర వహించి దైవాఱఁ
బరఁగు సరస్వతి పరిణయంబనెడి
సరసనాటకము లాస్యముల రాజిల్లి
భావముల్ దగు వేషభాషాదులమరఁ
గావించె భరతులు గాయకుల్ మెచ్చ"

అని యున్నది. దీనిని పై శేషాచలపతి కృతిగనే పరిగణించుట లెస్స.

పురాణదంపతులైన సరస్వతీ చతుర్ముఖుల పరిణయకథ కొన్ని మార్పులతో నిందుఁ గూర్పఁబడినది. రచన ప్రౌఢమై మంచి నాటకపుపైపు వాటములు గలిగి యున్నది.

4. లీలావతీ శాహరాజీయము:—

ఇది బాలకవి సుబ్బన్న కృతమని యున్నది. కాశ్మీర రాజపుత్రియగు లీలావతీ శాహరాజుల శృంగార మిందలి ప్రధానవిషయము. రచనలో సందర్భశుద్ధి తక్కువ. భావప్రౌఢి లేదు. శబ్దదోషములును గలవు. కాని, శయ్యాలాలిత్యము చక్కఁగఁ బ్రదర్శింపఁబడినది.

5. పంచకన్యా పరిణయము:—

ఇందిది బాలకవి కృతమని మాత్రమేకలదు. కాని శాహజీ ప్రశంస యుండుటచే శాహాజీ ఆస్థానకవియగు బాలకవి సుబ్బన్నయే యీగ్రంథమును రచించియుండును. శ్రీకృష్ణుఁ డైదుగురు గోపకన్యలను వలచి, వారు జలక్రీడ లాడుచుండ వస్త్రాపహారణమొనర్చి, తుద వారినిఁ బెండ్లాడుట యిందలి విషయము. రచన యొకతీరుగా నున్నది.

6. శాహామహారాజ కల్యాణము:—

ఇందు కర్తృనామనిర్దేశము లేదుకాని, బాలకవి కృతమగు పంచకన్యా పరిణయమునందు నిందును ఫలశ్రుతి సీసపద్య మొక్కతీరున నుండుటచేఁ బ్రాయికముగా నిదియు బాలకవి సుబ్బన్నకృతమై యుండునని యూహింప నగును.

పురవీధుల స్వారి వెడలిన శాహరాజును జూచి రూపావతియను రాజకన్య మోహించుట, వారి సమాగమము, నిందలి యితివృత్తము. రచన చక్కనిది.

7. వాదజయ కొరవంజి:—

ఇందు కర్తృనామ నిర్దేశములేదు. గ్రంథమంతట శాహరాజు ప్రశంసగలదు. అందుచే నిది తదాస్థాన కవి యెవఁడో రచించియుండు ననుట నిశ్చయము. గ్రంథము నడుమ నొకదరువులో రామకవి పేరొకటి దొరలినది. నివర్తి శేషాచలపతి శాహరాజ విలాస కృత్యవతారికలోఁ దత్సభా ప్రశంసాత్మకమగు పద్యములో "సభాసీనుల్ ప్రవీణుల్ కవుల్ రామాదుల్" అని యున్నది. దీనినిబట్టి శాహజీ యాస్థానమున రామకవి నామధేయుఁ డొకకవి యుండెననుట స్పష్టము. అతఁడే యేతత్ కృతికర్తయై యుండిన నుండ వచ్చును,

ఇందు వాదజయమును లేదు కొరవంజియును లేదు. నాయకుఁడు శాహరాజు. అతనిఁగూర్చిన యొక నాయిక ప్రణయ మిందలి విషయము. రచన చక్కనిదే.

8. శాహేంద్ర చరిత్రము:—

ఇది దర్భా గిరిరాజ కవికృతము. ఇందలి విషయము— శాహరాజు స్వారి వెడలుట, ఒకసానికూఁతు రతనిని మోహించుట, వారి సమాగమము. రచన సరస మైనదే. గ్రంథము యక్షగానమని పేర్కొనఁబడినది.

9. రాజమోహన కొరవంజి:—

ఇదియుఁ బై గిరిరాజకవి కృతమే. ఇది కొరవంజి, అనఁగా ఎఱుకత పాత్రి విశిష్టమైన యక్షగాన ప్రాయరచన. కొరవంజులలో సాధారణముగా నాయికా నాయకుల విప్రలంభము, నాయికకు నెఱుకత ప్రియాసమాగమమును గూర్చి సోదె చెప్పుటయుఁ బ్రధానవిషయములు. అందందుఁ గొరవంజి వేషభాషలు, తిరిగిన దేశములు, కొలిచిన దేవతలు మొదలగునవి ప్రసక్తము లగును. ఈకృతియు నదేతీరుది. ఇందలి నాయకుఁడు శాహరాజు. నాయిక యొకరాజకన్య. రచన చక్కనిది.

10. రాజకన్యా పరిణయము :—

ఇదియు గిరిరాజకృతియే. ఇందుఁ గొరవంజిపాత్రి లేదు కాని కడమకథ యంతయు రాజమోహన కొరవంజిని బోలినదే.

11. వాదజయము :—

ఇదియు గిరిరాజకృతమే. వారవధువు లిరువురకు నాట్యవిద్యానైపుణ్యమును గుఱించి పందెము పడినది. అందొకతె యప్పుడే శాహాజీ మెప్పువడసినది. మఱియొకతె తాను నతని మెప్పించి మరుకేళిఁ గలియుదునని ప్రతిన పట్టినది. అనినంత పనియుఁ జేసినది. ఇది యిందలి విషయము. రచన చక్కనిది. గ్రంథము నాటకమని పేర్కొనఁ బడినది.

12. సర్వాంగ సుందరీ విలాసము :—

ఇదియు గిరిరాజ కవికృతమే. కుంతలేశ్వర కుమారి సర్వాంగ సుందరితో శాహరాజు వివాహమిందలి విషయము. రచన చక్కనిదే. నాటకమని పేర్కొనఁ బడినది.

13. లీలావతీ కల్యాణము :—

ఇదియు గిరిరాజకృతమే. కాని శహాజీ యాస్థానమునకుఁ గాక, అతని తరువాత క్రీ. శ. 1712-1728 సంవత్సరముల నడుమ తంజావూరి నేలిన యతని తమ్ముఁడగు శరభోజి యాస్థానమునకు సంబంధించినది. ఇందలి నాయకుఁడౌ శర భోజియే. రచనలోఁబరిణతియుఁ జాకచక్యమును గన్పట్టుచున్నవి.

మీఁద శహాజీ, తదాస్థానకవుల యక్షగానప్రశు రచనల స్వరూపము దిఙ్మాత్రముగాఁ బ్రదర్శింపఁ బడినది. ఇంచుమించు, ఇవి యన్నియు రంగప్రదర్శన సౌలభ్యము గలవి. యక్షగాన మానాఁడు రచనలోఁ బ్రదర్శన ప్రక్రియలో విశిష్ట పరిణతి నందినట్లా గ్రంథములందలి పాత్రల సంభాషణములలోని వాక్య సరళి, వచన ప్రాచుర్యము, వాడుక నుడికారము, రంగప్రయోగ సూచనలు విశదముఁ చేయుచున్నవి.

ఈ యక్షగానములయందు ఆదేశకాలము లందలి యాచారములు, మనుజుల నడవడి, వారుపయోగించెడి భాష, మొదలైనవి యెఱుంగనగునని ముందటి సంపుటములలోఁ దెలిపియే యున్నాను. అట్టివిషయము లెఱుంగుటకు నిందలి రచనలును బనికివచ్చును.

పైన నుదాహరింపబడిన వానిలో మచ్చునకొక యైదు మాత్రము : శాహజీకృతులు నాలుగు :

1. ద్రౌపదీకల్యాణము,
2. రతికల్యాణము,
3. శచీపురందరము,
4. సతిదానశూరము,

5. అతని యాస్థానకవి యగు బాలకవి సుబ్బన్న కృతియగు పంచకన్యా పరిణయమును బ్రస్తుత మీసంపుట రూపమునఁ బ్రకటింపఁబడినవి. కడమ కృతులును గాలక్రమమున సంపుటములుగాఁ బ్రకటితములు కాఁగలవు.

ఈ ప్రతులకు పాఠనిర్ణయములు చేయుట, ప్రెస్ కాపీలను తయారుచేయుట, ప్రూపులను సరిచూచుట మున్నగువానిలో, మా శాఖలోఁబనిచేయుచున్న చిరంజీవి కె. జోగయ్యశర్మ బి.ఏ.

మిక్కిలిగా నుపకరించుచున్నాఁడనుట ముందటి సంపుటము లలోఁ దెలుపఁబడినది. యక్షగానముల చరిత్రము మొదలయిన వానిలో విశేషకృషిచేసి డాక్టరు పట్టభద్రులై విశ్వవిద్యాల యాంధ్రశాఖలో పనిచేయుచున్న చిరంజీవి యస్వీ. జోగారావు కూడ ఈసంపుట ప్రచురణ విషయమున సాయపడి యుండుట ముదావహము.

విద్వాన్ సోమయాజి.

# ద్రౌపదీకల్యాణము



జయ పార్వతీరమణ – జయ మనోభవహరణా
జయ భుజంగాభరణ – జయ లోకశరణా ।
జయ జాహ్నవీధరణ – జయ జితాంతఃకరణ
జయ సరోరుహాచరణ – జయ జగత్కారణా॥
సకలజగదాధార – సాధితధరాభార
మకరాంకమదహార – మంగళాకార।
వికటరిపుసంహార – విధృతమణిగణహార
సుకృతిజనమందార – శోభనవిహారా॥
సాధుజనపరిపాల – సర్వజ్ఞశుభశీల
బాధితాహితజాల – భక్తానుకూల।
మాధుర్యగుణలోల – మదనభీషణఫాల
క్రోధనిర్జితకాల – గుణగణవిశాల ॥శరణు॥
శరణు శ్రీవసుదేవనందన – శరణు జగదానందన
శరణు చరణానతసనందన – శరణుసురకృతవందనా॥
మధురభాషణ, మహితతోషణ –
మదవిరోధి విశోషణ –

బుధవిభూషణ, భూతపోషణ
భుజబలాహత దూషణా ! ॥౨॥

దివ్యభక్తసమూహసాదర - దేవతామరసోదర
భవ్యసుగుణ సురేంద్రిసోదర - పాపహార దామోదర॥౩॥

మంగళం॥ మహతే దేవేశాయ తే మంగళం - నిత్యం
మందాకినీచూడాయ మంగళం॥
భానుకోటిప్రిభాయ - భక్తసంరక్షకాయ
మానసాతీతాయ - మంగళం ॥౨॥
నిగమాంతవేద్యాయ - నిష్కళంకరూపాయ
మకరధ్వజభంగాయ - మంగళం ॥౩॥
చంద్రావతంసాయ - చతురాననసేవ్యాయ
మందారవాసాయ - మంగళం ॥౪॥

శ్లో॥ లంబోదర స్సర్వవిద్యాలంబో, దరహాసన్ముఖః
బంధురః స్తుత్యసుగుణై ర్బంధు రస్తు భవన్ముదే॥

సూ: అవురా యీవిధంబున విఘ్నేశ్వరప్రార్థన చేసిన యా
తదనంతరంబున మఱియు నేవిధాన నంటే.

శ్లో॥ నృత్యాకారగతైః కరాబ్జవలనై స్తాలాయితైః కంకణ
ప్రిక్వాణైశ్శ్రితాంగతై ర్ముఖవలల్లోలంబమాలారుతైః।
వీణాయా మృదుగీతిభిః పరవశాశ్చాళీజనాఃకుర్వతీ
వాగ్దేవీ, వదనాంబుజే నివసతు శ్రీశాహపృథ్వీపతేః॥

సూ: అవ్వరా యీవిధంబున సరస్వతీదేవిప్రార్థన చేసిన యా
తదనంతరంబున మహావిష్ణువును ప్రార్థన చేసెడిమార్గము.

శ్లో॥ వందే తం దేవదేవం వరసురపటలీహాళిమాణిక్యదీప
శ్రేణీనీరాజితశ్రీచరణసరసిజధ్యానయోగాదిభాజాం।
భక్తానామీప్సితార్థాకలనపటుచతుర్బాహుశోభాంచితశ్రీ
చక్రాబ్జాదిప్రభాభిశ్శమితజగదఘం శాశ్వతం కృష్ణదేవమ్॥

సూ: అవ్వరా యీవిధంబున మహావిష్ణువును ప్రార్థన చేసిన యా
తదనంతరంబునఁ బార్వతీపరమేశ్వర ప్రార్థన సేయు మార్గము.

శ్లో॥ చండస్తాండవకాండశౌండమహిమా శుండాలతుండోన్నమ
చ్చండాదండపిచండభాండవిహారత్కుండల్యఖండశ్రియై।
తండూద్దండిత చండడిండిమముఖో డిండీరపండోద్భ్వామ
త్కాండైర్మండితగండమండలజటాఖండోఽస్తు చండీపతేః॥

సూ. ఈవిధంబున నిష్టదేవతా వందనంబుగావించి తదనంతరం
బున సభానాయకాదుల నభివర్ణించెడు మార్గము.

శ్లో॥ శాహేంద్ర స్సకలానవద్య సుకలాపాండిత్య జాగ్ర ద్యశో
హారాలంకృత దిగ్వధూకుచతటీ కాశ్మీరదంచన్మహాః।
అత్రత్యాః కవయశ్చతుర్విధమహాసాహిత్య నిర్వాహకా
స్స్నేహాంచేద్దశరూపకాభినయధీ పారంగతో రంగతః॥

కైవారము : జయజయాక్రాంత విశ్రాణనరాధేయ, జయ జయ సర్వసజ్జన విధేయ! జయ జయ సుప్రతిజ్ఞాజిత గాధేయ, జయ జయ సుప్రశస్తాభిధేయ, జయ జయ లోక రక్షణ దక్షిణోపాయ! జయజయ శౌర్య తేజస్సహాయ! జయ జయ శృంగారరసాంగప్రాయ! జయ జయ నిర్వ్యాజసత్కృపాయ,! జయ జయ మహాప్రతాప యశస్సమాజ! జయ జయాశ్రితలోకనిర్జరమహీజ! జయ జయైకమహీతలేశ్వరతనూజ! జయజయోదార! భోసల శాహరాజ!

వ॥ అవ్వరా యీవిధంబున సభానాయకవర్ణన చేసిన యాతద నంతరంబున భూరిగుణోదార వేషభాషాదిభూషితంబగు శ్రీశాహమహారాజప్రణీతంబైన ద్రౌపదీ కల్యాణం బనెడు నాటకంబునందుఁ దొలుత విఘ్నేశ్వరప్రార్థన సేయుగా విఘ్నేశ్వరుఁడు వచ్చెడిమార్గము.

ద్వి. పాశాంకుశంబులు సరఁగహస్తముల
భాసురకనకప్రభల్ విలసిల్లఁ
బొసఁగ లంబోదరంబున నాగవితతి
యసమాన కాంతితో నాడుచుండంగ
వలనొప్ప మూషికవాహనంబెక్కి
వెలయ విఘ్నేశుండు వేడ్కతో వెడలె.

ద॥ ముదమునఁ గుండలముల రుచులమరఁగ
నిదె వెడలెను వి - ఘ్నేశ్వరుఁ డిపుడు ॥౧॥

కర్ణతాళములు - గదలఁగ నల్లన
స్వర్ణనిభుఁడు గణ - పతి తగవచ్చెన్ ॥౨॥

మూషికవాహన - ముననొప్పుచు శుభ
వేషుఁడు వెడలెను - విఘ్నేశ్వరుఁడు ॥౩॥

తన లంబోదర - మున ఘణులాడఁగ
ఘనతను వెడలెను - గజముఖుఁడిపుడు ॥౪॥

మోదముతో గణ - ముఖ్యులు గొలువఁగ
మోదకహస్తుఁడు - ముదముగ వెడలెన్ ॥౫॥

సూ॥ ఈవిధమున విఘ్నేశ్వరుఁడు వచ్చిన యా తదనంతరమునఁ గథాసంవిధానం బెవిధాననంటేను. ద్రుపదధరణీ మండలాఖండ లుండు నిత్యకొలువునకు వచ్చుచున్నాఁడని యాస్థానసంతోషి యైన వేత్రికరుండు వచ్చెడు మార్గము.

ద॥ పట్టెనామమును బెట్టి - బరికోల కేలఁబట్టి
దట్టిపైని దుప్పటి గట్టిగాఁగట్టి-జుట్టునిండా పూలు సుట్టి-
మిట్టపండ్ల నెగఁబెట్టి - యట్టహాసముతో
వికటాంగుఁడువచ్చె ॥౧॥

సూ॥ ఎవరోయి నాయఁడా ! నీవెందుండి వచ్చినాఁడవో తెలియఁజెప్పవోయి.

కటికి : వినరోయి భాగవతులార! మా ద్రుపదరాజు కొలువు, నకు వచ్చుచున్నాఁడని డెబ్బదిరెండు విని యోగాలవారి కిని హెచ్చరిక దెలుపవచ్చితినోయి.

సూ. మహాభాగ్యమాయెను. ఆరీతిగానే హెచ్చరికగా నున్నారు. రాజుతోఁజెప్పవోయి పోయి.

సూ.వ. అపు రా యీవిధంబున వేత్రికరునిచేఁ గొలువుకూటంబు శృంగారింపఁబడినవార్త విన్నవాఁడై ద్రుపద ధరణీమండలాఖండలుండు సకలభూషణభూషితుండై తన నిత్యకొలువునకు వచ్చెడి మార్గంబు (పరాకు)

ద. ద్రుపదరాజు వెడలె నిండు కళలమీరు
చెంగల్వరాయని కైవడిని
కనకాంబరము గట్టి – నవలు సిగనుజుట్టి
కినిసి వంకిచేతఁబట్టి – గిలుకుపావలుమెట్టి ॥౧॥

ఘనమైన వాలుగేలఁ – గాంతిమీఱఁగఁజాల
గొనకొని జగమెల్లఁ – గొండాడఁగ నీవేళ ॥౨॥

సూ. ఈవిధంబున ద్రుపదభూపాలశేఖరుండు వచ్చి కొలువునఁ గూర్చుండినవాఁడై వేత్రికరు నవలోకించుచుఁ బలికెడి మార్గంబు. (పరాకు)

రాజు॥ వ॥ ఎవరురా కటికవాఁడ ! మన పురోహితుండైన యయ్యవారినిఁ బిలువరా.

కటి॥ సాహూ మాబాఁగు॥

సూ॥ అప్పురా యీవిధంబున ద్రుపదరాజాజ్ఞావలంబనంబున వేత్రికరుం డవహితుండగుచు హితపురోహితుంబిల్వ నతండమందానంద కలశపారావారవీచీనిచయంబుల నోలలాడుచు రాజసభాంతరము చేరవచ్చెడి మార్గము.

ద॥ పంచాంగముచేతఁ బట్టి - పట్టె వర్ధనము పెట్టి
యొచ్చఁగఁ బురోహితుం - డేతెంచె నిపుడు॥

పురో॥ వ॥ ఎవరురా వాకిట ?

కటి॥ ఏమయ్యా మీరా ? చెప్పి వచ్చుచున్నాను. కూర్చుండుఁడు.

కటి॥ వ। స్వామి, పురోహితబాపఁడు వచ్చినాఁడు.

రాజు॥వ॥ ఓరి, తోడుకొని రారా.

కటి॥వ॥ ఎవరయ్యా పురోహితులు ? పోవోయి రాజు పిలుస్తున్నాఁడు.

సూ. వ: ఈవిధంబున వచ్చిన హితపురోహితు చరణారవిందంబులకు వందనం బాచరించి రాజపలికెడి మార్గము(పరాకు)

రాజ॥ ద్వి. వినవయ్య నామాట విప్రవరేణ్య
వనజాక్షి ద్రౌపది వైఖరిచూడ
నలినారి కళఁబోలె నానాట నిండు
కళలఁ జెన్నొందెఁ జక్కని జవ్వనంబు
హెచ్చుగు కల్యాణ మింకఁజేయకున్న
వచ్చు దుష్కీర్తి భూపతులలోఁ జాల
పూనిక జనుల కద్భుతమైన యంత్రి
మీనంబు నేసిన మేటికిఁ దనయ
నిచ్చెదనంటినే నిది నాప్రతిజ్ఞ
లొచ్చుగాకుండ నాలోచనచేసి
కరుణించి నాపైని ఘనులు నుతింప
వెరవిదియని తెల్పు వివరంబుగాను.

సూ॥ వ. ఈవిధంబునఁ బలికిన ద్రుపద ధరణీమండలా ఖండలు నవలోకించి హితపురోహితుఁడు పలికెడు మార్గము (పరాకు)

ఉ॥ ధీరుఁడ వీవుచేసిన ప్రతిజ్ఞ వృథాచను నెట్లు నెయ్యమిం
పారఁగ యంత్రభాసిత పయశ్చరమున్ దెగఁద్రుంచునట్టి ధా
త్రీరమణుండు ద్రౌపది వరించు నిజంబు స్వయంవరార్థమై
యారసి రాజులన్ బిలువనంపుము పెంపుఘటింపు భూవరా.

సూ. అవురా యీవిధంబున హితపురోహితుభాషణంబు లాక ర్ణించి ద్రుపదభూపురందరుండు తన నందనుండగు ధృష్ట ద్యుమ్నునిఁ బిలువఁబంచిన, నపుడు ధృష్టద్యుమ్నుండు వచ్చెడి మార్గము (పరాకు)

ప॥ వింతఠీవిగ వెడలె - ద్రుపద తనయుఁడు
వింతఠీవిగ వెడలె॥
కంతు జయంత వసంతుల మించిన చక్కఁదనముకోన॥

తోడవులు మెఱయ నిరు-గడలభటులుగొల్వఁ
డడయక వజ్రాల - గొడుగుల నీడను॥ విం॥

సూ. వ. ఈవిధంబున వచ్చిన నిజనందనుండగు ధృష్టద్యుమ్ను నిఁ గనుఁగొని ద్రుపదధరణీమండలాఖండలుండు పలి కెడి మార్గము

ద్రు.వ. వినవోయి కుమార కంఠీరవ ధృష్టద్యుమ్న, మనద్రౌపదీ కన్యకకు స్వయంవరప్రకారంబుగా వివాహంబు గావింపఁ దలఁచినాము. తలవరులను బిలిపించి పట్టణము శృంగా రింపుఁడనియు సకలదేశాధిపతులను స్వయంవరమునకు రండని చాటింపుఁడనియుఁ జెప్పవోయి.

ధృష్ట.వ. స్వామి, మహాభాగ్యము ఎవరురా కటికవాఁడా ! తలవరులను బిలువురా.

సూ.వ. అవురా యీవిధంబున ధృష్టద్యుమ్నుని వాక్యంబు లాకర్ణించి వేత్రికయుండు తలవరులను బిలువఁగా నప్పుడు తలవరులు రాజసముఖానకు వచ్చెడిమార్గము

ద. అరిగెలఁ గత్తులును పిస్తూను - మెఱయు తుపాకులును గరములఁ బూనుకొని తల - వరు లరుదెంచిరి కడు వింతగను।

తలవ.వ. ఆడెకుత్తును తీత్తాను నగరివాకిటనేమో పిలువమన్నా రఁట బోదాము రారా.

ప్రత్యుత్తరం. ఆనాల్ పోవోం వారుంగళ్

తలవ.వ. అదెవట్టా వాకిట ? మేము తలవరులము వచ్చినామని ద్వారవారికిఁ జెప్పరా.

క. స్వామీ, తలారులు వచ్చినారు.

ధృష్ట. పిలువురా

తలవ.వ స్వామీ, దండాలు దండాలు

ధృష్ట. వినరోయి తలవరులారా! ద్రౌపదీకన్యకకు కళ్యాణము కానున్నది. పట్టణము శృంగారించి చప్పన్న దేశాధీశ్వరులను స్వయంవర మహోత్సవమునకు రమ్మనరోయి.

తలవ.వ: మాబాగు

సూ.వ. అవురా యీవిధంబున ధృష్టద్యుమ్నుని వాక్యంబులు శిరసావహించినవారలై తలవరులు పట్టణము శృంగారింపుఁడని చాటించెడి మార్గము

ద. ముత్యాల హారతులు తేరె – ముత్తైదువలార !
నిత్యతోరణా లెత్తరోయి – నీటుగా మానవులార ॥౧॥
కదళికంబములు నిలుపరోయి – ఘనకాపులార
ముదమునఁ బన్నీరుచల్లరె – మోహనాంగులార మీరు॥ ౨॥
అంగళ్లు శృంగారింపరోయి – యతివర్తకులార ॥
సంగీత మేళములతో రారె – రంగుగ నోవేశ్యలార ॥3॥

తలవ. అంగ,వంగ,కళింగ,కాశ్మీర,కాంభోజ,మాళవ, నేపాళ సౌరాష్ట్రం బాదిగాఁగలయేఁబదియారు దేశాధీశ్వరు లును స్వయంవరమహోత్సవంబునకుఁ దమతమ పరివార సహితులై సాగివచ్చెదోహో।

సూ.వ. అప్పురా యీవిధంబునఁ దలవరులు పట్టణము శృంగా రింపుఁడని చాటించినవారలై స్వయంవర మహోత్సవం బునకు అంగ, వంగ, కళింగ కుకురు, కురు, కొంకణ, టెంకణ, కేరళ, గౌళ, కుంతల, కాశీ, కాశ్మీర, కాం భోజ, కిరాత, కేకయ. ఘూర్జర, త్రిగర్త, యనెడి సర్వ సర్వంసహా మండలాధీశ్వరుల రండనిచాటింప సవ్వచ నంబులు భూనభోంతరంబు పిక్కటిల్లినఁ దొలుత మగధ దేశాధీశ్వరుండు వచ్చెడిమార్గము.

ద. పొగసైన కిరీటము – నిగనిగ నీటుదేర
మగధేశుండు వెడలె – మదగజముపై నెక్కి
(కటిక ముఖాంతరం)

సూ.వ. ఈవిధంబున మగధదేశాధీశ్వరుండు వచ్చిన యాం తద
నంతరంబున మాళవదేశాధిపతి వచ్చెడి మార్గము.

ద. చాలభటులుగొల్వ - వాలుకేలనుబూని
మాళవేంద్రుఁడు వెడలె - మేలైన రథమునెక్కి॥

సూ. అవురా యీవిధంబున మాళవేంద్రుఁడు వచ్చిన యా
తదనంతరంబున లాటదేశాధీశ్వరుండు వచ్చెమార్గము.

ద. మేటివిల్లు చేఁబూని - నీటుగ సేనలుగొల్వ
లాటాధీశుండువెడలె - సాటిలేక యీవేళ॥

సూ.వ. అవురా యీవిధంబున లాటదేశాధీశ్వరుండు వచ్చిన
యాతదనంతరంబున సింధుదేశాధీశ్వరుండు వచ్చెడి
మార్గము.

ద. తేజముమీర రాజిల్లు - నేజము చేతఁబూని
తేజినెక్కి యాసింధు - దేశాధీశుండు వెడలె॥

సూ.వ. అవురా యీవిధంబున సకలదేశాధీశ్వరులు వచ్చిన
యా తదనంతరంబున సుందరవదనారవిందమందస్మితుం
డును, సంక్రందనాది బృందారకబృందవందితుండును,
నందనందనుండగు గోవిందుండు నీలాంబరధరసమేతుండై
స్వయంవర మహోత్సవము చూడవచ్చెడి మార్గము.
(పరాకు)

ద. వచ్చెశౌరి వేడ్క వచ్చెశౌరి।
మెఱపులరాజిల్లు నీల - మేఘమువలె వడి నిండు
మెఱుఁగు బంగరుదుప్పటి - మేననుసొంపు దేర॥
మొలకనవ్వులు నెమ్మో - మునఁ దళుక్కొత్త
బలరామునితోఁగూడి - చెలువుమీఱ నీవేళ॥

సూ.వ. ఇట్లెఱింగునఁ జిత్తజగురుండు వచ్చిన తదనంతరంబున దుశ్శాసన దుర్ముఖ దుర్ధర్షణ జలంధర ప్రముఖులైన యనుజశతంబును, కర్ణాశ్వత్థామ సోమదత్త భూరిశ్రవ ప్రముఖసేనాదులగు బాంధవస్నేహితులనుగూడి సుయోధనుండగు సుయోధనుండు వచ్చెడిమార్గము (పరాకు)

ద. వింతగ వెడలెఁ దమ్ములఁగూడి - వింతగ వెడలె।
అర్యమ తేజుం డద్రిధైర్యుండు సింధు
గాంభీర్యుండు నిరుపమ - శౌర్యుండు భూవర
వర్యుండు విమత - వార్యుండు చంచల
కార్యుండు ఘూనసుయోధనుండు॥ ॥౧॥

సూ॥ అప్పు డీవిధంబున సుయోధనుండు వచ్చిన తదనంతరంబున నేకచక్రపురంబుననున్న విప్రవర్యులు సబంధుమిత్రకళత్ర పుత్రపౌత్ర దౌహిత్రులై ధనకనకవస్తువాహనాపేక్ష నరుదేర వారలచేఁ దద్వృత్తాంతం బెఱింగి శుండాదండమండితశౌండ వేదండంబుల చందంబున

బాహుదండంబులఁ బలాశదండంబులు మెఱయ, బాల మార్తాండ సన్నిభ తేజోమండలంబు దిఙ్మండలంబు గప్పుకొన భండన కేసరులగు పాండవాగ్రేసరులు స్వా యంవరమహోత్సవంబునకు వచ్చెడిమార్గము.

ద. నిండుహొయలుగా వచ్చిరిపుడు ॥నిండు॥
నిండుహొయలుగ భుజ – దండముల వింతవింత
దండము లుల్లసిల్ల వే – దండశౌండమున ॥౧॥
భాషణములఁ దగిన – భూషణములను బటు
వేషము లుట్టిపడ సంతోషమునఁ బాండవులు ॥ ౨॥

సూ॥ అపురా యీవిధంబున సర్వసర్వంసహా మండలాధీశ్వ రులు నొండొరులు నిండారు బంగారుకొండల చందం బునఁ దమతమ వస్తువాహనభూషణాదులు దిగంతం బుల నితాంతంబు మెఱయ, నొడ్డోలగంబుగాఁ బాల సముద్రంబు వెల్లివిరిసిన చందంబున, రెండవకుసుమ కోదండుని చందంబున సుఖాసీనులైయుండు సమయం బున, ద్రుపద ధరణీమండలాఖండలుండు శిష్టపరిపాలనుం డగు ధృష్టద్యుమ్నునిఁ గనుంగొని పలికెడిమార్గము.

రాజు:-వ. వినవోయి కుమారకంఠీరవ, సకలదేశాధీశ్వరులును వచ్చినారుగదా! స్వయంవర మంటపాంతరంబునకు ద్రౌపదికన్యకామణినిఁ దోడుకొనిరావోయి.

ధృష్ట:-వ. మహాభాగ్యము స్వామి!

వచ. అప్పురా యీవిధంబున జనకవచనప్రకారంబుగా ధృష్ట ద్యుమ్నుండు పెగ్గడికత్తెలను ద్రౌపదీకన్యను దోడి తెం డన్నఁ గమలసంభవు కల్పనాచాతురీవిధంబునఁ గందర్ప జగన్మోహనవిద్య మూర్తిభవించిన చందంబునఁ, దళుకు తెళుక్కన మెఱయు తొలకరిమెఱుపు నిలకడై నిలిచిన పొలుపున, నంగజప్రతాపానలంబు పొంగారి రంగారు శృంగారరసంబు ఘనీభవించినచందంబున నంగము లిందీవరశ్యామల కోమలంబులై చెలువార, ద్రౌపదీకన్య స్వయంవరమంటపాంతరంబు చేరవచ్చెడు మార్గము (పరాకు)

ద్వి. చిత్తజు మదదంతి చెలువమేల్బంతి
పుత్తడిబొమ్మ పెంపొందు పూరెమ్మ
కలహంసయాన సత్కళలందు జాణ
యలినీలవేణి మేలైనపూఁబోణి
తళుకు వెన్నెలమిన్న ద్రౌపదీకన్య
చెలువలు గొలువంగఁ జెలువొంద వెడలె॥

పా. ఒయ్యారమున వెడలెఁ - దియ్యవిల్తుశరమనఁ
దొయ్యలులందఱుగొల్వ - నెయ్యమున ద్రౌపదీకన్య ॥౧॥
రాజిల్లురూపున వల - రాజు మోహముఁజెందంగ
రాజహంసనడలను - రాజబింబానన వేగ ॥౨॥
సన్నని పయ్యెదలోనఁ - జిన్ని చన్నులు చెలఁగఁ
బున్నమచందురు సరిఁ - బోలుమోము వెలుగంగ ॥3॥

సూ. అవ్వురా యీవిధంబున వచ్చు ద్రౌపదీసుందరి సౌంద
ర్యాతిశయంబు గనుఁగొని సకలదేశాధీశ్వరులు కుసుమ
శరాయుధనిమగ్నులై మోహవిభ్రాంతులై యక్కల
కంఠకంఠి రూపరేఖావిలాసంబులు వర్ణించెడి మార్గము.

ద. కలయఁబర్వినయురులు ఈ-కమలాయతాక్షి ముంగురులు
విదియచందురు రేఖఁగేరు నీ-విరిబోఁణినిటలంబుతీరు ॥౨॥
లచ్చికొమరువింటిరమలు ఈ-లలనామణికనుబొమలు ॥౩॥
కొదమతెల్లజైత్రమ్ములు ఈ-కోకిలవాణినేత్రమ్ములు ॥౪॥
చంపకముకుళవిభాస యీ - చక్కనిసుందరినాస ॥౫॥
నిక్కము చక్కెరతీవి యీ-చక్కెరబొమ్మకెమ్మోవి ॥౬॥
పున్నమచందురుగోము ఈ-పూఁబోఁణిముద్దునెమ్మోము ॥౭॥
లక్కనముల మంగళము ఈ-చొక్కపువగలాడిగళము ॥౮॥
కెంజిగురాకులగములు ఈ-కుంజరగమనకరములు ॥౯॥
చెలువైన గజనిమ్మపండ్లు ఈ-కులుకులాడి పాలిండ్లు ॥౧౦॥
హరిపాదగర్వమునిడుము ఈ-యంగనామణిచిన్నినడుము ॥౧౧॥
సురనాథలీలలతీరు ఈ - సొగసుకత్తె నూగారు ॥౧౨॥
సైకతముల లలామ ఈ - జవ్వని వరకటిసీమ ॥౧౩॥
అరఁటి కంబములతొడలు ఈ-యరుదైనచాన పెందొడలు
మేలైన తమ్మిభేసమ్ములు ఈ-మెఱుఁగుఁబోడిపాదమ్ములు
పోలఁతిఁ బొందనివాఁడేపాటి దీనిఁ-బొందినవాఁడె కిరీటి.

సూ॥ ఇట్లయంగున సర్వసర్వంసహా మండలాధీశ్వరులు సర్వాంగ సుందరియగు ద్రౌపదీకన్యరూపరేఖావిలాసంబులు వర్ణించుచుండు సమయంబున ద్రౌపదీకన్య తండ్రిసన్నిధిఁజేరి వందనంబాచరించినఁ జూచి యాశీర్వదించి పలికెడి మార్గము॥

రాజు॥వ. అభీష్టసిద్ధిరస్తు, రావేయమ్మ కూర్చుండవే.

సూ. అవురా యీవిధంబున ద్రౌపదీకన్యవచ్చిన దుృపద ధరణీమండలాఖండలుండు ఆశీర్వదించి కూర్చుండఁ బెట్టుకొని తన నందనుండగు ధృష్టద్యుమ్నునిఁ గనుఁగొని పలికెడిమార్గము.

ద్రుప. వినవోయి నందనాగ్రణి, సకలదేశాధీశ్వరులు వచ్చినారే వారల వృత్తాంతంబు నామధేయ పూర్వకంబుగాఁ బలుకవోయి

ధృష్ట.వ. మహాభాగ్యము

సూ. అవురా యీవిధంబున ధృష్టద్యుమ్నుండు ద్రుపద ధరణీ మండలాఖండలుని యాజ్ఞవలన ద్రౌపదీకన్యకామణికి సకలదేశాధీశ్వరులను, వేఱువేఱ వారలవృత్తాంతంబును దెలియఁబలికెడి మార్గము.

ద. తరుణిరో చూడవమ్మ స్వయం - వరమునకై యిందు
నచ్చిన నృపులను.
ఇతఁడు నందనందనుం - డితఁడు నీలాంబరుఁ
డితఁడు సాత్యకి రతి - సుతుఁడితఁడు।
ఇతఁడు దుర్యోధనుం - డితఁడు దుశ్శాసనుం
డితఁడు జలంధరుం - డితఁడు॥ ॥౧॥

అతండు భూరిశ్రవుం - డతండు జరాసంధుం
డతండు శిశుపాలుం డతఁడు।
అతఁడు రాధాసుతుం - డతండు శ్రుతసేనుం
డతండు వికర్ణుఁ - డతండు సైంధవుండు॥ ॥౨॥

వీరు శూరసేనులు - వారు కోసలేశులు
వీరు లాట విరాట కేరళులు ।
వారు కాశ్మీర సౌ - వీర పుళింద గం
భీర ధరణీశులు - పేరుకెక్కినవారు ॥౩॥

వూ. ఇత్తెఱంగున ధృష్టద్యుమ్న ముఖాంతర విదిత సర్వసర్వం సహాధీశ నామధేయమై యాద్రౌపదీకన్య తండ్రి యభేద్య ప్రతిజ్ఞ నిర్విఘ్నంబుగా నెఱవేఱవలెనని, తనకు సుందర రేఖాతిశయంబుల మించిన మంచి పురుషుండు గావలెననియు, డెందంబున నియమించి యిందుశకలధరు నిల్లాలగు గౌరి పాదారవింద యుగళంబులకుఁ బూజఁ జేయు మార్గంబు. (పరాకు)

ప. దయసేయవమ్మ గౌరి – దయసేయవమ్మ।

మల్లెలఁబూజించెద – మంచిపురుషుండుగలుగ ॥౧॥

జాజులఁబూజించెదఁ – జక్కనిమగండుగలుగ ॥౨॥

తొగలఁబూజించెదను – సొగసైనపెనిమిటిగలుగ ॥౩॥

తమ్మిలఁబూజించెదను – దగినకాంతుఁడుగలుగ ॥౪॥

బంగరుపూలఁబూజింతు – బాగైనవానిఁబెండ్లాడ ॥౫॥

సూ. ఈవిధంబున ద్రౌపదీకన్య గౌరిపూజలొనర్చిసర్వమంగళకు మంగళహారతు లెత్తెడి మార్గము.

ప. బాలకును బాలేందు – ఫాలకును భక్తజన
పాలకును బర్వతీ – బాలికకును ।
కాళికిని గతిజిత మ – రాళికిని కచతర్జి
తాళికిని ముదితశివ తేజికిని॥జయమంగళం శుభమంగళం॥
అంబకును ముక్తావలంబకును అమృతధర-బింబకును
మధ్యవిజితాంబకకును।
కంబుకలకంఠికిని – అంబుజనేత్రకును
శంబరారి జీవన దాం – బికకును ॥జయమంగళం॥
చండికకుఁ గుముదాప్త – చండతర నేత్రికును
దండితోన్మత్తారి మాండలకును ।
చండ త్యాగవైద్య పరిచండ కాంతకును – (?)
చండికాసుర ముండ ఖండనకును ॥జయమంగళం॥

సూ॥ ఇత్తెఱంగున( బంచాస్యమధ్యయగు పాంచాలి గౌ
పూజ లొనర్చు సమయంబున సర్వరాజలోక పాకశాస
నుండగు దు్రుపదభూనేత సుతుడగు ధృష్టద్యుమ్నుని
గనుంగొని పలికెడి మార్గము.

రాజు. వ. వినవోయి దృష్టద్యుమ్న, సకలదేశాధీశ్వరులు వచ్చి
యున్నారె ! వారలకు మనప్రతిజ్ఞ తెలిపి యంత్రి
మత్స్యము దుంచి యీకన్యకామణిని గైకొమ్మని
స్వయంవరము చాటింపవోయి.

ధృష్ట॥ వ॥ స్వామీ ! మహాభాగ్యము.

సూ. ఇత్తెఱంగున( దండ్రి వాక్యంబు లాకర్ణించి జలధర గర్జి
తాధిక గాంభీర్యభాషణంబుల సకలరాజులను జూచి
దృష్టద్యుమ్నుడు జనకుని ప్రతిన తెలిపెడి మార్గము.

డ. మగువను జేకొనరోయి యీయంత్ర - మత్స్యము తెగ
నేయరోయి॥

సారభూషణులార మేలైన - సత్యభాషణులార ।
నీరధితుల్యగభీరులార - పేరుకెక్కిన హంవీరులార
ధీరులార ! శూరులార ॥ ౧ ॥

హరభక్తులారా ! తగిన - హరిభక్తులార !
బిరుదు కెక్కిన రణ - భీకరులార ।
మురువైన మేటి కా - ర్ముక ధరులార
దొరలార భూ - వరులార ॥ ౨ ॥

మనసున దిటవుంచరోయి మీనిజ -
మానముల నెంచరోయి।
దినదిన నవ్యకీర్తి ధనులార - ధనవంతులార ! సుందర
తనులార !
ఘనులార ! జనులార ॥3॥

వూ. అప్పురా యీవిధంబున సర్వసర్వంసహా మండలాధీశ్వ
రులు ధృష్టద్యుమ్ను ముఖాంతరంబుగా స్వయంవర
వివరంబు దెలిసిన సకలరాజాధిరాజులు గుమిగూడి
యంత్రమత్స్యసమీపమునకు వెడలి వచ్చెడిమార్గము.

ద. వెడలిరిపుడు రాజులు వెడలి రిపుడు।
వెడలి రిపుడు పుడమిపతు లిరు
గడల ముత్తెపు - గొడుగుల లరఁగ
కడిమి భుజబల - గర్వములతోఁ
దడయకను యం - త్రమత్స్యమే యంగ ॥~॥
లాటభోట మరాట - విరాట నాథులు
మేటిగా ముమ్మాటికిని-సాటిలేదని మాటలాడుచు ॥౨॥

వూ॥ అవురా యీవిధంబున మేరుమందర చందంబగు కోదం
డం బుపలక్షించి గగనంబున యంత్ర పయశ్చరంబు
నేత్రంబులకగోచరంబై జలప్రతిఫలిత ఛాయారేఖయై
పరివర్తించినఁ గని తలలూఁచి నివ్వెఱఁగంది తమలోఁ
దాము పలికెడి మార్గము (పరాకు)

ద॥ ఇందు కేల వచ్చితిమి॥

సీట నున్నది నింగినిఁగానము - మాటలేల కన్న డేశా।
నూటిగఁ జూడుము - చూడ్కికిఁ గానము
ఏటివిచిత్రమో యేటిచోద్యమొ - యేల వచ్చితిమి॥౧॥

చుక్కల దాఁగిన - రక్కసులను గని
యొక్కశరమ్మున - నుక్కణంతు ॥
చక్కఁగనే రెండుజాములు చూచిన -
నెక్కడఁగాన మేమనఁబోయే ॥యేల॥ ॥౨॥

చూచిచూచి నా - లోచన యుగమిఁక:
గాచి యున్నది - కపటమత్స్యముస ।
ఏచి పద్మభవుఁడెత్తిన కల్పనో -
యా చక్రియుధుఁడంచిన మాయో లేక ॥3॥

వూ. ఈవిధంబునఁ బునఃపునః పరీక్షాదిదృక్షులై యంత్రి మత్స్యంబుఁ గననేరక భూమండలంబునఁ గుండలేంద్రు చందంబున నుండు కోదండం బుపలక్షించి నృపతులు బాహుదండముల నెక్కిడుమార్గము. (సాములు సాధన చేసికొనేది)

వూ. ఈవిధంబున విల్లు గదలింపలేక చాలా చింతాయుక్తులై రాజులు తమలోఁదాము పలికెడిమార్గము.
దరువు.

ద॥ కనుగాన కిటువచ్చినది గౌరవమె మగధ
తనరు యంత్రమత్స్యమేయ-ధాతతరమె॥ ॥౧॥
మనకుబటాక విల్లిదే - మంచు నీవు లాట
ముసుకొని భోజుని వల్ల - మోసపోయేవు॥ ॥౨॥
వెనరున నీవుపలికేది - నిలువరమె గౌళ॥
ఘన ధనువెత్తెద ననేది - కలువరమె॥ ॥౩॥
ముందుగాఁ దెలియక నేను - మోసపోతిఁ బాండ్య
యిందేల వచ్చితి శౌర్య - మేల్ర్బాఁతి॥ ॥౪॥
కినిసి పూనరాదు జరి - గేది మేలు భోజ
చనవున ద్రౌపది గొడవ - చాలుఁజాలు॥ ॥౫॥

సూ. ఇత్తెఱఁగున ధనువు నెక్కు-వెట్టఁ జాలక చిత్తరువుల విధంబున నృపతులు దద్దరిల్లి తిరుగుడుపడినఁ గనుఁగొని ద్రుపదభూపాలుఁడు ప్రతిజ్ఞాభంగ చింతానిమగ్నుఁడై హిత పురోహితు నవలోకించి పలికెడి మార్గము॥

ద॥ ఎందుకీ ప్రతిజ్ఞ సేసితి మందుఁడనై భూసుర।
ముందుగా నింతైనఁ దెలియక - మోసపోయితి ॥౧॥
తిన్నఁగా యంత్రమును నేసే - మన్నవారిపుడు
చిన్నవోయియున్నారు సిగ్గులు - చెంది వీరు ॥౨॥
ఎన్నఁటికి నీకన్యకకుఁ బెం - డ్లేను జేతును భూసుర
యెన్నరాని విచారమాయె - నేమిసేతు ॥౩॥

వూ. ఈవిధంబునఁ జింతానిమగ్నమానసుండైన ద్రుపదరాజు
దీనాలాపంబులు విని విప్రసమూహంబున నుండు
మాయా విప్రుండైన సంక్రందన నందనుండు సమీర
కుమారునిఁ గనుగొని పలికెడు మార్గము.

ప. దొరలు దాతలు బిరుదుగల భూ
వరులు మన కురువంశ్యులందఱు ।
దురము నేరని యంత్రమత్స్యముఁ ద్రుంతునన్న॥

భీమ. కలయ దాయాదులును సామంతులును జూడ
నీ యంత్రమత్స్యము ।
నెలమిఁ ద్రుంపఁగ నరుని కనుజ్ఞ యీయవన్న ॥౨॥

సూ. ధర్మరాజు పలుకు మార్గము.
నరశిరోమణి మనము లేమిని
తిరిపెమెత్తేవారలకు నీ । బిరుదులేలను
కన్యలేలను బీరమేల॥

భీమ: పెద్దయని నినునమ్మి రాజ్యము–పేరునూరును గోలుపోతిమి
వద్దు విడువము మనము శూరులు – వరులమున్న ॥౪॥

ధర్మ॥ తరముగాదిది దురము నెవరికిఁ
తమ్ముల్లారా [illegible] బలిమిఁ గోలదికఁ ।
జెల్లుత్తల్లని పలికితిని బెంపున
సరసులార ॥౫॥

సూ॥ అవురా యీవిధంబున మాయావిప్రుండైన సంక్రందన నందనుండు అన్నలయనుమతిఁ గైకొన్నవాఁడై యా బ్రాహ్మణసమూహ మధ్యంబుననుండి వెలువడి వచ్చి ద్రుపదరాజును జూచి పలికెడి మార్గము॥ (పరాకు)

ద॥ యంత్రమత్స్యమును ద్రుంచెదను ద్రుపదభూపాల ।
మాటల వల్ల నేమి నీటఁ గనిపించు
వాటంపు ఛాయ గుఱుతుపట్టి - రేయి
గాటంపుఁ జీకటిని - గబళము దెచ్చిచేయి
నోటికిచ్చిన జాతి గట్టి - నేను ఈ
సాటిలేని ధనువుఁ బట్టి - నిమిషమున నీ
మేటిరాజుల తల మెట్టి - యీవేళ ॥౧॥

సూ.వ. అవురా యీవిధంబునఁ బలికిన మాయావిప్రుని వాక్యంబులు విని యాబ్రాహ్మణసమూహము తమలో నొకనికి శౌర్యంబొదవెనని సంతోషభరితాంతరంగులై పంచె లెగుసవేసి పలికెడి మార్గము.

వసువు॥ మంచి మంచి వింతగంటిరా పెద్దిభట్లు
మించిపోయీని చూడ [illegible]
మంచిగాని తోడివాఁడురా । షిఁ [illegible]
మత్స్యమేము వచ్చినాఁడురా ॥౧॥

పిల్లజుట్లు చుట్టికట్టిరా - యెఱ్ఱంభట్లు
పిల్లకాయ యెంత దిట్టరా - మంచి
వెల్లపంచె మొలను జుట్టెరా - సాహసము
వీని కెటువలెను బుట్టెరా ॥౨॥

కుప్పాభట్లు తిప్పాభట్లు ఈ - పిన్నవాని
కోర్కెలీడేరఁ జూడుఁడీ ।
యప్పనభట్లు వారినిఁగూడి తథాస్తనుచు
నాశీర్వాదములు సేయుఁడీ ॥3॥

మా॥వ॥ అవురా యీ విధంబునఁ బలికిన బ్రాహ్మణుల వాక్యం బులు విని దుర్యోధనాదులు మాయావిప్రునిఁ జూచి పరియాచకంబుగాఁ బలికెడి మార్గము.

ద్వి. వింటిరే యీమాట వేగఁ దానొక్క
బంటువలెనె గోచి బాపఁడు వచ్చి
నరులకు సురలకు నాగ కిన్నరుల
కరుదైనయట్టి యీ యంత్రమత్స్యమును
దుంచెద నని మించి తుళ్ళుచున్నాఁడు
పంచాంగమును సైనఁ బఠియింపలేఁడు
సుందరీ మణి రూపుచూచి వెఱ్ఱెత్తి
మందుఁడై మోహనిమగ్నుఁడై వీఁడు
ఏమేమొ పలికీని యిప్పుడు వీని
బూమెలు చూతాము భూపాలులార॥

సూ. వ. అవురా యీవిధంబున నీరీతి రాజులు బరియాచకం
బులు సేయఁగా విని మాయావిప్రుఁడు యంత్రిమ
త్స్యము ద్రుంచెదనని పలికెడి మార్గము.

దరు॥ కరలాఘవముఁ జూడు నేఁడు – ద్రుపదభూపాల
కరలాఘవముఁ జూడు – ఘనులెల్లఁ బొగడ, వేడు
కరయ మిక్కిలి చిన్నవాఁడు –
హరుని విల్లువిఱిచినా రామచంద్రుని జోడునై నేనిప్పుడు
బిరుదు విల్లిదె నాతోడు – మెచ్చనినాఁడు ॥౧॥

దొరలు సిగ్గులఁ గుంద – సురవరులచ్చెరు వంద
నెఱయఁ గీర్తులు పొలుపొంద – నీమనము సరిలేని
వేడుకపొంద !
నీప్రతిజ్ఞ ధరణిమిగులఁ జెన్నొందఁ–జేతు జయమంద॥ ౨॥

సూ.వ. అవురా యీవిధంబునఁ బలికిన మాయావిప్రుఁడు
ధనువు నెక్కుపెట్టి యంత్రిమత్స్యంబు ద్రుంచెడి
మార్గము. (యంత్రమత్స్యమును ద్రుంచేది)

బ్రాహ్మణుల వచనం॥ వినవోయి ద్రుపదభూపాలకా! నీ ప్రతిజ్ఞ
ప్రకారముగా మాచిన్నవాఁడు యంత్రమత్స్యమును
ద్రుంచెనే. ఇఁకను గన్య నిక్కడ నుంచఁదగినది లేదు.
మా వెంబడి నంపించుమా.

సూ.వ. అవురా యీావిధంబున మాయావిప్రుల వాక్యంబులు విని, ద్రుపదభూపాలుండు తన కుమారికామణియైన ద్రౌపదీదేవికి బుద్ధిసెప్పి యంపించెడి మార్గము.

వ. పోయి రానమ్మా - మాయమ్మా పోయిరానమ్మా ।
అత్తమామలపట్ల - బత్తితో నడువుమీా
చిత్తమున నింత - చింతనొందకు మీా ॥౧॥

పతిదే దైవమని - భావింపుమీా చాల
హితవుగ నడువుమీా - చతురతనుండుమీా ॥౨॥

పురుషునితోఁ గూడి - పుత్రులఁ గనుఁగొని
వరుసతో వేయేండ్లు - వర్ధిల్లి యుండుమీా ॥3॥

సూ.వ.అవురా యీావిధంబున ద్రుపదభూపాలుండు కుమారికామణికి బుద్ధిసెప్పి మాయా విప్రులవెంబడి నంపించెఁ గనుక వారు ద్రౌపదిని దోడ్కొని యేకచక్ర పురమునకు వచ్చెడి మార్గము.

ద॥ మాయావిప్రులు వెడలిరి వింతవింతగ
మాయావిప్రులు వెడలిరి॥
మాసినకట్టాణి - ముత్యము తెఱఁగున
భాసురాంగి ద్రౌపది - పాయక వెంటరాఁగా॥

సూ॥ అవురా యీవిధంబున మాయావిప్రులు ద్రౌపదీదేవిని దోడ్కొనిపోవు నవసరంబున దుర్యోధనాదులు తమ వంటి దొరలంతా యుండఁగాను ద్రుపదభూపాలుండు తమ కుమారికామణిని మాయావిప్రుల కియ్యవచ్చునా యని యుద్ధసన్నద్ధులై ద్రుపదభూపాలునిఁజూచి పలికెడు మార్గము.

ద. కొండలపై వడి - నుండెడి ధరణీ
మండలేంద్రుల యంత్ర - మత్స్యమున।
బెండువలెఁ జేసితి - కండగర్వమున
భండనమున నిన్ను - దండింతుము ద్రుపద ॥౧॥

ద్రుప॥ద॥ దొరబిడ్డలమని - బిరుదులు పాటించి
మెఱుఁగులీనెడి యంత్ర - మత్స్యంబు।
గుఱుతుగ నేయక - కొంకితలలు వంచి
వెఱచి పాఱితిమిమ్ము - దురమునఁ దుసిమెద ॥౨॥

సూ.వ. అవురా యీవిధంబున దుర్యోధనాదులును ద్రుపద భూపాలుండును యుద్ధముసేయుసమయంబున మాయా విప్రుండైన యర్జునుండు తమ యన్నదమ్ములఁ జూచి పలికెడిమార్గము॥

అర్జు॥వ॥ వినవయ్యా యన్న దుర్యోధనాదులు ద్రుపద భూపాలునితో యుద్ధము సేయుచున్నారు. ద్రుపదభూపాలు

నకు సహాయముగా నేను పోయి శత్రుపలాయనము చేయించి వచ్చుచున్నాను. అంతపర్యంతము మీరొక ప్రదేశంబున నుండుఁడు.

ధర్మ॥వ॥ వినవోయి యర్జున, వారిగోడవ మన కేల? మనము కన్యకామణినిఁ దోడ్కొని పోవుదము రావోయి.

అర్జు॥వ॥ వినవయ్యా యన్నా! క్షణమాత్రము వేడుకచూచుచు నుండుఁడు. నేనును భీమసేనుఁడును బోయి వచ్చెదము.

సూ॥వ॥ అవురా యీవిధంబున నర్జున భీమసేనులు ద్రుపద భూపాలునితో యుద్ధముసేయు దుర్యోధనాదులవద్దకు వచ్చి ధిక్కరించి పలికెడిమార్గము.

ద్వి॥ ఓరి దుర్మతులారా, యూరకే మీర
లీరీతిఁ బంతంబులేల పల్కెదరు?
కలిసి మిమ్మెల్లను ఖడించి మించి
బవరంబు లోపలఁ బాఱఁదోలెదను.

సూ.వ. అవురా ఈవిధంబున మాయావిప్రుండైన యర్జును వాక్యంబులు విని దుర్యోధనాదులు "మాయావిప్రులు ద్రౌపదినిఁ దోడ్కొనిపోవునది గాక ద్రుపద భూపాలునకు సహాయముగా రావచ్చునా?" యని రోషకషాయి తాత్ములై మాయావిప్రులను ధిక్కరించి పలికెడి మార్గము.

ద॥ భామను విడిచిపోరోయి, బాపనులార
గురుకుచ కోకిలవాణి – కువలయ నిభలోచన
తరుణీశిఖామణి మీకుఁ – దగదు, ఊరకె మాకు ॥౧॥
కుంతములను గదలఁ – గొట్టి చెండాడఁ బోయేము
పంతముల వారుగారు – ప్రాణముతోడ మీరు ॥౨॥

సూ.వ. అపురా యీవిధంబున దుర్యోధనాదుల వాక్యంబులు విని యర్జున భీమసేనులు తమ బీరంబు మెఱయఁ బలికెడి మార్గము.

ద. మాటలేలరా, యోరి, పాటిచాలురా,
నీకుఁ గర్ణకఠోరములు – ఈ కార్ముక గుణధ్వను లిట్టి॥
నీ శల్యదారుణములు – నెఱయ నాబాణము లిట్టి ॥౨॥
నీసేన ప్రాణములహరింప – నేధనంజయుఁడ నిట్టి ॥3॥
పొంగుచు నిన్ను భేదించెద – సంగర విజయుఁడనిట్టి ॥౪॥

సూ.వ. ఈవిధంబున నర్జునునికి నోడిన కర్ణునిఁజూచి దుర్యోధనుండు హెచ్చరింపఁగా వానిఁజూచి వృకోదరుండు పలికెడి మార్గము.

భీమ.వ.ద. చేరకు నీవాస మీఱకు–మారుని గురుహితునినిట్టి ॥౧॥
నీకు తగదు సుయోధన,–భీకరుండ నాతో నీదుడుక ॥౨॥

సూ.వ. అవురా యీవిధంబున నర్జున భీమసేనులు దుర్యోధనాదులను యుద్ధమున జయించి వారలను బాఱఁదోలిన తర్వాత, మాయావిప్రులగు పాండవు లేకచక్రిపురి మునకు వచ్చునట్టి పట్టునఁ గుంతీదేవి యొక రమ్యప్రదేశంబునకువచ్చెడు మార్గము.

ద. సకల..............గుణవంతురాలు
సద్గుణశీల చతుర ।
సుకుమారి కుంతిదేవి వచ్చెనిప్పుడు – సుతులను
గనుఁగొనను ॥౧॥

సూ॥వ. అవురా యీవిధంబున కుంతీదేవివచ్చిన తదనంతరంబున నర్జునుండు ముందుగా వచ్చి తమ తల్లియైన కుంతీదేవికి వందనమాచరించి పలికెడి మార్గము

త. నెఱ తీవులు గలదమ్మా
దొరల శిఖామణులకైన దొరకని దమ్మా ।
తరువునఁ బోడమని దమ్మా
తిరముగ నొకవింతఫలము దెచ్చితి నమ్మ ॥

సూ. వ. అవురా యీవిధంబున నర్జునుని వాక్యంబులు విని కుంతీదేవి ప్రత్యుత్తరముగా పలికేమార్గము.

ద. మంచిదె వినుము మాయన్నా - మీలో
వంచన రారాదన్నా।
మించి యీఫలము మాయన్నా - మీరు
పంచి భుజియింపుఁడీ యన్నా॥ ॥౧॥

సూ.వ. అపుడా యీవిధంబునఁ గుంతీదేవి పలుకుచుండు సమయంబున ధర్మరాజు నకులసహదేవులు భీముఁడు వచ్చి వందన మాచరించి పలికెడు మార్గము.

ద॥ మొ్రక్కెదనే నీకు మొ్రక్కెద నేను।
మొ్రక్కెద నత్త మీపాదములకు॥

సూ.వ. అపుడా యీవిధంబున ద్రౌపదీదేవి కుంతీదేవికి వందన మాచరించిన తరువాత, కుంతీదేవి । కుమారులను జూచి పలికెడు మార్గము.

ద. ఎటువలెఁ దెచ్చితి - రిందుముఖిని
సురకన్యకయో - నరనాథుకన్యయో
నాగకన్యయొ యీ ॥౧॥
చక్కెరబొమ్మను సద్గుణశీలను
చక్కని గరితను సర్వాంగసుందరిని ॥౨॥

సూ.వ. అపుడా యీవిధంబున బలికిన తల్లి వాక్యంబుల విని ధర్మరాజు పలికెడి మార్గము.

ద్వి. వినవమ్మ యొకమాట విన్నవించెదను
మన యర్జునుఁడు యంత్రమత్స్యంబునేసి
ఘనుఁడైన ద్రుపదుని కన్యకామణినిఁ
జనవునఁ గైకొని సకలశాత్రవుల
దురమున వడిఁబాఱఁదోలి యిచ్చటికిఁ
దరుణిని దెచ్చె సంతసమొప్ప నేఁడు
నురరాజ సుతునికి సుదతికిఁబెండ్లి
గరిమను గావింపు గణఁక మీఱఁగను.

మా.వ. అప్పుడా యీవిధంబునఁ బలికిన ధర్మరాజు వాక్యం
బులు విని యర్జునుండు పలికెడు మార్గము.

ద. వినవయ్య నాయన్న తల్లినోటనుండి
-వింతలు పుట్టెనన్న ।
ఉచ్చితమైన ఫలమునేఁ - దెచ్చితినని పలుక
ఇచ్చగా మనయమ్మ మీ -
రేగురు గైకొనుఁడనెను ॥౧॥

తల్లిమాటలు జవదాఁటఁ గూడదు ఒక
పల్లవపాణి కేగురు పతులు గారాదెట్లా ॥౨॥

సూ.వ. అప్పురా యీవిధంబునఁ బలికిన యజ్ఞుని వాక్యంబులు విని ధర్మపుత్త్రాదుల విచారగ్రస్తులై యుండు నెడ, సంతట నావలి కథాసంవిధానంబెవిధానసంశేను. ద్రుపద భూపాలుఁడు మాయావిప్రుల వెంబడి నంపించిన తన కుమారికామణి వృత్తాంతము తెలియకపోయెను; మాయావిప్రుల వృత్తాంతమున్ను తెలియలేదని విచార గ్రస్తుఁడై వారలవృత్తాంతము తెలియవలెనని చారులను పిలువుమనఁగా, చారులు వచ్చెడి మార్గము.

ద. గుదియలు చేఁబూని చద్ది - కూటిమూటలు వేలాడ
ముదమున వేగులవారు - మ్రొక్కుచు వచ్చిరిపుడు॥

సూ.వ. అప్పురా యీవిధంబున వచ్చిన వేగులవారిని జూచి ద్రుపదభూపాలుండు పలికెడిమార్గము.

ద్రు.వ. వినరోయి వేగులవారలు! మన ద్రౌపదీకన్యను దోడ్కొనిపోయిన మాయావిప్రుల వృత్తాంతము తెలిసి కొని రారోయి.

వేగు.వ. మహాభాగ్య మాయెనయ్య స్వామీ!

సూ.వ. అప్పురా యీవిధంబున ద్రుపద భూపాలు ననుమతిని చారులు మాయావిప్రుల వృత్తాంతము దెలియవలసి, వారలుండే ప్రదేశమునకువచ్చి పొంచియుండు నవసర మున మాయావిప్రులైన పంచపాండవులు తమలోఁ దాము పలికెడు మార్గము.

ధర్మ.ద. మాయావిప్రులమై యుండగ యంత్ర
మత్స్యము ధరఁ దెగఁగొట్టి ।
దాయాదులనుదోలి తరుణిఁ దెచ్చితిమి ॥
ధర్మమె తెమ్మోర పట్టి ॥౧॥

భీమ.ద. సురరాజ తనయుఁడు రాజధర్మముఁబూని
శాంత చూపెఁగదన్న ।
నిరుపమ పాండుమహీతలేంద్రుని కీర్తి
నేఁటికి నిలిపెఁగదన్న ॥౨॥

అర్జు.ద. క్రూరులు దుర్యోధనాదుల ననిలో
కొట్టక విడిచితినన్నా - యిఁక
మీఱిన రాజ్యలక్ష్మి గొనకున్న నా
పేరు కిరీటిగాదన్నా ॥౩॥

మా.వ. అవ్వరా యీవిధంబునఁ బలుకుచుండు మాయా విప్రుల వాక్యంబులు విని చారులువచ్చి దుపదభూపాలునితో వారల వృత్తాంతము తెలిపెడి మార్గము.

చారుల॥వ॥ వినవయ్యాస్వామి ! విప్రులవృత్తాంతము విచారింపఁ బోతిమి. అక్కడ విప్రులును మన ద్రౌపదీదేవియును మఱియొక ముసలామెయు నున్నారు. అందులో నొక బ్రాహ్మణుఁడు "మనము మాయావిప్రులమై యుండి యంత్రమత్స్యమును గొట్టి దాయాదులను బాఱఁద్రోలి

కన్యకామణిని దెచ్చినది ధర్మమే తెమ్మోరపట్టీ!" యనెను అందుకు మరియొక బ్రాహ్మణుండు అందుకొని, "సుర రాజతనయుండు రాజధర్మముఁబూని శౌరతమెఱయుంచి పాండుభూపాలునికీర్తి నేఁటికి నిలిపెఁ గదన్న" యనెను. అంతలో మన యంత్రమత్స్యమేసిన చిన్న వాఁడందుకొని "క్రూరులగు దుర్యోధనాదులను నీకై గొట్టక విడిచితిని. ఇఁకను మీఱిన రాజ్యలక్ష్మిఁగొన కున్న నాపేరు కిరీటిగాదన్నా" యనెను. ఈవృత్తాంతము తెలిసి వచ్చితిమి.

సూ.వ. ఈవిధంబునఁ బలికిన చారుల వాక్యంబులవిని ద్రుపద భూపాలుఁడు తనయుఁడైన ధృష్టద్యుమ్నునిఁజూచి పలికెడి మార్గము.

ద్రు.వ. వినవోయి ధృష్టద్యుమ్న ! మన ద్రౌపదీదేవినిదోడ్కొని పోయిన బ్రాహ్మణులను, మన ద్రౌపదీదేవిని దోడ్కొని రావోయి.

ధృష్ట.వ. మహాభాగ్య మాయెనయ్యా !

సూ.వ. అవురా యీవిధంబున జనకవచన ప్రకారంబుగా ధృష్టద్యుమ్నుండు మాయావిప్రుల సమీపమునకు వచ్చెడి మార్గము:

ద. ద్రుపద సుతుండు వెడలెఁ బాండు
నృపతి నందనులఁ బిలువ॥

సూ.వ. అపుడా యీవిధంబున ధృష్టద్యుమ్నుండు మాయా విప్రులైన పాండవులనుజూచి పలికెడి మార్గము.

ద్వి. ఘనులార, యంభోధి గంభీరులార,
మనసిజ నిభులార, మహితాత్ములార,
శేష సుధారామ క్షీరాబ్ధిసోమ
భాషాసతీ భీమ ప్రాలేయసీమ
సన్నిభ యశులార, సర్వజ్ఞులార,
మిన్నక మాతండ్రి మిమ్మందుఁ దోడి
తెమ్మన వచ్చితిఁ దీవ్రింబుగాను,
సమ్మతి మీర లీక్షణమె రారయ్య.

ధర్మ.వ. మహాభాగ్యమాయె నారీతిగానే పోవుదమురావయ్యా.
సూ.వ. అపుడా యీవిధంబున ధృష్టద్యుమ్నుండు మాయా విప్రులైన పంచపాండవుల దోడ్కొనివచ్చెడి మార్గము.

ద. పోడిమితో ద్రుపద - పుత్రుఁడు వెడలెను
చండప్రతాపుల భండనవిజయుల
చండకరనిభుల - పాండుసుతులఁగూడి ॥౧॥

సూ.వ. అపుడా యీవిధంబున మాయావిప్రులైన పంచపాండవులు వచ్చినవారలై ద్రుపదభూపాలుండు గొలువుండు నాస్థానమంటపంబున బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రుల కుచితాసనంబు లమర్చియుండఁగాఁ జూచి, వారలు

రాజాసనంబులఁ గూర్చున్నఁజూచి పాండవులని నిశ్చ
యించి ద్రుపదభూపాలుండు వారలను స్తోత్రముచేసి,
పలికెడి మార్గము.

ద్వి. చండవిక్రములార, సద్గుణులార,
భండనరిపు హస్తి పంచాస్యులార,
చండికానాథ పూజారతులార,
పాండవులార, దోర్బల యుక్తులార,
ఎన్నిదినంబుల కేగురిమిమ్ముఁ
గన్నులపండువుగాఁ గనుటాయె.
తొలుత మీవితము నిస్తులవృత్తి మీఱఁ
దెలియక ద్విజులని దీనుఁడై యుంటి.
ధర్మనందన, పురందర తనూజునకుఁ
బేర్మితోఁ జేయుము పెండ్లియీవేళ.

సూ.వ. అపురా యీవిధంబున ఆ ద్రుపదభూపాలుని వాక్యం
బులు విని ధర్మనందనుండు పలికెడి మార్గము పరాకు.

దరువు॥ తగవు గాదిది చూడ – ధర్మంబుగాదు
నగరె యిట్లయితే ము – జగము వారెల్ల॥
బలనైరి తనయుఁ డొక – ఫలముదెచ్చితి ననుచుఁ
బలుక సరిపాలుగాఁ – బంచి కొమ్మనుచుఁ

దెలిపె మాతల్లి యి - తెలుఁగు గావింపుమింక
తలిదండ్రులమాట జవ - దాట భూపాల ॥౧॥

హరహర ! యిదియేమి - యయిదుగురి నొకకన్య
వరియించు టెట్లు లీ - వావు లెట్లు,
పురుషునికిఁ జెల్లు నెం - దఱభామ లైనాను
తరుణి కొక పురుషుఁడే - ధాత కల్పన యిట్లు॥ ॥౨॥

వ. అవురా యీావిధంబున విప్రులును ద్రుపద భూపా లుండును సంతోషజనితచింతామగ్న మానసులైయుండు నవసరమున నకస్మాత్తుగా వ్యాసులు వచ్చేమార్గము.

ద. వ్యాసులు వెడలిరి - భాసురముగను ।
పాయకమదిలో కాశీ - పతిని స్మరణచేసి
మాయను దెగగోసి - మైని భూతిపూసి ॥౧॥
హరినామ సుధన్గ్రోలి - యానందమునఁ దేలి
పరమ పుణ్యశాలి - పద్మసంభవుఁబోలి ॥౨॥

వ. అవురా యీావిధంబున వచ్చు వ్యాసుల నెదుర్కొని వందన మాచరించి యుచితాసనంబునఁ గూర్చుండ నేమించి యా వ్యాసులను జూచి ద్రుపదరా జవ్రుడు పలికెడి మార్గము.

ద॥ శరణు శరణు భవనాశ - శరణు శరణు స్వప్రకాశ
శరణు శరణు హరిదాసస్వామి-శరణు శరణు వేదవ్యాస॥

క. వరముని సందోహా పురం
దర, ధర మీఱెఱుఁగనట్టి ధర్మముగలదే !
నెరవేమి ? కన్యకేగురు
పెరిమిటులనిపలికెఁ గుంతి పెద్దకుమారున్.

సూ. అప్పురా యీవిధంబునఁ బలికిన ద్రుపదుని వాక్యంబులు
విని వ్యాసులు భూతభవిష్యద్వర్తమానంబుల సవిస్తరం
బుగాఁ బలికెడిమార్గము.

ద్వి. ధారుణీశ్వర, నీకుదైన్యమదేల !
కారణంబొక కొంతకలిగెను మున్ను
ఇదియొక్క మునిసతి యెప్పుడు విభుఁడు
మది మది రోగనిమగ్నుఁడైయున్న
రతిలేమి శోకించి రాతిరి పగలు
పతిసేవ సేయుచు భావజహరుని
నిత్యము నుతియింప నీలలోహితుఁడు
ప్రత్యక్షమై వచ్చి పణఁతి, నీకోర్కి
యడుగుమటన్నను అప్పుడాబాల
యడరక మగని నిమ్మనివేడఁ జూచి
యేగురుపురుషులు నెలమితోడుతను
బాగుగా నిన్ను జేపట్టుదు రనుచు
వరమిచ్చె నాప్రభావమున నీభామ

పరమపతివ్రత పాంచాలియయ్యె
చతురతమించిన శంకరుకృపను
బతుకులైరి యీపంచపాండవులిపుడు
దైవకృతంబిది తప్పింపఁదరమె !
కావున లగ్నంబుగావింపు వేగ.

సూ. వ. అవురా యీవిధంబున వ్యాసులవాక్యంబులు విని సంతోషచిత్తుండై యాద్రుపదరాజు పంచపాండవులకు ద్రౌపదీకన్యకు శుభలగ్నంబున వివాహంబు చేసే మార్గంబు పరాకు. ఈవిధంబున పాండవులకు ద్రౌపదీ కన్యకను వివాహంబుసేయు సమయంబున సకలజనులు మంగళముపాడే మార్గము (మంగళము పాడేది)

---

# రతి కల్యాణము



జయ దేవి, శర్వాణి, జయ వినతగీర్వాణి,
జయ కీరవరవాణి, జయ మృదులపాణి,
జయ శుభగుణశ్రేణి, జయ గౌరి, కల్యాణి,
జయ విభవనిశ్శ్రేణి, జయ ఘనశోణి ॥౧॥

మహిషాసురప్రాణ – పరిహరణపారీణ
మహనీయ శితబాణ – సహితే! చిరేణ
బహుళ భువనత్రాణ – భవ్యధర్మధురీణ
మహిమే! శుభవరేణ – మామను గృహాణ ॥౨॥

మధుకైటభ విపక్ష – మర్దనాధికదక్ష
పృథుశరే పరపక్ష – ...మాంరక్ష (?)
విధివిబుధ మునియక్ష – విద్యాధరాధ్యక్ష
మధుర సన్నుతిలక్ష – మద ఘూర్ణితాక్ష! ॥3॥

చండముండ విరామ – చాప బాణస్తోమ
పాండితీ జితధామ – వరదైత్యభామా
చండశుంభోద్దామ – జయని శుంభస్థేమ
ఖండనే, సుత్రామ – కామితప్రేమ ॥౪॥

శరణు శరణు॥

శరణు శ్రీవసుదేవనందన – శరణు జగదానందనా
శరణు చరణానత సనందన – శరణుసురకృతవందనా ॥౧॥

మధురభాషణ – మహితతోషణ
మదవిరోధి విశోషణా।
బుధవిభూషణ భూతపోషణ
భుజబలాహత దూషణా ॥౨॥

ఉద్ధతాఘతృణ ప్రభంజన–యోగి హృదయ నిరంజనా
సిద్ధచారణముఖ్యరంజన – శ్రీహరీ మురభంజనా ॥౩॥

మహతే దేవేశాయ తే మంగళం
మందాకినీ చూడాయ మంగళం ॥౧॥

భానుకోటి ప్రభాయ – భక్తసంరక్షకాయ
మానసాతీతాయ మంగళం ॥౨॥

చంద్రావతంసాయ – చతురానన సేవ్యాయ
మందారవాసాయ మంగళం ॥౩॥

నిగమాంతవేద్యాయ – నిష్కళంకరూపాయ
మకరధ్వజభంగాయ మంగళం ॥౪॥

శ్లో॥ వందే తం దేవదేవం వరసురపటలీఘాళి మాణిక్యదీప
శ్రేణీ నీరాజిత శ్రీచరణ సరసిజ ధ్యానయోగాదిభాజాం।
భక్తానామీప్సితార్థాకలన పటుచతుర్బాహు శోభాంచిత శ్రీ
చక్రాబ్జాది ప్రభాళీశమితజగదఘం శాశ్వతం కృష్ణదేవం॥

సూ॥ ఈవిధంబున నిష్టదేవతాప్రార్థనంబు చేసిన తరువాత.

నాందీ ద్విపద॥

ద్వి॥ శ్రీరమణీ విభాసిత శుభాకారు.
కారుణ్య రసధునీ కనదకూపారు,
పారుష్యకలుషాది భవభయదూరు
దూరూపసైరి సందోహవిదారు
దారుణదైతేయ దళనదోస్సారు
సారూప్య ముఖముక్తి సంయుతాగారు
గారుత్మతవిహారి ఘనకాంతిపూరు
పూరుషోత్తమ ముఖాద్భుత నామధీరు
ధీరూపరుచి వశాదృత గోపభీరు
భీరు భక్తావన బిరుదప్రచారు
చారు కాంచన పటాంచలకాంతిభారు
భారూషితాంచితా భరణాంగవారు
వారణార్తిదశా నివారణశూరు
శూరసేనకులాబ్ధి శుభ సుధాకారుఁ
గారణాతీత లోక త్రయాధారు
ధారణాది సమాధి తాపసాపారుఁ
బారమార్థిక భావ భావితాచారుఁ
జారణముఖ నుతోజ్జ్వల యశోగారు

గౌరవ ప్రాభవకలన దుర్వారు
వారాశివరగర్వ భరభి ద్గభీరు
భీరహితారాతి భేదనోదారు
దారపుత్త్రధనాద్యుదాత్తమందారు
శ్రీధరు త్రిభువనశ్రీధరు హరిని
మాధవు పృథువీరమాధవుఁదలఁచి
తారకాధిపమౌళిఁ దారకాధీశు
శారద నీరద శారదావర్ణ
భవుని వసంతవైభవుని వర్ణించి
శివకరు నాసదాశివుని వర్ణించి
గణనాథు గణుతించి ఘనులైన కవులఁ
బ్రణుతించి శారదాంబను బ్రస్తుతించి
పదపదార్థవివేక పదములుగాక
పదముల మెల్లఁగాఁ బదరుచునున్న
కుకవి సర్పంబుల కోఱలుపీకి
సకలభాగవతుల సన్నుతి చేసి
యీసదాశివుపేర నంకితంబుగను
భోసల కులసింధు పూర్ణచంద్రుండు
ఏకరాజకుమారుఁ డెల్లదేశముల
నేకాతపత్త్రుఁడై యేలు ఘనుండు
మగఁటిమి మకరంద మకరాదిబిరుదుఁ

డగు శాహభూమండలాఖండలుండు
పరఁగించు రతిదేవి పరిణయంబనెడు
సరసనాటకము లాస్యమున రాజిల్లు
భావముల్ తగు వేషభాషాదు లమరఁ
గావించె భరతులు గాయకుల్ మెచ్చ
నాచక్రవాళా చలాచలాచక్ర
మాచంద్రతారార్క మై యొప్పఁగాక.

సూ. ఈరీతి నాట్యారంభమందు నిష్టదేవతావందనంబు గావించి సభానాయకు నభివర్ణించి శ్రీశాహమహారాజ ప్రణీతంబైన రతి కల్యాణనాటకము కథాక్రమంబుగా వినిపించెదము విన నవధరించుమయ్యా.

వ. ఈవిధంబున నాట్యారంభంబు గావించి యిష్టదేవతా ప్రార్థన సేయు మార్గము.

శ్లో॥ లంబోదర స్సర్వవిద్యా లంబో దరవాసన్ముఖః
బంధురస్తుత్యసుగుణై ర్బంధురస్తు భవన్ముదే॥

వ. ఈవిధంబున సరస్వతీదేవిని బ్రార్థనసేయు మార్గము.

శ్లో॥ నిత్యాకారగతైః కరాబ్జవలనై స్తాలాయితైః కంకణ
ప్రక్వాణై శ్శ్రితితాంగతై ర్ముఖవలల్లోలంబ మాలాయితైః
వీణాయా మృదుగీతిభిః పరవశాశ్చాళీజనాః కుర్వతీ
వాగ్దేవీ వదనాంబుజే నివసతు శ్రీశాహపృథ్వీపతేః॥

సూ॥ ఈవిధంబున సరస్వతీదేవిని ప్రార్థనచేసి పరమేశ్వరుని
ప్రార్థనసేయు క్రమము.

శ్లో॥ చండస్తాండవకాండ శౌండమహిమా శుండాలతుండోన్నమ
చ్చండాగండపిచండభాండ విహరత్ కుండల్యఖండశ్రియై
తండూర్ధ్వండిత చండడిండిమముఖో డిండీరపంశైర్వ్యమత్
కాంశైర్మండిత గండమండల జటాఖండోఽస్తు చండీపతేః

సూ॥ విష్ణుప్రార్థనసేయు మార్గము.

... ... ... ... ...

# కథాసంగ్రహము



ద్వి. మహితమౌ తత్కథామార్గమెట్లనిన
రహిని మన్మథమహారాజు వచ్చుటయు
రాకేందుః పవనులు రహినసంతుఁడును
శ్రీకరంబుగఁ గొల్వుసేయ వచ్చుటయుఁ
గొలువువేశ్యలు నంతఁ గుండోదరుండు
వెలయ వచ్చుట యంతవేగులవారు
చనుదేర నారాజు సారి వచ్చుటయు
నెనయుఁ శ్రీవను వృద్ధుఁ లెదుట నుండుటయుఁ
సరవిఁ గన్యయు బ్రహ్మచారి వచ్చుటయుఁ
దరళాక్షి రతిదేవిదాదియు సఖులుఁ

జను దేరుటయు నంత సకియుఁ జందు్రఁడును
ఘనత బంధువులతోఁ గల్యాణమిపుడు
నెఱవేర్చుటయు నిందు నేర్పుతో శాహ
నరనాథుఁ డొనరించు నవ్యనాటకము
ఆచక్రివాళాచ లాచలాచక్రి
మాచంద్రతారార్కమై యొప్పఁగాత

వ॥ ఈరీతి నుదార శృంగార వేషభాషా విభూషితంబగు శ్రీశాహమహారాజ ప్రణీతంబైన రతిపరిణయంబ నెడు నాటకమునందుఁ దొలుత విఘ్నేశ్వరప్రార్థన సేయఁగా వినాయకుఁడు వచ్చుమార్గము.

ద॥ ముదమునఁ గుండల - ములరుచు లమరఁగ
నిదె వెడలెను వి - ఘ్నేశ్వరుఁడిపుడు ॥౧॥
కర్ణతాళములు - గదలఁగ నల్లన
స్వర్ణనిభుఁడు గణ - పతి తగవచ్చెన్ ॥౨॥
మోదముతో గణ - ముఖ్యులు గొలువఁగ
మోదకహస్తుఁడు - ముదమున వెడలెన్ ॥౩॥
తన లంబోదర - మున ఘణులాడఁగ
ఘనతను వెడలెను - గజముఖుఁడిపుడు ॥౪॥

సూ॥ పూజారిని బిలువుమోయి ఏమోయి పూజసేయవద్దా?
సూ॥ ఆరీతిగానే పూజసేయవోయి.

సూ॥ ఈవిధంబున వినాయకుండు వచ్చిన తరువాత మన్మథ మహారాజు వచ్చునవసరంబునఁ గటికవాఁడు వచ్చెడి మార్గము.

ద॥ ఓరశిఖవేసికొని - గీరునామము పెట్టుకొని
బరిగోల కేలఁబట్టి - చేరఁగవచ్చె వికటాంగుఁడు ॥౧॥
పొట్టి గీతములుపాడి - బొజ్జ నిమురుచును నాడి
దిట్టతనమున నిటకు - నట్టెవచ్చె వికటాంగుండు ॥౨॥

సూ॥ ఎవరోయి నాయఁడా ?
క॥ నేనుదా పింకినాయడను
సూ॥ ఎక్కడికి వచ్చితివి ?
క॥ మన్మథ మహారాజు కొల్వునకు వచ్చుచున్నాఁడని హెచ్చరించ వస్తిని.
సూ॥ అవురా యీవిధంబునఁ గటికవాఁడువచ్చి యెచ్చరించిన యాతదనంతరంబున మన్మథమహారాజు యథోచిత ప్రదేశంబునకు వచ్చెడు మార్గము ఎవ్విధాన ననఁగా.

చ. అలసిగఁదా మెతుల్ మెఱయునట్లురువాబురుసారునూలుచుం
గులు చెలఁగంగ బంగరుదుకూలపు వన్నె చెఱంగు రంగులన్
నలుదెసలెండగాయ లలనల్ సురటీలిడఁ బట్టు దట్టియం
దలరులవంకిపూని కుసుమాస్త్రుఁడువచ్చెను గొల్వువేడుకన్.

సూ॥ ఇవ్విధంబున మన్మథమహారాజు తనకొల్వుకు వచ్చె మార్గం పరాకు.

దరువు॥ పువ్వులవంకిచేఁబట్టి – పువ్వులదుప్పటిగట్టి
పువ్వువిల్తుఁడు వచ్చె దేవ – పువ్వుఁబోణి సురటివీవ॥

పొంగారు మన్మథుఁడువచ్చె–బంగారు సొమ్ములపొచ్చె
(కటికి ముఖాంతరం – చదురునఁ గూర్చుండేది)

సూ॥ అవురా యీవిధంబున మన్మథమహారాజు కొలువునఁ గూర్చున్న యాతదనంతరంబున, ఆతనికొలువునకుఁ జంద్రుఁడు వచ్చెమార్గంబెవిధాన నంటేను.

ద॥ చందనములవన్నెల – చందాన నిగ్గులీన
చందమామ చిత్తజుని – సభను జేరవచ్చె ॥౧॥

ముత్తేలసొమ్ములచాయ – కొత్త వెన్నెలలు గాయ
చిత్తజుని గొలువనిచ్చఁ– జిత్తమమరవచ్చె ॥౨॥

కటిక ముఖాంతరం.

సూ॥ అవు రా యివ్విధంబునఁ జందుృ్రిండువచ్చిన తదనంతరంబున మన్మథమహారాజు కొలువునకు మలయమారుతుండు వచ్చెడు మార్గం బెవ్విధాననంటే.

ద్వి॥ హరిచందనము మేన నలఁది నెయ్యమున
సురుచిర రత్నాలసొమ్ములు చాలఁ
జెలఁగి పువ్వులకొమ్మ చేపట్టి కమ్మ
మలయ మారుతుఁడిచ్చ మలయుచువచ్చె.

ద॥ తావులు వెదచల్లునట్టి – పూవులకొమ్మలు పట్టి
భావజునిఁ గొలువనిచ్చఁ – బవనుండు బడలికలలర ॥౧॥
లలితగతుల వల్లి – వలయములు నర్తింప
మలయు వేడుకల నిచ్చ – మలయ పవనుఁడువచ్చె ।

వ॥ ఎవరోయి వాకిట ? మలయ మారుతుండు వచ్చినాఁ
డని చెప్పవోయి.

కటిక॥ స్వామీ, మలయమారుతుండు వచ్చినాఁడు.

రా॥ లెస్స విచారించి రారా

క॥ పవనుండు వచ్చినాఁడు

రా॥ రానీవోయి

సూ॥ ఈవిధంబున మలయమారుతుండు వచ్చిన తదనంత
రంబున వసంతుఁడు వచ్చెడు మార్గము.

చ॥ పొలుపుగ వింతవింతలగు పువ్వులదండల దివ్యవాసనల్
వెలయు ముఖాంబుజాళులకు విందులు సేయఁగఁదోపు
దుప్పటిన్
గలిత విచిత్రభూషణ నికాయము లెల్లెడ నుల్లసిల్లఁగా
నలరులవింటిజోదు ప్రియుఁడైన వసంతుఁడు వచ్చె వేడుకన్.

ద॥ వింతపువ్వుల నీడులెన్న - ..కోకవల్లెవాటు
కాంతులు దిక్కులహెచ్చ - ఘనుఁడువసంతుఁడు
వచ్చె ॥౧॥
నవరత్నభూషణచ్ఛాయ - నవముగ నీరెండగాయ
వివిధవిలాసములుహెచ్చ- వెలయువసంతుఁడువచ్చె॥ ౨॥
కటికముఖాతరం:

వ॥ ఈ విధంబున సకల సామంతవర్గములుం గొలువునకు వచ్చినతరువాతఁ బంచబాణుని కొలువునకుఁ గొలువు వేశ్యలు వచ్చెడు మార్గం.

సీ॥ కురులపై నెత్తావి సురులు పిసాళింపఁ
గలికిచూపుల నీటు లొలుకుచుండ
మెఱుఁగుగుబ్బలఁబైట చెఱఁగుదువాళింప
హారువుముత్తెపుసరుల్ మురువులీన
జాళువాయందెలు లీల ఘల్లునమ్రోయ
గిలుకు మెట్టెలనాదు గులకరింప
బంగారు రవికడాల్ శృంగార మలరంగ
బలుకులఁ దేనియ లొలుకుచుండఁ

గీ॥ చిత్తరువు బొమ్మచందంబు చెలువుమీఱి
చిత్తజునిరాణి వైఖరి శ్రీచెలంగఁ
గొలువుభోగంపుఁ జాన లయ్యాలరువిల్తు
కొలువు సేయంగవచ్చిరి చెలువెసంగ.

ద॥ వలపుమైసరులుమించ - వగకాని వెంబడిఁ
గొలువుబోగమింతి - కులుకునడల ॥౧॥

జాలుపైఁట చక్కఁబెట్టు - చందాన గుబ్బలగుట్టు
పౌరజనులుచూచి మెచ్చ - భామిని వచ్చె ॥౨॥

చనుఁకట్టులోని గుబ్బ - చన్నులు నెయ్యానుబ్బఁ
దనరు బోగమింతి వచ్చెఁ - దనుఁజూచి జనులుమెచ్చ ॥౩॥

వ॥ ఈవిధంబునఁ గొలువుబోగాలవారు వచ్చిన తరువాత సకల దేశాధిపతులుం గొలువఁగా మన్మథమహారాజు కొలువుననుండు సమయంబున విదూషకుం డనెడు కుండో దరుండు వచ్చెడు మార్గము.

ద॥ చొంగచారు తుడుచుకొంట
పొట్టచూపు చూచుకొంట
కొంగకాళ్ళు యీడ్చుకొంట
కుండోదరుఁడు వచ్చె నవ్వకొంట.

వ॥ ఇవ్విధంబునఁ గుండోదరుఁడు రాజసభకు వచ్చుసమయంబునఁ గటికవాఁడు హెచ్చరించెడు మార్గం.

ద్వి॥ రాజకందర్ప, పరాకు హెచ్చరిక
రాజసంబొప్ప వీరలఁ గటాక్షింపు.

విదూ: మంగళాని భవంతు. ముందుగా నన్ను గటాక్షింపు మయ్యా.

కటిక :

ద్వి. రాజకందర్ప పరాకు హెచ్చరిక
రాజసంబొప్ప వీరలఁ గటాక్షించు
వీరు కాశ్మీర సౌవీర భూపతులు
వారు కోసల కాశి వంగవల్లభులు
వార లుశీనరావంతి నాయకులు
వారు సింహళ గౌళ వసుమతీవరులు
వీరు శకాంగ పృథ్వీతలేశ్వరులు
వీరు జాంగల శకోర్వీతలేశ్వరులు
వీరులాట విలాట వీరపుంగవులు
వారలు మలయాళ పాంచాలవిభులు

ఉ. వీరు విదర్భమాగధులు వీరు కరూశ నరేశనందనుల్
వీరు విదేహ కేకయులు వీరు కళింద పుళిందభూపతుల్
వీరు కళింగమానవులు వీరుయుగంధర సింధునాయకుల్
వీరు త్రిగర్త భూపతులు

కుం: నన్నేలా చెప్ప లేదురా ?

కటిక : వీఁడు ఘటోదరుఁడయ్యా మన్మథా!

కుం: వ. అదేమిరా నాపేరు తాఱుమాఱుగఁ జెపఁ చున్నావు.

సూ : ఈవిధంబున మన్మథమహారాజు కొలువునకు సకలదేశ
వృత్తాంతముల నరసి చారులు వచ్చెడు మార్గం.

ద. కంబళి గొంగళ్ళు దండు - కట్టెల కట్టిన ముండ్లు
ఇంపైకాళ్ల బిగువారు - ఏసగా వచ్చిరి వేగువారు॥

కటిక ముఖాంతరం :

వేగులవారు :

ద్వి. జయజయ మకరాంక, జయశాసనాంక,
జయజయ సుగుణాంక, శౌర్యనిశ్శంక,
జయజయ జితశాంత, జగదేకకాంత,
జయజయారి కృతాంత, సతత నిశ్చింత,
దేవ, నీ యనుమతి తెలఁగున మేము
వేవేగ వింతలు వెదకి వచ్చితిమి
అఖిల లోకములు నీయాజ్ఞ యన్నంత
సుఖలీలఁ బూదండచొప్పునఁ దాల్చు.
పరుసకో నెలమూఁడు వానలు గురియు;
ధరణి దున్నక పండు; దనర గోతతులు
కోరినప్పుడె పాలు కురియుచు నుండు;
నారాముహూలు నిన్నందు రేజనులు.

విదూ : వెసఁబలికితివోయి రామ యనేపేరుమార్చి పలికినచో
మార యనుపేరు నిలువరమాయెను "మదనో మన్మథో
మారో" అనుశాస్త్రం నిలువరంగాఁ బలికితిరి.

వ. మఱియు నా దేశవృత్తాంతము తెలియఁగేయుయ్యా

ప. నిగనిగ యనుజారుకొప్పులు తమ
మగల వలపించెడు సేపులు।
సొగసులు మీఱిన మేపులు
చొక్కపు నిడువాలు కొప్పులు ॥౧॥

కన్నులు మోముకెక్కెడు గుబ్బిగుబ్బ
చన్నులు ... ... ... ॥౨॥
చక్కెర కెమ్మోవి మిన్నలు తగ
మక్కువ నమరుదు రన్నలు॥
హారుమైన బంగారు మేడల తావి
నలరిన సురపొన్న నీడల।
తరుణులు పైకొను క్రీడల వారు
తగుదురు పురి పురి వాడల॥

సూ. అప్పురా యీవిధంబున మఱియుచు వేగులవారు పలికెడు.
మార్గం (పరాకు)

ద్వి. ఒకప్రదేశంబున నువిద యొకర్తె
మకరాంక, నీయాజ్ఞ మది నిబోధించి
'శ్రోసిరాజా'యని స్తుత్యమా తపము
చేసి తాపసియైన చెలిని జూచితిమి.

సూ. మఱియును ఆవృత్తాంతంబు వినవయ్యా.

ద: అయినఁగాని వినవయ్య యా
యద్భుతము దెల్పెదము దయతో ।
నమ్మిక లీవయ్య యో మహారాజ ।

చారు: కామదేవ, పంచబాణ – కరుణతో వీరిఁబ్రోచి
ప్రేమమీఱ నభయము నిమ్ము – ఓ మకరాంక !

మన్మ. భయము మీ కేలయింత –
పరిశోధించిన వింత ।
రయమునఁ దెల్పుఁడు మీరు ॥౧॥

వ: ఈ విధంబున చారులకు మన్మథమహారాజు నమ్మిక
యీయఁగా వారలు పలికెడి మార్గం.

ద్వి. వినవయ్య దేవ, యీవిశ్వంబునందుఁ
గనుఁగొంటి వింతయొక్క టపూర్వముగను
చందురుఁ గన్న ప్రసన్నమా వింత
యిందీవరమ్ముల నీను విస్మయము
బంతులకెల్ల మేల్బంతియా వింత
పంతుతో భ్రమరాళి భ్రమయించు సొగసు
ముకురబింబంబుల మూలధనంబు
శుకముల నదలించిచూచు నద్భుతము
తొలకరి మెఱుఁగులఁ దోలఁగించు మెఱుఁగు
నలరు విల్కాని మోహాన మంత్రవిద్య

గలుగు తామరలందుఁ గనక కాహళులు
కనక కాహళులపైఁ గరి కరంబులును
కరికరంబులపైఁ బ్రకాశించు నభము
నరుదైన నభమునందగు హస్తతలము
నలహస్తతలముపై నమరు శైవలము
అలరు శైవలముపై హస్తికుంభములు
నొనరఁ గుంభములపై నొప్పు శంఖంబు
వినుము శంఖముపైని వెలయుఁ జందురుఁడు
మూఁగి చందురుమీఁద మొగిలు రాజిల్లు.

సూ: మఱియును బలికెడు మార్గం.

ప: అయ్యా వినవయ్యా యెవ్వతో – ఆబంగారుబొమ్మ
నెయ్య మలర వలపులీను – నెఱయు పూలకొమ్మ ॥౧॥
భోజకన్యకయో దేవ – రాజ కన్యకయో
రాజకన్యకయో భోగి – రాజకన్యకయో ॥౨॥
కలకంఠ కన్యకిఁజూపు – కలువపూలతూపు
కలవాణికి గుబ్బచండ్లు – గజనిమ్మపండ్లు ॥3॥
కుందరదన నగుమోము మంచి – చందురునినోము
మందగమన కమ్మమోవి – మంచి తేనెబావి ।
చిలుకలకొలికి పలుకు – ఇల తేనెలొలుకు
అలినీలవేణికొప్పు – తెలినీలాలయొప్పు ॥౪॥

ద్వి. ఈరీతినలరు నయ్యిందు బింబాస్య
చారులీలావన సరసి తీరమున
వరతపంబులను దేవతలఁబూజించు.
మౌనవ్రతంబుతో మఱియొకభామ
పూనిక నుపచారములు సేయుచుండుఁ
జూచి వచ్చితినయ్య సూనసాయకుఁడ!
ఆచంద్రముఖియును...

వా. ఈవిధంబునఁ బలికిన చారుల వాక్యంబులువిని చంద్రుఁడు
మన్మథమహారాజునుజూచి పలికే మార్గం.

ద. ఔరర నేఁడొక్క వింతపుట్టెఁ - జారులిడకు వచ్చునంత
శీరువయసు మిటారులేడ యిట
వారుసేయు వతంబులేడ ॥౧॥

ద. ఏమూలనేమూలనీవు వింతల మహినిశోధించినావు!
సోముఁడా నీవనినమాట - వినిన
నామదికి వింతయీపూట ॥౨॥

చా. ఇటువంటిబలుకేటికి వసంతా మరునిఁ
జటమున నాడెదవు కొంత ॥౩॥

వా. ఈవిధంబునఁ బలికిన చంద్రవసంతాదుల వాక్యం
బులు విని పచ్చవిలుతుండు పలికెడు మార్గం.

ద. భళిభళి మేలిట్టి - పలుకు లిపుడు వింటి
నిలకు నావంటిరాజు - నిటులనుండియేను ॥౧॥
బిగువు గబ్బిగుబ్బల - వగలాఁడు లేయూరు
తగవు తప్పిన కటికి - తపము లేయూరు ॥౨॥
యతులంట సంశ్రిత - వ్రతులంట నేపేరు
క్షితి వారిని జూ - చినవారలు లేరు ॥3॥
నామహిమ తెలియఁగక - నాఁడు విశ్వామిత్రుఁడా
మేనకకు దాసుఁ డాయెఁగా చంద్ర ॥౪॥

సూ. మఱియును బలికెడి మార్గము.

వ. వేయును జెప్పఁగనేల - వినుఁడి నామహిమను
ఆయింద్రునంతవాని - కోడాట లాడించినాను ॥౧॥
నాఁడు బ్రహ్మదేవునంత - వాఁడు కూఁతునంటినాఁడు
పాఁడి దప్పినట్టి శివుని - బ్రతుకు చెప్పనేల నేఁడు ॥౨॥
చెఱకు సింగాణివింటి - కలికుతూపుల నంత
వెఱవనివానిఁ గాన - వినవయ్య యో వసంత ॥3॥

సూ॥ ఈవిధంబునఁ బలికిన మన్మథమహారాజును గనుఁగొని చంద్రుఁడు పలికెడు మార్గము.

ద. మీనాంక, వినవయ్య - యీనాతిచందంబు
నేనరసి మీయాజ్ఞ - పూనిక చెల్లింతు ॥౧॥
వనితలనఁగ నెంత - వారిచిత్తము నరసి
ఘనతతో నీవశము - గావింతునయ్య ॥౨॥

సూ. ఈవిధంబునఁ బలికిన చంద్రునివాక్యంబులు విని చారులు పలికే మార్గం.

ద్వి. ఇది యెంత హెచ్చని యీచందురుండు
మదమును దప్పిన మలయానిలుండు
చులుకగాఁ బలికిన చోద్యంబుచూచి
తలఁచితి మిది వృథా దర్పంబులనుచు
నాచంద్రవదన యొయ్యారంబు చూచి
యీచంద్రుఁ డేమానో యెఱుఁగఁగా రాదు.
మిగులఁ జెప్పఁగ నేల మీవంటివారి
వగలఁ జిక్కించు నావగలాఁడి వగలు.

సూ. ఈవిధంబునఁ బలికిన చంద్రుని వాక్యంబులు విని విదూషకుఁడు పలికెడుమార్గం.

ద. ఐతే శుభస్య శీఘ్రమనురీతి రాజా
ఈతటిఁ గార్యము నిర్వహించుప్రీతి॥

సూ. ఈవిధంబునఁ బలికిన విదూషకుని వాక్యంబులుల విని మన్మథమహారాజు చంద్రవసంతాదులతోఁ బలికెడు మార్గం॥

ద. ఇందు పవన వసంతాది – హితులార యిపుడే
యందమైన వాహానము – లమర నడతాము.

వ్యా. ఈవిధంబున మన్మథమహారాజు చంద్రవసంతాదుల సమేతంబుగాను కీర కురంగ తురంగ వాహనా రూఢులై సారి వచ్చేడుమార్గం.

ద. సారి వెడలె మారుండు – హాాయలు మీాఱ
సారి వెడలె మారుండు – కీరవాహనము నెక్కి
సారసాక్షులు బిరుదు – సన్నుతులు సేయంగ ॥౧॥

ఝమ్ము ఝమ్మని మ్రోయు – తుమ్మెద నారిచే
నిమ్ముగ వంచిన – యించువింట ।
కమ్మపూవుల సాయ – కంబులు సంధించి
సమ్మతిఁ జంద్ర వ – సంతాదులతో ॥౨॥

రంగల రంగఁ గు – రంగముపై నెక్కి
ముంగల పవనుండు – ముచ్చటాడ ।
తుంగములైన తు – రంగములందగు
సంగతిఁ జంద్ర వ – సంతాదులతో ॥3॥

వ్యా. ఈవిధంబున మన్మథమహారాజు సారివచ్చు సమయంబునఁ గటికవాఁడు హెచ్చరించెడు మార్గం.

నవమోహనాకార – నవ్యాలంకార
వివిధ శృంగార జయ – వీర, హెచ్చరిక.

వ్యా. ఈవిధంబున సారివచ్చు మన్మథమహారాజు చంద్రవసంతాదులను గనుఁగొని పలికెడిమార్గం.

ద్వి. వినుము రాకాచంద్ర, వినుము వసంత
వినుము ధీరసమీర, విను విదూషకుఁడ !
నాదు ప్రభావంబు నలినాసనునకు
నాదిశేషునకు శక్యంబె వర్ణింప.
కడు వృద్ధులైనను గడుబాలురైన
వెడవింట వెడలు నీ విరిబాణములకు
నవనిఁ గామాతురు లౌదురు నిజము.
నవయౌవనులనంగ నాకెంత హెచ్చు
సరవి నిందుకు నిదర్శనము చూపెదను
వరుసతో నీమహోపవనమున నేఁడు.

సూ. ఈవిధంబునఁ బలుకుచుఁ బచ్చవిల్తుండు సారిరాఁగ నామార్గమునందు వృద్ధాంగన మార్గం.

ద. నడిదారి నిలుగుకొంట - నామస్మరణ చేసికొంట
దుడుకోలపూనుకొంట - దొడవృద్ధవనితవచ్చె!

ద. నిన్ను నమ్మితినయ్యా నారాయణ
నీపాదములు దిక్కు నారాయణ
నన్ను మన్నింపవె నారాయణ మదిని
నన్యమెఱుఁగను సుమ్ము నారాయణ॥

సూ. ఈరీతిని వృద్ధాంగనవచ్చిన తరువాత నామార్గంబున నొకవృద్ధభూసురుఁడు వచ్చెడుమార్గం॥

ద॥ కుఱుమాపు ధోవతులుగట్టి – కరము కనుబొమ్మపైఁబెట్టి
............శివము సరణి వృద్ధద్విజుఁడువచ్చె॥

వ. ఎవరే ముసలాపె ?

ము॥వ॥ ఏమిా యక్కడదగడా బల్లికా వచ్చినారు పొండి తీసుకోడ కూర్చుండుఁడా.

బ్రా.వ. అలాగే కూర్చుందు – నతిరమ్యముగ నిందు చాల సంతోషించి – సమ్మతిగాంచి॥

సూ. ఈవిధంబున వృద్ధస్త్రీ వృద్ధబ్రాహ్మణులు వరుసగా నెదురై తమలోఁ దమరు ముచ్చటలాడు సమయంబున, నా వృద్ధులకు ననురాగహేతులైన మోహనచూర్ణంబులంబోలు పుష్పాదులచే నొప్పిదంబులగు పుష్పబాణంబులు మన్మథమహారాజు ప్రయోగింప వారలు పరస్పరవశులై పలికెడిమార్గం.

బ్రా॥ ద॥ ఇంతిరో నా బడలికలెల్లఁ దీఱెను నీ
స్త్రీ: సంతోషములైనదే – చాలునిపుడు॥
బ్రా: ఆసలయ్యె నీతోడ మాట – లాడుచుండఁగ – నా
స్త్రీ: యాసచేత నీకేమిఫల – మది చెప్పుమా॥
బ్రా: చెప్పెదనంటే నాకునింత – సిగ్గులయ్యెనే
స్త్రీ: చెప్పవయ్యా నీకునింత – సిగ్గులేల॥
బ్రా: రమణి, నిన్ను జూచినంత – తమకమెచ్చెనే।

స్త్రీ: తమకించఁగ నిల్లాలికిఁ - దగవుగాదు॥
బ్రా: ఇల్లాలవైతే నేమాయె - సింధురావె
స్త్రీ: మెల్లనె నాపైఁదమి - మించనీవు॥
బ్రా: మోవినిచ్చి కౌఁగిలించి - ముద్దుపెట్టవె
స్త్రీ: యీవగల మాటలాడ - నిందేయేటిది॥

సూ. ఈవిధంబున వృద్ధసంవాదంబు గావించి మన్మథ మహారాజు ఒకరితోనొకరిని నిదర్శనంబుగాఁ జూపుచు వచ్చు సమయంబున, కన్యకామణి బసువనినోముల సేయవచ్చే మార్గము.

ఉ. రంగలరంగఁ బావడచెఱంగులు కాళ్ళఁబెనంగొనంగఁదా
బంగరుబొమ్మలీల నొకబంగరుబొమ్మను గేలనుంచి యా
సంగడిపొందు కత్తియల సంగతితో బసవయ్య నెంచుచున్
బొంగుచు లేఁత లేఁతవిడిముచ్చటలాడుచువచ్చు కన్నెయున్.

ద. వచ్చెను గన్యతన - నెచ్చెలులతోన వింత
ముచ్చటలాడుచు నిపుడు-బొమ్మలపెండ్లి సేయంగ ॥౧॥

చెలులతో సారెసారెకు - జిలిబిలి మాటలాడుచు
కిలకిలనవ్వుచుగౌరి-లలనపైఁ బాటపాడుచు ॥౨॥

వెలఁది ముత్యాలపాపట - వెన్నెలగాయంగ నుదుట
మొలక చన్నులపైని - ముత్యాలసరులువూని ॥3॥

సూ. ఈవిధంబునఁగన్యక బసవనినోము చేసేమార్గం.

బసవయ్య నిన్కుపదగళ జేరగెదను –
వాశవానితం దనర తనకోడు ననగే ‖౧‖
హుల్లూ నీరుగళు – వుప్పినఅవరుగళు ।
కోళైయాగివిన – కోరెను నాసలహు‖

సూ. ఈవిధంబున బసవనినోముచేసిన తరువాతఁగన్యలఁ
గూడి కోలాటమాడెడు మార్గం.

ద‖ నెఱికురులను విరి – సరములు మెఱయను
నరమెదఁ బయ్యెద – జాఱగను।
పరువడి నేకన్య – పాల శాహేంద్రుని
హరువుమీఱఁగొని – యాడుచును ‖
కోలెకోలెయని – కుందరదన లెల్లఁ
జాలనాడిరి జనులు – సంతసిల్ల‖
కోలె బంగారుకోలె – కోలె వజ్రాలకోలె
కోలె రత్నాలకోలె కోలెయని‖
ముందుగఁ బదము – లందును రత్నాల
యందెలు గజ్జెలు – నతిశయిల్ల।
నందము మీఱిన – మందహాసమ్ములఁ
బొందుగ నాడేరు – పొలఁతులెల్ల‖ ‖౨‖

తరుణులు మిగుల సం - తసములు మీఱంగఁ
బరువడి గిరిరాజ - పదములను
సరసుఁడైనయట్టి - శాహేంద్రునిఁ
బరి పరి విధములఁ - బాడుచును ॥3॥

సూ॥ ఈవిధంబునఁ గన్యక కోలాటలాడంగ నాత్రోవ నొకా నొక బ్రహ్మచారివచ్చె మార్గం॥

ద: బ్రహ్మచారి కట్టూగట్టి - పైన దర్భముంజగట్టి
బ్రహ్మచారి వెడలెఁ జేతఁ - బట్టిన పుస్తకమలర॥

సూ. ఈవిధంబున బాలికాబ్రహ్మచారులఁ గనుఁగొని మన్మథ మహారాజు చంద్రపవన వసంతాదులఁ గనుఁగొని పలికెడి మార్గం.

ద్వి. ఓచంద్ర, యీవంక నొకవింతచూడు
నే చెప్పినప్రతిజ్ఞ నీకిఁ జెల్లింతు.
ఎటులన మున్ను నావృద్ధుల నందు
స్ఫుట మోహజలధిలో ముంచినరీతి
నిటులున్న యీకన్య నీబ్రహ్మచారి
మటుమాయ వలపింతు మాప్రభావమున.

సూ. ఈవిధంబున మన్మథమహారాజు బాలికా బ్రహ్మచారుల మీఁదఁ బుష్పబాణాలు ప్రయోగింపఁగా వారలు పరస్పర పరవశులై పలికెనుమార్గం.

బ॥ కోలాటమాడెదు - కొమ్మరో యిటుచూడు
మీలీల నీవెవ్వ - రెఱిఁగింపు నేఁడు॥

బా॥ నేమెవ్వరైతే - నేమి నీతో మాట
లేమిటికి మొగ - మెఱుఁగనిచోట.

బ్ర॥ కన్నరో నీమాట - విన్న మొదలుగాను
నిన్ను మెచ్చుచు చూచు - చున్నాను నేను॥

బా॥ బాలలతో నొంటి - పాటున మాటాడ
మేలా నె! యేఁటికి - మీకు నిట్లాడ॥

సూత్ర॥ అవురా యీవిధంబునఁ గన్యకామణి వాక్యంబులు విని యాబ్రహ్మచారి ప్రత్యుత్తరంబుగాఁబలికెడిమార్గం.

(ప రా కు)

దరువు॥ ఏలనే యీచలము బాలరో
యేలనే యీచలము॥
చనవిచ్చి లాలించవే యిపుడు నా
మనవిని పాలించవే॥
సఖి, నీకు దక్కితినే మరుబాణ
ముఖములఁ జిక్కితినే॥
మోమిచ్చి మాటాడవే నాపైని
ప్రేమ నించుక చూడవే॥
పరసలు పాడెదనే నీ శృంగార
పదమంటి వేడెదనే॥

సూ. అపురా యీవిధంబున నాబ్రహ్మచారి వాక్యంబుః
విని యాకన్యక విరహం బభినయించు మార్గము.

దరువు: కలఁగె నామనసు వాని - పలుకులు విన్నంత
చెలియరో యింకేమి - సేయుదునే కాంత॥
పులకరించె నెమ్మేను - ఝులుఝుల్లు మనెనోచాన
మొలకచన్నులు రవికయందుఁ-గొలఁదిమీఱెనేయిందుః
అదరెనె నాదుమోవి - వదలెనిప్పుడు నీవి
మదను బారివలన - బెదరితి నోలలన॥

సూ. ఈవిధంబున వారల మదనోన్మాదవశులఁజేసి సింహనాద
ములు సేయుచు మన్మథమహారాజు వచ్చు సమయంబుః
చారులు మన్మథమహారాజును జూచి పలికెడిమార్గం

ద్వి. అవధారు దేవ, మోహనకళాభవన
నవమైన యీనందన వనంబునందు
నతిభక్తితో దేవతార్చన సేయ
నతివయుఁ దామును నరుదేరువేళ
నటుగాన నొక రహస్యప్రదేశమున
నిటులుండి యీజాడ లెఱుఁగఁగావలయు.
(అదే వచనం)

వ. ఈవిధంబునఁ బలికినచారుల వాక్యంబులు విని మన్మథ
మహారాజు చంద్రపవన వసంతాదులను జూచి పలికెడు.
మార్గం.

దరువు॥ ఇందుఁ గొంత తడవుందాము
యిందు మందపవనులార - పాడుచు మాటలాడుచు॥

సూ॥ ఈవిధంబునఁ జంద్ర చందన గంధవాహ వసంతవిదూష కాది సమేతంబుగ రాజమన్మథుం డారామమునందు విశ్రమించి యుండు సమయంబున నంతట నావలి కథా సంవిధానం బెవిధాననంటేను, రతిదేవి శృంగారవనంబు నకు వచ్చుసమయంబునఁ దొలుత దాది వచ్చెడు క్రమము.

ద॥ మైలవన్నె చీరగట్టి కోయిల - పుక్కిట
మూసిన విడెముపెట్టి కోయిల।
మేలము చాలహెచ్చ కోయిల - శ్రీరతిదేవి
యేలిన దాదివచ్చె॥

సూ॥ ఎవరే నీవు ?

దా॥ రతిదేవి వారింటిదాదిని ఆపెశృంగారవనమునకు
వచ్చుచున్నది కాఁగా శృంగారవనంబు చూడవచ్చితిని.

సూ॥ ఈవిధంబున దాదివచ్చిన తరువాత రతిదేవి వచ్చెడు మార్గం.

ది. శృంగారముల మించు చెలిమేని చాయ
బంగారు నిగ్గుతోఁ బందెంబు వేయ
నరవిందగంధి సోయగపుఁ గెమ్మోవి
కురువింద మణులఁ దక్కువసేయు ఠీవి

కరిరాజగమన చొక్కపుఁ గప్పుకొప్పు
సురరాజమణిఁ గేరుసొగసున నొప్పు.
బాలికామణి గుబ్బపాలిండ్లతీరు
పూలబంతులకు మెప్పులు సేయమీఱు.
ఈరీతి నలరారు నెలనాగబాల
కూరిమి చెలికత్తె గొలువ నీలీల
ఘనత గౌరీపూజ గావింపఁగోరి
వనవీధులకు వచ్చె వరభక్తిమీఱి.

దరువు: ముత్తేల కమ్మచాయ చెక్కిళ్ళ – గొత్త వెన్నెలగాయ
చిత్తరుబొమ్మచాయ వచ్చెను –
శ్రీరతిదేవి డాయ॥
మంజీర రవము మించ హంస
మగువలు వెంబడించ ।
మంజుగళ రవము – చెలులను
రంజిల్లఁ జేయఁగను॥
బంగారుపైఁట చెఱఁగు చెలఁగఁగఁ
బొంగారు జిగిమెఱుంగు ।
శృంగారము హెచ్చ వేడ్కను – శ్రీరతిదేవివచ్చె॥

సూ॥ అపుడా యీవిధంబున రతిదేవినిఁ గనుంగొని యలివేణి పలికెడి మార్గము.

ద. బంగారుబొమ్మ యిటురమ్మా దివ్య
శృంగార వనమిదే సుమ్మా॥

రతి॥ అలివేణి చాల లెస్సాయె-నిచటి
తిలక చంపక తరుచ్ఛాయ।

సూత్ర॥ అపురా యీవిధంబున రతిదేవి శృంగార వనంబున
గౌరీపూజ చేసెడిమార్గం

మంగళం : జయజయ మంగళం శుభమంగళం
జయజయ మంగళము తుహిన-శైలనాయక పుత్రి
జయ మంగళము మృదుల - చారుగాత్రి।
జయ మంగళము గౌరి - సకలశోభనధాత్రి
జయ మంగళము జగ - జ్జన జనయిత్రి॥

శ్లో॥ శర్వాణి కల్యాణి సమస్తవంద్యే
గీర్వాణ వాణీశ ముఖాభినంద్యే
పుష్పాయుధం మే రమణం విధేహి
పుష్పాంజలిం తే చరణేర్పయామి ॥

సూ. ఈవిధంబున రతిదేవి గౌరీపూజసేయు సమయంబున నా
వృత్తాంతంబు చారులు మన్మథమహారాజుతోఁబలికెడు
మార్గం.

ద్వి. దేవ, మీనాంక, యీదివ్యసుందరిని
భావించి తెలియు డీపట్టున మీరు.
ఆచంద్రవదన వృత్తాంతంబు తెలియ
నీచంద్రు నంపించుమీ పంచబాణ!

(అదేవచనం)

వ. ఈవిధంబునఁ బలికినచారుల వాక్యంబులు విని మన్మథ మహారాజు శశాంకునిఁజూచి పలికెడిమార్గం।

ద్వి. వినవయ్యచంద్ర, యీవిమలాంగి కులము
జనన శీలాదులచ్చట విచారించి
మెలఁత నాయాజ్ఞలో మెలఁగంగఁజేసి
తెలిసి యీవాక్యంబు తెలుపుము మాకు.

మా. ఈవిధంబున మకరాంకుని యనుమతిని శశాంకుఁడు రతిదేవియొద్దకు వచ్చెడుమార్గం.

ద. మకరాంకుని యను – మతిని శశాంకుఁడు
శుకవాణియగు రతిని – జూడంగవచ్చె.

మా. ఈవిధంబున వచ్చినచంద్రుండు రతిదేవి రూపరేఖా విలాసాదులఁ గనుఁగొని యచ్చెరువంది పచ్చవిలుతుని జేరవచ్చి పలికేమార్గం.

ప. ఆచంద్రిముఖి మోము - నేమూచి నదిమొదలు
నాచిత్తము వివశమాయె - ఓ మకరాంకా ।
నాచిత్తము వివశమాయె॥ ॥౧॥
చిలుకల కోలికి బిగువు - సిబ్బెపు గుబ్బలు
వలపులు మించె నిపుడు - ఓ వలరాజ
వలపులు మించె నిపుడు॥ ॥౨॥
మోహనాంగి చకోర కె - మ్మోవిసోగసు దాఁజూచి
మోహ మింతింతనఁగ రాదు - ఓ మోహనాంగ
మోహమింతింతనఁగ రాదు॥ ॥౩॥

సూ. ఈవిధంబునఁ బలికిన చంద్రుని వాక్యములు విని పచ్చ
విలుతుండు అచ్చెరువడి రతిదేవిని జేరవచ్చెడుమార్గం.

ద॥ పచ్చవిల్తుండు వచ్చెను - హారోయలు మీఱ
తచ్చనలకోడఁ బం - తము లాడుకొంచు
మచ్చిక తెలనాకు - మడుపంమకొంచు ।
ముచ్చటోట మీస - ములు దిద్దుకొంచు
విచ్చల విడి వన - వీధుల వెంట॥ ॥౧॥
పసఁగు బంగరు గిలుకు - పావాలు మెట్టి
చెఱఁగు జాడ సరిగ - చేలము గట్టి
కర మొప్పఁ బవనుని - కై దండఁ బట్టి
విరహులపై దండు - వెడలు నాజెట్టి॥ ॥౨॥

పంతు వగల యేల - పదమనుకొంట
ఇంతు మీఱఁగఁ గిన్న - ర మీటుకొంటఁ
జెంత నున్న సఖునిఁ - జెనకి యిట్లంట
వింత వింత మాట - విని నవ్వుకొంట॥ ॥3॥

సూ॥ ఈవిధంబున వచ్చిన మన్మథుండు రతిదేవినిఁ గనుఁగొని చంద్రి పవన వసంతాదులను జూచి పలికెడుమార్గం॥

ద్వి. ఔరౌర ! యీకొమ్మ యపరంజిబొమ్మ
నారీమతల్లి మానస కల్పవల్లి
యీమెలఁతకు సాటియే జోటిమేటి
యీమె యౌవనము మదీయ జీవనము
ఈనాతి ప్రాపున నెల్లలోకములుఁ
బూని తాను జయించఁ బోలును సుమ్ము.

సూ. మఱియును వర్ణించెడు మార్గం.

ద॥ సొమ్మో పువ్వులకొమ్మో చిత్తను
బొమ్మో యీముద్దు గుమ్మో - లాల॥ ॥౧॥
ఏపో కలువలతూపో మెఱుపుల
కోపో యీచెలిచూపో లాల॥ ॥౨॥
బాగో బంగరు సోగో మెఱుపుల
తీగో యీయెల నాగో లాల॥ ॥3॥
వన్నో పుష్పాడి దిన్నో మెఱుపుల
చెన్నో యీజిగి యన్నో లాల॥ ॥౪॥

సూ. ఇవ్విధంబున మన్మథమహారాజు అమ్మోహనాంగియైన రతిదేవిని గనుంగొని మోహవిభ్రాంతుఁడై యుండఁగా నమ్మహానుభావుని రూపరేఖా విలాసంబులు గనుంగొని తనచెలితో రతిదేవి పలికెడిమార్గము.

ద. చూడవే చెలియ, యీవగకాని
చూడవే చెలియ ।
ఇంద్రుఁడో కాక యు - పేంద్రుఁడో యీతఁడు ॥౧॥
నరుఁడో కాక కి - న్నరుఁడో యీత. డు ॥౨॥
నలకూబరుఁడో కాక - నలుఁడో యీతఁడు ॥3॥
కంతుఁడో కాక జ - యంతుఁడో యీతఁడు ॥౪॥

సూ. ఈవిధంబున రతిమన్మథులు పరస్పర పరవశులై యుండు సమయంబున నాదాది రతిదేవినిజూచి పలికెడిమార్గము.

ద్వి. ఓయమ్మ రతిదేవి యోయలివేణి
యీయెడ మనకింతయేటికిఁ దడవు?
కావలసిన మనకార్యముల్ సల్పి
వేవేగ యింటికి వేడ్కఁబోవలయు.

సూ. ఈవిధంబునఁ బలికిన దాదివాక్యంబులు విని రతిదేవి యలివేణి సహితంబుగాఁ దన నగరికి నరిగెడుమార్గం.

ద. వగకాఁడో మరునినగవు – మొగము తిరిగిచూచుచు
వగలాడి రతిదేవి – వచ్చెను మెచ్చెను॥ ॥౧॥
అలరు విలుతునిఁజూడఁ – బులకించు మేనితోడ
వెలఁది శృంగారవనము – వెడలెను నీవిసడలెను॥ ॥౨॥
చిలుకల పలుకులఁ – గలఁగి నెమ్మిఁజాల
చిలుకలకొలికి విడిది – చేరెను దమిమీఱెను॥ ॥3॥

సూ. ఈవిధంబున రతిదేవి తన నగరికిఁ బోయినతరువాతఁ బచ్చవిలుతుండు తన నిజనివాసమునకు వచ్చి విరహ పరవశుండై స్వబాణవివశుండై చంద్రపవన వసంతాదులతో విరహ మభినయించెడి మార్గం.

ద. చెలికాఁడో చంద్ర యా – చెలినిజూచినది మొదలు
కలఁగె నెమ్మది యింకే – శరణి యీసరణి॥ ॥౧॥
వలపింపఁబోయి తా – వలలఁ జిక్కినతీరు
చెలువయ్యె నింకేమి – చేయ నీచాయ॥ ॥౨॥
మలయజ గంధికి – మరులుకొంటి నిపుడు
మలయానిల యింకెట్లు – వలపు నాతలఁపు॥ ॥3॥

సూ: ఈవిధంబునఁ దనబాణాలు తనకే పగాయెఁగా యని విరహాపారవశ్యుండై యుండెడు మన్మథునిఁ గనుఁగొని చంద్రపవన వసంతాదులు పలికెడి మార్గం.

స్వ. ఇదియేమి మకరాంక, యింత కలంక !
సుదతులెల్లను నిన్ను జూచినంతటనె
తమకించి విరహసంతాపంబు వలన
రమణులఁ బైకొన రహిఁదలంపుదురు.
నినుజూచెనేని యానెలఁత నెమ్మదిని
ఘన విరహంబుచేఁ గలఁగక యున్నె !
ఆవెలందిని జూచి - యాత్మలోనిట్లు
లీవు మోహించితి వేని విస్మయము !
ఆమోహనాంగి మోహన విద్యయొకొ - !
భా[illegible] వశీకార పరమౌషధంబొ !
ఆచంద్రవదన వృత్తాంతంబు దెలియ
నీచంద్రు సంపించుమీ పంచబాణ !

సూ. ఈవిధంబున మలయమారుతుని పలుకు లాకర్ణించి పంచబాణుండు చంద్రునితోఁ బలికెడి మార్గము.

ద. ఉదధిలోజనియించి-యుదయాద్రిపై నీవు చందమామ,నీ
యుదయముజనులకు-ముదమునునొదవించు చందమామ॥
ఆచంద్రవదనము-జూచి మరులుకొంటేఁ జందమామ !
యిఁక
నేచక ప్రేమ నా-యెలనాగఁ గూర్పుము చందమామ॥౨॥
చందమా నన్ను నీ-చందమాఁడిబెట్ట చందమామ నా
చందమెఱింగియా-చంద్రముఖనిగూర్చు చందమామ॥3॥

సూ. ఈవిధంబునఁ బంచబాణుని వాక్యంబులు విని
విదూషకుఁడు పలికెడి మార్గం.

శ్లో. యత్నేకృతే యది నసిద్ధ్యతి కోత్రదోషః
సర్వాంకషా భగవతీ భవితవ్యతైవ

మన్మథ:- దైవం ప్రమాణమితి కాపురుషావదంతి

చం : ఉద్యోగినం పురుషసింహ ముపైతి లక్ష్మీః॥

సూ॥ ఈవిధంబునఁ బంచబాణునిచేత ననుజ్ఞగైకొని చంద్రుఁడు
ఆ రతిదేవి వృత్తాంతము తెలియవచ్చెడి మార్గము.

ద. మకరాంకుని యను - మతిని శశాంకుఁడు
శుకవాణి యఁగురతిఁ - జూడఁగవచ్చె॥

సూ. ఈవిధంబునఁ జంద్రుఁడువచ్చు సమయంబున నావలి
కథాసంవిధాన మేవిధాననంటే, ఆరతిదేవి చెలికత్తె
నంపఁగా చెలికత్తె యమ్మహానుభావుని వృత్తాంతము
తెలియఁ బలుచుమార్గం.

ద. కులుకుగుబ్బలఁ బయ్యెద చెఱఁగు జాఱఁగా
చెలికత్తెవచ్చెను - ప్రేమహెచ్చెను ॥౧॥
పచ్చల కడియాలకాంతి - హెచ్చనరంజిల్లఁ
జెలియ వచ్చెను - మదిమెచ్చెను ॥౨॥
నుదుట ముత్యాలపాపట - యెనుటవెన్నెలలు గాయఁ
వచ్చెను - జెలిమిహెచ్చెను ॥

మా. ఈవిధంబున వచ్చిన చెలికత్తెంజూచి చంద్రుండు పలికెడి మార్గం.

ద్వి. నెలంత, నీవెవ్వరు? నీదుపేరేమి?
యలివేణిరో యీ వనావని నిపుడు
ఘన దేవతాపూజ గావించు నిట్టి
ననబోండి యెవ్వరు? నాకెఱింగింపు

మా. ఈవిధంబునం బలికిన చంద్రుని పలుకులాకర్ణించి యా యలివేణి తనవృత్తాంతంబు దెలిపెడు మార్గం

ద్వి. వినవయ్య దేవ, యీవృత్తాంతముల్ల
వినిపించెదను నీకు మనసురంజిల్ల.
నెనయంగ నీవలె నీజనులెల్ల
నను నలివేణి యన్నారు శోభిల్ల.
రతిదేవి యనందగురమణి మిటారి
యతనునిం బతిగాంగ నాతనింగోరి
ప్రతిదిన మీకేళి వనవీథిం జేరి
కుతుకాన మదనునిం గొలుచునొయ్యారి.
ఎవ్వరయ్యా మీర లీరేఖవారు?
పువ్వు విల్తుని పోరుం బోలినవారు
మవ్వంపు జిగిమీఱు మలయసమీరు
నివ్వగ శశితీరులెసంగి యున్నారు.

సూ. ఇవ్విధంబునఁ బలికిన యలివేణినిజూచి చంద్రుఁడు తన వృత్తాంతను తెలిపెడుమార్గం.

ద. చాల సంతోషమాయెను – వాలుఁగంటిరో మాకు
నీలాగు మావృత్తాంత – మెఱిఁగింతు నీకు.
బాలరో నను జంద్రునిఁగ – భావమునఁ దెలియు
మాలీల వాఁడుమన్మథుఁ – డని యెఱుఁగ వలయు ॥౧॥

అలివేణి, యారతిని – నతఁడు చూచినమొదలు
వలపునఁ దాళలేఁడు – చిలుకల రొదల ।
లలనరో యెట్లైన – నలరు విల్తునితోడఁ
జెలిని గూర్చు మీచాన – చెలఁగి నెయ్యాన ॥౨॥

సూ. ఈవిధంబునఁ బలికిన చంద్రుని వాక్యంబులు విని యలివేణి పలికెడిమార్గం.

ద్వి. ఓయి రాకాచంద్ర, యురుకాంతిసాంద్ర,
యీయెడఁ గూర్చెందు మీ కొంతతడవు.
కాఁగల కార్యముల్ క్రమముతో నగును
ఆ గజగామిని యభిమతంబెఱిఁగి
యాదాది కెఱిఁగించి యన్ని కార్యములు
నాదరంబున వేగనమరించ వలయు

సూ. ఇవ్విధంబున నలివేణిచంద్రుని నుచితప్రదేశంబున నుంచి తాను రతిదేవితో వృత్తాంతంబు తెలుపవచ్చెడుమార్గం.

ద. రమణీయ మగు మంజీ - రములు ఘల్లనమ్రోయ
రమణి చెలియ వచ్చె - రతిదేవి చాయ.

సూ. ఇవ్విధంబున నలివేణి వచ్చునట్టి పట్టున రతిదేవి తొలుత సమ్మోహనాంగుని రూపరేఖా విలాసములఁ గనుఁగొని చిత్తజాయత్త చిత్తయై విరహామభినయించెడుమార్గం.

ద. తలఁచుకొంటే తాళలేనే అల - చక్కెరవిలుకానిఁ
జెలువుమీఱినవానిఁ - దలఁచుకొంటే తాళనే ।౧।

ఇంక నేమిసేతునే యెవ్వరివేఁడి - యీవిరాళిఁబాతునే।
పొంకముగ నాదుమేను - పులకించె నిపుడునేను ।౨।

నీవి యెంతజాఱెనే - ఆసచేత నా
మోవి తేనె లూరెనే।
తావి తెమ్మెరలచాల - తలఁకితినయ్యో యీవేళ ।3।

సూ. ఈవిధంబున రతిదేవి విరహపరవశయై యుండఁగా నలివేణి చేరవచ్చి వందనమాచరించి పలికేమార్గం (పరాకు)

ద. అమ్మారతిదేవి వినుమమ్మా - యపరంజిబొమ్మా।
సమ్మతితో నేఁడొక్క - సంతోషవార్త॥
చాలభాగ్యమయ్యె నేఁడు - సకియరో యలివేణి।
యేలీల నాసంతోషము - నెఱిఁగింప్రమాకు॥
మారుఁడు ప్రాణేశుండుగా - మదిలోనఁ బ్రేమ నీవు
చేసినపూజలు కొనసాఁగె నివుడు॥

రతి: ఏలాగున నీవీకార్య - మిపుడొనఁగూర్చితి
చాలసంతోషానఁ దెలియ - పలుకరించు మాయలివేణి॥

వ. వినవమ్మ రతిదేవి! నీప్రాణేశ్వరుండైన మన్మథమహారాజు తనప్రాణసఖుఁడైన చంద్రుని నీవద్దకు నంపినాఁడమ్మ.

రతి: మహాసంతోషమాయె నాతనిఁ దోడితేవే చెలియా.

చెలి: రావయ్యా చంద్రుఁడ! యిదిగో రతిదేవితో వార్తలాడుకోవోయి.

సూ. ఈవిధంబున వచ్చిన చంద్రుండు అల రతిదేవినిఁగనుఁగొని పలికెడుమార్గం.

ద్వి. రతిదేవి, వినుమమ్మ రతనాల బొమ్మ
యతివ, నీశృంగార హావభావంబు
నేఁడు శృంగారవనీ వీథులందు
వేడుక రంజిల్ల వీక్షించి మదిని
మరుఁడు కామార్తుఁడై మరులు కొన్నాఁడు
తరుణిరో, నీదువృత్తాంతంబు తెలిసి
రమ్మని కూర్మిమీఱంగ నన్నంపె.
అమ్మ, నీవతని నెయ్యంబున నేలి
జగముల కేలికసానివై నీవు
తగుప్రేమ మమ్మునందఱ నాదరించు.

సూ. ఈవిధంబునఁ బలికిన చంద్రుని వాక్యంబులు విని లజ్జచేత మాటాడకయున్నఁ జూచి యలివేణి యామె భావంబు తెలిసి చంద్రునిఁజూచి పలికెడు మార్గం.

ప॥ ఆటతాళం॥

మనసారఁ బెండ్లికుమారుని బంధు-జనులఁదోడి తెమ్ము చంద్రుఁడా॥

రాజిల్లు శ్రీశాహ - రాజేంద్రు తంజ
రాజధానికి వేగ రావయ్యా॥
అలశోభనద్రవ్య - ములతోడ మేము
చెలఁగి తంజాపురి - చేరేము।
మేము సూచుట్టాలు ప్రేమను శాహ
భూమీశుఁ జేరేము ముదమున॥

వ. అప్పుడా ఈవిధంబునఁ జంద్రుని సముచితప్రకారంబుగ నంపించినవారలై రతి యలివేణులు శాహేంద్రుఁడేలు తంజాపురంబునకు వచ్చెడుమార్గం (పరాకు)

ప॥ కలకలమొగముల - మొలక నగవులు
పలుచని మోముల - పైనలర।
వలపులు గులికెడు - బెళుకుల చూపుల
చెలఁగఁగ నును సి - గ్గులు మెఱయఁగను॥
వచ్చిరి యలివేణి శ్రీరతిదేవి.........
................చైన తంజపురికి॥
అందెలరవళిని - హంసలు వెనుకొన
మందగమనముల - మలయుచును।
అందపుమేనులఁ - గుందనములతోఁ
బందెము వేయుచుఁ - జందన గంధులు॥ ॥౨॥

సకలజనుల కెం - చఁగఁ గల్పకమై
మకరకేతుఁడన - మహిఁ జెలయు।
సుకృతిని శాహ - క్షోణీవిభుని నిజ
సుకృతము వలనను - జూడఁ గలిగెనని॥ ॥31॥

సూ. ఈవిధంబున రతియు నలివేణియుఁ దంజాపురంబునకు వచ్చిన తదనంతరంబునఁ, జంద్రుఁడు వివాహమెునఁ గూర్చుకొని మకరాంకునివద్దకు వచ్చెడుమార్గం॥

ద. సరిగెదుప్పటి వలెవాటు - జాజఁబేరిమ
మరునిఁజేరెఁ జంద్రుఁడింపార॥

సూ. ఈవిధంబునఁ జంద్రుఁడు వచ్చి పంచబాణునిఁ గనుఁగొని పలికెడు మార్గం.

ద. మకరాంక యిపుడు నీ - మదిఁ గోర్కెలెల్ల
నకలంకముగఁ గూడె - నాత్మ రంజిల్ల॥

మరు॥ నీవంటి చెలికాఁడు - నెనరునఁ గలుగ
నీవేడ్క చేకూడె నిన్నేలగలుగ॥

చంద్రుఁడు. వేవేగ శ్రీరతి - దేవి కల్యాణ
మీవేళనగును ర - మ్మో పంచబాణ॥

మరు॥ ఆలాగే నీవు చు - ట్టాలఁ బిలిపించు
లాలిత లీలఁ గ - ల్యాణ మొనరించు॥

సూ॥ అవురా యీవిధంబున మన్మథ మహారాజు వాక్యంబులు విని చంద్రుండు మలయమారుతుని దేవతలఁ బిలుచు కొని రమ్మనఁగ మలయమారుతుఁడు సాఁగి వచ్చెడు మార్గం.

ద. పూవుల తావులు దెసలఁ-బొసఁగ ఘుమఘుమము లెచ్చ శీవిమలయ మారుతుండు - దేవతలఁ బిలువవచ్చె॥

సూ. ఈవిధంబున మలయమారుతుండు పిలువఁగాఁ దొలుత నింద్రుండు వచ్చెడుమార్గం॥

వ. కరమున నొప్పువజ్రమును గన్నులవేయును నాల్గుదిక్కులన్ నెఱయఁగఁజూచుచున్ దిశల నిర్మల రత్నకిరీట దీధితుల్ మెఱయఁగ భూరివైభవము మీఱఁగ మత్తమతంగజంబుపై సురనికరంబు గొల్వ బలసూదనుఁ డింద్రుఁడువచ్చె నత్తఱిన్.

ద. ఐరావతము పై నెక్కి - హర్షముతో రంభాదులు చారుశృంగార నాట్యములు-మీఱ దేవేంద్రుండువచ్చె॥
జేజేలు తనచెంగటను - జేజేయనుచును గొల్వంగ
రాజసముమీఱ సుర - రాజు వేడ్కతోను వెడలె.

సూ. ఈవిధంబున దేవేంద్రుండు వచ్చినతరువాత బ్రహ్మ దేవుఁడు వచ్చెడుమార్గం.

ఉ. నాలుగు నెమ్మొగమ్ములను నాలుగు వేదములన్ బఠింపుచున్
మేలగుధోవతుల్ భుజముమీఁదనమర్చిన యుత్తరీయమున్
లాలితపట్టెనర్ధనములన్ విలసిల్ల శుభాక్షతంబులన్
ఫాలతలంబులుల్లసిల బ్రహ్మ ముదంబున వచ్చెనత్తఱిన్.

ద. నాలుగుమోములను – నాలుగు వేదములు
లీలఁ జదువుచువచ్చె – నీబ్రహ్మదేవుఁడిపుడు.

సూ. ఈవిధంబున బ్రహ్మదేవుండు వచ్చినతరువాత విష్ణువు
వచ్చెడుమార్గం.

ద. శ్రీ నెలయు నీనంచు – ధోవతులు వెలయ
శ్రీశంఖ చక్రములు – హస్తములఁ జెలఁగ।
నలునైన గరుడవా – హనముపై విష్ణు వెడలె॥ ॥౧॥
అభయవరహస్తము – లమరంగ దిశలందు
శుభపీతాంబరముల – ప్రభసొబగొండ శౌరివచ్చె ॥౨॥

సూ. ఈవిధంబున విష్ణువువచ్చిన తదనంతరంబునఁ బరమేశ్వ
రుఁడు వచ్చెడుమార్గం.

ద. దేవుండు వెడలె శ్రీమహా – దేవుండు
దేవుఁడు శ్రీశంకరుండు – శివిమీఱఁగ నిపుడు।
శ్రీవృషభ వాహనము – పై వేడుక నెక్కి
దేవుఁడు శ్రీశంకరుండు – శివిమీఱఁగ నిపుడు
శ్రీవృషభవాహనము – పై వేడుక నెక్కి ॥౧॥

గంగ జడలలోఁ ద - రంగములు మీఱంగ
నంగజ హరుఁడు ది - వ్యమంగళాకారుఁడు ॥దే॥
బాలచంద్ర చంద్రికలు - ఫాలమున విలసిల్ల
లాలిత రుద్రాక్ష కంఠ - మాలిక లలర వాము ॥దే॥
నాగ చర్మోత్తరీయము - నాగభూషణము లమర
నాగ మద మర్దనుండు - నాఁగ శోభిలుచు రుద్ర ॥దే॥
శూల డమరుచాపములఁ - గేల ధరియించి భక్త
పాలుఁడైన శాహభూమి - పాలుదైవంబైనయాది ॥దే॥

వ. ఈవిధంబున సకలదేవతలును వచ్చినతరువాత వివాహ ములు సేయఁగా మంగళములు పాడేమార్గం.

మంగళం: గౌరికి రమ్యవిహారిణికిఁ - జారుకృపారసహారిణికి ।
మీఱిన ప్రేమను - ధీరులఁబ్రోచుచుఁ
గోరికలొసఁగెడి - గుణనిధికి॥ ॥౧॥
దేవునికి మహాదేవునికి - దేవాధిప నుతభావునికి
శ్రీవైభవములు తగఁ - బావనుఁడై తగు
సేవక నిధియగు - శివునికిని॥ ॥౨॥
భోసలశాహజి భూవిభుని - భాసిల్లుప్రేమను బాలించు
వానికి శోభన వైభవ సంతతి
ధీ సంపద లిడుదేవునికి శోభనమే - శోభనమే.

# పంచకన్యా పరిణయము



బాలకవి సుబ్బన్న

# పంచకన్యా పరిణయము



ద్వి. శ్రీమంగళాకారు శ్రితజనాధారు
రామామనోహారు రంజితాచారు
నందగోపకుమారు నవనీతచోరు
బృందావన విహారుఁ బృథుగుణోదారు
వికసిత కంజాక్షు వికటారిశిక్షు
సకల సురాధ్యక్షు సవనసంరక్షు
నహివైరివాహు నీలాంబుద దేహు
మహితోల్లసిత బాహు మానితోత్సాహుఁ
దపనీయకౌశేయు దళితదైతేయు
రిపుజనాజేయు సూరిజనవిధేయు
గురుధర్మగుణశీలు గోపికాలోలుఁ
బర ....................పాలు
వినుతింతు మదిలోన; వేడుకమీఱఁ
గను వ్యాసవాల్మీకి కాళిదాసాది
సుకవీశ్వరుల నెంతు; శుక పరాశరుల
కకలంక భక్తితో నంజలిసేతు;
భా (రతీనాథునే) ర్పడఁ బ్రస్తుతింతు;

సారెకు వాగ్దేవి చరణాబ్జములను
బ్రణుతింతు నేను శోభనముగ నెంచి
యనుపమంబగు కబ్బ మనువొందఁ జేయ.

వ. అని యివ్విధంబున నిష్టదేవతా ప్రార్థనంబుగావించి యేఁబదియేడు దేశములలోన నతిప్రకాశమై వెలుఁగొందునట్టి చోళదేశంబు నేమని వినుతించేని.

సీ. క్రముక కామ్ర నారికేళాది వృక్షములచే
రమణీయమైన యారామములును
వినువీధినంటి బల్విడిఁ గొండలన మించు
గోపురంబుల నొప్పు కోవెలలును
సతతంబు వేదఘోషములచే నెడనెడ
హాదువు మీఱిన యగ్రహారములును
ఊరూర దురితాంధకారంబులను బాప
దినమణులగు పుణ్యతీర్థములును

గీ. గృహము గృహమున దినమొక్క కృతియొనర్పఁ
జాలు లక్షణకవులును సహ్యజయును
గలిగి విలసిల్లు సకలలోకములు మెచ్చ
మహిమ చెన్నొందఁగను జోళమండలంబు.

వ. తద్దేశంబులోన సకలజనాధారంబై రంజిల్లు తంజాపురంబును మంజులంబుగఁ బాలించు నేకభూపాలుని కుమారుండైన శాహామహారాజ దేవేంద్రుఁ డొక్కనాఁడు తానొక శుభదినంబున సకలవైభవంబులు మెఱయ నమాత్యభృత్యహిత పురోహిత కవీశ్వర గాయకవైణిక నట విట ముఖ్యజనంబులు పరివేష్టించి కొల్వఁ బేరోలగంబుననుండి నన్నుఁజూచి యేమనుచున్నాఁడు.

ద్వి. మొదల సుదాముండు మురవైరితోడఁ
గదిసి కందుకమాడఁగా నోడి మఱు ది
నంబున గెలిచెదనని వచ్చుటయును,
అంబుజాక్షుఁడు వాని యభిలాషదీర్పఁ
గదలి రాఁగాఁ బంచకన్యకామణులు
ఎదురైనఁ జూచి మోహించి వాఁరుండు
భవనము ల్దెలియఁగా బాపని ననిచి
సవరణ మీఱఁ దాఁజనుదెంచి యా సు
దామునిఁ గాంచి తద్దయు వారిచెల్వ
మేమఱు వానితో వివరించుటయును,
అబ్బాలుఁ డటపోయి యాగృహం బరసి
నిబ్బరంబున వచ్చి నీరజాక్షునకుఁ
దెలుప సుదాముని దిక్కు వీక్షించి
పలికె వెన్నుఁడు వారిపైఁ దనమనసు

నిలిచెఁ గావున నేఁడె నీనేర్పు మెఱయ
జలజాక్షులకు నాకు సంభోగమొనరఁ
జేయుమనుటయు, మచ్చికవల్ల నతఁడు
నాయింనతిని బూని యబ్బాలు వెంటఁ
దగఁ బోయి చెలులు నుద్యానవనాని
కేగువనున్న కొలంకు కేతేర వారి
సకిచేతఁ గార్యంబు జతగూర్చి వచ్చి
ప్రకటంబుగా రమాపతికిఁ దెల్పుటయు,
నంత నందఱుఁ గొల్వ నటకేఁగి సఖుల
నంతంత నిలిపి తా నంబుజాకరము
చెంతకుఁబోయి తా స్త్రీలచేలముల
నంతటఁ గొని వారలడుగ వచ్చినను
బెదరించి పెండ్లాడి పిదప నొండొకరు
కదన మాడుచు నుండఁగా మాన్చి వారి
నతిశయంబుగఁ గృష్ణుఁ డలరించె ననెడి
కతను మించిన పంచ కన్యల పెండ్లి
బాల కవీంద్రాంధ్ర భాషతో నీవు
మేలిమి గనుపట్ట మెఱయ నీవేళ
మాకంకితంబుగా మంజునాటకము
జోకతో రచియింపు సుకవీంద్రు లెన్న.

వ. అని బహుమానంబుగావించి కర్పూరతాంబూలంబు లిచ్చినం బుచ్చుకొని యాకవీశ్వరుండే తత్కథా సంవిధానంబునకుం దొలుత నడతేరవలసిన సుదామునివాకిట బరిగోల కేతినాయని ఈసభాసదులు ప్రశంసింపం బ్రవేశింపంజేసే మార్గ మెటుల వలెనుండీని.

నాదనామక్రియ॥ ఆటతాళము॥ చాపు ॥

కేతినాయఁడు వచ్చెను తన
జాతిమాటలకెల్ల జనులు మెచ్చఁగను।
పట్టెనామము పెట్టి బరిగోలపట్టి
గట్టిదుప్పటిగట్టి ఘనతమీఱ।
పొట్టమూ తెగఁబెట్టి జుట్టునఁబూలుచుట్టి
దిట్టయై యచటికి నట్టహాసమున॥ ॥౧॥
మేనగంధముఁ బూసి మీసము మెలివేసి
కూనిరాగముతీసి గొణుగుచును।
పైని పాఁతనోనిపట్టి జగ్గుగవేసి
నానాజనములు నవ్వఁచుఁజూడ॥ ॥౨॥
వికవికనవ్వుచు విడెముచేయుచు
వికటముచూపుచు వేడ్కతోను।
ప్రకటముగాఁజూచు ప్రజ నదలించుచు
నొకటఁ బొచ్చెములేని యొఱపుతోను॥ ॥3॥

వ. అవురా యీవిధంబున నచ్చటికివచ్చిన కేతినాయనిం గనుంగొని ప్రసంగి సొంపెసంగ వానితో నేమని మందలించేని.

వాక్యము: అదెవర్రా ఓరి! యిచ్చటికివచ్చినవాఁడు.

కేతినాయనిమాట: నీవెవర్రా యిక్కడనిలుచున్నవాఁడు!

ప్రసంగిమాట: నేనా, దశావతారాలాడే పరమభాగవతుఁడరా.

కేతినాయనిమాట: అయితే నేను కేతినాయన్నిరా.

ప్రసంగిమాట: నీవిక్కడికివచ్చిన పనేమిరా ?

వ. అని యడిగిన ప్రసంగితో కేతినాయఁ డెటువలె పలుకరించేని.

చ. హరియు సుదాముఁడిచ్చట విహారముసేయుచు నిన్న రేయి న
చ్చెరువుగఁ బందెమొడ్డి యదుశేఖరులందఱుఁజూడఁగందుకం
బఱిమిఱినాడఁగా,భువనజాక్షుఁడు గెల్చి గృహంబు కేఁగఁగా
నరహరి రేపురమ్మనిన నాతఁడువచ్చుటఁ జెల్పవచ్చితిన్॥

వ. అని తెలియఁజెప్ప నాప్రసంగితో మఱియుఁ గేతినాయఁ డేమని పలుకరించేని.

వాక్యము: నీవు నిత్యాపస్తుడవైతే నామీద నొక పదము పాడవర్రా.

ప్రసంగిమాట: ఆలాగే వినిపించెదనోయి.

వ. అని జతి నొద్దికగా దిద్దుకొని నిద్దంబుగాఁ బొదలు పదములు ముదంబొదవ వినుపించే క్రమం బెటువలె నుండేని.

గౌళ॥ ఆటతాళము॥ చాపు॥

కేళినాయకుఁ డే

విందులకై తేను - ముందె వచ్చువాఁడె ॥౧॥

కదనాలకై తేను - కడ కేఁగువాఁడె ॥౨॥

కవిగాయకులకై తే - కాసీయని వాఁడే ॥౩॥

ఎల్ల లంజలకై తే - కొల్లఁ బెట్టువాఁడె ॥౪॥

తోయజాక్షులపైఁ దమి గల్గువాఁడు- కేళినాయకుఁడె ॥౫॥

వ. అని యిత్తెఱంగున నప్పరమ భాగవతోత్తముఁడు నెఱ నీటు వాటిలఁ బాటపాడిన విని యక్కోఁకిల కేతుండు డెందంబునఁ బరమానందంబునొంది హాస్యంబుసేయు నవసరంబున, సుదాముని గృష్ణుఁడు పంచెమిమ్మని యడుగ నచ్చటికి వచ్చె క్రమంబెటువలె నుండేని.

గుమ్మకాంభోజి - ఆదితాళము.

వచ్చెను సుదాముఁడు హాొయలు మీఱ

వచ్చెను సుదాముఁడు ।

వచ్చెను సుదాముఁడు వాలుసిగ వేసి చూడ

మచ్చెకంటుల మదిలో మమత దోఁచవీధిలో ॥౧॥

చెలువు మీఱఁగఁ జుట్లు నలువొందఁ బురజనులు

పలువురు గన్గొనఁ జేత బంతి పట్టుక ।

విలువ దీర్పఁగరాని వింతవైఖరి పూని

కలువలచెలి మింటి కరుదేర నాడుకొంటు ॥౨॥

వ. ఇట్లు చనుదెంచిన సుదామునితోఁ బ్రసంగి మేటివగను మాటలాడే చందం బెటువలె నుండెనిII

వాక్యముII అదెవరోయి యిచ్చటికి వచ్చినవారు ?
సుదాముని మాట: నేనేనోయి.
ప్రసంగిమాట: నేనన నీపేరేమోయి ?
సుదాముని మాట: నేనా సుదాముఁడను.
ప్రసంగి మాట: నీవిక్కడికి వచ్చిన పనేమోయి ?

వ. అనినఁ బ్రసంగితో సుదాముఁ డేమనుచున్నాఁడు.

ద్వి. వినుము ప్రసంగి, గోవిందుండు నేను
దినదిన మిచ్చోటఁ దిరుగుచు నిన్న
కుతుకంబుతోఁ జెండు గోరించుకొనుచుఁ
బ్రతిన సేసెల్ల గోపాలకుల్ చూడ
నాడుచోఁ గృష్ణుండు ననుగెల్చి నేఁడు
గూఁడి యాడుటచాలు గోర్కులు వెలయఁ
గావున నాకింటికడ కేఁగవలయు
నేవిధంబున నైన నెలమిఁగొడుతను
నేఁటికిఁ జని రేపు నీవిందు రమ్ము
నీటుతో నీకాట నే నిచ్చువాఁడ.

అని చెప్పియంపిన నరిగి నిన్నఁటికిఁ
జననిచ్చి వచ్చితి జలజాతనయనుఁ
డెందున్నవాఁడు నాకెఱుఁగ నీవిప్పు
డందంబుగను దెల్పుమని వేగ (మడుగ)

వ. వినవోయి సుదాముండ! కృష్ణస్వామి నగరిలోపల
నున్నాఁడు. పూఁబోఁడులచే నీరాక చెప్పించి కృష్ణస్వామిఁ
దప్పించేనుగాని యిచ్చటఁ గూర్చుండ వోయి.

వ. అని మందలించు సమయంబున గోవిందుఁడు సుదాముని
రాకఁ దొలునాఁ డాడిన చందంబు డెందంబునఁ దోఁచిన లేచి
సింగారి సేసికొని యచ్చటికి వచ్చె క్రమం బెటువలె నుండెను.

సీ॥ కనకాంబరము గట్టి కౌస్తుభరత్న
మును (వక్షమందున) మురువుగాఁ దాల్చి,
కరములఁ బచ్చల కడియముల్ వెట్టి,
చిఱుత పాదముల మంజీరంబు లునిచి,
నవరత్న విచిత్రమై నలువొందు కొండె
నవధానమున నుత్తమాంగంబునందు
ధరియించి, కెంగేలఁ దామెతుల్గట్టి,
వర బాహుపురులు రవారుగాఁ దొడిగి,
వీనుల జవ్వాది వింతగాఁ బూసి,
కౌనున మొలనూలు కడువేడ్కనుంచి,

గిలుకు పావలు మెట్టి గీరునామంబుఁ
దళుకొత్త నుదుటఁ దద్దయుఁ దీర్చి, పిల్ల
గ్రోవి నూఁదుచుఁ జుట్టు గోపకుల్ గొలువ
గోవిందుఁ డరుదెంచెఁ గుతుకంబుతోను.

శంకరాభరణము ॥ఆదితాళము॥

వారి జాక్షుఁడు వచ్చెను వేడుకమీఱ ॥వారి॥
వారి జాక్షుఁడు సిం — గారము మీఱ గోప కు
మారులుగొల్వఁగ వేణు-ధారుఁడై నేఁడిచ్చటికి ॥వారి॥
ముజ్జగములు నుతింప — మురళినాదము మించఁ
సజ్జనులందఱు తన — చరణాలు సేవింప ॥వారి॥
అందెలు మిక్కిలి ఘ — ల్లన రాణింప ।
గుజ్జురూపముఁ జూచి రాకోమలులు విమోహింప॥

వ. అప్పురా యీవిధంబునఁ గృష్ణుండు సకలభూషణాలంకృతుండై వచ్చి యిచట ముచ్చట హెచ్చు పెచ్చుపెరిగి విచ్చలవిడి నర్తనంబు గావింపఁ బ్రవర్తించు చందం బెటువలెనుండెను.

శంకరాభరణము॥ ఆటతాళము॥ చాపు॥

ఆడేనే కృష్ణుఁడు। తనబోటికాడెలఁగూడి వేడుకతోడ।
మకరకుండలములు — మాటి మాటికిఁ
జెక్కుల జిగిగల్పించఁగా।
అకలంకమైన పీ — తాంబరంబు మేని
కందమై చెంగు లల్లాడఁగా॥ ॥౧॥

సారె పాదముల మం - జీరనాదము సొంపు
మీఱి దిక్కుల నిండఁగా।
హారరుచులు వెలి - దేరి యచ్చట నున్న
వారిపైఁ జేరి - కూరిమిఁ జెల్వఁగా॥ ॥౨॥

బాగుగా రత్నాల - పతక మురముమీఁదఁ
బలుమాఱు నటియించఁగా।
రాగమెఱఁగి పాట - రంజిల్ల వాయుప్రా
రంబు నా వేణు - రాజము సేయఁగా॥ ॥3॥

క. హరి యిట్లు నృత్యమాడఁగఁ
బరికించి సుదాముఁ డతని పజ్జకుఁ జేరన్।
బరువెత్తి వచ్చి గ్రక్కునఁ
జరణంబుల కెఱఁగి పలికె సంరంభమునన్॥

వ. వినవోయి కృష్ణ, నీవు నిన్న నాకిచ్చినమాట పట్టుదప్పి యిప్పగిది నప్పంకజాక్షులఁ గూడి శంకలేక పొంకంబుగా వింత వైఖరి నలరి నీవింతపొద్దునకు వచ్చితివి. నేను భానూదయా త్పూర్వంబున లేచి యిచ్చటికి వచ్చి భోజనమజ్జనంబులు దక్కి నీరాక కెదురు చూచుచున్నవాఁడనని యెఱింగించిన, నవ్వి యవ్విహంగవాహుఁడు సుదామునితో నేమని పలుకరించెని.

ద్వి. వినుము సుదామ, నీవిందు వచ్చినది
విని నేను వేకువవేళ నిచ్చటికి
నడతేరుచోఁ ద్రోవ నతులితంబగుచుఁ
బుడమిని లేని యపూర్వ వస్తువులు
గనుఁగొని మదిలోనఁ గడుఱెఱఁగంది
వినుతింపుచుఁ బెను తీవిని నింతసేపు
తడసితిఁ గాని సంతసమున గొల్ల
పడుచులఁ గూడి నీ పందె మిచ్చుటకు
రాకుండ లేదు పరాకుతో నిను ని
రాకరించి సుదామ, రమణీయధామ !

వ. అప్పు రా యీవిధంబున మందలించిన గోవిందునితో సుదాముఁ డందు కేమని పందెమడిగే చందం బెటువలె నుండేని.

శంకరాభరణము ॥ఆదితాళము॥

పందె మీరా । గోపాలకృష్ణ । పందెమీరా॥
ముచ్చవగమాని – మురవైరి నిన్న నీ
విచ్చిన మాట పట్టిస్తూ – డియ్యకున్న నే ని
న్నెచ్చటికైనాను దెమల – నిచ్చేదన బాగాయని
తచ్చన మాటలిందుఁ – దగదు వేడ్కఁబూని ॥

వ. అప్పు రా యీదారిని సుదాముఁడు పందెమిమ్మని యడిగిన దామోదరుండందు కేమని మందలించేని.

చ. వినుము సుదాము, నీవు నను వేమఱు వేడఁగ నేల నిప్పుడేఁ
గనుఁగొనినట్టి వస్తువులు గ్రక్కున మాకొనఁగూర్చితాయెనా
నను మనవారిలో గెలిచినట్లెసుమీ; యనృతంబుగాదు; నే
నను వచనంబు సత్యము; విహంగతురంగుని యాన తప్పినన్.

వ. అని యిత్తెఱంగున వాసుదేవుండా సుదామునికి నమ్మికగాఁ దమ్మికంటిపై నొట్టువెట్టిన విని వాఁడేమని పలుకరించేని.

ద్వి. మంచిది గోపాల, మనసఖుల్వినఁగ
నంచితంబుగను నీ వాడిన మాట
తప్పవేకద ! యింకఁ దలఁచిన తలఁపు
చొప్పు మాకెఱిఁగింపు సుకరంబుగాను;
చేసెద నేను బల్చెలువుగా నేఁడె
నాసరివార లౌనని వినుతింప.

వ. అవురా యీగతి సమ్మతించి సుదాముఁడు వాసుదేవునితో నీవిందు వచ్చునప్పుడు గనుంగొనిన వస్తువులెయ్యవి? అవి తెలియఁబడ వివరింపుమనిన నతండేమని తెలియఁ జెప్పేని.

ఆ. వె. చెలువుమీఱ నేను చెలికాండ్రు గొలువంగ
నిన్ను జేర వచ్చుచున్న వేళ।
తరళనయన లైదుగురు ప్రౌఢసఖితోడ
నరుగుచుండఁ గంటి నద్భుతముగ॥

క. కనుఁగొని వారల నెనయను
మనమునఁ దమి చిగురువెట్ట మాన్పఁగలేకే
నును ననవిలుతుని శరముల
కును లోనై నిన్ను వేడుకొంటి సుదామా !

వ. ఔరా యిప్పగిది నప్పంకజాక్షుండు తన కోరిక తేటఁ పడం జెప్పిన విని, సుదాముండు విస్మయం బంది యేమని వలుకరించెని.

వ. వినవోయి కృష్ణ, నీవు చూచివచ్చిన పంచకన్యల పేళ్లు దెలియక వారల గృహంబులును ఎఱుంగక నే నెత్తెఱంగున నిక్కార్యంబు హత్తుగడ గావింతు ? నాచేత ననుకూలంబు గాదుసుమీ.

వ. అవురా యివ్విధంబునఁ జెప్పిన విని దామోదరుండు సుదామున కేమని యెఱింగించెని.

ఉ. కాదననేల నేఁదొలుతఁ గామినుల న్గనుఁ గొన్న వేళనే
మోదముతోడ వారిగృహముల్ పరికించుట కొక్క బాలునిన్
సాదరణానురాగమున నంపితి; వాఁడిదె వచ్చు; వచ్చితే
ఖేదువుగాని వాని వెనుబూని సుదామ,సుధామ యొప్పఁగన్.

వ. అవురా యిమ్మాడ్కి నమ్మారవైరి చెప్పినవిని సుదాముఁడు సమ్మతించిన సమయంబునఁ, దొలుత నప్పంచకన్యల పిఱుంద వారల మందిరంబులరసి రమ్మని యంపిన బాలుఁడు తద్గృహంబులరసి,కృష్ణుని కడకు వచ్చె క్రిమంబెటువలె నుండెని.

గుమ్మకాంభోజి॥ ఆదితాళము॥

పిల్లజుట్టు కదిలాడ - నల్లని గొంగడికోడ।
నెల్ల జనములు చూడ - గొల్లవాఁడు వచ్చెను॥ ౧॥
మంద గమనల వెంట - మందర ధరుఁడంపిన
చందము చేసుక వేగా - నందముతో నిచ్చటికి ॥ ౨॥

వ. అపురా యీచందంబున గోవిందుని కడకు వచ్చి వాఁడేమని మందలించేని.

క. దేవర పంపిన పనికై
యా వనితల వెంట నంటి యట కేఁగి వెసన్ ।
ఠీవిగల వారి గృహములు
వేవేగమె గంటిఁ జిత్రవీధిని వరుసన్॥

వ. అపురా యీలీల బాలకుండు దెలుప విని గోపాలుండు సుదాముని వాని వెంటఁ గూర్చి యంపిన సంతసంబుఁ జెంది చనుచున్న సమయంబున నప్పంచకన్యలకుఁ బ్రాణపదంబైన సఖి వారికెదురుగా రాజమార్గంబున డంబు హెచ్చ వచ్చె విధంబెటువలె నుండేను.

గుమ్మకాంభోంజి॥ ఆదితాళము॥

కనకాంబరము గట్టి ఫాలమునందుఁ - గస్తూరిబొట్టుపెట్టి॥
అనువొంద పావాలుమెట్టి, కెంగేలులీల-నలరుబంతిపట్టి॥
పాలిండ్లు గునిసాడఁగా, గుంపులుగూడి
పౌర జనులు చూడఁగా।

తాళగతుల జూడగా, వేడుకతోడ
మేలైన పాటఁ బాడుక॥ ॥౨॥
మతిలోని కోర్కులూరను, వాల్చూపులు
మరుశరములఁ గేరను।
ప్రతిలేని సొంపు మీఱను, మరాళిక రాజ
మార్గముఁ జేరెను॥ ॥3॥

వ. అప్పురా యీగతి నా గజగమన రాజమార్గంబునఁ జనుదేర నబ్బాలకుండు దూరంబునఁ గాంచి యీ చంచలాక్షి పంచకన్యలకుఁ బ్రాణపదంబై నలువొందు చెలువయని సుదా మున కెఱింగించిన, నయ్యింతి చెంతకుఁ బోయి హాయి మీఱ దానితో వాఁడేమని పలుకరించేని.

ఉ. ఇందునిభాస్య, నీ వెచటి కేఁగెదవి వెవ్వరిదాన! విందు సొం పొంద నొకింతసేపు కృపఁబూని వసించి యెఱుంగఁజెప్పుమా పొందుగ మాకటన్న, విరిఁబోఁడి ముదంబున నందునిల్చి గో విందుని చెల్మికానికి సవిస్తరమై గనుపట్ట నిట్లనెన్॥

శంకరాభరణము ॥ఆటతాళము॥ చాపు॥

సంతసంబునఁ బంచకన్యల చెంతఁజేరి
వింతగా నేనుందురా యే వేళ।
అంతరంగ మెఱిఁగి వేడ్కల నన్ను వా
రెంతయుఁ బాలింతురు సుశీల॥ ॥౧॥

పేరు మరాళికందు రందఱు, నామాటంటే
గారవించా కన్యలు విందురు।
నారదాది భక్తజన మందారుఁ, జైమినీజిన
సారసాక్షు నమ్మిన బండారు॥ ॥౨॥
కనకాంగులు వేడుకతోడ, శృంగారవనము
గనుఁగొన వచ్చే మన్నారీడ।
అనువుగా నే నిల్చినజాడ, వారు వింటే
కనలుదురురా గాయకుఁడ॥ ॥౩॥

వ. అవురా యిత్తెఱంగునఁ దనవృత్తాంతంబు దెల్పి నీవెవ్వఁ డెక్కడికిఁ బోయెదవని యడిగిన నమ్మరాళికతో సుదాముఁ డేమనుచున్నాఁడు

ద్వి. చెలియరో నేఁడు మా శ్రీకృష్ణుఁడలరి
చెలికాండ్రు గొలువఁగఁ జెలువుగాఁ జేరి
దారిలోరాఁగ నెంతయు సొంపుమీఱఁ
గా రయంబునను మీ కన్యకామణులు
పోవుచోఁ జూచి యా పువుఁబోండ్ల చెలువు
భావంబులో నుంచి భావజుచేత
గాసిఁ జెందుచు నుండఁ గనుఁగొనలేక
భాసురాంగేను నీ పజ్జ కీవేళ
వచ్చితిఁ దెలుప నవశ్యంబు నీవు
మచ్చికతోడను మాట తోసేయకను

వనజనేత్రల నింక వసుదేవసుతుఁడు
గనుమాడ్కిఁ గార్యసంఘటన యొనర్పు
మని వేడుకొనినచో నమ్మరాళికయుఁ
బనిపూన శ్రీహరి భక్తురాలగుట.

వ. అపురా యాగతి సుదాముఁడు కృష్ణుని కార్యార్థంబుగా వచ్చితినని చెప్పిన మంచిదని సమ్మతించి మరాళిక యేమను మన్నది.

క. వినుము సుదామ, రయంబున
ఘుశవనమున కిపుడె పంచకన్యకలను వే
డ్కను దోడితెత్తు నిచటికి
వనజాక్షుని దెమ్ము నీ వవశ్యము వేడ్కన్.

వ. అపురా యీక్రమంబున నమ్మగువ నమ్మిక చెప్పి గృహంబున కేఁగుచో దానిపిఱుంద వారివనప్రవేశంబు తమకెఱిఁగించు కొఱకు బాలకు ననిచి, సుదాముఁడు మగిడి వచ్చి కృష్ణునకు నక్కార్యంబు వివరంబుగాఁ దెలిపిన, తదనంతరంబునఁ గృష్ణుని కడ కౌకసిద్ధుండు వచ్చేచందం బెటువలెనుండేని.

జోడి॥ ఆదితాళము॥

జడలు మూపునజాఱ – జలపాత్ర చేమీఱ
బడుగు దేహమునిండ – భసితము దేర।
కడు నిష్ఠతో నూరఁ – గంసవైరిని జేర
వడిగ సిద్ధుఁడు వచ్చె వరమునుల్ మెచ్చ॥

వ. అప్పురా యివ్విధంబున వచ్చిన సిద్ధునకు కృష్ణుం డెదు ర్కేఁగుదెంచి, వందనంబు గావించి, సింహాసనంబున నుంచి యేమని మందలించేని.

ద్వి. అనఘాత్మ, మీరు నాయందకీవేళ
జనుదెంచి నంతనే సకల శుభంబు
లనుకూలమయ్యె సర్వాభీష్టములును
దనకుఁ దానే చెందె ధన్యుండనైతి.
చెలువగ్గలించె నాచిత్తంబు పొంగెఁ
గలిమియు బలిమియుఁ గడువృద్ధిఁబొందె.
కాన మీ మహిమ లోకారాధ్యుఁడైన
దాన వారికి నెంచఁ దరమె సిద్ధుండ.
ఇపుడొక కోర్కె నేనెన్నియున్నాఁడఁ
గృపతోడఁ దెలుపు నాకేర్పడ నీవు.
ఔనొ కాదో లేక యాలస్యమగునొ
జ్ఞానదృష్టినిజూచి కడు వేగముననుు.

వ. అప్పురా యీవిధంబునఁ గృష్ణుం డడిగిన విని సిద్ధుం డొక్కంతసేపు ధ్యానంబుఁ బూని, దిశలాకర్ణించి, మరుఘాయని యేమనుచున్నాఁడు.

క. మనమున దేవర తలఁచిన
పని చెప్పెదఁ బంచసతుల వరియింపఁగ నీ
దినమున నీకార్యము నీ
కనుకూలంబగును ఒక్కయంగన వలనన్.

వ ఔరా యిత్తెఱంగునఁ దేటపడఁ జెప్పి సిద్ధుండరిగిన తదనంతరంబున నలుగురు గోపాలకులు కృష్ణునికడకు దీర్ఘదంత యను పెరుగుదాని వెంటఁబెట్టుక వచ్చు క్రమం బెటువలె నుండెనని.

సౌరాష్ట్రము॥ ఆటతాళము॥ చాపు॥
కంబళిగట్టి వికారముతోను
లంబకుచము లుయ్యాల లూఁగఁగాను ॥౧॥
సుంగాణి చేత సిస్తుగఁ బట్టి జనులు,
సింగారముగఁ జూడ శ్రీకృష్ణుకడకు ॥౨॥
కడవ నెత్తినిఁ బెట్టి గాజులు గదల
తడఁబాటుతో దీర్ఘదంత వచ్చెను ॥౩॥

వ. అవురా యీవిధంబున గోవిందుని కడకు దీర్ఘదంత పొట్టనడల నడతెంచి పెరుగుచట్టి క్రిందనుంచి కొన్ని హాస్యంబులు సేయుచున్న సమయంబున కృష్ణుండు మెల్లగ దధిభాండంబు లంకించి దాని బూతుఁ జేయ నెంచి యున్నచోఁ బంచకన్యల సమాచారంబు దెలుసుక బాలుఁడువచ్చి యేమనిపలుకరించెనని.

ఆ.వె. కమలనాభ, పంచకన్యకామణులు మ
రాళికయును జూడ రమ్యవేష
భూషణములు వెట్టి పొలుపుతో శృంగార
వనము కిపుడు వచ్చి రనువుమీఱ.

వ. అపురా యీలీల నబ్బాలకుండు కృష్ణునితోఁ దెలిపిన తదనంతరంబున నప్పంచకన్యకలు వనకేళి సలుప మరాళిక వెంట నంటి శృంగారవనంబున కేతెంచే చందం బెటువలె నుండేని.

ద్వి. అనువు మీఱిన శిరీషామ్రఖర్జూర
పనస వంజుళ నింబ బదరి పున్నాగ
మాతులుంగ లవంగ మందార వకుళ
కేతకీ భల్లాతకీ నారికేళ
చందన పిచుమంద జంబీర తినిశ
కుంద కురంటక కోవిదార వట
సరళ కపిత్థ కాంచనక్రముకాది
తరువులఁ దనరు నుద్యానవనాని
కేతెంచిరట రుచు లెచ్చు బంగారు
వ్రాఁత చీరలు గట్టి బహుభూషణములు
మైనిండఁ బూని గమ్మను బుక్కఁ బూసి
జానొందఁ వేనలుల్ జాఱుగానుంచి
తీరుగా మెఱయఁ బత్త్రిరిబొట్లు చూడ
మీఱు ఫాలములందు మిన్నగాఁ బెట్టి
చెన్నొంది తెనుఁగు సంస్కృత మహారాష్ట్రి
కన్నడ ద్రావిడ కబ్బంబు లందుఁ
గదలక కలకంది కనకాంగి యందు

వదన మనోరమ వరచిత్రరేఖ
లను నామములఁ జాల నవనీతలంబు
నను కీర్తి గాంచిన యంగనామణులు.

శంకరాభరణము॥ రూపకము॥

మాటల వైఖరి మీఱఁగా వల
వాటు పైఁటలు భుజముల జాఱఁగా।
బోఁటులు పలుసొంపు దేరఁగాఁ జేరి
సీటుల మనవులు గోరఁగా॥ ॥౧॥

బెళుకు నడుము లసియాడఁగాఁ గొప్పు
తళుకు నెఱులొకింత వీడఁగా।
కెలఁకుల రాయంచ లాడఁగా నెంతో
మెలకువతో వింత జాడగా॥ ॥౨॥

నిండు వేడ్కలు మదిఁ జెందఁగాఁ బూల
చెండులు చేత సొంపొందఁగా।
మండలాధిపులు వెఱఁగందఁగా వచ్చి
రండజాక్షులు వనము ముందుగా ॥3॥

వ. అప్పు రా యీచందంబున నాకుందరదనలు వనంబుఁజొచ్చి వచ్చుసమయంబున మరాళిక వారలతోఁ దన చాతుర్యంబు మెఱయఁ దరువులపేరులు వేఱువేఱ నేమని తెలియఁజెప్పెని.

గుమ్మకాంభోజి॥

చెలువుగ మీరుచూచినది మాకందము భామలార।
మదిఁ జెన్నలరఁగ మీ చెంతనున్నది పారిజాతము భామలార॥1॥

పెక్కున మీరు పట్టినది కాంచనము భామలార।
మీర లక్కజముగ మెచ్చినదియె సరళము భామలార ॥2॥

ఘనముగా మీరు నిల్చినది చాఁదగుపొగడ భామలార।
యిప్పుడనువుగ నను మీరలడిగినది ప్రియాలము భామలార॥3॥

వ. అవురా యిమ్మాడ్కి నమ్మరాళిక పలుకరించిన విని వారలలో నెల్ల మేలైన కనకాంగి రంగుమీఱి పొసంగ నేమని ప్రసంగించెని.

చ. పలుకుల నేర్పు మీఱఁగను భామిని, నీవిటులుగ్గడించితేఁ
దెలియఁగ శక్యమే పులుఁగు తేజివజీరునకైనఁగావునన్
బొలుపగు నీదుప్రజ్ఞ విరిఁబోఁడులకేగ తెఱుంగవచ్చు నీ
చెలిమను మంత్ర మింత దయసేసినఁగాక విసీలకుంతలా!

వ. అవురా యిత్తెఱంగునఁ గనకాంగి మరాళికను వినుతించుచున్న సమయంబునఁ, గేకి కోకిల కలహంస చకోర చక్రవాక నికర కలకలంబులు మీఱిన వారింపఁ జాలక, యాకోల కస్తనులు మదనదేవత నారాధింప సమకట్టిరఁట యెటువలెను.

ద్వి. జలకంబులాడి మేల్చలువలు గట్టి
ఫలములు దేనియల్ పరిసవముల్పాలఁ
దెచ్చి యచ్చట మిన్న దేరినచోట
ముచ్చట దళుకొత్త ముదితలు పూల
చప్పరం బొనరించి చలువగందమున
గొప్పతిన్నియ పైచి గోవజవ్వాజి
చే రతిదేవిఁ జిత్తసంభవుని
నీరజారాతిని నిఖిలాండజముల
వ్రాసి వారలను భావంబులో నిలిపి
భాసురంబుగఁ బూజపద్ధతి నెఱిఁగి
పూజగావించి పెంపునను ధ్యానంబు
నోజతోఁ జేయుచునుండ నావేళ.

వ. అపురా యివ్విధంబున జవ్వనులు మన్మథధ్యానంబుతో నున్న నచ్చటికిఁ గృష్ణుండు బాలునుగూడి వేడుక హెచ్చ వచ్చే చందం బెటువలెను.

రేగుప్తి॥ ఆదితాళము॥

మదిలోన సంతసిల్లుచుఁ దనలోఁదానె
మాటి మాటికి నవ్వుచు।
ముదమున వేణువూఁదుచు ముచ్చట మీఱ
ముదితల పొందుగోరుచు। ॥౧॥

చెలఁగి దిక్కులు చూచుచు నేమఁటు బాల
చెలికానిఁ జేరఁ జీరుచు।
నలువొంద నడయాడుచు వచ్చెఁగృష్ణుఁడు
నన విల్తుని తళుకుచు॥ ॥౨॥

వ. అవురా యీవడువున నడతెంచి యప్పుడంతులఁ గనుఁగొని కృష్ణుఁడు వారల రూపరేఖాతిశయంబు నేమని వినుతించెని.

శంకరాభరణము॥ ఆదితాళము॥

ఎలనాగల కుంతలములు ఇంద్రనీలములు।
మలయజగంధుల రొంట్లు మరుని తేరిబండ్లు॥ ॥౧॥

కనకాంగులవా తెరలు కండచక్కెరలు।
వనజాస్యలలోచనములు వరపంకజములు॥ ॥౨॥

భుజగవేణుల మోములు పూర్ణసోములు।
గజయానల పాలిండ్లు గజనిమ్మపండ్లు॥ ॥3॥

మీననేత్రల మీఁగాళ్లు మెఱయు తాబేళ్లు।
మానినుల కందరములు మంజుల దరములు॥ ॥౪॥

వ. అవురా యిప్పగిది నప్పంకజాక్షుండు నిండు వేడుకతోడ నుతియించుచున్న సమయంబునఁ బంచకన్యకలు మన్మథ ధ్యానంబుచాలించి, కన్నులు తెఱచి, ముందఱనున్న గోవిందుని గాంచి మోహించి యేమనుచున్నారు.

సౌరాష్ట్రము॥ ఆదితాళము॥
కుతుకముతో రతి నితవుగఁ బాలించే
కుసుమబాణుఁ డితఁ డేమో।
అతఁడైనఁ జెఱకువిల్లుండనె యుండఁడా
యతఁడు గాఁడు సుమ్మి వీఁడు॥ ॥౧॥

సతతము కలువల నెనవున నలరించే
చలువల దొర యితఁడేమో।
యతఁడైన మేనఁ గళంకము గలుగఁడా
యతఁడు గాఁడు సుమ్మి వీఁడు॥ ॥౨॥

జతనాన నిషధదేశము నేలి వెలసిన
చక్కని నలుఁ డితఁ డేమో।
అతఁడైన ముదిమి వీనినంటి యుండఁగవలదా
యతఁడు గాఁడు సుమ్మి వీఁడు॥ ॥3॥

వ. అప్పురాయిాలీల నబ్బాలగోపాలుని బాలిక లితఁడని వివరింపఁ జాలక, మరాళికను వీఁడెవ్వఁడని యడిగిన, వారలతో నది యేమని వివరించెని.

ఆ. వె. ముగువలార, వినుఁడు మగవారిలో నెల్ల
నొఱపుగాఁడు కృష్ణుఁ డొకఁడె ధరణి।
ననుచు మాకుఁదొలుత వినిపించినట్టి యా
ఘనుఁడితండె సుమ్మి గావు నటులు.

వ. అప్పు రా యిమ్మాడ్కి నమ్మరాళిక దెలిపిన విని బాలికలు గోపాలునిపై మనసుంచి గనుంగొన నతఁడును వారల నప్పగిది వీక్షింప నన్యోన్యావలోకనంబులు పెనఁగొనుచున్న సమయంబున, నప్పుడఁతుల భుజియింపఁ బిల్వ నొకానొక దాది వచ్చె క్రమం బెటువలె నుండెను.

దరువు: మల్లెపూలు జడఁజుట్టి మైలకోక మొలఁగట్టి।
నల్లని కోల చేఁబట్టి నాభి నామము పెట్టి।
యెల్లజనముల చుట్టి యెలమిఁజూడ దొ్రవఁబట్టి।
మెల్లదాది వెడలెను మెలఁతలఁబిలువను॥

వ. అప్పు రా యీదారి నాదాది వచ్చి భుజింపఁబిల్వ మంచిదని దాని వెంటనంటి వారలు గృహంబునకరుగ నమ్మరాళిక బాలునిఁ గనుసన్న చేఁబిలిచి, వీరల నేనిప్పుడే పద్మాకరంబునకుఁ దోడి తెచ్చెదఁ గృష్ణునిచ్చట నుండుమని చెప్పిపంపిన వాఁడట్లు సేసి పంచకన్యల సమాచారం బరయుటకొఱకుఁ బోయిన పిదపఁ, గృష్ణుండు విరహాభరంబున కోర్వఁజాలక తనలోఁదా నేమనుచున్నాఁడు.

ఖాబి॥ ఆదితాళము॥

కూహాకమున మరుఁడలుగుల నను గగ్గోలుసేయఁగాను
మోహసాగరం బెటులీదుదునా ముదితలఁజూడకను॥౧॥

తరుణుల నాడెందములోఁదలఁచినఁదమిమిక్కిలి హెచ్చి।
వెఱవకుమని నావేదన దీర్పనీవేళనె వడివచ్చి ॥౨॥

బిగిచను లెదనాటఁగూర్చక మేల్గిగి నగవులతోన।
సొగసుగ రతి నాథగువలఁ గలయని
మగవాని దిమేనా॥ ॥3॥

వ. అని మఱియు నేమనుకొనుచున్నాఁడు.

సీ. చనుజక్కవలఁ జేతులను బట్టి ముద్దాడు
చును వారి చెలువముల్ చూడకున్నఁ
దను వల్లికలు మేన నెనయఁ గౌఁగిటఁ జేర్చి
పలుమాఱు వారితోఁ బలుకకున్నఁ,
గటిచక్రములు వేడుకలు మీఱఁ దొడలపై
నుంచుక వారిలాలింపకున్నఁ
జెక్కుటద్దములు సొంపెక్క గోరుననొక్కి
నేఁడె వారలతోడఁ గూడకున్న,

గీ. రాజు వలరాజుగూడి సర్వాంగములను
తుక తుక మసంగ నన్ను వాత్తుకొని వేడి
కరముల శరంబులను జాలగాసిచేయ
కుందునే ! యింక నెటుదాళుకొందు నేను !

వ. అవురా యీచందంబున గోవిందుండు హృదయారవిందంబున నయ్యిందుముఖుల పొందు లేక కుందుచున్న సమయంబున వారలు భుజియించి మరాళిక ప్రేరేపింప జలక్రీడ సలుప నొకరి నొకరు పిలుచుక వచ్చేక్రమం బెటువలె నుండెనని.

ఆటతాళము ॥చాపు॥

చంద్రహాసా నీవు రావే జలకేళికి। పూర్ణ
చంద్రముఖి, నీవురావె జలకేళికి ॥౧॥
జలజాక్షి, నీవురావే జలకేళికి। వేగ
నలివేణిరో నీవు రావె జలకేళికి ॥౨॥
సన్నుతాంగి నీవురావె జలకేళికి। ప్రి
సన్న యౌవన, నీవుర్రావె జలకేళికి ॥౩॥
కలువ కంటి, నీవురావె జలకేళికి। ఓ
తలిరుఁబోఁడి, నీవురావె జలకేళికి ॥౪॥

వ. అవురా యీ క్రమంబున నొకరి నొకరు పిలుచుకొని వచ్చుచున్న యెడ వెడవిల్తుఁడలుగుల మనములఁ గుంద నేయఁ దాళఁజాలక కృష్ణునిం దలంచి మోహాతిశయంబున నేమను చున్నారు.

ఘంటారవము ॥ఆదితాళము॥

రారా గోపాల మది రంజిల్లఁ జాల
చను మొనలను గినుకను నన విలుతుఁడు।
మునుకొని యలుగుల ఘనముగ నేసె ॥౧॥
చుఱచుఱమని మెయి యొఱపఱమరుసున।
గఱచుగఁ గరువలి మెఱయుచు వీచె ॥౨॥
ఎలమిని గెల్లఁకుల నలరుల విలుతుని
బలములు వీడి యఁలరుచుఁ బలికె ॥౩॥

వ. అప్పురా యీరీతి నాసరోవరంబుఁ జేరఁ జనుదెంచి తీరంబున వలువలు దిగిచిపెట్టి యందుకు మరాళికను గావలి వెట్టి వలిపపావడలు గట్టి సింహమధ్యలు పద్మాకర మధ్యంబుఁ జొచ్చి జలక్రీడలు సలిపేచందం బెటువలె నుండెని.

మధ్యమావతి ॥ ఆదితాళము॥

భామలు జలములాడేరే । హాయలుమీఱ
భామలు జలము లాడేరే॥
తామరపువ్వులు బలుప్రేమతోఁ జేతులఁబూని
వేమఱు నవ్వుచు శ్రీ కామినులవలెఁజాల ॥౧॥

అందముగఁ బూల మకరందములా నీటిలోన।
చిందఁజేయుచుఁ బరమానందముతోఁ బొందుగాను॥౨॥

ఒక్కరొక్కరికి డాయుచు మక్కువమీఱ మెచ్చుచు।
జక్కవగుబ్బలంటుచు దిక్కులఁ గనుఁగొనుచు ॥౩॥

వ. అప్పురా యీవిధంబున జవ్వనులు జలక్రీడలుసలుపుచున్న జాడఁజూచి, చని, బాలకుండు గోపాలునకెఱఁగింప సొంపొంది తానొక్కరుండే మందగమనంబున సరోవరంబునకు వచ్చి యమ్మరాళిక సమ్మతంబున నంబరబులు గొని చెంత నున్న సురపొన్నపై కెక్కినపిదప మరాళిక యమ్మక్కయని వారలతో నేమని మందలించేని.

క. చెలులార, మీరలందఱు
జలకేళి యొనర్చుచున్న సౌందర్యము నే
నెలమిఁ గనుఁగొనఁగ వలువల
నలరుచుఁ గొనిపోయి కృష్ణుఁడవనిజ మెక్కెన్.

వ. అవురా యీప్రకారంబున నమ్మరాళిక దెలిపిన నచ్చెలువ లదరిపడి, కొలను వెడలి, గట్టుకు వచ్చి మిట్ట వనులు గనుపట్ట రాకుండఁ జేతులు గట్టుకొని, నలు దిక్కుల నరయుచో నొక్క సురపొన్నపై నున్న చిన్ని కృష్ణునిం జూచి, జిలి బిలి పలుకుల వలువలిమ్మని యడిగే చందం బెటువలె నుండేని.

సౌరాష్ట్రి॥ ఆటతాళము॥ చాపు॥

మ్రొక్కేమురా నీకు గోపాలా। యిట్టి
ముచ్చు వగలు మాని గోపాల
మక్కువతో నీవు గోపాలా యింక
మన్నింపరా మమ్ము గోపాల ॥౧॥

చిఱుతల మని మమ్ము గోపాల మెల్ల
చేర రమ్మనేవేర గోపాల।
దొరవైతేనేమి గోపాలా యింత
దుడుకులు చెల్లునా గోపాల ॥౨॥

దాదులు వచ్చితే గోపాలా నిన్ను
దండించఁ బోయేరు గోపాల ।
వాదు మాని వేగ గోపాల మాకు
వలువలు పాలించు గోపాల॥ 3॥

వ. అవురా యీగతి నా గజగమన లంబుజాక్షు నంబరంబు లడిగిన వారలతో నతఁడేమని పలుకరించేని.

ద్వి. ఎలనాగలార, మీరిచ్చట నన్ను
బలుకులఁ దేలించి బాగు మీఱఁగను,
మొలక నవ్వులతోడ ముద్దులు వెట్టి
సరసంబు లాడుచు జక్కవ గుబ్బ
లురమునఁ జేర్చి సొంపొందఁగ మీఱు
సొలపుల వలపుల సొగసుల వగల
వలరాజు కేళి రువారుగాఁ గూడి
నా మనంబలరించి నను మీకు వలువ
లోమికతో నిష్ట నొక్కింతలోను.

వ. అనిన గోవిందునితో నాకుందరదన లేమనుచున్నారు

సీ. బాలగోపాల, మమ్మొక్కపారి నీవు
గలయ నెవ్వరు మరి బొట్టు గట్టఁబోరు।
గాన నొల్లము సంసారహానియైన
యిట్టి పనిసేయ; వలువల నిమ్ము దయను.

వ. అనిన వాసుదేవుండా భాసురాంగులతో నేమను చున్నాఁడు.

చౌళి ॥ ఆటతాళము ॥ చాపు ॥

భామలార యెవరుచెట్టఁ - బట్టకున్న నేమాయెను
ప్రేమ మీఱఁగఁ మిమ్ముఁ - బెం డ్లైనాఁడేను ॥౧॥
పణఁతులార నా ప్రాణ - పదమైన స్త్రీలకన్న
కడుఁజనవున మిమ్ము - గారవించేను ॥౨॥
మగువలార, నేను మీ - మాటద్రోయక యెపుడు
తగవునఁ బాలించే నెం - తయు వేడ్కను ॥౩॥

వ. అని మురారి పలికిన నాకలకంఠులు సమ్మతింపక యూరకున్నఁ గని మరాళిక వారలతో నేమనుచున్నది.

చ. చిలుకల కొల్కులార, మిముఁజెల్వుగఁ గృష్ణుఁడు పెండ్లియాడితే
తలఁపులు పండు సంతసము తద్దియుఁజెందు యశంబుగల్గు మే
నులు తళుకొందుఁగావున ననూనముగాఁగను సమ్మతించి సొం
పొలయఁగ నేఁడె వానిఁ గృహంబూని శుభంబుగఁ జెట్ట వట్టుఁడే.

వ. అపుడా యిమ్మాడ్కి నమ్మరాళిక హితోపదేశంబు చేసిన సమ్మతించి వారలా గోవిందునితో నేమని మందలించేరు.

క. విను కృష్ణ, మాకు వలువల
నను వుగ నిచ్చినను బెండ్లియాడెద మిపుడే
మనమునఁ గుతుకము మీఱను
నిను మేమందఱము సుజన నికరమువొగడన్.

వ. అవురా యిత్తెఱంగున నత్తలోదరులు పలికిన విని కృష్ణుండు తనమనోరథంబు నెఱవేఱెనని మనంబున సంతసిల్లి, వారలకు మరాళిక ప్రూఁటమీఁద నంబరంబు లొసంగి తరువు దిగి, హరువుగా వారలఁ గూడి నర్తనంబు సేయుచున్న సమయంబున నచ్చటికి ముహూర్తంబు నిర్ణయింప మంచనభట్టు వచ్చే మార్గం బెటువలెనుండేను.

దరువు. కంచి ధోవతులు గట్టి – పంచాంగము చంకఁబెట్టి
ఎంచరాని నిష్ఠతోను – మంచనభట్టు వచ్చెను ॥౧॥
జపమాలిక చేఁబూని – జన్నిదములు మెఱయ।
అపరిమితమైన పర – మానందముతో వచ్చెను ॥౨॥

వ. ఇవ్విధంబున వచ్చి మంచెనభట్టు కృష్ణునకుఁ బంచాంగము చెప్పే చందం బెటువలె నుండేని.

క. పంచాంగ మిట్లు చెప్పిన
మంచన్నను జూచి లోకమాన్యుడు పలికెన్,
ఎంచఁగఁదగు సుముహూర్తం
బంచితముగఁ దెలుపు పెండ్లికని వేగముగన్॥

వ. అని కంసారి పలికిన విని, మంచనభట్లు నికటంబుగా నొక శుభముహూర్తంబు నిశ్చయించి చెప్పిన, నమ్ముహూర్తంబునందుఁ గృష్ణుఁడు పంచకన్యలఁ బాణిగ్రహణంబు గావించే చందంబెటువలె నుండేని.

శ్లో. తదేవలగ్నం సుదినం తదేవ
తారాబలం చంద్రబలం తదేవ।
విద్యాబలం దైవబలం తదేవ
లక్ష్మీపతే తేంఘ్రియుగం స్మరామి॥

వ. ఆసమయంబున మరాళిక శోభనపాట పాడెనట యెటు వలెను.

శోభనమె శోభనమె।ప్రాభవుఁడగు మాబాలకృష్ణునకు।
ఆలములోవృషభాసురుని గూలనేసి గోపకులు మిగుల।
బాళిని గనుఁగొన బలదేవునిఁ జేరి
యాలఁ గాచిన గోపాలునికి ॥౧॥

శైశవమున బంధు జనులు మెచ్చ
కంసుని పగదీఱ ఖండించి।
వాసిగ దేవకీ వసుదేవుల నలరఁ
జేసి వెలసిన చెలువునకు ॥౨॥

సురముని గణములు స్తుతిసేయఁగా।
ధరణిలో నుదయించి దైతేయుల।
శిరములఁ దునుమాడి శ్రీకృష్ణుఁడను పేర
నిరవుకొనిన జగదీశునకు ॥౩॥

ద్వి. ఔర యీగతిఁ బెండ్లియాడి వారలను
గారవమునఁ బ్రోవఁగా నొక్కనాఁడు
చెలియలు గొలువంగ శ్రీకృష్ణుకడకుఁ
గలకంఠి వచ్చి బంగారుకోకలును
గొలుసరమ్ములు కంఠమాలికలు
జాళువా మొలనూలు సరిగపావడలు
గావలెనని వేడఁగా మంచిదనుచు
నావేళనే దాని కతిమోదమునను
గరుణ చేసినదెల్ల ............
అరయను జెలికత్తె లనువుగాఁ దెల్ప
విని యిందుముఖి సైఁచె వేమాఱు మదిని.
కనలి మనోరమ కానిమ్ము టనెను,
వరచిత్రరేఖ భావమునఁ గోపించి
తరుణులలోన నెంతయు.....

...... నుండ నాయతివ కిప్పగిది
నానాంబరంబులు నవరత్న భూష
ణంబులు దయచేయ నాయమె యనుచు,
డంబుగాఁ గనకాంగి డాయంగ వచ్చె॥

వ. అపురా యిత్తెఱంగున నక్కనకాంగి కృష్ణునికడ కేఁగు దెంచి పంచకన్యలలోనెల్లఁ బెద్దదాన నైన నేనుండఁగా నక్కనకాంగి కిప్పగిది వలసినవస్తువులిచ్చి సన్మానఁచేయ నాయమా యని యాగ్రహించి మాటలాడుచుటయుఁ. గృష్ణుండందులకుఁ బ్రత్యుత్తరం బిచ్చుటయు నెట్టవలె నుండేనః.

పదము॥ గట్టిగ నను జెట్ట పట్టేటప్పుడు చెప్పి
నట్టి మాటలు దప్పినట్టాయె...... ॥౧॥
భూతల మంతయుఁ బాతాళమునఁ
బట్టదా తరలాక్షి ॥౨॥
అంత సత్యముంటే యింత సేతువ యింక
సంతతమును నా చెంత చేరక్కర ॥౩॥
చేరకు మని నన్ను గేరకువే............
.................... నీ కిచ్చేనే ॥౪॥
ఇచ్చినట్టి నన్ను మచ్చికతో సరి
మచ్చకంటులలో మెచ్చితి వంటే ॥౫॥

మెచ్చెను గాని నా ముచ్చట దీఱను
గ్రుచ్చి కౌఁగిలించ వచ్చేవఁటవే ॥౬॥
వచ్చెనురా............లు మాన
చెచ్చెర మాట పట్టిచ్చే వాని ॥౭॥
మాట పట్టిచ్చేను పూఁట చెప్పించేను
బోఁటిరో నేను నీ మాట వినేను ॥౮॥

వ. అప్పురా యీరీతి మాటలాడుకొని కలహించి...... ......చెంది వారలెంతయు సంతసంబుమీఱ మంగళంబు-పాడుకొనుచు రంగు గనుపట్ట నర్తనంబుగావించే చందం బెట్టువలె నుండెను............

మహారాజ శాహేంద్రునికి మంగళం। చోళ
మహీపాలవర్యునకు మంగళం ।
కంజదళాక్షునకుఁ గమనీయ తేజునకు
మంజులభాషణునకు మంగళం ॥౧॥
...............శాహదేవేంద్రునకు
మమునేలు దేవునకు మంగళం ॥౨॥
దీపాంబికాసుతునకు దీనపోషకునకు
మాపాలి శాహేంద్రునకు మంగళం ॥3॥

సీ. ఎంతకాలము చంద్రుడీశునిమౌళిపై
కాంతి మంతుండయి కదలకుండు,
ఎంతకాలము దివ్య దంతావళంబులు
దిక్కుల యందులం దీయకుండు,
నెంతకాలము..................
.............రక్తుండై పరంగుచుండు.
నెంతకాలము రమాకాంతుం డనంతునిం
దల్పంబుచేసుక దనరుచుండు,

గీ. అంతకాలము నీవు నీయనుజ తనుజ
బంధు మిత్రులు సుఖముమైవఱల వలయు
ధరణిలోపల నాచంద్ర తారకముగ
సకల గుణ సాంద్ర, శాహరాజక్షితీంద్ర !

వ. అవురా యివ్విధంబున మవ్వంపు..................
హావణించిన పంచకన్యా పరిణయంబను నాటకంబున కధీశ్వరుం
డైన శాహమహారాజ దేవేంద్రునకు నిలువేలుపైన శంకరుండు
షాంకంబుగా..................పత్య నిత్యాయురారోగ్య
భాగ్యంబులం బాలించి రక్షించుం గాత.

---

# శచీపురందరము



శోడెము ॥ నాటరాగము ॥ జంపెతాళము ॥

జయ పార్వతీ రమణ జయమనోభవహరణ
జయ భుజంగాభరణ జయ లోకశరణ।
జయ జాహ్నవీధరణ జయ జితాంతఃకరణ
జయ సరోరుహాచరణ జయ జగత్కారణ ॥౧॥

సకల జగదాధార సాధిత ధరాభార
మకరాంక మదహార మంగళాకార।
వికటరిపుసంహార విద్రుతమణి గణహార
సుకృతి జనమందార శోభనవిహార ॥౨॥

కోటి మన్మథ రూప కోమలతరాలాప
పాటిత ఖలాటోప భవ్యస్వరూప।
త్రోటితాఖిల తాప తులిత భూధరచాప
మోటితానత పాప ముక్తానురూప॥ జయజయ॥౩॥

సాధుజనపరిపాల సర్వజ్ఞ శుభశీల
బాధితాహితజాల భక్తానుకూల।
మాధుర్య గుణలోల మదన భీమణఫాల
క్రోధ నిర్జితకాల గుణగణ విశాల ॥శరణు॥౪॥

కేదార గౌళ ||త్రిపుట||

శరణు శ్రీవసుదేవనందన శరణు జగదానందన
శరణు చరణానతసనందన శరణు సురకృతవందన ||౧||
మధురభాషణ మహితతోషణ – మదవిరోధి విశోషణ
బుధవిభూషణ భూతపోషణ భుజబలాహతదూషణ ||౨||
ఉద్ధతాఘతృణప్రభంజన యోగిహృదయ నిరంజనా|
సిద్ధచారణ ముఖ్యరంజన శ్రీహరీ మురభంజనా ||౩||
దివ్యభక్తసమూహ సాదర దేవతామర సోదరా|
భవ్యసుగుణ సురేంద్ర సోదర పాపహర దామోదర||౪||

సూత్రధారుఁడు: అపురా యీవిధంబున నాట్యారంభము చేసిన యాతఁనంతరంబున శచీపురందరంబనెడు నాటకంబు నిర్విఘ్నంబుగా నెరవేరేటందుకు విఘ్నేశ్వరప్రార్థనచేసే మార్గం బేవిధాన నంటేను.

శ్లో. సింధూరారుణగండ మండల మదామోదభ్రమద్భృంగికా
సంగీత ధ్వనిభిర్మృదంగ పటుభిస్తైః కర్ణతాళైరపి
తత్తౌర్యత్రికరీతిమేతి శిరస శ్శశ్వన్మదాందోళనం
యస్య శ్రీగణనాయకస్య భవతు శ్రీశాహజిశ్రేయసే|

సూ. అపురా యీవిధంబున విఘ్నేశ్వరుని పాదపద్మములకు వందనమాచరించి, ఆతదనంతరంబున మఱియునేవిధాన నంటే-

శ్లో. తంత్రీసంవల దంగులీ విగళితైర్గానామృతైస్సేచనాత్
సద్యస్సంభృత పల్లవామివ దధత్యుత్సంగగాం వల్లకీం।
అచ్ఛస్ఫాటిక మాలికామపి కలాలాపం దధానాశుకం
వాగ్దేవీ వదనాంబుజే నివసతు శ్రీశాహపృథ్వీపతేః।

సూత్ర. అపురా యీవిధంబున సరస్వతీదేవి పాద పద్మము లకు వందన మాచరించి మఱియు సేవిధాన నంటే.

శ్లో. త్వంగత్తుంగ తరంగ వారిధి మిళద్భృంగాంగ సంగాప్లవ
స్రోతోద్యదంచత్తిమి శంఖపంక్తి పటలీ మిశ్రీభవత్తారకం।
భ్రశ్యచ్చంద్రకలావిలాస మఘనీ భూతేందు చంచజ్జటా
జూటార్చిః పునరుక్త సాంధ్యరుచి తన్నాట్యం తవశ్రే యసే

సూత్ర: అపురా యీవిధంబున పార్వతీ పరమేశ్వరుల పాద పద్మములకు వందనమాచరించి ఆతదనంతరంబున మఱియు సేవిధాన నంటే.

శ్లో. యస్యోత్తంభిత హస్తవర్తి వితతం చక్రం ప్రఫుల్లాంబుజా
కారత్వేన దరోపి మీలదవతాబ్జాకృతిత్వేనచ
ఆదిత్య ద్విజరాజతాం స్ఫుటతరం యన్నేత్రయోస్సంతతం
కుర్వాతే సతనోతు శాహనృపతేశ్శ్రేయాంసి నారాయణః.

సూ: అపురా యీవిధంబున శ్రీమహావిష్ణు పాదపద్మములకు వందనమాచరించి యాతదనంతరంబున మఱియు సేవిధాననంటే.

నాంది-ద్వి. శ్రీనగర విహార, శ్రితజనాధార,
మానేషు సంహార, సురుచిరాకార,
భవ బంధ పరిహార, భక్తమందార,
భవ, ధవళ శరీర, పన్నగహార,
కమనీయగుణజాల, కరుణాలవాల,
సమర భీకరశీల, సన్ముని పాల,
భాసుర వృషవాహ, పర్వతగేహ,
భోసలకులశాహభూపకృతేహ,
వందిత వాగీశ, నమదమరేశ,
సుందరత్యాగేశ, సుముఖ, మహేశ,
నిన్ను నే నుతియింతు నెమ్మది మీఱ
మన్ననగా నిన్ను మఱియుఁ బ్రార్థింతు
వ్యాసవాల్మీకుల వర్ణింతుఁ గాళి
దాస మయూరాఖ్య దండిముఖ్యులకు
నంజలి గావింతు నతులితభక్తి
మంజునాటకము సమ్మదమొప్పఁ జేయ.

సూ. అపురా యీవిధంబున నభీష్టదేవతా వందనంబు గావించి సభానాయకాదుల నభివర్ణించి శ్రీ శాహమహారాజ ప్రణీతంబైన శచీపురందరంబనెడు నాటకంబు కథాక్రమంబుగా వినిపించెదము విన నవధరింపరయ్యా.

## —: కథా సంగ్రహము :—



సీ. శ్రీపురంబున మునిశిష్యుఁ డొక్కరుఁడు
తాపసులనుప నత్తఱి వక్రిదంతుఁ
డనువాఁడు వేడ్కతో నరుదెంచుటయును,
అనువొందఁ గపిల కణ్వాదులచ్చటికిఁ
దప మొనరింపంగఁ దరలి వచ్చుటయుఁ,
గుపితుఁడై యప్పుడు కుంభోదరుండు
మునుల తపోవిఘ్నములుసేయ వారు
కనలి కుంభోదరు గర్వమణఁచుటయు,
నదియెల్ల విని పులోమాసురుఁ డేఁగి
మదమున మునులను మర్దించుటయును,
మునులు దేవేంద్రుతో మొఱయిడ నతఁడు
విని పులోమునిఁ జంప వెడలు మార్గమున
దేవేంద్రుఁడును శచీదేవి యన్యోన్య
భావముల్ మిక్కిలి పరఁగఁ జూచుటయు,
శచి కన్యకకు నింద్రి సచిన్నన కపుడు
ఉచిత సంభాషణ మొనర నౌటయును,
పురుహూతుఁ డాపులోముని జయించుటయు

సరసిజాక్షి వితంబు చంద్రుఁ డింద్రునకు
ముదముతోఁ దెలుపఁగా మోహితుఁడగుచు
సదయుఁడై మిక్కిలి సంతసిల్లుటయు,
అనువొంద శచి నింద్రుఁడడుగఁ బులోముఁ
డనుమతించి తనూజకా వివరంబు
నచ్చికతోఁ దెల్ప నా శచి సఖిచే
హెచ్చైన యుంగర మిచ్చి పంపుటయు,
శాహేంద్రుఁ డేలు తంజాపురమున వి
వాహంబు గావింప వజ్రి వచ్చుటయు,
అను కథలను జాలనమరి రాజిల్లు
దనర శచీపురంధ్ర నాటకంబు
పని వడి యానంద భరితుఁడైచాల
ఘనుఁడు శాహేంద్రుఁడు గావించెభువిని,
సరస సత్కవి వరుల్ సన్నుతిసేయ
ధరణిలో నాచంద్ర తారార్కముగను.

మా. అవురా యీవిధంబున నుదార శృంగార వేషభాషాది భూషితంబగు శ్రీ శాహామహారాజ ప్రణీతంబైన శచీపురందరం బనెడు నాటకంబునందు నిర్విఘ్న సిద్ధ్యర్థముగా విఘ్నేశ్వర ప్రార్థనసేయ నా విఘ్నేశ్వరుఁడు వచ్చేమార్గం బెవిధానసం శే

ద్వి. పాశాంకుశంబులు పరఁగహస్తముల
భాసుర కనక ప్రభలు విలసిల్లఁ
బొసఁగ లంబోదరంబున నాగ వితతి
యసమాన కాంతితో నాడుచుండంగ,
వలనొప్ప మూషిక వాహనంబెక్కి
వెలయ విఘ్నేశుండు వేడ్కతో వెడలె.

అన్నాఁడు గనుక, అప్పురా యీవిధంబున దొలుత విఘ్నేశ్వర పార్థనసేయఁగా విఘ్నేశ్వరుండు వచ్చేమార్గం పరాకు.

మాతృక ॥ఆదితాళము॥

ముదమునఁ గుండలముల రుచు లమరఁగ
నిదె వెడలెను విఘ్నేశ్వరుఁ డిపుడు ॥౧॥
కర్ణతాళములు గదలఁగ నల్లన -
స్వర్ణనిభుఁడు గణపతి తగ వచ్చెన్ ॥౨॥
మూషికవాహనమున నొప్పుచు శుభ
వేషుఁడు వెడలెను విఘ్నేశ్వరుఁడు ॥౩॥
తనలంబోదరమున ఫణులాడఁగ
ఘనతను వెడలెను గజముఖుఁ డపుడు ॥౪॥
మోదముతో గణ ముఖ్యులు గొల్వఁగ
మోదక హస్తుఁడు ముదమున వెడలెన్ ॥౫॥

సూ. ఎవరోయి భాగవతమహాజనాలు: విఘ్నేశ్వరుఁడు వచ్చియున్నాఁడే. పూజచేసేటందు కర్చకుని బిలిపింపరోయి.

ప్రత్యుత్తరం॥ మహాభాగ్యమాయెను, ఆరీతిగానే పిలిపించి పూజ చేయించుచున్నామోయి. ఓహోయి అర్చకుం డెవరోయి ? విఘ్నేశ్వరుండు వచ్చి యింత తడవాయెనే, యింతసేపు పూజసేయక యెక్కడికి పోతివిర కుక్కముండా కొడక.

అర్చకుఁడు: ఏలరా ఊరకే వదరుచున్నావు వెఱ్ఱిపెత్తా కొడక ! మహామణియంగాని కొడుకువలెనే, 'పసుకాట యిచ్చేది వసలేదు చొచ్చేది మూరెన్నడన్నట్లు'..............అర్చకుని శప్పాలుమాత్రిం తెప్పించుకొని వత్తువురా. నీవాండ్లను దండించేది లేదు, ఏమిన్నీ లేదు.

సూత్రధారుఁడు: అవురా యిప్పుడు ఎవరు రాకయున్నారు? నట్టువకాండ్రు రాలేద ? భోగమువాండ్రు రాలేద ? కావలివాండ్రు రాలేద? పరిచారకుఁడు రాలేద? ఎవరు రాకయున్నారు? అందఱున్నూ సూర్యోదయానికే వచ్చి కాచుకొనియున్నారే. నీవు యింతసేపటి వచ్చి పూజసేయక ఎక్కడికి పోయియుంటివిర ?

పూజారి: మాకొక పుగాకుతోట కద్దు. అందుకు పొత్తులకావు వృషణాల వీరంభట్లంచు ఒక బ్రాహ్మఁడు కద్దు.

ఆహొగాకు తోటకు నీళ్లు చల్లేటందుకే ఉదయమయ్యేటందుకు నాలుగు గడియలకే వచ్చివేసి పిలుచుకుపోయెను. కాబట్టి ఆహొగాకు తోటకంతకును నీళ్లు చల్లితిని. నాకు కడుపునొప్పి కద్దు. కాబట్టి మలశుద్ధికాదు. అందుకోసరం గెంపుచుట్టల హొగాకు ధూమపానంచేసి చెరువులోపలికిపోయి కడుపు తట్టి యిచ్చి స్థూలశంక నివృత్తిచేసుకొని, కాళ్లుచేతులకు మన్ను పెట్టుకొని శుద్ధాచమనం చేసుకొని, అతి శీఘ్రంగాను వస్తిని. నన్నయితే యింత బెదరిస్తున్నావే నిన్న, సాయంకాలం కాక మున్నే పరిచారకునిచేత వడలు అతిరసాలు తేనెతొలలు ఇడ్డెనలు స్వామికి నైవేద్యమైన శర్కరపొంగలి మోదకాలు పండ్లు టెంకాయలు పూలు దవనము శ్రీగంధం పాయసము కూనలు ఇదంతాను పట్టించుకొని లంజయింటికి కొనిపోయి యిచ్చి ఆవేళనే పోయి సూర్యోదయమైన యెనిమిది గడియలు దాక దానింట్లోనే పండుకొని నిద్దరపోయి నీవిప్పుడు గదా వస్తివి. ఇంకాను...లంజ నిద్దరలేచింది కాదు. అదంతాను నేను విచారించకనే యింత తడవు నాకార్యాన వుండివచ్చి నీకృత్యమంతాను విచారించి నీవు రాలేదుగనుక నేనును నా కార్యం చక్కబెట్టుకొని వచ్చినాను.

సూత్రి॥ అయితే నిన్ను దండించలేదోయి, నీకుసమ్మతమైనట్టు పూజసేయుమోయి.

పూజారి: ఇఁకమీఁద నన్నేమైనాను దండించవస్తివంటే నీ గుట్టంతాను దివాణంవాకిటపోయి చెప్పి గట్టిచేయిస్తున్నాను చూచేవూ అప్పుడు నాతమాసుహా.

పూజారి: ఓరీ పరిచారిక భ్రష్టుముండాకొడక, మొన్న విఘ్నేశ్వరునికి అభిషేకంచేసిన యరఁటిపండుముక్క వొక ముక్క మన యేడ్చి చిన్నవాఁడైన మహాగణప నీచేతకొంట పోయి యియ్యుమంటే వోపన్న నీవు మణియగాని వెంటనైతే తునకలు నైవేద్యమైనపదార్థాలు యివన్నీ నెత్తిమీదపెట్టుకొని పోయి మణివగాని గుత్తలంజకున్ను యిచ్చికొనిపోయిన పదార్థాలలో కొన్ని జిల్లేడుపొదలలో వేసిపెట్టి మణివగాని గుత్తలంజతోత్తుకు యిచ్చి దానిదగ్గఱ పండుకో ఉండి స్నానమున్ను చేయకనే తడిబట్టతో ఒల్లుతుడుచుకొని తాఁనుమారుగా విభూతి పూసుకొని విఘ్నేశ్వరమూర్తికి పరిచారికము సేయ వస్తివి. మంచిదికాని చెప్పెద. విఘ్నేశ్వరుని సొమ్మంతాను తిని తొత్తుకొడుకులకున్ను, ముండమోపులకున్ను గుద్దలుకొ్రివ్విపోయెను, మంచిదికాని చెప్పెదకాక,

పరిచారకుడు: ఏలనయ్యా కోపించుకొంచున్నారు. నేను భిక్షాపాత్రి ముండాకొడుకును, పిచ్చుకమీఁద బ్రహ్మాస్త్ర ప్రయోగం చేసినట్లు నేనిందుకంతాను పాతురిడనా? ఈకోలువు విడిచిపోతేను కూటికి ముఖమున్ను కాళ్లున్ను వాచి చచ్చిపో

దును. నీధర్మమయ్యా నీకాళ్లు పట్టుకొనెదను క్షమింపవయ్యా. పూజాద్రవ్యమంతా వచ్చింది పూజసేయవయ్యా.

పూజావిధానం॥ దేవ దేవోత్తమ, దేవతాసార్వభౌమ,. నృత్త గీత వాద్య మవధారయ.

పూజారివచనం॥ విఘ్నేశ్వరునికి పూజయాయెను విఘ్నేశ్వరుఁడు నృత్యముచేస్తున్నాడు. ఇఁక మాయింటికి మేము పోయివస్తున్నాము.

సూత్రధారుఁడు: అవురా యీవిధంబున విఘ్నేశ్వరుఁడువచ్చి సకల విఘ్నములున్ను నివారణచేసిన యాతదనంతరంబున శచీపురందరంబనెడు నాటకంబునందు కథాసంవిధానంబెవిధాన నంటే. కపిలకణ్వాదులు తపశ్చర్య చేసేటందు కుత్తమమైన స్థలము విచారించి రమ్మని యంపించిన, వారిచేతనంపఁబడి వారిశిష్యుఁడైన వక్రదంతుఁడు వచ్చేమార్గం పరాకు.

దరువు॥ రాగం॥ ఆటతాళం॥

గునిసి యాడుచుఁజాలఁ గొంకుచు బెదరుచుఁ
బనసలు చదువుచుఁ బకబక నగుచు –
మునులఁ దలఁచి తప్పు మొక్కులు మొక్కుచుఁ–
దనరఁగ నిటు వక్రదంతుఁడు వెడలె॥ ॥౧॥

వక్రదంతుని మాటలు॥

హరిః ఓం బ్రహ్మణే బ్రాహ్మణ మాలభతే శస్త్రాయ రాజన్యం విశ్రుతం వైశ్యం కుటిలేనశూద్రం గృహాతే। తస్కరం బీరకాయపీచుఘనం నల్లేరు దురదఘనం వేపకాయ చేదుఘనం పరివిత్తాయ రంధనం గుడిచుట్టూ ప్రాకారం గుళ్లో లింగాకారం మాయింటి తాళ్వారం। హరిః ఓం ఆగ్నేయం యజ్ఞమధ్వరం విశ్వతః పదిబూరెలు నయద్దేవేషుగారెలు సోమయాస్తే ముద్ద పప్పు రూకలసంచిదాచవే తాభిర్నోవడాథవ అగ్నిర్బ్రహ్మా బువ్వః తన్న స్తోమయాజి పచ్చడిముక్కలు హరిః ఓం.

సూత్రధారవచనం॥

ఎవరోయి భాగవత మహాజనులారా! మనము హరి కీర్తనచేసేటటువంటి స్థానమందున వీఁడెవఁడో యొకఁడువచ్చి యున్నాఁడే వీని యాకృతి చూసితిరే! వీనిపంక్తైతే మొరగ లేని కుక్క పండ్లిగిలించేటట్టున్నవి. వీని మేదావి చూస్తే పెనం కాల్చి యంటించి నట్టువలెనేయున్నది. వీని కడుపుచూస్తే యేతాపుబాన బోరగిలించి నట్టుంవలెనేయున్నది. వీని పూర్వో త్తర మడిగి తెలిసికొనరోయి.

సూత్రధారుఁడు: ఆరీతినే అడిగి తెలిసికొనెదము. ఓహో విద్యార్థి, నీవెవరోయి!

వక్రదంతుఁడు: హోహో నన్నేనా ఁడుగుచున్నారు? భళా భళా!

సూత్రధారుఁడు: నిన్నే యడుగుచున్నాము. నీ వెక్కడి నుండి వచ్చితివి? నీపేరేమి ? నీవెవరివాఁడ వోయి?

వక్రదంతుఁడు: హాహా మేమా. మేముదా కపిల కణ్వాదుల శిష్యులమైన వక్రదంతులము.

సూత్రధారుఁడు: వక్రదంతులమని బహువచనం చెప్పితివే మీరెందఱు వక్రదంతులోయి?

వక్రదంతుఁడు: ఓరి తిష్ఠసూత్ర ముండాకొడుకుల్లార ! మాకు బహువచనం చెల్లదటారి ?

సూత్రధారుఁడు: మహా దొడ్డవాఁడవోయి. నీకు బహువచనం చెల్లును. నీవెక్కడనుండి వస్తివి? నీవు వచ్చిన పనేది ? చెప్పవోయి.

వక్రదంతుఁడు:- మాగురువులవారైన కపిలకణ్వాదులు తపశ్చర్యార్థమై సకలపుణ్యస్థలాల్లో నుత్తమమైన స్థలం విచారించి రమ్మని యంపించఁగా ఇదానీం తన్నిమిత్తమై పంచాశత్కోటి భూమండలమున్ను శోధించి యీ చోళభూమికి పుణ్యక్షేత్రాలు వెదుకవలసి వస్తిని.

సూత్రధారుఁడు:-మహాభాగ్యమాయెను. చోళభూమిలో కావేరీతీరము మొదలుగా చాలా పుణ్యక్షేత్రాలున్నవి. ఇందులోపల దొడ్డస్థలం విచారించి రావయ్యా.

వక్రదంతుఁడు:- బహుసమీచనం అప్లనేపోయి విచారించి వచ్చెదను. హో యిదిగో పంచనదం హరహరహర. ఇదిగో కుంభకోణం. ఇదిగో మధ్యార్జునం. ఇదిగో శ్రీవాంఛం. ఇదిగో కమలానగరం. ఒహోహో మన గురువులవారికి తపశ్చర్యచేసే టందుకు ఇదేరమ్యస్థలం గురువులవారితో పోయి చెప్పవచ్చునే. ఏమోయి భాగవతులు మాగురువులవారికి తపశ్చర్యచేసేటందుకు మంచి పుణ్యక్షేత్రం చూచి వస్తినోయి.

సూత్రధారుడు:-విచారించి వస్తినంటిరే అది యేస్థలం? ఏదిక్కున? ఆస్థలపూర్వోత్తరాలు చెప్పవయ్య బ్రాహ్మణోత్తమ?

వక్రదంతుఁడు:- అయితే చెప్పెద వినరోయి.

ద్వి. వినరోయి వేడ్కతో విన్నవించెదను
జనులెల్ల మిక్కిలి సన్నుతిసేయ
మంజుల నవరత్న మయమైనయట్టి
తంజాపురంబునఁ దనరుచు నుండు
సకల సాహిత్య లక్షణ సారవిదుఁడు
అకలంక మానసుం డతిదయాపరుఁడు
సత్యసంధుఁడు సదాచార సంపన్నుఁ
డత్యంతనయశాలి యతుల సద్గుణుఁడు
బాగుగా శాహభూపాలశేఖరుఁడు
భోగదేవేంద్రుఁడై పొలుపొంద నేలు

చోళదేశంబున సుస్థిరంబైన
మేలైనతోఁపులు మేటితావులును
దేవాలయంబులు దివ్యస్థలములు
కావేరి మొదలైన ఘనమగు నదులు
చాల రంజిల్లు నాస్థలములలోన
లాలితమగు కమలానగరంబు
అది తపోయోగ్య మానని నిశ్చయించి
ముదమునఁ బోయెద మునులఁ బిల్వఁగను.

సూత్రధారుఁడు:- మహాభాగ్యమాయెను. మంచిస్థలమే విచారిస్తివి. ఆరీతినే మీగురువులవారిని పిలుచుకొనిరావోయి.

వక్రదంతుఁడు:- అట్లానే పోయి మాగురువులవారి నతి శీఘ్రముగానే పిలుచుకొని వస్తున్నానోయి.

సూత్రధారుఁడు:- అవుగా యీవిధంబున వక్రదంతుఁ డుత్తమ రమ్యస్థలము విచారించిన యాతదనంతరంబునఁ గపిల కణ్వాదులు తపశ్చర్యచేసే నిమిత్తమై కమలాపురంబునకు వచ్చే మార్గం బెవిధాన నంటేను.

సీ. శిరమునఁ గెంజెడల్ చెలువు మీఱఁగఁ జుట్టి
పొలుపొంద మేనుల భూతిపూసి
పెదపెద రుద్రాక్షపేరులు ధరియించి
విలసిల్లు జపసరంబులను బట్టి

మానుగా దండ కమండలువులు పూని
సరస కాషాయవస్త్రములు గట్టి
మలయుచు వ్యాఘ్రచర్మములు చంకనుబెట్టి
శంకరుఁ దలఁచుచు సంతసమున

గీ. గరిమ శిష్యులు గొల్వఁగా ఘనతమీఱి
తపముసేయంగ మిగులఁ జిత్తంబు లలర
నతులభక్తిని గపిల కణ్వాదులపుడు
అరుగుదెంచిరి వేగ శ్రీపురముఁజేర.

సూత్రధారుఁడు:- ఈవిధంబునఁ గపిలకణ్వాదులు శిష్యులతోఁ గూడ తపశ్చర్యచేసే నిమిత్తమై శ్రీపురంబునకు వచ్చే మార్గం.

దరువు॥ రాగం॥ ఆదితాళం॥

జపమాలికలు పూని శంకరుఁ దలఁచుచు
నుపవీత సూత్రము లురమున మెఱయ।
కపిల కణ్వాదు లాకమలాపురికిని
దపమొనరింపఁగఁ దనరంగ వచ్చిరి॥

కపిలకణ్వుల వచనం: ఓరి వక్రదంత, తగినస్థలం విచారిస్తి నంటివే ఏదిక్కున విచారిస్తివిర ?

వక్రిదంతుఁడు: అయ్యా గురుస్వామి సేవిచారించిన స్థలా బహుదూరంగా ఉన్నది. పోయేత్రోవలో ననేక దివ్యస్థలా లున్నవి. సేవించుకొంచున్ను పోదాం రండు.

కపిలకణ్వాలవచనం: భళభళాభళా శిష్యుఁడు గట్టివాఁడు. అనేకస్థలాలు విచారించినాఁడు. అయితే పోదాం రావోయి.

వక్రిదంతుఁడు: అయ్యా అయ్యవారు, ఇదిగో పంచనదం.

కపిలకణ్వాలవచనం: అవునోయి, అవునోయి, ఇది దొడ్డస్థలమే సరి. హర హర హర !

వక్రిదంతుఁడు: అయ్యా ఇదిగోచూడండి. ఇదిదా ఇప్పుడు కుంభకోణం.

కపిలుఁడు: ఓయికణ్వా, కుంభకోణం ముఖ్యమైన స్థలము సుమీ. ఏమోాయని యెంచవద్దు. కుంభేశ్వరుని సేవించవోయి. హర హర కుంభలింగ!

వక్రిదంతుఁడు:- మంచిది ఇక ముందరనున్నవి స్థలాలు సేవింపరఁడు.

మునులు:- మంచిది అయితే పదవోయి.

వక్రిదంతుఁడు:-ఇదిగో మధ్యార్జునం. ఇదిగో మాయూరం. ఇదిగో శ్రీవాంఛం. ఇదిగో వేదవనం. మహాదొడ్డస్థలం సేవింపరయ్యా.

మునులు:- స్వభావమేసరి వేదవనమంటే చెల్లునే వేదా లంతానూ వనంగా నిలిచిన స్థలంకాద. మహాదివ్యస్థలమిది. హరహరహర ! వేదవనేశ్వరాయనమః

వక్రదంతుఁడు:- ఈస్వామిని దర్శనము చేసినట్లాయెనా ఈస్థలమున నుండేటటువంటి మూర్తులు ఇంకా రెండుగలవు. అది, నేనెఱిఁగినదేకాద యీప్రపంచ మాద్యంతమున్ను ఎఱుఁగు దును ఆమూర్తుల దర్శనమయితేను సద్యః సాయుజ్యపదవి కలు గును. అందువల్లనే మీకు మోక్షం సిద్ధించును. ఆమూర్తుల పేర్లేమని యడిగితిరా, వనమాలి మూర్తమనిన్ని, సూర్య మూర్తమనిన్ని బహుప్రసిద్ధము. కాఁబట్టి మీకు సాయుజ్యపదవి యిచ్చేటందుకు నామూర్తులిరువురువినా తక్కిన దేవతలిచ్చేది బహుదుర్లభము. ఇది శీఘ్రసిద్ధి అతిశీఘ్రముగా నిరువురనున్ను సేవించి సాయుజ్యపదము చేకొందము రారయ్యా.

కపిలకణ్వులు:-ఓరీ శిష్యా! నీవు చెప్పినది మహాయద్భుత మాయి; సాయుజ్య పదవియిచ్చే దేవతలు వారు. ఆహా మనకున్ను అంతే యభిలాష. నీవు చెప్పినట్టే దర్శనానకుఁ బోదాము. కంటివే యది సూర్యమూర్తమంటివే, యదిక్షుద్ర మూర్తివలెనే శోచుచున్నది. ఆసూర్యమూర్తమును దర్శనము సేయఁ బోదాము రావోయి.

వక్రదంతుడు:- ఇదిగో నయ్యా గురుమూర్తుల్లార ! యిదియే యిప్పుడు సూర్యమూర్తం. ఈమూర్తిని దర్శనంచేసి సాయుజ్యము కోరండి, పరమేశ్వరసాక్షిగా మీకున్ను నాకున్ను ఇంకా మనవంశానఁగల ఋషులకున్ను ఈక్షణమే సాయుజ్యము కట్టడచేసును. యథార్థము; సేవించుండ.

కపిలవచనం:- ఓయీ కణ్వా, భ్రష్టుముండాకొడుకు సాయుజ్యమిచ్చునని తోడుకువచ్చి, లంజముండదగ్గర విడిచి పెట్టెను. చూస్తివె!

కణ్వుఁడు:- నేను మునుపే చెప్పలేద వాఁడు దాసీ పుత్రుఁడంచును. ఇట్లాగు పీపు తోమమంటే ముడ్లో వేండ్లు పెట్టుచున్నాఁడు. లంజముండా కొడుకు.

వక్రదంతుడు:- ఏలనయ్యా నన్ను కోపించుకోను చున్నారు ! నేనేమైనా అపోహం చెప్పితినే! దానిపేరు సూర్య మూర్తి; నిజం. తొలుత నేను స్థలం విచారింప వచ్చినపుడు నన్ను వారి యాలయానికి పిలుచుకపోయి యాసుఖ ప్రదేశమైన దిక్కుచూపెను. అక్కడ లింగాభిషేకము చేస్తిని. అప్పుడు నాకు సాయుజ్యమిచ్చినట్లనే యుండెను. కాఁబట్టి మీకోను జెప్పితిని. మీకు సమ్మతమైతే ఉండండ కానివక్షానికి కమలా పురానికిఁ బోదాంరండు.

మునులు:- ఓరి భ్రష్టా! యిదంతా నీకే యోగ్యం కాని మాకు యోగ్యము కాదు. కమలాపుర మెక్కడర! అట్టు పోదం నడవర కొంటిముండకొడక!

వక్రదంతుఁడు:- అయ్యా, మీరేల కోపించుకొనుచున్నారు! ఇదే కమలాపురం; ఇదిగో.

కపిలుఁడు:- రావోయికణ్వా! చూస్తివె కమలాపురం, మహాద్భుతముగా నున్నది. కమలాలయతీర్థమున్ను, త్యాగరాజసన్నిధియు, వాల్మీకేశ్వరుని సన్నిధిన్ని, మహాఉత్తమమైన స్థలము. ఇక్కడ తపస్సు చేసినవాని భాగ్యముగదా భాగ్యము! శిష్యుఁడెంత కొంటిముండాకొడుకైనాను స్థలం మాత్రం ఉత్తమస్థలం విచారించినాఁడు. అయితే యీపట్ల మంచివాడే. సరి, యిక్కడనే తపస్సుచేతాము శిష్య, ఆసనం వేయర.

శిష్యుడు:- స్వామి! ఆసనం వేస్తే ముడ్డిపూసంతా విఱుగవలె.

కపిలకణ్వాదుల వచనం: ఓరి, భ్రష్టుముండాకొడక, మృగాసనం వేయర.

శిష్యుఁడు:-స్వామీ, గార్దభాసనం ఉన్నది నాదగ్గర.

కపిలకణ్వులు:-ఓరి, శుంఠకాయముండాకొడక, కృష్ణాసనం తెచ్చి భూస్థలమందు శుచైనస్థలంచూచి, వేయర.

శిష్యుఁడు:-స్వామీ, శుచైనస్థలమే కంటిని. అయితే యించుక చిన్నవాఁడు అల్పాచమనం చేసినాఁడు. అది యవునో కాదో విసుమంత మూచూడండ.

మునులు:- ఓరి కొంటెముండాకొడక! అల్పాచమనం చేసిఉంటే ఇషువేయర.

వక్రదంతుఁడు:-అయ్యా, ఆసనంవేస్తిని, కూర్చుండుడు. నే నైపైనాపోయి చలిదివంతం భోజనంచేసి వచ్చెదను.

మునులు:-నీ వెషుపోతే ఏందిర పోరా (మునులుతపస్సు చేసేది)

సగాత్రిధారుఁడు:-అవురా యీవిధంబునఁ గపిల కణ్వాదులు కమలాపురంబునఁ దదేకధ్యానులై, సకలదేవతలనున్ను హితవుగోరి తపశ్చర్యచేయుచున్న యాతదనంతరమున, ఆవలి కథా సంవిధాన మేవిధానమంటేను.

పులోమాసురుఁడనే రాక్షసాధముఁడు భూసురులుసేయు ధర్మములనున్ను, మునులుసేయు తపములనున్ను విఘ్నముసేయు నిమిత్తమై కుంభోదరుని అంపించఁగా, కుంభోదరుఁడు వచ్చే మార్గం పరాకు.

దరువు॥ రాగం॥ ఆటతాళం॥

శూలము చేతఁబట్టి బొట్టమూతి యెగఁబెట్టి
కోలాహలము సేయుచుఁ గుంభోధరుఁడు వచ్చెను॥

సూత్రి:- వినరోయి భాగవతులార! మనయొక్క నాట్యరంగమందు వీఁడెవఁడో తెలియదు; వీని పొట్టమూ తేంది, వీని శూలమేంది, కాటుకకొండవలె వీని శరీరమేంది, మహా ఘోరంగానున్నాడు. వీడెవడో తెలియదు. వీని పూర్వోత్తర మడిగి తెలుసుకొండ.

ప్రత్యుత్తరం:- అవశ్యం అట్లానే అడుగుదము రండు.

సూత్రి:- ఎవట్రా! ఓహోరి, ఓరి, నీ పూర్వోత్తరం చెప్పర.

కుంభోదరుడు:- హ్హా! హ్హా! వోసి, ఛీ ఛీ అటుతీయఁటలే ఓరి మ్రింగుదునో, ఓరి నొక్కుదునో, ఓరినలుతునో! కాలఁబెట్టి నేలరాతునో, ఓరి దెబగుబలేంది? ఓరి దాంచామేంది? ఓరి దిందిమేంది? ఓరి మద్దెలలు వ్రాదేదేంది? తాళాలు గీచేదేంది? తంబురలు కొట్టేదేంది? తిత్తులు పిసికేదేంది? ఈ యార్భాట మేందిర? మి మ్మిదంతా యెవరు సేయుమనిరిర? హ్హా! హ్హా! నాముందరనే నహ్హో యెరగరా! కుంభిగాణ్ణి.

సూత్రిధారుఁడు:-ఏమోయి మమ్ము నేలతిడుచున్నావ్ మమ్ము నేలనోయి కొడుచున్నావ్. లేకపోతే కాలఁబెట్టి నేల రాచేమంచున్నావ్? నీవేమిటి తొక్కివస్తివో? ఊరకే హరికీర్తనచేసే మమ్ము నేలనోయి కొట్టవస్తున్నావు.

కుంభోదరుఁడు:-ఓరి హరికీర్తనా? ఇంతసేపూ నేనెరుగక యుండంగా పోయెను. నేవచ్చిన వెనుకను నాముందరనున్న

హరికీర్తనా? తొత్తుకొడుకుల్లార! దోస్త్రతుంచి నోట్లో వేసికొనే టట్లుగా మిమ్ముతుౖంచి నోట్లో వేసికొందును.

సూత్ర:- ఓయి, మమ్ము తుౖంచిగించి నోట్లో వేసికో వద్దు మేము హరికీర్తనచేసేది విడిచిపెట్టి నిన్ను కొలిచెదమోయి.

కుంభోదరుఁడు:- హ్హాహ్హా అట్లాచెప్పి బ్రతుకండి. మంచిది గంటి. నన్నెవరని యడిగితిరే నేను కుంభోదరుఁడ. మాదొరైన పులోమాసురుండేడనైనా మునీశ్వరులు తపస్సుచేస్తూ యున్నా గానిన్ని బాపనతొత్తుకొడుకులు ధర్మంసేస్తూ ఉన్నాగానిన్ని అదంతా విఘాతముచేసి వాండ్లనుచంపి వాండ్ల నెత్తురంతాను నన్ను పానంసేయుమని నాకు సెలవిచ్చినాఁడు. కాబట్టి కాశికిఁ బోతిని. కాశిలోనున్న ఋషుల నాద్యంతమున్ను కొట్టి, జడలంతా తుౖంచి పాఱవెళ్లగొట్టితిని. అది మొదలుకొని యింత పర్యంత మున్నుగల ఋషులను గొట్టి తఱిమితిని. కాశిమొదల్కొని ఇంత పర్యంతమున్నుగల ఋషులను దేశభ్రష్టులఁ జేసితిని. తర్వాత నీస్థలమందు కొందఱు ఋషులు తపస్సుసేస్తున్నారని విని వీరలను సంహరింప వచ్చినాను. వారిని జూపరండ్రి.

సూత్రి:- ఇక్కడ తపస్సు చేసేటటువంటి ఋషులను మేమెఱుఁగము. నీమనుష్యులుగా నీవిక్కడ నుండమంటే నిన్ను కని కొలుస్తున్నా ఉండేం. లేకపోతే ఎక్కడికైనాను వెళ్లి పొయ్యేం మమ్మేలచంపుచున్నావోయి! నీవే ఋషులను వెదకి చూడవోయి.

కుంభోదరుఁడు:- మంచిది మీరెక్కడికిన్ని పోవద్దు. గావాండ్లై మీరిక్కడనే వుండండ (కుంభోదరుఁడు మునుల వెదకేది) ఓరి తగిలెరతొత్తుకొడుకులు. ఇదిగో ఉన్నారుర.

సూత్రి:- ఔరా యీవిధంబున పులోమాసురుని చేత నంపఁబడ్డ కుంభోదరుఁడు మునులఁ గనుఁగొని, యట్టహాసము చేసి పలికే మార్గము (పరాకు)

కుంభోదరుఁడు:-

ఓరోరి మునులార ! యుగ్రతపంబు
మీరు చేసెదరేల మేనులు మఱచి
దారుణమగు శూలధారచే మిమ్ముఁ
బోరిలోనఁ బొరిగొని భువనముల్ గలఁగ
మీరక్త మాంసముల్ మెదడుతోఁ గూర్చి
బోరన భుజియింతు భూతముల్ వొగడ.

కుంభోదరుఁడు:- ఓరి మునులార, మాదొర యాజ్ఞ మీఱి నన్నెంచక కండ్లుమూసికొని ఘోరతపము చేస్తున్నారే! ఇదిగో చూడండిర, కొడుచున్నాను.

సూత్రి:-అవురా యీవిధంబునఁ గుంభోదరుఁడుచేష్టలు చేయఁగాఁ గపిల కణ్వాదులు కండ్లు తెఱచి చూచినవారలై యారాక్షసాధమునిఁ జూచి పలికే మార్గం పరాకు.

ద్వి॥ ఓ రాక్షసాధమ, యోరి దురాత్మ,
యీరీతిఁ గడుకొ్రివ్వి యేలపల్కెదవు ?
మునుకొని మాదండములను నీరొమ్ము
మొనసి నెత్తురులొల్క మొత్తెదు మిపుడు.

మునులు:- ఓరి దుర్మార్గ, రాక్షసాధమ, మేము సేయు తపస్సు విఘ్నముచేసితివే. ఓరి, మాదండపు కోలలతో కొట్టు చున్నామురా ! (మునులు కుంభోదరుని గొట్టేది)

కుంభోదరుఁడు:-ఓరి మునులార, నన్ను గొట్టితిరే మా దొరైన పులోమాసురునితోఁ జెప్పి మీజడలంతా పీకించి మిమ్ముఁబట్టి మ్రింగివేస్తున్నానురా యోరి ! హా హా హా మంచిది అహా.

మునులు:- ఓరి పోరా భ్రష్టుముండాకొడక ! మీదొర యెంత ! నీవెంత ! ఛీ పోరా ! ఓరి వక్రదంతిగా, దండపుకోల యెత్తుకొనిరా. చెప్పినాగాని తిరిగిమాట్లాడుచున్నాడురా మొండి ముండాకొడుకు. ఛీ పోరా !

సూత్ర:-అవురా యీవిధంబునఁ గుంభోదరుఁడు మునుల చేత దెబ్బలు పడినవాఁడై తమదొరైన పులోమాసురునితో మొఱపెట్టుకొనఁగా నదివిని పులోమాసురుఁడు రోషకషాయి తాక్షుఁడై మునుల తపోభంగము సేయవలెనని గదాపాణియై కుంభోదరుఁడు మొదలైన రాక్షసులు గొలువఁగా వచ్చేమార్గం (ప్రవేశం)

ఆదితాళం॥

ఘోరరూపమున వచ్చెను పులోముఁడు—
ఘోరరూపమున వచ్చెను.

పల్లవి: ఘోరరూపమున వచ్చెఁ గోరలు దీటుచు సుర
వారములు భయమునఁ బొఱలుచుండఁగఁ।
గేరి చూచుచుఁ దనకేడెము కత్తి చిమ్ముచుఁ
మీరిన గరువమున సారెసారెకు నవ్వుచు ॥౧॥

అక్కజముగరిపుల ధిక్కరింపుచు మునుల
దిక్కు చూచుచు వారల వెక్కిరింపుచు।
మిక్కిలి కేకలువేసి దిక్కులయందు చాటుచుఁ
జక్కనివాఁడనని రక్కసులు గొలువఁగ ॥ఘోర॥

పులోముఁడు:- ఓరి కుంభోదరా, నినుగొట్టి రంటివే వారెవరిర!

కుంభోదరుఁడు:- నన్ను గొట్టినవారు తోత్తుకొడుకులు అదిగో కండ్లు మూసికొని కూర్చున్నారె వాండ్లుదా సామి నన్ను గొట్టినవాండ్లు.

పులోముఁడు:- ఓరి నీకడుపేది? నీకూలమేది? నీయాకారమేది? వీరిచేతనా నీవు దెబ్బలు పడితివి!

కుంభో:- సామి, నా గాచారమిట్లాయుండెను. నా వొళ్ళంతా పెట్లగొట్టినారు.

సూత్రి:- అవురా యీవిధంబునఁ బులోమాసురుఁడు కమలాపురంబునకు వచ్చినవాఁడై మునులఁ గనుఁగొని క్రూర హృదయుఁడై పలికేమార్గం.

పులోముఁడు:–మునిశ్రేని మీరిందు మునిముచ్చులార !

ఘనమైన తపమిట్లు గావింపు టెల్లు ?
కమలసంభవుఁడైనఁ గమలాక్షుఁడైనఁ
గమలమిత్రుండైనఁ గడఁగి నాపేరు
విన్నమాత్రంబున వెఱచుచుందురు.
కన్నులు గానక కదలక మీర
లున్నారు మీగర్వ మొక్కట నణఁచి
పన్నగ మిముఁబట్టి పరిమార్తు నిపుడు.

పులోమాసురుఁడు మునులను గొట్టేది. హ్హా హ్హా ! ఓరి కుంభోదర ! పట్టు కొట్టు జడలు పీకు; జంధ్యాలు రుద్రా క్షలు త్రెంచు. కమండలాలు పగులఁగొట్టు. దండపుకోలలు విఱువుము. ముఖము క్రిందుగా వేసి యీడ్వుము.

కుంభోదరుఁడు:–ఓరి, మునిశ్రేష్ఠకొడుకులార! మునుపు దండపుఁ గోలలతోఁ గొట్టిరే ఆదండపుకోలలు ఇదుగో విఱుచు చున్నాను నన్ను తిట్టితిరే ఇదిగో మీనోట్లో నుచ్చపోస్తు న్నాను. మీజడలు రుద్రాక్షలు జంధ్యాలు అంతా పీకి పాయిలో వేస్తున్నాను.

కపిలకణ్వులవచనం:- కపిల ! నేను ముందఅనే చెప్పి తిని. వాఁడు మున్నే రాక్షసుఁడు వానిని కొట్టితే ప్రాణానికే వచ్చునని చెప్పితినే! అది వినక వానితో విరుద్ధముచేసి కొంటి వే! ఇన్నోటి బాధలన్నీ నీనుంచిగదా వచ్చెను.

కపిలుఁడు:- నేనేమిసేతును! వాఁడు మాత్రింగదా యని కొట్టి తరముంటెని ఈ వెనుకగదా యీయుపద్రవము వచ్చెను. ఇట్లావచ్చునని నేనెఱుఁగుదునా ?

పులోమాసురుఁడు:- హ్హాహ్హా ఓరి, యింకా మాట్లాడు తున్నారట్రా ! (మునులు పాఱిపోయేది)

సూత్ర :- అవురా యీవిధంబునఁ గపిలకణ్వాదులు పులోమాసురునిచేతఁ జాలఁగాసిఁబడ్డవారై చాలా చింతనొంది తమలోఁ దాము పలికేమార్గం.

కణ్వుఁడు:- దరువు॥ ఘంటారవం॥ ఆటతాళము॥

జపతపములనెల్లఁ జక్కఁజేసెఁ బులోముండు
కపిల మునీంద్ర ! యింక గతియేమి॥

కపిలుఁడు:-వినుము నామీన నుపవీతములు కాన
నెనసి చూడుము కణ్వా, యేమందును॥
కణ్వుఁడు:- పల్లంపూర్వవత్ ॥
కపిలసంయమీంద్ర యెక్కడికిఁ బోవుదమింక।
గుపిత పులోమునిచే ఘోరమైతిమి ॥

కపిలుఁడు:- (వర్ణంపూర్వవత్)
బాగుగా నాపులోముని బరిమార్పుమని కణ్వ!
వేగమే దేవేంద్రునితో విన్నవింతము.

కపిలుని వచనము:- మనమెంత గాసిపడ్డను మనయొక్క యార్తితీర్చి రక్షించెడివాఁడు దేవేంద్రుఁడు వినాగా మఱి యెవ్వరును లేరు. వానిదగ్గఱకుఁబోయి మొఱపెట్టు కొందము రావోయి.

కణ్వుఁడు:-వినుమోయి కపిల! మంచి యోజనచేస్తివి. దేవేంద్రుని వినాగ మనకెవరున్ను వేఱే దిక్కులేరు, అతని దగ్గఱికిఁ బోవుదము రావోయి.

సూత్రి:- అప్పురా యీవిధంబునఁ గపిలకణ్వాదులు పులోమాసురునిచేతఁ జాల గాసిపడ్డవారై ఖిన్నతనొంది దేవేంద్రునితో మొఱనెట్ట వచ్చేమార్గం (పరాకు)

ద॥ పంతువరాళి॥ ఆటతాళము॥

జపమాలికలూడఁగ జడలు వీడఁగఁ గపిల
కణ్వాదులింద్రుని కడకు వచ్చిరి॥

సూత్రి:- అప్పురా యీవిధంబునఁ గపిలకణ్వాదులు దేవేంద్రునియొద్దకు వచ్చు నవసరంబున నావలి కథాసంవిధానం బేవిధాన నంటే. దేవేంద్రుఁడు తన నిత్యకొలువుకు వచ్చు నవసరంబున హెచ్చరిక తెలిపే నిమిత్తమై కటికనాయఁడు వచ్చేమార్గం (పరాకు)

ద॥ రాగం ॥ ఆదితాళం ॥

పట్టె నామమును బెట్టి బరికోల కేలఁబట్టి
దట్టిపైని దుప్పటి గట్టిగాఁ గట్టి।
జుట్టునిండఁ బూలుచుట్టి మిట్టపండ్లు నెగఁబెట్టి
యట్టహాసముతో వికటాంగుండు వచ్చె॥

సూత్ర:- వినుఁడోయి భాగవతులార, యిక్కడ చూచితిరే! ఈ కళరియందు (?) వీఁడెవఁడో వికృతాకారముగాను వచ్చియున్నాఁడు. వీనినడిగి వీని పూర్వోత్తరము తెలిసి కొనరోయి!

ప్రత్యుత్తరము:- మహాభాగ్యమాయెను. ఆలాగునే అడి తెలిసి కొందమోయి.

సూత్ర:- ఓహోయి నాయడా! నీవెవరు? ఎక్కడనుండి వచ్చినావు? తెలియఁ జెప్పవోయి !

కటిక:- మీరెవరు నన్నడిగేందుకు? ఎవని కొడుకులు ? కాసంతానేయరు మీరు. మీరడిగితే మేము చెప్పచున్నామా? తొత్తుకొడుకుల్లార ! యావల పొండు.

సూత్ర:- ఏలనోయి కసుకుకొనుచున్నావు? మంచి తిరునామధారివైయున్నావు. హరిభక్తుఁడవైయున్నావు. అటువంటిచోట మేము బ్రాహ్మలము. అడిగితిమంటే ఏలనోయి కసరు కొంచున్నావు కుక్కవలె.

కటిక:- ఓరి, బాపనకోస్తుకొడుకుల్లార, నన్ను కుక్క యని చెప్పుతున్నార ! తోస్తుకొడుక నాకోలపెట్టి తిప్పెదునా!

సూత్ర:- వద్దోయి మమ్మెందుకు తిట్టుచున్నావు ! నీవు వచ్చినకార్యం చెప్పవోయి !

కటిక:-[1] మస్తిచెప్పుచున్నాను విను దేవేంద్రుఁడు సభకు వస్తున్నాఁడు. అందుకు నన్ను ముందరపోయి డెబ్బైరెండు వినియోగాలవారినిన్ని ముస్తీదు సేయమన్నారు. అందుకోసరం నెలవేసుకొని కోలచేతఁబట్టుకొని నేను వచ్చినాను.

సూత్ర:- ఓరి నీయింటిపట్టారిపోను. నీకు నెలవేసికో నేల యీడ్చి కట్టుకొనిపో. ఆరీతిగానే డెబ్బైరెండు వినియోగాలున్ను అమర్చిపెట్టుచున్నాము.నీవుపోయి మీదొరను పిలుచుకొనిరా.

సూత్రి:- అవురా యీవిధంబునఁ గటికవాఁడు వచ్చి హెచ్చరిక దెలిపిన యాతదనంతరంబున దేవేంద్రుఁడు సకలాలంకార శోభితుఁడై కొలువునకు వచ్చేమార్గం బెవిధాన నంటేను.

ద్వి. కనకాంబరము కటిఁగట్టి శ్రీమించు
ఘనకిరీటము మస్తకమున ధరించి
హరిచందనము మేననలఁది ముత్యాల
సరు లురస్థలమున సరసతఁ దనర

1. మంచిది.

మెఱుఁగైన కాంతులు మీఱినయట్టి
కుండలంబులు చెవుల గుల్కుతుగా మెఱయ,
వరరత్నమయమైన వలయములేమేటి
కరయుగమునను వైఖరిగా నమర్చి,
పదముల బంగారుపావలు మెట్టి,
ముదమున దేవతల్ ముందఱగొల్వ
వివిధసంపదలచే వెలయుచు నిపుడు
దివిజవల్లభుఁ డరుదెంచెఁ గొల్వునకు

అన్నాడు గనుక, అప్పుడా యీవిధంబున దేవేంద్రుఁడు కొలువుకువచ్చే మార్గం.

దరువు॥ రాగం॥ ఆదితాళము॥

చెలువుమీఱఁగ వచ్చెను దేవేంద్రుఁడు
చలువ చప్పరములోపల నిరుగడల సేవలుసేయఁగ ॥౧॥
బంగారు దుప్పటిగట్టి పసిఁడిపావలు మెట్టి
శృంగారములు రాజిల్లు వజ్రముఁబట్టి ॥౨॥
బృందారకులు తనముందరఁ గొలువంగ
నంద మమరంగ సంక్రందనుఁడే వేళ ॥౩॥

కటిక:- దేవదేవోత్తమ, దేవతాసార్వభౌమ, పరాకు సురేంద్ర! ఇదిగో సభ ముస్తీదుచేసియున్నది కూర్చుండుమయ్యా.

దేవేంద్రుఁడు:- ఎవరురా కటికవాఁడా! రంభోర్వస లను బిలిపించరా.

కటిక:- స్వామి పిలుచుకొని వచ్చుచున్నాను.

సూత్రి:- అవురా యీవిధంబున దేవేంద్రుఁడు కొలువుకు వచ్చిన యాతదనంతరంబున దేవేంద్రుని వచన ప్రకారంబుగా రంభను బిలువఁగా రంభ వచ్చేమార్గం బేవిధాన నంటే

సీ. కులుకుగుబ్బలమీఁద జిలుఁగు పయ్యెదజాఱఁ
బలుకులు చిల్కపల్కులను మీఱ,
నొప్పైన తనగొప్పకొప్పున మందార
సుమముల సరములు సొంపు దేర,
నందమౌ ముత్యాల హారము లురమున
నిగనిగమని చాలనీటు మీఱ
శ్రీలను గేరెడు చెలువైన వీనుల
పంజులకమ్మ లింపార, విరహి
జనులపై వచ్చు మారుని శరమనంగ
మెఱుపుఁదీఁగెను నిరసించు మేనితోన
నొరినటియింప దేవేంద్రుకొల్వుకిపుడు
రంభవచ్చెను మత్తేభ రాజు నడల.

అవురా యీవిధంబున దేవేంద్రుని కొల్వునకు రంభ నటియింప వచ్చేమార్గం.

12

దరువు॥ రాగము॥ ఆదితాళము॥

రంభ వచ్చెనపుడు సౌరభమునను
జంభారి కొలువు కిపుడు జతనముగను॥ ॥౧॥
చెలువు మీఱఁగ బంగారు చీరగట్టి
వెలయఁ గొప్పున మల్లెవిరులు చుట్టి॥ ॥౨॥
కలికి మేలైన వజ్రాల కమ్మలు వెట్టి
కిలకిల నవ్వుచు సకియ కేలువట్టి॥ ॥3॥
అందెలు ఘల్లు ఘల్లని యతిశయిల్లగా
నిందు ముఖులు ముదమంది కొల్వఁగా॥ ॥౪॥
అందము నెమ్మోనఁ జెలువొందుచుండఁగాఁ
బొందుగాఁ గస్తూరిబొట్టు పొలుపుమీఱఁగా॥ ॥౫॥
బాగైన గబ్బిగుబ్బల బయ్యెద జాఱ
సొగసైన కన్నులు మీలసొబగు దేర॥ ॥౬॥
నాగరికమైన నడల నయముమీఱ
వేగమె వచ్చె నిర్జర విభునిఁజేర॥ ॥౭॥

రంభ:- ఓరి, గొల్లవాఁడ! నే వచ్చినానని దేవేంద్రుని తోఁ జెప్పర.

కటిక:-మంచిది; చెప్పివస్తున్నాను. ఇక్కడ కూర్చుండు. (లోనికిఁబోయి) స్వామి! నే వస్తిని.

దేవేంద్రుఁడు- గొల్లముండాకొడక! వాకిట నుండక యేల వస్తివిర! ఛీ పోర.

కటిక:- ఓసి. నియ్యాఖ్యదరిచేసి తొత్త (?) నీకోసరం నేను తిట్లుతింటిని. నీపేరు తెన్నగాఁ జెప్పవే.

రంభ:- ఓ రట్లాగాదుర వెఱ్ఱివాఁడ! రంభ వచ్చిందని చెప్పర!

కటిక:- సామి! రంభ వచ్చింది.

దేవేంద్రుఁడు:- పిలిపించర.

కటిక:- నీకుత్తరువాయెను,నీవు లోపలికిఁబోవె.

రంభ:- శరణు శరణయ్యా సురేంద్ర!

సూత్రి:- అవురా యీవిధంబున దేవేంద్రుని సభకు రంభ వచ్చి నృత్యముసేయు సమయమున ఆవలి కథాసంవిధాన మేవిధాన నంటే - కపిలకన్యాలు దేవేంద్రుని కొలువునకు వచ్చేమార్గం (పరాకు)

పరిక్రమణ దరువు (వర్ణం పూర్వవత్)
జపమాలిక లూడఁగా......... (ఆదిగా)

సూత్రి:- అవురా యీవిధంబునఁ గపిలకన్యాదులు దేవేంద్రుని కొలువునకు వచ్చు నవసరంబున దేవేంద్రుఁడు వారల నెదుర్కొని వందనమాచరించి పలికేమార్గం.

దరువు॥ మాతృక॥ రాగం॥ ఆటతాళం॥

శరణు శరణు మునులార మీకు
శరణు దయాపరులార – మీకు
శరణు తపోనిధులార ! మమ్మోఁ
గరుణింపుఁడీ ప్రేమ మీరఁ॥

దేవేం:- స్వామీ మునీశ్వరులార ! ఉచితాసనంబులఁ గూర్చుండరయ్యా.

సూత్ర:- అవురా యీవిధంబున దేవేంద్రుఁడు మునుల నెదుర్కొని వారలకు వందనము లాచరించి వారల నుచితాసనములఁ గూర్చుండ నియమించి మునులఁజూచి దేవేంద్రుఁడు పలికే మార్గము. (పరాకు)

ద్వి. ఇదియేమి మునులార ! యిట్టిరూపములు !
మదిలోన శోకాబ్ధిమగ్నులై జడలు
వదల మోములవంచి వసుధపైఁ జాలఁ
బదములు తడఁబడ భావముల్ గలఁగ
నరుదెంచినారు మీరద్భుతంబుగను
ఎఱిఁగింపుఁ డంతయు నిది తెలియంగనుచు.

దేవేంద్రుఁడు:- వినరయ్యా మునీశ్వరులార ! మీరు కేవలము భగ్నులై ఖిన్నతనొంది విచారముచే వచ్చినారు. ఆవివరము సవిస్తరముగాఁ దెలుపరయ్యా.

మునులు:- మహాభాగ్యమాయెను ఆకీతిగానే తెలుపు మన్నాము వినవయ్యా.

సూత్ర:- అప్పురా యీవిధంబున దేవేంద్రుని వాక్యం బులు విని ఆమునులు దేవేంద్రునిజూచి పలికేమార్గము.

ద॥ మాతృకపూజ్యము॥ పంతువరాళి॥

వినుము మావితమెల్ల విన్నవించెదమయ్యా నిర్జరేంద్ర!
చనవుంచు నీవు హెచ్చరికగా నిప్పుడు నిర్జరేంద్ర ॥౧॥
విమలతపము మేము విబుధహితముగాను నిర్జరేంద్ర।
కమలాపురంబునఁ గావింపుచుంటిమి నిర్జరేంద్ర ॥౨॥
అచ్చట పులోముఁడనువాఁడు చనుదెంచి నిర్జరేంద్ర।
హెచ్చైన మాతపమెల్ల విఘ్నముచేసె నిర్జరేంద్ర ॥౩॥
అక్కటయని మేమందఱము గూడుకొని నిర్జరేంద్ర।
దిక్కు నీవని చనుదెంచితిమిప్పుడు నిర్జరేంద్ర ॥౪॥
అక్కసాధముఁబట్టి రణమున సమయించి నిర్జరేంద్ర।
గ్రక్కున మమ్మెల్లఁ గాచి రక్షింపుము నిర్జరేంద్ర ॥౫॥

కపిలకణ్వులు:-వినవయ్యా సురేంద్ర! కమలాపుర మనెడి స్థలమందు సకల విబుధులకు హితవుగాను తపశ్చర్యచేయు చుంటిమి. అక్కడకు పులోమాసురుఁడనే రాక్షసాధముఁడు వచ్చి మమ్ము బహుశా గాసిఁబెట్టి మేము చేయుచున్న తపస్సు నున్ను విఘ్నముచేసినాఁడు కాఁబట్టి సకలదేవతలకున్ను రాజవు

గనుక నీతో మొఱపెట్టితిమి. ఆరాక్షసాధముఁడైన పులోమాసురునిబట్టి సంహరించి మేము చేయుతపస్సు కొనసాగునట్లు సేయుమయ్యా.

సూత్ర:- అవురా యీవిధంబునఁ బలికిన కపిలకణ్వాదుల వచనంబులు విని దేవేంద్రుఁడు వారల నాదరించి పలికే మార్గము.

దరువు॥ ఆదితాళము॥

తాపసవరులారా నేనేపున మీభయమెల్లఁ
బాపెద బలము చూపెదను ॥౧॥

మించిన వజ్రముచేత మేటిదనుజరొమ్ము వ్రక్క-
లించెద - బెదరించెద ॥౨॥

గట్టిగా నాపులోముని పొట్టకొ్రివ్వెల్ల నణంచి
పట్టెద శిరము గొట్టెద ॥౩॥

సారెకు సంయములార ! చనుఁడి మీతపోవనము
చేరఁగా వేడ్క-మీఱఁగా ॥౪॥

దేవేంద్రుఁడు :- వినరయ్యా మునులార ! ఆరాక్షసాధముడైన పులోమాసురుని సంహరించి మీభయమెల్లను బాపుచున్నాను. మీరు తపోవనము చేరరయ్యా.

మునులు:- అన్యథాశరణం నాస్తి యని మిమ్ము నమ్మి యున్నాము. ఎట్లైనను మాయుపద్రవముఁబాపి మాతపస్సు నెరవేఱునట్లు సేయవయ్యా.

సూత్ర:- అవురా యీవిధంబున దేవేంద్రునిచేత నను జ్ఞాతులై కపిలకణ్వాదులు తమయాశ్రమంబునకు వచ్చేమార్గం.

పరిక్రమణ దరువు॥ మాతృక॥ రాగము॥ ఆదితాళము॥

పొందుగ మునులెల్ల పురుహూతుఁడనుపఁగా।
నందమున వెడలి రాశ్రమంబులకు॥

దేవేంద్రుఁడు:- అదెవత్తా కటికవాఁడా ! దేవసేనాధి పతియైన కుమారస్వామిని బిలుచుకొని రార.

కటిక:- సామి బుద్ది; ఆరీతినే పిలుచుకొని వచ్చు చున్నాను.

సూత్రి:- అవురా యీవిధంబున దేవేంద్రుఁడు కపిల కణ్వాదులను వారి యాశ్రమమున కంపించి యాతదనంతరం బున దేవసేనాధిపతియైన కుమారస్వామిని బిలువుమనఁగా కుమారస్వామి వచ్చేమార్గం బెవిధాన నంటే.

ఉ. హాటకరత్న సంఘటితమైన కిరీటముఁలన్ శిరంబులన్
మేటిగదాల్చి, పీనులను మెండుగఁ గుండలముల్ చెలంగఁగా
మాటికి వేత్రిపాణు లసమాన, ప రా కని హెచ్చరింపఁగా
నీటుగ నింద్రుకొల్వునకు నెమ్మిగవచ్చెఁ గుమారసామియున్.

సూ:- అవురా యీవిధంబున సర్వాలంకారభూషి తుండై దేవేంద్రుని వచనప్రకారంబుగ, కటికవాఁడు పిలువఁగా కుమారస్వామి వచ్చేమార్గము (పరాకు)

దరువు॥ మాతృక॥ రాగము॥ ఆదితాళము॥

పంతము మీఱ వెడలెను ।
పంతము మీఱ వెడలెను బాగుగా నెమలినెక్కి
సంతసమునఁ గుమార స్వామి శక్తికేలఁబూని ॥౧॥
మిగుల మొగములఁ జిఱునగవులు వెలుఁగఁగాను ।
సొగసైన జిలుఁగుదుప్పటి చుంగులుజీరాడఁగాను ॥౨॥

కుమారస్వామి:-ఎవరురా వాకిట కటికవాఁడా? సేనాధిపతి వచ్చినాఁడని చెప్పర.

కటిక:- స్వామి శ్యేనాధిపతి వచ్చినాఁడు.

దేవేంద్రుఁడు:- ఓరి ఛీ శ్యేనాధిపతియనఁగా నేంది? లెస్సగా విచారించి రారా.

కటిక:- ఎవరయ్యా, మీపేరు లెస్సగాఁ దెలియఁ జెప్పవయ్యా.

కుమార:- అటుల చెప్పకుర వెఱ్ఱివాఁడ! సేనాధిపతియైన కుమారస్వామి వచ్చినాఁడని చెప్పర.

కటిక:- మాబాగు, చెప్పివచ్చుచున్నానుండుఁడు. సామి! సేనాధిపతియైన కుమారస్వామి వచ్చినాఁడు.

దేవేంద్రుఁడు:- ఐతే పిలుచుకొని రారా.

కటిక:- అయ్యా, రండు దొర పిలువుమన్నారు.

దేవేంద్రుఁడు:- రావయ్యా కుమారస్వామి! కూర్చుండు వయ్యా. వినుమోయి కుమారస్వామి! పులోమాసురుఁడైన రాక్షసాధముని సంహారింప వలసియున్నది. అందుకు ముప్పది మూఁడుకోట్ల దేవతలను మాచెలికాఁడైన చంద్రునిఁ బిలి పింపవోయి.

సూత్రి: అపురా యీవిధంబునఁ గుమారస్వామివచ్చిన యాతదనంతరంబున దేవేంద్రుఁడు తన చెలికాఁడైన చంద్రునిఁ బిలువుమనఁగా చంద్రుఁడు వచ్చేమార్గం బేవిధానమంటే.

చ॥ విరిసరముల్ శిరంబునను వేడుకమీఱఁగఁజుట్టి వింతనై
ఖరిగను నిండువెన్నెలలు గాయుచునుండఁగఁ బూలబంతియున్
గరమునఁబూని మేటియగుకంకణముల్ చెలఁగంగవేడ్కతో
సరగనువచ్చెవింతగను జంద్రుఁడు నింద్రునికొల్వుచేరఁగన్.

అన్నాఁడు గనుక ఈవిధంబున నింద్రునికొల్వునకుఁ జంద్రుఁడు వచ్చేమార్గము (పరాకు)

రాగము అసావేరి॥ ఆటతాళము॥

దరువు॥ మాత్రిక - కొంచెకత్తైలమె॥

పచ్చనిదుప్పటిగట్టి పసిఁడిపావాలుమెట్టి
వచ్చెను జంద్రుఁడు పూలవంకిచేతఁబట్టి ॥౧॥
చెలఁగి వన్నెలమీఱు జిలుఁగు దుప్పటిజాఱ
నెలమిఁ జంద్రుఁడువచ్చె నింద్రునికొలువుఁజేర ॥౨॥

చంద్రునివచనము:-అదెవరురా కటికవాఁడ! చంద్రుఁడు వచ్చినాఁడని చెప్పర.

కటిక:- మంచిది చెప్పివచ్చుచున్నా నుండుఁడు సామి! చంద్రుఁ వడుచ్చినాఁడు.

దేవేంద్రుఁడు:- పిలువర.

కటిక:- మాబాగు దొరపిలుచుచున్నారు పోండు.

చంద్రుఁడు:- శరణు శరణయ్యా దేవేంద్ర.

దేవే:-రావోయి చంద్ర! రాక్షసాధముఁడైన పులోమాసురుని సంహారింపవలసియున్నది. అందుకు సకలమైన దేవతలును యుద్ధసన్నాహులైయున్నార!

చంద్రుఁడు:- సామి! అంతా ము స్తీదుగా నేయున్నారు. నారి పోదము రావయ్యా.

సూ:- అపురా యీవిధంబునఁ జంద్రుఁడువచ్చిన యాతదనంతరంబున, దేవేంద్రుఁడు సారివచ్చునవసరంబున నావలి కథాసంవిధానం బేవిధానమంటే. ఆ పులోమాసురుని కుమారికామణియైన శచీదేవి శృంగారవనంబునకుఁ జెలికత్తెలఁగూడి కోలాటలాడవచ్చు మార్గం బేవిధానమంటే.

ద్వి. బంగారుచెంగావిపావడ గట్టి
శృంగారములను రాజిలు చీరమెఱయఁ
బద్మబాంధవురీతిఁ బదిదిశల్ వెలుఁగు
పద్మరాగపుఁదీగె పరఁగ ధరించి,

మంజుల నవరత్నమయమైనయట్టి
పంజులకమ్మ లింపార వీనులను,
వన్నె మీఱిన తనవాలుఁగన్నులను
దిన్నఁగాఁ గాటుకదీర్చి, నెన్నుదుటఁ
దెలివొందఁ గస్తూరి తిలకంబు దిద్ది,
వెలయఁ గీల్జడనిండ విరిసరుల్ దాల్చి,
కంకణయుగమును గరిమతోఁ బాణి
పంకజములఁ బూని భామలు గొలువ
భావజునకుఁ దపః ఫలమగు మంత్రి
దేవత యన శచీదేవి తా వెడలె.

అన్నాఁడు గనుక ఈవిధంబున శచీదేవి శృంగారవనంబు
నకు వచ్చుమార్గము (పరాకు)

దరువు॥ మాతృక॥ రాగము॥ ఆదితాళము॥

ఒయ్యారముగ వెడలె నందము మీఱ ।
ఒయ్యారమున వెడలెఁ దియ్యవిల్తుని శరమోయన
దొయ్యలు లందఱు గొల్వ నెయ్యమున శచీదేవి ॥౧॥
సన్నని పయ్యెదలోనఁ జిన్నిచన్నులు చెలఁగఁ
బున్నమచందురు సరిఁబోలు మోము వెలుఁగఁగ ॥౨॥
రాజిల్లురూపున వలరాజు మోహముఁ జెందఁగ
రాజహంస నడలను రాజబింబానన వేగ ॥3॥

మాత్రి:- ఈవిధంబున శచీదేవివచ్చి చెలికత్తెలఁ గూడి కోలాటలాడే మార్గము (పరాకు)

దరువు॥ మాతృక॥ రాగము॥ ఆదితాళము॥

నెఱి కురులను విరిసరములు వెలయను
సరసతఁ బయ్యెద జాఱఁగను।
పరువడి నేక నృపాలు శాహేంద్రుని -
పొరువు మీఱఁ గొనియాడుచును ॥౧॥

కోలు కోలన్నయని కుందరదన లెల్లఁ-
జాల నాడిరి జనులు సంతసిల్ల।
కోలె బంగారుకోలె కోలె వజ్రాలకోలె-
కోలె రత్నాలకోలె కోలెయని ॥౨॥

ముందుగఁ బాదము లందును రత్నాల
యందెలు గజ్జెలు నతిశయిల్ల -
నందము మీఱఁగ మందహాస్యములఁ
బొందుగ నాడిరి పొలఁతుక లెల్ల ॥౩॥

తరుణులు మిగుల సంతసములు మీఱను
బరువడి గిరిరాజ పదములను -
సరసుఁడైనయట్టి శాహరాజేంద్రుని
బరిపరి విధములఁ బాడుచును ॥౪॥

సూ:- అప్పుడా యీవిధంబున శచీదేవివచ్చి కోలాటః లాడుచుండు సమయంబున దేవేంద్రుఁడు శచీదేవియొక్క రూపరేఖావిలాసంబులు గనుఁగొని యచ్చెరువంది వచ్చనున్న చంద్రునిజూచి పలికేమార్గము (పరాకు)

దేవేంద్రుఁడు:-

దరువు॥ మాతృక॥ శంకరాభరణము॥ ఆదితాళము॥

కనుఁగొంటివే చంద్ర కన్యనీవేళ।
మనసిజశరము ఈ బాల ॥౧॥

వన్నెలాడి చక్కని మిన్నైనమోము
పున్నమచందురు నోము ॥౨॥

అలినీలవేణి బెళుకైనచూపులు -
వలరాజుచేతి తూపులు ॥3॥

నిక్కము ఈముద్దునెలఁతచన్నులు -
జక్కవలకన్న మిన్నలు ॥४॥

వనజాక్షిరూపము వనితలయందుఁ
గనుఁగొననేను ఏమందు ॥౫॥

ద్వి. వినుచంద్ర, నీవందు వేగమెపోయి
కనకనిభాంగి యాకన్యకపేరు
కులమును నెలవును గూరిమితోను
వెలయంగ వినిరమ్ము వేడ్కతోఁ లెమ్ము॥

వ. వినుమోయిచంద్ర! నీవాకన్యకవద్దకుఁబోయి యామె వృత్తాంతముఁదెలిసికొని రావోయి.

చం:- మహాభాగ్యమాయెను. ఆరీతిగానే దెలిసికొని వచ్చుచున్నాను.

సూత్రి:- అవురా యీవిధంబున దేవేంద్రునిచేత నను జ్ఞాతుఁడై చంద్రుఁడు శచీదేవిని జేరవచ్చేమార్గము (పరాకు)

దరువు॥ మాతృక॥ రాగము॥ ఆటతాళము॥

భామరోనీఁడెవ్వఁడే యోభామరో
కాముని కన్నఁ జాల చక్కనివాఁడే।
వీనిచక్కరమోవి విందుచేసినఁజాలు।
వీనిముద్దుమాటలు వీనుల వినినఁజాలు॥ ॥౧॥

చంద్రుఁడోగాక యూనసంతుఁడోగాక వీఁ
డింద్రుఁడో దెలియరాదేమిసేతునె చూడు॥ ॥౨॥

సూత్రి:- అవురా యీవిధంబున నాశచీదేవి దేవేంద్రుని యొక్క రూపరేఖాదుల వర్ణించి మదనపరతంత్రయై విరహాముభినయించు మార్గము (పరాకు)

దరువు॥ మాతృక॥ రాగము ఆహరి॥ ఆదితాళము॥

బాలరో వినవె - బాలరో।
బాలరోవానికి నేనేల మరులైతినె -
బాళిమీఱె మరునిబారికిఁ దాళలేనె ॥౧॥

చిలుకల రవళికిఁ జీకాకై తిఁజాల
నళులనాదములకుఁ గలఁగితి నేనయ్యో ॥౨॥
పొందుగవాఁడు దయను పూవిల్తుకేళీ నన్ను
బొందనియందము పొలఁతి, తనకేల ॥3॥

సూత్రి:- అపురా యీవిధంబున శచీదేవి మోహ విభ్రాంతురాలై మఱియు దేవేంద్రునిఁజూచి పలికేమార్గము.

దరువు॥ మాతృక॥ రాగము॥ ఆదితాళము॥

తాళఁజాలనె చెలియరో యెంతని నేఁ దెలుపుదుఁ జెలియరో।
బాళి మీఱెనె చెలియరో మరు బారికోర్వలేనె చెలియరో।
వెన్నెలకాఁకలఁ జెలియరో నేవిరహముఁజెందితిఁ జెలియరో।
మిన్నగుగాలిచేఁ జెలియరో నేమిగుల నలసితినే చెలియరో।

సూ:- అపురా యీవిధంబున శచీదేవి విరహ మభినయించుచుండు సమయంబునఁ జెలికత్తె శచీదేవిని జూచి పలికే మార్గము (పరాకు)

చెలికత్తె:- వినవమ్మ శచీదేవి! నీవనఁగఁ గన్యవు. ఈ లాగునఁ ద్రోవలోఁ బోవువారిని జూచి మోహించినచోఁ జూచినవారేమందురు! ఇదంతా కన్యలకు ధర్మముగాదు.

శచి:- వినవే చెలియ! నీవు చెప్పినది కన్యలకు ధర్మమే సరియైనను నాయంతఃకరణ వానిమీఁదను బూనియున్నది నే నీలాగున ననేక సుందర పురుషులను జూచినాను. వాల

మీఁదఁ దానిన్లు మోహింపలేదు. అందుకు నీవే సాక్షివి. "సతాంహి సందేహ పదేషు వస్తుషు ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః" అనే శాస్త్రమున్నదే. అందువలన నాయంతఃకరణమైతే వానిమీఁదఁ బూనియున్నది. బ్రహ్మ వ్రాసైతే వానికి వ్రాసియున్నవి. ఆవల నీశ్వరేచ్ఛ.

సూత్రి:- అపురా యీవిధంబున నాశచీదేవి మోహ విభ్రాంతురాలై మఱియు విరహ మభినయించే మార్గము.

(పరాకు)

దరువు॥ మాతృక॥ రాగము॥ ఆదితాళము॥

తాళఁజాలనె ముద్దుగుమ్మ॥
ఇంతికో వానిపొందు ఎన్నఁడుగల్గునమ్మ ముద్దుగుమ్మ॥౧॥
వింతగవానిమోవి విందుసేయుటెన్నఁడెముద్దుగుమ్మ॥౨॥
కలకంఠి వానిబిగియఁగౌఁగిలించుటెన్నఁడో ముద్దుగుమ్మ॥౩॥
వలరాజుకేళిని వానిఁగూడుటెన్నఁడె ముద్దుగుమ్మ ॥౪॥

సూ:- అపురా యీవిధంబున నీరీతి శచీదేవి విరహ మభినయించుచు నుండుసమయంబునఁ జంద్రుఁడు శచీదేవియొక్క యంతరంగంబు దెలిసినవాఁడై వద్దకువచ్చిపలికేమార్గము. పరాకు

ద్వి. ఇందుబింబానన యెవ్వతెవీవు?
పొందుగా నీయున్కి పొలఁతి, యెచ్చటను?
నీకులంబునునేమి? నీదుపేరేమి?
మాకువేగమెదెల్పు మనసురంజిల్ల.

సూ:- అవ్వరా యీవిధంబునఁ జంద్రుని వాక్యంబులఁ విని శచీదేవి ప్రత్యుత్తరంబుగాఁ బలికేమార్గము (పరాకు)

ద్వి. వినవయ్య తెలిపెద విశదంబుగాను
దనరఁ బులోముని తనయను నేను
పొందుగా భూతలంబునను నా పేరు
అందంబుగా శచియందు రంద్రును.

సూ:- అవ్వరా యీవిధంబునఁ బలికిన శచీదేవివాక్యం బులువిని చంద్రుఁడు ప్రత్యుత్తరంబుగాఁ బలికేమార్గం (పరాకు)

చం:- ద॥ ఇచట నీత్రోవఁబోయిన యింద్రుఁడాతనికి నే
సచివుండ నా పేరు చంద్రుండె సకియ॥

శచి:-ఇంద్రుఁడిప్పుడు వేగమె యెచటఁబోవుచున్నాఁడు
చంద్ర తెల్పుము నాకు సరసతమిాఁఅ॥

చం:- మునులబాధించు పులోమునిఁ జంపఁబోవుచు
నినుజూచి మోహించి ననుబంపెనిటకు॥

శచి:- వాసవుఁడా పులోమాసురుఁజంపిన
నీసునఁ బ్రాణములాశింపఁ జంద్ర॥

చం:- అలివేణి యింద్రునిఁబెండ్లాడు మతని వేడి
వెలయ మీాతండ్రిని విడిపించెదను॥

సూ.వ:-ఈవిధంబునఁ జంద్రుని వాక్యంబులువిని శచీదేవి పలికే
మార్గము.

ద్వి. పలికెదవినుచంద్ర, పరమధర్మంబు
దెలిసి నన్నడిగెదవు దేవేంద్రునికిని
దిరమొప్పఁ దండ్రియధీనంబు నేను
పురుహూతుఁ డిప్పుడింపొంద మాతండ్రి
ననువొందఁ గాచిన నతఁడు వేడుకను
నను నాతనికి నిచ్చె నమ్మ నామాట
చెలిని గూర్చెద నీవు చెలువొందఁ బోయి
తెలుపు మీ తెఱఁగెల్ల దేవేంద్రునికిని.

చం:- వినుమమ్మ శచీదేవి! మహాసంతోషమాయెను. ఆరీతిగానే నేనుబోయి కార్యసంఘటన చేసికొని వచ్చుచున్నాను. చెలికత్తెను నావెంబడిగా నంపవమ్మ ।

సూ:-అవురా యీవిధంబునఁ జంద్రుఁడు శచీదేవిచేత ననుజ్ఞాతుఁడై చెలికత్తెతోఁగూడ దేవేంద్రుని వద్దకు వచ్చె మార్గము.

దరువు॥ మాతృక॥ రాగము॥ ఆటతాళము

చంద్రముఖినట్లు శచిపంప సఖితోడఁ
చంద్రుఁడువచ్చె నింద్రునికడకు నందముమీఱఁగా.

సూ:- అవురా యీవిధంబునఁ జంద్రుఁడు శచీదేవిచేత ననుజ్ఞాతుఁడై దేవేంద్రుని సన్నిధానంబునకు వచ్చునవసరంబున వంతట నావలి కథాసంవిధానం బెవిధాననంటే, దేవేంద్రుఁడు

పులోమాసురుఁ గనుఁగొని రోషకషాయితాత్ముఁడై పలికే మార్గము.

ద్వి. ఓరిదురాత్మక, యోరి పులోమ !
ఈరీతి గర్వంబులేటికి నీకు ?
శ్రీపురంబున శశిశేఖరుఁ దలఁచి
తాపసులొనరించు తపము విఘ్నంబు
గావింప న్యాయమే కడుక్రూరముగను
ఏవిధంబుననైన నిఁక నిన్నుబట్టి
దారుణమగు వజ్రధారచే నిపుడు
పోరిలోఁ బోరిగొందు భువనముల్ వొగడ.

సూ:- అపురా యీవిధంబున దేవేంద్రుఁడు పలికిన వాక్యంబులువిని పులోమాసురుఁడు ప్రత్యుత్తరంబుగాఁ బలికే మార్గము.

ద॥ మాతృక॥ మోహనరాగము ॥ఆదితాళము॥

చాలుర యీమాటలేలర దేవేంద్ర
శూలముచే నిన్ను గూలఁగ్రుమ్మెదర ॥౧॥

దే:- ఈలాగు గర్వము లేటికిఁ బులోమ
వాలాయముగనిన్ను వధియింతునోరి ॥౨॥

పులో:- బాపురె దేవేంద్ర పంతములాడక
యేపున నీబలముఁ జూపరయోరి ॥3॥

దేవేం:- పాప పులోమ నీప్రాణములెల్లను
బాపెద మునులెల్ల బాగుగఁబొగడ ॥౪॥

పులో:- మట్టుమీఱకయింద్ర గుట్టుతోనుండర
చట్టలువాపెద సమరంబులోను ॥౫॥

దేవే:- ఎట్టెట్టుపలికితి వీఁకఁబులోమ నిన్ను
బట్టి నేనీతల గొట్టకపోర ॥౬॥

సూ. అపురా యీవిధంబున దేవేంద్రుఁడు పులోమా సురుని బొడిచి శిరంబుద్రుంచ నుద్యుక్తుఁడై యుండు సమయంబునఁ జంద్రుఁడువచ్చి దేవేంద్రుని జూచి పలికే మార్గము.

ద్వి. తెలిపెద వినవయ్య దేవేంద్ర, యెల్ల
నలివేణి యీపులోమాసురు తనయ,
సారసానన పేరు శచియందు రెందు;
కూరిమితో నిన్నుగోరియున్నదియు,
తరుణితో నీదు వృత్తాంతంబు దెలిపి
యొరపునఁ గార్యము లొనఁగూర్చినాను
వీనిఁ జంపితివేని వెలఁది కార్యంబు
గానేర దసురుని గావు మీవేళ.

సూ. అపురా యీవిధంబునఁ బలికిన చంద్రుని వచనంబుల విని దేవేంద్రుఁడు పలికేమార్గము.

దరువు॥ సౌరాష్ట్రరాగము॥ ఆదితాళము॥ మాతృక॥

చంద్రముఖి ఉందమ్మ॥
విను చంద్రి దనుజుని సమయించి
కనకాంగిని గైకొనెదను॥

వ. వినవోయి చంద్రి! దనుజుండైన పులోమాసురుని జంపికనకాంగియైన శచిని గైకొందునోయి॥

చం॥ దరువు॥

దనుజునిఁ జంపినఁ దరుణి ప్రాణము లిచ్చు
మునులకై వీనిని జంపనేల॥

వ. వినవయ్యా దేవేంద్రి! దనుజుఁడైన పులోమాసురుఁ జంపితే శచి తనప్రాణము లాశింపదయ్యా.

దేవేం॥ ద॥ మునులెందుఁ బోతేనేమి దనుజుఁడెందుబోతే నేమి
వనజాక్షి కలిగితే చాలు.

వ. వినవోయి చంద్రి! మునులు తామెందుఁబోతే నేమి?
దనుజుండైన పులోమాసురుండెందుఁబోయిన నేమి,
వనజాక్షియైన శచి తనకుఁ గలిగినఁ జాలునోయి.

చం.ద. వనజాక్షి నీకు నవశ్యముగా నిచ్చు దనుజుని నడుగు
మింద్రి!

వ. వినవయ్యా దేవేంద్రి! వనజాక్షియైన శచిని దనుజుఁడు నీకే యిచ్చు నడుగవయ్యా.

దేవేం॥ వ॥ వినవోయి చంద్రి! ఇన్నికార్యములోనఁ గూర్చినవాఁడ వీకార్యమున్ను నీవే వార్తలాడి సంఘటన సేయవోయి.

సూత్రి:- అపురా యీవిధంబునఁ బలికిన దేవేంద్రుని వాక్యంబులు విని చంద్రుఁడు పులోమాసురునిఁ గని పలికే మార్గం (పరాకు)

ద్వి॥ దానవాధీశ, సంతసమున నీదు
ప్రాణముల్ గాచెను భయమేలనింక.
గుణవతియైన నీకూఁతురి నిపుడు
కణఁక నింద్రునికిని ఘనతతోఁ నిమ్ము.

సూ:- అపురా యీవిధంబునఁ జంద్రునివాక్యంబులువిని పులోమాసురుండు పలికేమార్గము (పరాకు)

దరువు॥ మాతృక॥ రాగము॥ ఆదితాళము

ధన్యుఁడనైతినీవేళ వన్నెమీఱఁగను
కన్యామణి నిచ్చెదను గైకొనుమింద్ర.

పులో వ:- వినవయ్య దేవేంద్ర ! ఈవచనంబులువిని ధన్యుఁడనైతిని, మహామాన్యుండనైతిని. నాదుకులము పావన మాయెను. ఆరీతిగానే నాకుమారికామణియైన శచీదేవి నిచ్చు చున్నాను గైకొనవయ్య.

సూ:- అపురా యీవిధంబునఁ బలికిన దనుజేంద్రుని వాక్యంబులువిని దేవేంద్రుఁడు పలికేమార్గము. (పరాకు)

దేవేం: ద్వి. వినుము పులోమ, యీవిశ్వంబునందు
ఘనుఁడైనవాఁడు చక్కనిమేనివాఁడు
ఆహవవిజయుండు నతిదయాపరుఁడు
శాహేంద్రుఁడేలు తంజాపురంబునను
వెలయంగఁ బెండ్లిగావింపంగవలయు
పొలుపొంద నేనందుఁబోయెద నిపుడు
చెన్నుగా బాంధవాశ్రితులతోఁగూడఁ
గన్నెనుగూర్పుక గ్రక్కునరమ్ము.

దేవేం:-వినవోయి పులోమ! శాహేంద్రుఁడేలు తంజాపురంబున వివాహంబు గావింపవలసియున్నది. నేనట వోవు చున్నాను. నీవు శీఘ్రముగా నీబాంధవులతోఁ గూడఁ గన్యను దోడ్కొని తంజాపురంబునకు రావోయి.

పులో:- హాహా సంతోషమాయెను. ఈ వర్తమాన మంతయు శచీదేవికిఁ జెప్పియంపించి పెండ్లికి సాఁగివచ్చు చున్నాను.

సూ:-అపురా యీవిధంబున దేవేంద్రునితో వార్తలాడి పులోమాసురుఁడు చెలికత్తెనుజూచి పలికేమార్గము (పరాకు)

ప్రతి:- వినవే చెలియ! మనశచీదేవివలనఁగదా నేను బ్రదికితి. ఇప్పుడు ముద్దుటుంగరము శచీదేవిచేతికిచ్చి యిక్కడ నడచిన వివరము తెలియఁబల్కి రావే చెలియ!

చెలి:- మహాభాగ్యమాయెనయ్యా దానవేంద్ర!

సూ:-అవురా యీవిధంబునఁ బులోమునిచేత ననుజ్ఞాతురాలై చెలికత్తె శచీదేవికిఁ దెలియఁజెప్పవచ్చుమార్గము.(పరాకు)

పరిక్రమణ దరువు॥ రాగము॥ ఆదితాళము॥

కులుకుగబ్బిగుబ్బలపై గుఱుతుగ హారములెల్ల
తళతళమని మెఱయఁగా - వేగమె వచ్చెఁ
జెలియ యాశచిని జేరఁగా॥

చెలికత్తె:- శరణు శరణమ్మ శచిదేవి।

శచి:- రావే చెలియ! కూర్చుండవే॥

సూ:-అవురా యీవిధంబునఁ జెలికత్తె వచ్చి శచీదేవిఁ జూచి పలికేమార్గము.

చెలికత్తె: దరువు॥ మాతృక॥ రాగము॥ ఆదితాళము॥

చెలువు మీఱఁగ నీపెండ్లి చేకూరెనమ్మా!
వెలయఁగ దేవేంద్రుఁడె నీ విభుఁడాయెనమ్మ ॥౧॥
కలికి నీతండ్రి నిండ్రుఁడు గాచెనె యోయమ్మ
చెలియరో మీతండ్రి సంతసిల్లెనె యోయమ్మ ॥౨॥
నెలఁత, యుంగర మిదిగో నీకుఁ బంపెనమ్మ!
కులిశహస్తునితో నీవు గూడుండ వమ్మ॥ ॥3॥

శచి:- మహాభాగ్యమాయెనే చెలియ! నేఁడుగదా తన కోర్కెలీడేరెను.

సూ:- అప్పరా యీవిధంబునఁ జెలికత్తెవచ్చి పెండ్లి కార్యము చెప్పఁగా శచీదేవి సంతోష భరితాంతరంగయై యుండుసమయంబున నంత నావలికథా సంవిధానం బేలాగున నంటే. దేవేంద్రునిచేత ననుజ్ఞాతుండై పులోమాసుతుండు తన పురంబునకు వచ్చే మార్గము (పరాకు)

మాత్రిక॥ రాగము॥ ఆదితాళము॥

పురుహూతుఁ డనుపఁగఁ బులోముఁడు దన
పురముచేరఁగ వచ్చెఁ బొందుగను॥

సూ:- అప్పరా యీవిధంబున దేవేంద్రుఁడు పులోమాసుతునిఁ గన్యను దోడ్కొని రమ్మనినవాఁడై తాను తంజాపురంబునకు వచ్చు మార్గము (పరాకు)

దరువు॥ మాత్రిక – జలములలో నల్లచంద్రికాంతము॥
రాగము॥ ఆటతాళము॥

సురలు ఖేచరులు కిన్నరులు సన్నుతిసేయఁ గరినెక్కి
వేడుకను ।
అరుమగ శచిని బెండ్లాడఁగ వెడలెను బురుహూతుఁడును
తంజపురము చేరఁగను॥

సూ:- ఈవిధంబున దేవేంద్రుఁడు తంజాపురంబునకు వచ్చి యొక రమ్యప్రదేశంబునఁ గూర్చుండి శచీదేవి రాక కెదురు చూచుచు మదనమాయా వశీకృతుండై వద్దనున్న చంద్రునితో విరహ మభినయించు మార్గం. (పరాకు)

దేవేంద్రుని విరహపదం: మాతృక॥ రాగము॥ ఆదితాళము॥

ఏమని విన్నవింతు నెటుల వేగింతు
రామ రామ నేడల్ల రమణి రాదాయెఁ జెల్ల॥ ॥౧॥

మరులుకొంటి నేనల్ల మగువపైఁ జాల
మరుని బారికిఁ దాళ మనసు నిలువఁజాల॥ ॥౨॥

శచిని నన్నును గూర్పఁ జనవింతైన నీవు।
సచివుఁడవై నీవు చంద్ర, యేల యేఁచెదవు ॥3॥

చం:- వినవయ్య స్వామి! యెందుకు విరహముఁ జెం దెదరు? పులోమాసురుఁడు కన్యనుగూర్చుకొని యిదిగో రాఁబో వుచున్నాఁడు మదిఁ గలఁగకుమయ్య.

సూత్ర:-అవురా యీవిధంబున దేవేంద్రుఁడు చంద్రునిఁ జూచి విరహమభినయించుచుండఁగాఁ దన కన్యకామణియైన శచీ దేవినిఁగూర్చుకొని పులోమాసురుఁడు తంజాపురంబునకు దేవేం ద్రునిఁ జేరవచ్చేమార్గము. (పరాకు)

దరువు॥ మాతృక॥ రాగము॥ ఆదితాళము॥

తనరంగఁ దనబంధుతతులెల్లఁ గొలువఁగ
దనయనుగూర్చుకొని ఘనవిభవమున।
ఘనుఁడు పులోముఁడు గరిమమీఱఁగను
జనుదెంచెనిపుడు తంజాపురిఁజేరను॥ ॥౧॥

పులోమ:- వినవయ్యా సురేంద్ర ! నేను సకలసన్నాహముతోఁగూడి కన్యను దోడుకొనివచ్చినాను. ఇటీవల సేయవలసిన శోభనకృత్యములు సేయుమయ్యా.

సూత్రి:- అవురా యీవిధంబునఁ బులోమాసురుఁడు కన్యనుదోడ్కొనివచ్చిన యాతదనంతరంబున నాదేవేంద్రుఁడు తన వివాహమునిమిత్తమై పరమేశ్వరుని ధ్యానముసేయఁగా భక్తపరాధీనుఁడైన పరమేశ్వరుఁడు గిరిజాసమేతుఁడై నందివాహనారూఢుఁడై శచీదేవేంద్రుల వివాహము నెఱవేర్పవలసి వచ్చేమార్గంబేవిధానమంటే.

ద్వి. శిరమున బాలశశిప్రభారుచిరము
కరమునఁ జాపఢక్కా త్రిశూలములు
గళమున రుద్రాక్షకంఠమాలికలు
జడలలోపల గాంగఝరనర్తనములు

కటియందువిలసిల్లు కరటిచర్మాంబు
పటిమతోఁజెలఁగ వైభవములతోడ
నమరుచు వృషవాహనారూఢుఁడగుచు
నమరవందితుఁడు శ్రీహరుఁడు తావెడలె.

దరువు॥ మాతృక॥ రాగము॥

దేవదేవుఁడు వెడలె శ్రీమహా - దేవుఁడు వెడలె
దేవుఁడు శ్రీశంకరుఁడు ఠీవిమీఱఁగ నిపుడు
శ్రీవృషభవాహనముపై వేడుకతో నెక్కి-॥ ॥౧॥
గంగజడలలోఁ దరంగములుమీఱఁగ
నంగజహరుఁడు దివ్యమంగళాకారుఁడు॥ ॥౨॥
నాగచర్మోత్తరీయము నాగభూషణము లమర
నాగమదమర్దనుఁడు నాగశోభిల్లుచు॥ ॥3॥
బాలచంద్ర చంద్రికలు ఫాలమునవిలసిల్ల
లాలితరుద్రాక్ష మాలికలలర॥ ॥४॥
శూల డమరు చాపములు కేల నవధరించి భక్త
పాలుఁడైన శ్రీశాహభూపాలుదైవమైన యాది॥ దేవుఁడు॥

మాట:- అపురా యీవిధంబున ధ్యానముచేసిన దేవేం
ద్రునియొక్క భక్తికి సంతసిల్లి పరమేశ్వరుఁడు వచ్చినయాతదనం

రంబున మహావిష్ణువునుగూర్చి ధ్యానముసేయఁగా నప్రుడు మహావిష్ణువు వచ్చేమార్గము (పరాకు)

దరువు। మాతృక। రాగము। ఆదితాళము।

వెలయు (శ్రీ) శంఖచక్ర..................॥

సూత్రి:- అవురా యీవిధంబున మహావిష్ణువు వచ్చిన సూతదనంతరంబున దేవేంద్రుఁడు బ్రిహ్మదేవునిఁ గూర్చి ధ్యానముసేయఁగా నాబ్రిహ్మ వచ్చుమార్గము.

దరువు। మాతృక। రాగము। ఆదితాళము।

నాలుగు మోములను నాలుగు వేదములు......॥

సూత్రి:- ఈవిధంబున హరిహరబ్రహ్మాదులు వచ్చిన సూతదనంతరంబున దేవేంద్రుని వివాహనిమిత్తమై బ్రహ్మర్షులు శుభలగ్నమందు మంగళాష్టకములు చదివేమార్గము (పరాకు)

శ్లో. కావేరీ యమునా నదీచ సరయూ............॥

.......................................

సూత్రి:- ఈవిధంబున శచీదేవేంద్రులకు వివాహము సేయు నవసరంబున నారద కిన్నర కింపురుషులు మంగళములు పాడే మార్గము (పరాకు)

ధవళము। గౌరికి రమ్యవిహారిణికి......నహారి...ప్రోచుచు
గోరిక లొసఁగెడు గుణనిధికి ।శోభనె।

దేవునికి మహాదేవునికి భాషాధిపనుత భావునకు।
శ్రీవైభవములఁబావనుఁడై తగు–సేవకనిధియగు శివునికిని।గో।
భోసల శాహజిభూవిభుని – భాసిల్లుప్రేమను బాలించు।
వాసిగ శోభనవైభవ సంతతి–ధీసంపదవిడు దేవునకు ।శో।

ఇతి శ్రీభోసల శాహమహారాజ విరచిత శచీపురందర
కల్యాణ నాటకం సకల రసిక విద్వజ్జనప్రీతమై సకలశ్రేయసే
శ్రీ త్యాగేశ సాంబశివార్పణమస్తు.

---

# సతి దాన శూరము



తోడి॥ జయ పార్వతీరమణ । జయ జానకీరమణ ।
జయ అంతకదమన । జయ మధుసూదన ।
జయ త్రిపుర సంహరణ । జయ వేదోద్ధరణ ।
జయ అఖిల నుతచరణ । జయ జనాభరణ॥ ॥౧॥

జయ రవిశశినేత్ర । జయ యఖిలనుతిపాత్ర ।
జయ పావనచరిత్ర । జయ జగన్మిత్ర॥
జయ నంది వరవాహ । జయ అండజవాహ ।
జయ నిత్య సోత్సాహ జయ శమితదాహ॥

మంగళం॥ మహనీయ త్యాగేశునికి మంగళం । మహనీయ
చారిత్రునికి మంగళం ।
కనకావతంసునికిఁ గమనీయచరిత్రునికి ।
మనసిజ హరునికి మంగళం॥ ॥౧॥

సోమస్కంద మూర్తికి శోభనప్రదునికి
మామీఁద దయసేయు సామికి మంగళం॥ ॥౨॥

భోసలకుల శాహేంద్ర భాసురకుల దేవునికి
మాశివ త్యాగేశునికి మంగళం॥ ॥3॥

మంగళాచరణము

శ్లో. అవిరళ మదజల నివహం
భ్రమర కులానీక సేవిత కపోలం ।
అభిమత ఫల దాతారం
కామేశం గణపతిం వందే.

సూ. వ. అపురా యీవిధంబున శ్రీ శాహమహారాజ ప్రణీతంబైన సతిదానశూర నాటకంబునందుఁ దొలుత విఘ్నేశ్వర ప్రార్థనచేసిన యాతదనంతరంబున సరస్వతీదేవిని ప్రార్థన చేసేమార్గము.

శ్లో. యా కుందేందు తుషారహారధవళా యాశుభ్రవస్త్రావృతా
యా వీణా వరదండ మండితకరా యా శ్వేత పద్మాసనా।
యాబ్రహ్మాచ్యుత శంకరప్రభృతిభిర్దేవైస్సదాపూజితా
సామాంపాతు సరస్వతీ భగవతీ నిశ్శేష జాడ్యాపహా.

సూ. వ. అపుడా యీవిధంబున సరస్వతీదేవినిఁ బ్రార్థన సేసిన యాతదనంతరంబున మహావిష్ణువును బ్రార్థనచేసే మార్గము (పరాకు)

శ్లో. శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశం
విశ్వాకారం గగన సదృశం మేఘవర్ణం శుభాంగం ।
లక్ష్మీకాంతం కమలనయనం యోగిహృద్ధ్యాన గమ్యం
వందే విష్ణుం భవ భయహారం సర్వలోకైక నాథం.

సూత్రి:-అవురా యీావిధంబున మహావిష్ణు ప్రార్థనచేసిన యా తదనంతరంబునఁ బార్వతీపరమేశ్వరులను ప్రార్థనచేసే మార్గము. (పరాకు)

శ్లో॥ గంగాతరంగ కమనీయ జటాకలాపం
గౌరీనిరంతర విభూషిత వామభాగం।
నారాయణప్రియ మనంగ మదాపహారం
వారాణసీపురపతిం భజవిశ్వనాథం॥

సూ:- అవురా యీావిధంబున సకలదేవతా ప్రార్థన చేసిన యాతదనంతరంబున శాహామహారాజప్రణీతంబైన సతిదాన శూర నాటకంబునందుఁ దొలుత గథాసంవిధానంబు వినిపించే మార్గము.

ద్వి. శ్రీరమణీయమై చెలువొందునట్టి
సారసలోచనోత్సవము చూడంగ
భూమీశుఁడువచ్చి మున్ను మతంగ
భామపై మోహించి పరఁగవాదంబు
మనసిచ్చి గావింప, మాదిగవాఁడు
అనువొందవచ్చి తానామాటలెల్ల
విని తనకాంతను విప్రునికీయ
సమకట్ట, వారిలో సంవాదమపుడు
క్రమమున నొచుండ, ఖండేందుధరుఁడు

వచ్చి ప్రత్యక్షమై వారినందరికి
ముచ్చటదీఱంగ మోక్షమిచ్చుటయు,
ననియెడికథలచే నమరి రాజిల్లు
చును మించు సతిదానశూరనాటకము
విరివిగా శాహభూవిభుఁడుగావించె
ధరణిలో నాచంద్రతారార్కముగను.

సూ:- అవురా యీవిధంబున శ్రీశాహమహారాజ ప్రణీతంబైన సతిదానశూర నాటకంబునందుఁ దొలుత విఘ్నేశ్వర ప్రార్థన సేయఁగా విఘ్నేశ్వరుఁడు వచ్చేమార్గము.

దరువు॥ తోడిరాగము॥ ఆదితాళము॥

ముదమునఁ గుండలముల రుచులమరఁగ।
ఇదె వెడలెను విఘ్నేశ్వరుఁడిప్పుడు ॥౧॥
కర్ణతాళములు గదలఁగ నల్లన
స్వర్ణనిభుఁడు గణపతి తగవచ్చెన్ ॥౨॥
మోదముతో గణముఖ్యులు గొలువఁగ
మోదకహస్తుఁడు ముదమున వెడలెన్ ॥3॥
మూషికవాహన - మునురొప్పుచు శుభ
వేషుఁడు వెడలెను విఘ్నేశ్వరుఁడు ॥౪॥

సూ:- అవురా యీవిధంబున విఘ్నేశ్వరుండువచ్చి సకలవిఘ్నాలును నివారణచేసిన యాతదనంతరంబునఁ గథా

సంవిధానం బేవిధాననంటే. రాజగోపాలస్వామి, నిత్యోత్సవానికి బయలుదేరి వచ్చుచున్నాఁడని కటికమువాఁడు హెచ్చరికలు దెలుపవచ్చే మార్గం.

దరువు॥ మధ్యమావతి॥ ఆది॥

పట్టె నామమును బెట్టి బరిగోల కేలఁబట్టి
దట్టిపైని దుప్పటి గట్టిగాఁ గట్టి ।
జుట్టు నిండఁ బూలుచుట్టి మిట్టపండ్లు నెగఁబెట్టి
అట్టహాసముతో వికటాంగుఁడు వచ్చె ॥౧॥

సూత్రి:- అప్పుడా యీవిధంబునఁ గటికమువాఁడు వచ్చి సకల జనానకు హెచ్చరిక దెలిపిన యాతదనంతరంబున, రాజగోపాలస్వామి లక్ష్మీదేవితోఁగూడ నిత్యోత్సవానికి వచ్చు మార్గము.

శ్లో. వేణీ మూలే విరచిత ఘనశ్యామ పింఛావచూడో
విద్యుల్లేఖావలయిత ఇవ స్నిగ్ధ పీతాంబరేణ ।
మా మాలింగన్మరకత మణిస్తంభ గంభీరబాహు
స్స్వాప్నే దృష్ట స్తరుణతులసీ భూషణో నీలమేఘః॥

దరువు॥ కాంభోజి॥ ఆది॥

వెలయు (శ్రీ) శంఖ చక్రములు హస్తములఁ జెలఁగ
నలువైన గరుడ వాహనముపై విష్ణువెడలె ॥౧॥

అభయ వరహస్తము లమరంగ దిశలందు
శుభ పీతాంబర ప్రభ సొబగంద శౌరివచ్చె.

సూత్రి:- అవురా యీవిధంబున మహావిష్ణువువచ్చి చంపక వనమందు నవరత్నఖచిత దివ్యమంగళ సభయందు సంతోషముగా నుండే సమయంబున, మహావిష్ణు మహోత్సవము సేవింపవలసి మతంగస్త్రీ వచ్చేమార్గము.

ద్విపద॥ ఆహరి రాగము॥

పల్లవంబులఁ బోలు భామ పాదములు
పిల్లాండ్లు మెట్టెలు బిరుదు పెండెంబు
గజ్జెలు నందెలు ఘల్లు ఘల్లనఁగ
ముజ్జగంబులవారు మొనసి చూడఁగను,
పెనుపైన తన మేటి పిఱుఁదందుఁ జాలఁ
గనక సూత్రి నికాయ ఘంటికల్ మెఱయఁ,
బద్మరాగపుఁ దీఁగఁ బరఁగ ధరించి
పద్మబాంధవురీతిఁ బలుదిశల్ వెలుఁగఁ,
దిన్నఁగా గాటుకదీర్చి నెన్నుదుటఁ
దెలివొంద గస్తూరి తిలకంబు దిద్ది
చెలు లిరుగడలను సేవలు సేయ
సారసలోచ నోత్సవము చూడంగఁ
గరిమతో మాతంగ కన్య తా వెడలెఁ?

దరువు॥ ఆహరి॥ ఆది॥

కనకభూషణములెల్లఁ దనర మాతంగ భామిని వెడలె
నీవేళ ।
మనసిజశరమోయని జనములు గొనియాడంగ వెడలె
నీవేళ ॥
జంటిరవికంటి గుబ్బచనుఁగవ పిక్కటిల్లంగ।
వెంట వెంట జంట తుంట వింటివాఁడంట నేయంగ॥

దరువు॥ బాగైన గబ్బిగుబ్బలఁ బయ్యెద జాఱ।
సోగైన కన్నులు మీాల సొబగుఁ గేర।
నాగరికమైన నడల నయముమీాఱ।
వేగ మాతంగభామ వచ్చె వింతమీాఱ ॥౧॥

అందెలు ఘల్లుఘల్లని యతిశయిల్లంగ।
ఇందుముఖులు ముదమంది గొలువంగ ।
అందము నెమ్మోనఁ జెలువొందుచుండంగఁ।
పొందుగాఁ గస్తూరిబొట్టు పొలుపుమీాఱంగ॥

మాతఙ్గి: ఈవిధంబున వచ్చిన మతంగస్త్రీ స్వామి సన్నిధియందుఁ దనస్వజాతివిద్య వినిపించి, యొక రమ్యప్రదేశంబున నుండు సమయంబున నావలికథ యేలాగునంటే॥ మహావిష్ణు తిరునాళ్ళు సేవించవలసి మోరోభట్లను బ్రాహ్మణోత్తముఁడు వచ్చుమార్గము.

దరువు॥ మధ్యమావతి॥ ఆదితాళము॥

వేదశాస్త్రములు చదువుచు విష్ణుదేవుని దలంచుచు।
మోదముతో నెడలెను ముఖ్యుండైన మోరోభట్టు॥

సూత్రి॥ అపురా యీవిధంబున బ్రాహ్మణోత్తముండు స్వామిని సేవింపరాంగా త్రోవలో నొకవింతగని శిష్యునిజూచి పలుకుమార్గము.

గురు : వినరా శిష్య! ఇక్కడ నేమో యద్భుతంగా యున్నది చూడరా.

శిష్యుండు : భూతమైతే తనకు వెలుపోచున్నదయ్య

గురు : భూతముగాదుర ! భామాలలామ

శిష్యుండు : భామాలలామయుంట మీకే గద్దయ్య

గురు : అదిగాదుర స్త్రీరత్నముర

శిష్యు : రత్నమైతే రాయిగాద ! (స్వగతం) నీకు తల పోడుచు కొనేందుకో

గురు : రాయిగాదుర మనిషేర

శిష్యు : ఊరివారి సొమ్ము నీవెలా ఆసపడేవయ్య

గురు : చక్కదనంగా ఉంటే చెప్పరాదా

శిష్యు : అయితే మీమనస్సు

గురు : దరువు॥ ఆదితాళము.

కొమ్మో పూవులరెమ్మో బంగారు
బొమ్మో మరునిశరమ్మో లేక।

తళుకో మరువంపు మొలకో రతిచేతి
చిలుకో ముద్దుల కలికో లేక।
ఇంతో వెన్నెలకాంతో చెలుల మేల్
బంతో మదనుని దంతో లేక।
నారో మేటిమిటారో చికిలి క
టారో యిదియెయ్యారో లేక।
కేటో మదనుని తోటో గుణముల
కోటో సింగారపు పేటో లేక॥

శిష్యుడు:- మాయయ్యవారికి వెఱ్ఱిపట్టిపోయెనయ్యా.

గురు:- ఓరి వెఱ్ఱిగాదురా. ఆవస్తువుయొక్క స్వభావమే. ఎట్లాగనంటే చెప్పెదవినర.

శ్లో॥ రహఃపరిచారకుశలా మృదుగద్గదభాషిణీ
కం కం నారీనకురుతే రక్తం రక్తాంత లోచనా॥

శిష్యుడు:- అట్లాఅంటే అర్థం ఏందయ్యా.

గురువు:- ఆవస్తువుయొక్క స్వభావమే నిత్యచాతుర్యమున్ను సౌందర్యమున్ను మరిన్ని ఆవస్తువెటువంటి దంటే మృదువైన గద్గదగళస్వరముతో మాట్లాడుతుండే అటువంటి దాన్ని జూస్తే యెవరు మోహించక యుందురురా ఇంకా చెప్పెద వినరా.

శ్లో॥ స్త్రీతి నామాపి సంహ్లాది, వికీరత్యేవమానసం।
కింపునర్దర్శనం తస్యాః, విలాసోల్లాసితభ్రువః॥

శిష్యుడు:- అట్లాఅంటే అర్థమేందయ్యా.

గురువు:- ఎంతజపము చేస్తూవున్నాగాని, ఎంత తపం చేస్తూవున్నాగాని, ఎంత సమాధిగావున్నాగాని, ఎంత నిష్ఠగా వున్నాగాని స్త్రీయనే రెండక్షరాలువింటే అదంతా విడిచిపెట్టి దాని మీద, మనం పారుచున్నది; మనస్సుకు వికారం పుట్టు చున్నది. మరిన్నెట్లానంటే, విలాసాలచేత ప్రకాశించుచుండే కనుబొమ్మలు గలిగినట్టువంటి స్త్రీని జూచి యెవరి మనస్సుకు వికారం పుట్టకయుండుర.

శిష్యుడు:- అయితే మీకు వెఱ్ఱిపట్టింది నిజమే సరి. ఎట్లాఅంటె చెప్పర వినవయ్యా.

శ్లో. ఉదర్క ఫల మిచ్ఛద్భి స్సద్భి ర్నైవావలోక్యతే
చతుర్థీ చంద్రరేఖేవ పరస్త్రీ ఫాలపట్టికా.

గురువు:- అంటే అర్థం ఏందిరా?

శిష్యుడు:- మహాత్మైన ధర్మమోక్షమానేటువంటివి అపేక్షించే పెద్దలు పరస్త్రీని జూచేదిలేదు. అది యెట్లానంటే పిళ్లారి చవితినాటి చంద్రకళ నెట్లువలె చూడరాదో అట్లువలెనే చూడరాదయ్యా.

గురువు:- మనం చూడరాదంటే మనస్సు నిల్చునా ? చెప్పెద వినరా.

శ్లో. కుంకుమ పంక కళంకిత దేహా
పీనపయోధర కంపితహారా ।
నూపురహంస రణత్పదపద్మా
కన్నవశీ కురుతే భువి రామా॥

శిష్యుడు : అనంగా అర్థమేందయ్యా
గురువు : ఆయొక్క-స్త్రీ, ముందరనే గౌరవర్ణము; అందుమీాద కుంకుమగంధము ధరించింది; గొప్ప స్తనాలు గలిగి నది; స్తనాలమీాద ముత్యాలహారాలు రత్నాలహారాలు ధరించింది. అదిగాక పాదాలయందు గజ్జెలు అందెలు ధరించుకొని ఘుల్లు ఘుల్లుమనిరాగా అటువంటిదాన్ని జూచి యెవడు మోహించక యుండునురా ?

శిష్యుడు అయితే వెఱ్ఱి మీాకుపట్టింది నిజమేసరి. ఎట్లా గంటే చెప్పెద వినవయ్యా.

శ్లో. ముఖం శ్లేష్మాగారం తదపిచ శశాంకేన తులితం,
స్తనౌ మాంసగ్రంధీ కనకకలశా విత్యుపమితౌ।
స్రవన్మూత్రక్లిన్నం కరివర శిరస్పర్ధిజఘనం
ముహుర్నింద్యం రూపం కవిజన విశేషైర్గురుకృతం॥
గురువు : అనంగా అర్థంయేందిరా ?

శిష్యుఁడు: వినవయ్యా గురుస్వామి, శ్లేష్మమయమైనష్ఠ వంటి ముఖాన్ని జూచి చంద్రబింబముతో సరిపోల్చుచున్నారు. మాంసవికారమైనటువంటి స్తనాలుచూచి బంగారు కలశాలను చున్నారు. మూత్రపురీషాలచేతఁ దడిసినటువంటి పిఱుదులను జూచి యేనుఁగుశిరస్సుతో సరిచేయుచున్నారు. పలుమారు నింద్యమైనటువంటి రూపమునుజూచి శ్రేష్ఠమని చెప్పుచున్నారు. ఇటుల చెప్పువారికి మీకు వెఱ్ఱిపట్టిందంటే కాని తనకు వెఱ్ఱి పట్టిందా.

గురువు: అట్లా గాదురా దానియొక్క స్వరూపఁ చెప్పెద వినరా.

దరువు॥ అసావేరి॥ ఆది॥

తరుణిజడకుఁ దాను సరిగాదని నెమ్మి
యరుదగు చిలువల నంటెఁగదోయి॥
కరిగమన మోముతోఁ దొరయఁగ లేనని
హరు శిరసుఁ జంద్రుఁడంటెఁగదోయి ॥౧॥
కలకంఠి కన్నులతోఁ దులఁదూఁగ లేనని
యల చకోరము లగ్ని నంటెఁగదోయి ॥౨॥
ఎలనాగ నూగారు కెనయంగ లేనని
తలఁచి తేంట్లు తమ్ముల దాఁటెఁగదోయి ॥౩॥

సుదతి గబ్బిగుబ్బలకుఁ బోలఁగాదని చక్రిములు
పదరి రవికభిముఖమై పలికెఁ గదోయి ॥౨౮॥
ఇటువంటి భామను ఎచటఁ జూడలేదని
అటువలె నిన్ను నే నంటెదరా యోరి ॥౨౯॥

శిష్యుఁడు:- శివశివ! నాతల నేల ముట్టెదవయ్యా? వీఁ ముంటి యోటి చట్టిమీఁద కొట్టుకోవయ్యా.

గురువు:- అదిగాదురా శపథం చేస్తున్నానురా.

శిష్యుఁడు:- నీశపథం కాల, నేను శపథం చేస్తున్నాను. ఏమాట యబద్ధము, చెప్పెద వినవయ్యా.

శ్లో. ఆవర్తస్సంశయానా మవినయభవనం,పత్తనం సాహసానాం
దోషాణాంసన్నిధానం కపటశతమయం క్షేత్రమప్రత్యయానాం
మోక్షద్వారస్య విఘ్నం నరకపురముఖం సర్వమాయాకరండం
స్త్రీయంత్రం కేనసృష్టం విషమమృతమయం సర్వలోకైకపాశః॥

గురువు:- అనంగా అర్థం ఏందిరా?

శిష్యుఁడు:- వినవయ్యా స్త్రీయనేదే సంశయాలకంతా సుడివంటిది. అవినయాలకంతా యిల్లైనటువంటిది; సాహసాని కంతా పట్నం వంటిది; దోషాలకంతాను సమీపభూమి. కపట

శతసహస్రాలు గలిగినది. భ్రష్టత్వానికి స్థానము వంటిది. మోక్షద్వారానికి విఘ్నం వంటిది. నరకపురానకు మార్గమై యుండును. సకలమైనషువంటి మాయలకున్ను బరణి వంటిది. ఇషువంటి స్త్రీయనే యంత్రము ఎవడిచేత పుట్టింపఁబడెను! విషమైనప్పటికి అమృతమై తోచును. సకలమైన లోకాలకున్ను పాశమువంటిది. ఇంకా చెప్పెద వినరయ్యా.

ద్వి. వినవయ్య నామాట విప్రవరేణ్య
మనకేల నేఁడు ఈ మానిని గొడవ?
వద్దు ఈ మోహంబు వాడు చాలించు
ప్రొద్దాయె నింటికిఁ బోదమయ్య సామి!

గురువు:- వినరా శిష్యా! మనకిల్లేల! వాకిలేల! సంసారమేల పెండ్లామేల! బిడ్డలేల? చెప్పెద వినరా.

శిష్యుఁడు:- వినవయ్యా, గురుస్వామీ! సన్యాసివలె డల గొరిగించుకొని కావివస్త్రాలు గట్టుకొని దండపుఁగోల కమండలము పట్టుకొని సన్యాసం తీసుకోఁ బోవుచున్నానా?

గురువు:- సన్యాసం గాదురా చెప్పెద వినరా.

దరువు॥ ఆహిరి॥ ఆది॥

ఇల్లాలి గొడవయేల యింటి గొడవయేల
మొల్ల సుగంధిపై మోహమెచ్చె నీవేళ॥
మగువ నెడఁబాయ నామనసు రాదురా ॥౧॥

వేలిమి యిఁక నేల వేదశాస్త్రములేల
బాలతో నొకసారి పలికితే చాలుఁబోర ॥౨॥

పసలేని బ్రహ్మానంద పదము నే నొల్లర
సశరీర స్వర్గ ఫలము సమకూడు దీనివల్ల ॥3॥

శిష్యుఁడు : వినవయ్య గురుస్వామి ! మావంటి బుద్ధి లేనివారికి మీవంటిపెద్దలుగద బుద్ధి చెప్పవలెను. మీరే యిట్లా స్త్రీని జూచి మోహిస్తే మీ పెద్దతనానకు మాటవచ్చునే.

గురువు॥ వినరా వెఱ్ఱిచిన్నవాఁడా ! మా పెద్దతనానికి కొదవయేమి. మాకంటే పెద్దలైనట్టి వారికి స్త్రీని జూస్తే యింద్రియనిగ్రహంసేయ గూడలేదె ! మాకనంగానేమి ? యింద్రియనిగ్రహమయ్యేదేందిరా? ఎట్లానంటే చెప్పెదవినరా.

శ్లో. విశ్వామిత్ర పరాశర ప్రభృతయో వాతాంబుపర్ణాశనా
స్తేపి స్త్రీముఖపంకజం సులలితందృష్ట్వైవ మోహంగతాః।
శాల్యన్నం సఘృతం పయోదధియుతం యేభుంజతే మానవా
స్తేషా మింద్రియ నిగ్రహోయదిభవే ద్వింధ్య*స్తరేత్సాగరే

శిష్యుఁడు : అనంగా అర్థమేదయ్య ?

గురువు : వినరా శిష్య ! విశ్వామిత్ర పరాశరులు మొదలైన మునీంద్రులు వాయువు, నీళ్లు, పండుటాకులు ఆహా

* ప్లవేత్.

రము చేసికొని యుండేవారు మొదలుగా, లలిత మైనటువంటి స్త్రీయొక్క ముఖకమలాన్ని జూచి మోహాముఁ జెందిరి. రాజాన్నమున్ను, అప్పుడు వెన్నగాచిన నెయ్యిన్ని, పాలు పెరుగుతో గూడిన భోజనముఁ జేసే మనవంటి మానవుల కింద్రియ నిగ్రహాము సేయఁగూడునా ? వింధ్యపర్వతము సముద్రిమీఁది నస్తైతే, మనకు నింద్రియ నిగ్రహాము సేయఁగూడును.

గురువు॥ వినరాశిష్య ! నాయొక్క మనస్సులోనుండే కోరిక సెప్పెద వినరా,

శ్లో. ముదితః కదా శయిష్యే
ముఖమివ మాఘ్రాయ ముకుళితాపాంగం !
మందస్మితం రతాంతే
ముక్తాతాటంక ముద్రిత కపోలం॥

శిష్యుఁడు : అనగా నర్థమేందయ్యా.

గురువు : వినరా శిష్య ! సంతోషముచేత పుష్పశయ్యమీఁద నది నేనుకూడి. దానిముఖమాఘ్రాణముచేసి, కన్నులు మోడ్చి, చిరునవ్వుతోడ దానితో సురతముచేసి, దానిముఖము మీఁద నణఁచినవల్ల దాని ముత్యాలకమ్మలు నా చెక్కిలిమీఁద ముద్రించి నస్తెన్నఁడు పండుకొందురా ! వినరా శిష్య ! తనకు నేదిక్కుచూచినా అదిగానే తోచుచున్నది. ఎటులనంటే చెప్పెద వినరా.

శ్లో. ప్రాసాదే సా దిశిదిశిచ సా పృష్ఠతస్సా పురస్సా
పర్యంతే సా పథిపథిచ సా తద్వియోగాతురస్య।
హాహా చేతః ప్రకృతిరపరా నాస్తిమే కాపి సా సా
సాసా సాసా జయతి సకలే కోయమద్వైతవాదః॥

శిష్యుఁడు:- అటులనంటే అర్థ మేందయ్యా.

గురువు:- వినరా శిష్య! మేడమీాద చూచినా అదే; దిక్కుదిక్కులఁ జూచినా అదే; వెనుకఁ జూచినా అదే; ముందఱఁ జూచినా అదే; మంచముమీాదఁ జూచినా అదే; ఏయే త్రోవలఁ జూచినా అదే. దానినెడఁబాసినందువల్ల సర్వము అదిగానే తోఁచుచున్నది. హా హా మనస! తనకు వేఱే ప్రకృతి లేదు. అది అది అది సకలమందును సర్వోత్కర్షగా నుండఁగాఁ బ్రత్యక్షమైన యద్వైతమను వాదమేమియున్న దిరా? వినరాశిష్య! నన్నింటికి రమ్మనుచున్నావే యెటుల వత్తురా?

శ్లో. మనోమే నాయాతం కఠినకుచయో రంతరగతం
తతోధైర్యం ధ్వస్తం కిముత విరహాగ్నౌ నిపతితం।
తరుణ్యా లావణ్యామృత సరసి మగ్నం కిమథవా
చరన్మారశ్చోరః కిమిదమహరద్యౌవనవనే॥

శిష్యుఁడు:- అటులనంటే అర్థమేందయ్యా.

గురువు:- వినరా శిష్య! నామనసైతే దీనియొక్క కఠిన మైనటువంటి స్తనాలమధ్యమమందు తగులుకొని రానను

చున్నదిరా. తరువాత నాయొక్క ధైర్యము విరహానలమందు పడి కరగి పోయెరా. ఏమి చెప్పుదురా ! అదిగాక స్త్రీయొక్క చక్కదన మనేటటువంటి అమృతపు సరస్సునందు మునుఁగుచు తేలుచు నున్నదిరా. మన్మథుఁడనే గట్టిదొంగ యీ వనమనే వనమందు సంచరించుచు నున్నవాఁడు నామనసు నపహరించు కొని పోయెనో తెలియదు గదరా. ఇంకా చెప్పెద వినరా.

శ్లో. కామినీ నయన కజ్జల పంకా
దుత్థితో మదన మత్తవరాహః ।
కామి మానస వనాంతరచారీ
కంద ముత్ఖనతి మాన లతాయాః॥

శిష్యుఁడు:-అటులనఁగా అర్థమేందయ్యా?

గురువు:-వినరా శిష్యా ! స్త్రీలయొక్క కన్నులదీర్చిన కాటుకయను బురదవల్ల నుంచి పుట్టిన మన్మథుఁడనే మదపు వరాహము, కాముకులయొక్క మనస్సనే వనాంతరమందు సంచరించుచున్న మానమనే తీగెయొక్క వేళ్ళను పెల్లగించు చున్నది. వానికి తోడుగాను చంద్రుఁడువచ్చి బాధించుచున్నాడు. వాండ్లతో మాట్లాడుకోవలెను. నీవును నన్ను బాధించక తాళరా భ్రష్ట.

సూత్రధారవచనము:-అవురా యీవిధంబున బ్రాహ్మణోత్తముఁడు శిష్యునిజూచి పలికి తన్ను బాధించే చంద్రమన్మథులనుజూచి పలికేమార్గం.

శ్లో. తవ కుసుమ శరత్వం శీతరస్మిత్వమిందో
ర్ద్వయమిద మయథార్థం దృశ్యతే మద్విధేషు
విసృజతి హిమగర్భైరగ్ని మిందు ర్మయూఖై
స్త్వమపి కుసుమబాణాన్ వజ్రసారీ కరోషి

శిష్యుఁడు : అనగా నర్థమేమయ్యా.

గురువు : వినవోయి; మన్మథ నీ పుష్పబాణత్వ మనే దిన్ని, చంద్రుని శీతకిరణత్వ మనేదిన్ని ఈరెండును మావంటి వారిపట్ల నబద్ధము. అది యెటువలెనంటే, చంద్రుడు మంచే లోపలగా గలిగినటువంటి కిరణాలచేత నగ్ని బిందువులను జల్లు చున్నాడు. నీవైతే పూలబాణాలను వజ్రాయుధ సమానముగా జేయుచున్నావు. కాబట్టి మీరిద్దరును దబ్బరపేర్లు గలిగినవారలే.

సూత్రధారుఁడు : అవురా యీవిధంబునఁ జంద్ర మన్మథులను జూచి పలికే గురువును జూచి శిష్యుఁడు పలికే మార్గం.

శిష్యుఁడు : వినవయ్యా గురుస్వామి! మీకు స్వంతంగా నుండే యిల్లు వాకిలి సంసారము విడిచిపెట్టి అదెవరో ఊరి వారి పెండ్లాము ఒకమాటనాడితే చాలునంచున్నావే, దీని నుండి సశరీరస్వర్గఫలము గలుగునని చెప్పుచున్నావే, దానిని జూచిన రాక్షసివలెనున్నదే! అదెటులనంటే చెప్పెద విన వయ్యా.

శ్లో. దర్శనాద్ధరతే చిత్తం స్పర్శనాద్ధరతే బలం।
సంగమాద్ధరతే వీర్యం నారీ ప్రత్యక్ష రాక్షసీ॥

గురువు : అంటే అర్థమేమిరా ?

శిష్యుఁడు : స్త్రీని చూడగానే మనస్సపహరింప బడుచున్నది; దానింటిపట్టారా ! దానినంటగానె బలమంతాహరింప బడుచున్నది; దానిఁగూడఁగానే వీర్యము హరించుకొని పోవుచున్నది. కాఁగా ఇటువంటి స్త్రీయనేదే ప్రత్యక్షరాక్షసి. ఇంకా చెప్పెద వినవయ్యా రాక్షసిని జూడఁగానే మనసుకలఁగుచున్నది; అంటఁగానే బలమపహరించుకొనిపోవుచున్నది; రాక్షసిని గూడఁగానే వీర్యనాశనమౌను. కాఁబట్టి స్త్రీయనేదే ప్రత్యక్షరాక్షసి.

గురువు : వినర శిష్య ! రాక్షసిగాదు మనిషేర. దాని వద్దకుఁబోయి పూర్వోత్తర మడిగి రారా.

శిష్యుఁడు : భళిభళా లెస్సాయెనయ్యా ! మీగురుత్వమున్ను నాశిష్యత్వమున్ను చాలుజాలును. రాక్షసి దగ్గఱను నేఁబోయేదిలేదు. నాకు వెఱపౌచున్నదయ్యా.

గురు : నేనుండఁగా నీకు వెఱపేమిరా !

శిష్యుఁడు : అయితే మంచిది. ఏమిసేయవలె ! 'బ్రాహ్మణార్థే గవార్థేవా సమ్యక్ప్రాణాన్పరిత్యజేత్' త్తని శాస్త్రమున్నది గనుక నీవు బ్రాహ్మణుండవు. అదిగాక తనకు గురువులు నగును కాఁబట్టి నీకొఱకై నాప్రాణాలు దాని కొప్పగించుచున్నాను. మీరు ప్రాణాలు గట్టిగాఁ బట్టుకొండయ్యా.

శిష్యుఁడు ; వినరయ్య భాగోతుల్లారా ! మాగురువుల వారు నన్ను రాక్షసి దగ్గఱకుఁ బొమ్మంచున్నారు. నాకు బదులుగా మీరెవరైనా పోరయ్య.

భాగవతుల వచనం॥ ఓరి వెఱ్ఱిచిన్నవాఁడా ! నీవు పోయే కార్యానికి నీవె పోవలెఁ బోరా.

శిష్యుఁడు : నీవైతే ముసలివాఁడవు. విద్యాబుద్ధులు నేర్చినవాఁడవు. ఇల్లు వాలికి సంసారము పెండ్లాము బిడ్డలు గలిగినవాఁడవు. నేనైతే చిన్నవాఁడను. విద్య బుద్ధి పెండ్లాము ఇల్లు వాకిలి సంసారము బిడ్డలు ఇదంతా యిఁకమీఁదటఁ గావలె. కాఁబట్టి నీవుపోతే యేంది ఉంటె యేంది, నాకు బదులుగా నీవేపోవయ్యా.

* * * * * *

సూత్రి ; అవురా యీవిధంబున శిష్యుండుపోయి మతంగస్త్రీని పూర్వోత్తరమడిగే మార్గం.

శిష్యుఁడు : ఓసి వినవే నీవు దయ్యమో భూతమో పిశాచివో మనిషివో నీపూర్వోత్త రాలు మాగురువులుగారడిగి రమ్మనిరి; నాతోఁ దెలియఁజెప్పవే.

శిష్యుఁడు : వినరయ్య భాగవతులార ! ముమ్మాటు పిలిచితిని; నాతోఁ బలుకలేదు; మీరు సాక్షి; నామీఁద నేరము లేదు నేఁబోవుచున్నాను మీరు సాక్షి.

సూత్రి : అప్పురా యీవిధంబున శిష్యుఁడు మతంగ స్త్రీని పూర్వోత్తరము నడుగఁగా నది పలుకకపోయెఁ గనుక వచ్చి బ్రాహ్మణునితోఁ బలికే మార్గము.

క. నేనడిగిన మాటాడక
మానిని కోపంబుతోన మనసియ్యకయే
పోనాడె నన్ను; దేవర
తానే యడుగంగవలయుఁ దరుణి వితంబున్.

గురువు : వినరా శిష్య ! నీవడిగితే మాట్లాడకపోయెనే నేఁబోయి మాట్లాడించుచున్నాను జూడరా.

సూత్రి: అప్పురా యీవిధంబున బ్రాహ్మణుండు మతంగ స్త్రీ సమీపానకుఁబోయి పలికే మార్గం.

దరువు॥ నాదనామక్రియ॥ ఆది॥
సకల శోభనమస్తు సంతతాభివృద్ధిరస్తు
వికచకమల నేత్రి వినవె నామాట ॥౧॥
నీదు నూరిపేరేమి నీదుపేరేమి
నీదు జాతియునేమి నెలఁత దెలుపవె ॥౨॥
నెలఁత నీరూపము నిలువునీరు పట్టేని
తెలియఁ బల్కవె నాతోఁ గలికి నీవితము ॥3॥

శిష్యుఁడు : అక్కడి కేలపోయేవయ్యా ? దానితో నేల మాట్లాడేవయ్యా ? నీవు పిడికెఁడు జంద్యాలువేసినావు. నీవు శావిధోవతులు గట్టినావు, గంధాక్షతలు పెట్టినావు, తనకు

మొదలుగామాట్లాడేందుకు రోఁతవచ్చుచున్నది. నీవేషము కాల. దానిచక్కఁదనమేమి దానిసొమ్ములేమి! దానికి నీకు "అజగజాంగా"నున్నది. నీవెఱ్ఱిగాలనీతో మాట్లాడునా? వింటే మనమ్మంతరకొట్టఁబోయీని రావయ్యా.

సూత్రి : అవురా యీవిధంబునఁ బలికిన బ్రాహ్మ ణుని వాక్యంబులు విని మతంగస్త్రీ పలికేమార్గము

దరువు ॥నాదనామక్రియ॥ ఆది॥

అంటరానివారమయ్యా మమ్మంటినపుడె మీకునంటె, నయ్యా (?)
చేరరావలదయ్యా సేవించెకనయ్యా
పాతేలవచ్చెదవయ్యా బాపనయ్యా।
దూరాన నిలువయ్యా దుడుకు మానవయ్యా
వాలులుగట్టే మాదిగవారమయ్యా॥ ॥౧॥
దొరయ గ్రామానికిఁదూర్పున మాగుడిసయ్యా
పరదూషితులమయ్యా బాపనయ్యా।
పొరిది పసులనంజులు దినేవారమయ్యా
పరికింపవేలయ్యా బాపనయ్యా॥ ॥౨॥
కలుద్రాగుదుమయ్యా కడజాతివారమయ్యా
పలుమాటాడకువయ్యా బాపనయ్యా।
మలినదేహులమయ్యా మరియాదహీనులమయ్యా
బలు మత్తులమేమయ్యా బాపనయ్యా॥ ॥3॥

శిష్యుఁడు : శివశివ! నారాయణ ! ఇక్కడికేల వచ్చితి వయ్యా! ఇవతల రావయ్యా. నీవేదాలేంది? నీశాస్త్రాలేంది? పురాణాలేంది? నీవు పెద్దవాఁడవని నీదగ్గఱకు చదువుకోవస్తే నీవుచెడి మాలల్లో గలిసి, నీ యాచారమంతా విడిచిపెట్టి మాల దానితో మాట్లాడుచున్నావే. అది మాలదని చెప్పుచున్నదే ; దానితో మాట్లాడితే నీబ్రాహ్మణికమే పోయెనే ! నీ వెక్కడికిగా రావయ్యా.

గురువు :- తాళరా దానితో ప్రత్యుత్తరము మాట్లాడు చున్నాను వినరా.

శిష్యుఁడు:- అయితే నీదగ్గఱనే యుండేదిలేదు. నేనెక్కడి కైనా పోవుచున్నానయ్యా. నేనైతే చిన్నవాఁడను. ఇంకా పెండ్లిలేదు. నీవు మాలదానితో మాట్లాడితే నీదగ్గఱ నేనుంటే నాకెవరైనా పడుచునిస్తురా? నే దూరముగా నుండెదనయ్యా.

సూత్ర: బ్రాహ్మణుఁడు మతంగస్త్రీనిచూచి పలికే మార్గము.

గురువు: వినవే మతంగభామ ! నీవంటరానివారని పలికితివే అందుకు దోషములేదు. మేమంటరానివారమే ఎటులనంటె చెప్పెదవినవే.

దరువు॥ కాంభోజి॥ఆది॥

అంటరాని వారంటి వగ్నినైతి నీ
యంటె కావలెనని యాశించినానె॥

శిష్యుఁడు: వినవయ్యా గురుస్వామి ! అంటరానివారని అగ్నివంచు చెప్పచున్నావే అంటివే నీబ్రాహ్మణీకమే పోయెనే.

గురువు: జంటగ కడజాతంటివి నీజాతి
సకలజాతులకు పైజాతి గదటవె.

శిష్యుఁడు: సకలజాతులకును పైజాయకుట్టు జాతిగాదా!

గురువు: మాదిగవారని మాటలాడితివేల
మాదిగ నినుజేయ నామనసించునే.

శిష్యుఁడు: వినవయ్యా మాదిగవారిని చాతుర్యంగా తనదిగాఁ జేసుకొనుచున్నావే. నీవున్ను మాదిగగాఁ బోయెదవు రావయ్యా.

గురువు: వాదేల తోలుగట్టేవారంటివి కాఁగా।
భేదమేడది గార్రీప్రియునకునీకు॥

శిష్యుఁడు: భళిభళా లెస్సాయెనయ్యా ! 'స్వయంనష్టః పరాన్నాశయతి' అన్నట్లాగున, తాఁజెడ్డకోఁతి వనమెల్లా చెఱిచె నన్నట్లాగున, నీవుచెడ్డదిగాక పరమేశ్వరునిగూడా చెఱుపు చున్నావా?

గురువు: పసులపాలను దినే వారంటివి దాని పాలు జనులు
ద్రాగి పావనులౌదురు। తసుకక దానిసమూలము దిని
మీరు ధన్యులు గారఁటె, దయసేయవేమె॥

శిష్యుఁడు: భళభళా! మహాలెస్సాయెనయ్యా తల్లి చంటి పాలు త్రాగేవారు తల్లినిగూడా తినుచున్నారా? నీవు తేలు పుట్టుక పుట్టినావా? తేలు పుట్టఁగానే తల్లినిగూడఁ దినుచు వచ్చును. పాలున్ను మాంసమున్ను సరియా?

మాత: అవురా యీవిధంబున బ్రాహ్మణుండు మతంగ స్త్రీనిజూచి పలికేమార్గము

గురువు:- వినవే భామామణి! నీచక్కఁదనముఁజూచితే కన్నుల పండువుగానున్నది. ఎటుబనంటే చెప్పెదవినవే.

శ్లో॥ వద యోజయామి పదయోరలక్తకం
కలయాని హేమవలయాని హస్తయోః।
నహానం కచస్య వహానం కుచస్యవా
కరవాణి కీరవరవాణి తేఽధునా॥

అర్థం: వినవే భామామణి! నీపాదాలయందు లత్తుక పూయుదునో, నీయొక్క చేతులయందు బంగారుకంకణాలు ధరింతునో, నీకొప్పుముడుతునో, నీస్తనాలు రెండుచేతులా మోయుదునో, ఎట్లా యూడిగముచేతును చెప్పవే. నీస్తనాలు చూచితే తన యిష్టదైవమువలెనే యున్నవి. ఎట్లానంటే చెప్పెద వినవే.

శ్లో॥ స్వయంభూశ్శంభురంభోజలోచనే త్వత్పయోధరః।
నఖేనకస్యధన్యస్య చంద్రచూడో భవిష్యతి.

శిష్యుఁడు: అటులనంటే అర్థమేమయ్యా.

గురువు:– వినరా దానితో చెప్పుచున్నాను. వినవే తామర రేకులవంటి కన్నులుగలదానా! నీస్తనాలు తనకుతానే పుట్టినటువంటి పరమేశ్వరుఁడు ఇఁకమీఁదట నేధన్యునియొక్క నఖాలచేతను చంద్రశేఖరుఁడు కాఁబోవుచున్నాఁడో తెలియదు గదవే !

శిష్యుఁడు:–భళా మహాలెన్నాయెనయ్యా! దాని చన్నులు మాచి పరమేశ్వరుఁడనుచున్నావే! దోషముగాదా! నీపెద్దిగాల రావయ్యా.

సూత్ర:–అవురా యీవిధంబున బ్రాహ్మణుని వచనము విని మతంగభామిని పలికేమార్గము.

మతంగ స్త్రీ:–వినవయ్యా బాపనయ్యవారు. తనసర్వాంగ మును జూస్తే మహాహీనముగా నుండును. మీవంటిపెద్దలకు చూరియాదగాదు. ఎటులనంటే చెప్పెద వినవయ్యా.

దరువు॥ ఘంటారవము॥ ఆది॥

బమ్మనయ్య వారీలాగు బ్రితిమాలుదురా।
ఇమ్మాలెతవేసము – ఈనముగాదా ॥౧॥

బిసబిస మెట్లనుగూర్చి – పిసికినసేతులునూసి
పసపులనంజుల మెసవి – పసగలనామేను నూసి ॥౧॥

కలుద్రావి వఱువల్లగట్టిన నాపెదవినూసి
మెలమిగనే లాహిరిచే నెఱ్ఱనైనకన్నులునూసి ||౨|
పరిపరి తబ్బిబ్బైన బాసలనువిని బమసి
మురిపెమున సోలినట్టి మోమునందమునూసి ||3||

శిష్యుడు: వినవయ్య యయ్యవారు. దానికిగలిగినబుద్ధి సెకులేకపోయెనే! నీవెఱ్ఱిగాల రావయ్యా.

సూత్ర: అవురా యీవిధంబునఁ దనయవయవములు నింద్యములని పలికిన మతంగస్త్రీ వాక్యంబులువిని బ్రాహ్మణో త్తముండు పలికేమార్గము.

గురువు: వినవే మతంగభామిని! నీవుచెప్పినట్లానే నీ యవయవాలున్ను తానంటేదిలేదు. అవి పరిశుద్ధవస్తువులు గాఁబట్టి తానంటుచున్నాను. ఎట్లానంటే చెప్పెద వినవే.

జరువు। ఎఱుకలకాంభోజి॥ఆది॥

కురులనైతే నంటనే యోభామామణి, మఱి
యిరులివిగాఁగ నంటేనె భామామణి॥

శిష్యుఁడు: వినవయ్యా గురుస్వామి దానియొక్క కురులు చూచితే గిజిగాని గూడువలె నున్నదే.

మోమునైతేనంటనే యోభామామణి, చందమామ
యిదిగాఁగ నంటేనే యోభామామణి॥

శిష్యుఁడు: నీ నెత్తిగాల దానిమోముచూస్తే నల్లనాఁ గాలిన పెంకువలె నున్నదే.

చెక్కులైతే యంటనే యోభామామణి, పసిఁడి
చెక్కలివిగాఁగ నంటేనే భామామణి॥

శిష్యుఁడు: దానిచెక్కులు చూస్తే ప్రాఁతచెప్పులవలె నున్నవే.
మోవినైతే యంటనే యోభామామణి।
తేనెబావియిదిగాఁగ నంటేనె॥

శిష్యుఁడు: దానిమోవి చూస్తే నాకు మొదలుగాకకుక్క వస్తున్నదే.

పొంకమైన నీగళమంటనే భామామణి, జయ
శంఖమిదిగాఁగ నంటేనే భామామణి॥

శిష్య: దానిగళము చూస్తే అందఱూ శంకించేయొడవే.
మేలు నీకరము లంటనే యోభామామణి, పల్ల
వాలివిగాఁగ నంటేనె భామామణి॥

శిష్య: దానిచేతులుచూస్తే ప్రాఁతచెప్పులుకుట్టి కాయలు కాచియున్నవే.

చండ్లనైతే యంటనే యోభామామణి, నిమ్మ
పండ్లివిగాఁగ నంటేనే భామామణి॥

శిష్య: దానిచండ్లు చూస్తే మాంసవికారమై కురుపుల వలె నున్నవే.

వగగా నడుమైతే యంటనే భామామణినేను।

గగనమిదిగాఁగ నంటేనె భామామణి॥

శిష్యుఁడు:- దానినడుము చూస్తే రోలు వలెనున్నదే
రొండ్లైతే యంటనే యోభామామణి, తేరు
బండ్లివిగాఁగనంటేనే భామామణి॥

శిష్యుఁడు:-దానిపిఱుదులు చూస్తే తేరుక్రింది తుండ్లవలె నున్నవే.

తొడలైతే యంటనే యోభామామణి, యంటి
గడలివిగాఁగ నంటేనే భామామణి॥

శిష్యుఁడు:-దానితొడలు చూస్తే పడిపోయిన యింటికి కాళ్ళుఇచ్చినట్లానున్నవే.

పాదాలైతే యంటనే యోభామామణి, తమ్మి
భేదాలివిగాఁగ నంటేనె యోభామామణీ॥

శిష్యుఁడు:-దానికాళ్ళుగాల; తిరునాలసందట్లో యేడనేడ
త్రొక్కిందో. దానికంపుగాల నీవెట్లగాల.
వేగ, మేనైతేయంటనేభామామణి, పూవు
దీగెయిదిగాఁగ నంటేనే భామామణీ॥

శిష్యుఁడు:-వినవయ్యా గురుస్వామి! దానిశరీరముచూస్తే
గానుగరోలువలె నున్నదే.

సూత్ర:-అవురా యీవిధంబునఁ బలికిన బ్రాహ్మణోత్త ముని జూచి మతంగ స్త్రీ పలికే మార్గము.

ద్వి. వినుబాపనయ్య నావిన్నపంబొకటి
తను వస్థిరము చూడ ధర్మమే స్థిరము
పాయక ధరనైన బ్రహ్మండమైన
మోయవచ్చును ఇదె మోయరాదెందు.
కులహీనురాల నాగోడవ నీకేల ?
తలఁకక యింటికిఁ దఱలిపోవయ్య.

శిష్యుఁడు:-వినవయ్యా గురుస్వామి ! యిదియింటికిఁ బొమ్మని యప్పనయిచ్చెనే ఇంటికిఁబోదాము రావయ్య. దానికి గలిగినబుద్ధి నీకులేకపోయెనే! క్షణకార్యమువల్ల నపకీర్తివచ్చును. పాపము వచ్చును. ఇందువల్ల నేమికట్టుకొనెదవు రావయ్యా.

సూత్ర:-అవురా యీవిధంబునఁ గులహీనురాలనిపలికిన మతంగ స్త్రీని జూచి బ్రాహ్మణోత్తముఁడు పలికే మార్గము.

దరువు॥ కులముమంచిదైనఁ గాని గుణహీనమైనఁగాని
గొనియాడుదురఁటవే భామా॥
కులహీనమైనఁగాని గుణముగలిగినదాని
కొనియాడరఁటవె జనులు భామామణి॥

శిష్యుఁడు:-వినవయ్య గురుస్వామి! వారివారి కులాచారము వారివారిది. కులములేనిదానికి గుణముగలిగితే దాన్ని గాల్చనా !

గురువు : కలశాంబు నిధిలోనఁ గలిగినదైనఁగాని
గరళమెవ్వరైన భుజింతురా ।
పాలుపైన శుక్తులను బుట్టినదైనఁగాని
ముత్యము నెవ్వరైన నిందింతురా ॥

శిష్యుఁడు: పోపో నీబుద్ధిగాల. ఆ గరళము పరమేశ్వరునికి భూషణమాయెను. ముత్యములు మనుష్యుని భూషణమాయెను. పరమేశ్వరుఁడు ధరించేదిన్ని ముత్యములున్ను సరేనా ?

గురువు : వనజభవకులమున జనియించిన రక్కసిని
జనులెవ్వరైనా నమ్మి చేరుదురా ।
పనిపడి మీజాతిని బరగఁగఁ గలిగిన కన్యను
పరమేశుఁడు చేపట్ట లేదఁటవె ॥

శిష్యుఁడు : భళభళా మీ కులాన రాక్షసిపుట్టెనా, కాఁగా నీవు రాక్షసివా ? జాతంటే బుద్ధి, కులమంటే యాచారము, అనేదంతా చూపుచున్నావు. నీవెట్టిగాల రావయ్యా.

సూత్రధారుఁడు : అవురా యీవిధంబున కులహీనులాలన్నప్పటికిన్ని గుణము గలిగితే చాలునని పరిగ్రహింపవచ్చునన్న బ్రాహ్మణునిజూచి మతంగస్త్రీ సంసారినని పలికేమార్గం.

దరువు॥ ముఖారి॥ చాపు॥

సంసారి గానఁటరా బాపనయ్య ।
సంసారిగానా యీసరసమేల నాతో ।
సంసారముఁ జేయ నన్నలు నేసేవు ॥

ఓజ నీకిదిగాదుర బాపనయ్య, ఓజనీకిదిగాదుర।
ఏజాతినైనాను ఈఁగ చెల్లని
మాజాతికిది మరియాద గాదుర॥ ॥౧॥

మబ్బునఁ జేరేవేర బాపనయ్య, మబ్బునఁ జేరేవేర।
ఉబ్బి నా పగకు ము సుబ్బువిని నామగఁడు
దెబ్బతియ్యఁ బోయీని తబ్బిబ్బునాటేల॥

శిష్యుఁడు : వినవయ్య గురుస్వామి నేముందఅనే. చెప్పి తినే వాండ్లు మహారోషము గలిగినజాతియని చెప్పితినే.మగఁడు వచ్చి దెబ్బతీసిన వెనుక పోవలెనా రావయ్యా.

సూత్రి: అవురా యీవిధంబునఁ బలుకరించిన మతంగ స్త్రీని జూచి దానిమగని నిందించి పలికే మార్గము.

దరువు॥ బోఁటిరో నన్ను నందగించుకొని పుణ్యము గట్టుకోవె ।
పాటించి మగఁడిందు వచ్చికొట్టునని మాటిమాటికి నేల
మము వెఱపించేవు ॥

ఆలతిండికాఁడు అసురవంటివాఁడు
నీలికాశవాఁడు నీకేలే ।
నాలుగు వేదాలు మేలాఱు శాస్త్రాలు
పాలుమాలక నీకు పరీక్షయిచ్చేగాని॥

శిష్యుఁడు : లెస్సాయెనయ్య ఇటువంటి దిక్కుమాలిన వచ్చాక నీవేదశాస్త్రాలు పరీక్ష యిచ్చేది. వాండ్ల కులాచారధర్మము

కొలతిండికాఁడున్ను అసురవంటివాఁడున్ను, నీలికాశవాఁడున్ను. మనవలె నేమైనా పప్పువంటకం, పూర్ణాచిపోడి, వడ, పుల్లకూర, నీకుమజ్జిగ త్రాగుచున్నారా ? నీవెఱ్ఱిగాల రావయ్యా,

గురువు : కోళ్లుగట్టువాఁడు దొమ్మికాఁడు వెఱ్ఱి
నీళ్లు తాగువాఁడు నీకేల ।
మామల్లి వరాలును మాడలు చీరెలు
జోళ్ళు ఇచ్చెదఁ గాని సొగసుగ నొకసారి ॥

శిష్యుఁడు : వినవయ్య గురుస్వామి ! కోళ్ళుగట్టేదిన్ని వెఱ్ఱినీళ్ళు త్రాగేదిన్ని వాండ్ల కులాచారధర్మము. మనవలె దొప్పలు విస్తరాకులున్ను కుట్టుచున్నారా ? దానికిచ్చే రూకలున్ను వరాలున్ను తనకిస్తే మీధర్మాన చిన్నపడుచునుగాఁ జూచి పెండ్లిచేసి కొనెదనయ్యా.

గురువు : ఎదురు తెలియని వాఁడు ఇనుపసొమ్ముల వాఁడు
నిదుర మబ్బువాఁడు నీకేల ।
పదరక యోచిన్ని పడుచ, నీకెందున
గొదవలేక చేసి కోర్కెలీడేర్చెద ॥

శిష్యుఁడు : వినవయ్య గురుస్వామి ! వాఁడా యెదురు తెలియనివాఁడు ? ఇపుడు ప్రత్యక్షముగా దాని కెదురుగా నిలిచి మాట్లాడుచున్నాడె! నీవెదురు తెలియని వాఁడవు. ఇట్లా మాట్లాడితే నీకాళ్ళకు మెడకుఁ గూడా సంకెళ్ళు వచ్చును. నీబుద్ధికాల ! రావయ్య.

సూత్ర : అవురా యీవిధంబునఁ బతిని నిందించిన బ్రాహ్మణోత్తముని జూచి మతంగస్త్రీ తన పతివ్రతాధర్మము మెరపడయ్యేటట్టు పలికేమార్గము.

దరువు. పతి నెడఁబాయ రాదయ్యా, ఓబాపనయ్యా,
సతులకిది ధర్మముగాదయ్యా।
పతినివంచింప నిహాపరమింతైన లేదయ్యా॥ ॥౧॥
కులహీనుఁడైననుగాని, యోబాపనయ్యా
గుణరహితుఁడైననుగాని।
కల్లుద్రాగువాఁడైనఁగాని గడుసువాఁడైనఁగాని॥
కలిమిలేనివాఁడైనఁగాని, యోబాపనయ్యా
బలిమిలేనివాఁడైనఁగాని।
తులువైనఁగాని బలుదుష్టుఁడైనఁగాని॥ ॥౨॥
మగఁడె ప్రాణబంధుండుగాఁడా, యోబాపనయ్యా
మగఁడె పెన్నిధానమెగాదా।
మగఁడేల యనేదిది తగవా, యోబాపనయ్యా॥ ॥౩॥

శిష్యుఁడు: భళా దానిని మెచ్చవలెను. జాతిధర్మమును నిలుపుకొనెను. పతివ్రతాధర్మము నిలుపుకొనెను. నీవు బ్రాహ్మణీకం వేదశాస్త్రాలు పోగొట్టుకొనియున్నావే. నీదగ్గరనుండే టంతకంటే దానిదగ్గరనుంటే వాసియయ్యా.

సూత్ర: అవురా యీవిధంబున బ్రాహ్మణుండును మతంగస్త్రీయు నుత్తరప్రత్యుత్తరములు వలికే మార్గము.

దరువు। శంకరాభరణము॥ ఆది॥

వగలేలచేసేవె నాతోన
నగరాదంటవె పడుచ।
నగవులు ఎందైన యోబాపనయ్య
మగనాలికిఁ దగునా॥

మాటైనా యాడరాదా నిన్ను నే
మాట గట్టుకపోయేనా॥

మాటగట్టుకపోతే నామగఁడు నిన్ను
మొత్తకపోనటర బాపనయ్య॥
కండ్లబెదరించకవె యోపడుచ నీ
చండ్లను బట్టిచూచేనె॥
చండ్లనుబట్టితేను నామగఁడు నీ
పండ్లు రాలఁగొట్టురా బాపనయ్య॥
కరిగమన నీమోవిపై మొనపంట
గుఱుతుల నుంచెదనే।
గుఱుతులనుంచేది కంటె నామగఁడు నిన్ను
గొంచానఁ బోనిచ్చునా బాపనయ్య॥
వేడుకమీఱఁగను పడుచ నిన్ను
గూడి యింటికిఁ బోయెదనే।
కూడి యింటికిఁబోయిన నామగఁడు నీ
జాడ వెంటవచ్చుర బాపనయ్య॥

శిష్యుఁడు:—వినవయ్య గురుస్వామి! దానిని మాటగట్టి మీ నెత్తిని బెట్టికొనిపొండు మీచేతనుండే బట్టపాఁత నాచేతికిండు నేచంకఁబెట్టుకొని జరిగెదఁగాని

సూత్రధారుఁడు:-అప్పురా యీవిధంబున మతంగస్త్రీ బ్రాహ్మణోత్తమునిజూచి జాగత్యమునిందించి పలికేమార్గము.

బాపండయోర. యిటువలెఁ
బలుకంగ మేర ।
కులహీనమైన గుణశీలమువిడిచి
యలరునిల్లాలు వెలయాలౌన।
ఇలజనులకు జాతు లెచ్చు కొలఁదు లింతేగాని
తలఁచ ధర్మభేదముగలదా వెఱ్ఱి॥ ॥౧॥

పలుమాఱు మదనుని బారికోర్వకే నన్ను
వెలిచవి కొగ్గుమని వేడేవు ।
తొలిసుఖ మొక్కింత దోసమైతే కొండంత
గలపనికోరి నింద గట్టకు వెఱ్ఱి॥ ॥౨॥

నలుగురిలోపల నగుఁబాటులుగాఁగఁ
గులమువారలకెల్లఁ దలవంపుగాఁగ।
మలయుచు నీవభిమానమెంచనైతివి
పొలుపొంద నాడు తోడఁబుట్టవ వెఱ్ఱి॥ ॥3॥

శిష్యుఁడు:-వినవయ్యా గురుస్వామి! నీ వెంత తలకిందా పడ్డాగాని, కాళ్ళు పట్టుకున్నాగాని అది నీకొగ్గపోయేది లేదు. "మహిష్యాం ప్రసవార్తాయాం మహిషోమదనాతురః" అనే న్యాయముగాను, అది పతివ్రతాభంగమౌచున్నదని బాధపడు చున్నది; నీవు కామాతురుఁడవై పైఁబడుచున్నావు. ఇదిధర్మము గాదు రావయ్యా.

సూత్రి:-అవురా యీవిధంబునఁ బతివ్రతాభంగమౌ చున్నదని యనుమానముగానున్న మతంగస్త్రీనిజూచి బ్రాహ్మ ణుఁడు పలికేమార్గము.

దరువు॥తోడి॥చాపు

అనుమానమేలె యనఁగనేలె
వినవె నావాక్యాలె వేదవాక్యములె॥
వితతధర్మమ్ములు వేదశాస్త్రమ్ములు
మతభేదములు కలిగె మావల్ల కాదా॥
హితవు చెప్పెద నీకిపుడు విప్రునియభి
మతము దీర్చుటకంటె మఱిలేదెధర్మము॥ ॥౧॥

ఇప్పటిమాట లెక్కడనైన నేఁ
జెప్పనె వినవె నాశిష్యునితోడె।
తప్పించుకోకవె దయసేయవే నీకుఁ
జెప్పరాని పుణ్యముచేకూరు నిందుకు॥ ॥౨॥

తనియ నధరసుధదాన మియ్యవె నీవు।
ఘనతర కుచ కలశదానమియ్యవె॥
మొనసివేగమె కటిభూదానమియ్యవె।
తనర మాయని గృహదానమూనె పాత్రుఁడ॥ ॥3॥

శిష్యుఁడు: శివశివ! నారాయణ! అప్పుడైతే నాతలముట్టితివి. ఇప్పుడు నామీఁద నానవెట్టుచున్నావు. నేనుండేది నీకుఁ గాకాదో యేమి?

సూత్ర: అవురా యీవిధంబునఁ దనమగని పరాక్రమము తెలిపినఁగాని యీబ్రాహ్మణుఁడు పోఁడని మతంగస్త్రీ పలికే మార్గము.

దరువు॥ పంతువరాళి॥ ఆదితాళము॥

నచ్చేనిరా, పోరా సామగఁడు
ఘనవిజయుఁడు మున్ను కర్ణునిపైని
తనువుబ్బఁగ దండు తర్లినాఁడు।
పనివడి పెనుకోల పట్టినవాఁడు।
తనమగండేయిటు నను వెదకుచును॥ ॥౧॥

గుఱుతుబిరుదుగల పింజలవాఁడు।
అరిగకత్తిచే నమరినవాఁడు
విరివిగఁ బేరగు విలుగలవాఁడు।
గరిమఁ జక్రము గదగలవాఁడు ॥౨॥

శిష్యుఁడు: వింటిరా! యయ్యవారు వానిప్రతాపము వానిశౌర్యము, ఇంతసేపు వానిచేత దుడ్డుకోల యుండనివింటిమే వాఁడుచేత పెద్దకత్తి కేడెము తీసికొని వచ్చుచున్నాఁడే. అందు చేత నొకదెబ్బతీస్తే నీకార్యము నాకార్యమునసరి రావయ్యా.

సూత్ర: అవురా యీావిధంబునఁ బలికిన మతంగస్త్రీని జూచి తనమహిమ ప్రకటమయేటట్టు బ్రాహ్మణుఁడు పలికే మార్గము.

దరువు॥ తోడి॥ చాపు॥

తెరుణిరో వానికి నేను వెఱతునఁటవె।
నెరయ రాజిల్లుచునుండే నిప్పునఁ జెదలంటున॥

సరసమంత్రములుండ సకలయంత్రములుండఁ
దఱచైన విద్యలెల్లఁ దనకు పశమైయుండ ॥౧॥

సరసిజలోచనుని యురమునఁ దన్నినవాని
వరవంశజుఁడ మేటి పరమేశభక్తుండ ॥౨॥

జపతపములు స్నానసంధ్యలు గలవాఁడ
కుపితుఁడైతే వాని శపియింతు నంతెకాని ॥౩॥

శిష్యుఁడు : వినవయ్యా గురుస్వామి ! నీజపతపమున్ను నీమంత్రమున్ను ఇట్లాకార్య మెప్పుడు చేస్తినో అప్పుడేపోయెను. ఇఁక మీాఁదట వాఁడువచ్చి మొత్తబోయీని రావయ్యా.

సూత్రి : అవురా యీవిధంబున బ్రాహ్మణోత్తముఁడును మతంగస్త్రీయును పలుకుచున్న సమయంబున నావలి కథాసంవిధానం బెవిధాన నంటేను.

మాదిగ యెంకెపులి తన పెండ్లాముఁగానక నానా దిక్కులు వెదకి, చంపకవనమందు మహావిష్ణుమహోత్సవము సేవింపఁ బోయెనని వెదకుచు వచ్చేమార్గము.

దరువు॥ పరజు॥ ఆదితాళము॥

యెల్లి లాంలాలే లాలాలే యెల్లిల్లామంబా
ఇదె మాదిగవాఁడు వచ్చె॥
వెల్లకుంచెలను విసరుచు బిరుదుగ
కల్లుదాగి సొక్కుచు మెల్లనె ॥౧॥
మీసరమునఁ దా మెఱయు విద్యలందున
మీసములను వడివేయుచు ॥౨॥

శిష్యుఁడు : హూహూ ! చెడితిమి గదవయ్యా నీవు చెడ్డదిగాక నన్నుగూడా చెఱిపితివి గదవయ్యా ! ముందరనే అది ఇప్పుడు వాఁడు వచ్చునని చెప్పెనె! దాని మాట వినక పోతివే ! ఇప్పుడైన నెక్కడికైనా పాఱిపోదాము. రావయ్యా

గురువు : ఉండరా ! వెఱ్ఱివాఁడ ! వాఁడువస్తేనేమి ? వాని తాత వస్తేయేమి ? వానికి నే వెఱచుచున్నానా ?

వానితో రెండు మాటలాడుచున్నాను. నే తలంచిన కార్యము విడుస్తానా !

శిష్యుఁడు : అయితే మీకు వెఱ్ఱిపట్టినది నిజమే సరి. నీదగ్గఱ నేనుండేదిలేదు. నన్ను నీవు శిష్యుండని చెప్పవద్దునిన్ను నే గురువని చెప్పునది లేదు. నీకుకాలము సమీపించింది కాబట్టి యిట్టి బుద్ధివచ్చింది. నే దూరముగా నుండెదనయ్యా. వాని ముందఱ నన్ను శిష్యుండని చూపవద్దయ్యా. నిన్ను నన్ను కొట్టవచ్చును. అదిగాక నీకొక భ్రమపుట్టింది. ఇందువల్ల యెన్ని దెబ్బలు పడ్డాగాని యోర్తువు. నేనైతే చిన్నవాఁడను. ఒక దెబ్బకు దాళలేను. కాఁబట్టి నన్ను చూపవద్దయ్యా గురువూ.

గురువు : నేనుండఁగా నీకు వెఱపేందిరా !

శిష్యుఁడు : నీవుండఁగా వెఱపులేనిది నిజమే సరి. నీవు వానిచేత దెబ్బలుపడి తన్ను కొంచు నుండేటప్పుడు నేనీతోవ ననుసరింపవలెనా! నాచేతగాదు. నీవు నా పేరెత్తితే ఈమూదిగ దాని పాదాలతోడె.

గురువు : ఓరోరి వెఱ్ఱివాఁడ ! ఏయాన పెట్టితివిరా ! వేదశాస్త్రిలు పురాణాలు లేకపోయెనా ! ఆనవిడిపిస్తి ననరా !

శిష్యుఁడు : పోవయ్యా యేటిమాట ! వేదశాస్త్రపురాణాలకన్నా దీనిపాదాలయందు నీకు భక్తిమించినది కాఁబట్టి యాన పెట్టితినయ్యా.

గురువు: సరి నీవుచెప్పినటులనే దానిపాదాలయందు భక్తిమించినది సరి, నేఁడుమొదలుగా నాయాన నెట్టవద్దురా.

సూత్ర: అవురా యీవిధంబున శిష్యుండు బ్రాహ్మణుని జూచి పలికి, మతంగస్త్రీని జూచి పలికే మార్గము.

శిష్యుఁడు: వినవే మతంగభామిని !. నీకాశీర్వాదము. నీమగఁడు వచ్చి యడిగితే ఈబ్రాహ్మణునికి తాను శిష్యుండని చెప్పవద్దు. వాఁడైనా రెండుదెబ్బలకోర్చును. నేనైతే చిన్న వాఁడను. వానినిజూడఁగానే వెఱపొచున్నది. ఏవిధముననైనా రక్షించిపుణ్యముగట్టుకో.

సూత్ర: అవురా యీవిధంబున మాదిగవాఁడువచ్చి మహావిష్ణుసన్నిధానమందు తనయొక్క కులాచారధర్మమైనటు వంటి విద్యవినిపించి, తిరునాళ్ళసందడిలో వెదకి దానిఁగని పలికే మార్గము.

దరువు॥వసంతభైరవి॥ఆదితాళము॥

ఇటు కేలవచ్చితివె యెమ్మెలాఁడి।
చిటుకుపోటుకనఁగ నీమాటి యొంటిగ॥ ॥౧॥

కట్టులు గుడిసెలో కూటికి వాపోవంగ।
ఎట్టుకోళ్ళుతడపక యెండలో నేయకను
మొట్టిచట్టిలోపాలసు ముంగిటనుండంగ॥
పెట్టిపడుస, యీవిసార మింతలేక॥ ॥౨॥

ఆడనీడను సూసి – యల్లతోఁటలో సూసి
పోఁడిమి తెరువు సూసి – పొలముసూసి।
ఏడనిన్ను గానక – యిప్పుడు। విసకినేను
గోడుమంటా కన్న – కొంపలు వెతకంగ॥ ॥3।

సూత్ర: అప్పురా యీవిధంబునఁ బలికిన మాదిగవాని మాటలువిని మతంగస్త్రీ పలికే మార్గము.

దరువు॥ కాంభోజి॥

వెఱవక తెలిపెద వినునా తెఱఁగు కరి
వరదు తిరునాళ్ళకు వచ్చితినోయి।
తెరువున నీబాపనదేవర నన్ను జూచి
పరఁగదారగ తిరుగ పలికెనోయి ॥౧॥

పరమబాపనయ్యాను పైఁడెత్తుమాటంటె
నెరియదోసమని యీడ నిలిచితోయి।
మఱిమఱియాతఁడు మరియాదవిడిచి జాతి
యెఱిఁగి కరఁగి సొరగి వేడెనోయి॥ ॥౨॥

అమ్మక్కచెల్ల యెంత యదలించిన వినక
దొమ్మిసేసి యీతఁడు దొడరెఁగదోయి।
కమ్మవిల్తుని కేళి గడిమైనఁ గూడుదాము
కొమ్మా లెమ్మా రమ్మని వేడెనోయి॥ ॥3॥

సూత్రి:-అవురా యీవిధంబున మాదిగవాఁడు పలు
కించుచుండఁగా విని శిష్యుఁడు గురువుతోఁ బలికేమార్గము.

శిష్యుఁడు:-వినవయ్యా గురుస్వామి! ఇంతసేపు తామసము
చేసుకొని యుంటిమే వానిమగఁడు రాఁగానే నీదుడుకువగలంతా
చెప్పివిడిచెనే. వాఁడు తఱుముకొని రాకముందే యెక్కడి
కైనా పాఱిపోదాము రావయ్యా.

సూత్రి:-అవురా యీవిధంబున శిష్యునిజూచి పలికె తన
మీఁద కొండెములుచెప్పిన మాదిగదానినిజూచి బ్రాహ్మణుఁడు
పలికేమార్గము.

శ్లో. ఇందీవరేణ నయనం ముఖమంబుజేన
కుందేన దంత మధరం నవపల్లవేన।
అంగాని చంపకదళైశ్చ విధాయవేధాః
కాంతే కథం రచితవానుపలేన చేతః॥

శిష్యుఁడు:-ఓరీ యోరీ బ్రాహ్మడ! చెడితివిగదరా! ఇంకా
దానితో మాటలానీకు! దానితో మాటలాడితే నీకువొట్టు.

గురువు:-ఓరీ వెఱ్ఱివాఁడ! ఆనవిడవరా. వానికి వెఱచు
చున్నానా? వీనికార్యము సరిగట్టి దీనిని జేకొనుచున్నాను.

శిష్యుఁడు:-అయితే దానితో మాట్లాడితివే అందుకర్థ
మేమయ్యా,

గురువు:- ఓపడుచ, బ్రహ్మదేవుఁడు నల్లకలువలచేత నీకన్లుచేసెను. తామరచేత నీముఖముచేసెను. మొల్లమొగ్గల చేతను నీదంతాలుచేసెను, లేతచిగురులచేతను నీయొక్క యధరముచేసెను. సంపంగిరేకులచేతను నీసర్వాంగమును చేసెను, నీయొక్క మనసైతే ఎటువలె రాయిగాచేసెను! అని మనమీఁడ కొండెములు చెప్పినే కాఁగా దీనినిబట్టుకొని తిట్టుచున్నానురా.

శిష్యుఁడు:-వినవయ్యా అయ్యవారు. లోకమునందుకోపమువస్తే భ్రష్టుముండా.మాలముండా,రంకులాడి,తొత్తఅని యిటువంటితిట్లు సేనా గలవే. అదంతా విడిచిపెట్టి, నీమనస్సురాయని తిట్టేకడ నేర్చుకొంటివయ్యా. నన్ను తిట్టమని యుత్తరవిచ్చితివా యెనా అప్పుడుచూడు నాతాళి నీమనసు ఛీయనిపోవలె.

సూత్రి:-అవురా యీవిధంబున గురువును శిష్యుఁడును మాట్లాడుచుండు సమయంబున, మాదిగవాఁడు తనముందట తనపెండ్లాముతో మాట్లాడేదిచూచి, కోపముచేత బ్రాహ్మణునిజూచి పలికేసూర్గము.

దరువు॥ రామకవి॥ ఆటతాళము॥

మగనిల్లాలితో నీకు మాటలేటికిరా ।
తగునా బాపన సాల్లే ధర్మముతోసి॥
మున్ను పాంచాలిని జూచి మోహించి కీచకుఁ
డెన్నిబాములు సెందెరా యింతా దెలిసియుండి ॥౧॥

పరసతులఁ బొందుట పాపముగాదా
సరస శాస్త్రములెల్ల చదువలేదఁటర ॥2॥
భామిని సీతను జెరఁ బట్టిన రక్కసుఁ
డేమేమి నెతలఁ జెందె నింతా తెలిసియుండి ॥3॥

సూత్రి : అపురా యీవిధంబున బ్రాహ్మణుని గదిమి కొట్టవచ్చే మాదిగవానికి నడ్డముగా నిలిచి శిష్యుఁడు మాదిగ వానిఁ జూచి పలికేమార్గము.

శిష్యుఁడు : వినవోయి మాదిగ యెంటిపులి ! నీకాశీ ర్వాదము. మాయయ్యవారికి వెఱ్ఱిపట్టింది, వాని తప్పుమాటలు విని కొట్టవద్దోయి. వాఁడు ఇల్లు, వాకిలి, సంసారము గలిగిన వాఁడు. వానిని జేసే శిక్ష నన్ను జేయవోయి. నేనైతే బ్రహ్మ చారిని సన్యాసి సరి నేనుసరి, కాఁబట్టి విడిచి పెట్టవోయి నీ పుణ్యము.

మాదిగ : విపది ధైర్య మథాభ్యుదయే క్షమా
సదసి వాక్పటుతా యుధి విక్రమః ।
యశసి చాభిరుచిర్వ్యసనంశ్రుతౌ
ప్రకృతిసిద్ధ మిదంహి మహాత్మనాం॥

శిష్యుఁడు : వినవోయి జాతిహీనుండుగా నున్నావే యిందు కర్థము తెలియునా ?

మాదిగ: మీయొక్క యనుగ్రహము వల్లను ఇంతంత తోచినమాత్రము చెప్పెద వినవయ్య. విపత్కాలమందు ధైర్యమున్ను, అభ్యుదయమందు ఓర్పున్ను, సభయందు వాక్పటుత్వమున్ను, యుద్ధమందు పరాక్రమమున్ను, కీర్తియందు ప్రీతిన్ని, శ్రుతియందు వ్యసనమున్ను ఇది పెద్దలకు స్వభావముగా కద్దని విన్నమాత్రమేకాక కండ్ల చూచినదిలేదు. ఇపుడు నీవల్ల నిలువరమాయెను. వినవయ్యా చిన్నయ్యవారు. మీ ధైర్యానికి, మీవిద్యకు, మీబుద్ధికి తాను మెచ్చితిని, కాఁబట్టి నిన్ను గొట్టేదిలేదు; మీ పెద్దయ్యవారిని కొట్టేదిలేదు. వెఱవకయ్యా.

సూత్రి: అపురా యీవిధంబున మాదిగవానిమాటలు విని శిష్యుఁడు పలికే మార్గము.

శ్లో. నిందంతు నీతినిపుణా యది వాస్తువంతు
లక్ష్మీస్సమావిశతు గచ్ఛతువా యథేచ్ఛం ।
అద్యైవవా మరణమస్తు యుగాంతరేవా
న్యాయాత్పథః ప్రవిచలంతి పదం నధీరాః

మాదిగ : ఇందు కర్థమేందయ్యా.

శిష్యుఁడు : చెప్పెద వినరా మాదిగ ఒంటెపులి ! మేమైతే బ్రాహ్మణులము. నీవైతే మాదిగవాఁడవు. మా గురువులవారు సేయరాని కార్యము తలంచిరి. అప్పుడు నీవు లేవు.

కాఁగా వెఱచుచుంటిమి. నీవువచ్చి యీమాటలన్నియు విని మమ్ముగదుముకొని కొట్టవచ్చితివి. మేమైతే నీమీఁదికి బలవంతానికిరాలేము. నీవువచ్చిన వెనుక నూరకేయుండరాదె. "ఆతతాయిన మాయాంతం హానహాన్యాత్సహాన్యతే" అని శాస్త్రమున్నది గనుక, నీవు లొట్టిత్రాగినవాఁడవైనాగాని, మాంసము తినేవాడివైనా గాని, యెంతబలిమి గలిగినవాఁడైనాగాని, ఎన్నియాయుధాలు పట్టుకొని వచ్చినాగాని, నీవు నాలుగుదెబ్బలుతీస్తే నాబ్రహ్మదండముచేత రెండుదెబ్బలైనా తియ్యకపోను. మేమైతే నీతోవరారాదని ఊరకేయుంటే, యిట్లామునుకుచేస్తే యేవేళధైర్యమున్ను న్యాయపథమున్ను విడిచిపెట్టుచున్నానా! అదెట్లానంటే.నీతిశాస్త్రజ్ఞులు నిందించినాగాని, స్తోత్రముచేసినాగాని లక్ష్మిపోయినాగాని, వచ్చినాగాని, ప్రాణపర్యంతమువచ్చినాగాని, యుగాంతరమంటైనా గానిన్ని ధీరులమైన మేము న్యాయపథము వల్లనుంచి చలించేవారముగాము. అని తెలిసికొని బుద్ధిగానుండవోయి.

సూత్రి:-అవురా, యీవిధంబున పలికిన శిష్యునిజూచి మాదిగవాఁడు పలికేమార్గము.

శ్లో. ప్రాణానపి పరిత్యజ్య, మానమేవాభిరక్షయేత్ ।
ప్రాణాస్తరంగచపలా మానమాచంద్ర తారకం॥

సూత్రి:- అవురా యీవిధంబున మాదిగవానిఁజూచి బ్రాహ్మణుఁడు పలికేమార్గము.

భైరవి॥ ఆటతాళము॥

ఏమియేమి పలికేవు రామ రామ యోరి
కామశాస్త్రమురీతి మేమునడువగాను॥
మనసుంచినపుడె యది తనసతిగాద।
తనివిదీర దానిపొందు ధర్మమె తలపంగ ॥౧॥
యాగము చేసేది రంభ భోగములకే కాద
భోగములకన్న వేఱె పుణ్యముగలద ॥౨॥
భామలెదైవము భామలెపెన్నిధి
భామలఁబొందని వాని బ్రతుకేమి బాగ్రీతి ॥౩॥

సూత్ర:- అవురా యీవిధంబున బ్రాహ్మణునిజూచి మాదిగవాఁడు పలికేమార్గము.

శ్లో॥ జితేంద్రియత్వం వినయ స్యలక్షణం
గుణప్రకర్షో వినయాదవాప్యతే।
గుణాధికే పుంసి జనోనురంజతే
జనానురాగ ప్రభవాహిసంపదః॥

గురువు: అట్లానంటే అర్థమేదిరా.

మాదిగ: వినవయ్య బాపనయ్యవారు. మీవంటిపెద్ద లకు జితేంద్రియత్వ ముండవలెను. అదప్పుడు వినయానికి లక్షణం, ఆయొక్క వినయమువల్లను గుణాధిక్యమౌచున్నది. గుణాధిక్యముగలిగిన పురుషునియందు సకలజనములు ననురక్త

ముగానుందురు. ఎవరియందు జనానురాగముగలిగెనో వారికి సంపదలకుఁ గొదవయేందయ్యా. కాఁబట్టి మీవంటి పెద్దలకు జితేంద్రియత్వ ముండవలెను. అదంతావిడిచిపెట్టి యిట్లాయేల చేసెదవయ్యా.

శ్లో. కులం పవిత్రం జననీకృతార్థా
విశ్వంభరా పుణ్యవతీ చ తేన।
అపార సచ్చిత్సుఖ సాగరేస్మిన్
లీనం పరేబ్రహ్మణి యస్యచేతః॥

గురువు: అందు కర్థమేందిరా.

మాదిగ: వినరయ్యా బాపనయ్యవారు. మీవంటివారి మనస్సు పరబ్రహ్మమం దాసక్తిగానుండవలెను. అందువల్లను కులము పవిత్రమౌను. తలిదండ్రులు కృతార్థులౌదురు. అటువంటివాఁ డొక్కఁడుండే భూమి పుణ్యభూమియౌను. అదంతా విడిచిపెట్టి యిట్లా యేలచేసెదవయ్యా. ఇంకా చెప్పెదవినవయ్యా

శ్లో॥ వ్యాఘ్రీవతిష్ఠతి జరాపరితర్జయంతీ
రోగాశ్చ శత్రవఇవ ప్రహరంతి దేహం।
ఆయుః పరిస్రవతి భిన్నఘటాదివాంభః
లోకస్తథాప్యహిత మాచరతీతి చిత్రం॥

వినవయ్యా బాపనయ్యవారు. అదే శాశ్వతముగానెంచి యిట్లా యేలచేసెదవయ్యా? ఎటువలెనంటే చెప్పెదవినవయ్యా. వృద్ధా

ష్యము పులివలెనే యుండుకొని గమముచున్నది. రోగాలు శతు్రువులవలె దేహాన్ని బాధించుచున్నవి. ఆయుష్యైతే వోటి కుండలోని నీళ్లుకారిపోయేటట్టు నానాఁటికి క్షీణమైపోవుచున్నది. ఇదే శాశ్వతముగానెంచి యిట్లా యేలచేసెదవయ్యా? ఇంకా చెప్పెద వినవయ్యా.

దరువు॥ రామక్రియ॥ఆది॥

పలికెద వినవయ్యా బాపనయ్యా
తెలియ నీసంసారమెల్ల కలవలెనయ్యా॥
ఆసించి యివిచన్నులని యెంచకు, తోలు
మూసిన మాంసపు ముద్దలయ్యా।
మోసపోయి నీవిది మోమని యెంచకు
భూసుర, శ్లేష్మానికిది పుట్టినిల్లయ్యా ॥౧॥
మెఱయఁగ నిది మంచి మేనని యెంచక
గుఱుతుగఁ జూడు మురికి గుడిసయ్యా।
మఱియు నిందులో మేము మాదిగ వారమయ్యా
పరమెంచు మిందుకేల బ్రతిమాలెదవయ్యా ॥౨॥

మాత్రి: అప్పురా యీవిధంబున మాదిగవాని మాటలు విని బ్రాహ్మణుఁడు పలికే మార్గము.

శ్లో॥ అవిదిత సుఖదుఃఖం నిర్గుణం బ్రహ్మ సాక్షా
జ్జడమతి రిహకశ్చిన్మోక్ష యిత్యాచచక్షే ।
మమతు మత మనంగ స్మేరతారుణ్య పూర్ణ
స్తనభర మధురాక్ష్యా నీవి మోక్షోహి మోక్షః॥

మాదిగ : అట్లా యంటే అర్థమేమయ్యా ?

గురువు : వినరా ఓరి మాదిగవాఁడ ! మోక్షము మోక్షముఅనే భ్రాంతి నీకేలరా ? తెలియని వారట్లా చెప్పదురు. ఎట్లా అంటె సుఖదుఃఖములు తెలియని నిర్గుణమైన బ్రహ్మమే మోక్షమని బుద్ధిలేనివాఁడు చెప్పెను. మాయొక్క మతము వినవోయి, మన్మధునియొక్క సర్వోత్కర్షా పరిపూర్ణమైన యౌవనము గలిగి నటువంటి, గొప్పస్తనాలు గలిగినటువంటి మదిరాక్షియొక్క కోకముడి విడుచుటే మోక్షముగాక మఱివేఱే మోక్షము గలదఁటరా ?

దరువు॥ దేవగాంధారి॥ ఆటతాళము॥

ఈహోయికన్నా మఱి యేహోయి యున్నది
ఆహా దీని నొక్కసారి యపనంగ వలదా ।
నీవేమిచేసిన నేవెఱవరా యోరి
భావింప నీకు నాభావము దెలిపెద॥ ॥౧॥

ఇది యున్నచోట భూమి, యిదితాగు నీరు జలము
ఇది చూచు నష్టమున గదియింతు తేజము॥ ॥౨॥
దీని సురటిచే గాలి దీనిముంగిటిపై నింగి
పూనింతు నైదుప్రాణాలు బుద్ధి నే వినను ॥౩॥

సూత్రి : అపురా యీవిధంబున గురువాక్యంబులు విని శిష్యుఁడు పలికేమార్గము.

శిష్యుఁడు : వినవయ్య గురుస్వామి ! మీవంటి పెద్ద లీప్రకారంగా నుండవలెఁగాక. ఇట్లానేసేది న్యాయమా? ఎట్లంటె చెప్పెద వినవయ్యా.

శ్లో. గంగాతీరే హిమగిరిశిలాబద్ధ పద్మాసనస్య
బ్రహ్మధ్యానాభ్యసన విధినా యోగ నిద్రాంగతస్య।
కింతైర్భావ్యం మమసుదివసైర్యత్రతే నిర్విశంకాః
కండూయంతే జరఠహరిణాశ్శృంగ మంగేమదీయే॥

గురువు: అంటె అర్థమేమిర?

శిష్యుఁడు: వినవయ్యా గురుస్వామి, మీవంటివారిట్లుండ వలె. గంగాతీరమందు హిమవత్పర్వతముయొక్క శిలాతల మందు పద్మాసనమువేసికొని బ్రహ్మధ్యానాభ్యాసము చేయు చుండఁగా, యోగముచెందిన సమయంబున ఆప్రదేశమందు తిరిగే మృగాలు నిర్భయముగావచ్చి తమయొక్క శృంగాలచే

గిరుచు నుండే దేహముగస్గినవానివలె నుండవలెఁగాక యిట్లా యేలచేసెదవయ్యా! ఇంకావినవయ్యా.

శ్లో॥ మహీంమృద్వీశయ్యా విపులపరిధానం భుజలతా
వితానం చాకాశో వ్యజనమనుకూలోయమనిలః।
స్ఫురద్దీపశ్చంద్రో విరతి వనితాసంగముదిత
స్సుఖంశ్శాంతశ్శేతే మునిరతనుభూతి ర్న్నృపఇవ.

గురువు: అంటే అర్థమేమిరా?

శిష్యుఁడు: మీవంటిపెద్దలు రాజువలెనే యుండవలెను. ఎట్లంటే వినవయ్యా. భూమే మృదువైనటువంటి మెత్త, భుజాలే తలగడ, ఆకాశమే మేలుకట్టు, అనుకూలమైన వాయువే విసనకఱ్ఱ, ప్రకాశించే చంద్రుఁడే దీపము, వైరాగ్యమనే స్త్రీ యొక్క సంగముచేత సంతోషపడినటువంటి శాంతమైనటువంటి యోగీశ్వరుఁడిట్లా సుఖమనుభవించుచుండవలెఁగాక, నేను చెప్పేదే సుఖముగాక, నీవుతలంచేది యేమయ్యా, ఇంకా వినవయ్యా.

శ్లో॥ ఆదిత్యస్య గతాగతై రహరహస్సంక్షీయతే జీవితం।
వ్యాపారై ర్బహుకార్యభారగురుభిః కాలోనవిజ్ఞాయతే।
దృష్ట్వా జన్మజరావిపత్తిమరణం త్రాసశ్చనోత్పద్యతే
పీత్వామోహమయీం ప్రమాదమదిరామున్మత్తభూతం జగత్ ॥

వినవయ్యా గురుస్వామి! సూర్యునియొక్క యుదయాస్తమానములచేతను రాత్రింబవళ్లు నాయుస్సు క్షయించుచున్నది. అపరిమితమైనట్టునంటి కార్యాలచేతను కాలము తెలియఁబడుటలేదు పుట్టుకయున్ను వృద్ధాప్యమున్ను ఆపత్తున్ను మరణమున్ను జూచి భయపడేదిలేదు. ఈలోకము మోహమయమైనట్టువంటి యున్మాదమనే మద్యాన్ని పానముచేసి మిక్కిలి మదించియున్నదయ్యా. సకలము దెలిసిన మీరిటువంటి ప్రపంచములోఁబడి యుండేది ధర్మముగాదయ్యా.

సూత్ర: గురుశిష్యులిద్దరు నన్యోన్యవాదముగా పలుకుచుండు సమయంబున ఆవలికథాసంవిధాన మేవిధాననం జేను.

బ్రాహ్మణునియొక్క భావము దెలిసి, యీబ్రాహ్మణుఁడు దీని నిమిత్తమై పంచప్రాణాల నొప్పగించి బ్రహ్మరాక్షసజన్మ మెత్తినప్పటికిని, దీనినిబట్టి సుఖమనుభవింపక విడువఁడని తెలిసి, యీరీతిగా పోయేంతకంటె తానే చేతులార నిచ్చేది మహావిశేషమని యెంచి, బ్రాహ్మణుఁ డౌనని యెంచి, తనకు దానశూరత్వము గలుగునని యెంచి, విచారించే పట్ల తమ యొక్క కులాచారధర్మము పారంపర్యముగా వచ్చినదని తెలిసినవాఁడై, 'అవశ్యం పితురాచారం పుత్రస్తదనువర్తతే' అనే న్యాయము ఇప్పుడు తనవలన నీలోకమందు ప్రకటముగావలెనని బ్రాహ్మణోత్తముని జూచి మాదిగవాఁడు పలికే మార్గము.

దరువు॥ బ్రతిమాలవలదయ్య బాపనయ్య ।
సతి ధారపోసెన సామి బాపనయ్య॥
తనజాతిలో వీరదానుఁడు హరిశ్చంద్రుఁ
డనువైన సత్యముకై యాలినమ్మలేద ॥౧॥
దానమానము తమవారికే కలదు।
ప్రాణమడిగిన నిత్తు భామనిచ్చేది హెచ్చ ॥౨॥
తనువు సంసారము ధనమస్థిరము చూడ।
తనకీర్తి స్థిరము ధారపట్టుమి నీవు॥ ॥3॥

శిష్యుఁడు : వినవయ్య గురుస్వామి ! వాఁడు చెప్పిన మాట నిజమేసరి. నీపద్దు చెల్లెనే అంతేచాలు. ఇకనైనా కడు చెడిపోక బ్రాహ్మణీకానికి వేదశాస్త్రాలకు మాటరాకుండా, ఈదానము పట్టక, మనస్సున విరక్తి దెచ్చుకొని, వేదవాక్యాలలో సూక్ష్మార్థము విచారించుకొని, యిహపరసాధనము గలుగునట్టులు, నలుగురు చూచినవారలు మెచ్చునటుల నడచుకొని రావయ్యా.

మాత్రి : అవురా యీవిధంబునఁ బలికిన శిష్యుని వాక్యంబులు విని, మాదిగవాని మాటలు విని, సమాధిగా నుండి, వేదార్థతత్వము విచారించి, మనస్సునందు విరక్తిఁజెంది, తాను చేసిన కర్మమును దలంచి, నమస్కారముచేసి లేచిన గురువులను జూచి శిష్యుఁడు పలికేమార్గము.

శిష్యుఁడు: శి.శి! నారాయణ! ఈనమస్కార మెవరి కయ్యా? మాదిగదానికో, మాదిగవానికో, మీతలంపీడే ర్చిన పరమేశ్వరునికో, విచారముగా నున్నారు. నాతో తెలియ జెప్పరోయి.

గురువు: వినవోయి మహానుభావ! నేఁజేసిన నమ స్కారము మాదిగదానికిఁ గాదు; మాదిగవానికిఁ గాదు; పర మేశ్వరునికిఁ గాదు, పోవోయి.

శిష్యుఁడు:- అయితే ఈనమస్కార మిందులో నెవరికిఁ గాకపోతే నీవు వ్రస్తుత నమస్కారిఁ జేసితివా! చెప్పవయ్యా.

గురు:- వినవోయి జ్ఞానప్రకాశ! నీవు చెప్పినటులనే యెంచుకొని పోవోయి నేచేసిన నమస్కారవివరము చెప్పెద వినవోయి.

శ్లో॥ బ్రహ్మయేన కులాలవన్నియమితో బ్రహ్మాండభాండోదరే
విష్ణుర్యేన దశావతారగహనేక్షిప్తస్సదాసంకటే।
శంభుర్యేన కపాలపాణియమితో భిక్షాటనంకారిత
స్సూర్యోభ్రామ్యతి నిత్యమేవ గగనేతస్మైనమః కర్మణే॥

వినవోయి జ్ఞానప్రకాశ! బ్రహ్మదేవుఁ డేకర్మచేతను బ్రహ్మాండమనే యొకకుండయందు కుమ్మరివానివలె నియమింప బడెనో; విష్ణువేకర్మచేతను సంకటమైనటువంటి పదిపుట్టుకల యం దును నేమింపఁబడెనో; పరమేశ్వరుఁ డేకర్మముచేతను కపాల

మెత్తుకొని యింటింటికి భిక్షమె త్తేటందుకు నియమింపఁబడెనో; పూర్వుఁడేకర్మముచేత నాకాశమందు నిత్యము దిరుగాడు చున్నాఁడో యాకర్మమునకు నమస్కారము చేయుచున్నాఁడ నోయి."సత్సంగతిః కిం నకరోతి పుంసాం" అనేన్యాయము ఇపుడు నీవలనను తనకు సులభమాయె. ఎట్లాననంటే వినవోయి.

శ్లో. సంతప్తాయసి సంస్థితస్య పయసః నామాపినశ్రూయతే
ముక్తాకారతయా తదేవ నలిని పత్రస్థితం రాజతే ।
స్వాతౌ సాగరశుక్తి మధ్యపతితం తన్మౌక్తికం జాయతే
ప్రాయేణాధమ మధ్యమోత్తమగుణాస్సంసర్గతోజాయతే

వినవోయి జ్ఞానప్రకాశ! నీళ్ళు, తెస్సగా తప్తమైనటు వంటి యుక్కుగడ్డయందు పడిన దానిపేరు మొదలుగా తెలియక పోవుచున్నది. ఆనీరే తామరపాకునఁబడి ముత్యమువలెఁదోఁచు చున్నది. ఆనీరే స్వాతియందు గుల్లయందుఁబడి ముత్యమాచు న్నది. అటువలెనే క్రమముగా నధమగుణ మధ్యమ గుణోత్తమ గుణములు పాత్రాపాత్రసంగతి వలనఁ బ్రకాశించునోయి. ఇంకాచెప్పెద వినవోయి.

శ్లో. ప్రీణాతి యస్సుచరితైః పితరం సపుత్రో
యద్భర్తురేవ హితమిచ్ఛతి తత్కళత్రం।
తన్మిత్రమాపది సుఖేచ సమక్రియం య
దేతత్త్రయం జగతిపుణ్యకృతో లభంతే॥
వినవోయి జ్ఞానప్రకాశ! తనయొక్క చరిత్రములచేత

నెవఁడు తండ్రిని సంతోషపెట్టుచున్నాఁడో వాఁడేకొడుకు.ఎవతె మగని హితవాచరించుచున్నదో అదే పెండ్లాము. ఎవఁడాపత్సుఖములు సమానముగా చూచుచున్నాఁడో వాఁడేమితుౖఁడు. నేచెప్పిన మూఁడువిధాలు ఈలోకమందు పుణ్యాత్ములైనవారికి లభించునోయి. వినవోయి గుణాకర! ఇన్నాళ్ళున్ను నిన్ను నేను శిష్యుండుగా నెంచియుంటినోయి. ఈపట్ల నీవు శిష్యుఁడవుగావు, తనప్రాణబంధువైనా నీవే, తనపాలిదైవమైనా నీవే, తనగురువైనా నీవే.ఇటువంటి యాపత్కాలమందు కడకున్ను నిలిచి బుద్ధి చెప్పితివే ఇట్టికార్యములెక్కడ చేయకుండాచేసిన నిన్ను నేనెంతని స్తోత్రముసేతునోయి! నీవుచెప్పినప్రకారమే నడచుకొనెదనోయి.

శిష్యుఁడు: శివశివ! నారాయణ! స్వామివారిట్లు చెప్పవచ్చునా? నేచేసినదంతా సర్వాపరాధమయ్యా; క్షమియింపవయ్యా.

శ్లో॥ అజ్ఞానాద్వా ప్రమాదాద్వా వైకల్యాత్సాధనస్యవా।
యన్న్యూనమతిరిక్తంవా తత్సర్వం క్షంతుమర్హథ॥

సూత్ర: అవురా యీవిధంబున శిష్యుఁడుపలుక, మాదిగవానిని జూచి బ్రాహ్మణుఁడు పలికేమార్గము.

పదము॥భూపాల॥ఆది॥

ఇలనీవంటివాని నెందు నేగాన
తలఁపఁబుణ్యుఁడవీవె ధన్యుఁడవీవె।
ధనధాన్యాది మహాదానములిత్తురుగాని
యెనయ నీదాన మెవ్వరైనఁ జేతురా।
మలినజాతివార మని మాటికిఁ బలికితివి
మలినమేడది నీవు నిర్మలుఁడవై యుండఁగాను।
వేదవిదుఁడ నేను విప్రుండఁ దనకుఁ
గాదీదానము కడకుఁ బోవోయి.

మాదిగ:-

ద్వి. వినుబాపనయ్య యీవిశ్వంబులోన
వినయంబు మీఱంగ విప్రముఖ్యులకు
నిచ్చెదనన్నది యీయమ లేకున్న
నెచ్చైన సంపదలెల్లను తఱుగు;
యశములెల్లను మాయు; నపకీర్తివాడము;
విసువక పాపంబు వెంబడి దొడరు.
భూసుర, నీవు నాపువ్వుఁబోఁడికిని
ఆసించి యడుగ నీకంగనామణిని
దారవోసెదనంటిఁ; దడయక నీవు
దారవట్టు నటంచుఁ దప్పించుకొన్న
విడుతునే యింక నీవెలఁదిని నీదు
మెడను గట్టకపోను మిగుల నిక్కముగ.

సూత్ర:-అప్పుడా యీవిధంబున మాదిగవాని మాటలు
విని బ్రాహ్మణుఁడు పరమేశ్వరుని గూర్చి పలికేమార్గము.

శ్లో. వపుఃప్రాదుర్భావా దనుమితమిదం జన్మని పురా
పురారే నక్వాపి క్షణమపి భవంతం ప్రణతవాన్।
నమన్ముక్తస్సంప్రత్యహమతను రగ్రే ప్రణతవా
నితీశ, క్షంతవ్యం తదిద మపరాధద్వయమపి.

ద॥ కటకట యేమిసేతు పరమేశ ।
కడజాతిదానిఁ జూచి పరమేశ ।
విటుఁడనైతి మోహించితిఁ బరమేశ-యీ
వెత దొలఁగజేయవె పరమేశ॥ ॥౧॥
మాదిగవాఁడైతే పరమేశ-యీ
మగువను గొమ్మనేని పరమేశ ।
కాదంటే బెదిరించేని పరమేశ-నన్ను
గావు మీవేళను బరమేశ॥ ॥౨॥
వేలిమి పోయెను పరమేశ
వేదములు పోయెను పరమేశ ।
మాలగాకుండాను పరమేశ-యభి
మానముగావలె పరమేశ॥ ॥3॥

సూత్రి:-అంత మాదిగవాఁడు పరమేశ్వరుని గూర్చి
పలికేమార్గము॥

శ్లో॥ ఆత్మాత్వం గిరిజామతిః పరికరాః ప్రాణాశ్శరీరం గృహం
పూజా తే విషయోపభోగరచనా నిద్రాసమాధిస్థితిః।
సంచారః పదయోః ప్రదక్షిణవిధి స్తోత్రాణిసర్వాగిరః
యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం శంభోతవారాధనం॥

పదము॥ బుద్ధికి మోసపూయె నే నేమిసేతు
బూచుల యెకిమీడ ।
కొద్ది బాపఁడు నీకేఁ గోరియిచ్చెద నంటే
దుద్దు బెట్టి వద్దనేని॥ ॥౧॥

బాపనయ్య దానము పట్టనని పలికేని
పాఁప సొమ్ముల వేలుప ।
బాపురె నాసత్యభంగము వలనను
పాపము వొడమెఁగదా॥ ॥౨॥

కోరి దానభంగము గాకుండఁ జేయుము
కొండవీటి జంగమా ।
బోరన నిట్లాయె తే పాణిమెంచను గావు
బుడుతల నేలఁ, జాలుపో॥ ॥3॥

సూత్రి : అంత నీవిధంబున మతంగస్త్రీ పరమేశ్వరుని
నూర్చి పలికేమార్గము.

శ్లో. స ఏవ ధ్యేయో మే ముకుళిత యదుత్కుంచిత పద
స్ఫురన్మంజీరాంత శ్శ్రయిత హరినాభీసరసిజే
వసన్ ధాతాభ్యర్ణ ప్రకటిత నిజాజీర్ణ శిరసః
స్సృగాలోకాశంకీ శశిన మను గృహ్ణాతి శతశః॥

పదము॥ ఇబ్బంది బ్రతుకాయె - దబ్బుబాపని మాట
తబ్బిబ్బాయె నామగఁడు - మబ్బుకాఁడై నన్ను
దొబ్బెని నేఁబోవసంటే - దెబ్బతీయఁగ వచ్చెని॥ ॥౧॥

కట్టడి బాపనయ్య తిట్టేని రావద్దని ।
బట్టునెట్టేని మగఁడు, పట్టిన కొమ్మపోయె ।
మెట్టినకొమ్మపోయె - గట్టు విల్తుఁడ కావవె॥ ॥౨॥

ప్రాణముకన్నను మానమె యెక్కుడు
నానావిధములఁ జూడను ।
మానము హీనమైన మానిని బ్రదుకేల ।
దీనురాలను గావవే॥ ॥3॥

అంత శిష్యుండు పరమేశ్వరుని గూర్చి పలికే మార్గము

శ్లో॥ శివోఽహ మితిభావయన్ శివశివేతి చోదీరయన్
శివం హృది సమర్చయన్ శివకథా స్సమాకర్ణయన్ ।
శివాత్మకతయా జగత్సకలమే తదాలోకయన్
నయామి దివసానహం నయతు యత్ర వామాంశివః॥

సూత్రి : అప్పుడా యీవిధంబున బ్రాహ్మణుండును శిష్యుండును మతంగస్త్రీయును మాదిగవాఁడును పరమేశ్వరుని గూర్చి పలికిన యా తదనంతరంబున నాపరమేశ్వరుఁడును వారి భక్తికిమెచ్చి వృషభవాహనారూఢుండై పార్వతీసమేతుఁడై ప్రత్యక్షమాయే మార్గము.

పదము॥ సంతుష్ట రాళి॥ ఆది॥

శంకరుండు వెడలె వింతవింతగ
శంకరుండు వెడలె శర్వాణీ సహితుఁడై
ఘాంకిమీఱెను నాగకంకణములు చెలంగ॥
బాలచంద్రచంద్రికలు ఫాలమున విలసిల్ల
లాలిత రుద్రాక్షసరులు రాజిల్ల గళమున॥

సూత్రి:- అప్పుడా యీవిధంబున ప్రత్యక్షమైన పరమేశ్వరుని జూచి వారు నమస్కారముచేసి స్తోత్రముచేసే మార్గము.

దరువు॥ శరణు శరణు పరమేశ - స్వామి
శరణయ్య సర్వలోకేశ।
శరణు శరణు భయనాశ, మమ్ము
గరుణింపు త్యాగరాజేశ॥

సూత్ర:- అప్పుడా యీవిధంబునఁ బరమేశ్వరుఁడు మాదిగవానిఁజూచి పలికేమార్గము.

ద్వి॥ వినవోయి మాతంగ వీరాగ్రగణ్యా
నినుబోల నెవ్వరు నేరరు జగతి
హెచ్చుగ సతియని యెంచకదాన
మిచ్చెదనంటివి యింతకన్నాను
ఏపుణ్యమున్నది యీదానభంగిఁ
బాపంబు నీకును బరిహారమయ్యె.
సరసత నీమహోత్సవమును మున్ను
ఇరవొంద మీకిపు డేఁటేఁటఁ బెంప్లి
చెలువొందఁ గట్టడ చేసితి మిపుడు
పొలఁతియు నీవును పుడమివర్ధిల్ల
నెవ్వరు నీకథ నేర్పడవినిన
నెవ్వరు నీకథనెలమిఁ జూచినను
వారికిఁ దనయులు వైభవోన్నతులు
గారవంబున నిత్తుఁ గల్యాణమునను.

సూత్ర:- అంతఁ బరమేశ్వరుఁడు బ్రాహ్మణోత్తముని జూచి పలికే మార్గము.

వృత్తదరువులు॥

వినవయ్య యోవిప్ర, వెఱపకుమిఁక నీవు
మనమున నీకింత మనికితమేల।
పనివడి నీధర్మభంగము గాకుండునయా నీకు।
తనర సాయుజ్యమిచ్చెద నీవేళ
చనవున దేవతలు 'సన్నుతింపంగ.

సూత్ర:- అంత పరమేశ్వరుఁడు మాదిగ వానిని జూచి పలికే మార్గము

వృత్తదరువు॥
తెలిపెద మాతంగ, ధీరాగ్రగణ్యా, యీ
కలఁక నీకేటికి గారవంబునను
పలుమాఱు నీదానభంగంబు గాకుండునయా నీకు।
చెలువైన సారూప్యమిచ్చెద చిత్తంబు రంజిల్ల
శీఘ్రంబుగాను॥

సూత్ర॥ అవురా యీవిధంబున పరమేశ్వరుఁడు మతంగ స్త్రీని జూచి పలికే మార్గము.

వృత్తదరువు॥ పలికెద మతంగ భామినీమణి, నీకుఁ
దలఁపులోపల నింతదైన్య మేటికినీ।
బలిమిని పతివ్రత భంగము గాకుండునమ్మ నీకు,
వెలయ సామీప్యమిచ్చెదఁ గైకొమ్మ
వేడుక మీఱంగ గౌరి మెచ్చను॥

సూత్ర॥ అవురా యీవిధంబున పరమేశ్వరుండు శిష్యుని జూచి పలికేమార్గము.

వృత్తదరువు॥ బాలుండవైనాను భక్తిచే నీగురుని
శీలము నిలిపితి నీమెల్లఁ బొగడ।
మేలు నీగుణములకు మెచ్చితి నీవేళనయా నీకు
సాలోక్య మిచ్చెద నిర్జర జలజభవాదులు గోరేది।

సూత్రి॥ అవురా యీవిధంబునఁ బరమేశ్వరుఁడు బ్రాహ్మణునకు సాయుజ్యమును, మాదిగవానికి సారూప్యమును, మాతంగభామినికి సామీప్యమును, విద్యార్థికి సాలోక్యము నిచ్చిన యీ తదనంతరంబున నారద కిన్నర కింపురుషాదులు మంగళము పాడేమార్గము.

శాహమహారాజు రచించిన సతి దానశూర నాటకంబు

సంపూర్ణము.

క॥ మేటి శహరాజ విరచిత
నాటకరత్నమున మెలఁగు సలుగురిలోఁ జన్ ।
బాటింపఁ బెద్ద యెవ్వరు
తేటగ విద్వాంసులార ! తెలుపఁగ వలయున్.

---

కాకినాడ : జార్జిప్రెస్ యందు ముద్రింపఁబడియె.

# స వ ర ణ

| పుట-పంక్తి. | | తప్పు | | ఒప్పు |
|---|---|---|---|---|
| 1 | 8 | మణి | — | ఫణి |
| 10 | 2 | ధృష | — | ధృష్ట |
| 11 | 20 | పొగసైన | — | సొగసైన |
| 24 | 13 | మనము | — | మనకు |
| 26 | 7 | కోర్కులీడేర | — | కోర్కులీడేర |
| 27 | 2 | బరియాచకంబులు | — | పరియాచకంబులు |
| 30 | 12 | దుర్మతులారా | — | దుర్మతులార |
| 35 | 3 | పుత్త్రాదుల | — | పుత్త్రాదులు |
| 35 | 11 | వచ్చిరిపుడు | — | వచ్చిరపుడు |
| 40 | 6 | నెందఱి | — | నెందఱు |
| 48 | 7 | పృధుపీ | — | పృథివీ |
| ,, | 8 | తారకాధీశు | — | తారకాధీశ |
| 49 | 18 | నిత్యాకార | — | నృత్యాకార |
| 50 | 6 | షండైర్వమత్ | — | షండోద్వమత్ |
| 57 | 17 | మానవులు | — | మాళవులు |
| 59 | 7 | గుబ్బి [illegible] | — | గబ్బి గుబ్బ |
| ,, | 20 | [illegible] | — | చెలువు |
| 62 | 13 | పతంబు | — | తపంబు |

| పుట–పంక్తి | | తప్పు | | ఒప్పు |
|---|---|---|---|---|
| 64 | 7 | మిది | — | మివి |
| ,, | 16 | వాక్యంబులుల | — | వాక్యంబుల |
| 66 | 13 | వృద్ధాంగనమార్గం | — | వృద్ధాంగనవచ్చు మార్గం |
| 68 | 9 | నోముల | — | నోములు |
| 70 | 16 | స్ఫట | — | స్ఫుట |
| 77 | 16 | ముచ్చుతోట | — | ముచ్చటతో |
| 90 | 4 | విలవిల్లు | — | విలసిల్లు |
| ,, | 13 | వరహస్తము | — | వరదహస్తము |
| 106 | 6 | తెఱఁగది | — | వెఱఁగంది |
| 111 | 22 | మచ్చికతోడను | — | మచ్చికతోడను |
| 114 | 8 | సుంగాణి | — | సింగాణి |
| 115 | 21 | కలకంది | — | కలకంఠి |
| 118 | 4 | యచ్చట | — | యచ్చట |
| ,, | 8 | దేవివి | — | దేవిని |
| ,, | 15 | బాలును | — | బాలుని |
| 119 | 5 | తళుకుచు | — | కళుకుచు |
| ,, | 15 | యావల | — | యానల |
| 121 | 9 | జనముల | — | జనములు |
| 123 | 5 | కేళికి | — | కేళిక |

| పుట-పంక్తి | | తప్పు | | ఒప్పు |
|---|---|---|---|---|
| 123 | 20 | గఱచుగ | — | దఱచుగ |
| 124 | 18 | నంబరబులు | — | నంబరంబులు |
| 131 | 20 | మచ్చకంటులలో | — | మచ్చెకంటులలో |
| 137 | 9 | విదుృతమణి | — | విధృతఫణి |
| 139 | 16 | మీాలదవతా | — | మీాలదవదాతా |
| 144 | 3 | పూాబ | — | పూాజ |
| 146 | 10,11 | మణివగాని | — | మణియగాని |
| 150 | 2 | బహుసమీాచనం | — | బహుసమీాచీనం |
| 157 | 21 | గుంభోధరుఁడు | — | కుంభోదరుఁడు |
| 159 | 15 | దేశబ్రిష్టుల | — | దేశభ్రిష్టుల |
| 160 | 12 | బొరిలోన | — | బోరిలో |
| 163 | 5 | మునికొని | — | మునుకొని |
| 166 | 11 | అడి | — | అడిగి |
| 170 | 3 | సౌరభము | — | సంరంభము |
| ,, | 14 | సొగసైన | — | సోగైన |
| 178 | 5 | చంద్రుఁవడుచ్చి | — | చంద్రుఁడు వచ్చి |
| 180 | 14 | గజ్జిలు | — | గజ్జెలు |
| ,, | 15 | మందహాస్మముల | — | మందహాసమ్ముల |
| 198 | 7 | సంపదవిడు | — | సంపదలిడు |
| 206 | 2 | వరహాస్తము | — | వరదహాస్తము |

Andhra University Series No. 66

# యక్షగానములు
## ( తంజావూరు )

సంపుటము ౪

---

పరిష్కర్త

విద్వాన్
గంటి జోగిసోమయాజి, ఎం. ఎ., ఎల్. టి.,
ప్రొఫెసరు, ఆంధ్రవిశ్వకళాపరిషత్తు.

---




ఆంధ్ర విశ్వకళా పరిషత్తుచే ప్రచురితము

Price Rs. 2-50] 1959 [వెల రు 2-50.

# విషయసూచిక

# ఉపోద్ఘాతము

ఆంధ్రనాయక రాజులచేతను తరువాతి మహారాష్ట్ర పరిపాలకులచేతను పోషింపఁబడిన కవులు, లేఖకులు స్వయముగా రచించినట్టియు నితరుల గ్రంథములకుఁ బ్రత్యంతరములుగా సేకరించినట్టియు వ్రాఁతప్రతులు తంజావూరి సరస్వతీ మహాలు గ్రంథాలయమునం దనేకములు గలవు. అవి యరవము తెనుఁగు సంస్కృతము మొదలైన భాషలలోని గ్రంథములు; తాటాకు ప్రతులు, కాగితపు ప్రతులు, ప్రత్యంతరములును; వానిలో ముద్రితములు, నముద్రితములుగూడ నున్నవి.

ఆంధ్రవాఙ్మయమున కలంకారములైన నన్నెచోడుని కుమారసంభవము, శ్రీనాథుని క్రీడాభిరామము మొదలైన మహోత్తమ గ్రంథములు అందలి ప్రతులనుండియే పరిష్కరింపఁబడి ముద్రింపఁబడినవి. అచ్చటి తెలుఁగు గ్రంథములనుగూర్చి వివరణపూర్వకమైన యొక కేటలాగు అప్పటి యుపాధ్యక్షులు శ్రీ డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారి ప్రోత్సాహమున, పి. పి. ఎస్. శాస్త్రిగారి యాధిపత్యమున 1933 లో ప్రచురింపఁబడినది.

మఱికొంతకాలమైన తరువాత అక్కడనుండిన తెనుఁగు వ్రాఁతప్రతులలో అముద్రితములైనవాని కన్నిటికిని ప్రత్యంతె

రములు వ్రాయించి తెచ్చుటకు కొందఱు లేఖకులను నియ మించి, యప్పటి యుపాధ్యక్షులగు డాక్టర్ శ్రీ కట్టమంచి రామ లింగారెడ్డిగారి ప్రోత్సాహమున 1938వ సంవత్సరమునుండియు పనిప్రారంభమైనది. అప్పటినుండియు 1948 సం॥ వఱకు నచటి యముద్రితముల కన్నిటికిని ప్రత్యంతరములు వ్రాయించి తెప్పిం పఁబడినవి. పైరీతిని సేకరింపఁబడిన వ్రాఁతప్రతులలో వీలైనన్ని ముద్రించి ప్రచురించుటకు విశ్వకళాపరిషత్తువారు తీర్మానించిరి. ఆతీర్మానము ననుసరించి ద్విపదభారతము మొదటి సంపుటము 1943 లోను, రెండవసంపుటము 1950 లోను అప్పటికి తెనుఁగు శాఖాధ్యక్షులైన శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు పరిష్కర్తగా ప్రచురింపఁబడినవి. ఆతరువాత డాక్టర్ శ్రీ వాసిరెడ్డి శ్రీకృష్ణ గారు ఆంధ్రవిశ్వకళాపరిష దుపాధ్యక్షులై మిగిలిన గ్రంథ ముద్రణమునకు దారికొనవలసినదని ఆంధ్రభాషాశాఖాధ్యక్షుఁడ నైన నాకానతి యిడిరి. . వారియాజ్ఞ ననుసరించి ద్విపదభార తము మూఁడు నాలుగు సంపుటములు 1950 సంవత్సరాంతము నకు ప్రచురింపఁబడినవి.

మిగిలినగ్రంథములలో ననేకములైన యక్షగానములు నితరకృతులు నున్నవి. వానిలో నల్పసంఖ్యాకములను సరస్వతీ మహాల్ అధికారులు ప్రచురించిరి. ఆంధ్రవిశ్వకళాపరిషత్తు వారిచే వ్రాయించి తెప్పింపఁబడిన యీ మిగిలినవానిలోఁ గొన్నిటి నైనను ప్రచురింపవలసినదని యుపాధ్యక్షులైన

డాక్టర్ శ్రీ వాసిరెడ్డి శ్రీకృష్ణగారు ఆజ్ఞాపింపఁగా యక్షగాన ప్రచురణ మారంభింపఁబడినది. అందు ఇప్పటికి మూఁడు సంపుటములలో ఈక్రిందిరీతిని ప్రచురింపఁబడినవి.

| | |
|---|---|
| 1 వ సంపుటము 1955 సం॥ | ప్రహ్లాద చరిత్ర<br>పూతనాహరణము<br>కాళియ మర్దనము<br>హేమాబ్జనాయికా స్వయంవరము |
| 2 వ సంపుటము 1956 సం॥ | విజయరాఘవచంద్రికా విలాసము<br>విజయరాఘవ కల్యాణము<br>తంజాపురాన్నదాన మహానాటకము |
| 3 వ సంపుటము 1957 సం॥ | ద్రౌపదీ కల్యాణము<br>రతి కల్యాణము<br>శచీపురందరము<br>సతీదానశూరము |

ప్రకృత ప్రచురణము నాలుగవ సంపుటము. తరువాతి 5, 6 సంపుటములును అచ్చులో నున్నవి. క్రమముగా ప్రచురింపఁబడును. ఇప్పటికి సిద్ధమైన యీ యారుసంపుటములు నచ్చులో నొక్కొక్కటి సుమారు మూఁడువందల పుటలు గలవి. ఇవిగాక యవకాశమునుబట్టి ప్రచురింపవలసిన గ్రంథములు సుమారు 25 సంపుటములు గావచ్చును.

పై గ్రంథముల నన్నిటిని బరిశీలించియుఁ బరిష్కరించియు శుద్ధప్రతులను దయారుచేయుటలో శ్రీ కొమ్మనమంచి జోగయ్యశర్మగారు సహాయులుగా పనిచేయుచు నుపయోగించుచున్నారు.

ఈ గ్రంథము లిట్లు ప్రచురణభాగ్యము నందుటకు ఆంధ్రవిశ్వకళాపరిష దుపాధ్యక్షులగు శ్రీ వాసిరెడ్డి శ్రీకృష్ణగారి యాదరాభిమానములు మూలకారణములు. ఇట్టి యుపాధ్యక్షులవారికిని, సిండికేటువారికిని, కీ. శే. లైన యాకృతికర్తల పక్షమున కృతజ్ఞతాభినందనముల నొనర్చుచున్నాను.

పరిష్కర్త,
ఆచార్య విద్వాన్ జి. జె. సోమయాజి,
ఆంధ్రశాఖాధ్యక్షుఁడు,
ఆంధ్రవిశ్వకళా పరిషత్,
వాల్తేరు.



# కృతజ్ఞత

అక్షరరూపమున వెలయుచు ఆంధ్రభాషాయోషాలంకారములయి చాలకాలమినాలోకయోగములేని యీయనర్ఘ కృతిరత్నముల ప్రకాశనమున దీక్షాపరులయి ఆంధ్రభాషోద్ధరణమున ఆదరము గలిగిన పండితపక్షపాతులు

ఆంధ్రవిశ్వకళాపరిషదుపాధ్యక్షులు
శ్రీ శ్రీ వాసిరెడ్డి శ్రీకృష్ణగారికి
నిరంతర కృతజ్ఞతాభివందనములు.

నిండుమనంబు నవ్యనవనీత సమానము, పల్కు శర్కరా
ఖండసమంబు, చేతయుపకారపరంబు, సధర్మచింతనల్
ఖండనసేయువర్తనము గల్గినుదారుఁడు వాసిరెడ్డి కృ
ష్ణుండు నిరామయాభ్యుదయ నూత్నవికాసము లొందుఁ
గావుతన్.

పరిష్కర్త
ఆచార్య విద్వాన్ సోమయాజి.

# పీఠిక

1. వాసంతికా పరిణయము:—

ఈ యక్షగానము కాంచె వెంకటాద్రియను నాతఁడు రచించినట్లు గ్రంథమునందుఁ జెప్పఁబడినది. ఇతఁడు తనకు బూర్వులైన తిరుమలార్యుఁడు, కొండార్యుఁడు, సింగరిభట్లు కొండుభట్లు అనువారిని బేర్కొనెను. తుదివాఁడగు కొండుభట్టుకు లింగాంబికయం దీతఁడు జన్మించెను. కవి తన్నుగూర్చి "సుకవిజన వందన విలోలుఁడు", "కుకవిజన దుర్మద విభాలుఁడు" "సకల లక్షణలక్ష్య మర్మవిశారదుఁడు", "సాహిత్య విద్యా ప్రచండుఁడు", "సరసగాన కళాప్రవీణుఁడు" అను విశేషణము లను వేసికొనియున్నాఁడు. పైవిశేషణము లన్నియు నీతని యందుఁ బరిపూర్ణముగా వర్తించునని చెప్పవీలులేదుగాని కొంత భాషాపాండిత్యమును, రచనాసామర్థ్యమును ఈగ్రంథ మున నీతఁడు చూపియున్నాఁడు. ఈతఁడు వ్రాసినది వైష్ణవ కథయగుటను, తిరుమలార్యుఁడు మొదలైన పేళ్ళు ఈవంశము వారి కుండుటచేతను ఈకవి విశిష్టాద్వైతియని తెలియుచున్నది. గుళదుర్తి యను నగ్రహారము తన నివాసమని కవి చెప్పికొని యున్నాఁడు. అది యహోబిలప్రాంతమని చెప్పుటచేత నీతఁడు కర్నూలుజిల్లా కోయిలకుంట్ల తాలూకాకుఁ జెందినవాఁడని తెలియనచ్చుచున్నది. వీరియింటిపేరు కాంచెవారు. ఆకాంచె

యనునది యొకగ్రామనామము. అదియే క్రాజ నేటి 'కాజ' యై యుండును. ఈగ్రామము నేటి కృష్ణామండలములోనిది. ప్రాయశః ఈకవి పూర్వులచ్చటినుండి వలసపోయిరేమో యని యనుకొనుట కవకాశమున్నది. ఈగుళదుర్తి యగ్రహారమును "తోరగంటి నరసరాజేంద్రదత్త"మని కవి పేర్కొనియున్నాఁడు. ఈనరసరాజు భట్టుమూర్తిచే వ్రాయఁబడిన నరసభూపాలీయము నకుఁ గృతిపతి. 'ఆతనిచే దత్తమగుచు వెలుఁగొందుచుండు నాయగ్రహార'మనియు, అందు "క్రాంజవంశాయతుండైన తిరుమలార్యుండు ప్రబలు" ననియు వ్రాసియున్నాఁడు. ఈ యగ్రహారము దత్తమని యుండుటయు పయిని దెలుపఁబడిన యూహను బలపఱచుచున్నది.

ఈ తోరగంటి నరసరాజు 1565 సంవత్సర సమీపమున నుండి యుండెను. ఆతఁడీ యగ్రహారము నెవరికిచ్చెనో తెలియదు. వెంకటాద్రికి మొదటిపురుషుఁడగు తిరుమలార్యుఁడే ఈయగ్రహార ప్రతిగ్రహీత యనుకొనుటకు వీలులేదు. ఒకప్పు డట్లైనను అతనికిని, అతనికి నైదవపురుషుఁడగు కృతికర్తకును నడుమ సుమారు నూరువత్సరములు జరిగియుండవలయును. కాఁబట్టి యీ గ్రంథము సుమారు 1700 సంవత్సరములకు వెనుక వ్రాయఁబడి యుండవచ్చును.

ఇందలి విషయము వాసంతికయను పేరుగల చెంచేతను అహోబలనరసింహస్వామి పెండ్లియాడుట. మిక్కిలి ప్రచార ములోనున్న గరుడాచలనాటకములో (చెంచునాటకములో) నిదే యితివృత్తము గలదు. ఇందలి రచనము సరసముగా సాఁగినది. ఇది వేంకటాచల విభునకుఁ గృతి యీయఁబడినది.

2. వివేకవిజయము:—

ఈగ్రంథకర్త చల్లా సూరయ. కృత్యాదిని "పోదవాకా హ్వాయపురవాసి. సాంగవేదాధ్యయనశాలి, ఆపస్తంబసూత్రి, కౌండిన్యగోత్రుఁడు"అని తన్నుఁగూర్చి వ్రాసికొనియున్నాఁడు. ఈ పోదవాకయను గ్రామము చెంగల్పట్టు జిల్లాలో నున్నట్లు తెలియవచ్చుచున్నది. ఇతఁడు పారమ్మ సూరభట్టు అనువారల పౌత్రుఁడు. లక్ష్మమ్మ సూరయ్య యనువారల పుత్రుఁడు. ఈ గ్రంథము తంజావూరికి సమీపమందలి మన్నారు గుడిలో నున్నట్టియు, తంజావూరి రాజుల యిష్టదైవమునగు రాజమన్నా రున కంకితమగుటచేత నీతఁడు కొంతకాలము తంజావూరి సంస్థానము నాశ్రయించెనేమో యను సంశయమునకుఁదావు గలదు. గ్రంథారంభమున "శ్రీమత్సదానంద చిన్మయయోగి పాదుకల్ నిజభావపదమునఁజేర్చి" యనుటచేత శ్రీమత్సదా నందయోగియను నాయన యీతనికిఁ దత్త్వోపదేశము చేసిన గురువైయుండె ననుకొనుట' కవకాశము గలుగు చున్నది. క్రీ.శ. 16 వ శతాబ్దము చివరనుండిన దత్తాత్రేయయోగి శిష్య

పరంపరలో 3వ తరమున సదానందుఁడను నొక యవధూత యున్నట్లును, అతఁడు గ్రంథకర్త యైనట్లును ఆంధ్రకవితరంగిణి 10వ సంపుటము 183వ పుటలోఁ గలదు. మన కవి సూరయ పై సదానందచిన్మయయోగికి శిష్యుఁడైనయెడలను, ఆ సదానందయోగి యాంధ్రకవితరంగిణిలోఁ జేర్కొనఁబడిన వాఁడే యైనయెడలను 17వ శతాబ్ది నడుమ నుండెనని యూహింపవచ్చును.

ఈ వివేకవిజయము సంస్కృతమున కృష్ణమిశ్రునిచే రచింపఁబడిన ప్రబోధచంద్రోదయమునకు ననుసరణము. ఈ ప్రబోధచంద్రోదయమునే నందిమల్లయ, ఘంటసింగయయను కవులు తెనుగునఁ బ్రబంధముగాఁ బరివర్తించిరి. సూరయ దృశ్యకావ్యముగానే రచించినాఁడు. ఈ యక్షగానములను నాటకములనియు, మహానాటకములనియు రచయితలే పేర్కొనుట యభ్యాసము. అనేక స్థలములందుఁ బ్రబోధచంద్రోదయనాటకము నతిక్రమించిన కల్పనలు మొదలైనవి యిందుఁ గలవు.

3. చిత్రకూటమాహాత్మ్యము:—

మహానాటకమని కవిచేఁ జేర్కొనఁబడిన యీ చిత్రకూటమహాత్మ్యము తిరుమలకవికృతము. కవి శ్రీకృష్ణుని నుతించుచు "రంగకృష్ణముద్దులరాయ రాజసుతుఁడు, శ్రీవిజయరంగ

చొక్కనాథావనీశుఁ డెలమిఁగోరిన కోరికలిచ్చు దేవ" యని సంబోధించియున్నాఁడు. ఆశ్వాసాంతగద్యమునను "శ్రీవిజయ రంగ చొక్కాధీశు నగర నృపవర నిత్యలాలితుం డై" యుండిన వాఁడని చెప్పికొన్నాఁడు. ఇంకను "సంగీత సాహిత్యచతురుఁడా విజయరంగ చొక్కావనీ రమణుని కృపను కర్ణభూషణములు స్వర్ణాంబరములు సరిపెణలు తాళి యందలము నగ్రహారము నాది ఘనబహుమానముల్ గాంచిన ఘనుఁడ" నని వ్రాసికొనియున్నాఁడు.

పై విజయరంగ చొక్కనాథనాయకుని కాలము 1706-1732 వఱకు నగుటచే నీ కవి యాకాలమున నీగ్రంథరచనచేసి యుండును. ఈతఁడు బాలసరస్వతి మఖిపౌత్రుఁడు. వేంకటాధ్వరి పుత్రుఁడు.

కవి కథలో వర్ణించిన రాజులమహలు మున్నగునవి తమ నాయకరాజుల యాస్థానమునఁజూచిన దృశ్యములకుఁ బ్రతిద్వంద్వాలనుటలో వైరుధ్యము లేదు.

ఇందలికథ విష్ణుపారమ్యమును దెలుపునట్టిది. చిదంబర క్షేత్రమున తిల్లగోవిందరాజుల యాలయమును, శైవాలయమును రెండు నున్నవి. శివ పార్వతులకు నాట్యవిషయమున వివాదమువచ్చుటయు, అట్టి వివాదమును విష్ణుమూర్తి తీర్చుటయుఁ జూడఁగా నీ రెండుమతములకును సామరస్యము గలిగిం

చునట్లు రచించి, వైష్ణవపారమ్యమును వ్యంగ్యముగా స్థాపించు నుద్దేశము కవి కున్నట్లు స్పష్టమగుచున్నది. ఇంకొకవిషయ మేమనఁగా "నావిష్ణుః పృథివీపతిః" అను న్యాయమున విజయ రంగ చొక్కనాథుఁడే గోవిందరాజులనియు, అతఁడు శివపార్వతులకు నాట్యవిషయమున వివాద మేర్పడఁగాఁ దీర్చుటకు సరిపోయిన సామర్థ్యము గలవాఁడనియుఁ గవి వ్యంగ్యముగా నిరూపించి యున్నాఁడు. ఇక విజయరంగని సభలో "వగకోపుల వైపులమర...ఇంచుబోణులు నటించు భాగ్యము నందియుండె" నని యూహింపవచ్చును.

ఇందుఁ బ్రసిద్ధరాగములలోఁ గర్ణాట హిందూస్థానీ బాణీలకుఁజెందిన దరువులుగలవు. సమపదమను రచనావిశేష మొకటి పలుమఱు ప్రయుక్తము; అష్టకము,ఉత్తరప్రత్యుత్తర పదమును గలవు. రచన చక్కనిది. అందును వచనరచనయు వచనమున సంభాషణలును గలవు. ఇది 'స్వామివాక్యం' ఇత్యాది పాత్రసంభాషణసూచనలు గలవు. సంధివచనములు ప్రసంగములను పేర వ్యవహరింపఁ బడినవి. గ్రంథమధ్యమునను కైవారములు గలవు. ఒకగుజరాతికోపును, జక్కిణియునున్నవి. పేరణి పదచాళికయును బేర్కొనఁ బడినవి.

ఈగ్రంథమునందు మొదటినాఁటి సంవిధానము, రెండవ నాఁటి సంవిధానము, అనురీతిని నాలుగునాళ్ళ విషయముగా

విభజింపఁబడినట్లు కవి వ్రాసియున్నాఁడు. ఇది నాలుగునాళ్ళు ప్రదర్శింపఁదగిన నాటకమగునాయని దీని యల్పపరిమితినిబట్టి సందియముపుట్టకమానదు. దీనిని ప్రదర్శించుట కొక్కరాత్రి చాలును. కథాస్వభావమునుబట్టి పరిశీలించినచో నీకథ నాలుగునాళ్ళలో జరిగినట్లు కవి నిర్దేశించెనని యూహింపవచ్చును. ఈనాలుగిటిని నాలుగంకములుగా భావించి, కైశికీవృత్తి క్లుప్త వృత్తము కలదగుటచేత నాటికాలక్షణము కొంత దీనికి పట్టినదనవచ్చును. "నాటికా క్లుప్తవృత్తాస్యాత్ స్త్రీప్రాయా చతురంకికా" యని లక్షణము.

4. భీమసేన విజయము:—

ఈగ్రంథము తుదిని: "తిమ్మయ దండనాథ తనయుఁడక్కయ సత్కృతంబై తనర్చు" నని కవి చెప్పియుండుటచేత నీకృతికర్త 'అక్కయ' యని తెలియుచున్నది. ఇంతకంటె నితనిఁ గూర్చి యేమియు దెలియరాదు.

ఇందలి కథ— భీమసేనుఁడు కీచకసంహారము చేసిన విధానము. కవి తిక్కనరచన ననుసరించినట్లు తెలియుచున్నది.

ఈగ్రంథము తిరుమల వేంకటపతి కంకితము చేయఁబడినది.

5. శ్రీ కృష్ణ లీలావిలాసము:—

గ్రంథము చివరనున్న పద్యభాగమునుబట్టి "తిమ్మయ దండనాథ తను సంభవుఁ డక్కయ ప్రధానుఁడు తిరుమల వేంకటేశ్వరున కంకితముగా" నీ యక్షగానమురచించినట్లు తెలియుచున్నది. ఇందు గోపికావస్త్రాపహరణము మున్నగు శ్రీకృష్ణుని బాల్యచేష్టలు ఆంధ్రభాగవతపద్ధతిని వర్ణింపఁబడినవి.



# వాసంతికా పరిణయము



వేంకటాద్రి

# వాసంతికా పరిణయము



సీ. శ్రీమించు కర్ణాట సింహాసనంబునఁ
బరఁగి యహోబలప్రాంతమునను
చెలఁగి కో ... ... గుళదూర్తి
యను పేరుగల యగ్రహారమొకటి
కలిత విద్వజ్జన కంఠీరవులచేత
వేదశాస్త్ర పురాణవిదులచేత
యజనాది షట్కర్మభజన పరులచేత
నిరత సదాచార నిధులచేత

గీ. సకలహితులైన గృహమేధిజనులచేత
సరస సంగీత సాహిత్య చణులచేత
నెనసి తొరగంటి నరసరాజేంద్రదత్త
మగుచు వెలుఁగొందు మంచుఁ దానతులముగను

కం॥ ఆయగ్రహారమున నలరుచును క్రాంజవం
శాయతుండై తిరుమలార్యుండు ప్రబలు ॥౧॥
... ... ... మణికి నాత్మజుండగుచు వి
ఖ్యాతముగఁ బ్రబలెఁ గొండార్యుండు భువిని ॥౨॥
ఆకొండుభట్లకును......
..........సుతుఁడు సింగరిభట్లుపుట్టెన్ ॥3॥

త్రిపుట॥ అతనికిని సరసాగ్రిగణ్యుండతుల శాస్త్ర
విత ... గుణాఢ్యుఁడు కొండుభట్లుదయించెమహిని॥
ఆసుధీరత్నమునకును లింగాంబికకుసంజ......
......గ్రణి వెంకటాద్రి కవీశ్వరుండు ॥౨॥
సుకవిజన వందన విలోలుండు - కుకవిజనదుర్మదవిఘాలుడు
సకలలక్షణ లక్ష్యమర్మ విశారదుండు ॥3॥
సాహిత్య విద్యాప్రచండుఁడు - సరసగానకళాప్రవీణుఁడు
శ్రీహరి పదాంభోజయుగ సంసేవకుండు ॥౪॥

వ. ఏతాదృశ గుణవిశిష్టుండైన యీ వేంకటాద్రికి నొక్క
నాఁటి రాత్రిసమయంబున.

సీ. నీలమేఘమువంటి నెమ్మేను గలవాఁడు
డంబైన పీతాంబరంబువాఁడు
శ్రీవత్సమను మచ్చఁజెలఁగు వక్షమువాఁడు
హావణించు దీర్ఘబాహువులవాఁడు
నిండు చందురువంటి నెమ్మోము గలవాఁడు
ధవళాబ్జ సదృశ నేత్రములవాఁడు
మహితమహా నవరత్నమయ కిరీటమువాఁడు
మకరకుండలకాంతి మలయువాఁడు

నిఖిలజగములఁ గుక్షిలో నిలుపువాఁడు
లీలతో భక్తజనులఁ బాలించువాఁడు
రమణ వరమిచ్చు నాల్గుహస్తములవాఁడు
కలిత విభవుండు వేంకటాచలవిభుండు.

వ. ఇట్లు స్వప్నమున వచ్చి మదంకితంబుగా నొక్క యక్ష గానంబు రచియింపుమని యానతిచ్చిన నతండు గ్రక్కున సంతోషభరితుండై యీయక్షగాన రచనకుద్యుక్తుండై తనయిష్టదైవతంబైన వేంకటాచలపతిని గపిశ్వరుం డేమని వర్ణించుచున్నాఁడు.

శా॥ శ్రీలక్ష్మి న్నిజవత్సకౌస్తుభమణి శ్రీసంగతిన్మాటి, యా
లీలన్ భూలలనామణిన్ స్వభుజసంశ్లిష్టాంగ దోర్ద్వయాన్వయా
ఖాళింగప్పి, పరస్పరానుగుణ సౌహార్దంబుగా నిర్భరన్
గేళిం దేల్చిన వేంకటాచలపతిం గీర్తించి సేవించెదన్॥

క. నిరతము గుణభూతి మతి
స్థిర విద్యాభావన ప్రసిద్ధులుగల యా
గిరిజా శంకర వాణీ
పరమేష్ఠి, రమారథాంగ పాణులఁ దలఁతున్॥

క. నిర్విఘ్నముగా మత్కృతి
నుర్విన్వెలయించి శుభము లొందఁగఁ జేసే
పర్వేందు కళాధరుఁడౌ
శర్వానిసుతుఁడైన విఘ్న శాసనుఁ దలఁతున్॥

శా. శ్రీమద్భారవి కాళిదాససుకవి శ్రీహీరపుత్రాదులన్
నేమంబొప్పఁదలంచి యంధ్రకవితానిర్ణేతలైనట్టి యా
సోమున్ తిక్కనసోమయాజి ముఖులన్ సొంపొందఁగా నెంచి యీ
భూమిన్నేఁటి మహాకవిప్రతతులన్ భూషించి కీర్తించెదన్॥

క. కాకవితారచనా పర
కాకవితానముల నొరయఁగా కవితతికె
కాకవితా సర్వజ్ఞుల
కాకవితారచన నొరయనర్హంబగునే॥

వ. అని యిష్టదేవతా ప్రార్థనంబును, సుకవిజనసంస్తవంబును గుకవిజన నిందనంబును గావించి కృతిభర్తయైన వేంకటభర్తను కవీశ్వరుండేమని వర్ణించుచున్నాఁడు.

షష్ఠ్యంతాలు॥

జంపె॥ ఘటిత సురకులభృతికిఁ జటులహిమనగధృతికిఁ
బటుశీలమతికి వేంకటశైలపతికి ॥౧॥

అనుపమశుభాకృతికి – నజ హర విహితనుతికి
ఘనసుగుణతతికి – వేంకటశైలపతికి ॥౨॥

శ్రితజనావనునకు – శ్రీరమాకృత రతికిఁ
గ్రితుభుగధిపతికి – వేంకటశైలపతికి ॥3॥

చరణగంగాశ్రుతికి – సరసజయ విశ్రుతికి
గరుడ సంగతికి వేంకటశైలపతికి ॥౪॥

నిరతముని సంస్థితికి ...
ఖర దితిజ హతికి వేంకటశైలపతికి ॥౫॥

వ. అంకితంబుగా నాయొనర్పంబూనిన వాసంతికాపరిణయంబను యక్షగానంబునకుఁ గథాక్రమంబెట్టిదనిన,

జంపె॥ సిసలనను గాపురము జితసదలకాపురము
పరమాత్మపుర మహోబలనామపురము ॥౧॥

స్థిరవైభవోత్కరము శ్రీనృసింహాకరము
వరభయంకర మహోబల నామపురము ॥౨॥

కలధౌతగోపురము కాంతిజితగోపురము
కలుషభయహర మహోబలనామపురము ॥౩॥

విజయలక్ష్మీకరము - వేదాంతగోచరము
ప్రజల కిహపర మహోబలనామపురము ॥౪॥

ముని నికరభాసురము మోక్షలక్ష్మీకరము
ప్రణతార్తిహర మహోబలనామపురము

వ. మఱియు నేమని వర్ణింపుచున్నాఁడు.

ద్వి. మఱియు శేషాచల మధ్యభాగమున
గరిమఁజెందుచు విశ్వకర్మ నిర్మాణ
చాతురీమహిమ సంజాతమై దిశల
ఖ్యాతమై సుజన సంఘాతమై మఱియు
విలసితప్రాకార వితతులచేతఁ
గులుకుదేరిన కోటకొమ్మలచేత
మెలపైన బంగారు మేడలచేతఁ
బొలుపైన రత్నగోపురములచేతఁ
దెఱఁగొప్ప రాజమందిరములచేత

విరివిగాఁ గనుపట్టు వీథులచేతఁ
జేరుపైనట్టి పేటలచేతఁ
చిత్రైన యుపరంజి తేరులచేతఁ
జిగిరిచి పూచి కాచి ఫలించి మిగులఁ
బాగడొందు నుపవనభూములచేత
నీటైనయట్టి కోనేరులచేత
గాటంపు బల్తటాకంబులచేత
గజహయ రథభటోత్కరములచేత
ద్విజరాజ విట్ఛూద్రి వితతులచేత,
వీణాది చౌషష్టి విద్యలచేత
రాణఁజెందిన వారరమణులచేత,
మించి నాదములభూమిని గప్పుచున్న
పంచమహావాద్యఘణుతులచేత
పావనించు దేవాలయమ్ములచేత
నవరత్న దివ్యమంటపములచేత
ననిశమ్ము భోగభాగ్యమ్ములచేతఁ
బరిణుతిచెందిన యహోబలపట్టణంబు
గగనంబునందుండి గ్రక్కున మహిని
దిగిపడ్డ యమరావతీఖండమనఁగఁ
జెలఁగి సర్వోత్కర్షచే సొంపుమీఱి
యలరుచు నుండె జనానందమగుచు.

ద్వి. ఆరాజధానికి నధిపతియైన
ధీరుండు నరసింహదేవుఁడవ్వేళ
సురలు కిన్నరులు యక్షులు సిద్ధసాధ్య
గరుడోరగాదులు గంధర్వవరులు
పరమభక్తులు లోకపాల సంఘములు
సరసాగ్రగణ్యులు సనకాదిమునులు
వరుస నాచార్యులు వైష్ణవోత్తములు
స్థిరమతి రమయు భూదేవియుఁ గొలువఁ
గమలసంభవుఁడప్డు కైదండ లీయ
రమణ నింద్రుండు బరాబరుల్ సేయ
స్వామి పరాకు, హెచ్చరిక సర్వేశ
శ్రీమద్గుణాధీన చిత్తావధాన!
అనుచు దేశాధినాయకులను జూపి
యినచంద్రులప్పుడు హెచ్చరింపంగ
తుంబురు నారదాదులు జంటఁబాడ
శంబరాహితవైరి సముఖంబుఁ జేరి
గరిమతో ధర్మమార్గములు బోధింప
గురుశుక్రులపుడు నెక్కొని నీతిఁదెలుపఁ
జెలఁగుచు రంభోర్వశీ మేనకాదు
లలరంగ మార్గనాట్యంబులు సలుప
మహిలోన దుష్టసంహారణంబు చేసి

రహించి భక్తసంరక్షణ సేయఁ
దివురుచుఁ జకచక ద్దేదీప్యమాన
నవరత్న సింహాసనమునఁ గూర్చుండి
యురుతరంబుగ వైభవోజ్జ్వలుండగుచు
గరిమతోఁ బేరోలగంబుండె నపుడు.

వ. ఇవ్విధంబున నయ్యహోబలవీర నారసింహదేవుండు సకల సురవర నికరంబుతో నిండుకొల్వైయుండి యొక్కనాఁడు.

క. సురుచిరతర వేదాచల
గరుడాచల విహరణోత్సుక మతిస్ఫురణల్
త్వరితగతులఁ బ్రేరేచఁగ
గరిమన్నర సింహుఁడపుడు గమనోద్యతుఁడై.

జంపె॥ ధావనంబునఁ బంచధారాగతుల మించు
శ్రీవైనతేయుపై శ్రీనృహరి వెడలెన్ ॥౧॥

వెడల నప్పుడె మేటి సిడములును సురటులును
గొడుగులును గూడి యాతని వెంబడించెన్ ॥౨॥

కలిసి రెక్కలతోడి కులపర్వతములనఁగ
దులదులని మత్తగజములగుంపు గదలెన్ ॥3॥

శరమనోమరుదధిక జవన విస్ఫురణచే
హరిదశ్వముల మించు హరివితతి గదలెన్ ॥౪॥

త్రిపుట॥ నడతలేని మహోన్నతియుఁగల-
నగపతులను దృణీకరించుచు
నడచె రథములు తురగముల వెంబడిగనపుడు ॥౧॥

భీమ విక్రమ సరణిఁ దమ తమ
బిరుదు లెంతయుఁ జెలఁగ నపుడా।
స్వామివెంటఁ బదాతిబలములు సరగ నడచెన్ ॥౨॥

అల్లనల్లన చేరి యప్పురి పల్లవాధరలెల్ల హరిపై
మొల్లమిగ ముత్యాలసేసలు చల్లిరపుడు ॥3॥

సరసిజాక్షునిఁ జూడవచ్చిన పురసతుల యిరుగడలఁ
జూపులు
సొరిదిఁ గలువలతోరణములై సొగసుమించెన్ ॥ర॥

జంపె॥ అడుగడుగునకు సతులు హారతెత్తిన వెలుఁగు
కడలుకొని గగనభాగము నిండుకొనియెన్ ॥౧॥

భేరీనినాదములు బిరుదు శంఖారవము
లారూఢి శిబిరమున బోరుకొల్పఁగను ॥౨॥

పరిజనులకలకలము భటులకైవారములు
మెరవడిగ సంగీత మేళములు చెలఁగెన్ ॥3॥

వ. ఈవిధమునఁ జతురంగబలసమేతుండై యప్పరమ పురుషుం డప్పురి వెడలి ఛత్రవటప్రాంతంబునఁ జేరి గిరివిహారణంబు సలుపుచున్న సమయంబున.

క. సురపతి యప్పుడే నరకే
సరి చిత్తము దెలిసి యచటి శైలమహాత్మ్యం
బెఱిఁగించుటకై తిన్నగ
దారకొని మృదువచన రచనతో నిట్లనియెన్.

త్రిపుట॥ స్వామి మును గంధర్వవరులకు
సరవితోఁ బ్రత్యక్షమై ర
క్షామహాత్మ్యముచూపుచోటిది ఛత్రివటము॥

దచ్చరేకులు॥ భృగుమహామునికిఁ బ్రసన్నమగుచు వరములిచ్చి
మున్ను
సుగుణుఁడై చరింపుచున్నచోటు భార్గవమిదె నృహరి॥

త్రిపుట॥ మున్ను నీవాదేవసమితికి ముదముతో నిజరూపము
నను బ్ర
సన్నమగుచోటిదియ వేదాచలమునుమిూ ॥౧॥
గరుడునకు మునునీవు సాక్షాత్కారమై వరమిచ్చుచోటిది
యరసి కనుఁగొను మిూగిరియ గరుడాచలంబు ॥౨॥

జంపె॥ మును నీవుచని బ్రహ్మకును యోగశాస్త్రముల
యనుభవము నేర్పు యోగానందమిదియ ॥౩॥
కినిసి కోపజ్వాలలను కంబమున వెడలి
మును నీవు కనకకశిపుని ద్రుంచు తలము ॥౪॥

రూపకము॥ ఆనాడు ప్రత్యక్షమై నీవుభూసతికిఁ
బూని వరమొసఁగఁ గిటివై నిల్చుచోటు ॥౧॥

క. దేవా యిది భవనాశిని
నీవలనన్ జననమంది నీకూఁటయై
యీవసుధ భక్తకోటికిఁ
గావలయు వరమ్ములొసఁగుఁ గనుఁగొన్నంతన్॥

జంపె॥ భవవిదళనోత్కటము - పతిత గహనచ్ఛటము
నవసుధాఘటము భవనాశినీతటము ॥౧॥

సురజనప్రాకటము శుకపికరవార్భటము
నవులకవికటము భవనాశినీతటము ॥౨॥

కలుములకు సంపుటము - ఖగకులవిశంకటము
నలిన విస్ఫుటము భవనాశినీతటము ॥3॥

కారంజకునికి సాక్షాత్కారమై నిల్చి
శ్రీరంజకునిగ రక్షించుచోటిదియు ॥౪॥

రూపకము॥ మును నీవుభారద్వాజునిఁ బావనుఁజేసి
మునుకొని వరములిచ్చినచోటు దేవ ॥౧॥

జంపె॥ అతి విమలజీవనము యతులసంజీవనము
వ్రతుల భవనము ఫలితవనము పావనము ॥౧॥

వినుత భక్తావనము వేదకృతభావనము
మునులభువనము సుధావనము పావనము ॥౨॥

పరమసురదేవనము నరలోకపావనము
వర సుజన విహితసేవనము పావనము ॥3॥

వ. ఇవ్విధంబున సుకవిభుండన్న వనాంతరసింహస్థల విశేషంబు లెఱింగింప సంతోషభరితమానసుండై యన్నరహార్యక్షుం డచ్చటి కనకసరోవరప్రాంతంబున విహరించుచున్న సమయంబున.

క. అంతటఁ బధికవధూజన
సంతాపకరుండు నగుచు సకలమహీంజ
శ్రాంతము లుడుపుటకొఱకు వ
సంతుం డుదయించె సద్ద్విజప్రార్థితుఁడై.

జంపె॥ కంతునికి సంతోషకరమగుచుఁ బొలిచెను వ
సంతాగమము లసదనంతాగమంబై ॥౧॥
తరుతతుల యీతిబాధలు దుల్లెనోయనఁగ
గుఱుతుగాఁ బండుటాకులు దుల్లెనపుడు ॥౨॥
తరులకే కాదు చైత్రమున నాకులపాటు
తరుణులకు రూపవత్తరుణులకుఁ గలిగెన్ ॥౩॥
ప్రాతగిల్లినవారు పడుపాటునై భువిని
నూతనస్థులు ప్రబలురీతి ననలొప్పెన్ ॥౪॥

త్రిపుట॥ ఉపవనేందిర రహిం ధరించినయుమటు చందురకావి చీరన
నిపుణతగఁ జిగురాకుజొంపమునిండెఁ దరులన్ ॥౧॥

జంపె॥ ఉల్లసిల్లఁగఁ బుష్పవల్లతాంగాళిపైఁ
బల్లవోత్కరములకుఁ బ్రబలె ననురక్తుల్।
సతులెల్లఁ బ్రథమస్తుమతియైన వనరమకు
తతి శోభనముపాడు గతి వికతమలరెన్ ॥౨॥

త్రిపుట॥ ఏలకూర్చె విధాత హాచండాలులను పద్మినుల
నంచును
పూలనే నెపమున వనేందిర పొసఁగ నవ్వెన్ ॥౧॥

ఝంపె॥ సహకార వన్మథుని సహకార కరములకు
సహకారమై పూచె సహకార నగమున్ ॥౧॥
పాలాశరహితమై - పాలాశ మటుపూచె
బాలాశనిగ రతిన్ - పాలాశ మిగులన్ ॥౨॥
పున్నాగ మదనమద - పున్నాగమునకు తల
పున్నాగముగఁబూచెఁ - బున్నాగతరువున్ ॥౩॥
సంతాప ధరణీజ - సంతాన మపుడు వ
సంతానఁబూచె హరి - సంతాన మలరన్ ॥౪॥
తాపికరణి నేపువి - తా విరహిజనములకు
తాపిక గోరంట - తాపికఁ బూచెన్ ॥౫॥

కుఱుచజంపెలు॥ పొగడ తరముగఁ బూచెఁ బొగడఁ దర
మగుచున్ ॥౧॥
మాధవీలతపూచె మాధవీహితమై ॥౨॥
వకుళములు పూచె దేవకులములు మెచ్చన్ ॥౩॥
దాడిమీతతి పూచె దాడిమీఱఁగను ॥౪॥
మల్లికలుపూచె సుమ ! మల్లికలు మీఱన్ ॥౫॥
అపుడు—

త్రిపుట॥ సంకృతులున్నై యొకరికొకరు నశంకృతులు
గాకుండు పథికా – హంకృతులు సడలించె షట్పద
ఝంకృతులును ॥౧॥

హుంకృతులచేఁ బతులఁ గదిమి యహంకృతులచేఁ
దిరుగుసతుల స్వయంకృతాగములుడిపె స్మరగుణ
టంకృతములు ॥౨॥

మదవతులు పూర్ణిమకు బెదరఁగ బెదరకుఁడు కుహూ
వనెడి మాదిరిని
మదపికములు కుహూకుహూయని రొదలుచేసెన్ ॥3॥

తరుణులప్పుడు పికరవములకు – వెఱవ వారికిమాఱు
చెప్పెడి
కరణి శుకములు రామరామని – కలయఁబలికెన్ ॥౪॥

అంకె తెలియక సతులు పతులు మంకుతనమున
నుండ వారల
బింకములు విడిపించుగతి గొరవంక పలికెన్ ॥౫॥

వ. అట్టి వసంత సమయమున.

ద్వి. అగ్గిరి చెంచునాయకులు మోదమున
నగ్గలంబుగ వేఁటలాడంగఁ దలఁచి
కొలఁదిగాఁ బొరుటాకులు పైధరించి
నలువొందఁ బొటిపొటి నామముల్ దీర్చి

అలతిఁగా వెదురుబియ్యపు టోగిరమునఁ
బులిమీఁగడ పెరుగు పొసఁగ మేదించి
కలిపిన చద్దిచిక్కములలో నించి
తులకించు చిఱుతకత్తులు గ్రిద్దగోళ్లు
మొలవంకి చిలుకుటమ్ములు విండ్లు బల్లె
ములు బిల్లులును శస్త్రములు సవదరించి
సురగాలి కాటేడు చొచ్చినవచ్చు
మెఱుపుఁదీఁగెయుఁ బచ్చిమిరియంబు బూచి
మెకములమిత్తి గామిడి చిల్కుటమ్ము
మొకమూయ సింగాడి ముచ్చల గొంగ
యనఁదగు సారమేయములతోఁ గూడి
చని చని యక్కొండ చఱుల నెత్తములఁ
బులులు సింగములు దుప్పులు లులాయమ్ము
లెలుఁగులు లేడులు నిఱ్ఱులు కిటులు
మనుబిళ్లు శరభముల్ మదసింధురములు
కనితి మెకమ్ములు గండకమ్ములును
మొదలైన మృగసంఘముల వేఁటలాడి
పదపడి సంతోషభరితులై యపుడు
జల్లిమెకమ్ములు చమరులు పునుఁగు-
పిల్లులు బవ్వాజి పిల్లులు మఱియు
జుంటితేనెలు పులిజున్ను ఖర్జూర

కంటకఫలములు కదళీఫలములు
కిత్తలిపండ్లు చక్కెరమోవి పండ్లు
మెత్తని తియ్యమామిడిపండ్లు మఱియు
పెదురుబియ్యములు వెదురుముత్తెములు
ముదముతో నరసింహమూర్తి సన్నిధిని
గరమొప్పఁ గానుకగాఁబెట్టి మ్రొక్కి
హరిసముఖమునఁ బాయక నిల్చిరంత.

వ॥ ఇట్లు నిలిచిన యచ్చెంచు నాయకులఁ గరుణావలోకనంబునఁ గటాక్షించి, తత్సమర్పిత వస్తుసంఘమ్ములు గైకొని, యన్నరసింహదేవుండు వారల నుచితసంభావనంబుల సంప్రీతులఁజేసి యన్యోన్య సంభాషణములఁ జెలఁగుచున్న సమయంబున

క. కానలఁ దమతమనాథులఁ
గానక త్వరపడుచుఁ జెంచుకామినులచటన్
నానా గిరులను జఱులను
గోనలఁ బొదరిండ్లఁ బర్వుకొని వెదకంగన్.

జంపె॥ అప్పుడాగుమిలోని నెప్పరులు జాడఁగని
యప్పుడంతులఁ బిలిచి రార్భటింపుచును ॥౧॥
ఆజాడ చూచుకొని యాచెంచు భామినులు
రాజిల్లి దులదులను రాఁజూచిరంతట ॥౨॥
తరుణులొక కొందఱంతయు వేడ్కమీఱిన
త్తఱిని ఏలలు పాడుతా వచ్చిరపుడు ॥3॥

ఏలలు॥ నవ్వుకొంటూ కేకుకొంటూ – నారీమణులందఱము
పువ్వులు కోయఁగఁ బోతేను—ఓరి చెంచులవాబ
నవ్వులల్లా పువ్వులాయెరా ॥౧॥

అల్లిబిల్లిగ నందఱము – ఆడుకొంటు పాడుకొంట
మొల్లలు కోయఁగఁబోతేను–చెంచులవాబ
మొల్లలెల్ల మల్లెలాయెరా ॥౨॥

రాతిరి పొద్దున మేము – రాణించు వెన్నెలబైట
గీతము పాడుచునుండఁగ–నోరి చెంచులవాబ
రాతిరి శివరాతి రాయెరా ॥౩॥

జాజిపూల శయ్యమీఁద–జాణతనము లాడుకొంట
రాజిగాఁ బవ్వళించఁబోతే–చెంచులవాబ
జాజులెల్ల సూదులాయెరా ॥౪॥

సొమ్ములఁ బెట్టుకమేము – కొమ్మలందఱముగూడి
సొమ్ముల మెఱయించఁబోతే–చెంచులవాబ
సొమ్ములెల్ల నమ్ములాయెరా ॥౫॥

చంపె॥ ఈరీతి నేలలొయ్యారముగఁ బాడుచును
జేరవచ్చినిలిచిరి చెంచుభామల్ ॥౧॥

కలువపూవులు కానుకలు సేయుగతి నహో
బలవిభుని మీఁదఁ జూపులు నించిరపుడు ॥౨॥

అందులో నొకవెలఁది యలరుబంతికాను
కందించుగతిఁ జేరెనఱపైటజాఱన్ ॥౩॥

మిడిగుడ్లు వెళ్ళుగా మిడిఁ జూడ వెఱచియొక
పడఁతి గడగడవణఁకి కడకడల నిలిచెన్ ॥౪॥

సింగమో మానిసియొ చిత్రమేమిది యనుచుఁ
జెంగటను జేరియొక చెలి తేఱఁజూచెన్ ॥౫॥

చెలియొకతె పారుటాకులు చాటుచేసికొని
తలవంచి యంచలంచలఁ బొంచిచూచెన్ ॥౬॥

ఇంచుల మించుల యంచులతోనొక
చెంచులలన చెలియంచున నిలిచెన్ ॥౭॥

క. ఆ నెలఁతలలో నొక్కతె
పై నిగిడెన్ హరికటాక్ష భరవిస్ఫురణల్
సూనశరాసన ముక్తన
వీనోజ్జ్వల దలఘు విశిఖవీచులనంగన్॥

జంపె॥ ఆచూపు నిగిడించుచుండగాఁ జేసికొని
యాచెలువమీఁది మోహము గ్రమ్మె హరిని ॥౧॥
ఆమోహములు గ్రమ్ముచుండగాఁ జేసికొని
కామబాణౌఘములు గ్రమ్ముకొనె హరిని ॥౨॥
ఆయస్త్రములు గ్రమ్ముచుండగాఁ జేసికొని
కాయజ వికారసంఘము గ్రమ్మె హరిని ॥౩॥

వ. ఇట్లు మదన విశిఖ నిర్భిన్న మానసుండై యన్నరహర్యక్షుం డచ్చపలనయన రూపంబున కచ్చెరువంది తదీయాంగసౌందర్యంబేమని వర్ణించుచున్నాఁడు.

క. పదములు పల్లవశోభా
స్పదములు తూణీరకాంతి సంఘల్ జంఘల్
కదళీ విహారములూరులు
చదరంబున భూమికరుదు జవ్వని పిఱుఁదుల్॥

క. వడుమూ పిడికిటి కణఁకువ
కడమూ చక్కఁదనమెంతగా వర్ణింతున్
కడుమానిని రూపొక్కటఁ
గడమా ! విడు మాటలేల కలరా పోల్పన్

జంపె॥ పలుమాఱు వడిసుళ్ళఁ బడుననుచుఁ గొలఁకులను
గిలకిలను జేరి పొక్కిలి యందమలరెన్ ॥౧॥

అటతాళము॥ ఆరో చిల్కల బారో కృష్ణాహి
తీరో యమున బిడారో లాలా
చండ్లో గజనిమ్మ పండ్లో బంగారు
గిండ్లో కాయజుని విండ్లో లాలా ॥౨॥

జంపె॥ వెలిదైన తమ్మితూఁడుల బాగు నిరసించి
కలకలను నగును బాహులు చక్కఁదనము ॥౧॥
నిగ్గులను ధళధళల జగ్గుకొని కడుమించు
వెగ్గలపు శంఖమున కగ్గలము గళము
నాసయో నువుబువ్వోటాసయో చంపక వి
కాసయో కాంతులమొకాపయో లాలా ॥3॥
మోవియో పగడంపు దీవియో కెంజిగురు
కోవియో చెలియకె మ్మోవియో లాలా ॥౪॥

ఏకతాళము॥ మోమో శ్రీసతి గీమో ముకురపు
గోమో సోము గారామో లాలా ॥౫॥

మీలో కలువలచాలో మరుని బా
ణాలో కనుఁగవ డాలో లాలా ॥౬॥

ఇరులో తేఁటుల సిరులో నీలపు
సరులో చెలియ ముంగురులో లాలా ॥౭॥

ఒఱపో బంగరుటారపో సంపంగి
తెఱపో చెలిమేను మెఱపో లాలా ॥౮॥

వ. ఇవ్విధంబునఁ దదీయాంగసౌందర్యంబు వర్ణించి యన్నరసింహదేవుం డత్తరుణి భయంబు వోమీటుటకై కోటికందర్పలావణ్యోల్లసితమూర్తి విస్ఫూర్తి ధరియించె అంత.

ద్వి. అతని రూపముచూచి యాచెంచులలన
యతులితానంద బృందాంబుధిలోన
నోలలాడుచును సమున్నతిఁ జెంది
హాళి నాహార నిద్రాదులు విడిచి
కళవళించి యఱమోడ్పు కనుదోయితోడఁ
గలఁక నొందక తదేకధ్యానమునను
బొలుపుమీఱుచు యోగపురుషునిరీతిఁ
దలఁచుచు నొకకొంతదవ్వు నైమఱచి
యంతలోఁ దెలిసి చయ్యన సిగ్గుతోన

నెంతయుఁ దలవంచి యిప్పుడీ చెలులు
చెలఁగుచు గేలిసేసెదరంచు వెఱచి
యులుకుచు బెళుకుచు నటునిటుచూచి
మొదుఁగుచుఁ బోఁదల్చి యొక నెపంబునను
బొదరింటి పజ్జకప్పుడు పోయి నిలిచె.

గీ. నిలిచి యచ్చట నాచెంచు నీలవేణి
యలపు సొలపుల నసురుస్సురనుచు మెలఁగి
చెలఁగి పూఁబానుపున మేను సేర్చి యతని
లలిత లావణ్యసంపదల్ తలఁచుచుండె.

క. అప్పుడు పంచశరుఁడు తన
కిప్పుడె సమయంబటంచు హేరాళముగా
నప్పడఁతుకపై శరములు
గుప్పున నాటంగ సేసెఁ గుశలతమీఱన్॥

ఆటతాళము॥ కమ్మవిలుతుఁడు చెలఁగి యమ్ముల గుమ్మ
గాను, ఆయమ
నెమ్మిఁ దాలిమి లేక మిక్కిలిసొమ్మసిల్లెన్ ॥౧॥
ఎచ్చటెచ్చటఁ జప్పుడైనను మచ్చకంటి, దిక్కుల
నచ్చటచ్చటఁ జూచె నదిగో వచ్చెననుచు ॥౨॥
అతని మధురవిలోకనామృత మబ్బియుండన్, మిక్కిలి
సతికిఁ జక్కెరపాలు నోటికసహ్యమాయెన్ ॥3॥

కుఱుచ॥ ఏకతాళము॥ రేకులు॥

అలఁతి సొమ్ములు మిక్కిలి వదులాయెన్ ॥౧॥
చెలికి వెలుఁగులుచూడఁ జీఁకటులాయెన్ ॥౨॥
వెలఁదికిఁ బన్నీరు వేఁడిగఁ దోఁచెన్ ॥౩॥
ప్రాణాలు మోయుట భారములాయెన్ ॥౪॥
చెలువకు మధురము లేదనిపించెన్ ॥౫॥
సొగసులు పెట్టుట వెగటుగఁ దోఁచెన్ ॥౬॥

జంపె॥ అంతలో నొకచెంచు - కాంత యచ్చోట వా
సంతి లేదని పలికె - జవ్వనుల తోడన్ ॥౧॥
ఆపలుకు విని పడఁతులందఱచ్చెరువంది
యాపజ్జ నెలఁతఁబాయక వెదకి రంత ॥౨॥
అప్పుడొక నాతి యాచొప్పుగని యందఱికి
నప్పుడఁతి యున్న చోటప్పుడే చూపెన్ ॥౩॥
చూపినప్పుడె చెంచుసుదతు లప్పుడుచేరి
యాపొలఁతిబాగు చయ్యన చూచిరంత ॥౪॥

వ. చూచి యాచెంచుభామ లచ్చెరువందుచుండిరి. అందులో నొక్కవధూటి యాకొమ్మతో నేమనుచున్నది.

క. ఓ వాసంతిక, యిచ్చట
నీవుండన్ మఱి విచిత్ర; మేమో నాతో
నీ వృత్తాంతము తెలుపుము
నీ వేటికి దాఁచెదింక నీరజవదనా !

జంపె॥ అనిన విని యా చెంచు వనిత నెచ్చెలితోన
మొనసి తలవంచి సిగ్గున నిట్టులనియెన్ ॥౧॥
ఓ వారిజాక్షి, విను మీ వెంట నెనువగిలి
యీ వనంబునకు నేనేల వచ్చితిని ॥౨॥

త్రిపుట॥ వచ్చి మఱి నేనుండఁబట్టక పచ్చిసొగసులు పెట్టుకొని నే
నచ్చటను హరినేలచూచితి మచ్చెకంటీ ॥౩॥
చూచి మీ వలెనుండకొక తమి
రేచుకొని హరి నేల వలచితి
నో చెలీ యిది దైవవశమిఁక దాఁచనేల ॥౨॥
అతనికిని నేనెట్టు వలచితి
నతఁడును నాకెట్టు వలచెనో
యితరులెల్లను నవ్వ నీపడి యేలవచ్చెన్॥ ॥౩॥

ద॥ దైవకృత మెవ్వరికిఁ దప్పింపఁగారాదు
నీవేల మదిని చింతించెదవె కొమ్మా ॥౧॥
అతనిఁ దోడుకవచ్చి యతనుబాధలు మాన్ప
గతినీవె నన్నిపుడు గడతేర్చవమ్మా ॥౨॥
చాన, నా నేరములు పూని[illegible] దగదు
మానవతి, యీ తప్పు [illegible] ॥౩॥

వ. అని యవ్వాసంతిక తనపా[illegible]త్తాంతం
జెప్పఁగించి మఱికొంతసేపు స[illegible]బున

తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయము హైదరాబాదు

సూర్యాస్తమయము :

త్రిపుట॥ వరుణ దిక్సతి కనకకలశము
శరధి రశ్మిని గట్టిచేదఁగ
బనువునను దెగిపడియె ననఁగాఁ
దరణి గ్రుంకెన్ ॥౧॥
సమయ హేమకరుండు నభమను
కమటసూన స్వర్ణంబు కఱఁగి జ
లమున నద్దిన పసిఁడిపూదెన
ద్యుమణి గ్రుంకెన్ ॥౨॥
పతుల మీఁదను నెట్టుకొను మద
వతుల యనురాగమ్ములు బహి
ర్గతములయ్యెనొ నాఁగ సంధ్యారాగమలరెన్ ॥౩॥
సమయమనుజగజెట్టి యాకా
శమును గరిడీఁజేయు మట్టినా
రమణతోఁ జెలువందె సంధ్యారాగమపుడు ॥౪॥
నిరపరాధ వధూవధోద్ధతి నికరటంబై బలసి చెలసిన
మనని యపయశమనఁగ దిక్కుల
నిరులు గవిసెన్ ॥౫॥

త్రిపుట॥ జరిగి చీకటి మరుగుచేరెడు
జారచోరులఁ బట్టితెమ్మని
మరుఁడుపంపిన తలవరస హిమ
కరుఁడు వొడమెన్ ॥౧॥

ఆట॥ అమరదూర్వున నమరసామ్రా
జ్యాధిపతికిని వెలయఁబట్టిన
విమలమగు జగజంపుగొడుగన
విధుఁడు వొడమెన్ ॥౨॥

త్రిపుట॥ మరువజీరుని యుగ్రిధాటికి
వెఱచి సురపతి కొలుకొలని
సరవి నెత్తు సుధాకలశమనఁ
జంద్రుఁ డొదవెన్ ॥3॥

జంపె॥ తనసందనుని రాకఁ గని సుధాంభోధి మిం
టను వెల్లివిరిసెనోయనఁ జంద్రికలరెన్ ॥౧॥
చెంగటను విరహిణుల - భంగపాటరసి ప్రా
గంగన హసించెనో - యనఁ జంద్రికలరెన్ ॥౨॥
అరయ విరహిణులౌది - గంగనామణితతుల
విరహ పాండిమమనఁగ - వెన్నెలలు ప్రిబలెన్ ॥3॥

వ. అప్పు డక్కన్యకా శిరోమణి శుకపికాదిరవమ్ములకో ర్వక ప్రాణసఖితో నేమనుచున్నది.

జంపె॥ ......కృతమె చేకొమ్మా మరుఁడు
గురిమ్మసాగెనె ముద్దుగుమ్మా ॥౧॥
విరహమున నేదాళఁగలనా ప్రాణ
విభునిఁ దోడుక రావె లలనా ॥౨॥

ప్రాణపదమైన మాయతమా – శత్రు
నై నిల్చె నిపుడు నాతరమా ||౩||
మున్ను ఏకగ్రీవముగను – మెలఁగు
చున్న పిక మేఁచెనే పగను ||౪||
మొగ మెఱుకగల చందమామ – యెంత
పగయాయెనే నేఁడు భామా ||౫||
పలుకుతోడై యున్న చిలుక – యెంత
యలయించెనే యశ్రులొలుక ||౬||
ఏచుట గాఁబోలు వ్రతము – ఎంత
యేచెనే యీ మధువ్రతము ||౭||
ఇంతగాఁ బెరిగి నావంక – నిప్పు
డెంత సేసెనె గోరువంక ||౮||
ఈ సొమ్ము నీకు వారకము – ఇప్పు
డేసల్పు భయ నివారకము ||౯||

జంపె॥ జలజాక్షి యీరీతిఁ జంద్రముఖులను దూఱి
లలిమీఱఁ జంద్రముఖులను దూఱెనపుడు ||౧||
చందురా యెంతముచ్చందురా యింత తె
చ్చందురా లేక నిచ్చందురా నిన్నున్ ||౨||
వెన్నెలా యివికొన్ని చిన్నెలా నాసాటి
వన్నెలాడులలోన సన్నె వేఁగించన్ ||౩||
కీరమా నీకింత బీరమా యిదియింత
ఘోరమా లేక హంకారమా యేఁచన్ ||౪||

తుమ్మెదా నీవిల్లె గ్రిమ్మి దాయలలోన
దొమ్మిదారికి రాక నమ్మితా నుంటిన్ ॥౫॥
చందమామకుఁదోడు చందమా యిప్పుడా
నందమా నన్నేఁచ మందమారుతమా ॥౬॥

వ. మఱియు నేమని దూఱుచున్నది.

ఏకతాళము॥ పికమా సుకలాపకమా యేఁ
పక మానవు చంపకమా ॥౧॥
చెలువా నావంటి చెలువ నేఁచఁ
గలువా యిది నీకలువా ॥౨॥
పద మాటికిఁ జలపదమా నీకు
ముదమా యేఁచఁ గుముదమా ॥౩॥
తరమా నన్నిటు తఱమ పు
ష్కరమా యిది ముష్కరమా ॥౪॥
రకమా జనమారకమా పో
రక మానవు కోరకమా ॥౫॥

మన్మథుని ఏమని దూఱుచున్నది :

ఏకతాళి॥ ఓరీ నావంటి నారీమణినేఁచ
దారిగాదు శంబరారి నీకున్। ॥౧॥
మారా నీరూపమారా! నన్నిట్లు
మారాముల్లుపెట్ట మేరా నీకున్

నిన్నారక వేఁడిన న్నారింపవు
నన్నాడింపవు పుష్పధన్వా నీ తే ||౨||
శంకమునిచే నహంకార ముడిగి
యింకా యేఁచెదవు మీనాంకా నన్నున్ ||3||
మదనా మాన సదనా నీకిది
యదనా శరములు నాయెదనాటించన్ ||౪||

జంపె|| కదనాన నన్నేయ నదనాయెనా నీకు
నెదనాటి శరమంత పదనాయె మదనా ||౫||

వ. ఇవ్విధంబున నవ్వాసంతిక విరహవేదనలఁ బొదలుచుండఁ దత్సఖీ శిఖామణి యన్నరసింహదేవు సముఖంబునకుఁబోయి

జంపె|| రతికాంతుగుఱుఁ దున్న లతికాంతరముఁజేరి
లతకూన విధము లోలతపూని తెలిపెన్||

క. స్వామీ మా వాసంతిక
నీమీఁదన్ మేలుపడి సునిశ్చలమతియై
వేమాఱు నిన్నె దలఁచుచు
నీమీఁదనె కలవరించు నీరజనాభా.

జంపె|| త్రిభంగులు రేవగుప్త||
కలికి శుక పికావళికి.........
నిలలేక యలికి నినుదూఱెన్ ||౧||
మగువ విరహమునఁ బొగువ నేఁచుటకు
దగవా కంటినీ తెగువ బిగువంతన్ ||౨||

తుంట విలుతుఁడు దంట తూపులై
దింట నేసె నెదకంట వాల్గంటిన్ ॥౩॥

చిలుక మధురసము చిలుకఁ జెలరేఁగి
పలుకఁ జెలిమేసఁ బులక లిగురొత్తన్ ॥౪॥

నెలకుఁ బండు వెన్నెలకు గండుఁ గో
యిలకుఁ బవను కాఁకలకుఁ జెలియళుకున్ ॥౫॥

మఱియు నేమని దూఱుచున్నది :

ఏకతాళి॥ భవనారీనుతిభవనా, త్రిభువనా హితశుచిభువనా ॥౧॥
కమలాస్పద హృత్కమలా ! పాతక మలాపనుద
పదకమలా ॥౨॥

అల మారవిభుండలమ నింత
చలమా యిది నిచ్చలమా ॥౩॥
అళికీరాద్యావళికి నెంతో
యలికెరా మా కలికి ॥౪॥

జంపె॥ వేదండగమన నీవే దండ యని మదిని
వే దండములుపెట్టు వేదండవరదా ॥౧॥
సారంగనయన వేసారంగ వచ్చితి మన
సారం గటాక్షించు సారంగవరదా ॥౨॥
నీకుమ్మనసుతోన మాకొమ్మపంపెనిది
కోకొమ్మ ముద్రికను గైకొమ్మనీవు ॥౩॥

వ. అనిన విని యన్నరసింహదేవుండు దరహసిత లసితవద
నుండై యవ్వాసంతిక నిచ్చటికిఁ దోడుకొనిరమ్మని యనుగ్ర
హించిన, నచ్చంద్రవదన యప్పొదరిండ్లచెంత కప్పుడేపోయి
నిలిచిన, నాదూతి లక్షణంబుచూచి యవ్వాసంతిక చెలితో
నేమనుచున్నది.

క. ఓయమ్మా వచ్చితివే
కాయజగురుఁ డేమియనెనో! కాయోపండో!
మాయలు చెప్పకు నాతోఁ
బోయినపని యెట్టులైనఁ బొసఁగెనో లేదో!

జంపె. అనిపలుకు వాసంతికనుజూచి యాసకియ
పెనఁగొనిన సంతోషమున నిట్టులనియెన్ ॥౧॥
వనితరో పూసగుచ్చినరీతి నీ తెఱఁగు
మునుపుగా నారసింహునికిఁ దెల్పితిని ॥౨॥
తెలిపినంతనె యతఁడు తెలిసికొని కరుణించి
యలవుగా నామనవు లంగీకరించెన్ ॥౩॥
తోడఁబడఁగ జాతిసుద్దులు వేయునననేల
పడఁతిరో నీతపము ఫలియించెనమ్మా ॥౪॥
అతివ, జగదేకనాయకుఁడు చేపట్టెనని
మతిలోన నుప్పొంగి మఱువకోయమ్మా ॥౫॥

త్రిపుట॥అనిన విని వాసంతి కప్పుడు మనసులో నుప్పొంగి
చెలఁగుచు
మనసిజుని సామ్రాజ్య మేలినమాడ్కినుండున్ ॥౧॥
అంతలో నా చెంచెతలు వాసంతికను దమ వెంటఁ
బెట్టుక
కంతుగురుఁడు వసించుచోటను గలిసి నిలువన్ ॥౨॥
నిలిచినంతనె శ్రీనృసింహుఁడు నీల వేణులలోన
మును దా
వలచియుండిన తరుణిఁ గనుఁగొని చెలఁగుచుండెన్ ॥3॥

వ. అయ్యెడ నా చెంచుభామినులు తమ వాసంతికను అయ్యహోబల వీరనారసింహ దేవునికి వివాహము సేయఁదలఁచి శుభముహూర్తమున నయ్యెగువురకుఁ దలంటఁబూని శోభనాలు పాడిరఁట యెటువలెను,

ద॥ చంపకగంధులు గుదియింపు సొంపులతోన
సంపఁగితైలము సిరసంటిరి చెంచొబళపతికి॥

పల్లవి॥ శోభనమె గుణనిధికి-శోభనమె శ్రీపతికి
శోభనమె శ్రీసతికి-శుభగుణవతికిన్ ॥౧॥
పంకజాక్షులు రత్న-కంకణరవములు సెలఁగ
పొంకముమీఱఁగ సిరసంటిరి-పూవుఁబోణికిని ॥౨॥
నీరజనయనలుకంఠ-హారములుయ్యాలలూఁగ
నేరుపుమీఱఁగ శిరసంటిరి నీలవర్ణునికి ॥3॥

బాలికలందఱుఁగూడి పయ్యెదచెఱఁగులు జాఱఁ ॥౮॥
దాళగతులతో శిరసంటిరి నీలవేణికిని

కొప్పునఁ బువ్వులు వదలఁ గుచయుగము ల్లన గదల
కప్పురగంధులు సిరసంటిరి యప్పుడు దేవునకు ॥౯॥

సువ్వాలలు॥ రూపకము॥

ఇందుముఖులు బంగారుకుందెన కస్తురిరాజనాలు
పొందుగనిలువు రోకండ్లతోఁ బొసఁగదంచిరి॥ సువ్వి
సువ్వి సువ్వాలె॥

సువ్వి భక్తభరణరంహ_సువ్వి దనుజేభసింహ
సువ్వి చెంచునారసింహ సువ్వాలె ॥౧॥

ముదము దనర సొగసుగాంచి_పొదలికలను మేనువంచి
సుదతులెల్ల దంచిరపుడు సువలఁ బాడుచు ॥౨॥

శృంగారవతులుగూడి చెలఁగి చెలఁగి పాటపాడి
యంగజగురునిమీఁద సుంకు లమరఁ జెరిగిరి ॥౩॥

జంపె॥ లలిమీఱ నొకచెంచులలన వాసంతికచే
నలుగు వెట్టించె (శ్రీ)నారసింహునికి ॥౧॥

నలిగట్టు పట్టి వాసంతికాంగనకు
జలజనాభునిచేత నలుగు వెట్టించెన్ ॥౨॥

అసదుగా జాజికాయటకలిని దలఁబులిమి
యిసవురికి జలకమ్మార్చిరి మానవతులు ॥౩॥

చంపకాంగులు మంచి చలువపుప్పటముచే
దంపతుల కయ్యెడను దలలొత్తిరంత ॥౮॥

అరచందురుని గేరి యలరు ఫాలినెన్నుదుటఁ
దెఱఁగొప్పఁ గస్తూరి తిలకమిడె నొకతె ॥౯॥

సకలలోకాధినాయకుని శిరమున రత్న
మకుట మటు సవరించె నొక నీలవేణి ॥౬॥

మకరకేతనుఁ గన్న మనుజహార్యక్షునకు
మకరకుండల మొక్క మగువ సవరించెన్ ॥౭॥

రమణియొక్కతె రమారమణునకు రాణింప
రమణతోఁ గంఠహారములు సవరించెన్ ॥౮॥

త్రిపుట॥ సంగతిగ నొక మోహనాంగియు
సరసిజాక్షుని బాహుయుగమున -
నంగదమ్ములు సయిరణించెను రంగుమీఱన్ ॥౧॥

మూఁగికొని మేఘుంబుచెంగటఁ దీఁగమెఱపులు
మెఱయుకైవడి
బాగుగా మాధవుఁడు పీతాంబరము దాల్చెన్ ॥౨॥

సకలభూషల కాంతిపుంజము-చొకళింపుచునుండ శ్రీనా
యకుఁడు జ్యోతిర్మయుఁడను నామకరణము దాల్చెన్ ॥౩॥

వ. అపుడచ్చెంచుకాంత లవ్వాసంతికకు శృంగారించిరఁట
యెటువలెను.

ఏకతాళము॥ అనద్భుతముగ నొక కుసుమగంధి యా
కిసలయపాణికిం గీల్జడ దాల్చెన్ ॥౧॥

కడుసొంపున నొక కప్పురగంధి యా
పడంతికి ముత్తెపుం బాపట దీర్చెన్ ॥౨॥

లలన యొకతె ముద్దు చిలుకంగం జిలుకల
కొలికికి మృగమద తిలకము దిద్దెన్ ॥౩॥

సొగసుమీఱంగ నొక చిగురాకుంబోండి యా
మగువకుం గెంపుల బుగడలు పెట్టెన్ ॥౪॥

పొంకముగానొక కుంకుమగంధి యా
పంకజముఖికిం దాటంకము లిడియెన్ ॥౫॥

రంగుగనొక్క కురంగనయన మోహ
నాంగికి ముత్తెపు ముంగరం బెట్టెన్ ॥౬॥

ముత్తేలదండలు మొగపూలతీగయు
బిత్తరి కిడె నొక బిబ్బోకవతియు ॥౭॥

రమణచెలంగ నొక రమణీశిరోమణి
కమలగంధికి సందెకడియము లిడియెన్ ॥౮॥

మెఱుంగు కడియాలు మెఱుంగైనగాజులు
సరసిజాక్షికి నిడె నెలంతయు నొకతె ॥౯॥

బిల్లల మొలనూలు బిగువుటొడ్డాణము
మొల్లమినిడె నొక పల్లవపాణి ॥౧౦॥

ఝంపె॥ శంసితలకు దృగవతంసమ్మై గనిపింప
హంసగమనకు నొకతె హంసకము లిడియెన్ ॥౧॥

గిలుకు మట్టియలు బొబ్బిలికాయలును సతికి
హాళిగాఁ బిల్లాండ్లు హవణించె నొకతె ॥౨॥

చెలియ బంగరుకమ్మి చెఱఁగులను రాణించు
జిలుఁగు చందురకావి చీరధరియించెన్ ॥౩॥

వెలలేనిపని ముఖమలుచేతఁ గడుమించి
విలసిల్లునట్టి రంగులరవిక దొడిగెన్ ॥౪॥

త్రిపుట॥ కమలసంభవుఁడప్పుడు సుముహూ
ర్తమున మానవహారిని మణిపీ
ఠమున నునిచెను తూర్యారవములు రమణఁ జెలఁగన్ ॥౧॥

మంతుగా మణిపీఠమునను వ
సంతుఁడును దన కూఁతురగు వా
సంతికను దగనునిచె నరకేసరికి నెదుటన్ ॥౨॥

రట్టు పగతుఁజ మట్టిపెట్టిన
యట్టి దిట్టకుఁ జెంచురాయల
పట్టికిని జిగిదుప్పటియుఁ
దెర పట్టి రపుడు ॥౩॥

మధువైరియైనట్టి మనుజహర్యక్షునకు
మంగళముగఁ గమలజుఁడు మధుపర్కమిడియెన్ ॥౧॥

గరిమను వసంతుఁడును గగనధునికిరవైన
హరిచరణములు గడిగె మెఱుఁగుపళ్లెమున ॥౨॥
ఘనముగ వసంతుఁడు త్రికరణముగ శ్రీహరికిఁ
దన యభీష్టముదీఱఁ దనయ నర్పించెన్ ॥౩॥

త్రిపుట॥ అరుదుగాఁ దెర కడకుఁదీసిన
యంతనే దంపతుల కప్పుడు
సరవితో సన్యోన్యముఖ దర్శనముగలిగెన్ ॥౧॥
తెలియ మాధవుఁజూచి వాసం
తికయుఁ జెలఁగినరీతిఁ దమి సం
ధిలగ మాధవుఁజూచి వాసంతికయుఁ జెలఁగెన్ ॥౨॥

అప్పుడు॥

ఆటతాళము॥

తురతురగా దివినుండి సురదుందుభులు మ్రోసెన్ దిక్కుల
వరుసతో జలజలను పూవులవానగురిసెన్ ॥౧॥
ఆడిరచ్చర లచ్చటచ్చట హర్షముగను చెలఁగుచుఁ
దోడనే గంధర్వవరులును బాడిరచట ॥౨॥

జంపె॥ మొల్లమిగ హరి పార్శ్వమునఁ బార్వతియు శచియు
నుల్లసిల దీపాల పళ్లెంబులిడిరి ॥౧॥
పరఁగ వాసంతికా భాగమునఁ జెంచెతయు
వరుసతో దీపాల పళ్లెమమరించెన్ ॥౨॥

త్రిపుట॥ నీలగిరిపై హిమకణంబులు నెఱసియుండినరీతి హరిపై
బాలికయుఁ దెలిముత్తెముల తలఁబ్రాలునించెన్ ॥౧॥

భ్రమరకమ్ముల సుమపరాగకణములు నిండినరీతిఁ
బ్రమదా
భ్రమరకమ్ముల మనుజహరి తలఁబ్రాలునించెన్ ॥౨॥

పూనుకొని లవణాంబురాశిని ఫేనలవములుగప్పురీతిని
మానవతి తలఁబ్రాలునించెను మనుజహరిపై ॥3॥

కప్పుఁ జీఁకటిలోనఁ జుక్కలు గానవచ్చినరీతి నిజసతి
కొప్పునను దలఁబ్రాలునించె ముకుందుఁడపుడు ॥౪॥

అంగనయుఁ దనవరుని మునుపటి దొంగతనములు
బయలుపుచ్చుట
కంగభవ జనకునికిఁ దలఁబ్రా లమరనించెన్ ॥౫॥

అళికులమ్ములమీఁద దుమికిన యమరగంగాజల
కణములనఁ
గలికిజడపై హరియుఁ దలఁబ్రా లమరనించెన్ ॥౬॥

మెరసి శిరములనుండి యిరువురి మేనజాఱిన
మెఱుఁగు ముత్తెము
లరయ సాత్త్వికఘర్మబిందువులనఁగఁ జెలఁగెన్ ॥౭॥

జంపె॥ కళలచే సర్వమంగళమించు చెంచు మం
గళవతికి హరియు మంగళసూత్రమిడియెన్ ॥౧॥

పొంకముగ భక్తులను బోషింప సతితోనఁ
గంకణము కట్టుకొనెఁ గమలాక్షుఁడపుడు ॥౨॥
రంగుగా నవమోహనాంగికిని శ్రీహరికిఁ
గొంగు ముళ్లిడిరి గ్రక్కున మానవతులు ॥౩॥

త్రిపుట॥ నీలవర్ణుండపుడు వాసంతికను జిటికెనవ్రేలుపట్టుక
హేళితోడ వివాహవేదిక కరిగెనంత ॥౧॥
సురకులేశుఁడు పెండ్లిపీటను సొరిదిగా దంపతుల
నునిచెను
పరిపరివిధమ్ములను రమణులు పాటపాడన్ ॥౨॥
మురిపెమున ముత్యాలబాసికమును ధరింపుచుఁ
జెలఁగెనప్పుడు
మురహరుండు త్రికూటపర్వతమోయనంగ ॥౩॥
తనదు లావణ్యాంబురాశికి దర్పకుఁడుగావించు తెప్పన
వనిత ముత్తెపు బోడ బాసికమును ధరించెన్ ॥౪॥

వ॥ తదనంతరంబ॥

జంపె॥ కమలజుఁడు హరిచేతఁ గల్యాణితోఁగూడఁ
గ్రమముగా లాజహోమము వ్రేలిపించెన్ ॥౧॥
ముదముతో బ్రహ్మణి పోలవాసంతికా
సుదతిచేతను సప్తపదులు త్రొక్కించెన్ ॥౨॥
అంబుజాసనుఁ డప్పు డాదంపతులచేత
డంబుగా ధ్రువ దర్శనంబుచేయించెన్ ॥౩॥

వ॥ ఇవ్విధంబున సఱ్యహాహోబలవీరనారసింహదేవుఁడు గాంధర్వవివాహమున వాసంతికను బరిగ్రహించి, సకలదివిజసంఘంబులకు నుచితసత్కారంబులు సవరించి యథేచ్ఛావిహారణంబు సలుపుచున్న సమయంబున.

త్రిపుట॥ హరి వివాహము చూచుటకునై యరుణసూర్యులఁ బిలిచినందుకు
గుఱుతు గొక్కొకొక్కో యనుచు కుక్కుటము కూసెన్ ॥౧॥

అరుణుఁ డప్పుడు గదలఁగలవాఁ
డగుచు ముందుగఁ బంపు దూతన
సొరిదిగా మఱి తూర్పుదిక్కునఁ జుక్కపొడమెన్ ॥౨॥

మొల్లమిగఁ బ్రాక్సతియుఁ బరిణయ
మునకుఁ బిలువరటంచు మోమటు
తెల్లసేసెనొయనఁగఁ దూరుపు తెల్లనాయెన్ ॥3॥

జంపె॥ అరుణోదయంబయ్యె నరవిందములఁ జెలఁగి
దొరలుకొను తుమ్మెదలచెఱ విఱుగుడాయెన్ ॥౧॥

కలువలకు సిరిసడలెఁ గటికిచీఁకటి వెడలె
కొలకొలను పక్షిజాతులు వలుకసాగెన్ ॥౨॥

దివ్వెలకుఁ బ్రభతొలఁగె దిక్కులకుఁ గళగలిగె
నివ్వటిలు చుక్కలకు నెఱిలేమిడాసెన్ ॥3॥

త్రిపుట॥ హరికి నపుడశ్విలిని బెండ్లికి
సురపతియు జతగూర్చి తెచ్చిన
మెఱుఁగుఁ గనకపుటరిగె యనఁగాఁ
దరణి వొడమెన్॥

వ. అప్పుడు సూర్యోదయానంతరంబున నన్నరసింహదేవుఁడు పట్టణప్రవేశమున కుద్యుక్తుఁడై నిజామాత్యుం బిలిచి, పట్టణము సింగారించుమని యానతిచ్చిన, వారలు పట్టణము సింగారించిరఁట యెటులనెను.

జంపె॥ తీరుగా నవరత్న తోరణమ్ములచేత
నా రాజధాని సింగారించిరపుడు ॥౧॥

మేరువుల గుమిచేత మేలుకట్టులచేత
నారాజవీథులను సైరించిరంత ॥౨॥

పట్టుకుచ్చులచేతఁ బసిఁడిలోవులచేతఁ
బట్టణంబునకు జృంభణచేసిరంత ॥౩॥

వీథివీథులవారు వింతరచనలుచేసి
మాధవుని రాకలకు మఱియెదురుచూడన్ ॥౪॥

త్రిపుట॥అంగజగురుఁ డంతఁబురికి ని
జాంగనలతోఁ గూడికొని చతు
రంగబలములతోన గదలెను రంగుమీఱన్ ॥౧॥

కంతుగురుఁడు వాసంతికను చతు
రంతయానము నందుఁ జేర్చుక
మంతనంబున నిజపురమునకు మఱలెనపుడు ॥౨॥

సిరియుఁ బుడమియుఁ దాను వేడుక
గరుడతురగము నెక్కి చెలఁగుచు
గరిమమీఱఁగ నిజపురమునకు వెడలెనపుడు ॥3॥

వ. అప్పుడు పంచమహావాద్యరభసంబుల దిక్కులు పిక్కటిల్ల నయ్యహోబలవీరనారసింహదేవుండు రాజవీధుల మెరవడిగా వచ్చుసమయంబునందు, అరుంధతి గౌరి శచిప్రముఖులైన పురంధ్రీమణులు తిన్నగా ధవళములు పాడిరఁట యెటువలెను.

జయజయ మునిజనగేయా జయజయ మోహనకాయా
జయజయ త్రిదశవిధేయా జయ చెంచుల ఓబలరాయా
శ్రీకరముగ గిరితటమున జోకఁ జరించుచున్న వీలుగని
వాసంతికఁ జేకొను శ్రీనారసింహా ॥౨॥

చెంచులవేషముగైకొని చెంచులలోఁ దిరుగాడి
చెంచెతకును మోహించిన చెంచుల శ్రీనారసింహా ॥3॥

శ్రీలలనామణిఁగూడి లీలతో భూసతిఁగఁ దెలిసి
లాలింపుచు వాసంతిక నేలిన శ్రీనారసింహా ॥౪॥

కలుములు బలుములొసంగి చెలఁగుచు జనులఁ బోషింపుచు
నిలలోభక్తులపాలిటఁ గలిగిన శ్రీనారసింహా ॥౫॥

త్రిపుట॥ హరికి నపుడర్మిలిని బెండ్లికి
సురపతియు జతగూర్చి తెచ్చిన
మెఱుఁగుఁ గనకపుటరిగె యనఁగాఁ
దరణి వొడమెన్॥

వ. అప్పుడు సూర్యోదయానంతరంబున నన్నరసింహదేవుఁడు పట్టణప్రవేశమున కుద్యుక్తుఁడై నిజామాత్యుం బిలిచి, పట్టణము సింగారించుమని యానతిచ్చిన, వారలు పట్టణము సింగారించిరఁట యెటువలెను.

జంపె॥ తీరుగా నవరత్న తోరణమ్ములచేత
నా రాజధాని సింగారించిరపుడు ॥౧॥

మేరువుల గుమిచేత మేలుకట్టులచేత
నారాజవీధులను సైరించిరంత ॥౨॥

పట్టుకుచ్చులచేతఁ బసిఁడిలోవులచేతఁ
బట్టణంబునకు జృంభణచేసిరంత ॥3॥

వీధివీధులవారు వింతరచనలుచేసి
మాధవుని రాకలకు మతియెదురుచూడన్ ॥౪॥

త్రిపుట॥అంగజగురుఁ డంతఁబురికి ని
జాంగనలతోఁ గూడికొని చతు
రంగబలములతోన గదలెను రంగుమీఱన్ ॥౧॥

కంతుగురుఁడు వాసంతికను చతు
రంతయానము నందుఁ జేర్చుక
మంతనంబున నిజపురమునకు మఱలెనపుడు ॥౨॥

సిరియుఁ బుడమియుఁ దాను వేడుక
గరుడతురగము నెక్కి చెలఁగుచు
గరిమమీఱఁగ నిజపురమునకు వెడలెనపుడు ॥౩॥

వ. అప్పుడు పంచమహావాద్యరభసంబుల దిక్కులు పిక్కటిల్ల నయ్యహోబలవీరనారసింహదేవుండు రాజవీధుల మెరవడిగా వచ్చేసమయంబునందు, అరుంధతి గౌరి శచిప్రముఖులైన పురంధ్రీమణులు తిన్నగా ధవళములు పాడిరఁట యెటువలెను.

జయజయ మునిజనగేయా జయజయ మోహనకాయా
జయజయ త్రిదశవిధేయా జయ చెంచుల ఓబలరాయా
శ్రీకరముగ గిరితటమున జోకఁ జరించుచున్న వీలుగని
వాసంతికఁ జేకొను శ్రీనారసింహా ॥౨॥

చెంచుల వేషము గైకొని చెంచులలోఁ దిరుగాడి
చెంచెతకును మోహించిన చెంచుల శ్రీనారసింహా ॥౩॥

శ్రీలలనామణిఁగూడి లీలతో భూసతిగఁ దెలిసి
లాలింపుచు వాసంతిక నేలిన శ్రీనారసింహా ॥౪॥

కలుములు బలుములొసంగి చెలఁగుచు జనులఁ
బోషింపుచు
నిలలో భక్తులపాలిటఁ గలిగిన శ్రీనారసింహా ॥౫॥

జంపె॥ తరుణులప్పుడారీతి ధవళాలు పాడఁగా
గరుడాధిరూఢుఁడై నరసింహుఁ డలరెన్ ॥౧॥
సురటులు గొడుగులు మకరటెక్కెములు ధ్వజము
లిరుఁగడల మిగులఁ గిక్కిరిసి జిగిమీఱెన్ ॥౨॥
భేరీ నినాదములు బిరుదు శంఖధ్వనులు
చారు మర్దలరవము లారూఢిఁ బ్రబలెన్ ॥౩॥
పగలు వత్తులు చకృబాణములు బిరుసులును
వగిన యాకాశబాణము లందగించెన్ ॥౪॥

*   *   *   *

*   *   *   *

వ. ఇవ్విధంబున రాజవీధుల మెరవడిగా వచ్చేసమయం బునం దచ్చటిపురంధ్రీమణు లడుగడుగునకు హారతులెత్తిరఁట యెటువలెను.

నాయకముగాఁ జెంచునాయికను బెండ్లాడి
వేయ . . . . . . . ।
మాయావినోదసంపదలచే విహరించు
శ్రీయహోబల నారసింహునకును ॥శుభమంగళం
శుభమంగళం॥
మంగళము ఘనదివ్యమండలాకారునకు
మంగళము దనుజసంహారునకును ।

మంగళము శతకోటి మదనలావణ్యునకు
మంగళము శ్రీచెంచు మనుజహరికి ॥౧॥

కలుములను బలుములను ఘనసుతులఁ గోదండ
* * * * * నములను గెలిసేసి।
పలు తెఱంగులచేత భక్తులను బోషించి
చెలఁగు లక్ష్మీనారసింహునకును ॥౨॥

అక్షీణబలులైన రాక్షసాదుల నెల్ల
శిక్షించి భువిలోనఁ జెలఁగి చెలఁగి।
అక్షయంబుగఁ బ్రజలకాదువుగా నిలిచి
రక్షించు మనుజ హర్యక్షునకును ॥౩॥

త్రిపుట॥ ఇవ్విధంబున రమణులారతు లెత్తుచుండఁగఁ బ్రజల సందడి
నివ్వటిల్లఁగ నచ్చటచ్చట నిలిచి కదలెన్ ॥౧॥

అంచెలంచెల బిరుదుపాత్రిలు హావముతో నృత్యములు సేయఁగఁ
జెంచహోబలనారసింహుఁడు గాంచె గరిమన్ ॥౨॥

వ. ఇవ్విధంబున మెరవడిగా వచ్చేసమయంబునందు నచ్చటి పురంధ్రిమణులు స్వామిచక్కఁదన మేమని వర్ణించుచున్నారు.

అష్టకాలు: శ్రీగుణముల జగమ్ము లేలఁగఁ జాలు వైఖరివాఁడఁటే।
త్యాగభోగ విహారుఁడే జిగిదనర వెలసినవాఁడఁటే।
బాగు మీఱినవారిలో నెఱబాగుగలిగినవాఁడఁటే।
నాగయానరో రావె చెంచుల నారసింహనిజాతము॥౧॥

భీతజనముల కభయ మొసఁగెడుబిరుదు వానికి సహ
జమనే॥
ఖ్యాతిగా రక్షించఁగల వైఖరులు వానికిఁ గలుగునే।
వ్రేఁతలను వలపింప నేర్చిన వీఁక వానికె చెల్లునే
నాతులందఱు రారె చెంచులనారసింహుని జాతము॥౨॥

అంచగమనలఁ గలియు వేళల నంగజుండనిపించునే

*  *  *  *  *

.  .  .  .  .

# వివేక విజయము



ద్వి. శ్రీమత్సదానంద చిన్మయయోగి
ధీమహితేక్షిత దివ్యప్రకాశు
నాదబిందు కళాది నానాస్వరూపు
పాదుకల్ నిజభావ పదవిని జేర్చి,
భాయుతుల వృషాకపాయీసహితుల
గేయగుణతతుల గిరిశార్ఙ్గభృతుల
భావించి, ప్రకృతికిఁ బరుఁడగునట్టి
యావిమలచిదాత్ముఁడగు పరమాత్మ
నెఱుఁగమిచేఁ బగలెండమావులను
బరఁగంగ నీరని భ్రమసినయట్లు
విన్ను తెమ్మెర వేడివేలుపు నీరు
నెన్నంగఁ బుడమినా నిట్టిభేదములఁ
బొంది ప్రపంచమై పొడసూపుచుండు
మంద ధీయుతులైన మానవులకును
ఎవ్వనిఁ దెలిసిన నివియెల్లఁ గల్ల
రవ్వగు శుక్తిని రజతమన్నట్టు
లట్టి తేజోనిధి యలరాజసమునఁ
బుట్టించి, సత్వముఁ బ్రోచుచుఁ దమము

జేహరింపుచు మాయఁజెలఁగి తానయ్యె
నా హరిహరవిరించ్యాత్మకుండగుచు
నిది రూప మిది గుణ మిది గంధమనుచుఁ
బదపడి యింతంత పరిమాణమనుచుఁ
దెలియ నశక్యమై తేటిన తెలివి
నల నిత్య నిర్మలుఁడై ప్రకాశించు
నిగమ శిరోవేద్యు నిత్యానవద్యు
నగశితు భవనైద్యుఁ డగునట్టియాద్యుఁ
దలపోసి, గురుమతిఁ దప్పక కొలిచి,
వెలయ నల్లవివేక విజయమన్పేరు
సలలితంబుగఁ బుణ్యచరితంబు మిగుల
సింగారమలరంగఁ జెవుల కింపుగను
రంగుగాఁ గవులవురా యని మెచ్చ
నాటకముగఁ గూటనాటకాకలన
ఘాటిచేఁ దగుసూత్రధారియా రాజ
మన్నారుపేర నామదిలోని వేడ్కఁ
జెన్నారుచున్నట్టి శ్రీపతిపేర
శ్రీరమ్యుఁ డా. జగత్ ప్రేరకుపేర
ధీరాంబుజోష్ణ దీధితిపేర (?) వేద
నిచయ గవేషిత నిర్మలుపేర
రచితసృష్టిస్థితి ప్రళయునిపేర
భాసుర చిద్రూప బంధురుపేరఁ
జేసి నాతని వంశశీల మెట్లనిన.

పొందవాకాహ్వాయ పురవాసి, సాంగ
వేదాధ్యయనశాలి విమలమానసుఁడు
చల్లవంశాంబుధి చంద్రుఁడై నిష్ఠ
నెల్లవారలు మెచ్చ హెచ్చిన యతఁడు,
సురుచిరాపస్తంబసూత్రి, కౌండిన్య
వరగోత్రుఁ డద్వైత వాదైకపరుఁడు
సూరభట్టార్యుని సుతుఁడు పాపమ్మ
కోరికన్నట్టి యా గుణగణాకరుఁడు
సూరయార్యుఁడు నాగశోభిల్లు, నతని
నూరిమి యిల్లాలు గుణవంతురాలు
భువిలక్ష్మమ యనంగఁ బొగడొందుసాధ్వి
సవతు లేనట్టి యాసౌభాగ్యగరిమ.
ఆ యిద్దరకు సుతుఁడైనట్టివాఁడు
పాయకరాజగోపాలునిఁ గొలిచి
కవితాచమత్కృతి గాంచినవాఁడు
కవి సూర యను పేరు గాంచినవాఁడు
నాటకముఖముల నవ్యకావ్యములఁ
బాటించి కవివరుల్ బాగుగా నాత్మ
వంశవర్ణన సేయవలెనని కృతుల
సంశయింపకనొక్క సంకేతముగను
వాడికమీఱంగ వావిరిగాను
బాడి తప్పక వారి పదవి చేకొనిరొ.

వ. ఇట్టి కవి నిజకృతి నిర్విఘ్నంబుగా నీడేరుటకై యాకృతి స్వామియగు రాజమన్నారుస్వామి నేమని కొనియాడు చున్నాఁడు.

తోడి॥ జంపె॥ నాట॥

జయ సచ్చిదానందమయ నిర్మలాకార
జయ జగత్పరిపూర్ణ జడతావిదూర
జయ జనిత పాలిత సంహృతాఖిలలోక
జయ పరాపరరూప జయ సదాలోక ॥జయజయ॥
॥పల్లవి॥

జయ సత్యనిర్వాణ.........
జయభృత్యమందార_జయకృత్యదూర ॥జయజయ॥

మీనకమఠవరాహ_మృగరాజరూప బలి
దానస్మయహర, విదారితక్షాత్రి
కాననాంతరచార_కలితహలాయుధా
మానినీ మానహర_మధితఖలనివహా ॥౨॥

సేవితాఖిలలోక_చింతితార్థద సతత
భావనాపరహృదయ_పద్మమార్తాండా ॥3॥

దేవాదిదేవ, నా_భావముననేప్రొద్దు
నీవు వసియించి న_న్నేలుకోవయ్యా ॥४॥

వ. అని మఱియు నేమని నుతించుచున్నాఁడు.

మంగళం.

మాయాతీతునకు మంగళం ఉపమాన రహితునకు
మంగళం!

సత్యజ్ఞానానంద సర్వసాక్షి రూపునకు
మత్యేకరతునకు మంగళం ॥౧॥
సంగదూరునకు సకలావభాసునకు
మంగళప్రదునకు మంగళం॥ ॥౨॥
మహదాదికప్రపంచ నిహిత చిద్విలాసునకు
మహిత తేజోరాశికి మంగళం ॥3॥

వ. అని యీలాగున నిష్టదైవంబునుగొనియాడి, రచియిం పఁబూనిన నాటకమునకు నాది కథావృత్తాంత మెటువలెను.

ద్వి. అనుపమ తేజోమయంబైనకోట
వినువీధి కబళించి వెలయునేపురిని
అనువైన యమృతపుటగడితలందు
ఘనతరాగాధత గల్గునేవీట,
సహజనైర్మల్యోచ్చ సౌధవీధికలు
రహిమించు మిగులనే రాజధానందు,
అసలారెడిని వాసనాభోగరమ్య
కుసుమితలలిత నిష్కుటము లేనగరి,
నతిరిరంస పరమహంసవతంస
రతికరకమల చక్రప్రతిపూర్ణ
సదమలసరసు లెచ్చటను రాజిల్లు,
నది సచ్చిదానందమను పట్టణంబు

దానికి రాజైన దాక్షిణ్యశాలి,
ధీనిధులైనట్టి దీనులఁబోషిన
దీక్షాగురుండైన దివ్యపరికాశుఁ
డక్షీణుఁ డీశ్వరుండను రాజువెలయు.
ఆతనిజాయ మాయాదేవినాఁగఁ
జేతనాచేతన సృష్టిచేమించు.
ఆమాయ యీశ్వరు నంటకుండఁగనె
వే మనసనుపుత్త్రి వింతగాఁగనియె.
నట్టి మనోనాథుఁ డఖిలలోకములఁ
బుట్టించి భోగింపఁబూనిమోదమున
నల ప్రవృత్తి నివృత్తియనియెడుసతులఁ
జెలిమిఁ బెండ్లాడియుఁ జెలువలలోన
మును ప్రవృత్తివలన మోహాదిసుతులఁ
గనె నివృత్తికి వివేకప్రభృతులను.
ఆ మహామోహాదు లా వివేకాదు
లీ మహీమండల మేలుటకొఱకుఁ
బోరాడుచుండిరి పూర్వ సురాసురులు
పోరాడురీతిని బూని వైరములు.

వ. ఆసమయమునఁ బ్రవృత్తిసంతతికి నగ్రగణ్యుఁడైన మహామోహుండు మిథ్యాదృష్టి చెలిగా, సధర్ముండే మంత్రిగా దూరదృష్టి దూరశ్రవణాకాశగమనపరకాయప్రవేశ లోకాంతర సంచారాదులగు యోగోపసర్గలు సహచరులుగా, నహంకారుండే ప్రాణపదుండుగా, నతనికొడుకు లోభుం, డతని సతి

తృష్ణయు, వారల సుతుండు దంభుండు, నతని సతి యాత్మ స్తుతియు,వారలసుతుం డనృతుండును, కార్యకర్తలుగా రతిపతి యైన కాముండును హింసానాథుండైన క్రోధుండును మద మాన మత్సరాదులు మన్నీలుగాఁగొలువ, మహాభైరవీశక్తి నిష్టదైవంబుగాఁగొలిచి, కాపాలిక జైన బౌద్ధ చార్వాకప్రముఖ పాషండులను నాయకులఁజేసి దుర్గుణాదుల వేగరులఁజేసి, పక్షపాతమున వివేకాదుల ధిక్కరించి, యఖిలరాజ్య మాక్రమించియుండు సమయమున నివృత్తిసంతతికి వగ్రేసరుండైన వివేకవిభుండు విజృంభించెనఁట యతని మహిమాతిశయ మెట్టు లనిన.

సీ. ఏరాజు నైమిశాద్యారామపుణ్యభూ
 మ్యాసక్తహృదయుఁడై యవని వెలయు
నేరాజుమతిసతి, నెన్నఁగ నుపనిష
 ద్దేవిని భార్యలుగావహించు
నేరాజుమంత్రులై యెనమండ్రు యమనియ
 మాసనాదులుగొల్వ నలరుచుండు
నేరాజు వస్తువిచారుఁడు హితుఁడుగా
 సత్యాదులును పరిచారకులుగఁ

గీ. బ్రీతి శ్రద్ధయు శాంతి యుపేక్షమైత్రి
కరుణ ముదితలట్ సతుఁబాడిగములుసేయ
సకలశాస్త్రస్మృతిపురాణసారతతుల
వెలయుమన్ననఁజేసి వివేకవిభుఁడు.

వ. ఇట్టి వివేకమహారాజు సదాచారుండను వాని గూఢచారుఁజేసి విష్ణుభక్తిమహాదేవి దేవతఁగాఁగొలిచి యాదేవి సాహాయ్యంబువల్లను భాగీరథీతీరంబునఁ జక్రతీర్థమను పుణ్యక్షేత్రంబున నెనకొని గుమిగూడియుండుట దుర్గుణాదిచారులవలనవిని మహామోహుండు కార్యాలోచనాపరుండై కొలువునకు వచ్చె నట యెటువలెను.

ఆటతాళము॥ కేదారగౌళ॥

అతివేగమునవచ్చెను మహామోహుఁ డతివేగమున
వచ్చెను॥
అతిమోహమునవచ్చె-నతివలు గొలువంగ
జతనమెచ్చరికని-సందడితొలగింప ॥అతి॥
అండజయానకై-దండయొసంగ ను
ద్దండత బిరుదు ప-ద్యములు చదువఁగను
అండనె యొకచెలి-యడపముగట్టఁగ
గండుమీఱిన-గర్వముప్పొంగఁగ ॥అతి॥
వెలయమిథ్యాదృష్టి-వేడుకకత్తెగా
ఖలుఁ డధర్ముఁడు దళ-కర్త గొలువఁగాను
చెలిమియోగోపసర్గ-ములు మంత్రులైచేర
బలుఁ డహంకారుండు-ప్రాణపదుఁడై రాఁగ ॥౨॥
తనర నహంకార-తనయుఁడా లోభుఁడా
తనిసతి తృష్ణయు-దంభానృతులును
అనుచరులై వేడ్క-నంది సేవింపఁగ
ఘనతమీఱి తన-కార్యమెన్నుచును ॥3॥

వ. ఈలాగువచ్చి మహామోహుండు కొలువునఁగూర్చుండి తన మన్నలలో నెన్నఁదగిన కొన్నిన విలుకానిఁగ్రోధాదిసమే తుఁగాఁ బిలిపించినఁ గాముండు వచ్చెనఁట యెట్టులనెను.

భైరవి ||ఆటతాళము|

కాముండు మోహునికడకువచ్చె జయకాముఁడై
మోదమున||

చిలుకతేజినెక్కి—చెఱకు సింగిణిపువ్వు
ములుకుల మొనయు—మూపున మెఱయ
చెలిమివసంతుఁడు—చేరి కొలువతేఁటి
యెలగోలుబారు—లేర్పడినడవంగ ||౧||

చక్కెరకవణము—మెక్కు—తేజీనెక్కి—
యెక్కువపువ్వు వి—ల్లెక్కు— వెట్టి
చక్కఁదనంబున—సాటిలేని తన
మక్కువ సతిరతి—యొక్క—జోడై రాఁగ ||౨||

ఎన్నంగఁ దగినట్టి — హింసానాయిక
వన్నెకాఁడౌ క్రోధుఁ — డున్నతిని,
మన్నన మదమాన — మత్సరులను దోడి
మన్నీలనుగూడి — మహిమ మెఱయఁగాను ||3||

వ. ఈలాగునఁ గాముండు వచ్చి ప్రొక్కిన బహుమానం బుగా లాలించి కూర్చుండ నియమించి తనయాప్తులగు నహం కార లోభాదులఁజూచి మహామోహుండేమను చున్నాఁడు.

ద్వి. వినుమో యహంకార, విఖ్యాతసార!
వినుక్రోధ, వినుదంభ, వివరంబుగాను
మనమీఁద దండెత్తి మర్మముఁబూని
మొనసి యున్నాఁడట మునిముచ్చు బలిమిఁ
బంద, వివేకుఁడేపాటి వీఁడు
ఇందుకుఁ బ్రతికార్య మెట్లొప్పునిపుడు.

క. అనిమోహుఁ డాడుమాటలు
విని కాముఁ డనూన మోహవివశ రతిసతీ
ఘనపులకిత స్తనాలిం
గనపరవశ హృదయుఁడగుచుఁ గడిమిం బలికెన్.

అ.సావేరి॥ఆట॥

వినుము మోహేంద్ర నావిన్నపము
మును నేబొంకెద నేసముఖమునను॥
జవ్వనిచూపను చక్కని బాణము – వీపునఁ దాకిన
చీకాకై
కవ్వడి శరములఁ గౌరవులట్లనె
యవ్వివేకుఁడెట – కరుగునో చూడుము ॥౧॥
గండు తుమ్మెదల – కైజీతములు
దండపుఁ జిలకల – దండి బారు
మెండైన యెలగోలు – మించిన కోయిలలు
నుండఁగ నాయెదుట – నుండునె యొకఁడు ॥౨॥

వెన్నునైనఁ బలుకు - వెలఁది మగని నైన
జన్నంపు వేఁటరి - జంగమునైన
చెన్నగ వెలఁదుల - చిక్కులఁ దగిలించి
యెన్నఁగల ధైర్యము - నెడలింతు నిపుడు ॥3॥

వ. అని యీలాగున వీరాలాపములు పలుకు చిలుకతేజీ
రౌతుఁగనుగొని యాతని యనుంగు సతి రతి యేమనుచున్నది.

కేదారగౌళ॥ జంపె॥

కొంచెకాఁడా వివేకుండు మీకు వంచింప
నెంచుటయు నీతిగాదిదిగాక వినుము ॥౧॥

ఎన్న యమ నియమాదు - లెనమండ్రు మంత్రులై
చెన్నలరుచు వివేకుఁ - జేరి యుండుదురు ॥౨॥

తగు సహాయపు బలము - మిగులఁగల్గిన పగతు
మొగర మెవ్వరికైన - మొక్కలముగాదె ॥3॥

వ. అని పలుకు రతింజూచి కాముండేమనుచున్నాఁడు.

క. రావే యోరమణీమణి
యీవిధమునఁ బలుకఁజెల్ల దింతివిరాఁగా
నీవెరవు గల్గె వినుమిఁక
నావగ బ్రహ్మాదులైన ననుమీరుదురే

వ. అని మఱియు నేమనుచున్నాఁడు.

పంతువరాళి॥ ఆట॥

తనదుకూఁతురి దగులుకొనె నావనజభవుఁడు ఇంద్రుఁడు
మునివధూటికఁ గలియఁగోడై - మొఱలు వెట్టెన్ ॥౧॥
యామినీపతి గురునిభార్యకుఁ - గామియయ్యెన్
రవి జుఁడు
రాముచేఁ జంపించె వాలిని - రమణి కొఱకు ॥౨॥
కొమ్మ, యమనియమాది మంత్రులఁ - గొని వధిం
పన్ మృత్యువు
సుమ్మ కులుకుమిటారి బిత్తరి - చూపుటమ్మ ॥౩॥
మెలఁత యొడలును కులుకునడలును - మెఱుఁగుఁ
దొడలు చూడఁగ
వలదు తలఁచినజాలు ధైర్యము - వదలుటకును ॥౪॥
కోరినేసంధించు పూవుల - కోరియొకటి మునులను
జారులను గావించు బ్రహ్మావి - చార ముడుపున్ ॥౫॥
ఘోటకుఁడా క్రోధుం డహింసను - గూల్చి లో
భుండుద్ధతిఁ
జేరి సత్యాస్తేయములఁ దగఁ - జెఱుపఁగలఁడు ॥౬॥

వ. అనిన విని రతి యేమనుచున్నది.

జంపె॥ గుమ్మకాంభోజి॥

అక్కటా యొకతండ్రి - యనుఁగు సుతులకు మీకు
నిక్కువాడంపుఁ బగ - లేమిటికిఁ గలిగెన్ ॥౧॥

రమణి, పోరాటమా – త్రిముగాదు మనవారి
గుమిఁజంపఁగా నెత్తు – కోలు గొన్నారు ॥౨॥
కటకటా యాపాప – కష్మలిందఱఁ జంప
నెటులఁ జింతించి రొక – యింత దయలేక ॥౩॥
కొమ్మ, చేలెఱుఁగమిని – కూనలైయుండిమే
మిమ్మహీమండలం – బెల్లఁ గోరితిమి ॥౪॥
అమ్మక్క – నేచెల్ల – యందఱునుసరిపాలు
నెమ్మిగైకొని కూడి – నిలువంగరాదా ॥౫॥
నెలఁతరో యిఁకమాకు – నెనరుపుట్టదు ప్రాణ
ములమీఁదవచ్చెఁ గడుమోస మిపుడాయెన్ ॥౬॥

క. అన విని రతి కాంతామణి
మనమున దిగులంది వడఁకుచై చెమరింపన్
ననుఁ గావు కావుమని యా
ననవిల్తునిఁ గౌఁగిలించె నాథాయనుచున్.

వ. ఇవ్విధంబున సభయ గాఢాలింగనంబుగావించినం జొక్కి యక్కుసుమశరుండు తనలో నేమనుచున్నాఁడు.

ఉ. భీతిని రెప్పలార్చుచును బిత్తరిచూపులముద్దుగుమ్మ తాఁ
జేతులుపారఁజాచి నునుసిబ్బెపుగుబ్బలురమ్ము మోవఁగా
హా! తనుదానె గొబ్బున నెయద్దరిపాటునఁ గౌఁగిలించి సన్
జేతమునందు వేడుకలు చిప్పిలఁదోఁగెను వానికప్పుడున్.

వ. అని స్వయంగ్రహాశ్లేషముదితుండై నిజకాంతతో నేమనుచున్నాఁడు.

క. అండజయానరో నే సుమ
కాండ పరంపరలఁబఱపి కఱకటిరిపులన్
రెండొకటి యొకటిరెండుగ
ఖండింతు మరేలనీకుఁ గళవళపడఁగన్.

వ. అని యీలాగు రతి నూఱడించు నించువిల్కానిపల్కులాలించి మోహుండుత్సహించువేళ దుర్గుణుండను వేగువాఁడు వచ్చెనఁట యెటువలెను.

బిలహరి॥ ఆదితాళం॥

వేగువాఁడు వచ్చెను దుర్గుణుండను వేగువాఁడు
వచ్చెను॥

బాగుమీఱ పెరుల-భావములెల్లను
వేగమె మోహునకు-విన్నవింపఁగాను॥

వ. ఈలాగువచ్చిన వేగువాఁ డేమనుచున్నాఁడు.

ద్వి. విను మోహదేవ, నా విన్నపంబొకటి
ఘనుఁడౌ వివేకుఁ డాగ్రహమంది మనల
నెలమిజయింపంగ నేకాంతమునను
దలపోసి యుపనిషత్తరుణినిగూడి
పొసరంగ విద్యాప్రబోధచంద్రులను

గని వారివలననే గ్రిక్కన జయము
కనుఁగొందుననుచు నాకాంత రాకలకు
ననిశమెదక్కముసేయు నతనిసంకల్ప
మీడేరుటకు నిప్పుడీ శాంతిదాంతు
లోడక పుణ్యతీర్థోర్వులలోన
దేవతాప్రార్థనల్ తీవిరిసేయుచును
నేవేళ దూత్యంబు నీఁగుచున్నార
లిందుకుఁ బ్రతికార్య మెట్లొనఁగూడి
పొందును జయమట్లు పూని చింతింపు.

వ. అనిన విని యాగ్రహోదగ్రుఁడై దంభాహంకారాముల శాంతిదాంతులఁ బట్టి తెమ్మని పంపిన వార లయోధ్యాది పుణ్యభూములకుఁ జనిరి. ఇట్టి వృత్తాంతమంతయు వివేకమహారాజు చారులవలన విని మోహాదుల జయింపఁబూని కార్యాలోచనాపరుండై కొలువునకు వచ్చెనఁట యెటువలెను.

కల్యాణి॥ ఆట॥

కొలువుకువచ్చె వేడుకను - వివేకవిభుఁడు
కొలువుకువచ్చెను శాంతి - కోమలి ప్రేమచే
వెలయఁ గైదండయొసఁగ - గిలుకు పావాలుమెట్టి ॥౧॥
మలయజగంధి మైత్రి - మడపు లందియ్యంగ
పలుమారు ముదితయుఁ - బావడ వీవంగ ॥౨॥
కులుకు మిటారి కరుణ - కుంచెయుఁ బూనఁగ
కలవాణి యాయుపేక్ష - కాళాంజి ధరియింప ॥3॥

వా. ఈలాగున వివేకమహారాజు కొలువునకువచ్చి యమ నియమాసన ప్రముఖమంత్రులుం దాను మహామోహాదుల జయింపం జింతించుచు నుండు నవసరమున గూఢచారి వచ్చె నట యెటువలెను.

రేగుప్తి॥ ఆటతాళము॥

చారుగతిని సదా - చారుండు మోహుని
ఘోరకృత్యములంగ - న్గొని శోధించి।
చేరి కార్యములు - సెప్పంగ వేగమె
బీరమున వివేకు - పేరోలగమునకు
చారుగతిని సదా - చారుండువచ్చెౕ

వా. ఈలాగునవచ్చి సదాచారుండు ఏమని విన్నవింపు చున్నాండు.

ద్వి. దేవ వివేకేంద్ర, దేవరయాజ్ఞ
భావించి మోహుని పాళెంబులోన
నే గూఢవర్తినై నేర్పువహించి
బాగుగా నామోహుభావంబుదెలిసి
వచ్చితి నెట్లన్న వర వివేకేంద్రుం
డెచ్చటనో డాంగి యిప్పుడు వాడమి
యుపనిషద్దేవి తానొక భంగింజూడ
నుపమగావించి యాయువిదకుం గలుగు

నొక కన్నియను మఱియొక కుమారకుఁడు
* * * * *

వానిచేత నె వారి వడిఁద్రుంపఁదలఁచి
పూనిన మీామంచి పూనికచరులు
తెలుపంగ విని వాఁడు దీనికి విఘ్న
ములుసేయ డంభాది మూర్ఖులఁ బుణ్యా
భూములు చేర నిప్పుడు పంపినాఁడు
స్వామి చిత్తము కార్యసరణి యిట్లయ్యె.

వ. అని విన్నవించిన సదాచారు మన్ననగావించి, యెప్పటి యట్ల మోహకృత్యములు దెలిసి రమ్మని పంపించి, మహామో హుండనిమిత్త వైరముల నాచరించు క్రూరకృత్యములకు మది నొచ్చి వెచ్చనూర్చుచునుండు సమయమున మతిదేవి యే తెం చెనఁట యెటువలెను.

ఘంటారవము॥ ఆట తాళము॥

రాయంచనడల యందెల-రవళిచెలంగజను
తౌరాయన మతిసతి-రాజు కొల్వుకువచ్చెన్.

వ. ఈలాగునవచ్చి మతిదేవి నిజకాంతుఁ జింతాక్రాంతాంత రంగుగాఁ దెలిసి యేమనుచున్నది.

ద్వి. ఇది యేమినాథ ! నీ వింత చింతింప
నొదవెనే కార్యము లో పుణ్యచరిత !
ధృతి దూలియున్న నాదేవేంచు నైన

నెతలఁ బెట్టుదు రతిపీసులు; గాన
ధైర్యమ్ము నవహాయించి దైన్యము డించి
కార్యంబు సాధించి ఘనుఁడ వర్ధిల్లు,
కావున ధీరతగాంచి డెందమున
నీవు సాధింపుము నెమ్మిఁ గార్యములు.

వా. అనిపలుకు మతిదేవిఁజూచి వివేకమహారాజేమను చున్నాఁడు.

ద్వి. విను మతిదేవి, యీవృత్తాంతమెల్ల
ననుగన్న యామనోనాథుఁడుద్ధతిని
దనుగన్న పరమాత్మఁ దామించి మోహుఁ
డను తనకొడుకుఁ దానైక్యముఁబొంది
పరమాత్మ సంసారపాశంబుచేతఁ
బరఁగ బంధించి తా ప్రాభవమంది
యంతటఁబోక నన్నలఁతి జయింపఁ
జింతించినాఁడని చెలియ, నేవింటి;
గురునైన మర్యాదఁ గూల్చినవానిఁ
బరఁగ శిక్షించుట పాడి యీజగతి.
కాన మనోనాథు గర్వి నామోహుఁ
బూని జయించినఁ బొనరు జయంబు.
ఈ కార్యమునకు నీవిందీవరాక్షి
శ్లోకసహాయనై సోకోర్వివలయు.

వ. అని పలుకు నిజకాంతుఁజూచి మతికాంత యేమను చున్నది.

ఆ. వె. నిత్యశుద్ధుఁడైన నిర్లిప్తుఁడేరీతిఁ
గట్టువడియె మోహకట్లచేత
నట్టి కూర్మికుఁడైన యామోహముఁ దెగటార్చు
వితము దెలుపు మిప్పుడు వివరముగను.

వ. అని పలుకు మతికాంతఁ జూచి వివేకమహారాజేమను చున్నాఁడు.

ఎఱుకల కాంభోజి ॥ జంపె॥

శాంతుఁడైన వివేక - సంపన్నుఁడైనాను
ఇంతులఁ దలంపనది - యంతయును దొలఁగున్ ॥౧॥
అటుగానఁ బరమాత్ముఁ - డామాయ నీక్షించి
చటుల నిజమహిమాతి - శయమెఱుఁగఁడాయెన్ ॥౨॥
జగము కనుపాపయూ - పగ లేలు మేటిపై
మొగులు గప్పినకాంతి - దిగునె యాత్మనికి ॥3॥
ఐన జపారక్తమగు పటికముఁ బోలి
జ్ఞానవిద్యా సన్ని - ధానమునఁ దగిలెన్ ॥౪॥
తగిలినప్పుడె మాయ - తరితీపు వగలచే
నిగమవేద్యునిఁ దనదు - నీడగాఁ జేసెన్ ॥౫॥

అమ్మరో విభుఁడు తన - యాత్మభావముఁ దెలిసి
పమ్మి నవరంధ్రపుఁబు - రమ్ములనె నిలిచెన్ ॥౬॥
ఆపురమ్ములనెదాఁ - గాపురమ్మొండితగ
నాపరమపురుషుని - నాపదలఁ బెట్టెన్ ॥౭॥
ఆమనోవిభుసుతేఁడ - హంకారుఁడనువానిఁ
బ్రేమచేఁ దవిలితన - పెరిమ మఱచుండెన్ ॥౮॥
సరగ నప్పరమేశు - సంసారి యనిపించి
పరఁగఁ దానవు 'డహం - బ్రహ్మ' భవించెన్ ॥౯॥
ఆమనఃప్రతిబింబ - మగు బ్రహ్మజీవుఁడన
భామరో యపరిమిత - భవములను గాంచెన్ ॥౧౦॥

వ. అనిన విని ప్రాణేశా, యట్టి మహామోహాదుల నెట్లుఁ జయింపవచ్చునని యడిగిన విని యేమనుచున్నాఁడు.

ద్వి. మతిదేవి వినవె సమ్మతమగునేని
కితవుఁడా మోహుని గెలుచుటకు పమ
యేవిషయాసక్తి యింతయు లేమి
భావింపఁ గార్యంబు పడఁతిరో యిపుడు
నీవు ప్రసన్నవై నిలిచిన మనదు
తావలమగు నవస్థాత్రయంబనెడు
సంకేత నిలయంబు చనఁగానె మున్న

కొంకక నాతోడఁ గుపితయై చనిన
యుపనిషద్దేవికి నొకభంగిఁ బ్రియము
నిపుడొనరించి యాయింతి సంగతిని
సకలార్తిహరు బోధచంద్రునిఁ గాంచి

* * * *

ఆసుతుచే మోహు నాయహంకారు
వాసిగఁ బరిమార్చి వన్నె చెలంగ
నావంశపతి పరమాత్ముని ఘోర
జీవత్వదోషము ఛేదించి సచ్చి
దానంద సామ్రాజ్యమందుఁ బట్టంబు
నేను గట్టుదుఁ జిత్తి! నీవియ్యకొనిన

వా. అని పలుకు నిజనాథునిఁజూచి మతి యేమనుచున్నది.

క. వల్లభ, యిటులనఁదగునే
చెల్లంబో మగని యనుఁగుఁ జెలులకు వేఱే
చెల్లుబడి గలదె మదిరం
జిల్ల నుపనిషన్మృగాక్షిఁ జేకొనుమిపుడే.

వా. అని మతిదేవి పలికిననాఁటనుండి యుపనిషద్దేవియందు నాటినప్రేమచే విష్ణుభక్తి మహాదేవి యనుమతిఁబడసి శాంతి కరుణాదిసఖుల నుపనిషద్దేవిఁ దోడితెమ్మని యాజ్ఞాపించి వివేక మహారాజు విరహావేదనచే నేమనుచున్నాఁడు,

ఘంటారవము ॥ఆదితాళము॥

తామసించఁగ నేటికి నుపనిష - త్తరుణిరో నినుజూడక
నేమనసు నిలుపలేనె నానేర - మేమిదెల్పవె కోమలి ॥౧॥
నిన్ను బాసినదిమొదలు నాకనులకు - నిదురరాదేమి సేతునె
నన్ను మదినెంచవేమె యుపనిష - న్నారి,మనోహారిణీ॥౨॥
నెఱనమ్మియున్న నన్ను నీవీరీతిఁ - బొరపొచ్చెముగ నెంతువా
కరుణించినన్నుగావవె యుపనిష_త్తరలాక్షి నీవాఁడనే ॥3॥
తొలుతనినుగూడినప్పుడు వేడుకల - తొలకు, చన్న నాడెంతము
పొలఁతిరో నిన్నుఁగానక వెతలచేఁ - బొందె నిపుడీ బంధము ॥౪॥
వెన్నవలెఁ గరఁగికరఁగినిన్ను బాసి_యున్న నన్నుదలఁపవేమె
మున్ను నన్నేలినట్టి ప్రేమచే_నన్నున దయనేలుకోవే ॥౫॥

వా. ఈలాగున వివేకమహారాజుప నిషద్దేవి రాకల కెదురు చూచు చుండు సమయంబున మహామోహుచే శాంతిఁ బట్టి తెమ్మని యాజ్ఞాపింపఁబడిన డంభుఁడు వచ్చెనటు యెటువలెను.

రామక్రియ ॥అటతాళము॥

డంభుఁడు వచ్చె సం - రంభమున వెంట
సంభావింపుచు బ్రహ్మ - చారులు గొలువ॥

నుదుట ముక్కు, చెవుల - నుదురు, గడ్డమునందుఁ
బెదవి, రొమ్మునఁగుక్షిఁ - బెందొడలు ।
కదియ, మృత్తికబొట్లు - కనుపట్టఁగాఁ గొంత
వదలు ధోవతికట్టు - వడిగఁజెక్కుచును ॥౧॥

రెండుచేతుల వేళ్ల - మెండుగాను దర్భ
ఖండ పవిత్రముల్ - గనుపట్టఁగా।
రెండుచెవుల సంది - రొండిని శిఖలోను
దండిగ నాదర్భ - దళములు సవరించి ॥౨॥

గబ్బిగా నేధావిబొట్టు - గనుపట్టఁగాఁ జేత
దబ్బర జపమాలిక - తగఁద్రిప్పుచు।
తబ్బిబ్బు కప్పగంతుల - దాఁటుచు రా, జను
లబ్బురముగఁజూడ - నావారణాసికి ॥3॥

వ. ఈలాగునఁ గాశీఁబ్రవేశించి యొకబోయ గృహమేధి వేషమున నుండి తనజాడనె మెలఁగు నప్పురజనులఁ జూచి యేమనుచున్నాఁడు.

ద్వి. అహాహా! యీపట్టణ మందలి జనులు
విహరించురీతులు వింతలు మిగుల
రేలెల్ల వారనారీగృహంబులను
జాల శీధురసంపుఁ జవుల కెమ్మోవి
తేనెలనాని యెంతేమది సుఖము
లీను వెన్నెలబైట నింపుగా వారి

సరస సల్లాపాది సంగతి గాథ
పరిరంభ రతులచే బాగుగాఁజొక్కి-
శేపకడను యోగిరీతి దీక్షితుల
రూపునఁజిరకాలరూఢాగ్ని హోత్రి
వైఖరి హాసిందు ప్రైవైపున భిక్షు
శేఖరుచందాన శివశివా ! జనుల
వంచించి ధూర్తులీ వట్టి డంభమున
మించిరి మోహుండు మెచ్చునా నేస్తు
అంచు నల్దిక్కు-లు నందందచూచి
కాంచె నొక్క-ని మదిఁ గదియవిస్మయము.

వా. ఈ వచ్చువానివలన రాధాపురస్వామియగు నహంకారు వృత్తాంతము దెలియవలయుననియుండు సమయమున నహంకారుండు వచ్చెనఁట యెటువలెను.

రామప్రియ ॥ఆది॥

వచ్చెను గర్వమురీఁ-జిచ్చుల పిడుగు జగముల
నచ్చుగఁ గబళించునట్టి-యందమునను
హెచ్చైన హుంకారముల-నెల్లజనుల ధిక్క-రించే
విచ్చలవిడి ప్రజ్ఞచే-విహాసించు కైవడిని ॥౧॥

వ. ఈవిధంబున వచ్చిన యహంకారుండు సకల మతప్రవర్తకులనుజూచి యేమని నిందించుచున్నాఁడు.

ఉ॥ తర్కముసున్న, భాట్టగురుతంత్రములావినఁజాల, రర్థసం
పర్క గభీరవాక్యముల పారముదూరము, వ్యాస
సూత్రముల్
కర్కశగూఢభావములు, కావున నే నుడువంగ
రాద యో
మర్కటబుద్ధులీ మనుజమాత్రులు గాంతురె
సూక్ష్మవస్తువున్.

వ. అని మఱియు నేమని నిందించుచున్నాఁడు.

ద్వి. అర్థంబు లెఱుఁగకే యవధానులనుచు
వ్యర్థపు వేదముల్ వదరెద రిచట.
మొనసి మాధ్వాకదధ్వ మూఢులై చాల
వనరెదరిట తత్త్వవాదులు నాఁగ.
ద్వైతమ తాటవిఁ దగిలి త్రిదండు
లై తగఁజెడిరి రామానుజమతులు.
పాషండతర శైవ పాశుపతాదు
లౌపషండులనుజూడనగుఁ బాతకంబు.
పొట్టలుసాఁకంగ బోడులై కావిఁ
గట్టి వేదాంతముఁ గాల్చిరి యతులు.
చేరికొ ప్రత్యక్ష సిద్ధవస్తువుల
మీఱిన వేదాంతమే నిజమైన

శుద్ధహా ప్రత్యక్షసూచితసుఖము
బౌద్ధమతంబేమి పాపంబుచేసె.
గాంగసైకతతుంగ కల్పితవేది
సంగతోచ్చాసన సంవిష్టులైన
వీరలు కుశదర్భ వెలయు యష్టికలఁ
జాను పురస్థిత సలిల పాత్రికల
సుమజాలపూజితాస్తోక విష్ణ్వాది
కమనీయవిగ్రహ కల్పితరతుల
నరమోడ్చి కనుదోయి యల్లననిక్క
త్వరచేత నోరు వృథా మరల్చుచును
పొందుగ రుద్రాక్షపూస లెన్నుచును
అందఱ వంచించి యర్థ మార్జింపఁ
బూనినారని వారిఁ బోనాడుకొనుచు
దానహంకారుఁడంతట నొక్కచోట
వాకిటిముందర వరుసగా నెవరు
తాకకుండఁగ వేణు దండాగ్రములను
గట్టి వ్రేలెడు నీరుకావిధోవతులఁ
దొట్టిన యాహోమధూమంబువలన
నలరునవీన కృష్ణాజిన దృషదు
పల ముసల చషాల భాసురోలూఖ
లాదులశోభిల్లు నాశ్రమంబొకటి

సాదరంబుగఁజూచి సంతోషమెసఁగ
నీయాశ్రిమస్థలి నీరెండుదినము
లాయాస శాంతికినై యుందుఁగాక
యనుచు డగ్గరి చూచె నాడంభునచట
మనమునఁ జాల విస్మయము పొందుచును.

వా. అనివచ్చు నహంకారుఁడు డంభుఁజూచి తనలోనేమను-
చున్నాఁడు.

మ. నొసటన్ ముక్కునఁజెక్కులన్ బెదవియందున్ గండ-
భాగమ్మునం
దసమాంసంబులఁ గుక్షిరొమ్మునను జాన్వగ్రింబునన్
మృత్తికల్
పసగాఁగన్పడఁగా శిఖన్ జెవులనాపాణిద్వయిన్ రొంటినిన్
వెసదర్భాగ్రిములుంచియున్న యితఁడీవేసానడంభుం
డెపో॥

వా. అనియూహించుచు డంభుఁజేరఁజని యాశీర్వదించిన
దంభుం డదరిపడి తనశిష్యునిఁజూచిన, శిష్యుండహంకారునితో
నేమనుచున్నాఁడు.

తోడి ॥జంపె॥

కడనె యుండుము విప్రి – కాళ్ళుగ[illegible]
నడుగులను బెట్టరా – దారా[illegible].

వ. అనిన విని యహంకారుండేమనుచున్నాఁడు

ఘంటారవము॥

అనయు లిచ్ఛాచారు - లజ్ఞానులక్కటా
ఘనులఁదెలియనిపాప - కర్మలయ్యయ్యో॥

వా. అనిన విని డంభుండు శిష్యుని సంజ్ఞసేయ శిష్యుఁడాతని కులదేశము లడిగిన నహంకారుం డేమనుచున్నాఁడు.

సౌరాష్ట్రిము ॥అటతాళము॥

భూచక్రమునఁ గీర్తికోశముచాల - పుణ్యముగలగౌడ
దేశము

ఆదేశమున ననూరాధా పురినాగ - నందమైయున్నది
మాపురి ॥౨॥

ఆపురినుత్తముఁడనఁగదా నెపుడు - కాపున్న మాజనకుఁ
డుగదా ॥3॥

ఈతెరినేనన్న దమ్ములలోన - ఖ్యాతిఁగాంచితి
భాగ్యముల ॥౪॥

వా. అని యహంకారుండు వలికిన దంభుండు శిష్యునిసంజ్ఞ సేయ శిష్యుండు తామ్రింపుగిండినిండియున్న శుద్ధోదకమునఁ బాద్యమిచ్చినఁ బాదప్రక్షాళనమాచరించి డంభుం జేరఁబోయిన దంభుండు హుంకరించి యేమనుచున్నాఁడు.

క. అస్సినస్సీ మూాఘాత్మా
దుస్సంగా నీదుచెమట తుంపరలిద్దెపై
పస్సున్నవోరి, కడఁబో
లెస్సాయె మరేమటంచు లేవఁదలంపన్.

వా. అతనిఁజూచి యహంకారుండు ఆహాహా నీ బ్రాహ్మణ్య మెంతవింత యనిన శిష్యుండేమనుచున్నాఁడు

కల్యాణి॥

రాజులెల్ల నితనిపాద - పూజసేయ వెఱచి
రాజితాచ్ఛ మకుటకాంతి - రాజిచేతను ।
ఓజమీాఱఁబాదనీ - రాజనంబులిచ్చి మొ్రక్కి
జేజేలిడుచు నుతిశతంబు - చేయుచుందురు॥

వా. అనిపలికిన విని యహంకారుండిచ్చటివారు డంభులకే కాని భ్రమయరని కూర్చుండఁబోయిన, దంభుండు పండ్లుకొొరికిన శిష్యుండహంకారుంజూచి యేమనుచున్నాఁడు.

ఉశాని ॥ఆట॥

కపట విప్రనీకుఁదగునె - ఘనులజపాసనముఁజేర
అపరిమితాచారముఖ్యుఁ - డారాధ్యుఁడు ।
కుపితుఁడయ్యెనేని యితఁడు - కోపవహ్ని చేతఁగాల్చు
త్రిపురముల హరించుహరుని - రీతిగాన్పడన్॥

వా. అనిపలుకుడంభు శిష్యునిఁజూచి నాయట్టికులశ్రేష్ఠున కీయాసన మెక్కఁదగదా! వెడవడుగా! యని యహంకారుఁ డేమనుచున్నాఁడు

పంతువరాళి ॥ఆట॥

విను మాజనని లోక - విశ్రుతకులజాత
గనక జనకుఁడం - దున ఘనుండాయెన్॥
తల్లికన్న నా - తరుణి వంశజురాలు
ఇల్లాలగుటఁ దండ్రి - కెచ్చునేనైతిన్।
అట్టినాసతితమ్మ - నల్లునికూఁతురు
నట్టెనిందఁబొందు - నగపునను
అనుకూలవతియైన - యాలివిడిచినట్టి
ఘనుఁడనే నాసాటి - గలరె జగమునను ॥౮॥

వా. అనిపలుకు నహంకారుంజూచి డంభుండేమనుచున్నాఁడు.

సారంగ ॥ఆట॥

మున్ను నేనొకనాఁడు కమలజు-నుదమునను దీవింపఁ బోయిన
నన్నుఁగని మునులెల్ల దిగ్గున-నయభయమ్ముల లేవఁగా।
కన్నులను గప్పుకొని యంతటఁ-గాని యానలువెట్టి తన తోఁడ
చెన్నలర గోమయముచే శుచి-చేసి నన్నుంచునిచెను॥

వా. అని పలుకు డంభునిఁజూచి యహంకారుం డేమను చున్నాఁడు.

కన్నడ ॥ఆట॥ (త్రిపుట)

వినర నామహిమంబు దెలియక—వెఱ్ఱి వై తేపోటుమాటలు
పెనచిదబ్బర లేమిరా నా—బిరుదు నీవేమెఱుఁగవో।
మునులు నిందబ్రహ్మ విష్ణువు—మొదలుగాఁగల
దివిజులెల్లను
జనిరి నేనెఱుఁగంగఁ గోటుల—సంఖ్యలై నాతపమున॥

వా. అనిన విని యాతఁ డహంకారుఁడని దిగ్గున లేచి 'డంభోహమభివాదయే' యని నమస్కరించిన 'ఆయుష్మాన్భవ' యని యాశీర్వదించి డంభుని కౌఁగిలించి, "వత్సా నిన్ను ద్వాపరాంతమునఁ జిన్ననాఁడు చూచినది గావున నెఱుంగనైతి. తనయుండైన యనృతునకు క్షేమమే. నీతల్లిదండ్రులైన తృష్ణాలోభులకుఁ గుశలమే" అనిన "పితామహా! నేననృతునెడఁబాసి నిమిషమైన నిలువఁగలనా! నాతల్లిదండ్రులు నేను మోహుని పంపున శమదమాదుల సమయింప నున్నవారలము. మీరు విచ్చేసిన కార్యము దెలుపుఁ" డనిన నహంకారుం డేమను చున్నాఁడు.

ద్వి. వినుడంభ, నేవచ్చువితము మోహునకు
ననుజుఁడైన వివేకుఁ డనయము మీఱి
చేయు విరోధంబు ఛేదించి తగు స
హాయముఁ జేయ నేనరుదెంచినాఁడ.

అదిగాక మోహుఁడాయత్తమై మీరి
కదలివచ్చు వివేకుఁ గదియింపఁదలచి
పూని యీకాశికిప్పుడు వచ్చుననుచు
నేను చారులవల్ల నెఱిఁగితి నిపుడు.

వా. అని పలుకు నహంకారుని జూచి డంభుండేమను
చున్నాఁడు.

ద్వి. విను మహంకార యీవిశ్వేశుపురము
ఘనుఁడైన యావివేక ప్రభువునకుఁ
బట్టైనదుర్గ, మప్పరమేశుఁ డిచటఁ
జుట్టమై యతనికి శుభవృద్ధి గలుగఁ
బరతత్త్వమెఱుఁగని పామరులైన
నరులకుఁ దారకనామంబు గలుగు
ననువుపదేశించి మనుచుఁ గావునను
మనమోహుఁడు జయించుమాట దూరంబు.

వా. అనిన విని యహంకారుఁ డేమనుచున్నాఁడు.

క. వినుడంభ, త్రికరణంబుల
ననువుగ నియమించఁ గలిగి యమలస్థితిచే
కొనిన మహాత్ముల కబ్బును
ఘనతర సత్తీర్థఫలము, కలుగ దొరులకున్.

వా. అని తెలుపు నవసరమునఁ దూర్యదుందుభిధ్వనులు విన వచ్చిన నదే మోహుండు వచ్చెనని డంభాహంకారు లెదు ర్కొనఁబోవ మోహుండు వచ్చెనఁట యెటువలెను.

కన్నడ ॥ఆట॥

కాపాలికాన్యత క్షపణకాదులనెల్లఁ
గాపాడిన మేటెని గణుతింపఁగా।
దాపున విభ్రమవతి తనుజేరి కొలువంగ
నాపాపజాతి మోహుఁడపుడు కాశికివచ్చెన్॥

వా. ఈలాగునఁ గాశికివచ్చి వేదమార్గరతులఁజూచి కటకటా పడి తన సభవారిఁజూచి యేమనుచున్నాఁడు.

ఘంటారవము ॥ఆది॥

తనువు నాత్మయు వేరెవేరని-తప్పనాడెడి పాతకులు
మొనయనీ జగమెల్ల నిత్తటి-మోసమాయె
మిగులను ॥౧॥

తనువుపోయినవెనుక సుఖములఁ-గను ననేమాటలును
కినిసి వంధ్యాతనయుఁ డంబర-వనజమందినటుల ॥౨॥

ఎంచభూతములొక్క-టై తగు-మంచి దేహము
పోయినను
అంచితాకృతి నాత్మవలెననుభ-వించఁగలదె ॥౩॥

నిజముగాఁ గననగు నర్థము వర్ణించువారట నాస్తికులు
గజిబిజిగా నంతయు మిథ్యని గాంచువారట
యాస్తికులు ॥౪॥

తనువు సుఖదుఃఖము లాహార నిద్రాతృష్ణలు
తుల్యములై
తనరజాతులు వేరెవేరని తలఁచెదరు పామరులు ॥౫॥

జాలిఁబడి తమనద్ద శ్రద్ధాజాడ్యమునను జెడి యకటా
మేలైన స్త్రీసుఖములఁగాదని చాలించిరి మూఢతను॥౬॥

వా. అనుచు మోహుండు పలుకునవసరమునఁ జార్వాకుండు వచ్చెనఁట యెటువలెను.

సాది (?) ॥ఆట॥

దుర్వాక్యముల జనుల దూషింపుచు వేగ
చార్వాకుఁడు మోహుఁ జేరఁగవచ్చెన్॥

వా. ఈలాగువచ్చిన చార్వాకుఁడు శిష్యునితో నేమను చున్నాఁడు.

ద్వి. వినువత్స, ప్రత్యక్షవేద్యైకఫలము
లనదఁగు గోరక్షణాదులఁదెలుపు
దండనీతియె విద్య, దానివర్జించి
యొండొరుల్ మూఢులై యొకధూర్తునుడువు

వేదముల్ చదువుచు నెట్టులైతె కారు
వాదములాడుచు వంచితులైరి.
సరవిఁబాతివ్రత్య సంకేతమెల్లఁ
బరభీతిచేత దుర్బలులుగల్పించి.
రరయసువర్ణ భూమ్యన్న దానములు
పరఁగంగ క్షుత్ క్షామపరికల్పితములు.
దేవాలయప్రపా దీర్ఘికారామ
పావన సత్రాళిఁ బాంధులుగూడి
పొగడుదు; రాగమ పుండాగ్నిహోత్ర
నిగమాదులను నేమినేరనిబుద్ధిఁ
బౌరుషహీనులు బ్రతుకుటకొఱకు
నారూఢిఁగల్పించి; రదిగాక వినుము
తనువు యాగము దవ్రతతియును జెడిన
వెనుక స్వర్గముఁగాంచు విధముఁజూచినను
దరికొన్న యడవియందలి దగ్ధమైన
తరువు ఫలించిన దారిగానుండు.
ధరనీల్గుజనుఁడు శ్రాద్ధంబునఁదృప్తిఁ
బొరయుననుట యారిపోయినదివియ
పైచిల్కునట్టియా పరమాజ్యధార
యై చనుఁ గాన నివన్నిదబ్బరలు.

వా. అనిన విని, అయ్యా మీరానతిచ్చిన విధమునను౦డక వాతాంబు పర్ణాశనులై యేల కృశించెదరని యడిగిన శిష్యుని జూచి యేమనుచున్నాఁడు.

సౌరాష్ట్రము ॥ఆట॥

అలఘూర్త కృతశాస్త్ర - ముల మోసపోయిన
ఖలులఁ గూడుక, వాయు!
జలపర్ణాశనములఁ - బలు పంచాగ్నులఁ జిక్కి-
యిలనశించిరి ॥౧॥

కులుకులాడి ముద్దు - గుల్కు చన్గవరొమ్ము
గుబ్బిమ్మ ప్రేమచే, కౌఁగిట
నలమిన సుఖము లేశమునఁబోలునె స్వర్గ
ఫలములెల్లను ॥౨॥

ధర దుఃఖయుతమని - నిరసింతు రింద్రియ
భరిత సౌఖ్యము జిన,!
సరిధాన్యములు ముక - కొఱకు నిచ్చినరీతి
నరులు మూఢులు ॥3॥

వా. అనిపలుకుచు మోహునిఁ జేరవచ్చి యేమనుచున్నాఁడు-

ద్వి. వినుమోహ, కలినీకు వినతుఁడై భక్తి
వినిపింపు మనియె నీ విన్నపంబొకటి.
దేవరకీర్తిచే దేశదేశముల
నేవేగఁ దిమ్మరి నిఖిలతీర్థముల
వేదశాస్త్రపురాణ వివిధార్థములను
మోదించు రిపుల నిర్మూలంబుచేసి,

పరఁగంగ నీపరితాపంబు నద్దెసల
నెఱయించి నానేర్పు నీవుమెచ్చఁగను
మఱివత్తు నని తెల్పుమనియె నీవఱకు
గరిమ సాధించిన కార్యముల్ వినుము.
భాగీరథికిఁ దూర్పుపడమర మొదలు
మాగధ సౌరాష్ట్ర మాళవ గౌళ
కొంకణ తెంకణ ఘూర్జర ప్రముఖ
సంకర దేశస్థ సకలవిప్రులును
వేదవేదాంగముల్ విడిచిరి; యొకటఁ
గాదని చదివినఁ గడుపు కక్కుర్తి
కొఱకు, నింతియుకాని కొంతైనశాంతి
కొఱకుఁ గాదెచ్చట గుఱువాన నిజము.
గీష్పతి భూమిలోఁ గీర్తింప మున్ను
దుష్పరిగ్రహులైన ధూర్తులకెల్లఁ
బొట్టలు సాఁకఁగాఁ బుడమి వేదములు
పుట్టెచనుచు మున్నె బోరనఁజాఱె.
కావున దేవర ఘన కటాక్షమున
సేవకులకుఁ గీర్తి సిద్ధించు ననియె.

వా. అనిన విని చార్వాకాచార్య, మీవంటి యాప్తబలము గలుగ నస్మజ్జయంబున కేమి కొదువ యను మోహుఁజూచి చార్వాకుండేమనుచున్నాఁడు.

ద్వి. వినుమోహా! మఱియొక్క విజ్ఞాపనంబు
ఘనతరశౌర్య సంకలితుఁడైనట్టి
కలిచేతఁ గడువిశకలితురాలయ్యుఁ
గలితపరిభావయై గనుపట్టునొక్క
యోగిని యదిదయనూనిరక్షించు
యోగీశులను జేర నోపరెవ్వరును.
ఆదేవిగొలిచిన యావివేకేంద్రుఁ
డిదివిని యెంతయునేలఁ దపించె
దానిఁ దుంపఁగ నీవదక్షుండ వగుదు
గాని యీకార్యము గాదనుమనియె. (?)

వా. అనిపలుకుచునుండు నవసరమునఁ గాలరివచ్చెనఁటా మొటువలెను.

రేగుప్తి – ఆది

లక్కముద్రవేసినట్టి – యొక్కకమ్మచేతఁబట్టి
గ్రక్కున వచ్చెనప్పుడు – కాలరియొకఁడు ‖

వా. ఈలాగువచ్చి వినతుఁడై (శ్రీ)పురుషోత్తమస్థలవాసులైన మదమానమత్సరులు విన్నపపత్రములు పంపినారని ముందట మంచిన రెప్పమి కలుగునని లక్కముద్రచేదెలిసి చార్వా కాదుల వీడ్కొల్పి తనలో నేమని చదువుచున్నాఁడు.

ద్వి. మోహేంద్రపదపద్మములకు మదాదు
లూహించి చేసెడి యుచితవిన్నపము,
లిపుడు శ్రద్ధాదేవి
యుపనిషద్దేవికి నొసర వివేక
నృపునకు దూత్యంబు నెఱపుచున్నదియు
విపరీతమయ్యె నావితముచూచినను.
అల కామసఖుఁడైన యాధర్ముఁడిప్పు
డొలయంగ వైరాగ్యునొగిఁ గూడినాఁడు
నిజమిది తప్పదు నీపాదమాన
గజిబిజిగా దొడ్డకార్యంబుపుట్టె.

వ. అని చదువుకొని సమీపమున నున్న కామునిఁజూచి స్వామిద్రోహియైన ధర్ముని వైరాగ్యుతోఁగూడ వధియించి రమ్మని పంపి యుభయపార్శ్వములనున్న క్రోధలోభులఁజూచి శాంతి జయింపఁగలరే యనినఁ గ్రోధుఁ డేమనుచున్నాఁడు.

ద్వి. దేవ, వివేకేంద్ర ! దేవరమహిమ
చే విన్నవించెదఁ జెలఁగి నేలోక
ముల నంధులఁజేతు, మొనసిబాధిర్య
మలరఁగఁ గల్పింతు, నజ్ఞులఁజేతుఁ
జేతనలెడలించి సిగ్గుఁబోఁజేతు
నీతుల నాచారనిష్ఠులఁజెఱతు

విద్యలమరపింతు వెఱ్ఱిగల్పింతు
సద్యఃప్రబల పాపసంతతినిత్తు
నిట్టి నాముందఱ నెట్లుండు శాంతి
బిట్టలుకవాని నొప్పింతునాక్షణమె.

వా. అన విని లోభుం డేమనుచున్నాడు,

ద్వి. దేవ, మహామోహా, దెలిపెద నిపుడు
నావల్లఁగల కామనాఘోరనదుల
మునుతు; తుంగతురంగముల రథంబులను
ఘనతర మాతంగ ఘటలనేపార
నిన్నియుఁ గూర్చితి నివిచాలవనుచు
నెన్నువారలమది నేకాఱఁజేయు
మొనగాఁడ నేను; నాముందర శాంతి
కినియునే! దానినే గెలుతు నీక్షణమె.

వా. అన విని క్రోధుండేమనుచున్నాఁడు.

సీ. తనర నాచేఁజిక్కి దక్షప్రజాపతి
శిరముఁ దుంచె హరుండు సిగ్గువిడిచి
తునిమె దేవేంద్రుఁడు దోసంబు కొడిగట్టి
వేగత్వష్ట సుతుని వృత్రుఁబట్టి

గాధినందనుఁడైన కౌశికుఁ డావశి
ష్ఠాత్మజుల శపించె నతులశక్తిఁ
బాలుఁడై యుండియుఁ బరశురాముఁడు రాచ
కులము లన్నియుఁ గూల్చెఁ గొంకులేక

గీ. అహహా ! నాచేతఁ జిక్కిన యఖిల జనులు
శౌర్య గాంభీర్యకుల సదాచార వినయ
మహిమ విద్యాక్షమాజ్ఞాన మానములను
విడిచి చెడుదురు మాటలు వేయునేల.

వా. అనవిని లోభుండు తనకాంతయగు తృష్ణను జూచి యిట్లనుచున్నాఁడు.

ద్వి. వినవె తృష్ణాదేవి, విజయము మిగుల
నొనఁగూడు నీవంటి యువిద గల్గినను;
తరుణి, నీవొక్కింత తలపడితేని
చిలుత మాన్యంబును జిన్నగ్రామమును
గురుతర విపినంబు గొప్పపట్టణము
సరవి దుర్గస్థల సంపూర్ణరాజ్య
మటమీఁద నొకదివి యంతటలోక
మిటుల మరిమ్మరి యీషణాత్రియము
లుప్పొంగ శాంతికి నునికెట్లు గలదు
తప్పదు నామాట తరుణి, నిక్కంబు.

వా. అనిన విని తృష్ణయేమనుచున్నది.

క. నిక్కంబిది ప్రాణేశ్వర !
చక్కఁగఁ గబళీకరింపఁ జాగితినైనా
యిక్కమలజాండ భాండము
లొక్కట నాయుదరపూర్తి నోసఁగంగలవే.

వా. ఆసమయమునఁ గ్రోధుండు హింసను జూచి యేమను చున్నాఁడు.

ద్వి. పడఁతిరో నీవంటి భామినిగల్గఁ
గొడవు దెవ్వారికైనఁ గినిసితి నేని;
గురులఁ దుంచుట పూలుగోయు మాత్రంబు;
మఱి తల్లిదండ్రుల మడియించు టెల్లఁ
బరికింపఁగాఁ దృణప్రాయ; మనుజులఁ
బరిమార్చుటయు దుగ్గబారి మాత్రంబు;
కాన దాయాదులఁ గల్బలమెల్లఁ
బూని జయింతు గోపురములు మ్రింగు
బడుగుకుఁ దలుపులప్పడములుగావె !
గుడిమ్రింగువానికి గుడిలింగముట్రి
వడియముగాదె యోవనిత, యారీతిఁ
గొడవుదుశ్శాంతి నిక్కంబునామాట.

వా. అని క్రోధలోభులు పలుకవిని మోహుండుత్సహించి శాంతిఁబట్టి తెమ్మని వారలఁబనిచి, శ్రద్ధాతనూజయగు శాంతి శ్రద్ధఁగానకున్న నశించుఁగాన శ్రద్ధఁబట్టి తేనోపునది మిథ్యాదృష్టి యని యూహించి మిథ్యాదృష్టిరావించి పంచిన, మిథ్యాదృష్టి వంచనకు రాజసశ్రద్ధలోనయ్యె. ఇట్టివృత్తాంతమంతయు విష్ణుభక్తిమహాదేవి దివ్యదృష్టిచేఁ దెలిసి సాత్వికశ్రద్ధాదేవి నతిరహస్యముగా నుండనియమించె.

వా. ఆసమయమునఁ బాషండులు తమలోఁదాము కలహించి కాపాలికుల పలుకులకులోనై యన్యోన్యము తమలోఁ దామాలోచించి మనమిందఱము మహామోహుకార్యమునకై సాత్వికశ్రద్ధఁబట్టి వచ్చినవారము. ఏమరియుంటిమి. జైనా! యాదేవి యెచ్చటనున్నదో పరామర్శింపుమనిన బలపమున గుణియించి చూచి జైనుండేమనుచున్నాఁడు

ద్వి. * * *
* * *

వ. ఈలాగునవచ్చు విభ్రమవతి మిథ్యాదృష్టిఁజేరి యేమనుచున్నది.

ద్వి. వినవె మిథ్యాదృష్టి, విభుఁడైనమోహుఁ
డినుమడించిన ప్రేమ నిప్పుడు నిన్నుఁ
దోడి తెమ్మని పంచెఁ దొయ్యలివేగ
వేడుక నావెంటవిచ్చేయు మమ్మ.

వా. అనిన విని విభ్రమవతిఁగూడి మిథ్యాదృష్టివచ్చెనఁట యెటువలెను.

మధ్యమావతి ॥ఆట।

సొగసుగ విభ్రమవతి జోడుగూడి జారిణి
వగలాడైన మిథ్యాదృష్టి - వచ్చె వేడుక॥

వ. ఈలాగున మిథ్యాదృష్టివచ్చి మ్రొక్కిన గ్రక్కునఁ గౌఁగిటఁజేర్చి యామోహాలుం డేమనుచున్నాఁడు.

ద్వి. కలికిరో నీబిగి కౌఁగిటఁ జేర్మ
నలమి నప్పుడె దుఃఖమంతయుఁ బాసె,
వినుమడించెను సుఖ, మెచ్చెను వేడ్క,
తనువు జవ్వనమునఁ దనరె, నాకోర్కి
కొనసాగె, భాగ్యము గొబ్బునఁబండెఁ,
దనుజాతలీలలఁ దనరె సౌఖ్యములు॥

వా. ఆసమయమున మిథ్యాదృష్టి యేమనుచున్నది.

ద్వి. ప్రాణేశ, నీవిట్లు పలుకంగఁదగునె
రాణించు నాథుచే రమణిరూపంబు,
చెలఁగు సింగారము, చేకూరుముదము,
కలుగుఁ జొక్కపుబిగి కావున నీవు
కౌఁగిటనను జేర్మఁ గదియించినపుడె
బాగైన జన్మసాఫల్యముఁ గంటి.

సామి యీపనికిఁగా సమకూర్పఁదలఁచి
నామీఁదఁ గృపనుంచి నారయ్యమీర
తౌనయ్య తెలుపుడీ యేనెట్టికార్య
మైనను సాధింతు నమర నీక్షణమె.

వా. అని పలుకు మిథ్యాదృష్టిని నిజాంకమున నునిచి నఖర శిఖరంబులఁ జికురనికరములు దువ్వుచు నేమనుచున్నాఁడు

ద్వి. వినవె మిథ్యాదృష్టి, వివరంబుగాను
బనిపూని సాధింపఁ బట్టైనకార్య
మొక్కటి, యావివేకోపనిషత్తు
లొక్కటై యుండంగ నొనఁగూర్పశ్రద్ధ
యను తొత్తు దూతికయై చేయివగలు
కనికరమునను సంఘట్టనసేయ
నున్నది యని వింటిమో కీరవాణి!
అన్ని చూడఁగఁ గార్యమది మోసమాయె
నటుగాన దూతికయగు శ్రద్ధఁబట్టి
పటుసాహసోదగ్రపాషండులకును
దాని నీ నొప్పింపఁ దరుణి, వివేకుఁ
బూని జయించి నేఁ బొందుదుశుభము.

వా. అను మోహుఁజూచి మిథ్యాదృష్టి యేమనుచున్నది.

మ. వినుపాపేశ్వర, మాటమాత్రమున నీ వేవేగఁదీవించినం
దెనక త్రైతగు శ్రద్ధఁదెచ్చి పగవాటిల్లంగఁ బాషండులా
జినకాపాలికముఖ్య తావకభట శ్రేణీవశం జేసెదన్
జను నే సేవకురాలికిట్లు ప్రియముల్ సల్పంగ మీ
బోటికిన్.

వ. అనిపలుకు మిథ్యాదృష్టికి భూషణాంబరము లిచ్చి పంచినవృత్తాంతమంతయు విష్ణుభక్తి మహాదేవి దివ్యదృష్టిచేఁ దెలిసి సాత్త్వికశ్రద్ధాదేవి నతిరహస్యముగా నుండనియమించె. ఆసమయమున రాజసశ్రద్ధాదేవి కర్మనిష్ఠులఁ దెలుపవచ్చెనఁట యెటువలెను.

ముఖారి॥ఆది॥

మొలకనవ్వుల ముద్దు - మోముచెన్నెలగాయ॥
కలికిచూపుల హోయలు - గనుపట్టఁగాను।
తెలిమించు సరిగంచు - వలువకుచ్చెలిచీర
కులుకునడలశ్రద్ధా - కోమలివచ్చెన్॥

వ. ఈలాగునవచ్చు శ్రద్ధాదేవింజూచి మిథ్యాదృష్టి వీరలు కర్మఠులై శరీరసుఖముల నిరాకరించిన చెనఁటులని చెవినిల్లు గట్టుక చెప్పిన నవ్వీరించికృత్యంబు గడువరాదు గాన దానివంచనకులోనై శ్రద్ధ పాషండులఁ జేరె. ఆసమయమునఁ దల్లిఁగానక శాంతివచ్చెనఁట యెటువలెను.

ఆహిరి ॥ఆది॥

జలజాక్షి శాంతికాంత - సఖియైన కరుణఁగూడి
వెలవెలఁబోవుచుఁదల్లి - వెదుకవచ్చెన్॥

వ. ఆసమయమున శ్రద్ధాదేవి పాషండులఁజేరెనని కటకట
పడుజనులవలన నెఱింగి శాంతియేమనుచున్నది.

ఘంటారవము ॥ఆట।

ఏతోత్తుబోధించె - నే తల్లి, నిన్నిపుడు
పాతకులైన యీ - పాషండులఁ గలియ ।౧।
కావించెనేబోఁటి - కటకటాయుపనిష
ద్దేవితో వైరమీ - తీరునసీకు ॥౨॥
ఏరాగయెడఁబాపె - నే జనని నామీఁది
కూరిమి యీరాది - గోరాది గొనుచు ॥3॥
అమ్మ యేగయ్యాళి - యక్కటాబ్రమయించి
నమ్మఁదగు వేదమా - ర్గమ్ములెడఁజేసెన్ ।౪।

వా. అని శోకించుశాంతిఁ జూచి కరుణయేమనుచున్నది.

ద్వి. వినుశాంతి, యాదేవి వెదకిచూచెదము
మనమున దిగులేల ! మహితబుష్యాశ్ర
మములను శృంగార మందిరమ్ములను
విమలరథురీయుత వితతాగసౌధ

ములఁ గలుషాపహ పుణ్యతీర్థౌఘ
ములను లీలాగృహముల మహానిగృహము
లను బంధుగృహముల నలవడఁజూత
మను మానమేటికి నతివరో నీకు.

వా. అనిపలుకు కరుణఁగూడి సకలస్థలంబులవెదకి తల్లిఁ గానక మఱియు నేమనుచున్నది.

ద్వి. చెలియరో యింక నేమిసేయుదు! మహా
కలితగృహంబుల ఘననదీపులిన
ముల నెల్ల వెదకితిఁ, బుణ్యతీర్థంబు
లలవడఁ దిరిగితి, నతులచషాల
చమస సమిద్ద్రుమచ్ఛాయ సంకులాతి
విమలాధ్వరాగార వితతిశోధించి,
తోకిచోటనైనఁ దానున్నదిగాదు.
వకవకగాదు నావజ్రింపు మనసు
వికలముగానింక వెదకుదునెచట!
అకట యీయక్కఱ కయ్యోదరెవ్వ!
రెవరికిఁ దెలుపుదు! నెవ్వరివేఁడు!
దెవరిట్టి యాపద లెడఁబాపువారు.
అమ్మ, నన్నెడఁబాసి యరిగితివనుచు
సొమ్మసిల్లుచు శాంతి చురచురఁగలఁగె.

వా. అని వెతనొందుశాంతిఁజూచి కరుణపాషండ సదనంబుల వెదకుదమని వచ్చువేళ జైనదిగంబరుండు వచ్చెనఁట యెట్టు వలెను.

మెల్లారు ।ఆది।

మురికివట్టిన మేన - మునరునీఁగలనెల్లఁ
గుఱుచ నెమలికుంచెఁ జే - కొనిజోపుచు।
బెనుకుగా వెంట్రుకలఁ - బెరికినబోడితల
నరచేత నిమురుచు ది - గంబరుఁడువచ్చెన్।

వ. ఈలాగువచ్చు జైనుండు తనశ్రద్ధాదేవి నాకర్షించిన జైనశ్రద్ధాదేవి వచ్చెనఁట యెట్టువలెను.

మేచచౌళి ॥ఆట॥

మకమకమనుమోము - మాటికిఁద్రిప్పుచు
వికవికగా సిగ్గు - విడిచి నవ్వుచు
కొకిపికి వేసంబు - గూనివీపుతోన
నొకజైనశ్రద్ధ - హోయనవచ్చెన్॥

వ. ఈలాగు వచ్చినదాని శ్రావకులవెంబడి చరింపుమనిన నదియు నట్లగావించె.

ఆసమయంబున శ్రావకులఁజూచి జైనుండేమని యుప దేశించుచున్నాఁడు.

ద్వి. వినుఁడు శ్రావకులార, వినరంబుగాను
జినరహస్యంబెల్లఁ జెప్పెద మీకు;
తొమ్మిదిగవఁకుల తోడి కళేబ
రమ్మున నాత్మ తా రాజిల్లుచుండు.
నెమ్మదిలో దీని నేర్పునఁదెలియఁ
గ్రమ్మరసిద్ధించుఁ గైవల్యపదము.
మలమయపుద్గలోన్మత్త దేహంబు
జలధులనీళ్లెల్లఁ జల్లి కడిగిన
నిర్మలంబేలగు, నియ్యాత్మ నిత్య
నిర్మలమైయొప్పు నేర్పునఁజూడ.
మనువకు ఋషిసేవ; మదిలోనవారి
చరణసరోజంబు చక్కఁగా నిలిపి
దివ్యులఁగన్నను దగవొప్ప మొక్కి
యెవ్వగఁ గాంక్షింప నిడవలెనన్న
మిల్లాలినడిగిన నీవలెఁ గాని
చెల్లఁబోయని యార్యసేసేయుసుమ్ము.

వ. అనుచు వచ్చు జైనుఁజూచి శాంతి దిగులందిసఁగరుణ చూచి "నమోర్హతే నమోర్హతే" యనుచు వచ్చువాఁడు జైనదిగంబరుండు, వెఱవకుమని శాంతి నూఱడించు వేళ బౌద్ధుండు వచ్చెనఁట యెటువలెను.

మంగళకైశికి॥

పొడవుబోడియునై-పుస్తకముఁబూని చిం
పుడుకావిబొంతయుఁ-బుడమి జీరాడ।
చిడిముడి పడుకొంట-పిప్పంగిచూపుల
బడిబడినడలతో-బౌద్ధుండువచ్చె।

వ. ఈలాగువచ్చు బౌద్ధుండు తన శ్రీద్ధాదేవి నాకర్షించిన బౌద్ధశ్రీద్ధ వచ్చెనఁట యెటువలెను.

సౌరాష్ట్రిము॥

పొగచాయగలమేనఁ-దగు కావిబొంతగట్టి
సుగత శ్రీద్ధాదేవి-చోద్యముగ వచ్చెన్॥

వ. ఈలాగున వచ్చినదాని భిక్షుకులవెంబడి చరియింపుమని నియోగించి, భిక్షుకులకు నేమని యుపదేశించుచున్నాఁడు.

ద్వి. వినుఁడు భిక్షుకులార, వేఘకమిాఱ
ఘనుఁడౌ సుగతముని కల్పించు మతము
తెలియఁజెప్పెద వట్టి ధీపరంపరలె
వలన నర్థమ్ములవలెఁ దోఁచుచుండు,
సత్తెల్ల క్షణికమై చను వెలుపల, న
సత్తగు రూపల సముబుద్ధిఁజూడ
* * *
అట్టిధీవాసనముగు విషయము

గట్టిగా భోగింపఁగా లేదు దోష;
మేవేళ భిక్షుకు లింపుగాఁ దమకుఁ
గావలసినవేళఁ గాంతలఁగూడి
భోగింపఁగాఁజూచి పోనాడరాదు;
భోగమోక్షములిచ్చు బుద్ధసిద్ధాంత
మనుచుఁ దథాగతుం డస్మదాదులకుఁ
గనికరముగ శిక్ష గావించినాఁడు.

వ. అనుచు వచ్చు బౌద్ధుంజూచి 'వీఁడు మునుపటివంటి' పాషండుఁడని తెలియువేళ జైన బౌద్ధులకు సంవాదంబు నడిచె నఁట యెటులనెను.

అసావేరి ॥ఆట॥

ఓరిభిక్షుక దెల్పు-మొక్క-శాస్త్ర రహస్య
మేరీతి నీమతము-నెఱిఁగితివేని ॥ ॥౧॥
ఓరి జైనమూఢ-యోరి దుర్మలభాండ
యోరి కొండీఁడ నీ-కొక శాస్త్రమేల ॥౨॥
కిను కేలరా భౌద్ధ-కినిసి శాస్త్రమఃశి
యొనర నాశంకకు-నుత్తరమీరా ॥3॥
వినర నామతమెల్ల-వివరించి తెల్పెద
కనఁబడు జగమెల్ల-క్షణనాశిగదరా ॥౪॥
ఇట్టి క్షణనాశైన-నీవు కఠినమై
నట్టి వ్రతమున బోడి-నైతివదేర ॥౫॥

................క్షణికవిజ్ఞాన
భావనగలిగినఁ బరముక్తిఁగలుగు॥ ॥౬॥

ఓరి మూఢబౌద్ధ-యొకఁడు ముక్తుండైన నీ
కేరీతి నుపదేశ-మితనిచేఁ గలుగు ॥౭॥

విను జైన సర్వజ్ఞుఁ-డను కీర్తిగలబుద్ధ
ముని మాకీ యుపదేశ-ముల నిచ్చుగురువు ॥౮॥

ఔర యీ యఁరపు లే-లతని సర్వజ్ఞత
యీరీతిఁ దెలిసెనీ-వింక నాలెంకవురా ॥౯॥

పంచమలానులిప్త-భాస జైనా మతము
నెంచక నీకిట్టి-యెమ్మె లేటికిరా ॥౧౦॥

కొంచెపుబుద్ధి బౌద్ధ - కొంచెతనము మాని
మంచిదైన మా - మతముఁ జేకోరా ॥౧౧॥

వ. అని వాదించు నవసరమునఁ గాపాలికుండు వచ్చెనఁట యెటువలెను.

ఉశాని ॥ఆట॥

పునుక కప్పెరఁబట్టి - భూతిమేన నలంది
వెనుక కఱకుజడలు - వ్రేలఁగను।
పెనుపట్టెము భుజమునఁ - బెట్టి పుత్తెలపేరు
ఘనవక్షమున మెఱయఁ - గాపాలికుఁడువచ్చె॥

వ. ఈలాగున వచ్చు కాపాలికుండు జైనబౌద్ధులఁజేరఁజని యేమనుచున్నాఁడు.

ద్వి. వినరోయి మామతవృత్తంబు చాల
ఘనుఁడు భైరవుఁడు మాకర్తైనవేల్పు.
ప్రకట నటదుద్భూత భయద స్మశాన
నికట శృంగాటక నివహంబులెపుడు
రచ్చపట్టులు మాకు, రమ్యవరాస్థు
లచ్చైనహారము, లిందుబింబాభ
నృకపాలపాత్రిక నిండినసురయు
నొకటఁగ్రోలుచు, వహ్నియుజ్జ్వరిల్లఁగను
వేగమహామాఁస. వితతివేల్చుచును
బాగుగా నరబలిఁబట్టి తత్కంఠ
భాగనిర్గళ దుష్టబహుళ రక్తమున
నీగతిని నుపారమిచ్చి వేడుదుము
మాపాలి భైరవు మముఁబ్రోచునతఁడు
కాపాడి సుఖమోక్ష గతులుగల్పించు.

వ. అనినవిని జైనుఁడు "నమోర్హతే నమోర్హతే యీ జోగి నెవ్వఁడో భ్రమయించె కటకటా వీఁడు హింసాపరుం డయ్యె" ననిన విని కాపాలికుండు రోషావేశంబున జైనబౌద్ధులను జూచి యేమనుచున్నాఁడు.

ద్వి. విను మైన మలభాండ, వినుబౌద్ధషండ,
ఘనుని భైరవదేవుఁ గలితప్రభావుఁ
దిట్టెద రేమియుఁ దెలియకే, జగముఁ
బుట్టింపఁబాలింపఁ బొలియింప నతఁడె
కర్తైన యాతని ఘనకటాక్షమున
నర్తిల్లఁజేయుదు నారాయణాది
సురల, బిట్టదలించి సూర్యచంద్రులను
సరగనిల్పుదు, జగజ్జాలంబు లిన్ని
యేకోదకముచేసి యేగురిక్కఁగొందుఁ,
జేకరదుకములుగాఁజేసి బ్రహ్మాండ
భాండంబు లొకవ్రేలఁ బట్టి చిమ్మెదను,
ఖండింతు నెదురాడఁ గలిగినవాని.

వ. అనిన విని జైనుండు "ఓరి కాపాలికాధమా! నిన్ను నే యింద్రజాల విద్యవాఁడో భ్రమయించె" ననినఁ గాపాలికుఁడు పట్టెంబొఱవాయఁ బెఱికి "యోరి, నిన్ను దుర్గబారిగాఁ దెగ వేసెద" నని వచ్చు కాపాలికుంజూచి జైనుండు గడగడవడఁకి బౌద్ధు మఱుఁగుజొచ్చె. ఆసమయమున బౌద్ధుండు "ఓయీ కాపాలికోత్తమా! వినోదవృత్తి వాగ్వాదమాడినఁ దెగఁ జూతురా?" అనిన శాంతిఁబొంది పట్టెంబొఱలోవేసి మఱి యేమనుచున్నాఁడు.

ద్వి. విను విషయాసక్తి విరహితమైన
ఘనతర సుఖమెందుఁ గానరందఱును.
భోగవిహీనయౌ పుత్త్రికరీతి
బాగుగాదని ముక్తి భావించమెపుడు.
చక్కనిభామిని శర్వాణిగాఁగ
మక్కువభావించి, మఱితన్ను శివుని
గాఁగ భావనచేసి కలసినయపుడె
చాగైన యాముక్తి సరవిసిద్ధించు.
సిద్ధించు నణిమాదిసిద్ధియు, నిష్ట
సిద్ధియుఁ గలదని శివుఁడానతిచ్చె.
కావున భోగమోక్షములిచ్చు మతము
భావింప దీనికిఁ బ్రతిలేదు జగతి.

వ. అనినవిని జైనబౌద్ధులు మొగమొగములు చూచుచు నుండి వీరలు అశ్రద్ధాయుతులని తనశ్రద్ధ నాకర్షించిన కాపాలిని వచ్చెనఁట యెటువలెను.

మధ్యమావతి॥

అచ్చెరు వడిజైనుఁ - డా బౌద్ధుఁడుఁజూడ
వచ్చెఁ గాపాలిక - వనితయపుడు॥

వ. ఈలాగు వచ్చు కాపాలిక శ్రద్ధఁజూచి కాపాలికుండు జైనబౌద్ధుల లోఁ బఱపుమనిన నదియు నట్లుసేయ జైనబౌద్ధులు తమలోఁ దామేమనుచున్నారు :

క. వినుజోగురాల నినువే
మెనసినసుఖ మెన్నఁడెఱుఁగ మెన్నాళ్ళువృథా
చనె శ్రావకులును నీగో
రనుబోలఁగ నేరరెవ్వరును నిజమునుమీ.

వ. అనిన బౌద్ధుండేమనుచున్నాఁడు

క. ముందుమతెందఱినైనను
బొందినయపుడేడ దిట్టిపొనరినసౌఖ్యం
బందమగు వీనిమతమిఁకఁ
గొందమ యీజోగురాలికొఱకు ముదమునన్.

వ. అనుచు జైనబౌద్ధులు కాపాలికునిఁజేరఁజని మమ్ముశాంభవదీక్షచేఁ గృతార్థులఁ జేయుమనినఁ జేరవచ్చినవారిని ముందరనుంచుకొని కాపాలికుండు భైరవధ్యాన నిమీలితాక్షుఁడై మద్యమాకర్షించిన, ముందరనున్నపునుక కప్పెరనిండ మద్యముద్భవించిన, రెండుచేతులనెత్తి తాఁగొంత త్రావి యేమనుచున్నాఁడు

క. సకల పశుపాశవిభే
దక మిది సంసారజలధి తారకమిది పు
ణ్యాకరంబిది యమృతంబిది
యకలుషమిది మృత్యువునకు నౌషధమిదియే.

వ. అట్లుగావున దీనిస్వీకరించి కృతార్థులు గండనిన అర్హాద నుశాసనము గాదని జైనుండు, జోగియెంగిలిగాదని బౌద్ధుండు, మొగములు చూచుచుండఁ గాపాలికుండు తన శ్రీద్ధఁజూచి యేమనుచున్నాఁడు

మ. పడఁతీ,చూడు పశుత్వదోషమున నీబౌద్ధుండు జైనుండుని
ప్పుడు శ్రీద్ధందొలఁగించి యెంగిలని మత్పూతాస్య
పీతాసవం
బెడఁగాఁజూచిరి, గాన వీరిభ్రమపో నీపాత్రమై రేయమున్
వడిగా గుకొక్కఁడుగోలు శుద్ధిగల నీవక్త్రింబునన్
వేగమే॥

వ. అనిన విని కాపాలిని తాఁగొంతగోలి జైనబౌద్ధుల కిచ్చిన 'స్త్రీముఖం సదాశుచి' యని జైనబౌద్ధులుత్రాగి తమలో నేమనుచున్నారు.

ఉ. మేలుసెబాసు, ఈమతము మెచ్చితి నిన్ని దినంబులెల్లఁగా
పాలినిఁగూడి వేడ్కమధుపానము లేక వృథాచనెన్
గటా
చాలునిఁకార్హతంబును విచారముసేయక వెళ్లులైతిమో
పాలితభక్త భైరవుకృపన్ మముఁబ్రోవుము నీకు
మ్రొక్కెదన్.

వ. అనుచు మధుమద ఘూర్ణమాన మానసులై సోలి యాడిరంట యెటువలెను.

ఎఱుకలకాంభోజి ॥ఆట॥

బిరబిర దెసలెల్లఁ - దిరుగుచున్నవిచాల
వెరపయ్యె యీభూమివేడెము బాలికా ॥౧॥
తిరిగేదిభైరవు - తీర్థముమహిమగా
నెఱుఁగరోరిజైన నీ - కేలసందియమిఁకను ॥౨॥
అయ్యారెూ యదెనిజము - అయితే యిట్లానన్ను
వెయ్యాసు వితములు - వెతలఁబెట్టునఁటరా ॥౩॥
అయ్యారె మేలు ది - గంబరమోక్షము
నియ్యాన సిద్ధించె - నిదిగోచూడరా ॥౪॥
బౌద్ధయోలాగైతే - బరువైన నాదేహ
మిద్ధరనిలువక యేలజిట్టునఁ దిరుగు ॥౫॥
సిద్ధుఁడురాజైనఁ - జింత యేలరనీకు
సిద్ధని నాయింతిఁ - జేరి నీవడుగరా ॥౬॥
సిద్ధుఁడు నన్నేమి - చేసెనో తెలియదురా
బౌద్ధ, లేకున్న యీ - పాటు నాకేడదిరా ॥౭॥
సిద్ధుఁడు మనయిష్ట - సిద్ధిచేసినవాఁడు
బుద్ధిమాలిన జైన-షోర! యిట్లాడక ॥౮॥

వ. అని సోలియాడు జైనబౌద్ధులఁజూచి కాపాలికుఁడు వెలఁబెట్టని భృత్యులు గలిగిరని తనలోఁ దలపోయుచున్న వేళ, శాంతికరుణలు 'ఇట్టి పాపపుమతము లెట్లు గల్పించె నీశ్వరుం' డని తొలఁగువేళ, జైనబౌద్ధులఁజూచి కాపాలికుండు మఱియు నేమనుచున్నాఁడు.

ద్వి. ఇదియేమిటరిది మాకిలలోన వినుము
విదిత బాహ్యసుఖంబు విడువఁగనయ్యె.
సిద్ధులెన్మిదియును సిద్ధించు, మోక్ష
సిద్ధియుఁ గల్గును, జింతితలోక
వశ్య వయస్తంభ వాదజయములు
దృశ్యమారణ సముద్వేషణాకర్ష
ణోచ్చాటనాదులు నొగి మోక్షమునకు
నెచ్చు విఘ్నములని యెంచము మేము.
సురగరుడోరగా సురయక్షరాత్రి
చరకిన్నరాదుల జవరాండ్రిమఱియు
వలసిన రంభాది వనితలనైనఁ
దలఁచి యాకర్షించి తగిలి క్రీడించి
యనుపుదు మగుడనే, నదిగాక విశ్వ
మొనరంగఁబుట్టింప నుడుపంగనేస్తు.
ఘనుని భైరవదేవు కరుణచే నిట్లు
దనరుశుభంబులు తప్పదీ ప్రతిన.

వ. అనిన విని జైనబౌద్ధులు సంతసిల్లిన, కాపాలికుండు
"విను! జైన! సత్యాత్మసంభవయగు సాత్వికశ్రద్ధఁబట్టి తేవలయు
నాదిని పరామర్శించుమనిన, జైనుండు బలపంబున నేల గుణి
యించి చూచి యేమనుచున్నాఁడు.

ద్వి. లేదు వనమ్ముల లేదు తీర్థముల
లేదు పర్వతముల లేదుపో గుహల
ఆదేవి హరిభక్తి యనుమతిఁగాంచి
తా దాఁగియున్నది తత్వజ్ఞులందు
కనుగొంటి మర్మమొక్కటి కామునిఁబాసి
చని ధర్ముఁడా మోహు సఖ్యమువిడిచి
యనువుగా వైరాగ్యుఁడనువానిఁ గూడి
ఘనుని వివేకునిఁగని మొ్రక్కినాఁడు.

వ. అని పలుకు జైనుని మాటలాలకించి కటకటా ధర్మ వైరాగ్యులొక్కటైన మోహుని కపజయంబగును. అయినను నాదు మంత్రదేవత పంపునట్టి శ్రద్ధాధర్ముఁబట్టి తెప్పించెదనని భైరవధ్యాన నిమీలితాక్షుఁడయ్యె. ఇట్టి వృత్తాంతమంతయు శాంతికరుణలుచూచి విష్ణుభక్తి మహాదేవికిఁ దెలుపవలయు నని చనుచుండి మార్గమధ్యంబున శాంతి తల్లింజూచి కాపాలి కుఁడుచేయు కృత్యంబులన్నియుఁ దెలుపు నవసరమున మహా భైరవశక్తి వచ్చెనట యెటువలెను.

కన్నడ ॥ఆది॥

పునుక కుండలములు - భుజములపై వ్రేలఁ
గనలు భైరవశక్తి - కడువేగవచ్చె॥

వ. ఈలాగువచ్చు మహాభైరవశక్తి శ్రద్ధాదేవిని గదిసిపట్టి గగనవీధి కెగయువేళ శ్రద్ధాదేవి యార్తనాదంబు గావింప విని విష్ణుభక్తి మహాదేవివచ్చెనఁట యెటువలెను.

శంకరాభరణము ॥ఆట॥

మొనసినుదుట బొమ్మ - ముడివెట్టి కెందమ్మి
నెనయుచూపులు కోప - మునఁ గెంపుమీఱ।
తనుబేర్కొని కూయు - దాని శ్రద్ధాదేవి
మనుపంగ విష్ణుభక్తి - మహిమతో వచ్చెన్

వ. ఈలాగు వచ్చు విష్ణుభక్తి మహాదేవి రోషహుంకార మాత్రంబున భైరవినిఁ దెగట్చ్చి శ్రద్ధాదేవిని విడిపించి వివేకు కడకుఁ బనిచె. నీవృత్తాంతమంతయు ముదిత తెలుపవిని మైత్రి వచ్చెనఁట యెటువలెను.

భైరవి ॥ఆట॥

తనసఖియగు శ్రద్ధా - తరుణిఁ జూడఁగఁగోరి
నెనరున నామైత్రి - చనుదెంచెనపుడు॥

వా. ఈలాగువచ్చు మైత్రి మార్గమధ్యమున శ్రద్ధాదేవిని జూచి యాలింగనంబుచేసి 'తరుణీ! నీకింత భయంబేటికి' ననిన శ్రద్ధాదేవి యేమనుచున్నది.

ద్వి. ఏమని తెల్పుదునే మైత్రి, యొకతె
భీమజటాజూట భిన్నోడుమార్గ
మైన కాపాలిని యత్యంతకుపిత
యై నన్ను నికుగేల నతివేగఁబట్టి

గగనంబు కెగసిన గర్ధిక్కున నపుడు
భగవతి యావిష్ణుభక్తి తానచ్చి
హుంకారమున దానియుక్కడఁగించి
కొంకక రక్షించుకొనియె నన్నెలమి
ఆదేవి కృపచేత నతివ, యీబారి
నేఁదరించితిఁ గాన నినుజూడఁగంటి.

వ. ఈలాగుననఁగాంచి ధర్మునిఁదోడ్కొని వైరాగ్యుతోఁ గూడ వివేకునొద్దకుఁ బొమ్మని యాజ్ఞాపించెఁగావునఁ జనియెద నీవు నెచ్చట నున్నదానవు నీసఖులైన శాంతికరుణలకు క్షేమంబె? ముదితయెచ్చట నున్నది ? వివేకేంద్రుఁడు మోహుఁదును మాడువఱకు మీరలెచ్చట నుండువార" లనిన విని మైత్రి యేమనుచున్నది. వినుము నీపుత్రి క్షేమంబుననున్నది. మేమును మహాత్ములయెడనే యున్నవారము గాన వారలు మమ్ము మెలఁగించువితము వినుము.

క. నన్ను సుఖియెడను దుఃఖా
పన్నునియెడఁ గరుణఁ బుణ్యపరునెడ ముదితఁ
జెన్నుగఁజెనఁటుల మదిలో
నెన్నకయె యుపేక్షఁగాతురెపుడు మహాత్ముల్.

వ. ఇట్టి మహాత్ములఁజేరియుండు మాకు రాగాది శత్రు భయంబులేదు గావున వివేకాభ్యుదయముఁ గోరియుండెదము. నీకు విష్ణుభక్తి యాజ్ఞాపించిన వినరమంతయు వివేకేంద్రునకుఁ

దెల్పుమని వీడ్కొల్పెననియె. శ్రద్ధాదేవియు వివేకేంద్రు సమ్ము-
ఖమునకు వచ్చి యేమనుచున్నది.

ద్వి. అయ్య, వివేకేంద్ర యావిష్ణుభక్తి
నెయ్యము మీఱంగ నియమించె నిటుల
వైరులఁ దునుమంగ వలయుఁగావునను
బీరంబున దళంబు పెంచి యాలమున
యత్నింపు మేపారనగ్గలైన నీస
పత్నుల నేనయ్య పరిమార్తుననియె.

వ. అని విష్ణుభక్తి మహాదేవి నియోగించిన విధమంతయుఁ
విని వివేకమహారా జుత్సాహమునంది. శ్రద్ధాదేవిం జూచి
మోహునికృత్యంబుల నూహించి యేమనుచున్నాఁడు.

మ. అనఘానంత చిదాత్మ సత్యఘన నిత్యానందగంభీర వా
ర్థిని నెల్లప్పుడుఁ దేలుచుండియుఁగడుం దీనాత్ములై మోహుచే
ష్టను సంసారమరీచికావనధిలో సమ్మగ్నులైనట్లనే
జనులధ్యాత్మ మెఱుంగలేక యిటులన్ సమ్మోహులై రక్కటా.

వ. కావున మోహునవలనఁగలుగు సంసారము నిర్మూలము
గావింప నీశ్వరాంఘ్రికమలార్చనా జాతబోధరజ మొక్కటియె
చాలునైన నిట్టిమోహునకు సంసారచక్రవాహకునకు మూల
ముకాముండుగావున వానిం దెగటార్చు బలోద్దాముండు వస్తు
విచారుండని పిలిపించిన వస్తువిచారుండువచ్చెనఁట యెటువలెను.

కేదార॥ ఆట॥

ధీరుఁడై సకలముఁ దెలిసిన వస్తువి
చారుడు వచ్చెను - జనులెల్లఁబొగడ.

వ. ఈలాగున వచ్చు వస్తువిచారుండు పామరులఁ జూచి దుఃఖమనుచున్నాఁడు.

ద్వి. కటకటా ! యామోహకుకతమునఁ గాము
సటలచేతను జిక్కి జనులు స్త్రీలనెడు
జంగమ నరకవిసరములఁ జూచి
బంగారు మేనిది బఁటువు చన్నవది
శృంగారలీలది జిగిమోవిగలది
రంగుమీఱిన చిత్తరపుఁ జూపుగలది
ప్రాయముగలది నిబ్బరపు వేడుకది
రాయంచనడల దొరాయంచు బ్రిమసి
కళవళపడి మది గాంభీర్యముడిగి
తలపోయుచుందురు; దగ విచారింప
ఘనశల్యములఁ బ్రోదిగాఁజేసి ప్రేవు
లను నరముల నవిశ్లథముగాఁ గూర్చి
పెనచి కట్టఁగఁగట్టి పెనుకొవ్వు వెట్టి
తనరు మెదడు రొంపి దానిపైఁ బూసి
తోలు తిత్తినిగప్పి తొమ్మిది గవఁకు
లాలీలఁ గల్పించి యందుల మలము
లేవేళఁ దొఱుఁగంగ నిస్సిసీ యనుచు

సేవగింపఁగఁ దగు నీకళేబరము
మెత్తని వలువల మెఱుఁగు సొమ్ములను
మెత్తిన చందన మృగనాభికలను
బైవస్నెపచరించి పరఁగు పాపంపు
పోవులనుచుఁ జేరఁబోరు సజ్జనులు.

వ. అని పలుకుచుఁ గామునిఁ జేకొని యేమనుచున్నాఁడు.

క. కందర్పా నీదర్పము
మందముఁ జేసెద నమంద మహితవిచారా
నందితమగు డెందముచే
ముందర నీకేది దిక్కు మూర్ఖవిచారా.

వ. అని పల్కుచు వచ్చి వివేకమహారాజునకు మొ్రక్కిన "వస్తువిచారా, మోహజయోద్యోగమునకు సహాయుండవై కాముఁ దునుమాడఁ గలవే" యనిన విని వివేకమహారాజుఁ జూచి వస్తువిచారుం డేమనుచున్నాఁడు.

తోడి॥ జంపె॥

జవనాథ వినుము వాని - శరములై దవియు
నన లందినంతనే - నలినలైపోవున్ ॥౧॥
అట్టికాముని గెలువ - నస్త్రంబు లేటికి దె
కొట్టి చెండాడెదను - కొంకకీక్షణమె ॥౨॥
ఘననదులఁ బులినముల - వనములను గిరిగుహాల
మునులఁ గనుఁగొనిన కా - మున కెడముగలదె ॥౩॥

వనిత వానికి మొసలు - ఘనశరము దానినే
మొనవిసుతు సువిచార - మనుతూపుచేతన్ ॥౫॥

ఆశరము చనునప్పుడె - యలకాము బలముతో
యల శశి వసంతాదు - లడఁగుదురు వేగన్ ॥౬॥

అటుగానఁ బటుశక్తి - నాకాముఁ బట్టినేఁ
దటుకున హరింతును - ధృత శౌర్యగరిమన్ ॥౭॥

వ. అని పలుకు వస్తువిచారుని నాయత్తపడి రమ్మనిపంపించి క్రోధుని జయింపనోపిన క్షమాదేవినిఁ బిలిపించిన క్షమాదేవి వచ్చెనఁట యెటువలెను.

ఉశాని॥ ఆది॥

నిబ్బరమునఁ గ్రోధు - నిర్జయింపఁగఁగోరి
గొబ్బున క్షమ వివేకు - కొలువునకు వచ్చెన్.

వ. ఈలాగున వచ్చు క్షమాదేవి యేమనుచున్నది.

ద్వి. కోపాంధకారాత్తి కుటిలభ్రుకులైన
పాపాత్ము లత్యంత పాటల దృష్టి
కడలుకొఁ జూచినఁ గఠినవాక్యముల
నుడివి నిందించిన నోరెత్తరెప్పుడు.
నీరధిగంభీర నిజభావలసమ
దాకులు సజ్జనుల్ తాలిమిచేత

నహహా మాటాడక యులయిక లేక
తహతహపడక యేతలయేసు లేక
పరహింస లేక యేపాపంబు లేక
పరగఁ గ్రోధుజయింతు బాగుగా నేను.

వ. అని పలుకుచు వివేకుఁ జేరి మ్రొక్కిన, వివేకమహా-రాజు క్రోధుజయింపఁగలవే యనిన క్షమ యేమనుచున్నది..

ద్వి. విన్నవించెద నే వివేకేంద్ర, మోహు
మన్నినఁ బాపాత్ము మహితదానాధ్వ
రాగమ దైవబుప్యాది కర్మముల
వేగమె చెఱుపుచు విస్ఫులింగములు
గురియు చూపులనుంచు క్రోధుని, మహిష
సురవైరిఁ జండిక చురుకు కోపమునఁ
బరిమార్చురీతిని బటుశక్తిఁ ద్రుంతు
పరఁగ నానేర్పునుపాయంబు వినుము.
నరునిఁ గ్రుద్ధునిఁజూచి నవ్వుచుఁ దొలఁగి.
కరకరించిన బాగుగాఁ గుశలోక్తి
పలికి, తిట్టినవాని భవ్యతఁ బొగడి,
పెలుచఁ గొట్టినవానిఁ బేర్కొని, నాదు
దురితమంతయుఁ బాసె దుష్కర్మవితతి
పరిణతి యీమూఢు బాధించుచున్న
దక్కటా! వీఁడ జితాత్ముఁడుగాన

జిక్కె దైవికమునఁ జెల్లఁబో యనుచు
దయసేయుచున్నట్టి తాలిమి సదుని
నియత తితిక్షచే నిలుచునే క్రోధుఁ
డటుగాన నాకూర్మిఁ డడఁగిన హింస
తటుకునఁగూలు, మాత్సర్యాభిమాన
పైశున్య మదచౌర్య పారుష్యములును
నాశమై చనుఁ జూడు నాపరితాపంబు.

వ. అని పలుకు క్షమాదేవి నాయత్తపడి రమ్మని లోభుఁ డనుమాడువాఁడు సంతోషుఁడని యూహించువేళ సంతోషుఁడు వచ్చెనఁట యెటువలెను.

దరువు॥

సంతతమును చింతా - సంతతి పుట్టిన
సంతాపములఁ దీర్ప - సంతోషుఁడు వచ్చెన్॥

వ. ఈలాగున వచ్చు సంతోషుఁడు కృపణులఁ జూచి యూహించుచున్నాఁడు.

ద్వి. వనమూలఫలము లవ్వారిగాఁగలుగ
ఘననదీస్వాదూదకములు గల్గఁగను
చల్లనిగాడ్పు పచ్చనితీఁగె యిండ్ల
పల్లవ మృదుల తల్పములు గల్గఁగను
అదనున స్వేచ్ఛావిహారులై వేడ్క

బ్రిమకక ధనికుల బ్రతిమాలి కాచి
ధనకాంక్ష నెన్ని యత్నముల యత్నింప
ననుకూలపడక సుంతైనను రోయ
కయ్యయో కృపణాత్ములగువారి మనసు
ఎరియ్యలైపోవదు వజ్రమో తెలియ.
"రాఁదగినట్టి యర్థమువచ్చె, నింక
మీఁద రాఁదగినదేమిటఁ గాంతు, ముందు
కూడిన యర్థము గూర్తునే చేర
మాడి వడ్డికినిచ్చి" యనుచు నేవేళ
నల ధనార్జనబుద్ధి నంధకారమునఁ
దెలియని మూర్ఖునిఁ దృష్ణాపిశాచి
తిరింపకమానదు తోఁచఁగ దుఃఖములు
పెంపున ధనమున్న పిదప నశించు;
నటుగాన నాజరయను నల్లత్రాచు
గుటుకునఁ గబళించి కొనుటకు మునుపె
బోధజలంబులఁ బోసఁగ లోభాద్య
బోధకల్మషములఁ బోవఁగఁ గడిగి
కార్పణ్యముడిగించి గాంభీర్యమంది
నేర్పునఁ గడతేరు నిర్మలాత్మకుఁడు.

వ. అని పలుకుచు వివేకుఁజేరి మ్రొక్కిన, సంతోషా
మన్నన గావించి లోభుఁ డనుమఁ గలవేయనిన వివేకుఁజూచి
యేమనుచున్నాఁడు.

క. నానాముఖుఁడై జగముల
నా నరదేవద్విజామరాదులఁ దునుమం
బూనిన లోభదశాస్యుని
నేనల దాశరధిరీతి నెఱసి వధింతున్.

వ. అనిపలుకు సంతోషపలుకులకు సంతసిల్లి యాయత్త
పడి రమ్మని తక్కిన నిజబలంబుల నాయత్తపఱచి యుద్ధసన్న
ద్ధుఁడై వివేకమహారాజు వచ్చెనఁట యెటువలెను.

కన్యా॥ ఆట॥
భువనములఁ దున్మింపఁగఁ - బొలుపొంద రథమెక్కి-
బవరమునకు వివేక - పతి వచ్చెనపుడు॥

వ. ఈలాగున రథారూఢుఁడైవచ్చు వివేకమహారాజువెనుక
ముందర నుభయపార్శ్వంబుల వెల్లివిరిసిన కల్లోలినీవల్లభు
చందంబునఁ గలకలధ్వను లుల్లసిల్ల నల్లనవచ్చు వివేకమహా
రాజుం జూచి సుమతియనుసారథి యేమనుచున్నాఁడు.

ద్వి. రథమిది నీమనోరథమట్లు విజయ
కథనముఁ జేయుచుఁ గాశిపురంబు
సీమను జేరెను; శివుశిలనున్న
సోమునపహసించు సొబగున ఫేన
పుంజంబులను మీఱి భూరితరంగ
మంజులడోలికా మధ్యంబునందుఁ

క్రీడించు కలహంస కిలకిలధ్వనుల
నోహక తననీట నొకపాలిగ్రింకు
జనులఁ జిదానంద జలధిలోఁ దేల్తు
ననురీతినున్న దల్లదె చూడుగంగ.
తత్తటంబున నతిధవళగోపురము
హత్తిన హేమకుంభాగ్రకేతన జ
పట పటత్కార సంభాషిత ముక్తి
ఘటనాతిశయరీతి గల్గు ముక్తేశు
మందిర మదిచూడు, మనలనుజూచి
పందయూ మోహునిపగ్రిజ తల్లడిల్లి
సందుల డాఁగేను సరగఁ గామాదు
లందఱు నిష్పాదహంకారముడిగి
తొలఁగెద రదెచూడు దురమున జయము
కలుగు నిక్కంబిదిగా నెన్ను మదిని.

వ. అని పలుకు సారథిపలుకులకు నుల్లసిల్లి యల్లన రథము డిగ్గి, విశ్వేశు మందిరంబుప్రవేశించి యద్దేవు సేవించి పరమానందభరితుండై యేమని నుతియింపుచున్నాఁడు.

శంకరాభరణము॥ ఆట॥

గుజ్జుజేజేయొక్క చాయను – ముద్దు
కొమరు సామి యొక్కచాయను
అజ్జిగాఁ దనకొలువు సేయను వెలయు –
హాయఁగొల్తు శుభములు డాయను ॥౧॥

అన్నపూర్ణాప్రియనాయకు భ-
క్తాభీష్ట ప్రదాయకు॥
సన్నుతింతు శుభదాయకు త్రిపుర-
సంహార ధృతవిష్ణు సాయకు ॥౨॥

నిటలాక్ష నిర్ధూతకాముని మాళీ-
ఘటిత తరుణతరసోముని
పటుజగత్ ప్రకాశధాముని నేను-
భావింతు విశ్వేశనాముని ॥౩॥

వ. అని యభినుతించి ప్రార్థించి యద్దేవుమందిరము వెలు పలి భాగీరథీతీరంబున శిబిరంబువిలుప నియోగించి నైయాయిక సిద్ధాంతిని రాయబారంబుపంచిన మహామోహుకడకు నైయాయిక సిద్ధాంతి వచ్చెనట యెటువలెను.

బిభాసు ॥

రాయబారమున నై-యాయికసిద్ధాంతి
హాయని మోహుని-యండకువచ్చెఁ॥

వ ఈలాగునవచ్చు నైయాయికసిద్ధాంతి మోహునిఁజూచి యేమనుచున్నాఁడు.

ద్వి. వినుము మోహా, వివేకవిభుఁడు సన్నాహ
మునను దండెత్తి యిప్పుడువచ్చినన్ను
బనిచె నొక్కట రాయబారంపుఁబనికి
వినుము నేవచ్చిన వితము తెల్పెదను

చతురుపాయంబులఁ జతురతభూమి
పతులకు సామముపాయంబుగాఁగఁ
దొలుతఁబ్రయోగించి దురముచూపుటకుఁ
దిలకించినీరీతిఁ దెలిసిరమ్మనియె.
ఈకాశిమొదలైన యీశ్వరపురము
లాకంచి మొదలైన యజ్ఞాక్షపురము
లతిపుణ్యవనభూము లద్రులు గుహలు
నతులశుభ్రనదీనదాదులు పుణ్య
పరుల హృదంతర ప్రాంగణంబులును
బరిహరింపుచు మీకుఁ బట్టైనమ్లేచ్ఛ
భూములఁజేరి యీభూముల విడిచి
సేమముచేకొను చీకాకుపడక.
కాదన్న నిప్పుడే కదనరంగమున
నీదళంబును నిన్ను నేను వధింతు"
అని తెల్పుమనియె నీయాన నిక్కంబు
మొనసిన కార్యంబు మోసంబుసుమ్ము.

వ. అని పలుకు నైయాయికుపలుకుల కాగ్రహోదగ్రుండై నైయాయికు నవమానపఱచి కామక్రోధాదిమూర్తులరావించి యుద్ధసన్నద్ధుండై వెలువడి పాషండబలంబు నెలగోలు నడిపించినఁ జూచి వివేకవిభుఁడు సకలన్యాయాగమాది బలసమేతంబుగా భారతీదేవి నంపిన భారతీదేవి వచ్చెనంట యెటువలెను.

కాపి ‖ఆట‖

వేదవేదాంగములు_వివిధపురాణములు
సాదరముగ ధర్మ_శాస్త్రములు గొలువ
మోదముమీఱ జలజ_మును గేలఁబూని కాంతి
మేదురముగ దిశలు_మెఱయ భారతివచ్చె‖

వ. ఈలాగునవచ్చు భారతీదేవికి సహాయముగా మీమాంసాదేవి వచ్చెనఁట యెటువలెను.

ఎరుకులకాంభోజి‖ ఆట‖

బలిమి న్యాయసహస్ర_బాహువు లుప్పొంగను
అల మీమాంసాదేవి_యప్పుడె వచ్చెన్‖

వ. ఈలాగున దుర్గాకాత్యాయనీదేవుల చందమున భారతీమీమాంసాదేవులు పాషండబలంబుల నెదిరించుసమయమున వైదికషడ్దర్శనంబులు మున్నుఁ దమలోఁ దమకుఁ గిట్టకుండినను పరుల కసమియ్యఁదగదని భారతీమీమాంసలు కలసిమెలసి మోహుని యెలగోలు గగ్గోలుగాఁ దునుమాడిన భారతీదేవి యేమనుచున్నది.

సీ. నిత్యశుద్ధబుద్ధ నిర్మలతత్త్వంబె
సత్యమై చెలంగు జగతిదానఁ
ద్రిగుణమయ సమస్త దేవతత్రయాది ప్ర
పంచమై యడంగు బ్రహ్మమందు.

వా. కావున దృశ్యే నశ్వర సదితరంబు నవలంబించినమిథ్యా సిద్ధాంతము గావింతునని కోపాటోపంబున భారతి కుటిలభ్రూలతంబగు నిరీక్షణంబున నిఖిలపాషండబలంబును సమయింప, మోహుం డాగ్రహోదగ్రుండై మూలబలంబుఁ గవియించి మించిన నాయుభయబలంబులకు భయంకరయుద్ధము నడచె నంట యెటువలెను.

క. మదగజతురంగ రథభట
ప్రదరము లొండొండఁదాఁకు రభసమునమిఁగు
ర్లదనముగ నెగయ భయకర
కదన మపుడు నడచెఁ బుడమి గడగడ వడఁకన్

వ. ఆసమయమున హింసాప్రియసమరము చూడఁజాలక సని సాలగ్రామపర్వతమునకుఁ జనియె.

ఆసమయమున వివేకు మన్నీలు ద్వంద్వయుద్ధమునను మోహుమన్నీలఁ దెగటార్చిరంట యెటువలెను.

రీతిగౌళ ॥ఆట॥
చాయశక్తివస్తు వి-చారుఁడు కామునిఁ
జేరి పోరున సమయఁ-జేసె నావేళ॥

గౌడిపంతు ॥ఆట॥
భండనమునఁగ్రోధుఁ-బట్టి క్షమాదేవి
చెండాడె నతులప్ర-సిద్ధయుద్ధమున॥

లలితపంచకము ॥ఆట॥

పంతముమీఱ అనా-బనరమున లోభుని
వింతగా గెలిచెను-సంతోషుఁ డిపుడు॥

రామక్రియ ॥ఆట॥

ఉదుటుతనంబున-నుబ్బిన యనసూయ
మదమానమత్సరుల-మడియించె నెలమి॥

వ. ఈలాగున వివేకేంద్రు మన్నిలచే స్వబలంబు నిశ్శే
షంబుగా మడిసినమోహుం డాత్మరాజ్యైకపాలనతత్పరుండై
యెచ్చటనోడాఁగె. ఆసమయమున వివేకవిభుఁడు సంగరవిజయ
లక్ష్మీసంగతి నంగీకృతాఖిలసామ్రాజ్యవైభవుండై కాశిఁ బ్రవే
శించి యీవృత్తాంతమంతయు విష్ణుభక్తిమహాదేవికిఁ దెలుపు
మని శ్రద్ధాదేవినిఁ బనిచిన శ్రద్ధాదేవియు విష్ణుభక్తిసన్నిధికి.
వచ్చి యేమనుచున్నది.

ద్వి. వినవమ్మ నీకృపా విలసత్కటాక్ష
మున వివేకుని కోర్కె యొనరె నెట్లన్నఁ
బటుతర రణ సముద్భట వివేకేంద్ర
భటసమూహముల యార్భటులు చెలంగఁ
జనె కాలునింటికిఁ జార్వాకబలము;
కనలి సౌగత జైన కాపాలికాదు
లానికలుడిగి తోయధితటప్రాంత

మున మ్లేచ్ఛమాగధ ముఖ్యదేశముల
కాననభూములకై చని; రప్రుషు,
మానములుడిగి సన్మానముల్ విడిచి
ఆస్తికురాలైన యట్టిమీమాంస
నాస్తికోక్తులనెల్ల నాశంబుచేసె;
జయమంది వస్తువిచారుఁడు కాము
నయమొప్పఁగాఁబట్టి నామంబడంచె;
మీఱి క్షమాదేవి మృత్యువై క్రోధ
పాపమ్యహింసలఁ బరిమార్చెఁగడిమి.
జగదేకవీరుఁడు సంతోషుఁ డంతఁ
దగులోభతృష్ణల దైన్యానృతముల
స్తేయంబుతోఁగూడఁ దెగటార్చె; నప్పు
డా యనసూయయు నడఁచెమాత్సర్య
మును; బరోత్కర్షసముజ్జ్వలశక్తి
మొనసి మానాదుల మూలంబడంచె
అంతట మోహుఁడా యూహాపాపజయ
సంతప్తుఁడై డాఁగి చనె సిగ్గుతోఁడ.
అప్పుడు విజయరమాలింగనమున
గుప్పునఁ బులకలు గుబుసుకొనంగ
నానందకందళితాత్ముఁడై వంది
మాగధ స్తుతులచే మహితభేరీని
నాదంబులుపొంగ నవ్యాప్తితాప
మేమరీకృతదీప్తి మిహిరుఁడైమించి

కాశిఁ బ్రవేశించె ఘనుఁడావివేకు
* * * *
ధవళకీర్తి స్ఫూర్తి దట్టమై జగము
గవిసి ప్రకాశంబు గావింపఁగాను.

వ. అని పలుకు శ్రద్ధాదేవినిఁజూచి విష్ణుభక్తిమహాదేవి యేమనుచున్నది.

ద్వి. వినుమిది యొక్కటి వెలఁది, యా మోహుఁ
డసయుఁడై హతశేషులైన యోగాప
సర్గలు దానును జతఁగూడి రోష
దుర్గతేంద్రియవృత్తి దుష్టాత్ముఁడగుచు
నొప్పుమిగావించు నూహించిచూడఁ
దప్పిపోయిన మోహుఁ దగదుపేక్షింప
శత్రుఋణమ్ముల సరిగాఁగ లేశ
మాత్రము లేకుండ మడియింపవలయుఁ
గావున విషమంబు గాఁగలదింక
నేవిధమునఁగార్య మెసఁగునో చెప్పుమ.

వ. అనిన విని శ్రద్ధాదేవి యేమనుచున్నది.

క. వినుమమ్మ పుత్త్రమిత్రులు
ననుజులును బ్రధానులాప్తులందఱు సతులున్
జనఁ దనలో శోకమ్మునఁ
గనలుచు శోకుఁడు నశించుఁ గడువేగమునన్.

వ. అయినను మనోనాథుఁడు ప్రవృత్తిసంతతిచ్ఛేదంబునఁ బ్రాణంబులు వాయుననిన విని విష్ణుభక్తిమహాదేవి మనోవిభు దుఃఖనివృత్తిసేయ వ్యాసభారతిఁబంపిన, వ్యాసభారతి మనోనాథు సమీపంబునకు వచ్చెనఁట యెటువలెను.

కన్నడగౌళ ॥ఆది॥

భాసురతనుకాంతి-పండువెన్నెలగాయ
వ్యాససరస్వతి-వచ్చె వేడుకను

వ. ఈలాగున వ్యాసభారతి వచ్చువేళ మనోవిభుఁడు వచ్చెనఁట యెటువలెను.

ఆహిరి ॥ఆది॥

అనయమునఁ బుత్త్రమి-త్త్రాదులు మడియంగఁ
గనలి శోకింపుచు మనోవిభుఁడు వచ్చెన్॥

వ. ఈలాగునవచ్చు మనోనాథుం డేమనుచుఁ బ్రలాపించుచున్నాఁడు.

ఆహిరి ॥జంపె॥

హా కామక్రోధాదు-లైన పుత్త్రకులార
నాకూనలార హా-నా పౌత్త్రులార ॥౧॥
హా యసూయాదిక-న్యాశిరోమణులార
న్యాయమా నా మీకు-నను బాసి చనను ॥౨॥

అక్కట రతిహింసాదు-లైన కోడండ్రిలార
ఎక్కడనున్నారు మిము-నెవ్వరు దెలిపెదు ॥3॥

పాపపుదైవమీ-పగిది ముప్పునమిమ్ముఁ
బాసి బాపురేచేటు-పాటుగాఁ జేసెన్ ॥౪॥

వ. అని శోకించువేళ సంకల్పుండు వచ్చెనఁట యెటు వలెను.

కాంభోజి ॥ఆట॥

అరసి మనోనాథు - నక్కఱఁదీర్పంగ
సరగున వచ్చెను - సంకల్పుఁడపుడు॥

వ. ఈలాగునవచ్చు సంకల్పుంజూచి, సంకల్పా! నాప్రాణ వల్లభయైన ప్రవృత్తికాంతామణిఁ దోడితెమ్మనిన, మనోనాథా! యాదేవియుఁ బుత్త్రశోకమున మున్నె సమసెననిన మూర్ఛిల్లి యల్లనఁ దెలిసి యేమనుచున్నాఁడు.

మ. కలనైనన్నను బాయఁజాలవుగదే కంజాక్షిరో! నిన్ను బా
సిల యాభూత సమస్తవృత్తికుఁడనై చేష్టావ్యయం బంది మూ
ర్ఛిలు నన్నుం గరమూఱడించఁగల వారింబాపె నే మందు, హా
బలవంతమ్ములు కర్మబంధములు నేపాలైతి నీబారికిన్.

వా. అని శోకింపుచువచ్చు మనోభవుండు వ్యాసభారతిం జూచి తెలివొంది యల్లనమ్రొక్కి యభిముఖుండైన చువో విభుఁ జూచి యేమనుచు బోధింపుచున్నది.

మొల్లారు ॥జంపె॥

భావింపనితిహాస - పౌరాణికోక్తులను
నీవెఱుఁగవా మున్ను మనసా।
చావుపుట్టువులెల్ల - సరియైనజనులకు
నీవేల కలిగేవు మనసా॥౧॥
శతకల్పజీవులౌ-జలజాసనాదులును
శతమఖప్రముఖులౌ సురలూ।
మృతిఁబొందబుద్బుద-ప్రతిమలౌ భౌతిక
ప్రతిమలకు వగవకుము మనసా ॥౨॥
లోకము లనిత్యములు-గాక యనివీక్షించు
లోకోత్తరపు తెలివి మనసా।
శోకమును జెఱచును వివేకులగువారి మది
శోకంబు చొరవెఱచు మనసా ॥౩॥
ఏకమై నిత్యమై-యినకోటితేజమై
యేప్రొద్దు వెలుఁగుచును మనసా।
వైకల్పికములుడిగి-వరసచ్చిదానంద
వార్ధియగు నియ్యాత్మ మనసా ॥౪॥
దేహులకును వివేక-బాహుళ్యముడిగింప
ధృతికూల్ప మతిగలఁప మనసా।

మోహమమకారములు-మూలములనియు నడంగ
ముదము వర్థిలుసుమ్ము మనసా॥౭॥
ఎన్ని నదులీదితివె-యెన్ని వనములు గంటి
వెన్ని గిరులెక్కితివె మనసా।
ఎన్ని కెక్కిన నృపుల-నెందఱిని గొలిచితివి
యేమిలాభముగలిగె మనసా॥౮॥
ఇంత తెల్పినఁ దెలియ కేలచింతించెదవు
వంత చెందుచు నీవుమనసా! ప్రాణ
మెంత లేదనుచు బలవంతమున విడువ మీఁ
చింతకును దుఃఖమో మనసా॥౯॥
తనువునను బొడముస్వే-దజపుపురుపులఁబట్టి
తాముఁ జంపుదు రెలమి మనసా।
తనుజులను మమత చే-తనుగట్టువడియుఁ జిం
తను బొరలుచుందురో మనసా॥౧౦॥
అటుగాన మమతాదు-లడఁగఁ జిత్తమునందు
నమరఁ దెలివినిఁగాంచి మనసా।
పటుతరానంద చిద్బ్రహ్మమగు నిత్యాత్మ
పరికించి లయమందు మనసా॥౧౧॥

వ. ఈలాగున వ్యాసభారతి బోధించినఁ దెలివిఁబొంది తల్లీ, మీరానతిచ్చిన విధమంతయు నిజము. అయినను మమకార గ్రంథి దుశ్చ్ఛేదంబయ్యె,

ఎట్లన్న వినుము.

క. అతివాసనావశంబున
గతిచెడి యాస్నేహసూత్ర కలితాంతరవి
స్తృత మోహపాశబంధము
సతతము విడిపింపలేక జడిసిరి తల్లీ!

వ. అని పలుకు మనోనాథుఁ జూచి వ్యాసభారతి మఱియు నేమని బోధింపుచున్నది.

ద్వి. వినువత్స, దేహికి వెలిపాటుగంటి
యును లేక మర్మములుచ్చిపో సెలలు
వారి మానక యేర్చు బహుళవ్రణంబు
దారుణశోకంబు, దానిమాన్పుటకు
శాంతియేపో మందు, చంచలభావ
మంతయుఁబోవంగ నణఁచు నాశాంతి.
ఆమీఁదనొకలక్ష్యమంది భావింప
నామోదముప్పొంగ నగు సుఖసిద్ధి.
అట్టి రహస్యమీవాతురుండగుటఁ
బట్టి తెల్పెదవిను, పద్మాక్షునైన
నిటలాక్షునైన హృన్నీరజమందుఁ
బటుతరనిశ్చల భావనసేయఁ
జేకూరు నానందసిద్ధి, లక్ష్యము ల
నేకములున్నవి యెన్నికమీఱి

మును వానిలోఁగొన్ని ముఖ్యలక్ష్యముల
నొనరఁదెల్పెద వినుమో మనోనాథ!
లలితమూలాలవాలంబున మొలిచి
బలువిడి షట్చక్రి పటలముల్ పెంచి
యతి సూక్ష్మతర సుషుమ్నాంతరమార్గ
గత లసన్నిజశిఖా కలితేందుబింబ
గళితామృతాలి సేకంబునఁబెరిఁగి
తలరెడు జ్యోతిర్లతాభావనయును,
దరదళద్ద్వాదశ దళహృదయాబ్జ
వరకర్ణికాంత నీవారశూకాగ్రి
పరమ సూక్ష్మతర చిద్భస్మశలాక
గురుభావమణులను గూర్చుటయొకటి;
మఱి సహస్రారపద్మంబుననుండు
పరవరాకాశంబు భావించునపుడు
పొడను ననాహత పూర్ణనాదంబు
నుడుగక వినుటయు నొకటి, యుష్ణంబు
చలువయుఁగాక నే శతకోటిసూర్య
జలజాగ్నులనుమీఱి జగమెల్లనిండి
నెలయు తేజోమయు వేమాఱుదెలిసి
కల ప్రపంచము మిథ్యగాఁజూచుటయును
వనఁదగు లక్ష్యములందు నెంతైన

మనమును నిలిపి ప్రమాదము లుడిగి
యొక్కటి భావింప నోపినఁజాలుఁ
జక్కఁగా సిద్ధించు సచ్చిదానంద
మాతని జిహ్వా జిడ్డంటక యుండు
రీతి సంసృతి యాచరింపంగ లేదు.

వ అనుచు వ్యాసభారతి బోధించిన మనోనాథుండు తెలివిఁ బొంది "తల్లీ, నాయుల్లము చల్లనాయె" ననిన విని "మనోనాథా, నీవు నివృత్తి కాంతఁగూడి రాజ్యముఁబొందుము. నీ యగ్రతనయుఁడైన వైరాగ్యు నాదరించి యాతని వచోవిశేషంబుల శోకంబుమాని సుఖమందు" మని బోధింపుచు నుండు. వేళ వైరాగ్యుండు వచ్చెనఁట యెటువలెను.

బిలహరి॥

సారమతిచే జగమ-సారమని గేరుచును
చేరె వైరాగ్యుఁడు మ-నో రమణు కడకు॥

వ. ఈలాగున వచ్చు వైరాగ్యుంగనుఁగొని మనోవిభుం డాలింగనముగావించి "వత్సా! నిన్నెడఁబాసినదిమొదలు నే ననేకాపదలం బొందియుంటి. ఇప్పుడు నినుఁగనుంగొంటిఁ గావునఁ జింత యంతయుఁబాసె" ననినఁ దండ్రిఁజూచి వైరాగ్యుండేమని బోధింపుచున్నాఁడు.

ద్వి. తెలిపెద వినుతండ్రి, తెలివిచేఁజూడఁ
బలుపురు తెరువున బంధువులైన
కరణి, నేరులఁబడ్డ కాష్ఠంబులట్లు,
సరసుల మూఁగిన జలరాశిపోల్కి-
జలనిధి నోడలు జతగూడురీతి
తలిదండ్రు లనుజులు దారలుపుత్రు
లను నెపమునఁగూడి యందఱుమగిడి
చనుదురు తమకర్మజాతమార్గముల;
భావింపఁదిగుణ స్వభావహాప్రకృతి
గావించుటకు బుధుల్ కళవళపడరు.
పరఁగంగ నీకళేబరములపైని
మరుఁగుపడంగఁ జర్మముగప్పకున్న
వేగమజ్జామాంసవితతి గ్రహింప
మూఁగినకాక ప్రముఖపక్షిగణము
వారింప నెవ్వరివశ ? మట్టిదేహ
మారయ నాపదలొందు గేహంబు;
ధనము ప్రరోహాన్నిధనము, విషయము
లెనలేని దుఃఖములిచ్చు నాయములు,
దారలు పుణ్యవిదారకము లిల
హోరాదు లమలధీహారకములని
తెలిసియుండియు రోయు తెంపుచాలక నే

కళవళపడి నరకంబుపాలైరి.
కావున మమతావికారంబులుడిగి
నీవుచాంచల్యము నిలిపి నీలోనఁ
గనుము నిత్యానంద ఘనసచ్చిదాత్మ !
యనుమాన మేటికి ననఘాత్మ! నీకు.

వ. అనుచు వైరాగ్యండు దెలిపిన విని వ్యాసభారతిఁజూచి యేమనుచున్నాఁడు.

ద్వి. తల్లి, నీయాజ్ఞ నాతనయుని పలుకు
లెల్ల వీనులవింటి నిపుడు నామనసు
తేటపడెను; మున్ను దిరిగినపువ్వుఁ
దోఁటలు కృతకనిస్తుల శైలములును
మధుగంధమాలికా మహిళాగృహాదు
లధిక దుఃఖదములటంచునే యెండ
మావులనీరను మాడ్కిని మిథ్య
గావె యత్తెఱఁగులఁ గనుగొంటి నిపుడు॥

వ. అని పలుకు మనోనాథునిఁజూచి వ్యాసభారతి యేమను చున్నది.

ద్వి. విను మనోనాథ, నివృత్తినిఁగూడి
ఘనత సంసారసౌఖ్యముఁ బొంది నీవు
కొడుకైన యావివేకునిఁజేరదీసి
కడువేగ నుపనిషత్కాంతతో నతనిఁ

బఱఁగంగ యువరాజ్య పట్టంబుగట్టు;
మఱయు వివేకేంద్రుఁ డతులమోదమున
నిన్ను నీతంత్రైన నిత్యసదాత్మఁ
జెన్నుగా నొక్కటి సేయంగఁగలఁడు.
మును నీవు మోహాదిమూర్ఖులఁగూడి
ఘనుని క్షేత్రజ్ఞునిఁ గలఁతఁబొందింప
నిత్యనిర్మలుఁడాయె నేఁటివఱకున
సత్యమై కనుపట్టు చావుపుట్టుకలఁ
బొరలుచు నీయందుఁబుట్టువృత్తులును
మఱిగి పయోరాశి మధ్యతరంగ
మాలికాబింబిత మార్తాండబింబ
జాలముల బహుత్వసరణి భేదంబు
నంది సంసారియై యట్లయాపదలఁ
గుందుచు దుఃఖాబ్ధిఁ గ్రుంకె నీవిప్పు
డారీతి వృత్తులనన్ని దప్పించి
ధీరత నిర్మలస్థితిఁ గాంచితేని
మెఱుఁగుటద్దములోని మిహిరబింబంబు
కరణి నిత్యానంద ఘనసచ్చిదాత్మ
గని సుఖియౌ జీవఘనుఁడు నిక్కైన

... ... ...

హరిభక్తి పెంపున నలశాంతి, దాంతి,

కరుణయు ముదితయుఁ గనికరంబునను
నాయుపేక్షయు మైత్రియమరసేవింప
సాయుజ్యపదమంది సౌఖ్యంబు గాంచు.

వ. అని యీలాగున వ్యాసభారతి బోధించిన నిర్మలత్వం బుగైకొని నివృత్తినిఁగూడి తనయగ్రతనయుండైన వివేకవిభునికి నిరంతరాభ్యుదయము గోరుచున్న సమయమున శాంతి తల్లిఁ జూచి యాలింగనంబుగావించి "తల్లి, నీవెందుఁబోయెదవు! మనోనాథుఁడేరీతి నున్నవాఁడు? జపేశ్వరునకు మనోవిభునకుఁ జెలిమిగలదే? యుద్ధమునఁ బరాజితుండైన మోహుండేమయ్యె?" నని యడిగిన శాంతిఁజూచి శ్రద్ధయేమనుచున్నది.

ద్వి. వినుపుత్రి! యాజీవవిభుఁడు వివేకు
ఘనుని మన్నిలచేఁ గామాదులడఁగ
వెతలేమియును లేక విమలత గాంచి
యతులిత సుఖసిద్ధి నలశమదములు
శీలింపఁ బరిచర్యసేయ నానంద
శీల నిత్యానిత్య చింతానఘాత్రి
యనుకూలభార్యగా నల్లవైరాగ్యుఁ
డనువాఁడు సఖుఁడుగా నలరుచుఁగొలువ
గరిమనహించి యాకల్లరిమాయ
నిరసింప నూహించి నేర్పునహించి
తనుఁ జేరవచ్చిన తనయు దుర్వృత్తి

కనుగుణములైన దురాత్ముల సంగ
వైర మాత్సర్యాది వైరులఁ దునిమి,
కోరి మనోనాథుఁగూడి తాసౌఖ్య
సంగతి నానందసామ్రాజ్యపదము
నంగీకరించి చెన్నలరుచున్నంత,
హతశేషుఁ డామోహుఁడా యుపసర్గ
యుతముగా మధుమతి నొగిఁబంప, వారు
జీవుఁడువచ్చిన జిగిబిగిమీఱఁ
గా, వింత గనుపట్టెఁ గనదింద్రజాల
విద్యలఁజూపిన, వేగమే యతఁడు
హృద్యముగా దానినెనసి యనేక
యోజనాంతరిత దేశోదితధ్వనుల
నోజతో విననేర్చె, నుర్విలోనున్న
ఘనతర నిధులెల్లఁ గనుఁగొనె; సకల
జన మనోభావముల్ చక్కఁగాఁదెలిసెఁ;
జదువక వినకనే సకలశాస్త్రములు
విదితములయ్యెను వేదముల్వచ్చె.
కామరూపతఁ బరకాయప్రవేశ
మామీఁద లోకాంతరాది సంచార
మాకాశ గమనము నాశుకవిత్వ
మాకల్ప జీవిత్వమాదిగాఁగల్గు

మహిమలఁజెన్నొందె మధుమతిఁగూడి
బహువిధక్రీడల బంధురోద్యాన
కృతకాద్రి నవరత్న కీలితగేహ
వితతులఁజక్కని వెలఁదులఁగూడి
మగిడి సంసారియై మాయచిక్కులకుఁ
దగిలినజీవేశుఁ దాఁజూచి మనసు
తనపుత్రి మోహునత్తఱి హెచ్చరింపఁ,
గనుఁగొని సత్తర్కగణము జీవేశు
భావించి యోదేవ, ప్రాల్మాలినీవు
ఈవిషయాసక్తి యేలకోరితివి ?
అక్కటా! భవగభీరాంబుధి దాఁట
నెక్కిన యోగత రేఁటికి విడిచి
తిరుగ సంగారనదీమధ్యకుహర
మరయక పడిపోయెదయ్యయో ! యనుచు
మాయ నదల్చి యామధుమతినడఁచి
యాయుపసర్గల నందఱఁదునిమి
తనుగాచివట్టి యాతర్కగణంబుఁ
గొనియాడి ముదమంది కోరిక లుడిగి
యాశాస్త్యమగు బోధమను నావనెక్కి
క్లేశదభవకంధి లీలగా దాఁటి
ఘనుఁడు జీవేశుఁడుత్కట చిదానంద
మనుమడింపఁగ వేడ్కనిపుడున్నవాఁడు.

వ. ఈలాగున శ్రద్ధాదేవి జీవేశువృత్తాంత మంతయుఁదెలిపినవిని సంతసిల్లి శాంతి యుపనిషద్దేవినిఁ దోడితెచ్చెద ననియెఁ. శ్రద్ధాదేవియు వివేకమహారాజు సన్నిధికివచ్చి జీవేశ్వరు వృత్తాంతమంతయుఁదెలుపు నవసరమున జీవేశ్వరుండు వచ్చె నఁట యెటువలెను.

కాంభోజి॥

భావింపఁదా క్లేశ పంచకములకును_
దావలమగునట్టి తనువునిందింపుచు॥
పావనుఁడై సంసారపాశము భేదించి
జీవేశ్వరుఁడువచ్చెఁ జిన్మయుండగుచు॥

వ. ఈలాగువచ్చు జీవేశ్వరునిఁజూచి వివేకమహారాజు శ్రద్ధాదేవియు నెదురేఁగి మ్రొక్కిన, వివేకు గారవించి నీవు జ్ఞానాధికుండవు గావున మాకుఁబూజ్యుఁడవు. నిన్ను జూచి నప్పుడే మదీయమనోరథంబీడేరె. నీ దేవియగు నుపనిషత్కాంత వలన నాత్మతత్త్వంబు దెలియుమని విష్ణుభక్తి నియోగించెఁ గావున వచ్చితిమని వివేకజీవేశ్వరులు నుపనిషద్దేవిరాకల కెదురు చూచుచు నుండు సమయమున, నిక్కడ శాంతియు నతిశీఘ్రమున మంధరగిరి కంధరమున నిందిరారమణు సన్నిధిగీతాకన్యకఁ గూడి దుష్టతర్కభయమున దాఁగియున్న యుపనిషద్దేవినిఁ గాంచి వినయావనతయై-విష్ణుభక్తి యనుమతి నతిశీఘ్రంబున నిన్నుఁ దోడితెమ్మని నన్నుఁబంచిన దాన వివేకవిభుఁడు నిన్ను

బాసిన నాఁటనుండియుఁ గంటికి నిదురగానక యున్నవాఁడూ
గాన వేగమె రమ్మనిన శాంతిఁజూచి యేమనుచున్నది.

ద్వి. అయ్యయో యిన్నాళ్లు ననదనైయున్న
కొయ్యచేఁతలఁజాల కుత్సితులైన
తర్కాది దుష్టులు తారందఱపుడు
కర్కశులై దాసిగా నేలుటకును
చేపట్టియొక్కఁడు చెఱఁగుపట్టొకఁడు
పాపంబనక కేశ పాశంబునొకఁడు
పట్టి తిగియఁగ వేగ భగ్నమైగాజు
లిట్టట్టు చెదర మేనెల్లఁగందఁగను
చలువజాఱఁగఁ గొప్పువదలి జీరాడఁ
దళతళ తొడవులత్తఱి నేలరాల
పెరిగిన ముత్యపుఁబేసుల సరులు
పఱవంగ భయమంది వడవడ వడఁకి
దిక్కెవ్వరును లేక దిగ్గునగుండె
వ్రక్కలుగా నిట్టి వగల దుఃఖింప
నన్ను పేక్షించిన నాథునిమోముఁ
గన్నియ, యేలాగుఁ గనుఁగొందు నమ్మ.

వ. అనిపలుకు నుపనిషద్దేవినిజూచి శాంతి యేమను
చున్నది.

ద్వి. చెలదిరో, వినవె వివేకునివలనఁ
గలదఁటే లోపమీకరణి దూఱఁగను !
మత్తుఁడై సాకరి మాయలు వన్ని
మొత్తంపు పగచేత మోహుండునీకు
నీపతికిని వట్టి నెపమున నింత
కోపము పుట్టించి కూరిమివాపి
మీపట్లఁ బగసేసి మొండొడ్డినట్టి
పాపాత్ముఁడా మోహపతి కళత్రాప్త
బలపుత్రమిత్ర సంపదలతోఁగూడ
విలయముఁబొందె, మీవెఱపెల్లఁదీఱె.
నింక మీకోరికలెల్లఁ జేకూఱుఁ
బంకజముఖి, చింతపడనలదమ్మ.
పతిభక్తిచే నిట్టిపాటునకోర్చి
పతిమేలు నీమదిఁ బ్రార్థించుచుండ
నీపతి పగతుర నేర్పునఁదునిమె
దీపించె నీదు పాతివ్రత్యమహిమ.
నీవంటి గుణశాలి నీవంటిసాధ్వి
నీవంటి యిల్లాలి నేఁగాన భూమి.
పోఁడిమి నీవు నీపురుషుని వేడ్కఁ
గూడియుండుటగూడఁ గోరి జీవేశుఁ
డెనలేనిముదమున నెనసియున్నాఁడు

నీనాథుతోడ భాషింపుచున్నాఁడు.
మును విష్ణుభక్తియు ముదముప్పతిల్ల
ఘనుని జీవేశు నీకాంతువివేకు
నెనయుంచి యుపదేశమిచ్చెను తత్త్వ
మనువుగాఁ దెలియంగ నడుగుమటంచుఁ.
గావున నీకు నా ఘనులకుబోధ
గావింపుజీవుండు కైవల్యమందు.
నీనాథుఁడెలమిచే నినుఁగూడినపుడె
చాన, వేగ ప్రబోధచంద్రుండు పుట్టు.
అతనిచే మోహుని హతముగావించి
మితిలేని శుభముల మెలఁతరో, వెలయు.

వ. అని పలుకు శాంతిఁజూచి విను శాంతి, నా పుత్త్రిక గీతాకన్యకయు వివేకజీవేశ్వరులకుఁ తత్త్వరహస్యము దెలుపుమనియె. కావున నట్లుచేసెద'నని శాంతిఁ గూడి వివేకమహారాజు సన్నిధికి వచ్చెనఁట యెటువలెను.

అసావేరి_ఆటతాళము॥

కలహంసగతిఁబాద_కటకముల్ మ్రోయంగ
చెలువొప్పనుపనిష_జ్జలజాక్షి వచ్చె.

వా. ఈ విధమునవచ్చు నుపనిషద్దేవి వివేకజీవేశ్వరులకుఁ మ్రొక్కి వినయావనతకంధరయై యున్నఁజూచి జీవేశ్వరుం డేమనుచున్నాఁడు.

శా. తల్లీ, నీదుమహాత్మ్య మారయఁగ నీధాత్రీస్థలిన్ మాదృశుల్
చెల్లింపందగు నీదుపాదములకై జేజే లడెల్లన్న నా
తల్లై తే జననాది సంసృతినిమిత్తంబీవు గంభీర చి
త్కల్లోలిన్యుదు పాంతరస్తవన సౌఖ్యంబొప్పఁ గల్గింతువే.

క. ఓయమ్మ యిన్నిదినములు
నాయాసముఁజెంది మూనులగువారలకై
యేయెడనుంటివో వారలు
నీయతులిత భావవిభవ నిర్ణయపరులే.

వ. అనినవిని యుపనిషద్దేవి నిజకాంతుఁజూచి యతని యను
మతివడసి యేమనుచున్నది.

ద్వి. వినుదేవ, మతముల విష్ణుమందిరము
లను రచ్చపట్టుల లలితపుణ్యాశ్రి
మముల వృద్ధమూఢ మనుజుల సభలఁ
గ్రిమమేని కడపితి కాల మంతయును.
వారలు చాలవిడవనిత వాక్యార్థ
మారసి తెలియ లేనట్లు నాభావ
మిదియని తెలియకే యెమ్మెలమీఱి
వదరుకొనుచు ద్వైతవాదులై యెపుడు

పరవాది విజయమే ఫలముగానుండు
తెరువాటుకాండ్రెట్లు తెలియంగఁగలదు
మామకగంభీర మహితభావంబు.
ఆమీఁద గృష్ణాజినాఢ్యుఁడగ్రంధ
సోమసమిత్స్రువస్తోమముల్ గొలువ
సామాదివేదముల్ సన్నుతింపఁగను
బహువిధ పుస్తకభారసంవాహ
సహితయై యెదురుగాఁ జనుదెంచు యజ్ఞ
విద్యను గనినేను వేడుక మదన
విద్యాభావంబిది వర్ణింపఁగలుగు
నని చేరఁజన నది యతివినయమున
నను బూజగావించి నాతి, నీకోర్కి
తెలుపుమనినఁ గొన్ని దినములునన్ను
గలకంఠి, పాలింపఁగావలెననిన
విని నీమకర్మము వినిపింపు మెట్టి
దని యడిగిన విద్యకాత్మభావంబు
వినిపింప విని తర్కవిద్యలు నన్ను
గనుఁగొని మిక్కిలి కరకరింపుచును
గినిసి తిట్టుచు నాదు కెంగేలువట్టి

. . . . . .

ఒక్కతె తియ్యగా నొక్కతెపైఁట

పెక్కసమున నాదు వేణి మగోర్తు
పట్టిపిగిచి చాల బన్నంబుసేయ
బిట్టు కుయ్యిడ విష్ణుభృత్యులు వారి
గిట్టి నన్ విడిపించి కినుకచే వారిఁ
గొట్టిరి మేనులు గులగులల్ గాఁగ.
అంతట నొకరీతి నచ్చోటువాసి
యంతరంగంబున నతిచింతఁబొంది
యెంతయు దిగులంది యేనున్నఁజూచి
చింతఁబో నాపుత్రి చెలిమి రక్షించె;
కావున నాగీత కరుణచే మిమ్ము
సేవింప నాభువిఁ జేర నేఁగంటి

వ. అనిపలుకు నుపనిషద్దేవినిఁ గనుఁగొని వినుమమ్మ నెన్నంటి నాయువిసందేహము తీరునని విష్ణుభక్తి నియోగించెఁ గావున నాకు నాత్మతత్త్వముపదేశింపు మనిన జీవేశ్వరుఁజూచి యుపనిషద్దేవి యేమనుచున్నది.

చ. కనుఁగొన నీవు నేననెడి కల్పితభేదముసున్న దేహికిన్
ఘనతరచిన్మయాత్మకును గావున జీవుఁడుపాధిభేదసం
జనితభిదాన్వితుండగుచు జన్మలయాదులఁగాంచినట్లుగాఁ
గనఁబడు వారిపూర్ణఘట గర్భలసత్ప్రతిబింబసైఖరిన్.

వ. అని యుపనిషద్దేవి సకలజీవాభేద పూర్వకంబుగాఁ నాత్మస్వరూప ముపదేశింప సామర్థ్యాభావంబున గ్రహింప

నేరక చింతనున్న జీవేశ్వరునకు వివేకేంద్రుఁడు తన దేవిభావ-మంతయుఁ దేటపడ నుపదేశించెనఁట యెఁటువలెను.

కల్యాణి। వాఁడెనీవైతివి॥

చూడ వేసగాదు - సుమ్ము జీవేశ॥ వాఁడెనీవైతివి॥
భానుఁడంబుఘఁబ్రతి-ఫలితుఁడైనరీతిఁ
దానవిద్యవల్లఁ-దగభేసిమండెన్॥
పూని విద్యచేతఁ-బాసఁగఁ జూచినపుడె
కానవానిత్యని-ష్కర తేజోమయుఁడైన॥ వాఁడె॥
కలిమిలేములు రెండు-గలుగఁబ్రపంచము
కలగన్నటులఁగాని-కాదు నిజము।
తెలియ రజ్జుసర్ప - ధీవలె మిథ్యగా
వెలయ నింద్రజాల-విద్యకల్పించిన ॥౨॥ వాఁడె॥
జ్ఞానకర్మేంద్రియ-గణమునేనుగాను
ప్రాణపంచకభూత-పంచకమునేనుగాను
మానసాదికరణ-మండలి ... ...
గాన... ... తుదిసత్యానందమహా ॥3॥

వ. ఈలాగున వివేకేంద్రుండు ఋజుమార్గంబున మహా వాక్యతాత్పర్య వర్ణనంబుగావించిన గ్రహించి తదనుసంధాన పరుండైన జీవేశ్వరు సన్నిధానమునకు నిధిధ్యాసనము వచ్చెనఁట యెటువలెను.

శంకరాభరణము॥

మనసుపడుఁడో జీవు - మనము రంజిల్లఁగ
చనుదెంచె నిధిధ్యా-సనమా వేళ॥

వ. ఈలాగునవచ్చిన నిధిధ్యాసనము సమీపముననున్న వివేకోపనిషత్తులఁజూచి యేమనుచున్నది.

ద్వి. అయ్య వివేకేంద్రి, యాహరిభక్తి
నెయ్యంబలర నిన్ను నియమించి పలికె.
వినుము దేవతలెల్ల వినరించిచూడ
నొనరఁగా సంకల్పయోనులుగానఁ
దగదెల్పి నీసన్నిధానమాత్రమున
నగణితగుణ విద్యయను కన్యఁగాంచు.
నటమీఁద వైరిసంహరణప్రతాప
చటులుఁడైన ప్రబోధచంద్రునిఁగాంచు.
కాన విద్యా కన్యకనుగాని వృత్తి
మానినిగూడి యమందసౌఖ్యంబు
నాను మనోనాథునట సంక్రమింపఁ
జేయుము, నీపుత్రి జీవేశుఁగూర్పు
మాయచే నిజరూప మాత్రానవిష్టు
మోహుని నతనికై మొనయునత్యంత
ద్రోహుల నుపసర్గ దుష్టులఁ దునుము

మతియొక్క కన్యకామణియైన ముక్తి
తరుణినిఁ గాంచు నీతరుణి యాపుత్రి
వలస మీకును వన్నెవాసియుఁ గలుగఁ
దిలకింప నతిశయస్థితి గల్గునని యె.

వ. అని యీరీతి విష్ణుభక్తి నిదేశమంతయుఁ దెలిపి జీవేశ్వరు సన్నిధానమునకుఁ జనియె. ఆసమయమున జీవేశ్వరుండు సద్ధ్యాసన సమాగమంబున ముదమంది యుండెనట యెట్లు వలెను.

మ. నిగమాంత ప్రతిపాద్యహృద్య మహిమానిస్తంద్రసాంద్రస్ఫూ
ర్త్యగతేజోవిభవాభిభావకమునై యాద్యంతశూన్యంబునై
తగునానందము సత్తుచిత్తునగు తత్త్వంబున్నిదిధ్యాసనా
ను గతింగాంచె నివాతనిశ్చల ఉసన్నాత్మ ప్రదీపాకృతిన్.

వ. ఆసమయంబున నుపనిషద్దేవియు సద్యోగర్భంబున విద్యాకన్యకను ప్రబోధచంద్రునిఁ గాంచిన, వివేకవిభుఁడు విద్యాకన్యకను మనోవిభునకు నొసంగె. అమ్మనోనాథుండు విద్యాసంగతి నత్యంత నిశ్చలుఁడయ్యె. ప్రబోధచంద్రుండు జీవేశ్వరు ననుమతిచే మోహుని నిశ్శేషముగావించిన, జీవేశ్వరుండు ప్రబోధచంద్రు నాలింగనముగావించి యానందకందళితుండై యుండెనట యెట్లువలెను.

చ. అమలత బోధచంద్రుఁడుదయంబయి సంతనె జీవ్రుఁ డెంతయుం
బ్రమదమునంది సందియముఁబాసి మనంబును దాను నొక్కటై
క్రమమున వృత్తులందునిమి, కాయముమాన్పడలో నెలిన్ ప్రపం
చము నిగుర్చైచనన్ వెలుఁగు శాశ్వతచిద్ఘనమూచు వేడుకన్

వ. ఆసమయంబున నుపనిషద్దేవి ముక్తికన్యకఁగనియె. ఆ కన్నియఁ గనుంగొని వివేకేంద్రుండు పరమానందంబు నొంది యాకన్నియకుఁ దగినవరునిఁగూర్చి వివేకోపనిషత్తుల మనోరథంబీడేర్తునని తలంచిఎచ్చెనఁట యెటువలెను.

పంతువరాళి॥

వెలయ వివేకుని-వేడుకచెల్లింపఁ
దలఁచి విష్ణుభక్తి - తానచ్చెనపుడు॥

వ. ఈలాగువచ్చు విష్ణుభక్తికి వివేకోపనిషత్తులు మ్రొక్కి-తల్లి, నీకరుణచే క్షేమఁబుగాంచితి మింకనస్మదీయ కన్యకయగు ముక్తికిఁ దగువరుఁగూర్చి మామనోరథంబీడేర్పుమనిన వివేకుఁగౌఁగిలించి వత్సా! వివేకా, నేనునీకన్యక వివాహ మహోత్సవంబు నెరవేర్చుటకు వచ్చినదాన స్వయంవరంబునకు

సకలమతాధిపతుల రప్పింపుమనిన వివేకుండట్లుచేయు సకల
మతసిద్ధాంతులువచ్చిరంట యెటువలెను

ఆట॥

సకలమత సిద్ధాంత-సార్వభౌములెల్ల
ప్రకటవైభవములం-బొ్రిడిమెఱయఁగా
సకలుషభావముల-నలముక్తిఁగోరుచు
నొకట వచ్చిరివేడ్క-లుప్పతిల్లఁగను

వా. ఈలాగునవచ్చు మతాధిపతులు తమతమ యుచిత
స్థానముల నిలిచిరంట యెటువలెను.

ద్వి. ఆవేళ సకలమతాధీశులెల్ల
వేవేగ తమతమ విభవముల్ మెఱయ
వచ్చిరి; ముందర వైశేషికుండు
నెచ్చుగ నిజపరమెనసి తానుండె.
తార్కికుఁడాతని దండనె తనదు
కోర్కెచే ముక్తిని గోరుచునుండె.
చేరి రామానుజ సిద్ధాంతి, ముక్తి
చేకునో నను వేసు సేయునో లేక
యని నిల్చె, నాచాయనంటి మాధ్వుఁడును
దనుదానె మెచ్చుచుఁ దగ నొప్పనిలిచె.

శైవసిద్ధాంతియు శంకరుకరుణ
గావలసిన సిద్ధి కలదనియుండె.
అంతట మీమాంస కధిపతియైన
కాంత కర్మరతుండు కడువేడ్కనచ్చె.
ఆతటి యోగీశుఁ డత్యంతయోగ
ధీతుర్యమూర్తియై తెఱఁగొప్పనిలిచె.
అంతట సాంఖ్యసిద్ధాంతి మోదమునఁ
జింతలో ముక్తి నీక్షించుచునుండె.
నాచేయఁ గానగు నర్థములన్ని
యూచాలు నీవృథా యాశలేటికని
చింతయంతయుఁబాసి చిరతరప్రజ్ఞ
వింతఁగా జెలువొందె వేదాంతి యచట.

వ. ఆసమయమున విష్ణుభక్తి యనుమతిఁగాంచి ముక్తి
కాంత నలంకరించిరఁట యెటువలెను.

ద్వి. చెలులు సత్సంగతి స్నేహంబుపేర
నలరు సంపఁగి తైలమంటిరి వేడ్క
పలుమారు తెలివను పన్నీటజలక
మలరించి నైర్మల్యమను వెలిపట్టు
మడుఁగు నెఱికగట్టి మహితప్రకాశ
మడరు నొడ్డాణము నమరఁ గీలించి



అమర సద్వాసనలను విరుల్ మునిమి
సమదృష్టులను సూర్యచంద్రుల నునిచి
లలితమానాసాగ్రి లక్ష్యంబుపేరఁ
బొలుపొందు ముత్యపు ముక్కెర వెట్టి
సన............హత నాదంబులనెడి
కవనొప్పు పంజులకమ్మలు వెట్టి
భక్తిశాంతియుఁ గర్మపటల రాహిత్య
మౌక్తికహారముల్ మగువకు నిచ్చె.
చెలిమి చేఁ గరుణ యచింత్యమాణిక్య
వలయములను బాహువల్లులఁ దొడిగె.
నెనరున మైత్రి తా నిఖిల సద్గుణము
లను చిరుగంటల నగుమొల నూలు
సవరించె; ముదితయుఁ జరణయుగ్మములఁ
రవళి భవాభవ రాహిత్యమనెడి
యందియ లిడియె నాయతివ యుపేక్ష
పొందుగా సుఖ దుఃఖముల లేములనెడి
మట్టెలుపెట్టె నీమాడ్కిని మఱియు
మట్టేది తగునట్టి మంచిశృంగార
మలరించి భావనయను మెయిపూఁత
నలఁది యానెచ్చెలులందఱు తనదు
సేవసేయఁగఁ గుల్కుచిల్కు నొయారి

కీవుల ముద్దునటింప శృంగార
భావముప్పతిలంగ భావింప నమృత
సేవధియై చాలఁజెలఁగె నాయింతి.

వ. ఈలాగున నలంకృతయైన ముక్తికాంత స్వయంవరము
నకు వచ్చెనఁట యెఱువలెను.

ఆట॥

మొలకనవ్వులె సిగ్గు-మోమునఁ దోఁపంగఁ
బులకలుప్పతిలంగఁ - బూవండపూని
కలకంఠియగు ముక్తి - కన్యకారత్నము
వలఁతియై తానా స్వయం - వరమునకు వచ్చెన్॥

వ. ఈలాగువచ్చు ముక్తికాంతఁజూచి సకల సిద్ధాంతులు
తమతమలో నేమనుచున్నారు.

ద్వి. జౌరౌర యీయింతి యలరులబంతి
భూరిలసత్కాంతి భోగవిశ్రాంతి
అతులరూపనవీన యమృతంపుసోన
మతిలతలకు కోన! మంచిదిచాన
ఘనతర కల్యాణ కర్మప్రవీణ
జనతా పరిత్రాణ చతుర యీజాణ
శుభకృత్యసదనంబు శుభనిదానంబు
విభవసంతానంబు విశ్వసుఖంబు

మన్ననల ఫలంబు మహిమలపడంబు
ఎన్నిచూడ జగంబుకెల్ల నిజంబు
వినుతుల కగు తావు వేడ్కలప్రోవు
ఘనతర స్థిరభావుకములకు తావు
కొఱంత మీఱిన గొప్పగుణముల కుప్ప
దరపయోనిధి నొప్ప దాటించు తెప్ప
కళల కావాసము కాంతసారసము
తళుకు మించుల సముత్కటపు బొక్కసము
మంతుకెక్క నొయ్యారి మాయలదారి
వంతబోనయగారి వగలు మిటారి
జిగిబిగిజిగి గ్రిమ్ము సిరుల మొత్తమ్ము
సొగసు మేలిమిసొమ్ము సొబగుల కిమ్ము
జగదేక నుతహేళి సరసపత్రాళి
నిగమాంత రసికాళి నిజమైన జాళి
సారజ్ఞ రతిశాలి సౌందర్యశాలి
నేరసజ్ఞులపాలి నిండువిరాలి
మోహినీ సతిజంట ముదముల పంట
దేహాధారుల కంట దెలియని దంట
ముకువు బంగరుబొమ్మ ముద్దులగుమ్మ
స్థిరబంధులను సమ్మతించు సీకొమ్మ
చన్నియల కొటారు వర్ధిల్లు తీరు

క్రొన్నెల గండారు గుణములబారు
ఆణి ముత్తైపుకోవ యందంపు త్రోవ
ప్రాణి కోటులఁబ్రోవ పట్టైన నావ
మనుజవర్యునికి సంభ్రమముల కునికి
ఘనుఁడగు మౌనికిఁ గనవచ్చు మనికి
కడుశోభనకరి చక్కఁదనపు నగరి
యుడివోని శశికరద్యుతి విభాప్రకర
సతతమోద మొసంగు చక్కనిరంగు
* * * కర ముప్పొంగు మేల్మిబెడంగు
నవతటిద్గాత్రి యానందసంధాత్రి
యువమోద సంధాత్రి యుపనిషత్పుత్రి
దీనిఁ గూడినవాఁడు ధీరుండు జగతి
దీనిఁ గూడినవాఁడు దివ్యవైభవుఁడు
ఈయంద మీచంద మెంచనాఁడెంద
మేయందమునఁ బొందు నిటుదీనిపొందు
ఈతీరు నీబీరమిట్టి యొయ్యార
మేతీరుగనఁదీరు నేలాగు చేరు
నీసొంపు నీయింపు నీజిగిపెంపు
నీసంపద నుతింప నెటులఁజింతింప !
ఈలాగు నీబాగు నెట్టివిరాగు
నేలాగుచేయునో యిటయేమి యగునో!

ఈనిల్కడౌకుల్కు నీముద్దు పల్కు
నేసల్లడలఁగాన నీచాయఁ గంటి
జౌర! మేలు! సెబాసు! అహహా! యమ్మమ్మ
హారె! మాయురె! భళీ! యని మెచ్చుకొనుచుఁ
దమ్మోఁదా మెఱుఁగక తమమెయి మఱచి
కర్మిష్మిన యరిదిచేఁ గలయ వీక్షించి
ననుజూచె నీయింతి ననుజూచె ననుచుఁ
గనుఁగొని రాముక్తికాంత నావేళ.

వ. ఈలాగున సకల మతాధిపతులు గొనియాడ వచ్చు ముక్తికాంతనుజూచి భారతీదేవి సకలమతాధిపతుల స్వరూపము వర్ణించెనఁట యెటువలెను.

ముఖారి॥

అతివ యీతనిఁజూడవమ్మ -
మతిలోన నినుగోరి మంచె నున్నాఁడమ్మ ॥అతివ॥
పేశలాంగి పదార్థై-పేర్పడిన పదార్థముల
కోశవంతుఁడై తర్క-గుణభూషణుండై।
అశాస్యముగ విశేషావాప్తి గాంచిన
వైశేషికుండను - వాఁడితఁడమ్మ ॥౧॥ ॥అతివ॥
చాన, మానములను - చతురంగబలముల
నాని యిరుపైయొక్క - టగునైరి బలము

ప్రాని మంచితత్త్వ - జ్ఞానఖడ్గంబునఁ
దాను ఖండించిన - తార్కికుఁడమ్మా ॥౨॥ ॥అతివ॥

రమణిరో, యల్ల (శ్రీ) - రమణాంఘ్రి భక్తి నా
కామహైన శక్తిచే - ఘోరశత్రువుల।
సమయించి సారూప్య - సామ్రాజ్యమేలిన
యమితబలుఁడైన రా - మానుజుఁడమ్మా ॥3॥ అతివ॥

తరుణిరో శ్రీముద్ర - ధారణబలమునఁ
గరకరించిన రిపుల - ఖండించి వేడ్క
............. పనుపట్టణమున నెపుడు
పరఁగనుండు మాధ్వ - పతి యితఁడమ్మ ॥౪॥

అలశివాచార క్రి - యాయోగాస్త్రములఁ
జలమునఁ గామాది - శత్రులఁ దునిమి
చెలఁగి శైవానంద - ఫలము గైకొన్నట్టి
సలలితుండగునైన - సార్వభౌముఁడమ్మ ॥౫॥

మోదమునఁ గర్మబ్రహ్మ - వాదసమర్థుఁడై
వైదిక కర్మజ - వ్యాపారాస్త్రముల
మీఁదట శత్రువుల - మించిపోడమ నీయక
పాదడఁచిన మీమాంస - పతి యాతఁడమ్మా ॥౬॥

గజయాన, విషయోగ - ఘనతరాసిచేత
గజగజ క్లేశములఁ - గంపింప నణఁచి
నిజమైన రూపమున - నిలిచియుండు లోకైక
విజయుఁడైన యోగి - పీఠుఁ డితఁడమ్మా ॥౭॥

పడఁతిరో, నిజవిద్యా - బలమున నెదిరించు
బడిబడి నవిద్యాది - పంచకము వలన
పొడము తాపత్రయ - భూతముల సమయించు
కడిమి వీఁడు సాంఖ్య - ఘనుఁ డితఁడమ్మ ॥౮॥
జలజాక్షి, లేనట్టి - జగముతోఁ బగచేయు
బలిమికత్తెయగు మాయఁ - బట్టి చెండాడి ।
వెలయంగ తనసాటి - వేఁడును లేఁడను
తెలివిని చెలువొందు న - ద్వైత సిద్ధాంతి యితఁడమ్మ॥

వ. అని సకలమతాధిపతుల స్వరూపముఁ దెలుప విని వారల
నందఱ వీక్షించి ముక్తికాంత తమలో నేమనుచున్నది.

ద్వి. ఈదేవి తెలిపిన యిందఱలోన
వాదులకోడిఁ గట్టువాఁడు తార్కికుఁడు;
వానికిఁ దగువాఁడు వైశేషికుండు
కాని రాజ్యమ్మున ఘనులఁ జేకొనఁడు.
అతని మిత్రులగు రామానుజ మాధ్వ
లతుల గర్వోద్రేకులగు వార లరయ.
శైవుండు తామస చర్యలవాఁడు
కావున వీరల ఘనత యేపాటి?
యోగ సాంఖ్యాధిపు లుడుగని చింత
నాఁగి వెనుక భోగులై యుందు రెలమి.

ఇందఱకన్నను నెసఁగు నానంద
కందళితాత్ముఁడై ఘనసత్త్వయుక్తిఁ
గడలేని సంసార కంధితరించి
కడలేని కడఁక నీకడలేమిఁ బొంది
కడపటి తత్త్వమై కనుపట్టునితఁడు
కడువేడ్కచేసె నాకనుదోయికిపుడు
ఇతనిగుణమ్ములె నిఁకనొకపాలి
జతనమ్ముగా విని సంతుష్టిగాంతు.

వ. అని యూహింపుచు నద్వైతపతి యెదుటనిలువ భారతీ దేవి మఱియు నేమనుచున్నది.

ఉ. ఓచెలి, యీమహాత్ము మహిమోన్నతిఁ దెల్పెద నిత్యచిద్విలా
సోచితశుద్ధ సత్త్వగుణయుక్తుఁడు పూర్ణమనోరథుండు ధీ
మోచిత నైరివర్గుఁడు విమూలిత సంశయ మోహ కారణుం
డీచతురుండు భేదము జయించి యభేదము నిల్పెఁ బొల్పుగన్.

వ. అనిపల్క విని ముక్తికాంత సద్యస్సంవాసిత సుమనో దామ మతని కంఠలగ్నంబు గావించిన నయ్యమలాంతరంగుండైన యద్వైతపతియు నానందంబునొంది నంతట, విష్ణు

భక్తియు వివేకోపనిషత్తులఁ జూచి మీరాకోర్కె కొనసాగె నింక శుభముహూర్తమున వివాహ మహోత్సవము నెఱవేర్పుమని నియోగింపనట్ల చేసెదనని ముక్తికాంతఁ దోడ్కొనిచనియా నంతట సకలమతాధిపతులు లజ్జానతోత్తమాంగులై చనిరి. అంతట వివాహ మండపంబలంకరించిరఁట యెటువలెను.

ద్వి. ఆవేళను వివేకు ననుమతిఁ గాంచి
వేవేగ వస్తువివేకాది సఖులు
తెలఁ గొప్ప భూమిని దిన్నెగాఁజేసి
పరిమళ జలముల బాగుగనలికి
వెలయఁ దేజము మించు నెలి ముగ్గువెట్టి
చలువ తెమ్మెర మించు చవిక గావించి
పరఁగ నాకసమను పందిరేర్పఱచి
తరణి చంద్రాగ్ను లద్దములుగా వెలయ
నెలమి నానావిధానేక వర్గములు
గల సద్గుణము మేలుకట్టుగాఁగట్టి
నవరత్నమయ తోరణము లమరించి
నవరత్న శృంగార నటన రంజిల్లు
నందమై తగిన కల్యాణమంటపము
సందడించిన ప్రీతి సమకూర్చిరపుడు.

వ. ఈలాగున నలంకరించినఁ జూచి విష్ణుభక్తియు నద్వైతో పనిషత్తు నత్యలంకృతఁజేసి కల్యాణ వేదికాయితమచ్చకరి చిత్రగా

శ్రోత్రమాంగ రంగత్సహస్రదళ కమలమధ్య కర్ణికామధ్యంబున నధ్యాసీనుఁగావించి ముక్తికాంతను రప్పించిన ముక్తికాంత వచ్చెనఁట యెటువలెను.

ఆది॥ జోడుగా శాంత్యాది - సుదతులు పాటలు
పాడఁగ నాముక్తి - భామ యావేళ।
ఈడులేని శృంగార - మెచ్చమోద ముప్పొంగ
వేడుకఁ గళ్యాణ - వేదికి వచ్చెన్॥

వ. ఈలాగున వచ్చు ముక్తి కన్యకను వివేకమహారాజు కన్యాదానము చేసెనఁట యెటువలెను.

ద్వి. అప్పుడు హరిభక్తి యనుమతి నడసి
ముప్పిరిగొనువేడ్క మోహరింపఁగను
సంతోష వైరాగ్యసత్సంగ మాదు
లెంతయుఁ బ్రీతి నహించి పార్శ్వముల
నాయత్త మాయె సర్వాయత్త మనుచు
మాయని తెరవట్టి మంగళాష్టకము
లాదరమునఁ జెప్ప నలకింకిణీని
నాద వీణావేణు నవశంఖ పటహ
భేరీరవంబులు పెంపుగా మొరయ
సారెకు వేదఘోషములు చెలంగ
నలరు ముదంబున నద్వైతపతియు

వెలయఁగాఁ గల్యాణ వేదికయందు
నమల విజ్ఞాన మనగ్ని ప్రతిష్ఠ
కామరుగాఁ గావించి గొబ్బున ప్రజ్వ
రిల్లఁగఁజేసి భూరి ప్రభావమున
నెల్లెడల నలంకరించి యామీఁద
నీషణ త్రయమను నెయ్యిమ్మువెట్టి
దోష ధర్మాధర్మ దుఃఖ భేదాదు
లను సమిధల వేల్చి యత్యంత నిష్ఠ
తనలోనఁ గుతుకంబు తనరుచుండుటయు
నామాయ యను తెరనటు తొలఁగించి
ప్రేమ వివేకుండు పెంపు వహించి
తనపుత్రిఁ దొడపైనఁ దగవొప్ప నునిచి
వనజాక్షి హస్తమా వరుని హస్తమున
నిగమోక్త విధినుంచి నిండు మోదమునఁ
దగవొప్ప నతనికి దానంబుసేయ,
నాముక్తి కన్యక నతఁడు పెండ్లాడి
ప్రేమదీపింపఁగఁ బెండ్లి కుమారుఁ
డాయింతి కంఠమునందు మాంగళ్య
దాయక సూత్రమత్తఱిఁ గట్టువేళ
మురిపెంపు నునుసిగ్గు మున్నాడి ప్రేమ
నెరయఁగా నాథుని నెలఁత తాఁజూచె.

కనుఁగొను వారికిఁ గన్నులపండు
వనువుగ నుప్పాంగ నావధూవరులు
జోడుగా నున్నంతఁ జూచి వివేకు
వేడుకఁ గనుఁగొని విష్ణుభక్తి నియె
"విను వివేకేంద్ర, నీవిఖ్యాతి మించె
మనకోర్కు లీడేరె మనచింత దీరె
ఫలియించె నీమంచి భవ్యతపంబు
కలిగె నిత్యానంద కందళి యిపుడు.

వ. అని పల్కు విష్ణుభక్తికి వివేకేంద్రుండు మొక్కి యేమనుచున్నాఁడు.

ద్వి. నీవంటి సత్కృపానిధిగల్ల నాదు
భావ మభ్యుదయ సంభావిత మయ్యె.
విజయముఁ గైకొంటి వేడ్కఁ గన్గొంటి
నిజపదమంది......దుర్గుండ నైతి
మోహాప సర్గాది మూర్ఖ సంహార
సాహసునిఁ బ్రబోధ చంద్రునిఁగంటి.
నాతండ్రియూ మనోనాథు దుర్నీతి
చేత నాపదలందు సర్వజ్ఞు దుఃఖ
మంతయుఁ బాసితి నలచిదానంద
సంతత సామ్రాజ్య సౌఖ్యమందఁగను.

వ. అని కొనియాడి ముదమంది యున్న వేళ శాంతి కరుణాది సతులు శోభనములు పాడిరఁట యెటువలెను.

శోభనము॥ శోభిత నిజశుభవైభవునకు॥

ధీరత నాద్గురువైరులను-జీరి తెలివిచేఁ జెలువలరి
సారెకు వేడ్క-ల-జగము నుతింపఁగ
మీరిన యాచిద - మితమహిమునకు॥ ॥౧॥
తుద మొదలనఁదగు భిదములను
పిదప నణుమహాద్భేదముల।
వదనపు మతిచే - నణఁచి పూర్ణుఁడై
ముదమందిన యా - ముదితాత్మునకు॥ ॥౨॥
నిరుపమ తేజో నివహంబై - ధర మొదలగు నానా
తత్త్వముల।
కరకరించి తాఁ-గానని కడఁకను
పరమ తత్త్వమా - బ్రహ్మాభిదునకు॥ ॥3॥
సకల నిష్క-ళాచలరూపై
సకలాగమముల సారమునై
అకలంక ప్రతిభాన్విత స్వక
ప్రకట మహిమచేఁ-బరఁగు నతనికి॥ ॥౪॥
స్వప్రకాశ శుచి భక్తియునై
యప్రమేయ నైజాకృతియై
అప్రతి మానందాత్మక సత్తై
ఆప్రకృతికిఁ బరమనైన యతనికి॥ ॥౫॥

వ. ఈలాగున ముక్తికాంతా కల్యాణమహోత్సవము నెఱవేర్చి విష్ణుభక్తి నిజావాసమునకుఁ జనియె. వివేకేంద్రుఁ

ముపనిషత్కాంతఁ గూడి ప్రమోదంబు నొందె. అద్వైత సార్వభౌముఁడైన జీవేశ్వరుండు ముక్తికాంతఁగూడి యమందత రానందకందళితుండై యుండెనఁట యెటువలెను.

ద్వి. ముదమున జీవేశమూర్తియు ముక్తిఁ
గదిసి భేదముమాని కలయికఁ బొంది
కడలేని వేడుక కనరాని చెలిమి
యుడివోని మోదము నుజ్జ్వలానంద
మును బొంది సుఖమంది ముల్లోకములను
తనదు తేజముకీర్తి దట్టమై నిగుడఁ
దన సాటిలేదని తనుదానె తెలిసి
వినుత వైభవముల వెలయుచు నుండె.
అనుచు శ్రీరాజమన్నారైన స్వామి
ఘనకృపానర్థిత కవితాతిశయుఁడు
పోదవాకాహ్వయ పుర నిత్యవాసి
వేదవేదాంగాది విద్యావిదుండు
చల్ల వంశాంబుధి చంద్రుఁడు సూరి
తల్లజుడైన యాతత్త్వ సంవేది
సూరయార్యున కగ్రసుతుఁడైన వాఁడు
సూరజనస్తుత సురుచిరాత్మకుఁడు
కవి సూరయాఖ్యుఁడు ఘనతత్త్వవిదుఁడు
వివరింపఁగ వివేక విజయనాటకము
తనపాలవెలయు చింతామణి పేర
కనకవనమునఁ జెంగమలను గూడి

సిరులొసంగుచు నున్న (శ్రీ)దేవుపేర
కరిఁగాచి రక్షించు కరుణాత్ము పేర
దక్షిణ ద్వారకాధాముని పేర
రక్షించు గోపాలరాయని పేర
నాచంద్రతారార్కమై భూమి వెలయఁ
గా చతురోక్తులఁ గావించినాఁడు
కావున నీపుణ్యకథ నెవ్వ రేని
భావంబులోపల భావించి రేని
చదువఁగ విని రేని చదివించి రేని
చదువ వ్రాయఁగబుద్ధి సమకూర్చి రేని
పరఁగఁ దాపత్రయోపద్రవ ముడిగి
నిరత చిదానంద నీరధిఁ దేలి
భోగులై యక్షయపుణ్యులై ధర్మ
రాగులై యానందరాజితులగుచు
నమర విజ్ఞానము నమరఁగాఁ బొంది
కొమరుగా సుతపౌత్రకోటిని గాంచి
తామరతంపరై తమకులంబరయ
సేమ మెలర్పఁగఁ జిరముందు రెపుడు.

చ. అలరఁగ నీవివేక విజయాభిధ నాటకమెవ్వ రేని ని
శ్చలమగు భక్తిచేఁ జదువఁజాలి తదీయ పదార్థభావముల్
సలలిత చిత్తవృత్తి ననిశంబును జింతనసేసి రేని వా
రలఘుతరాత్మతత్త్వ పదమంది శుభస్థితిఁ గాంతురెప్పుడున్.

# చిత్రకూట మాహాత్మ్యము



సీ. శ్రీలచే ననుపమ లీలచే నెంతయు
నలువొందు ద్వారకానగరమునను
గాంతమై జితవైజయంతమై జిగిమీఱి
మెఱుఁగారు బంగారు మేడమీఁదఁ
బొందుగాఁ గనుదోయి విందుగాఁగనుపట్టు
డంబైన కొలువుకూటంబునందుఁ
గెంపురాసంతన నింపురాణించు కుం
దనపు గద్దియనుండు దైవరాయ !

రంగకృష్ణ ముద్దులరాయ రాజసుతుఁడు
శ్రీవిజయరంగ చొక్కనాథావనీంద్రుఁ
డెలమిఁగోరిన కోరికలిచ్చు దేవ !
నీకు మ్రొక్కెద ననవద్య, నిగమవేద్య !

కైవారము॥ శ్రీద్వారకాపుర జనహృదయరంజన చారుచారిత్ర !
నీలనీరజనిభనేత్ర ! నంద యశోదానందసంధాయక !

. . . . . .

నవనీతచౌర్య ! మందరాచలధైర్య ! రాధికాహృద

యూధికాహ్లాదవిధాయక నిజభుజాశ్లేష! సంతతశేయన కృతశేష! దేవకీ వసుదేవ తపఃఫలాయిత మహీతల మహితలోక హితావతార! పాలితాఖిలసురవార! నీయెదుట నుదుటువగకోవ్రుల వైవ్రులమర, నమరనాయక సభాంతరమున నటియించు తెఱగంటి తెఱవల తెఱంగు ప్రకటించు నించుఁబోఁడులు నటియించు చిత్రకూట మాహాత్మ్య మహానాటక సంవిధానంబు చూడ నవధరింపు నాస్వామి!

విజయీభవ! దిగ్విజయీభవ!

ద్వ. శ్రీకర కైలాసశిఖర నివాసుఁ
డై కరము ప్రసిద్ధి నలరినమేటి,
భామినీరత్నమై పరఁగిన సతికి
సామేనొసంగిన చక్కనిసామి,
ఎనలేనిదయఁ బదాఱేండ్లప్రాయమునఁ
గనుపట్టునటుల మార్కండేయుఁ గాచి
శాశ్వతమైనట్టి సత్కీర్తి విశ్వ
విశ్వంభరాస్థలి వెలయించువిభుఁడు,
కనక కిరీటంబుకై వడి మిగుల
ననుపొందు జడముడియందు రహించు
నకలంకమైన శశాంకుని రేక

రకమైన మగఱాతురాలీల నమర,
నీలరత్నపుఁదాళి నెఱనీటుగన్న
హాలాహలద్యుతు లఱుత రాణింప,
నలువైన వ్యాఘ్రాజినము కటిసీమఁ
బలువన్నె పసిఁడిదుప్పటి బాగుగాంచ,
ఘనరత్న ఖచితమై కనువిందొనర్చు
కనకసౌధముఁ జేరఁగా వచ్చెనపుడు.

ప్రసంగము॥ అవురా యీవిధాన నారాజశేఖరుఁడు బలు రాజసంబు దనరఁ దనరతనాల మేడకు వచ్చి వింతచిత్రరువుల హారువుల నలువుమీఱు కొలువుకూటంబుననుండి ప్రమధ గణమ్ములతోడ వార్తలాడువిధము విన నవధరింపు నాస్వామి!

కైవారము॥ పాండవ యాదవ సముదయ హృదయసముదయ
ప్రమదాతిశయాకర సభాంతర! యదుకుల ధురంధర!!
పరాకు.

అ ష్ట క ము

శ్రీకరంబగు జోక భసితపు
రేక నుదుటను దనరఁగా।
లోకబంధు విభాకదంబము
పోఁకఁ గెంజడ లొనరఁగా॥

చాల రకమగు లీల శిరమున
బాలచంద్రుఁడు మెఱయఁగాఁ।
గేలఁ బూనిన శూలరుచులు-
ద్వేలవైఖరి నెఱయఁగా॥
గంగ విమలతరంగ ప్రియ మెసఁ
గంగ జడల వసింపఁగా
నంగకాంతులభంగ హిమగిరి
శృంగరుచులను మించఁగా॥

దరువు॥ భైరవి॥ ధృవ॥

శ్రీకైలాసంబున నుండెడు-శివుఁడు కేలశూలము దనరఁగ
పేఁకమీఱఁ బరిజనములు తన-వెంటరాఁగఁ గొలువుకు
వచ్చెన్॥

దరువు॥ శంకరాభరణము-ఆది

ప్రమథులు వచ్చిరి-రజతగిరినాయకుని
సముఖముఁ జేరఁగా-సంతసము మీఱన్॥

వ. మ్రొక్కెదము మ్రొక్కెదమయా మిక్కిలికంటి సామి!

శివుఁడు: ఓప్రమథవరులార ! నగరాజ తనూజయైన గౌరి
ముచ్చట మీఱి నాతోడ జంటగ నటనంబు సలుపు
బాళిపొడమి నాదువిరహంబునఁ బుడమి నెందు వసి
యించునో యా తెఱఁగు తెలియుదురా ?

ప్రమథులు: ఓనిరుపమ చారిత్రి, నీదు పట్టపురాణియైన శుక
వాణి వసియించుతాపు వచియింప వలయునయ్యా.

శివుఁడు: కానరోయి ప్రమథవరులార !

దరువు॥ సమపదము — సైంధవి॥

చెన్నుమీఱిన పూవుఁదోఁటలననువొందు
చిత్రకూట మహాటవియందు।
తిన్నఁదనమున గౌరి తానవతరించి
నెలకొన్నది గరిమగన్నది ॥౧॥

దంటయై నాట్యమునఁ దన వన్నెవాసి
ధరణిలో నన్నెడఁ బాసి।
ఒంటిగాఁ దిల్లనని నింపొందు నలవాలు
గంటిని దలంచు కొంటిని ॥౨॥

తిల్లయనెడు పేరుగాంచి రంజిల్లుచుఁ
జెల్లు వాకొనర నచట దేవిపుడు
పల్లవాధర నిపుడుచూడక సొంపు సం
ధిల్లదు మది రంజిల్లదు ॥3॥

అంతరంగము మిగుల నలరఁగనే వేఁట
లాడుచందమున నచటి యెలఁదోఁట।
చెంతకిపుడే యేఁగి యామెకుఁ బ్రియముగా
వింతును గారవింతును ॥౪॥

ప్రమథులు॥ వినవయా దేవాదిదేవ!

కాంభోజి - ఆది.

పదము॥ సరసిజాక్షి గుణములకు సాటిజగతిఁగలదా ?
అరసి నీవెయింతిఁజేరి యాదరింపవలదా ?
మనసుదెలిసి మెలఁగు సతిపై-మమత నీకు లేదా ?
నెనరు మీఱలాలించుట-నీకు నీతిగాదా?॥
సకలలోకారాధ్యుఁడవైన-సర్వజ్ఞుఁడవు గావా
ఒకరు నీకుఁ దెలుపవలెనా-యోమహానుభావ!

పదము॥ కాచి - ఆట.

వినరోయి ప్రమథవరులార! - తిల్ల
వనమిపుడే సేరంగ - వలయు సొంపుమీఱ॥
కలనైన నామాట మీఱదు-ఆమెఁ
గనుఁగొనక సొంపుచేకూరదు॥
పెరలలనల నామనసు కోరదు - ఆ
మెలఁత మోడి వినకే నెగు లిపుడు దీఱదు॥
పాటలాధర వలపు దాఁచదు-మిగుల
జూటువగల నన్నేఁచదు - ఆకె
కూటమికి మదినెగటు దోఁచదు - మగువ
మాటలెకాకొరుల మాట విననొసఁచదు॥

అలవారిజాక్షి నాజీవము - వ్రాసిన
టులున్నది యామెభావము - మనసు
గలగించెఁ గోకిలరావము - నిలిచె
నెలనాగ యందే నా హృదయ రాజీవము ॥౪॥

శివుఁడు॥ అటుగనుక మృగయావిహారసముచిత సాధనంబులఁ
గొనుచు నల్లతిల్లవనముఁజేర నల్లనల్లన నడువుఁడు.

ప్రమథులు॥ మంచిదయా మహానుభావా!

ప్రసంగము: అవురా యీ విధానఁ గొలువుండి కైలాస నివాసుఁడైన గౌరీవల్లభుండు భిల్లవేషంబు శోభిల్ల వెలువడి, యుత్తాలతాల రసాలసాల సముదయ సముల్లసితంబగు తిల్ల వనంబుచేరి యుద్దండగండక గండభేరుండ వరాహావాహారిపు సంతతి సంతత సమాక్రాంతంబైన తన్మహాటవిలోన వేఁట లాడువిధము చూడ నవధరించు నాస్వామి।

కైవారం॥ కళిందకన్యకా ప్రతీత మృగయావిహార కందళితా
నంద హృదయారవింద! శ్రీగోవింద! పరాకు॥

దరువు॥ బిలహరి-ఝంప.

భిల్లవేషముఁబూని యుల్లమలరఁగ హరుఁడు
తిల్లవనమున కేఁగెఁ దేజంబుమెఱయన్॥

ప్రమథులు॥ కంటివా కైలాసనివాస! పరమపావనమైన యీ
వనము సౌభాగ్యమేమని వర్ణించెదమయ్యా.

సమపదము॥ కన్నడ - రూపకము.

అలరు తావులవలన-నానందకరములై
యలరు తావుల మిగుల-నలరె నీవనము
నీలకంఠములాడు-నీటుగనుఁగొనుమిచట
నీలకంఠ, ముదమ్ము-నెమ్మదికి సంధిలఁగ ॥౨॥
పున్నాగములనీడ-పొంకమై తగునీడఁ
బున్నాగములజాడ-పొదవె నెల్లెడలన్ ॥3॥

క. కాఱడవిలోన మిక్కిలి
కూ్రరములై శరభసింహ కుంజరకిరి సం
చారములు హెచ్చెఁ దేజము
మీఱఁగ వేఁటాడవలయు మెఱనడి మెఱయన్

స్వామివాక్యం: కానరోయి ప్రిమథులార !

దరువు॥ సురటి-ఆట.

వేటలాడ విచిత్రి విక్రిమంబునఁ జిత్రి
కూటవనమునఁ గాలకూటహరుఁడు వెడలె॥

దరువు॥ గౌళిపంతు-ఝంప,

దండమెలఁగెడి లేళ్ల దయమనిచి పురవైరి
గండకమ్ములఁదనదు-ఖడ్గమునఁ గదిమెన్॥

దరువు॥ కేదారగౌళ-ఆది.

సరసఁ జరియించు నం-చల గుంపులను విడిచి
శరచాపములఁబూని-శరభములఁ దఱిమెన్॥

దరువు॥ నాగధ్వని—రూపకము.

నికటమున నటియించు—నెమ్మికదుపులఁగడచి
చికటారిగొని పులులఁ—దెగటార్చెనపుడు॥

దరువు॥ మాళవ—ఆట

దయసేయఁ దగు జంతు—తతులపై దయసేసి
భయదంబులగు జంతు—చయములను నొంచెన్॥

స్వామివాక్యము: ఓ ప్రమథవరులారా వేఁటలాడిన యలయికఁ దీఱ నీయలరుఁ దోఁటలనుందముగాని రారో యి.

ప్రమథులు: మంచిదయా మహానుభావా !

దరువు॥ కాచి—ఆది

ఈరీతి వేఁటాడి - యింపైన యొండోఁటఁ
జేరి యందొకచోట - శివుఁడు తావసియించె॥

స్వామి: ఓప్రమథవరులార ! యీవనము చక్కఁదనము గనుఁ గొంటిరా ?

పదము॥ ధన్యాసి—ఆట

నలువొందఁగా నిచట వఱలు—గొప్ప
నగములందలి తేనెదెరలు।
కొలనిలోపలి వెలిదామరలు—చిత్త
మలరించెఁ జలువ తెమ్మెరలు॥

ఒనరు నిచ్చుట మానినరులు-పూజ
లొనరింప నన్నసైన విరులు।
తనరు నుపవనకేళిపరులు-పాదు
కొనఁదగిన దాక్షపందిరులు॥
వెలసె నిడె సంపంగిగముఁలు-చూడ
వేడుకైన పున్నాగములు।
బలిసియున్నవి సహకారములు-మిగులఁ
బ్రబలినవి నారికేళములు॥

స్వామి:

కం॥ (శ్రీ)సుచిరంబై నిత్యవి
హారోచితమగుచు నందనారామంబున్
గేరుచు శృంగారమునన్
మీఱుచు నీయుపవనంబు మేదినిఁదనరెన్॥

వ. ఇందు విరులపైనలరు తలిరుల శయ్యమీఁద మృగయా-
శ్రమంబుదీఱఁ గొంతతడవు పవ్వళించి యుండెద. మీఱును
మీయలయికలుదీఱ నవలనుండుఁడు.
ప్రమథులు: మంచిదయా దయాసముద్ర!

దరువు: కేదారగౌళ-ఝంప

అలసి యుండెడువారి - నవలనుండఁగఁబంచి
తలిరు శయ్యను హరుఁడు - తాను బవళించెన్॥

ప్రసంగము॥ ఔరా యీవిధానఁ బ్రమథాధిపతి వేఁటలాడి యలయికదీఱ నల తిల్లవనంబునవర్తిల్ల దంటకనంబున నతని జంటగా నటనంబునలుపు వనంబు వడసి పుండరీకసరోవనంబు నలగొన్న వనంబున నవతరించి, తిల్లయనుపేరు ధరించి యవ్వానంబున నెఱజవ్వనంబునఁ దనరిన గౌరి, తన శృంగారవనంబుఁ జేరి, యందుఁ జెన్నొందు సురపొన్న గున్నలనీడల నీడులేని విధుకాంతమణి కాంతవేదిక నధివసించి, రేయి మిక్కిలికంటె వేల్పులమేటి నిజరూపంబుఁజూచి నాటినప్రేమఁ దనదు సరసకుఁ జేరి కలను గలసిన తెఱఁగు తనచేరికలను మెఱంగు నెచ్చెలులతోడ వచియించు విధమును, తదనంతరంబున నాహారి మధ్య హరిపూజ యొనరించు విధమును జిత్తగించు నాస్వామి!

కైవారము : బహువిధబంధభేదవిరచిత రతికళాకలాప రంజిత నిరుపమ తారుణ్యాగణ్యాయువతి జనాంతః కరణ! యదుకులాభరణ! పరాకు.

దరువు॥ సాళగభైరవి॥ రూపకం॥

అనుఁగుఁ జెలులనుగూడి – యలతిల్ల యనుకాళి
తన కేళివనమునకుఁ – దానపుడు వచ్చెన్॥

చెలి : అమ్మా, ఓ చెలువరాయూ! ఈచలువఱాతిన్నె మీఁదఁ గూర్చుండుఁడు.

కాళికాదేవి : కానిమ్మ కుందనపుబొమ్మ !

పదము॥ మంగళకైశిక - ఆది॥

జలజాక్షి, నేనొక్క కలగంటినమ్మా, ఆ
కలలోన నేనొకనిఁ గనుఁగొంటి నమ్మ।
నెలవంటి నెమ్మోము-తళుకువాఁడమ్మ వె
న్నెలవంటిమై నిగ్గు-గలుగువాఁడమ్మ॥ ॥౧॥
పలుచని కెమ్మోవి-బాగువాఁడమ్మ, క
ల్వలగెలుచు కనుదోయి-నలుకువాఁడమ్మ॥ ౨॥
వాఁడే నామది చూర-లాడె నోయమ్మ, మహిం
నీడు జోడులేని-కోడెకాఁడమ్మ॥

పదము॥ సురటి - ఆది॥

ఎన్నో వింతలు నడిపించెనమ్మా।
చెలియరో మఱికొన్ని నుడివెదనంటే।
సిగ్గు నన్ను మాటాడ నీదమ్మా॥
చాల దినములనుండి-మాలిమి చేసినవాని
చందమున లాలించె నమ్మ, మిక్కిలి
సరసలీలలను దేలించెనమ్మా, కొప్పున
విరుల మాలికలు గీలించెనమ్మ ఏమందునమ్మ॥
మఱచితివో నీననుచు-గుఱుతు తెలిసినటువలె
మంచి మాటలతేఁ డాడెనమ్మా, నాసోయగమో

తెలుచుగాఁగొని యాడెనమ్మా, ముద్దిమ్మనుచు
మఱిమఱి నను వేడెనమ్మా॥ ఏమందునమ్మా॥
పానుపుపైనుండి నన్ను-బలిమి మీఱఁగాను దన
పజ్జకుఁ జేరఁ దీసెనమ్మా, నాదు
పయ్యెదపైని తనదు చేయి వేసెనమ్మా। యిక్కువలంటి
మేను సొక్కఁగఁ జేసెనమ్మా॥

పదము॥ ఘంటారవము-ఆట

తాళఁజాల నేను దయవాని నెడబాసి-తాళఁజాలనే॥
ఇన్నాళ్లు ననవిల్తు వింటి మ-హిమ నేను గుఱుతెఱఁగ
కుంటి
నిన్న రాతిరి తఱిని నొంటి నున్న న-న్నేలికొన్న వింతలే
మఱలుకొంటి ॥౧॥

పాటలాధర కల్లగాదె-యాట
పాటలపై బాళిలేదే-వేఱె
మాటలాడ మనసురాదే-వాని
సాటి నన్నిటునొంటిగ-నిలువ నీదే॥ ॥౨॥

నెనరు మిక్కిలి గలుగు మీరే-యాలా
గున నేల జాగుచేసేరే।
యెనసిన ఘనుఁ దోడితేరే-నన్నా
ఘనుచెంతకైనఁ దోడ్కొని వడిగఁబోరే॥

చెలులు: మానినీమణి! మాటికి మము దూఱుకొననేటికే నీ
మాట జవదాటని మా మాటలు వినవే॥

సమపదము॥ పున్నాగవరాళి_ఆది.

కలను జూచినట్టి నీటు_కాని దోడి తెమ్మనేవు
కలికి, యతని యూరుపేరు తెలియుటెలాగే॥
అందమైన కొలను నీటి_యందుఁ గానుపించునట్టి
చందమామ నొడిసిపట్టు_చందమేలాగే॥
కుందరదన, గొప్పమాని_కొమ్మతుదను బాదుకొన్న।
యందరాని ఫలముచెందు_నందమేలాగే॥
ఒప్పులాడి, యద్దమునను_గుప్పునఁ గనిపించునట్టి
గొప్పముడుపు చేయిసాచి_కొనుట యెలాగే॥

చెలివాక్యము॥ ఓయలరుఁబోఁడి! అయిన నేమాయె. మేమొక
యుపాయము దెలిపెదము వినవే.

పదము॥ మోహన_ఆట.

కోరిన వరములు_గొబ్బున దయసేయు
శౌరిపూజ సేయుము_జలజాక్షి, నీవు॥
అతనిపూజ లీవేళ_ననువొందఁ జేసితే
ఆతఁడే నీకోరిక_లన్నియు నొసఁగున్॥
ఈమాట నుడువుచో_నెడమకన్నదరేని
కామినీమణి, మనవి గైకొనవమ్మ॥

అమ్మవారు॥ వినరె నెచ్చెలులార! ఇటువలె నిత్యమైన సుద్దులు నుడువు మీబుద్ధులకు మెచ్చుకొంటిని. అంగజజనకు బంగరు విగ్రహమును అతని పూజోపకరణంబులును దెచ్చి యిచ్చట నమరించరే॥

చెలులు: కానీవమ్మా బంగారుబొమ్మా.

జతి॥ మచ్చెకంటి, నీవాన - తెచ్చినటుల నన్నియుఁ
దెచ్చి యమరించినారము-చిత్తగించుమా॥

అమ్మవారు॥ కానీరే చెలులారా!

దరువు॥ శ్రీరాగము॥ఝంప॥

అందమైయలరు హరి - యపరంజి విగ్రహము
బొందుగా జలజాక్షి - పూజగావించెన్॥

చెలులు: ఓయంగనామణి! ఈయంగజ జనకుఁడే నీకోరిక సఫలము గావించునమ్మా॥

అమ్మవారు॥ కానీరే కన్యకామణులార!

ప్రసంగము॥ అపురా యీ విధంబున ఆహారిణలోచన హరిపూజ లొనరించిన యనంతరంబున నవ్వానంబున వేఁటలాడి యలసి నిదురించు హరిని సరసకుఁజేరి యతని తోడ వాదుసలిపెడిబాళి నాళీజనంబులఁగూడి, యలకాళి గదలఁగ, వల కాళీ గడుగయ్యాళితనంబున నతనిపదము

నందలి నటనబిరుదు కటకంబులాగించి కించిదవనతవదనయై యుండ, నమ్మదనశాసనుండు నిదురమేల్కాంచి యాపెను గాంచి వార్తలాడువిధము విననవధరింపుము నాస్వామి!

కైవారము॥ సాత్రాజితీప్రముఖ లీలావతీప్రణయకోపాతిశయాపనోదన పటుతరసల్లాప ! యదుకులదీప! పరాకు॥

అమ్మవారు॥ ఓచెలులారా ! యింటొకవింత చెలువుఁడు నెలకొన్నయటులున్నది. ఈతని తెఱంగు తెలియుదము గానిరారే.

చెలులు: కానీవే కన్యకామణి !

దరువు॥ సావేరి_రూపకము.

మరుని పట్టపుదంతి _ హరువు మురువును మెఱయ
హరునిఁజేరఁగఁ దిల్లె _ యను నింతివచ్చెన్॥

దరువు॥ నీలాంబరి_ఆట.

పొంచి పొంచిమెల్లనె _ పాదలమాటున నిలిచి
చంచలాక్షి, నిదురించు _ శంకరుని జూచెన్॥

అమ్మవారు॥ ఓ చెలులారా !

సమపదము॥ పంతువరాళి_ఆది.

పవళించిన నీటుకాఁడు_భవుఁడేనమ్మా_యీతఁడు.
నవమోహనాఁగుఁడో చిత్త_భవుఁడేనమ్మా॥
చూడఁదగిన నెఱచక్కని_వాఁడేయమ్మా, యితనిఁ
గూడకున్న మరునితూపు_గాడేనమ్మా.

చానలారా ! యితఁడు బిరుదు-పూనెనమ్మా, అట
తానే నేర్తునంట, మనిసాం-పూనె నమ్మ॥
అందె దోచి వాదుమీఱి-యాడెనమ్మ, కయ్య
మందు వారలతని జేరి-యాడెనమ్మా॥

అమ్మవారు॥ ఓయిందుముఖులార! యేనొకమేలఁ॥ుస చేసెదను.
మీరలిచ్చుటనే యుండుఁడు.

చెలులు॥ కానీవే కన్యకామణీ !

దరువు॥ ముఖారి-ఆట.

ఉదిరి యంద్రెనాట్యమునకు బిరుదుగా వామ-
పదమున ధరియించి మదనశాసనుండు।
నిదిరింప నటనమున-నెఱజాణయగుకాళి
కదిసి యాయందియను-గైకొనియెనపుడు॥

దరువు॥ శుద్ధసావేరి-ఝంప

నిదుర మేల్కని శివుఁడు నికటమునున్నయా
మదిరలోచనను స-మ్మద మొదవఁజూచెన్॥

పదము॥ ధన్యాసి-ఆట.

ఎందుండి వచ్చితి-విచ్చటికి నీవు
ఇందుముఖి, తెలుపుమా-యిరవుకొనుతావు॥
నీరజగంధిరో నామాట వినుము
నినుజూచినంతనే కరఁగె నెమ్మనము।

ఈరీతి నలువొందు నీచక్కఁదనము
ఈవఱకు మేమెచ్చుటను గనుఁగొనము॥ ॥౧॥

నిండు చందురు నెఱిఁవినిమోఱు
నిగనిగమని మెఱయు నెమ్మోము తీరు।
దొండపండు సోయగము మిగులఁ గేరు
తొగరుమించి నీదు వాతెఱ సౌరు॥
బెళుకుఁ గనుఁగవమించు కలువరేకులను
పలువరుస నిరసించు మొల్లమొగ్గలను।
కలికి, నీకరములు చిగురుచాయలను
గెలుచు నింతులమేటి నీపె యీయిలను॥

స్వామి: వినవే కన్యకామణి !

క. భావము రంజిలె నీమన్వొ
భావము నీచక్కఁదనముఁ బరికించినచో
మావంటివారి చెంగట
నీవంటి యొయారి కొనరునే దుడుకువగల్॥

అమ్మవారు: వినవయ్యా మహానుభావ !

క. ఈయందె బిరుదుపూనిన
నీయందె ఘటిల్లె దుడుకు నిక్కముదోఁపన్।
నాయందు దుడుకు ప్రకటము
చేయందగు నీతిపొసఁగఁ జిత్తంబెసఁగన్॥

వాక్యోపవాక్యములు:—

పదము॥ కాచి-ఆట.

నిదురఁజెంది యున్ననాఁడు-పదమునందుఁ బరఁగునందె
నదురుబెదురులేక యట్టు-లపహరింప న్యాయమా !

అమ్మ: నటనలీల దంటనైన-నాదువనము నీవుచేరి
యిటుల నందెబిరుదుపూన-నేను తాళియుందునా॥

స్వామి: భరతవిద్యయందుఁ జాల-నెఱతనమ్ముగన్న నేను
బిరుదుపసిఁడియందెఁబూను-తెఱఁగు జగమెఱుంగదా॥

అమ్మ: నావరంబు గాంచువారె-నటనమునకు బిరుదుపూనఁ
గావరంపు మాటలాడఁ-గాను నేను విందునా॥

స్వామి: మాటలేల పెంచెదీవు-మానవతిరో జంటమీఱి
నాట వినికి మదికినింపు నాటసేయ నేర్తువా॥

అమ్మ: వాదుమీఱి నాడుతఱిని-వద్ద నొకరు లేకయున్న
నీదు నాదు మెలఁకువ విచట-నిర్ణయింపశక్యమా॥

స్వామి: కానీవే కన్యకామణి !

తే. వనజసంభవుఁ డఖిలదేవతలు మునులు
దండవసియింప నిండుకొల్వుండుతఱిని
నటనచాతురి మెఱయింప నాదునీదు
విద్యమేలిమి దెలిసెడి విశదముగను॥

అటులేకాని నీవే యో యిందువదన! అందుఁ బోదము
గాని నీవు నిజమందిరమునకుఁ బోయిరమ్మా.

అమ్మ: మంచిదయ్యా మహానుభావా !

దరువు॥ కన్నడ-ఝంప.

గజగమనలఁ గూడి-కడువేడ్క మీఱఁగా
నిజసదనముఁ జేరె-నీరజాక్షి యపుడు॥

దరువు॥ బిబాసు-రూపకము.

ప్రమథులందఱు తనదు-పజ్జ మెలఁగఁగ శివుఁడు
ప్రమదమున నిజనివా-సమున వసియించెన్॥

(ఇది మొదటినాఁటి సంవిధానము)

(రెండవనాఁటి సంవిధానము)

వ. అవురా యీవిధాన నిజసదనంబుచేరిన నీరజాక్షి తన శృంగారవనమునకు వచ్చి కొంతతడవు నెచ్చెలులతోడ వార్త లాడిన యనంతరంబ యాసూనశరాసనుచెంతకు నేఁగి, యతని వెంబడి వెడలి నీరజాసను సభ చేరునంతకుమున్నె యన్నలువ కొలువుకూటమునకు వచ్చువిధమును కొలువున్న యన్నలువ చెంగటికి ఫాలలోచనుఁడు కుటిలకుంతలయుఁ దానును వచ్చి తమవృత్తాంతమంతయుఁ దెలుప, వారల వాదుతీర్చు నెఱవాది తనము తనకు-లేదని తలంచి యవ్విరించి వారలుం దానును క్షీరవారిధినుండు వారిజాక్షుని సమక్షంబునకు నేఁగువిధమును జూడ నవధరింపుము నాస్వామి.

కై వారము॥ శతముఖ చతుర్ముఖప్రముఖసుమనో మనోవినోద
కర సభాంతరాళ! శ్రీగోపాల! పరాకు.

దరువు॥ పరజు-ఆది

అందె కరమున నలరె-నలివేణులను గూడి
యిందుముఖి సొంపునను-శృంగార వసిఁజేరె॥

ఉత్తరప్రత్యుత్తరము-పదము॥ రామకవి-రూపకము.

ఇందు బింబమురీతి-నెసఁగు నీమగడాల
యందె చక్కఁదన మెంతని యెంతునమ్మా॥
అందె సోయగమె కొని-యాడెదవు హాయని బిరు
దందె కైకొన్న సా-హస మెన్న వలదా॥
ఇదియునొక సాహసమె-నేనతని నాట్యమునఁ
గదిసి గెలిచిన యపుడు-గద నాదు ఘనత॥
అదరుబెదరును లేక-యాట వినుపించు ని
న్నెదిరించు పాటివా-రెవ్వరున్నారె!॥
పేరణి వినిపించు-వితమునఁ దనుమించు
వారెవ్వరనుచు గ-ర్వము నతఁడుగాంచు॥
ఆరజము మీఱ నీ-వాట వినిపింపఁగా
నీరీతి వినిపింప-నేర్చునే యతఁడు॥

అమ్మ॥ ఓ నెచ్చెలులారా! మనము నీలకంఠుని సరసకుఁ
బోదముగాని రారే.

చెలులు॥ కానీవమ్మా కొమ్మా.

దరువు॥ అసావేరి-ఆట.

మునువున్న శృంగార-వనమునకును శంకరుఁడు॥
గొనబు మీఱఁగఁదాను-గొలువుండె నపుడు॥

దరువు॥ నాయకి-ఝంప.

శృంగార మమరఁగాఁ-జెలఁగు శంకరుఁజేర
నంగనామణి వచ్చె-నందియలు మొరయ॥

అమ్మ: నందనమయ్యా యిందు కళావతంసా!
స్వామి: వినవే కన్యకామణి! మనము కంజసంభవు సభకుఁ
బోదముగాని రమ్మా.
అమ్మ: మంచిదయ్యా మహానుభావా!

దరువు॥ ధన్యాసి-ఆట.

కాలకంఠుఁడు కాళికాదేవి వెంటరా
హాళి మీఱఁగ నబ్జభవుఁ జేరవెడలెన్॥

దరువు॥ అసావేరి-రూపకము

కలువడంబుల మీఱు-కలువడంబుల నమరు
చలువ చప్పరమున నలువ-కొలువునకు వచ్చెన్॥

దరువు॥ సారంగ-ఝంప.

తేజంబు మీఱఁగా-దిక్పాలకులఁ గూడి
జేజేలదొర యజునిఁ-జేరఁగాఁ వచ్చెన్॥

బ్రహ్మ: ఇంద్రాదులార! యిక్కడఁ గూర్చుండుఁడు.
దేవతలు: కానీవయ్యా కమలసంభవ!

దరువు॥ మలారు-రూపకము.

వెనుకఁ గొందఱు మునులు-వినయాన రాఁగాను
సనకాది మునులజుని-సభఁజేరి రపుడు

బ్రహ్మ: సనకాది మునులారా యిందుఁ గూర్చుండుఁడు.
మునులు: మంచిదయా మహానుభావా!

దరువు॥ తోడి-ఝంప.

కాళియును శంకరుఁడు-కంజసంభవుఁ జేరి
హాళిమీఱఁగ వచ్చి-రతివేగమునను

స్వామి: కంజసంభవ! నేను నీకు నంజలి ఘటియించెదనయ్యా
బ్రహ్మ: ప్రమథనాయకా! నాదు ప్రణామంబులంగీకరించి
యీరత్నసింహాసనంబునఁ గూర్చుండ వలయునయ్యా.
కాళికాదేవి, రత్నపీఠంబున నుండుమా.
అమ్మ: మంచిదయా దయాసముద్ర!
బ్రహ్మ: ఓనిటలాక్ష! ఇందీవరాక్షియు నీవు నిచ్చటికి వచ్చిన
కార్యంబు వివరింపవలయు నయ్యా!
స్వామి:

ఉ॥ తిల్లవనంబులోపలను దేజము మీఱఁగ వేఁటలాడియా
చల్లని నీడనుల్లసిలు సంపగితోఁపునఁ బవ్వళింప నీ

పల్లవపాణి నాబిరుదు బంగరుపెండెముదోఁచి వాదుసం
ధిల్లఁగ నీదుసన్నిధిని నిచ్చనటింపఁగఁబిల్వ వచ్చితిన్॥

కాళికాదేవి: వినవయ్యా సదయహృదయా !

క. నరులందఱు భళిభళియం
దురు నేనటియించుతఱి ననుంగని యాటన్
నెఱవాదినైన నాముం
దర మేదిని బిరుదు పూనఁదరమె మహాత్మా॥

పదము॥ కల్యాణి-ఆట.

కనుఁ గొనుమయ్యా జాగుసేయక
వనజసంభవ, నాట్య-వైఖరు లన్నియును।
అలయికలేక చెన్నగురీతి గుజరాతి
పొలమునే వినిపించు-పోణిమి నేర్తున్॥
బింకము మీఱఁగాఁ-బెనుబాళి పదచాలి
కొంకక వినిపించు-పొంకము నేర్తున్॥
సంతసము మీఁఱఁగ-సభనున్న జనులెన్న
వింతగా జక్కిణి-వినిపింప నేర్తున్॥

స్వామి: పదము-తోడి-ఆట.

నటన విద్యలునేర్చు-నలినాక్షులు వేరె
యిటువంటి జాణ నే-చ్చటఁగాననయ్యా॥
ఈయింతి ముచ్చట-లెల్లఁ జెల్లనాట్యము।
సేయభాళిని సభను-జేరిన దయ్యా॥

ఇంతకన్న వేడుక-యే మున్నదయ్య యీ
యింతిమాట మీఱక-యేను నటియింతున్॥
పడఁతి, భావము తెలుఁగు-పరికించి నీవిపుడు
నుడివి నటువలె-ను నేను నిజము.

బ్రహ్మ: వినుమా కాళికాదేవి!

పదము॥ పంతువరాళి-ఆది॥

భరతశాస్త్రసరణిఁ-బ్రకటించి యీ ధరణి
బిరుదు వక్కా-ణించు-హరుదరి యితఁడు ॥౧॥
ఇతని బిరుదముదోఁచి-యేపున నటియించు
చతురత గాంచిన-జాణవు నీవు ॥౨॥
గొల్లపల్లెను ముద్దు-గులుక నటియించు
నల్లదేవర తెలియు-నటన వైఖరులు ॥౩॥

క. అటుగనుక మనము హరి చెం
గటి కేఁగిన నా ఘనుండు కడుఁ బేర్మిని మీ
నటనంబు చూచి తా న
చ్చట నన్నియుఁ దేటపఱచు సమ్మదమొదవన్.

హరుఁడు: మంచిదయా మహానుభావా!

దరువు॥ భైరవి-ఝంప॥

సురలు మానులు నజుఁడు-సుదతియును వెంటరా
సరఁగ హరుఁడల పాల-సంద్రమ్ముఁ జేరెన్.

ప్రసంగము: అవురా యీ విధాన నలినసంభవుండు నెంటనంటి మిక్కిలి కంటిదంట యమ్మెచ్చెకంటియుఁ దానును జాలసముద్రింబుఁ జేరవచ్చు వైఖరిఁదెలిసి సకలలోకవృత్తాంత విజ్ఞానవిచక్షణుండైన నలినేక్షణుండు దెలిసివిరాజిల్లు చిరత్న రత్నసౌధమునకువచ్చి విబుధవర్యులు విశ్వకర్మమొదలైనవారలు గొలువ నిండుకొలువుండుసమయంబునఁ దన దండకు నాఖండలాది సురనరులఁ గూడివచ్చు నాఖండపరశువు నవలోకించి యఖండానందంబున నమ్మధుసూదనుండు నతని కెదురుగ నేఁగి తోడ్కొనివచ్చి తన కొలువుకూటంబునందుఁ గనువిందుసేయు కుందనపు గద్దియలను వసియించి వార్తలాడువిధము నవధరింపుము నా స్వామి.

కైవారము॥ లాటవరాట భోట భోజకాంభోజ నృపరాజివిరాజిత నిజాస్థానమందిర ! సకలలోకరక్షణ ధురంధుర ! పరాకు.

దరువు॥ పున్నాగ_ఆది.

బలుకీవివిమీాజుఁగాఁ_దెలిదీవిలో నలరు
కొలువుకూటముఁజేరె_నలినలోచనుఁడు॥

దరువు॥ రామకలి_ఝంప.

మణిసౌధముననున్న_మాధవునిఁ జేరిరల
ఫణిభూషణుఁడుఁగాళి_బరిహాసదులపుడు॥

బ్రిహ్మాదులు: ఎవ్వరే హెగ్గడీలు ? మా రాక వాసుదేవునకు
విన్నవింపరే !

హెగ్గడీలు: మంచిదయ్యా మహానుభావా.

పదము॥ జతి॥

తే. గీ. హరుఁడు గాళికాదేవియు సబ్జభవుఁడు
వచ్చి మీ సముఖానకు వత్తుమనుచుఁ
బ్రియముమీఱంగ మీ రెచ్చరింపుమనిరి
క్షీరసాగరశయన ! మీ చిత్తమయ్య.

విష్ణువు: రానీరే హెగ్గడీలు

దరువు॥ సైంధవి–రూపకము.
ముదితహృదయుండగుచు హరుఁడు
ముదితఁగూడి వచ్చుతఱిని
ఎదురుకొనుచు శౌరితానే–యెలమిఁదోడితెచ్చెన్.

హరి: ఇందుకళావతంసా ! యిందుఁ గూర్చుండుమా

ఈశ్వరుడు: మంచిదయ్యా మహానుభావ !

హరి: కాళికాదేవి ! నీవును గూర్చుండుమా.

కాళి: కానీవయ్యా కంజదళాయతాక్ష !

ఈశ్వరుఁడు: వినుమా అచ్యుత ! ఇచ్చిగురుఁబోఁడియు నేనును
ఇచ్చటికి వచ్చినకార్యంబు వివరించెదనయ్యా.

పదము॥ భైరవి-ఆది.

కడు వేడ్క- మీఱఁగాఁ-గైలాసమునను౦డి
వెడలి తిల్లవనమున-వేఁటలాడితిని।
అలయికతీఱంగ-నచ్చటి యెలదోఁట
నెలకొని యొకచోట-నివురించియుంటి॥
నలువొంద నటియించు-నాబిరుదు పెండెంబు
బలిమిఁ గైకొని వనిత-వాదుకు వచ్చెన్॥
వాదులను దీర్చు నెఱ-వాదివి నీవనుచు
నీదండకై వచ్చి-నెలకొంటినయ్యా॥
వనజగంధులతోడ-వాదింపఁ దగవుగా
దనినుడివి నాదుబిరు దిమ్మన వలయునయ్యా॥

పదము॥ బిలహరి-ఆట.

ఇరువురి విద్యచా-తురి తెలియునందాఁక
హరునకీయను బిరు-దందియ నేను ॥౧॥
వినవయ్య కడునాట్య-విద్య మెఱనడి మెఱయ
వనజాక్ష ! నేఁదిల్లవనమున నుందున్ ॥౨॥
వేఁటాడి యీప్రమథ-విభుఁ డలసిసొలసి యెల
దోఁటలోపల నొక్క-చోటఁ బవళించెన్ ॥3॥
పవళించియున్న తని-పసిఁడి బిరుదందియ
నవలీలగా నొడిసి-యచట నే యుంటిన్ ॥౪॥

నన్నెంచకయె యచట-నాట్యబిరుదముపూని
యున్న యీతనిఁజూచి-యోర్చ్చుటేలాగు ॥౫॥
నటనలీలల నితఁడు-నను గెలిచి యీబిరుదు
కటకము గ్రిమ్మఁటఁ-గైకొనుట లెస్స ॥౬॥

హరి: కానీవే కన్యకామణి !
కాళి: వినవయ్యా విధుకళావతంసా !

పదము॥ మధ్యమావతి-ఆది.
నీదండఁ జేరియీ-నీరజలోచన
వాదు నడపించిన-వార్తలు వింటే ॥౧॥
ఆడకే నేవత్తు-ననియెంచి యుంటి
నీడకే వచ్చితిరి-యింతలో మీరు ॥౨॥
ఉల్లమలరఁగ నేనా-తిల్లవనికి వచ్చి
వల్లగా నిరువురి-వాదములు తీర్తున్ ॥3॥

హరి: అటుగనుక నీవు నీపల్లవాధరయు ధరాతలంబున నుల్లసిలు తిల్లవనంబునకు ముందుగా నేఁగియుండుఁడా॥

స్వామి: కానీవయ్యా కంజదళాక్ష !

దరువు॥ ముఖారి-రూపకము.
కొలువున్న యీ-నలినలోచనుఁ జేర
నల విశ్వకర్మ తా-నతివేగమున వచ్చె॥

హరి: వినవోయి విశ్వకర్మ !

క. హరుఁడు నటనంబు సలుపఁగ
హరువగు నొక కనకసభయు ననువొందఁగ మే
మిరవుకొనఁదగిన యొకమం
దిరమును గావింపవలయుఁ దిల్లవనమునన్॥

విశ్వకర్మ: వినవయ్యా వనజాక్ష !

తే. స్వామిచిత్తంబుఁ దెలిసినవాఁడనగుట
భవనయుగళంబు నిర్మింపఁ బనిచినాఁడఁ
దగినవారల నేనట,, దామసంబు
సేయ కచటికి విజయంబు సేయుమయ్య.

హరి: మంచిది. అటువలెనే వచ్చెదను. నీవు నచ్చటికిరమ్ము.

దరువు॥ మోహన_ఆటతాళము.

మురభంజనుఁడు పనుప_ముదితతో వెడలి యా
పురశాసనుండు సొంపునఁ దిల్లవనికేఁగె॥

దరువు॥ ఉశాని_జంపె.

తనకొలువులోన నుం_డినవారి వెంటర
మ్మని నుడివి హరిసేరె_నంతిపురమపుడు॥

రెండవనాటి సంవిధానము ముగిసినది.

మూఁడవనాఁటి సంవిధానము

ప్రసంగము॥ ఔరా యీవిధాన ననిచిన వేడ్క శ్రీకంతు ననిచి వైకుంఠవాసుఁడైన వాసుదేవుండు వాసవచతుర్ముఖ ప్రముఖ సురవార పరివారసహితుండై తిల్లవనంబుచేరు నంతకు మున్న యంతకాంతకుఁడు విశ్వకర్మనిర్మితంబైన కనకసభాంతరమునకు వచ్చి యచ్యుతునకు నెదురేఁగి తోడ్కొనివచ్చు విధంబును, గౌరి యవతారంబైన యవ్యాజిజాక్షిస్వరూపంబు ప్రకటమగు తెఱఁగున వాదుమీఱి యవ్వనితయుఁ దానును మదనవిదారి నటనంబుసలిపెడుదారి గుడుసుకై దువ్వుదునేదారి మొదలైన వేలుపుదొరలు మేలు మేలనిమెచ్చి వారలవాదు తీర్చువిధంబును జూడ నవధరింపు నాస్వామి.

కైవారము: సకల సురాసుర నికరానంద ఘటన పటుతరనటన విద్యాతిశయప్రకటన ధౌరేయ! గోపాలరాయ! పరాకు.

దరువు॥ కాంభోజి—ఆది.

అనువుమీఱ విశ్వకర్మ—యలవరింప నందమయిన
కనకసభను హరుఁడుచేరఁ—గా వచ్చె నపుడు.

దరువు॥ శంకరాభరణము—ఆది.

హరియు నంబుజభవుండు—నమరేంద్రుఁడును సురలు
వరవిభవమునఁ దిల్ల—వనిఁ జేరిరపుడు॥

దరువు॥ ముఖారి_జంపె.

వరపాంచజన్య నిస్స్వనము విని యెదురేఁగి
స్మరశాసనుఁడు హరిని సభకుఁ దోడ్కొనితెచ్చె॥

శివుఁడు: ఓ జలజదళాక్ష ! యీ యపరంజిపీఁటమీఁదఁ గూర్చుండి నీవెంబడి వచ్చినవారల నుచితపీఠంబుల నుండ నియమింపుమా.

విష్ణువు: మంచిదయా మదనశాసనా ! ఇంద్రాదులారా ! యిక్కడఁ గూర్చుండుఁడు.

దరువు॥ దర్బారు_

సకల దేవవరులు_సంతసంబున వచ్చి
రకలంక హృదయులై_యీసభనుజూడన్॥

దరువు॥ అఠాణా_రూపకము.

వలనొప్ప హరునితో_వాదుమీఱి నటింప
నలకాళికాదేవి - యీసభను నిలిచెన్॥

విష్ణువు: వినుమయ్యా విధుకళావతంసా !

కం. ఈవనిత విద్యమెఱనడి
నీవనిలోనుఁడఁ జెల్లనిచ్చె నె బిరుదుల్
వేవేగ వాదకథలను
గావింపఁగ వట్టికట్టతన్ జెల్లదుగా.

శివుఁడు:

గీ. సరసములకేమి శౌరి యీచానయాడి
నన్ను గెలుచుట నిక్కంబు నాదుకటక
మేనొసంగిన బిరుదుగాఁ బూనెనేని
సమ్మతించెద వాదులు చాలునయ్య.

కాళికాదేవి:

కం. ఇందఱు వినుచుండఁగ నా
ముందఱ నితఁడాడు వెంగెముల సుద్దులునే
విందునె! గోవిందుఁడ, నీ
విందుండఁగ దుడుకువార్త లితఁడనఁదగునే!

వ. అటుగనుక నీకనకసభాంతరంబున వెంగెపుమాటలనక
నెమ్మనమలర నటనంబుసలుప నెమ్మనవలయునయ్యా.

శివుఁడు: వినవే లతాంగి!

పదము॥ సావేరి—ఆది. (వాక్యోపవాక్యములు)

నగరాజకన్యక—వగునీవు లివమీఱ
మిగుల మెఱవడినాడి—మెప్పించ నేర్తువా॥
స్థాణుభావమున ని—చ్చలును నమరిన నీదు
తాణ తెలియు నాచెంత నె—జాణతనములా॥
ఘనజఘనభరమూను—తనువు గాసిలునటుల
ననబోఁడి, జంటగా—నటియింపనేర్తువా?

భీమనామముఁ బూని-వినువాఁక దాల్చిన
సామి, నాతో నీవు-జాతులాడుదువా ?
అడుగిడెడునప్పుడె కం-దెడు పదములను నీవు
విడివడి నాదు వెం-బడి నాడనేర్తువా ?
ఒకమూల యందొదిగి-యుండియాడెడు నీవు
ప్రకటముగ సభను న-ర్తన మొనర్చుదువా ?

విష్ణువు: వినుమా వామదేవ ! ఈవామలోచనయు నీవును
మాటలు పెంచనేల ? మీయాటల మెఱవడిఁ బరిక
టింపుఁడు.

అసావేరి॥ ఝంప.

ద్వారకాధిపు నటన పరవిఙుతు మిరే-తు మెచ చాటు
పదపదు
మభంజన వరుసామిరే। ధీరురే। భక్తమందారురే।
బుధజనాధారురే। మేరునగధీరురే॥ జీవు॥

దరు॥ దరబారి-జంపె.

గజరాజగమన యా-గౌరి వేడుకమీఱి
గుజరాతివగ వింత-కోపుల నటించెన్॥

జక్కిణి॥ ధన్యాసి-ఆది.

సకలనటన విభేదచమత్కారప్రకార ప్రకటనకరణి సమ
రధు నటనుతు మేటె భోజాణురే-నటనసురధామనురె
సురుచుసమ్మణు కొణురే . . . . .

ద॥ జక్కిణి వగఁజూచి సభవారు దలయూఁచి
యక్క-జంబనుచుఁ గొని-యాడ శంకరుఁడాడె॥

ద॥ సౌరాష్ట్రము-జంపె.
చంద్రముఖయును శివుఁడుఁ-జాల నింపగులీల
నింద్రాదులును హరియు-నెంచనాడిరి సభను॥

దరువు॥ ధన్యాసి-ఆట.
ఒకపాద మున్నతమొనరించి శివుఁడాడ
శుకవాణి సభను నిల్వక తొలఁగె నవల॥

విష్ణువు: వినవయ్యా నటరాయ!

కం. ఒచ్చె మొకింతయు లేకయు
నిచ్చట నటియించినట్టి యిరువురి నేర్పున్
మెచ్చె సభయెల్ల మీకున్
వచ్చె మహత్వంబు చాలు వాదులిఁకేలన్॥

విష్ణువు: పదము॥ ధన్యాసి-రూపకము.
కనుఁగొంటి నిచట నేను-గను విందుగాను
వినవయ్య నటరాయ-మనసెంతొ చల్లనాయె॥
మేలిమెంచి యెల్లవారు-మేలు మేలనికొనియాడఁగాఁ
జాలవింతల వగల-జక్కిణి వినిపించు వితము॥

లివమీాఱ నటియించు-హావణికలు మెఱయఁగాఁ
గువలయాక్షి నటియించు-గుజరాతి పోలమురీతి॥
ఎనలేనిమై చక్క-దనము-ఘనము నయము జాణతనము
గనిపించఁగఁ బదచాలి-వినిపించిన నిండుసాగను॥

పదము॥ తోడి-ఆది.

స్వామి: ఎంత నీవు దయచేసితివి-యిభరాజవరదా।
వింతసేయక యిచటికి-విజయము చేసితివి॥
నీలవేణియును నేను-నిను వేడినంత నె
పాలసముద్రముననుండి-బయలు మెఱసి చేరితివి ॥౧॥
బడలికలను జూడక యే-భావమ్ము రంజిల్లఁగఁ
దడవుగ నీసభను సం-తసమెసఁగ నెలకొంటివి ॥౨॥
కృపయుంచి మదిని భేద-మెంచక వచ్చిన నీకు
నుపచారముల నుడువు లే-మున్నది నీరజదళనేత్ర ॥3॥

విష్ణువు: వినవయ్యా విధుకళావతంసా ! నీవింత యుపచరిం చుట వింతయైయున్న యది. మీాయిరువురి నటనచాతురిఁ బరికించి యుల్లమెంతయు రంజిల్లె. అటుగనుక నీకనక సభామధ్యంబున నీగంధగజయానను గాంధర్వవివాహంబున లాలించి వినోదలీలలం దేలించి యాపెనెడఁ బాయక కనకసభానాయక సమాఖ్య విఖ్యాతంబుగా నొనర్చి మహోల్లాసంబున నిత్యనివాసంబు సలుపుచూ

క. సార సలిలపరిభూత వి
సార సమూహప్రచార సముదంచిత కా
సార సముదీర్ణ పాండర
సారసవని నేను నీదు సరసనెయుందున్॥

శివుఁడు: మంచిదయ్యా మహానుభావా !

పరిసంగము: అవురా యీవిధంబున మిక్కిలి నాన తన మనంబున నానఁ దిల్లయనుచాన యాటచాలించి మాటున కేఁగి యున్న సమయంబున నమ్మధుసూదనుండు మదికింపునాట నాడినమాట జవదాఁటక నటరాయఁడు నమ్మోహనాంగిని గాంధర్వవివాహంబున నంగీకరించు విధముచూడ నవధరించు నాస్వామి !

వైవారము: సమరూపలావణ్య సౌందర్య వశీకృతాష్టమహిషీ
కళ్యాణసంతుష్ట నిజాంతరంగ! గరుడతురంగ ! పరాకు.

దరువు॥ వసంతభైరవి-రూపకము.

హరి కనుంగొన హరుఁడు-అలతిల్లయను నింతి
కరము కరమునఁ జేర్చెఁ-గనికరం బెసఁగ॥

స్వామి: వినవే లలితాంగి ! మనము తనువులొకటిగ మెలఁ
గిన తెఱఁగు నీవెఱుఁగవే ! ఇంక నీమదిఁ గలంకఁదీఱి
సుఖంబున నుందుమా.

అమ్మ: మంచిదయా పాణినాయకా !

విష్ణువు: వినవయ్యా చందావతంసా ! ఈ యిందాదులు నేనును విశ్వకర్మ నిర్మితంబైన మణిసౌధంబున నుండెద మయ్యా.

శివుఁడు: మంచిదయ్యా సదయహృదయా ! వినరయ్యా సురాసురులార ! మీరలిచ్చట వసియింపుఁడు.

దేవతలు: మంచిదయా మదనజనకా !

దరువు॥ ఎఱుకలకాంభోజి_జంపె.

హరి యానతి యొసంగ-నలతిల్ల వనినపుడు
ఇరవొంద నెలకొనిరి_సురలు నసురులును॥

దరువు॥ గౌళిపంతు_ఆది.

నెఱతనమున విశ్వకర్మ వింతగ
నిర్మించిన మణి మందిరమున।
హరియుఁ దిల్ల గోవిందుఁ డను పే-
రంతట నెగడఁగ నెలకొనె నచటన్॥

దరువు॥ కళ్యాణి_అట.

కనకాంబరునిఁ బనిచి-కడు వేడ్క- శంకరుఁడు
వనజలోచనఁ గూడి_వసియించె సభను॥

మూఁడవనాఁటి సంవిధానము ముగిసెను.

## నాల్గవనాఁటి సంవిధానము

ప్రసంగము॥ ఔరా యీవిధాన నాదానవారి నిజనివాసంబుచేరి వారిజభవాదుల వారి వారి భవనంబుల నునిచి నెల కొని యున్నంతఁ, గల్యాణగిరిశరాసనుండు కల్యాణమహోత్సవ సంతుష్టాంతరంగుండై చంద్రవదననుగూడి చంద్రశాలకు వచ్చి యచ్చిగురుఁబోఁడితోడఁ గవగూడి సరసలీలల వార్తలాడువిధము విన నవధరించు నాస్వామి.

కైవారము॥ పల్లవీపల్లవాధర మదనకదనమహోల్లాసకర శృంగార వచనవిలాస! ద్వారకానగర నివాస ! పరాకు,

దరువు॥ ఘంటారవము_రూపకము.

నీలవేణితోడ సరస_లీల వార్తలాడే శివుఁడు
చాలవేడుకలరఁ జంద్ర_శాలఁజేర వచ్చెనపుడు

దరువు॥ కేదార_ఆది.

చంద్రశాల వసించు_శంకరునిఁ జేరఁగాఁ
జంద్రముఖి తావచ్చె_సకియలనుగూడి॥

అమ్మ: వినవయ్యా నటరాయ ! నీబిరుదు గండపెండేరము గైకొమ్మా.

స్వామి: వినవే ముద్దులగుమ్మ ! ఈగండపెండేరము నీపాదమున నీవే హవణించుకొమ్మా.

అమ్మ: కానిమ్మా ప్రాణవల్లభ !

స్వామి: వినవే కలకంఠి ! నిన్ను గలలోనఁ గలసిన నాడు తెఱంగు నీ వెఱిఁగియుందువా ?

అమ్మవారు: వినవయ్యా నటరాయ ! నీ మాయలన్నియు నేఁటికిఁ బ్రకటమాయె. ఇన్ని వింతల నన్నేలయించ న్యాయమా ?

ఉత్తర ప్రత్యుత్తరములు

పదము॥ కాంభోజి–ఆట.

తొలుదొల్తనే నాదు తెఱఁగు– తెలియున
టుల దయచేసితే।
చెలువుఁడా నిన్ను వాదులకుఁ–బిలుతు నా
యెదుట నిలుతువా।
నెట్టన నీవునేర్చు విద్య–నెగడఁజేయుమ సనియెంచి నీ
గుట్టు బయలుసేయక నేనిడుము–గొంటినే
యోర్చియుంటినే।
సాహసమున నన్నెంచక–సారె నేనాడినవార్తలు
మోహనాంగ, తాళుకొమ్మని–మొ్రక్కితి
నిపుడు దక్కితి॥
నానాసభలలోన నిలిచి–నానాఁట నీననుమాటలు
వీనులకు విందుగా నేను–విందు నే
మెచ్చుకొందు నే॥

నేను మిక్కిలి గోలనంటి నీమదినెంచి నన్నేలుము
నానేరము లెంచక యిఁక-నాప్రాణనాయకా
చౌక సేయక॥
నేరమేమున్నది నీవల్ల నీరజాక్షికో-నావలపు
వారకముసేయనే నీదయవాఁడనే-కల్లలాడనే॥

పదము॥ ఆహిరి-ఆది.

గానవిద్యయందు హొయలు-గా నటించు వితమునందు
గాన నీకెన యీభూమిలోన।
నీమీఁది యనురాగాన సననే మదగజయాన ॥౧॥
మానవతిరో మరుని పదమాన నేను నినుగూడక
మాన, నిచ్చకము లాడలేనే నీ-మదిలో నను
మాన నేల నిజమే నుడివేనే॥
సన్నుతాంగి,యిచటిచెలులు-సన్నచేసి తొలఁగి రవల
సన్నజాజిశయ్యపై రావే మరుకేళి నొక్క-
సన్నఁజాతు మనవిగైకోవే ॥౨॥

పదము॥ గౌళిపంతు-ఆట.

నన్నేలుకోవె యోభామ-
నన్నేలుకోవె నాజీవము నీవె॥
నినుజూచి నప్పుడే-నిండుఁ గౌఁగిట గుత్తు
ననుచు నెంచుకొంటినే-అప్పుడే నేనీ

మనసుచూడఁ గంటినే_ఏమందునో
ఘనుచు నెఱచి యుంటినే। ఓభామ॥ ॥౧॥

ఎలఁదోఁట నలుపువ్వులు మరునితూపుల
వలె మనసు గరగించెనే_అంతలోనే
యలరువిల్తుఁడు పొంచెనే_నాఁటినుండి
వలపు మిక్కిలి మించెనే ॥౨॥

సన్నతాంగిరో సరససగఁ గౌఁగిలియీక
యున్నఁ దాళఁజాలనె_యెప్పుడెపుడంట
యున్నాను జాగేలనే_నినుగాక యొక
కన్నియ నీకనేలనే॥

దరువు॥ ఆహరి_ఆట.

మొనపంట నొకరొకరి_మోవు లానియాని
కొనగోటఁ దళుకుఁజెక్కులఁ జీటిచీటి।
ఘనువొంద బిగువుఁగౌఁగిట గ్రుచ్చిగ్రుచ్చి యా
ఘనుఁడు గౌరియు సొంపున నెనసిరపుడు॥

పదము॥ పంతువరాళి_ఆట.

కలిసితివి సమరతుల_గలిబిలిగా నిపుడు
వెలిచె వెలిచెయుఁబెనఁగు_వితము మీఱఁగను।
నామీఁద దయయుంచి_ననశయ్యపై నుండి
మోము మోమునఁజేర్చి_ముద్దుపెట్టుచును।

గాము తంత్రములెల్లఁ-గడుఁదేటగా నుడివి
వేమాఱు విడెమొసఁగి-విడెము గైకొనుచు ॥౧॥
మనసు రంజిలురీతి-మైనిమిరి కరమునను
దనువు తనువునఁ బెనఁచి-దగఁ గౌఁగిలొసఁగి।
ఘనమైన తమకమున-గళము గోరనునొక్కి-
మొనపంటి మోవాని-మోవి యొసఁగుచును ॥౨॥
కడనున్న నెచ్చెలులఁ-గనుసన్న చేఁ బనిచి
తొడను దొడ గదియించి-దుమకు మీఱఁగను।
కడుమేను సోకించి-గళరవంబులచేత
వడిగ నను వలపించి-వలపు మీఱఁగను ॥3॥

పదము॥ భైరవి-ఆట.

నేఁటికి నిజమాయెరా యోనటరాయ-మిక్కిలి మమత
నాఁటికిఁ గలలోన నన్నేలిన వితము॥
మోవియాని చెక్కిలి బాళిగాముద్దు-పెట్టెడు హాళి
యోవన్నెకాఁడ, నాభావమున నెన్నఁగా ॥౧॥
గారవించు హాసువు-కౌఁగిలించు మునువు
సారె సారెకు మనసుఁ-జాలఁ గరగింపఁగా॥
తమి గొంచునందము-దయనేలు చందము
సమరీతిఁగా నుండఁ-జక్క-నిసామి ॥౨॥

సమపదము॥ ముఖారి_ఆది.

మెఱుఁగు నీలములఁ గేరుచు_మిగులఁ గప్పుజిగిని మీఱు
కురులుదువ్వి కొప్పుఁబెట్టెనే_సంపంగి విరుల
సరులు ముద్దుగుల్కఁ జుట్టెనే।
తలిరుఁబోడి మకరికలను_దావికుంకుమ రసమునను
దళుకుఁ జెక్కుళ్లపై వ్రాసెనే_రవికందముగను
తెలిగందము మేనఁ బూసెనే॥
నెఱతనమున నన్నేలితివి_సురటిచే విసరుచు నీ
సురత కేళీశ్రమముఁ దీర్చెనే_కౌఁగిటఁ జేర్చి
సరగ మదికిఁ బ్రియముఁ గూర్చెనే॥

అమ్మ: మంచిదయా ప్రాణనాయక !
స్వామి: ఓ యలరుఁబోఁడీ ! విరులపోఁడిమి నలరు నిచ్చటి
యెలదోఁట చక్కఁదనము ముచ్చటమీఱఁ గనుఁగొం
దముగాని లెమ్మా.
అమ్మ: వినవయ్యా నిటలలోచన ! నీ వానతిచ్చినయటులనే
వెంబడిన వచ్చెదను. నాదు కైదండగైకొమ్మా.

దరువు॥ ఘంటారవము_ఝంప.

కాళికాదేవి తన కైదండ నొసఁగ వన
కేళి సలుపఁగ వెడలె_గిరిశుఁ డలరుచును॥

ప్రసంగము॥ ఔరా యీవిధాన రాజశేఖరుఁడు కేళినీ... కేళి నల తిల్లయను నతివయుల్లమలర రేయెల్ల విహరించిన యనంతరంబ తాను నవ్యనజగంధియు వనకేళియుఁ గంతుకేళియు జలకేళియు నొనర్చు విధముచూడ నవధరింపుము నాస్వామి !

కై వారము: ఆరామ విహారాది వివిధక్రీడాపర క్రీడావతీ లాలన నూతనపాంచాల ! కాంచనచేల ! పరాకు.

దరువు॥ నవరోజు-ఆట.

రమణీమణియుఁ దాను-రజతగిరియందుండు
రమణీయమైన యా-రామంబు చేరెన్॥

స్వామి: ఓరామాలలామ ! యీప్రమదవనంబునందలి దవనంపుఁ బాదులకెలనఁ బాదుకొని మీఱు కురువేరు జొంపముల చెంగటి సన్నజాదులు వలగొన్న సురపొన్న గున్నలు మొదలైన నగముల గములఁ గొన్ని నలు ముదముమీఱంగఁ జిదుముదముగాని నెచ్చెలులఁగూడి యిచ్చటికి రమ్మా.

అమ్మ: వచ్చెదనయ్యా హృదయనాయకా !

పదము॥ మధ్యమావతి-ఝంప.

స్వామి: నెఱవాదులగు నీదు నెచ్చెలుల జతగూడి
విరవాదులను నీవు-వెలఁది, గైకోవే।

అమ్మ: పెన్నిటికొలనిదరిఁ-బెంపొందు నెఱతావి
పన్నీటి ననలెల్ల-భవుఁడ, కైకొమ్మా॥
స్వామి: వెఱవక చిరుతేంట్లు వెఱపించునని నీవు
కురవకమ్ములఁ గొమ్మ విరులఁ గైకొమ్మా॥
అమ్మ: సేవంతులకు రాను-నిజముగను నుడివెదను
సేవంతులను నీవు-శివుఁడ, గైకొమ్మా॥
స్వామి: పెన్నెఱుల కొప్పునకుఁ జెన్నలరు కస్తూరి
గన్నెరులు కోసెదనె-కానుక చేసెదనె॥
అమ్మ: పరువమ్ముగా నిండు-పఱపగు పాదులనమరు
మరువమ్ములను నీవె-హరుఁడ, గైకొమ్మా॥

ఉత్తర ప్రత్యుత్తర దరువు

పున్నాగవరాళి-ఆట.

అమ్మ: మొల్లమొగ్గలు చిదిమి-మొల్లమిగ నటరాయ
చెల్లుబడిమీఱ నీ-శిరమునను జేర్తున్ ॥౧॥
స్వామి: కన్నెగేదఁగి విరులు కన్నె, నేనే తెచ్చి
తిన్నఁగాఁ గురులఁ బొందికసేతు నీకు ॥౨॥
అమ్మ: మరువ కయ్యెడ నమరు-మరువములు చేకొనుచు
హరువుమీఱఁగ నిన్ను-హరుఁడ, పూజింతున్ ॥3॥
స్వామి: పొగడపువ్వులఁ గొనుచుఁ-బొగడొందు నట్టి సర
ముగఁ గూర్చి నీదుగళ-ముననుంతు నలివ ॥౪॥

అమ్మ: కడమ విరులందఁగాఁ—గడిమిపువ్వులఁ గోసి
వడిగఁ బాళికేశ, నీ—పాదముల నుంతున్ ॥౫॥

స్వామి: నగుచు నీపున్నాగ—నగజనితమగు విరులు
తిగిచి నేనీకు బం—తిగఁ జేర్చియిత్తున్॥

దరువు॥ నాదనామ—ఆది.

చిమిమిరి పువ్వుల శివుఁడు గొరియుఁ—దీవె తునలన్
మొదలు తుమ్మెనలన్—గదిమి, పూఁబొదలన్॥

స్వామి: వినవే కన్యకామణి ! మనము కందుక విహారము
గావింతముగాని రమ్మా.

అమ్మ: మంచిదయ్యా మహానుభావ !

పదము॥ బిలహరి—రూపకము.

కరమునఁ దానందిన తతిఁ—గమలదళమ్ములనగు నీ
కరతలకాంతులు కెంపుల—కై వడి నలరంగ ॥౧॥

పరికింపఁగఁ దగుబంతిని—బడఁతిరో, గైకొనియాడుము
సరస మెలంగెడువారలు—చాల నుతింపఁగను ॥౨॥

ఒఱపుగ ధరపైనుండియు—నుబికెడుతఱి నీమైజిగి
పరమగు తెలిముత్తియముల—భాతిని బర్వఁగను॥

పరఁగెడుబంతిని గైకొని—పాళికేశ్వర, నీవాడుము
పరిపరి రీతులఁ దగులయ—వంచన లెనయంగన్ ॥౪॥

దరువు॥ మలాయ-ఆది

ఇంతులు గూడుక-యింపుగ నాడిరి
బంతులఁగైకొని-భవుఁడును సతియున్॥

స్వామి: ఓ నీహార గిరితనయ, కందుక విహారము చాలించి
జలకేళి సలుపుదముగాని రమ్మా.

పార్వతి: కానిమ్మా కైలాస నివాస !

దరువు॥ కాచి-ఆది

హరుఁడు నలకాళికయు-ననుఁగుఁ జెలులనుగూడి
సరిగఁజేరిరి కొలను-జలకేళి సలుపన్॥

స్వామి: పదము॥ సావేరి-ఆట.

నెఱచక్కఁదనమున నీదేనే నేను-నిజముగా బలికేనే।
ధరణిలో నింతులున్నా రే-తరుణిరో నీహొయలు వేఱే॥
కొలనిలోఁ దేటనీట మిగుల-గుంపులు గూడుక మెలఁగు
బెళుకుబెడఁగుమీాల లీలల-బింకముమీాఱ నేలు॥
నీనిడువాలు తెలిగన్నుఁ గవడాలు ఈ - కలువ రేకుల
కెటులఁ గలుగఁజాలు॥
ఓభామా ! ॥ మెఱుఁగుబోఁడి, నిద్దమైన-మెఱుఁగు
టద్దములఁ గేరుచు
నొఱపుమీాఱి పగలు జేలు-నుల్లాసమును జెందు॥
నీ నెమ్మోము నెఱచక్కఁదన మెందు।

పెంపొందు। తామర లెటువలెఁజెందు ॥ఓభామా॥
ఏపుమీఱు నిభకుంభముల-నెంచకగట్టి పొంకాన।
చూపట్టు నీకుజోడు లేని-సోయగము హెచ్చ నీ
గుబ్బలకు॥
మాపటితఱిని విచ్చు నీపక్క-నల-నైపు లెటు లెనవచ్చు
॥ఓభామా॥

అమ్మవారు: పదము॥ కేదారగౌళ-ఆది.

కనుఁగొంటివా యిపుడు-కనకసభాధ్యక్ష! కమలదళాక్ష!
ప॥ చెలువైన నీమోముకళను-జెందవలసి కొలనిలోపలనుండి
నలువొందు తేటజలములను తపము-
సలుపురీతి నలరు తెలిదామరలను॥
ముదముమీఱఁగ నీయాఁదలను-మిగుల
ముద్దుగులుకు చందురుకళను-జూచి
పదరకకొల్చు నైపులను-నిచట।
గదలక మెదలకయుండు-కలువగుంపులను ॥2॥
కొమరారు హరినీలములను-గేరి
యమరు నీగళము చాయలను-జూచి
తమబలగమనుచుఁ జెంతలను-జేరి
గుమిగూడి మెలఁగు నీకొదమ తేఁటులను ॥3॥

శివుఁడు: ఓయంగనామణి ! మాచెంగట నలుపు చెంగల్వవిరు లను, గొనియాడఁదగిన తామరలను, గుందనపుటందె లను, జిమ్మనగోవ్రులను, జూడరమ్మ చెలుల వెనుకఁ జనక నిలువుమా॥

దరువు॥ ఆహరి-ఝంప.

రాజీవనయనయగు-రమణి రంజిల్ల
రాజీవముల నేసె-రహిని శంకరుడు॥

దరువు॥ తలితపంచమము-ఆట.

చెలువ రాజసమెసఁగఁ-జెంగల్వలనురువ్వఁ
జెలువరాయని శివునిఁ-జెల్లుబడి మీఱెన్॥

దరువు॥ హిందోళ-వసంత.

తన కుందనపుటందెఁ-దనరు పస్నిటిచేఁ
దన కుందరదన మది-ధవుఁ డలరఁజేసెన్॥

దరువు॥ నాటకుంజరి-ఆది.

నీలాల సంతనను-నెఱయు చిమ్మనగోవి
నీలాలకయుఁబూని-నీట శివునించెన్॥

దరువు॥ వసంత-ఝంప.

జతనంబుగా సలిపె-జలకేళి నెచ్చెలుల
జత నంబుజాక్షి సర-సమెలంగ శివుఁడు॥

శివుఁడు: ఓమచ్చెకంటి, యీపడకు వచ్చి తడవాయె మన కుంజ
నవుమేడకుఁ బోదముగాని రమ్మా॥

పా: మంచిదయ్యా మహానుభావా!

దరువు॥ రామకవి_ఆట.

జలకేళి చాలించి_కోలను వెల్వడి వచ్చి
చెలులతో జతగూడి_చలువలు ధరించి।
చలువగంద మలంది_సతియును శంకరుఁడు
నలువొంద నిజసద_నముఁ జేరి రెలమి॥

దరువు॥ కల్యాణి_ఝంప.

ఆగౌరియును శివుఁడు_నలకనకసభ నఖిల
భోగంబు లనుభవిం_పుచునుండి రచటన్॥

ద్వి. అని యనివార్య శౌర్యాన్వితుపేర
ననుపమ సత్కీర్తియగు శౌరిపేరఁ
గృష్ణచారిత్రి కీర్తితుఁడైన రంగ
కృష్ణముద్దుల వీరనృపపుత్రుఁడగుచు
జయశాలి యనఁగ నెసంగిన శ్రీవి
జయరంగ చొక్కరసాధీశు నగర
నెనరుమీఱ వసించి నిరుపమానంద
మనుభవింపుచునుండు ననముని పేర
శ్రీలచేఁ దనరుచు నృపవర నిత్య

లాలితుండైన బాలసరస్వతి మఖి
సుత ముఖ్యుఁడగుచు నిస్తుల కళాప్రౌఢి
నతని మించిన వేంకటాధ్వరి సుతుఁడు
తిర్మలకవి పార్వతీపతి భజన
నిర్మలమతి విష్ణు నిత్యసేవకుఁడు
సంగీత సాహిత్య చతురుఁ డావిజయ
రంగ చొక్కావనీ రమణుని కృపను
గర్ణభూషణములుఁ గరభూషణములు
స్వర్ణాంబరంబులు సరిపెణల్ తాళి
యనువొందు నందలం బగ్రహారాది
ఘన బహుమానముల్ గాంచిన ఘనుఁడు
వచన చమత్కారవైఖరి మీఱ
రచనసేయఁగను నర్తన యోగ్యముగను
గానబు మీఱిన చిత్రకూటమాహాత్మ్య
మను నాటకము విద్యలాగూఢిఁ గన్న
కవులెన్న నానిశాకర తారకముగ
నవనీశ్వర సభార్హమై యుండుఁగాక

తిల్ల గోవింద నాటకము ముగిసెను

# భీమసేన విజయము



సీ. శ్రీదేవి నురమున భూదేవి మూపునఁ
జేర్చి వర్తించు దాక్షిణ్యశాలి
బహువిధాలంకార పరిపూర్తిచే నంద
మై వన్నెకెక్కు కల్యాణమూర్తి
జగదేక నాథుఁడై సంతతోత్సవముల
వలనొప్పు శాశ్వతవైభవుండు
తనపాద సేవకతతి తమం బెడలించి
బాగుమించిన లోకబాంధవుండు

గీ. జలజసంభవ భవ పాకశాసనాది
మౌళి మాణిక్య దేదీప్యమాన చరణ
తోయజుండగు వేంకటరాయఁ డెలమి
[1]వెలయనిష్టార్థసిద్ధి గావించుఁగాత.

వ. అని కృతిరచనా పరుండయి వేంకటపతి నేమని కొని యాడుచున్నాఁడు.

---

1. ఇష్టకామార్థ సిద్ధి. పా. అం.

ద॥ఆట॥ శ్రిత సురముని వరపాలా శ్రీలోలా
శతమఖమణి మేచక ఘనలీలా।
సురుచిర కౌస్తుభభూషా శుభవేషా
సరసిజభవనుత శయకృతశేషా।
మహిత కనకకౌశేయా బహుమాయా
విహగ తురంగమ వెంకటరాయా॥

వ. మఱియు నద్దేవతా సార్వభౌము నేమని కొనియాడు చున్నాఁడు.

జంపె॥ కలవానితోఁ బొందుగలవానిసతి వినుతి
కెకులు॥ గలవాని మంచిసిరిగలవానిఁ గొలుతున్॥
వికటారి తతులమేఁత కటారి గద సంకు
పరికటారి చేఁగలుగు శకటారిఁ గొలుతున్॥
ఏవిందు నొల్లని యావిందుఁడగు విదురు
చేవిఁదు గొన్నట్టి గోవిందుఁ గొలుతున్॥

వ. అని సదయాంతరంగయగు నలమేల్మంగ నేమనికీర్తించు చున్నాఁడు.

త్రిస్త్రబకలు॥ సిరి మెఱసినరూపు విరిదొరసినచూపు
హరిబెరసినమేపు నలరు సతిఁగొలుతున్।
నెమ్మిగెలిచిన కొప్పు నెమ్మినొలసిన యొప్పు
తమ్మివెలసినచొప్పు దనరు సతిఁగొలుతుఁ।
ఇంపుదేలినతావి కెంపుమీఱిన మోవి
పెంపుమీఱినదేవిఁ బ్రేమతోఁ గొలుతుఁ॥

గీ. అనుచు నయ్యబ్జమందిర నాదిలక్ష్మిఁ
గడలి రాపట్టి మేలిమికలికిఁ జంద
మామసైదోడు నలమేలుమంగ మరుని
తల్లి నతిభక్తి డెందంపుఁదమ్మి నిలిపి

మఱియు వేంకటేశ్వరుం డెటువంటివాఁడు:—

జంపె॥ చిలువభూణము మెక్క పులుఁగు బొల్లని నెక్క
కలికి కౌతునకు వేంకటరాయనికిని॥
కటకాముఖము చెంత బటువుకైదువు చేత
నటనతోఁబూను వేంకటరాయనికిని॥
ఎనయ నలమేల్మంగ యెదనెపుడుఁ బొసఁగంగ
ఘనతతో నుండు వేంకటరాయనికిని॥
వెలయు డెందమునందుఁ_గలిమితొయ్యలిపొందు
గలిగి విలసిల్లు వేం_కటరాయనికిని॥

వ. అంకితంబుగా నా యొనర్పంబూనిన భీమసేన విజయం బను యక్షగానంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

లఘుశేఖరతాళము॥

హరిపురంబునకు నీడు
యక్షనగరమునకు జోడు।
బెరసి యెంచఁగాను గూడు
సిరుల నెపుడు మీను వీఁడు।

కరములందుఁ గోదమ లేదు
గలుగుదోరను మించనాడు।
పరుల సరకు గోనఁడమాడు
బంట్లు నెసఁగు మీనువీడు।

వ. మఱియు నాపురం బెటువంటిదె.

త్రిపుట॥ ఆటతాళము.

రాజులాజికిఁ జీరిరన నా
రాజులట రక్షించి రిపుబల
రాజులను విదళింతు రచ్చటిరాజు లలుకన్॥
వారకన్యోడఁ జతుర విటజన
వారములు మదిఁగోరి తగఁ గై
వారములు సేయంగ వత్తురు వారసతులూ॥
కరము వెలయును
*    *    *    *    *
గనక కమల ని
కరములను జూపట్టు కమలాకరము లచటఁ॥

ద్వి. పొలుపొంద నామత్స్యపురి విరటుండు
నలువునఁ బరిపాలనము సేయుచుండు
జననుతులగు పాండు జనపాలసుతులు
వనమున ద్వాదశవర్షముల్ మెలఁగి

(ముగుపతోడుతఁ) బదుమూఁడవ యేఁడు
జగము మెచ్చంగ నజ్ఞాతవాసంబు
జరపఁ[1] దలంచి యాజననాథుదంత
నవుడుగాఁ గంకభట్టన ధర్మసుతుఁడు,
తనరంగఁ బవమాన తనయుండు వలలుఁ
డనఁగ, నర్జునుఁడు బృహన్నల యనఁగ,
మఱి నకులుండు దామగ్రంథి యనఁగఁ,
దెఱఁగు మీఱంగఁ దంత్రిపాలుఁ డనఁగ
సహదేవుఁ, డచ్చట సైరంధ్రి యనఁగఁ
దుహినాంశు సముఖి ద్రుపదనందనయు,
హితము దెల్పను దండ నృత్యంబు గఱప
వితతుల దిద్ద గోవితతిఁ బోషింప
రాజుదేవుల కంగరాగముల్ గొలుప
నోజతోడుతఁ గొల్చియుండఁ బక్షంబు
పదియొండు నెలలు దప్పక చనునంత,
మదజఘుండగు రాజుమఱఁది కీచకుఁడు
అక్కఱఁ దనయక్కయగు సుదేష్ణకును
మ్రొక్కనే తెంచి యాముదిత చెంగటను
నడయాడు క్రొమ్మించు నలువున మించు
పడఁతుక సైరంధ్రి భావించి చూచి,
కనుమ్లు గొని యక్కఁగని మ్రొక్కమఱచి
మనసిజునకులోఁగి మనసులో నపుడు

1. దలఁచి మత్స్యజనపాలు.

వ. ఏమనుచున్నాఁడు.

ఆటతాళము॥ జంపెరేకులు.

ఇమ్మహి నిటువంటి కొమ్మగలదె పువ్వు
కొమ్మగావలెఁ దావి కమ్మగాఁ గ్రిమ్మ॥
ఇలలోన నిటువంటి యెలనాగ గలదె వె
న్నెల బొమ్మగావలెఁ గళలఁ జెన్నొందె।

వ. అని మఱియు నిటువలెను.

జంపె॥ ఒనరఁ బూఁదూపులైదును గరఁగి కరవుఁబో
సినప్రతిమగాఁబోలు చెలఁగు నీచెలువా,
పూని మారుతోఁగిసిసి పువ్వువిలుతుండిపుడు
దీని ప్రాపున సూడు దీర్చుకొన లేఁడా।
కదిసి యెవ్వండో యీ కాంత యెలజవ్వనము.
నదనెఱిఁగి మునుపంటి నట్టిపుణ్యుండు।

వ. అని మఱియు నేమనుచున్నాఁడు.

ఏకతాళి రేకులు॥

కై సేయక యీగతిఁ గనుపట్టెను
కై సేసిన నేకరణిని అగునూ।
మాటలికేటికి మాటికి భువిలో
నాఁటది యిదియేమని తలఁపుదును।

గట్టిచనుంగవ ఘనవేణియుఁ దా
నెట్టుమోచెనో యీనడుమునను।
చూడఁ జూడనే వేడుకయయ్యెన్
చూడఁజూడ నిదె చోద్యంబాయెన్॥

వ. మఱియు నేమనుచున్నాఁడు.

అర్థచంద్రికలు॥

హరినీలముల సరులు హరిణాక్షి కురులు।
నలినారి కళగోము నళినాక్షి మోము।
కలికి మెడ శంఖము గడచు నశంకముగ।
కోకనదముల గెల్చుఁ గోకకుచ కేలు।
కలికి జక్కవఁ బట్టుఁ గలికి చనుకట్టు॥

చ. కలువలలీల లేవిరులకై వడి మల్లెల * * * *
* * * జాజులమాడ్కి ప్రోదిపొ
న్నలగతి కప్పురంపు రహి నవ్యకురంగ మదంబురీతిగాఁ
బొలఁతుకదేహ సౌరభము పొల్పెసఁగెన్ గడునెంచఁ
చోద్యమై॥

ద్వి. అని సింహబలుఁడు కాయజునకు లోఁగి
తనయక్కచేత నా తరుణిచందంబు
తెలియంగఁ జేరి యాదేవికి మ్రొక్కి
పలుకులు దొట్రిల్లఁ బాంచాలిఁ జూచి,

"యీకొమ్మ పేరేమి? యేజాతి? యెవ్వ
రెక్కడ నుండుఁ? బ్రాణేశుఁ డెవ్వాఁడు?
ఇక్కడి కరుదేర నేమికారణము?
మక్కువ యేపాటి మగువపై నీకు?
వినిపింపు" మనిన నా విరటుని కాంత
మనమున వెతనొంది, మరుని బారికిని
అగపడె, వీనిమోహంబు నేర్పునను
మగిడింతునని, యొంచు మాటలు పలుక,
వినఁగూడ కెంతయు విన్ననైవాఁడు
చనుదెంచి మెల్లన సైరంధ్రికడకు॥

మఱియు నేమనుచున్నాఁడు :

జంపె॥ ఇలలోన నిటువంటి చెలువుగలకాంతఁ గ
న్నులఁ జూచి నేనెఱుఁగ లలన నీయాన॥
పడఁతి, నీపేరేమి పతియెవ్వఁ డేకులము
పడుచ, యెఱిఁగింపు తప్పక నిజముగాను॥
ఏమిగావలెనన్న నెవ్వరొసఁగరు నీకు
భామ, పలుకకయుండ నేమి యిటువలెను॥

వ. అనిన సైరంధ్రి నిర్వికారయై పలుకకున్న నద్దురాత్ముఁ డేమనుచున్నాఁడు.

దరువు॥ ఆటతాళము॥ త్రిపుట.

పరుసదనమునఁ జిగురుఁగైదువు
పమ్మి మదనుఁడు వేయఁ దొడఁగిన
వెఱచి నే నీమఱుఁగు చొచ్చితి
వెలఁది ప్రోవు।
శరణు చొచ్చినవాని దీనుని
గరుణతోఁ జేపట్టి మనుచుట
పరమధర్మము నీవెఱుంగవె
పద్మనయనా।
నీకు నిఁక నావంటిపురుషుఁడు
నాకు నిఁక నీవంటి యింతియు
లోకమున వెతకినను గలుగునె
లోలనయనా।

వ. అని యీవిధంబునఁ గీచకుండు తన మనోరథంబు తేటపడం బలుక సైరంధ్రి కలుషించి వీఁడు మదాంధుఁడు వేగిర పాటువలదు. నేర్పుననె తప్పించుకొనవలయునని నయంబేర్పడ వానితో నేమనుచున్నది.

దరువు॥ జంపె.

ఓయన్న యిదినీకు న్యాయమగునా చెల్లఁ
బో యాఁడువారితోఁ బుట్టవా నీవు।
అనవచ్చు ననఁగరాదనక యెట్లాడితివి
మొనసి కొంకకపదరి మొగమొగంబునను!

ఈచీర యీరెయొడలు ఈరోఁత గనుఁగొన్న
నేచందమునఁ జిత్త మిగురొత్తె నీకు।
తెలియఁ విను మదిగాక కులహీనురాలనెటు
వలెనత్తు నెలయాలివలెఁ; బతివ్రతను॥

వ. అనిన విని యమ్మూర్ఖుం డేమనుచున్నాఁడు.

రచ్చరేకులు॥

సమ్మతింపక రేపు మాపని
జాగుచేసే తాను గాదిది
కొమ్మ, దయనిటుచూడు నినునే
నమ్మినాఁడన్।
కలికి, తప్పక చూడఁబోయినఁ
జెలుచఁ గన్నుల నీకుగ్రిమ్మనుఁ
పలుకఁ బోయిన నాలుకాడదు పదను దఱిగి॥
పడఁతి, ఊయ్యో, నీవునిటు క
న్నడచేసిన మునఁడు నొంపఁడె।
పడయ వచ్చునె మగుడ నిను నేపగిదినైన॥
మంచితనమున వినుట మిక్కిలి
మంచి దటువలెఁ గాక నన్నడి
కించినను మఱి నీవునెఱుఁగవె చంచలాక్షి॥

వ. అనిన సైరంధ్రి విని పేఁడెంతయు నష్టుండు గాఁడని, మోరతోఁ ద్రిప్పున మోహము చెదర నాడినఁగాని వెనుదీయఁడని వానితో నేమనుచున్నది.

జంపె॥ పంద యందనిమ్రాని పండ్లకును చెయిచాప
నందునా యీవట్టి యాస లేమిటికి।
తలక్రొవ్వి పరభామినులఁ గోరి చెడునట్టి
తులువ! రావణాదుల చావు వినవా।
తెగువ నిన్నిపుడు నా మగలుగంధర్వులై
మగురు నిలువున త్రొక్కి తోలఁచెదరుచూడు।

వ. అనిన విని కీచకుఁడు సైరంధ్రివలన నోడఁ బాటు గానక చిన్నవోయి మగుడ సుదేష్ణకడకుఁ బోయి నిట్టూర్పులు నిగుడించుచు, నిన్నడిగిన యింతియందు మనస్సు చిక్కియున్నది. నాయభివృద్ధిగోరితేని దాని వేగిరంబె సమకూర్పుమనిన వాని తమకంబు చూచి తలయూపుచు సుదేష్ణ యేమనుచున్నది.

జంపె॥ చెలువమున మేనకాదుల నవ్వ నీకొలువు
వెలయూండ్రు మఱి నీకు వేవురుండఁగను।
సిరిమించు నీయాడు చిగురాకుఁబోండ్లు తగ
నిరతంబు నీయిల్లు నిండియుండఁగను।
ఊరకే మొరటివలె నున్న యిటువంటి యీ
సైరంధ్రి నేరీతిఁ గోరితివి నీవు॥

వ. అనిన సుదేష్ణతోఁ గీచకుఁ డేమనుచున్నాఁడు.

ఆటతాళము॥

అప్ప, యూరకె తెలియకంటివి చప్పచేసి-యొప్పుల
కుప్ప దానికి నీడుగలదా చెప్పిచూపవె।
కొమ్మచాలదు చన్నుఁగవకోకమ్ములకును-ముద్దుమొ
గమ్ముచాలదు బెళుకు బేడిస కన్నులకును।
దానిచూపులు దానినటనలు దానినడలు-చూచిన
మానికైన విరాళిపుట్టదె మచ్చకంటి।
పచ్చవిలుగల మేటిపట్టపుఁ బచ్చతేజీ-యెందుకు
మెచ్చకంటివి తెలియకయ్యో మచ్చెకంటి॥

ద్వి. అనినఁ దమ్మునిఁజూచి యాయింతి పలికెఁ
జనునయ్య యిట్లు పరసతులను గోర?
ఏసౌఖ్యమున్నది యెందునూహింప
దోసంబు నదిగాక దూఱును నొకటి;
దానికిఁ బతులు గంధర్వు లైదుగురు
మానధనాఢ్యు లేమఱక యుండుదురు.
అది తలంచిన గుండెలగలుచునుండు
మది నిట్టి తలఁపులు మాను నాయన్న!
అనిన వాఁడిట్లను నతిదర్పమునను
వనిత, యాభయము లెవ్వరికైనఁగాక

నాకును గలవె ! గంధర్వులైదుగురు
డీకొన్న నందఱి ఁడిగఁ ద్రావి విడుతు.
చీరి బుద్ధులు రేపు చెప్పెదుగాని
సైరంధ్రి నిచటికి సరగ రప్పింపు.
అనుచు గద్గదకంఠమమర దైన్యమునఁ
దన సహోదరి పాదతలమున వ్రాలె.

వ. ఇవ్విధంబున మ్రొక్కి లేవకున్న తమ్మునిఁ జూచి యెంత చెప్పినను వీనిచిత్తంబు మగుడదని చింతాక్రాంతయై సుదేష్ణ వానికరంబులు గ్రుచ్చి యిందులకుఁగా నింతవంత నీకేమిటికి ? మదిర దెచ్చుట కాయింతి నిప్పుడె నీయింటికిఁ బనిచెద. నీయభిమతం బీడేర్చుకొమ్మని యొకనెపంబున సైరంధ్రిని బిలిచి సుదేష్ణ నేమనుచున్నది.

జంపె॥ తావిమించిన పంచదార పానకమెంత
త్రావినను దాహంబు తాళదేమిటను।
పెదవులెండుచు దప్పి బెట్టుగానయ్యెడిని
మదిరచేఁగాని యిది మానదేమిటను।
మన సింహబలు నింట మంచివారుణ్ణిగలదు
చని వేగిరమె తెమ్ము చవిగలదిగాను॥

వ. అనిన సైరంధ్రి యుల్లంబెంతయుఁ దల్లడంబంది యా సుదేష్ణతో నేమనుచున్నది.

త్రిపుట॥ తల్లి, నన్నే పంపవలెనా-క్షుల్లకములగు నిట్టిపనులకుఁ
జెల్లఁబో! సుర దెచ్చుటకు మఱి-చెలులు లేరా।
అమ్మ ధర్మమె మంచియిల్లని-యరసి యొకనెపమునను
నిన్నసి
నమ్మిచేరినవారియెడ మన్ననలు దప్పన్।
భూమిరాజులు మేరదప్పిన-పాము లురవడి త్రోవఁ
గఱచిన
నేమిసేయఁగవచ్చుఁ జూచుట-యింతెకాక।

వ. అనిన విని సుదేష్ణ యిది యనుచితంబని శంకించి తమ్ముని బలవంతంబు దలంచి కలువుఁగొట్టుతనంబున సైరంధ్రితో నేమనుచున్నది.

జంపె॥ కడవారిఁ బంపగాఁ గాదనుచు నీపనికిఁ
బడఁతి, నిను బొమ్మంటిఁ బ్రాణపదమగుటన్।
చెల్లఁబో నావేడ్క చిన్నపుత్తురె చెలీ
యెల్లనటు పోనాడి యిగురాకుఁబోఁడి।
ఇదియేమి వింతయిల్లే నీకుఁబోఁగదవె
మదిరాక్షి, యేగు నామాట త్రోయకువె॥

వ. అనిన విని సైరంధ్రి సుదేష్ణ నుపచరింపక దీనితో నూఱక యుచితంబు కాదని యాయింతి యొసఁగిన పయిఁడి గిన్నె కేలఁబూని కీచకు నింటికిఁబోవుచుఁ దనలోఁదా నేమనుచున్నది.

చెంపె రేకులు॥

ఎంతటిది బలిమి నన్నీ పనికిఁబనిచె నీ
జంత యెక్కడినుండి సంగడం బాయెన్॥
పమ్మి హీనపుఁబనికిఁ బరుచుఁగా కెదిరియిది
ప్రాప్తమెఱుఁగునె సురాపాయినిది తలఁపన్॥
కొలఁది యెఱుఁగనివారిఁ గొలిచి మనుకంబెసఁడ
నృలయందు మునివృత్తి మెలఁగుటయె ఘనత॥

అట తాళము॥

తోడఁ బుట్టిన వానిమాటలు తోఁపయ లేక-మెల్లన
మూడుమా పొమ్మనియె మాయల చుప్పనాతి।
ఒదిఁగి యూరక యొకులపంచల నుండనీక-దైవము
వెదకి పగ సాధించెఁ దన మది-వేగిఁగుదోఁచి॥
దీమసంబునఁ బోవనెవ్వరు దిక్కు-నాకు-నోచిన
నోముఫల మిట్లాయె నేనిఁక నేమిసేతున్॥
కానఁ బండెండ్రేండ్లు మెలఁగితి గారవమున-కడపట
మానమెడలకయున్న మఱి యేమైననేమి॥

వ. అని మఱియు నేమనుచున్నది.

అర్ధచంద్రికలు॥

గుదిగొను దిగులున గడగడ వణఁకున్
పదములు తొట్రిలఁ బెదవులు తడుపున్
అలమటఁ గన్నుల నశ్రులునించున్
* * * * *
బాపురె విధియని ఫాలంబంటున్॥

వ. ఈవిధంబున సైరంధ్రిభయాకులితయై దురితనివారణంబు వారుణిభయనివారణంబుసేయ నేమనుచున్నది.

జంపె॥ శరణు నందకుమార శరణు శ్రితమందార
శరణు నిత్యానంద శరణు గోవింద।
శరణు పావనరూప శరణు సుగుణకలాప
శరణు రవిశశినేత్ర శరణు ఘనగాత్ర॥
శరణు నిర్జితదోష శరణార్థి జనపోష
శరణు నీరధిగేహ శరణు ఖగవాహ॥

ద్వి. అని పుండరీకాక్షు నాత్మలోఁదలఁచి
దినకరుఁజూచి హా దినరాజ, లోక
బంధుర, పద్మినీబాంధవ, సప్త
సైంధవ, విధివిష్ణు శంకరరూప!
పాండుపుత్రులకుఁ దప్పనిదాననేని
చండాలుఁడైన కీచకునిచే సిగ్గు
కుఱ్ఱంగకుండఁగఁ జేసికొన వేగవచ్చి
యంగదతో మాన్పుమని కేలుమోడ్చఁ
గరుణించి భానుఁడా గజయానఁదలఁచి
సరగున నొక్క రాక్షసుఁబంపువెట్టె;
అపుడు వాఁడదృశ్యుఁడై వెంటరాఁగఁ
జపలాక్షి చనియెఁ; గీచకుఁడంత నచట॥

జంపె॥ అక్క నాతో నప్పుడనినట్లు సైరంధ్రి
నిక్కడికిఁ బనుచునో యిపుడనుచునలరున్।
తెలియవచ్చిన దాఁపు తెరువులను మాటలనె
మరలించితీర్తునని మరలిపోకుండున్।
అదరిపాటున నెవ్వరైన వచ్చినఁజూచి
యదె వచ్చె సైరంధ్రియని కౌఁగిలించున్॥

అర్ధచంద్రికలు॥

త్రోవ వాకిటఁ దలుపుమరుఁగునఁ దొంగిచూచున్॥
మేడమీఁదికి నెక్కి వాడలఁ గలయఁజూచున్॥
నిగిడిపీటలుపెట్టి గోడలు నిక్కిచూచున్॥

వ. అంత సైరంధ్రి బెబ్బులియున్న పొదఁజొచ్చు కొదమ లేడిచందంబునఁ గొంకుచుఁ జనుదేరఁ గీచకుం డప్పు డెటువలె నుండెను.

జంపె॥ తిలకించి పులకించి తలయూఁచి తమకించుఁ
జెలరేఁగు తనకోర్కె ఫలియించె ననుచున్।
విడెముసేయుచుఁ బెదవి విఱిచి వన్నియఁజూచుఁ
దడఁ బడినహారములు దగ నన్నుపఱచున్।
సిగ విడిచి నిలువు కొప్పుగఁబెట్టుకొని యద్ద
మొగిఁ జూచి నెమ్మొగము బిగియించుకొనును।

వ. *ఈవిధంబునఁ దనలో నవ్వుచున్న సింహబలునిఁ జేరఁ జనుదెంచి సైరంధ్రి యేమనుచున్నది.

జంపె॥ అన్న మీయక్క దాహమునొంది మీయింట
నున్న మద్యంబు దెమ్మన్న వచ్చితిని।
ఎదురు చూచుచు నుండు నేవచ్చునందాఁక।
ఇదిగో గిన్నియ మంచి మదిరఁ బోయించు।
అదిగాక బడలియున్నది చాలవడఁదాఁకి
యెదయెండి యలుగునో యింత తడ్రసిసను।

వ. అనిన సింహబలుండు సంతోషాతిశయంబున నేమను చున్నాఁడు..

ఆటతాళము॥

ఎపుడు వత్తువో యనుచు వేడుక నెదురుచూడఁగ
వచ్చితివినా।
తపము నేడుగదా ఫలించెను తరళనయనా।
ఆడకే నేవత్తుననఁగా నతివ నీవే యిటువచ్చు
టాడఁ బోయినతీర్థమెదురై నట్లుగాదె।
అక్కదాహము మాన్పఁబూనితి వాసవంబున నటుల
మాన్పు
మక్కతమ్ముని దాహమును నీయధర మొసఁగి।

* ఇట్లు పలుపోకలఁ బోవుచున్న కీచకుని (పా॥ అం।)

వ. అనిన నాయింతి తిరోహిత గావున మొగమీయక యప్పలుకులు పెడచెవింబెట్టి మవిరపోయించు, లేదా మగిడి పోయెద నని గమకించిన నడ్డంబుగా వచ్చి కీచకుండేమను చున్నాండు.

ఏకతాళి॥ అప్పకొక తెచే నంపెన మద్యం
బిప్పుడు గడిసే పిక్కడనుండు।
ఎట్టకేలకు నాయింటికి వచ్చితి
విట్టె మరలిపోయెదననం దగవా।
పట్టిమంచమిదె పఱపిదె ననుజే
పట్టి యేలుమిఁక గుట్టేమిటికి।
వింతవారమా వేడుక యింతీ
కాంత, యిందులకుంగా సిగ్గేల।

వ. అని సింహబలుం డేమని యొడంబడిక సేయుచున్నాండు.

జంపె॥ కట్ట పెట్టెదు పట్టుపుట్టంబు లొసంగెదను
పెట్టె నిలిపెదుసొమ్ము పెట్టెదను నీకు।
కలరాజ్యమెల్ల నీకైవసము చేసెదను
కులసతుల నెల్ల నిను గొలువంజేసెదను।
పంచశరు కేళినిను బగలు రేయనక తే
లించి యెప్పుడు గొమ్ము దించకుండెదను।

ద్వి. ఈరీతిఁ బల్కి యాహీనమానవుఁడు
మాచని మాయచే మనసోర్వలేక
కదిసి పయ్యెద కొంగు గ్రక్కున నంట
నదలించి పోఁద్రోసి యలివేణి మరలి
వడిచనె; వెనువెంట వాఁడును బలుక
నోడియు సౌరుగా నొఱపు దీపింపఁ
జనుదేర, నెచటికిఁ జనుదాన నింక
నని విచారము నొంది యట దైవవశత
వలనొప్ప విరటభూనరుఁడు కొల్వుండ
జలజాక్షి యచటికిఁ జయ్యన పోవఁ,
గూడి యాకులమతిఁ గొలువువారెల్లఁ
జూడఁ జూడంగ నాసురవృత్తిఁ దన్నె,
అప్పుడాసతిఁ గావ నరుదెంచు నసుర
గుప్పున మెడమీఁద గుమికినఁ గూలి
బలమేఁగ రోఁజుచుఁ బడి వేగలేచి
నిలిచి సింహబలుండు నివ్వెఱగందె.

వ. అప్పుడా కొలువులో భీముండజాతశత్రుసమేతుండై నిజవల్లభ పరితాపంబు చూచి తనలో నేమనుచున్నాఁడు.

ఆహిరి॥ అతివ నిటువలెఁ గొలువులోపల
నగడు సేయఁగఁ జూచు మగతన।
మేల ధర్మము చాలు నెటువలెఁ
దాళవచ్చునె॥

రాజననుచును బిగుసుకొని యూ
రకే కనుఁగొనుచుండెఁ బోతుల
రాజువలె వలదనక యెక్కడి
రాజు వీఁడు॥
పూని యిట్లే మేముపోడువఁగ
రాని కోపంబెపుడు వచ్చిన
వానిఁ గినిసిన వానినేలిన
వానిఁ దున్ింతున్॥

వ. అని భీముఁడు కోపావేశంబున మత్స్యపతి సహితం బుగాఁ గీటణఁగింతునని తలంచి చెంగటనున్న ఘనమహీరుహంబు చూచి తన యన్న మొగంబు కనుఁగొనఁ, దమ్ముని కోపంబు వారింప భావగర్భితంబుగా నయ్యజాతశత్రుం డేమను చున్నాఁడు.

గీ. వలల, నీదృష్టి యెక్కడ నిలిచె నిపుడు;
ఫలమహీరుహ మదిగాక నిలువనీడ;
చెట్టు మఱీ పుట్టదా వంటకట్టెయలకు
అందులకు దీని ఖండింప నర్హమగునె !

వ. అనిన ద్రౌపది యేమనుచున్నది.

ఝంపె॥ దయ్యమా యిటుసేసితాయనుచుఁ జెయ్యూఁది
యొయ్యనలేచి నిట్టూర్పులూర్చుచును।
ఏజాతి వారికి నిట్టిపాటుగలదె తన
పూజ యిదియని దుమ్ము పోఁదుడుచుకొనును।

సిగ్గుగాకేరోఁత చెప్పవలసెను మగల
దగ్గ అనె కీచకుఁడు తనుదన్నె ననుచున్।
విభుల దూఱుటకొక్క విధమునను మత్స్యపతి
సభయున్నకడకుఁ బాంచాలి యేతెంచెన్।

వ. ఇవ్విధంబున ద్రుపదరాజనందన సభాస్థలికిఁ జేరఁ జనుదెంచి సమయభంగ భయంబును కోపావేశంబును ముప్పిరిగొనఁ దత్సభాసదులను జూచుమాడ్కిఁ దనపతులఁ గోపదృష్టిఁ గనుంగొని యందఱు విన నేమనుచున్నది.

త్రిపుట॥ నీతి ధర్మము లావు శౌరత నేర్పుగల గంధర్వపతులే
రీతినోర్చిరి నన్ను నొకఁ డీరీతి సేయన్।
కటకటా యీకొలువులోపల ఘనులుధర్మవిహీనమతి స
న్నిటులసేయఁగ నెటులనోర్చిరి యిచ్ఛగింపన్।
చెల్లఁబో యీరాజు మఱఁదిని చెల్లవిడిచి పరాంగనల సి
గ్గెల్లఁ జెఱుపఁగఁ జూచె వలదన కింతయైనన్।

వ. అనిన విరటుఁడు మనంబునఁ గనికరంబు నంది సింహబలు నేమియు ననలేక పొమ్మనియె।

అప్పుడా కొలువులో ధర్మరాజేమనుచున్నాఁడు.

జంపె॥ వారిజానన, నీవు వాకు్రివ్వవలెనె యీ
కొలువువారలు చూచి రారూఢిగాను।

పరులచే నీవింత భంగపడఁ జూతురే
తరుణి, గంధర్వులకుఁ దఱిగాదుగాని।
మాటలాడకుము పలుమాఱు నీ తెఱఁగెల్లఁ
దేటపడఁ బొమ్మిఁక సుదేష్ణపాలికిని।

వ. అని పాంచాలిని కోపంబున దూఱిపలికి పాండవా
గ్రజుం డింక నేమనుచున్నాఁడు.

ఏకతాళి॥ చేతులఁ జూపుచుఁ జెప్పెదు సుద్దులు
పాతరకత్తియ బాగున నెదుటన్।
నెలకొని పలుపోకలఁ బోఁదగవా
కులసతులకు రాజుల కొలువునను।
ఓర్పుగలిగితే నొకవిధమున నందఱిఁ
జేర్చును దైవము చింతిలనేల।

వ. అనిన సైరంధ్రి కంకుభట్టుతో నేమనుచున్నది.

త్రిపుట॥ పలికితివిగా మేలు మేలీపాటిదైనను ధర్మరాజవు
కొలువులోపలఁ బెద్దలెవ్వరు పలుకకున్నన్।
నాదురమణుఁడు నాటకుండఁట నటినిగా నేనే నీవే
కాదు, కాదనఁ గలరె లోకమువారలెల్లన్॥
తెలియఁకంటివిగాక నాపతి దలఁపకితవుఁడుగాన సిగ్గనఁ
గలదె జూదరి యాలికిని మఱి కంకభట్టు।

వ. అని పల్కి యచ్చోటనుండక కీచకుని యింటికిఁబనిచి నన్నింతచేయించిన యాయింతికి నీవృత్తాంతంబంతయుఁ జెప్పెద నని చనుదేర ద్రౌపది విన్నఁదనంబు చూచి సుదేష్ణ తెలి యని దానివలె నేమనుచున్నది.

జంపె॥ ఏమది యూఁబకే యింతలోనే మోము
భామ, వేకువచందమామవలె నాయెన్।
పుష్పాడియుఁ బూఁదేనె తెప్పఁదోఁగిన తేంట్ల
చొప్పమున నీకుకులు సుదతి యిదియేమొ॥
లోలాక్షి యిదియేమి వాలుఁగన్నులు నీటఁ
దేలాడు వాలుగల లీలఁ గనుపట్టెన్।

వ. అనిన సైరంథ్రి నీవన్నియుఁ దెలిసి తెలియనిదానివలె నన్నడిగిన నేమియనుదాన, నయినఁ జెప్పెదనని తద్వృత్తాంత మంతయుఁ జెప్పిన విని సుదేష్ణ కీచకుని నిప్పుడే దండింపఁ జేయుదునని యూఁబడిలం బలికిన సైరంథ్రి యేమనుచున్నది.

క. ఈపనికి నీవు దమ్మునిఁ
గోపింపఁగ నేల తాళుకొనరాదా వాఁ
డేపాటు పడునొ చూచెదు
రేపే నామగలచేత హృదయంబలరన్।

ద్వి. అనిన సుదేష్ణ భయంబున నెంత
వినయముల్ చెప్పిన వినక యే తెంచి
భోజన మజ్జనంబులు మాని ద్రుపద
రాజతనూజ యాగ్రహమును బొంది

శయ్యపైఁ బవళించి చాలఁ గన్ని దు
చయ్యనఁ గొలఁకుల జాలువాఱంగ
దళమైనచింత నెంతయు వెతనొంది
బలవంతుఁ డగు సింహబలుని మర్దింప
ననిలతనూజుచే నవుఁగాక యనుచు
జనులు నిద్రింప నిశాసమయమున
సెజ్జ మెల్లనె డిగ్గి చిటుకనకుండ
మజ్జనం బొనరించి మడుఁగు ధరించి
వంటల యింటిలోపల నొంటినిద్ర
నంటియుండఁగ సమీరాత్మజుఁ జేరి

జంపె॥ తలవట్టి మీఁదలిందఱుచూడఁ గొలువులో
పలఁ దన్ని కీచకుఁడు ప్రాణమున నుండెన్
ఒకయింత మదినిఁ దుకతుక లేక మైమఱచి
యకట యేరీతిఁ గంటికి నిదుర వచ్చెన్।
ఆవేళఁ గినియ మీరయన్న వలదనియెనో
నావంక చూచి మిన్నకయుంటి వకట॥

వ. అని ద్రౌపది పాణిస్పర్శంబునఁ బ్రబోధింప మేల్కని భీముఁడు మాటవైఖరిని ద్రౌపదిగాఁ దలంచి యీ వేళ నిచటికిఁ జనుదేరఁ గారణమేమియని యడిగిన నా యింతి యేమను చున్నది.

జంపె॥ ఎఱిఁగి యడుగఁగనేల యింతలో మఱచితే
యుఱక యేమఱియుండు టేమి లెస్స।
తెలిసి నాచేతనే పలికింప నింపైనఁ
బలికెదను చెవుల పండువులు గాను।
ఆసింహబలుఁడు దన్నడిగినది మొదలుకొని
పూసగుచ్చినరీతిఁ బాలఁతి వివరించెన్।

వ. వివరించి మఱియు నేమనుచున్నది.

త్రిపుట॥ ఆసభను మీయెదుట మును దు
శ్శాసనుఁడు తలవట్టి యీడ్చెను
ఈసభాస్థలిఁ గీచకుఁడు నన్నిట్లు చేసెన్
తెగువ నెవ్వాఁడేమిచేసిన నగుట మీమగ
తనము లెందుకు।
పొగుల నెందుకు నింతయును దన
పుణ్యమింతే।
ఆలకించెను బేదరాలి మొత్తైన ధర్మతనూజుఁ
డయ్యో।
ఆలి నిటువలెఁ గొలువులోపల నగడుసేయన్।

వ. అని వివరించి మఱియు నేమనుచున్నది.

జంపె॥ అత్తగారికి వెఱవ నంత మీకును వెఱవఁ
జిత్తమున విరటు మహిషికి వెఱచినట్లు।

ఒరులు తీసినగంధ మొల్లదేఁ దీయ కా
గరిత భోగముగాదు గాని చెయిచూడు।
పనివంపనే గాని పనిసేయ నేనెఱుఁగఁ
బని నేర్చుకొంటి నాపాపాత్మ కతన।

వ. మఱియు నెటువలెను.

త్రిపుట॥ ఎండకన్నును నీడకన్ను నొకింతయెఱుఁగని పుట్టు భోగులు॥
మండలేశ్వరులహితకువలయ చండకరులు॥
డాన నీతివిశారదులు సౌందర్యవంతులు బొంకుమఱికల
నైన నెఱుఁగని సత్యసంధులు మానధనులు॥
మాఱుపేరులు పెట్టుకొని యొక మానవాధమునొద్ద కూటికిఁ
జీరకునుగా మీరలిటువలెఁ జేరియుండన్।
చూచి యలమట నొందియయ్యో నీచవృత్తికిఁ దెచ్చె దైవము।
చూచి తేయని కన్నుఁగవ నశ్రువులు నించుక్॥

వ. మఱియు నేమనుచున్నది.

జంపె॥ దుప్రపద భూవిభుఁడు ప్రతుప్రలకన్న మీాటుగాఁ
గృపగలిగి పెనుపఁ బెరిగితి గారవమున।
కోడండ్రిలోనెల్లఁ గుంతీమహాదేవి
కూడుకొనిరా మిగుల వేడుకల మనితి।

మది నెప్పుడును ప్రాణపదముగా మీారలిం
పొదవ లాలింప నేకొదవ లేకుండెన్।
ఆరీతినుండు నేనీరీతిఁ బొగులంగ
నేరీతి నోర్చువారేఁగుదును మీారు॥

వ. అని ద్రౌపది బాష్పాకులిత నయనయై భీమునివక్షం బుపై వ్రాలిన నింతిచేతులు కన్నులనొత్తుకొని యాతండయ్యవస్థనే పొంది, ధైర్యంబు దెచ్చుకొని యేమనుచున్నాఁడు.

క. జనకజయును దమయంతియు
మనమునఁ గడువంతనొంది మగువా పిదపన్
గనరా మోక్షం బటునటెఁ
గనుమలమట కోర్చి శుభము కంజదళాక్షీ!

ద్వి. అని యూఱడిలఁ బల్కి యనిలనందనుఁడు
విను కీచకుని నెన్ని విధములఁ దుంతు
ఇందుకుఁగాఁ జింతయెందుకు నీకు
నిందుబింబానన, యేఁ గల్గియుండ
ఆలాగె రేపు నిన్నడుగంగ వచ్చు
వాలాయమున వాఁడువచ్చిన నీవు
నొడఁబాటువలెఁ బల్కి యుబ్బించి "నేను
నడురేయి నొకతెను నాట్యశాలకును

ఏతెంచి యుండెద నెడచూచి నీవు
నాతటి రమ్మని యనిచి యామాట
వినిపింపుమని" యంప, వెలఁది యేతెంచి
కనుకూర్కెనంత వేగమె తెల్లవాఱె।
అంతటఁ గీచకుండాత్మలోపలను
ఎంతయుఁ జింతించి యాపొద్దు కదలి
యెందుఁ జొచ్చినఁ బోయి యీడిచి తెచ్చి
పొందుదు సైరంధ్రిఁ బోనీక యనుచుఁ
గైసేసి మదిఁ దమకంబు రెట్టింప
నాసింహబలుఁడు రయంబున వచ్చి
నిజసహోదరియున్న నిలయంబు సొచ్చి
రజనీకరాస్య సైరంధ్రి ముందఱను

జంపె॥ చెలఁగి వంకరగోర సిగనున్న గా దువ్వఁ
దళుకుసున్నంపు గోడల నీడచూచున్।
లేని సుద్దులుచెప్పి మేనెల్ల విఱుచుకొను
కూనరాగము తీసి కుప్పించి దాఁటున్।

వ. ఈవిధంబున దుశ్చేష్టలొనర్చుచు నెదుటఁ దిరుగు తన్నుఁ జూచి చూడనిదానివలెనున్న సైరంధ్రిని జూచి, కీచకుఁడేమను చున్నాఁడు.

జంపె॥ ఎదుట నిలుచున్నవారెవ్వరైనను గన్ను
తుదినైనఁ గనుఁగొనవు దోసమా యేమి।
వెలితియగునా నీదు చెలువంబు చెల్లఁబో
చెలువ మగవారిఁ గడదృష్టిఁ జూచినను।
రమణి నన్నేలు నారాణివాసంబులకు
సమర నేలికసానివై యుందుగాని।
మగువ యింతటనైన మన్నించి దయఁజూడు
మనసైన నిటువంటి మనువెందుఁ గలదు।

వ. అనిన సైరంధ్రి యూరకున్నఁ గనలికండగర్వంబున సింహబలుఁ డేమనుచున్నాఁడు.

త్రిపుట॥ ఓజఁ బిడికెఁడు కూడు పెట్టి
యుండు విరటుఁడు రాజనఁగ మఱి
గలఁడె వేఱేరాజు నేనే రాజనిచటన్.
బలిమి నిన్నేగాదు నేఁ గా
వలసి యెవ్వతెనైనఁ బట్టిన
వలదనంగాఁ గలరె యెంతటి
వారలైనన్.
కొలువులో విరటుండు నతనికిఁ
గూర్చుదొరలును నుండఁగను నేఁ
బెలుచఁ దన్నఁగఁ జూచి యేమియుఁ
బలుకరైరి।

చిక్కితివి నాచేత నికనీ
వెక్కడికిఁ జనుదాననెవ్వరు
దిక్కు పట్టెద నెందుఁ జొచ్చినఁ
దిరిగి నిన్ను।

వ. అనిన సైరంధ్రి వీఁడు తమకించియున్నాఁడు తొందఱబడి కదియఁబడినఁ దనదుయత్నంబు సఫలంబగునని యొడఁబడిక దీపింప నేమనుచున్నది.

జంపె॥ చలము చేసెదవెంత వలదని చెప్పినను
పొలఁతి మఱిపుట్టదా భూమిలో నీకు।
ఐన గుట్టునె నేఁడు అగడుపఱచెదవు
గాన నే నీవంటి కకర్కార్తి కాని।
పాదుకొని నీవింత భంగపడఁగా నేను
గాదనేనా బయలుగాకుండవలయు।

వ. అనిన సింహబలుండు భుజం బప్పళించుకొని సంతో షాతిశయంబున నేమనుచున్నాఁడు.

జంపె॥ మగువ నాపైనీకు మనసులేకున్నదా
మనసు చూడఁగ నింత పెనఁగితివిగాక।
నడవ నడవఁగ నీకు మనసువచ్చి యింక
విడువ వలదనుబుద్ధి పొడమువలెఁ జూడు।
మఱఁది సమమార్గణుఁడు మదిఁదాళుకొనరాదు
ఎఱిఁగింపు నీకోర్కి యిప్పుడొనగూర్తు।

వ. అనిన కీచకుండు తనపొందుకు లోనాయెనని నిశ్చ
యించి సైరంధ్రి యేమనుచున్నది.

త్రిపుట॥ హాళిఁ బగలిటివేళ నుత్తర యనుగుఁజెలులఁ—దానుఁ
గేళికలు గావించు నాటక శాలయందు।
ఒంటిపాటై రాత్రివేళల నుండునపుడా—మఱియిటు
వంటిపనులకుఁ దగినయిరవది బాగునీకు।
అక్కడికి నేవచ్చియుండెద ననువుచూచి—చీకఁటి
నొక్కరుండవె రమ్ము మాటలు పెక్కులేల।

వ. అనిన సింహబలుండు మిన్నంది నీవుచెప్పినట్టు లీరేయి
నొక్కండనే నాటకశాలకుఁ జనుదెంచెద నీమాట మఱువకు
మని మొ్రక్కుచు మరలిచూచుచు, నొక్కవిధంబున నింటికిఁ
జనియె. సైరంధ్రి తద్వృత్తాంతంబంతయు భీమున కెఱిఁగించి
యథోచితవృత్తి నుండె. అటమీఁదటి వృత్తాంతం బెటువలెను.

ద్వి. అక్కడఁ గీచకుండంత సైరంధ్రి
చక్కని వాతెర, సవరని నుదురు,
పలుచని చెక్కులు, పాణి, పల్వరుస,
కలకల నగుమోము, ఘనమైన వేణి,
నిడువాలుఁ గన్నులు, నెలవంకబొమలు,
నెడలేని పాలిండ్లు, నినుమంత నడుము,

పొలుపొందు నూగారు భూమంతపిఱుఁదు
తళుకైన పెందొడల్ తమ్మియడుగులును
బలుమాఱు తలపోసి బలవంతమైన
వలవంత నుద్యాన వనవీథికేఁగి
మందార పున్నాగ మాకంద వకుళ
చందనంబుల నీడఁ జరియించుచుండె.

జంపె॥ ఒకటొక్కటికిని లోఁగి కొ౞ికి యందిచ్చు
శుకదంపతుల చెలిమి చూచి యెదఁబొదలు।
మమతఁ బూగిన్నెల మధువు పొత్తునఁ దావు
భ్రమర యుగ్మములగొగిఁ బరితాపమందు।
తలిరాకులొండొరుల కెలమిఁ గఱచుకయిచ్చు
కలకంఠమిథునములఁ దిలకించి యలయున్।

వ. మఱియు నేమనుచున్నాఁడు.

ఆటతాళము॥

వనిత నాతో నన్నులాగున వచ్చునొక్కొ- వచ్చియు,
నెనరు దలఁగక త్రోసిపోవక నిలుచు నొక్కొ-।
నిలిచి యరమరలేక నాతోఁ బలుకునొక్కొ--పలికియుఁ
జెలిమిఁ గదియఁగ వచ్చి నవ్వుచుఁ జేరునొక్కొ-।
చెలఁగి చనుమొనలాని కౌఁగిటఁ జేర్చునొక్కొ -
చేర్చియు
నెలరుగాఁ జొక్కించి నను దయ నేలునొక్కొ-॥

వ. మఱియు నెటులనెను.

ఎప్పుడాడిన కోర్కె యప్పుడే తీర్చుకొన
కిప్పుడలరెడు నన్ను జెప్పవలెఁ గాక।
ఆవేళ నాచేత నటు పడినదే మాయ
గావించి పాఱార్చెగాదె నేర్పునను।
దానికొక నిజమున్నదా యూరకే యాడ
దాని చిత్తము తెలియఁ దరమె బ్రహ్మకును।
పొద్దెన్నటికిఁగ్రుంకుఁ బొలఁతి యెప్పుడు వచ్చు
నొద్దికలను గూడి యుండుతే వేళ।
బలిమి నిప్పుడు పోయి పట్టితీసుకవచ్చి
తలిరు విలుతునిఁ గెళిఁ దనియింతు దాని।
అనవలసి యంటిఁగా కదియేల రాకుండు
మనసు లేదా స్రొద్దు చనదు వేగిరము।

వ. అని మఱియు సింహబలుండు మదనోన్మాదంబున వలెనుండె.

జంపె॥ శుకవాణిఁ దనయెదుటఁ జూచినట్లైనఁ గ్ర
మ్ముకపోయి గానక మొగి బమ్మరించున్।
అలివేణిమోవిల నున్నట్లైనఁ బలికింపఁ
దలఁచు లేకున్నఁ గన్నుల నీరు నించుఁ।
చెలి గదిసినట్లైన నలిఁ గౌఁగిలింపఁగాఁ
దలఁచు లేకున్నఁ జేతులు పిసికికొనును।

గీ. వనితరూపంబు పలకపై నొనరవ్రాయు
వ్రాసి తప్పక చెలువంబు డాసి చూచు
చూచి కన్నులనిండ నశ్రువులు నించు
నించి నీబంట దయ నేలుమంచు మ్రొక్కు.

ఏకతాళి॥ జక్కవ గుబ్బల సైరంధ్రి నను
జక్కఁగఁ జూడవె సైరంధ్రి।
జాలిఁ బెట్టకువె సైరంధ్రి నిను
జాల నమ్మితినె సైరంధ్రి॥
వారి వీరివలె సైరంధ్రి నే
నోరువఁ గలనా సైరంధ్రి॥
ఊరకె నన్నిటు సైరంధ్రి మరు
బారిఁ ద్రోయకువె సైరంధ్రి।

కాంభోజి। రావదేమె గొబ్బున సైరంధ్రి
రాతి గుండె దానవా।
ఆట దాని మాటలు సైరంధ్రి
పాటిల్లెఁ గదవె।
తేనె మోవి గ్రుక్కెఁడు సైరంధ్రి
యానన్నీయఁ గదవె।
కొద్ది మీఱె వలపు సైరంధ్రి
ముద్దు మోముఁ జూపవె!
వింత దాని వలెను సైరంధ్రి
యింత యేఁతురఁటవె।

ఏలలు॥ కూరిమి మీఱ నన్నది యేరాయని పిలిచి మోము
చేరిచి తమ్ములము నోరానించి కూడు మెప్పుడో।
శివి సావి తావిపూవుఁ దీవె పొదరింటిలోన
భావజకేళినేఁ గూడి తీయని మోవి తేనెలాను టెప్పుడో।
మెచ్చి నామీఁదనొఱఁగి మెడమీఁదఁ జేయివేసి
మచ్చికలఁ జెక్కు నొక్కుచు నాతో నది ముచ్చట
లాడుట యెప్పుడో॥

వ. ఈవిధంబున విరహాభారంబునఁ బొద్దుగడపనేరక యే మనుచున్నాఁడు.

ద్వి. అంతటఁ గీచకు నలమట చూడ
నెంతయు రోసి పోయిన విధంబునను
గుంకుడుమల మరుఁగున కేఁగె నినుఁడు;
కుంకుమ పూచాయఁ గొమరొప్పె సంజ.
నారు పోసిన రీతి నవకమై చుక్క
లారయఁ గనుపట్టె నంబరస్థలిని.
మిన్ను నేలయు నంత మేలెంచరాక
కన్నుల కంతఁ జీఁకటి వెల్లివిరిసె.
తఱలిరి జారకాంతలు సంభ్రమమునఁ
దఱచుఁ గొప్పునఁ గల్వదండలు వెట్టి
మేలిమి మేనుల మృగమదం బలఁది

నీలంపుసొమ్ములు నీటుగాఁ బెట్టి
జిలుఁగు నల్లని వన్నెచీరలుగట్టి
చెలువల సంకేతసీమల నునిచి
*          *          *
యేతెంచు గరితల కెదురేఁగువారు
నిజవల్లభుల నటు నిదురలఁబుచ్చి
విజనస్థలంబుల విహరించువారు
నగుచునుండఁగ సమయంబిదే యనుచుఁ
బగదీర్ప భీముఁడు పాంచాలిఁగూడి
సరగున నాటకశాల కేతెంచి
తరుణి నక్కడనుంచి తాసెజ్జనుండె.

వ. అప్పుడు కీచకుండు తన యభిమతంబటు నీడేర్చుకొనుటకు సమయమని తలంచి శృంగారించుకొనెనఁట యెటు వలెను.

అర్థచంద్రికలు॥

కొనముక్కుపై నామ మొనరంగదిద్దున్
గనుబొమలఁ జంపలను గంధంబు మెత్తున్
భుగులనఁగ మేనిపై బుక్కచల్లుకొనున్
తనరార ముంజేతఁ దానూలు గట్టున్
నీటు దీపింప మెడ నేవళము వేయున్
బొమ్మంచు పచ్చడము నెమ్మితోఁగప్పున్

వ. ఈవిధంబున సింహబలుఁడు తనకుఁదగిన వన్నె లొడఁ గూర్చుకొని మదనతాపంబున వికారంబున నేమి యెఱుంగక మోహాంధకారమున నాటకశాలకుఁ జనుదెంచు నప్పుడు, భీముని యఁలుకుడు విని సైరంధ్రియని తలంచి సంతోషాతి శయంబున నేమనుచున్నాఁడు.

జంపె॥ తమిరేచి నావలపు తలఁచినట్టి వధూటి
సుమశరునిచేనిట్లు సుడివడకయున్నె।
ఒనర నానీటుచూచిన నింతి వెన్నవలె
దనరంగ నెట్లు నిలువునఁ గరుగకుండు।
పెనుపొంద నామాట వినిన కామిని మరులు.
గొని యెట్లు నాదు వెంటనె తిరుగకుండు॥

అనువులు॥ అంగజాగ్నులఁగాఁగి తమినను
నైన కానుకలెల్ల నిచ్చియు
నంగనలు నాపొందు కని కానంగలేరు।
అతివ, విను నిజమేనుమానిసి
నైన యున్నాళ్ళకును నీవా
క్కతెవె బంటుగ నేలితివి నే
డెలమితోడఁ॥
పొలఁతి నీపాదముల సాక్షిపున
బొమ్మగట్టెద వామపదమునఁ
దులువ మరునికినింక నాతోఁ
దొడరెనేని॥

వ. అని మఱియు నేమనుచున్నాఁడు

జంపె॥ మానినీమణి యిదిగొ మంచివస్తువులు కై
కానుకలు దెచ్చితిని గైకొనుము వేడ్కన్।
విడెమిత్తునో సురటి విసరుదునొ; బాదములు
తొడలపైఁ జేర్చి పొందుగను బత్తుదునో।
ఏవిధంబున సేవ గావింతునని చెప్పి
సేవ చేయించుకొను సేవకుని చేతన్॥

వ. అనిన భీముండు వీఁడెంతయు నీచుండని రోసి మెల్లనె తనభావంబు దెలియకుండ వానితో నేమనుచున్నాఁడు॥

త్రిపుట॥ పొగడు కొంటివి నీకు నీవే
పొసఁగ మఱి నావంటి యాఁడుది।
జగములో నెందైనఁ బ్రితి
యంచెన్నఁ గలవా॥
ఒనర నామది నుండు నెటువలె
నుండునో నాతనువు చూచెదు।
వినుము నన్నెవ్వ తెనుగా భా
వించితీవు॥
పూని నను నీవంటి, క్రిమ్మఱ
పొందఁగల వాసతుల నెటువలె।
నైన నేనీ దేహమెత్తితి
నడుగవలెనా॥

సరసములనే పొర్లిద్దుపోయెను
జాగులేటికిఁ బన్నాళింపుము
సరగ నీకును దివ్యభోగము
సంఘటింతు॥

వ. అనిన సింహబలుండు తన మనోరథంబు సఫలంబాయె నని సంతోషాతిశయంబునఁ దమకం బాపలేక పాన్పుపై గూర్చుండి యతని యొడలు తడవిచూచి వెఱఁగంది తనలోఁ దా నేమనుచున్నాఁడు

జంపె॥ ఆపద్మముకుళకుచయైన నిట్లుండునా
వీపు రొమ్మని యింత వివరింపరాక
ఆపువ్వుబోఁడి తానైన నిట్లుండునా
కోపుగా గట్టియుక్కునఁబెనఁచినట్లు
ఆకృశోదరియుఁ దానవ్వ డిట్లుండెనా
తూకొన్న బకులు నీతోడేటి కడుపు
నాతిగాదిది యున్న రీతి భావించినను
పోతుపేరంటాలి పోలుపుగలిగినది॥

వ. అని సింహబలుండు సంశయించుచుండె నప్పుడు॥

క. వడముడి బొమముడి నిగుడఁగ
గుడిగొను కోపంబుతోడ గుండెలువగులఁ
వడి సింహబలుని బొడిచెను
బిడికిటన శిరమ్ము వలపు పెడతలపట్టన్.

ద్వి. భీముఁ డీవిధమునఁ బిడికిటఁ బొడువ
దీమసంబున వాఁడు దిగ్గన లేచి
గంధర్వుఁడను బుద్ధిఁ గవిసి కోపమున
గంధవాహాత్మజుఁ గడుఁ దలఁబొడిచె
బొడిచిన వడముడి పోనీక కడిమి
చిడిముడిఁ గీచకు సిగ వంగఁ దిగిచి
నడువీపు మోచేత నాలుగు దంప
జడియక హుమ్మని జడిపించి కదిమి
విడిపించుకొని వాఁడు వేగంబె మరలి
వడియార భీముని వదనంబుఁ బొడువ
గమకించి యదలించి కసుకసు త్రోసి
తెమలక పావని తేఁకువ లేచె.

* * * * *
* * * * *

ఈరీతి నొండొరు లేపున సమద
వారణంబుల లీల వారణరిపుల
పోలుపున గబ్బి బెబ్బులులచందమునఁ
దలపడి మల్లయుద్ధము సేయునపుడు
బలమంతకంతకుఁ బ్రబలి వాయుజుఁడు
బలువిడి నలసింహబలుఁ బడవైచి
దేహంబు గుల్లల త్రొక్కఁగా గుప్పి
బాహువుల్ పదములఁ బళపళ విఱిచి
పుట్టినచ్చోటువు, చప్పుడుగాకయుండ
పొట్టలోనికిఁ ద్రోసి పొరిపుచ్చి యీడ్చె.

వ. ఇవ్విధంబున సింహబలునిఁ బరిమార్చి తన జయంబు ద్రౌపదికిందెలిపి రహస్యంబున దీపంబుంచి వానిఁ జూపిన సైరంధ్రి యేమనుచున్నది.

జంపె॥ చెప్పితివి నీపోటు శివమెత్తి పలుమాఱు
అప్పుడాడిన మాట యిప్పుడెటువోయెఁ ।
చలపట్టితివి యెంత వలదనుచుఁ జెప్పినను
తులువ, తలకెక్కి నీవలపింత చేసెఁ ।
నిదుర కంటికి లేక నేఁడెంత బడలితివో
నిదురఁ బొమ్మికఁ నీవు నిశ్చలమ్ముగను।

వ. అనిన భీముం డేమనుచున్నాఁడు.

ద. అంతరంగమునఁ గల చింత-మాని
సంతోష మొదవెనే కాంతా।
వెఱవ కిప్పుడు నిన్ను వీఁడు-చెనకి
నెఱిదప్పి యిట్లాయె నేఁడు।
మానవతి, నిను జెనకెనేని-త్రుంతుఁ
బూని యిటువలె నెంతవాని।

వ. అనిన ద్రౌపది భీమునితో నేమనుచున్నది.

జంపె॥ సింహ మేరుఁగుఁ బట్టిచీఱుచాడ్పున నీవు
సింహబలు నోర్చితివి చిటుకు మనకుండన్ ।
ఆవేళ నాకోప మార్పుటకు నొంటినై
నీవేళ నీనీచు నేపణంచుటకు।

నీకుఁ దగు నానేర్పు నాకుఁ దగు నీయొప్పు
గాని యితరులయందుఁ గలదె యీమహిమ॥

ఆ.వె. అంత ద్రౌపదియును ననిలతనూజుండు
జయము నొంది నాట్యశాల వెడలి
నిజనివాసములకు నెమ్మితోఁ జని పూర్వ
చర్య నుండి రధిక సమ్మదమున।

త్రిపుట॥ సాంద్రమగు తిమిరంబు వెడలిన
చంద్రబింబము కరణి వేడుకఁ
జంద్రముఖి ద్రౌపదియు నాటక
శాల వెడలెన్।
శారికా కలకంఠ కలరవ
సరసతను మృదువాక్యవైఖరిఁ
జేరియచ్చట నున్న కావలివారిఁ జూచి।
అతుల బలగర్వితులు శౌర్యో
న్నతులు నాపతులతి జయస్థితి
మతులు వేడుక నద్భుతంబుల నలరిరిపుడు।
క్రూరు ధర్మవిదూరు దోషా
కారు దుష్టవిచారుఁ గీచకుఁ
బోరి త్రుంచిరి మీఱిచూడుఁడి
మీర లిపుడు।
ఒనరఁ బుణ్యాంగనలఁ జెనకిన
మనుజు డెన్నండైన నన్నిటు

చెనకి తత్ఫల మిప్పుడె యీఖలుఁ
డనుభవించెన్।

ద్వి. అనుచుఁ జెప్పినవార్త కచ్చెరువంది
ఘనతర కరదీపికాసమూహంబు
గొనివచ్చి వివిధ సంకుల మావహిల్ల
జనులు నర్తనశాల చయ్యనఁజొచ్చి
పరికించి యా సింహబలుని కాయంబు
కర మద్భుతంబుగాఁ గనుఁగొని మిగుల
ఘనముగాఁ గలకలధ్వనులు సేయంగ
విని యుపకీచకుల్ వేగంబె వచ్చి
యారూఢబలుఁడైన యన్న దేహంబు
ఆకృతినున్న బిట్టడలుచుఁజూచి
కదిసి హా యనువారుఁ గడుచోద్యమంది
యిది యేమియను వారు నెంతయుమూర్ఛ
యొదవ మ్రాన్పడువారు నోర్వంగలేక
యదటున నొఱలుచు నవనిపైఁ బొరలు
వారునై దుఃఖింప వానిబంధువులు
వారింపఁ జనుదెంచి వారికిట్లనిరి.

త్రిపుట॥ ఎందునెవ్వరియందు నీగతినీల్గి రూపఱినట్టివారిని
విందుమో కనుఁగొందుమో యిటుముందు మనము।
ఎవ్విధంబున నెంత వారికి నెంచిచూచినఁగాని యడలక
క్రొవ్వితిరిగినఁ జేటుతప్పునె కువలయమున।

అకట కరచరణాంగకంబులు అరసిచూచిననేకమై కడు
ప్రకటితంబుగఁ గానుపింపని పగిదియేమో।
ఉర్విలో గంధర్వవీరుల నోర్చువారల తెలుఁగొ! లేక
గర్వచిత్తుని నలుకఁ జేసిరొ కరుణలేక

వ. అని మఱియు నేమనుచున్నారు.

జంపె॥ అందముగ గౌతముని యాలికి ననఁగి పెనఁగి-క్రిమ్మఱ
నిందునంతటివాఁడె యవమతిఁ జెంద వినమె।
కావరంబున రామచంద్రుని కాంతఁగోరి-యనిమొన
రావణుఁడు తనవారితోఁ దెగిపోవవినమె।
పొందుగాఁ బెంపొంద తన గురు సుందరాంగిఁ-గైకొని
చందురుఁడు కడుఁగుంది దోషముపొంద వినమె।
కాన ధర్మవిహీనమతి నాకాంతనిపుడు-కలయఁగఁ
బూని సింహబలుండు కుంగుట భువిని నరుదె

వ. అనుచుఁ దద్బంధువులు పల్క నపుడు వినుచుఁబోడము
శోకాగ్నియం దడలుచున్న యుపకీచకులనెల్ల నొక్క యుప
కీచకుఁ డుచితసంభాషణంబు లొనర నేమనుచున్నాఁడు.

జంపె॥ అంచితంబుగ బ్రహ్మవ్రాసిన యంతగాక-యొదవునె
యెంచిచూడఁగఁ బ్రాణములు మఱి యితనియందు।
మనము నెంతయు వనరి పిలిచినఁ జనునె యిపుడు-వేగమె
యొనరఁగొని చని యగ్నియుంచుట యుచితమగును।
అనుచుఁ జెప్పిన శోకమణఁచి రయంబు మెఱయఁ-గీచకు
లెనయఁ దద్విధియాచరింపఁగ నెలమినపుడు॥

క. చేతః క్రోధవిహీనత
నాతఁడె సైరంధ్రి వారి నాతురగతిఁదాఁ
జూతునని వచ్చె వచ్చినఁ
బాతకులా భామఁజూచి పలువురు పెలుచన్.

జంపె॥ చారులోచనఁబట్టి చలపట్టి క్రూరులై
భూరికోపాటోపమునఁ గేలుఁగట్టి।
కడుమచ్చరమున నిది గంధర్వపతులచేఁ
బొడవడంచెను సింహబలు భూరిబలుని।
జగమంత యెఱుఁగంగ శవము తోడుతఁ గట్టి
యెగి నగ్నిలోఁగాల్చు టుచితమని యపుడు.

త్రిపుట॥ విరటునకు నెఱిఁగించువారై వేగమరిగి యందఱు
విన్నవించిన విభుఁడు విని వినకున్న నపుడు।
ఆగ్రహంబున నెల్లకీచకులబలనప్పుడు శవము తోడ నా
నిగ్రహింపఁగఁదలఁచి యప్పుడె నీకుఁదెలియ।
....యరమరికసేయక యొసగవయ్యా ధరణినాథా।
....వలవనిన నడుగని మాటదలఁచి మీకే
తెలుఁగు వచ్చిన నటులఁజేయుడి సరగుననిన।
అనుమతించెనటంచు సరభస మలవరించి యన్నకు
నెనయ నెమ్మిని బ్రీతిసేయుద మనుచునపుడు।
సతతపావనిఁ బుణ్యసాధ్విని సాహసమునఁ బతి

వ్రత గుణోజ్జ్వల ద్రుపదసుత వామాక్షిఁ దెచ్చి।
అరయ నశుచియు హేయమగు నరశవముతోడ
శుచియగు

తరుణి ద్రుపదతనూజ నటు బంధించిరపుడు।

వ. ఆ యుపకీచకులు ద్రోవదినిఁ బ్రేతభూమికిఁగొనిపోవుచు
నుండఁగాను సైరంధ్రి యేమనుచున్నది.

త్రిపుట॥ భయమునను వడఁకుచును గన్నుల
బాష్పధారలొలుకంగ
రయమునను సైరంధ్రి యాక్రందనముచేసెన్।
ధీరులార శూరులారా.........
.........కావరే గంధర్వులారా !
జయ జయంత విజయజయత్సేన జయద్బలమీరలు
దయచెలంగఁగ నన్ను గావరె జయము మెఱయ।
అకట మీరలుగల్గి నేననాథనైతిని నన్ను గీ
చకులు శవమున నంటఁగట్టిరిచలముతోడ।
చాల నిర్భయలీల భంగముసేయఁదొడఁగి రెంతెయు
నాలి మొఱ మీరాలకింపరె యేల తడవు

ద్వి. అని పలవింప నాయార్తరావంబు
అనిలపుత్రుఁడు విని యవ్వర నాప్రాణ
నాయికఁ గ్రమ్మర నాగ్రహబుద్ధిఁ
బాయక వీరెంతపనిచేసిరనుచు

బలశాలి రోషసంభ్రమ చిత్తుఁడగుచు
నెలమితో వేగ నాయిత్తమై చెలఁగి
వెసఁబాఱి గుప్తంబు విన్నాణమమరఁ
గసిమసఁగి వప్రిలంఘన మాచరించి
నలుదిక్కు లీక్షించి నలువు దీపింప
నలరెడు నొక యున్న తావనీజమ్ముఁ
బెఱికి రౌద్రాకార భీషణ రేఖ
పొరయంగ ఘనమైన మూపునఁ బూని
కటములు పొంగ నుత్కట భూరిఫాల
చటుల చాపోన్నతిఁ జయ్యన బొమలు
ముడివడఁ గన్నులమొగి నిప్పులురలఁ
గడఁకతోడుతఁ గ్రోధకలితుఁడై యచట
సకల కీచకజన సంహారమునకు
బకవైరి నిలిచె జృంభణ మూర్తితోడ.

వ. ఇట్లు నిలిచిన సింహబలు బంధుసమూహంబు లతనిఁ జూచె నప్పుడెటువలె నుండెను.

ఆటతాళము॥

దూరమునఁ గనుఁగొనుచుఁ గొందఱు పాఱిరయ్యా
పాఱికొందఱు బ్రిహ్మనెంతయు దూఱిరయ్యా।
చిక్కికొందఱు పొదలసందునఁ దక్కిరయ్యా।
తక్కికొందఱు వృక్షసంతతు లెక్కిరయ్యా।
లోఁగి కొందఱు పల్లములలోడాఁగిరయ్యా।
మూఁగి కొందఱు నీళ్లలోపల మునిఁగిరయ్యా।

వెఱచి కొందఱు చావునకు వాచఱచిరయ్యా!
కరఁగిపాఱఁగలేక తృణములు గఱచిరయ్యా!

ద్వి. అత్తఱి నతి భీతి నగ్రజుఁబొంది
తత్తరంబున వైచి తనరఁ గీచకులు
వీటికిఁ బాఱంగ వెసఁ గూడి ముట్టి
పాటిత వేగ సంపన్నుఁడై భీమ
సేనుఁడంతటఁ దన చేకసివోవ
మార్గినితో వడివోది మఱియును వెదకి
హాతము గావించి చయ్యన నూటయేవు
రతఁగుల నుపకీచకావలిఁ దునిమి
అపుడు బంధముదీఱ యాజ్ఞసేనికిని
విపుల బంధనములు వేగంబె విడిచి
గంధవాహ సుతుండు కాంతకిట్లనియె
గంధేభయాన, యింకను చింతదక్కి
పొందుగా విరటభూభుజు కాంతయున్న
మందిరంబునకు నెమ్మది నేఁగుమనుచు
ననిపి వేఱొకత్రోవ నరుదెంచి వాయు
తనయుండు వంటిల్లు తగఁ జొచ్చెనంత.

వ. జలకమాడి మడుగుధరియించి సుఖంబందెనట. అప్పు
డెటువలెను.

అనువులు॥

అరుణకిరణుం డుదయమయ్యెడునటకుమున్నె। మానిని
సరసిలోపలమునిఁగి నిజవస్త్రములుగట్టి।
మందగామిని మిగుల శుచియై మందగతిని_పురజను
లందఱును జూడంగ ముదముంబొందియపుడు।
నగరుసొచ్చి సుదేష్ణవద్దను నయము మీఱ_పరులకు
మిగుల వేడుకఁ జెలఁగుచుండెను మేల్మిమీఱ।

* * * * * *

స్వ. అని రమాధిపు పేర నగధరు పేర
దనుజారి పేర నందకధరు పేర
సురరక్షు పేరఁ గౌస్తుభవక్షు పేర
కరిపోషు పేర శ్రీకర వేషు పేర
వనమాలి పేర సేవకపాలి పేర
ఘననిభు పేర వేంకటవిభు పేర
అంకితంబుగ వేంకటాధీశుపాద
పంకజయుగ మదభ్రమరాయమాణ
మతియుత శ్రీరామమంత్రి గర్భాబ్ధి
సితకర నుతవాగ్విశేషాది శేష
మనసిజాకార తిమ్మయదండనాథ
తనయుఁ డక్కయ సత్కృతంబై తనర్చు
సుజన సంస్తుత్య భాసుర భీమసేన
విజయకావ్యము లోకవిఖ్యాతమగుచు
నా చతురాబ్ధి వేలావనియందు
నాచంద్రతారార్కమై యొప్పుఁగాక॥

# శ్రీకృష్ణలీలావిలాసము



అక్కయ

# శ్రీ కృష్ణ లీలా విలాసము



సీ. శ్రీమించు ప్రియురాలి చికురభరంబున
ముడిచిన పువ్వులు ముడుచుజాణ
అనువొంప వెడమాట లాడి విప్రుని వెల
కొమిరెను గూర్చిన కోడెగీఁడు
కరమొప్ప వేదలల్ గదలునిద్దంపుఁ బా
న్పున నెమ్మిఁ బవళించు పుట్టుభోగి
కడగోర నుదిటిపైఁ గమ్మకస్తురి నెల
వంక నామముదీర్చు వన్నెకాఁడు

వరకవేరసుతా మనోహర సరోజ
కాంతి మృదుగంధవాహ దిశాంతరాళ
రంగమందిర సంస్థాయి రంగశాయి
యెలమితోడ నభీష్టము లిచ్చుఁగాక

వ. అని కృతి రచనాపరుండైన కవీశ్వరుండు జగదీశ్వరుం డగు వేంకటేశ్వరు నేమని కొనియాడుచున్నాఁడు,

త్రిపుట॥ చుట్టుకైదువ విల్లు కరమునఁ జట్టఁ బూనినవాని బంగరు
పట్టుదుప్పటికట్టి రహిఁ జూపట్టువాని। ॥౧॥
మంగళప్రదమైన అలమేల్మంగ నలమెడువానిఁ
బుడమి భు
జంగభూషణు కొప్పు మెట్టిన జంగవాని। ॥౨॥
దండమిడి తను గొలుచువారికి దండదాపగు వానిఁ
గోరినఁ
గొండనుచు వరమొసఁగు తిరుమల కొండవాని ॥3॥

వ. అని వినుతించి హృదయంబున నునిచి యా వేంకటేశ్వరుఁడైన శ్రీరంగశాయిని ఏమని కొనియాడుచున్నాఁడు.

జంపె। సతతంబు సేవింతు సద్భక్తి దనరార
శ్రితమనోరథదాయి శ్రీరంగశాయి ॥౧॥
ఆరూఢిఁ దగఁ గొలఁతు నవలోకవన మాత్ర
సారభువనవిధాయి శ్రీరంగశాయి ॥౨॥
మతిలోనఁ దలఁతు నేమమున నత్యాసక్తి
శితవదనఖగయాయి శ్రీరంగశాయి ॥3॥

వ. శ్రీరంగశాయి మఱియు నెటువంటివాఁడు.

గీ. రాజమార్తాండు లర్థితో రాత్రి పగలు
నగుచు, గనుసన్న మెలఁగంగ నమితవైభ
వాభిరాముఁడై సన్నుత ప్రాభవమున
రంగు మీఱంగనుండు శ్రీరంగశాయి॥

వ. అని సదయాంతరంగనల మేల్మంగ నేమని కొనియాడు చున్నాఁడు.

రచ్చతాళం ॥

నెమ్మినలర దొంతర_తమ్మియందుఁగనుపట్టి
తమ్మి తన చేతఁగలయ మ్మను దలంతోఁ ॥౧॥
మక్కువతో మాటలాడు_జక్కి_నెక్కి మేలమాడు
చక్కని కొడుకుఁగన్న_శశిముఖిఁగొలుతున్ ॥౨॥
పేరుగల రమణుని_పేరురమునఁబచ్చని
పేరుదండమెలఁగు మి_టారినిఁ గొలుతున్ ॥3॥

ఆ॥ వె॥ అనుచు హిమనగేంద్ర తనయా సరస్వతీ
శక్రవల్లభాది సకలదేవ
తలును నర్థిగొలువఁ గొలువుండు నలమేలు
మంగనతులభక్తి మతిఁ దలంతు॥

అర్థచంద్రికలు ॥

శ్రీకంఠకృతనుతికి_శృంగారమతికిన్ ॥౧॥
చారుతరగుణతతికి_శ్రీరంగపతికిఁ ॥౨॥

వ. అంకితంబుగా నాయొనర్పంబూనిన శ్రీకృష్ణవిలాసంబు నకుఁ గథాక్రమం బెట్టిదనిన॥

జంపె॥ శివకర గృహోజ్జ్వలము_శ్రీ విహారస్థలము
నవవత్ససంకులము_నందగోకులము ॥౧॥
మృదులమలయానిలము_మృగమదసురభిలము
నదదర్ష భాకులము_నందగోకులము ॥౨॥
లలితకృతకాచలము_కలితశుక కలకలము
నలరూపజనకులము_నందగోకులము ॥౩॥

త్రిపుట॥ చెలువలే మనవంపురెమ్మలు_తళుకుగల కుందనపు
బొమ్మలు
వలపు గులికెడు పువ్వుఁగొమ్మలు_వలులు నచ్చటి
కలికి కొమ్మలు ॥౧॥
పొలుపుగల పుణ్యాములపోవులు_పొసఁగనమృతము
లూరు బావులు
లలితకల్పకలతలదీవులు_వెలయు నచ్చటి
వేల్పు టావులు ॥౨॥
తలఁపుమీఱఁగఁ దేనెయూటలు_దావి పొదలెడు
నళులపాటలు
గలిగి తగు వాసనల తేటలు_చెలఁగు నచ్చటి
పువ్వుఁదోటలు ॥౩॥

ఆ॥వె॥ ఎంచిచూడఁ బౌరులెల్ల బృందారకు
లతివలెల్ల మేటి యప్సరసలు
ధరణిజంబులెల్ల దైవభూజంబులు
పొసఁగ నచటిమహిమ పొగడఁదరమె.

వ. ఇటువంటి నందగోకులంబున నాదినారాయణుఁ డంశం
బున భూభారనివారణంబుకొఱకై రామకృష్ణులు వసుదేవునికి
జనియించి నందునియింటఁ బెరుఁగుచుండిరి. అందు కృష్ణుఁ డెటు
వలె విహరించును.

ద్వి. పొత్తులలో నుండఁ బొలుపొందఁజేతు
లెత్తుచుఁ బొఱలాడు నెంతయు వేడ్క-
ముద్దుగా ఱెడినంచు ముదితలుచేరి
ముద్దాడు వేళఁ గెమ్మోవులునొక్క-.
అమరంగఁగూర్చుండి యాడంగఁజూచి
ప్రమదంబుతో గోపభామలు గ్రుచ్చి
చంకలనిడికొన్న, సరగున వారి
పొంకపుఁబాలిండ్లు పుడుకుచునుండు.
నడచి యాడఁగఁజూచి నళినదళాక్షు
నడరి 'యప్పల! విందు'లని తన్నుబిల్వ
ముదమైన యపరంజి మువ్వలు గదలఁ
బదువున నరిగి పైఁబడి కౌఁగిలించు.
పనివడి తనయీడు బాలురఁగూడి
చని గొల్లయిండ్లను జయ్యనఁజొచ్చి
యబ్బినచోటెల్ల నందు నిందనక
గబ్బియై కడు దుండగంబులు సేయు.

వ. అని మఱియు నేమనుచున్నాఁడు

జంపె॥ ఒక తెరగ్గఱ ప్రియుండొక్క ప్రక్కనుండంగ
నొకప్రక్క పవళించుచుండు నవ్వుచును ॥౧॥
పతులు సతులునుగూడి పానుపున నిద్రింప
సతులమార్పడ నునిచి జగడములు పెట్టున్ ॥౨॥
మగనిరూపున నొక్క మగువఁగూడిన బాల
మగఁడుఁగాఁడని చెప్పి మగుడఁదిట్టించున్.

వ. ఇవ్విధంబున గోపికలు అతని చిట్టకంబు లేమని తెలుపు చున్నారు.

రచ్చతాళము॥

మువ్వలు గదలకుండ-ముచ్చువలెవచ్చి దండ
పవ్వళించి యేముండఁ-బాలుత్రాగుఁ బొట్టనిండ ॥౧॥
నడిమీఁఱవెన్న ముచ్చు-వలె గుర్కిళ్ళుమ్రింగు
పడుచుల నోటగుక్కఁ-బట్టెఁడేసి తాను మెక్కు ॥౨॥
ఒమ్మికతో నాలుమగల-యుగము గూడికొనఁగా
రమ్మని బాలికఁజీరు-రాకయున్నఁ గోరఁజీఱు ॥౩॥

త్రిపుట॥ ఒనరఁ బ్రియమునఁ బండ్లొసంగిన
వలవదేమియు మోవిపండ్లే
తనకు నిమ్మనుఁగలదె యీచోద్యంబు తల్లీ ॥౧॥
ఆకులిపిగో పోకముడివిఁడు-మనుచు నోడక పలుకుఁ
దగని చి
కాకుదనమున బిడ్డఁడెక్కడఁ-గలిగెనమ్మా ॥౨॥

కొడుకులెన్నఁడు లేనిదానికిఁ-గొడుకు నిచ్చెదననుచు
రమ్మనుఁ
బుడమిలో నిటువంటిబిడ్డలు-పొడమిరవ్వా ॥3॥

న. అని గోపికలువచ్చి తన కుమారుని దుండగంబులు వివరింప వారివారి ననునయించి యశోదాదేవి శ్రీకృష్ణునిఁ జూచి యేమనుచున్నది.

జంపె॥ ఎందుఁజూచిన నీవె-యుందువని వీరనెద
రిందటి నిందల-కేల నాయన్నా ॥౧॥
సిరిగలిగియుండియును-బొరుగిండ్లకడకు నీ
వరుగ నేమిటికిమా-యయ్య పలుమాఱు ॥౨॥
కలవాఁడవుక్కి-వుడు-గా! రాదు నాయన్న
కులమువారల నంత-గొడవేల తండ్రీ! ॥3॥
కజ్జములు పెట్టెదను-ముజ్జగంబులుగన్న
బొజ్జనిండఁగ నెందుఁ-బోకుమీ తండ్రీ! ॥౪॥

ద్వి. అని యశోదాదేవి యాత్మజు నేమి
యనఁజాల కతని రమ్మని చేరఁబిలిచి
పాలవంకలమించు పాలిండ్ల పాలు
పాలవంకలనంగఁ బ్రవహింప వేడ్క-
నక్కునఁజేర్చి ముద్దాడిలాలించె
నక్క-ఱపెంపున నబ్జదళాక్షు.
కొదమతేఁటులన శ్రీగులికెడుకొప్పు

విదియచంద్రుని రేఖ విలసిల్లు నుదురు
దలచుట్టు కన్నులుఁ దళుకుఁ జెక్కులును
జిలుకముక్కుమిటారి జిగిగలమోవి
కంబునఁ గొంకులేని కలువలవిందు
నందంబుగల వదనారవిందంబు
జలజంబు నిరసించు చారుకంఠంబు
సలలితమాంసలాజానుబాహువులు
క్షీరాబ్ధికన్యకచెలఁగ నిచ్చలును
పేరోలగంబుండు పృథుల వక్షంబు
మృగరాజు వణకించు నిసుమంత నడుము
చిగురుచాయలఁజెందు చిన్నిపాదములు
ననుదినంబునుజూచి యా గోపసతులు
మనసిజవివశలై మచ్చికలిచ్చి
యీసౌకుమార్యంబు నీవిలాసములు
నీసొంపు నీపెంపు నెందును గలవు
అలరంగ వీనితో ననిశంబుఁగూడి
వెలలేని పెనుపండువులు సేయలేని
పడఁతుల పాపములు భావించిచూడ
నడవినిఁ గాసినయట్టి వెన్నెలలు
కాత్యాయనీదేవిఁ గడుభక్తిఁ గొలువ
సత్యమావిభుపొందు సమకూడు వేగ।

వ. అని మాసవ్రతంబు సేయుటకై మార్గశిరంబు మొదటి దినంబున గోపికలు యమునానదికిని జని కృతస్నానలై యిసుక గౌరీదేవింజేసి వివిధోపచారములను బూజచేసి యేమను చున్నారు.

ధవళము ॥

జయసుమ భాసురహాసా-జయరమణీయవిలాసా
జయగతిసమదమయూరీ-జయహిమశైలకుమారీ ॥౧॥
జయమణిమయ తాటంకా-జయధృత బాలశశాంకా
జయ మధురాధరబింబా-జయ పావని జగదంబా ॥౨॥
జయ వికచాంబుజవదనా-జయ నవకోరకరదనా
జయ జలధరనిభ వేణీ-జయ శశిశేఖరురాణీ! ॥3॥

వ. అని మఱియు నేమని వినుతింపుచున్నారు.

జంపె॥ చెలువుఁడెప్పుడుచిక్కి-చెలువ, సగమైనాఁడు
తలఁప నీవంటి సౌం-దర్యవతిగలదె ।౧।
మసలకెప్పుడు నీవు-మనసురా మెలఁగితివి
వసుధ నీవంటిగుణ-వతియు మఱిగలదె ।౨।
వెలయు నీ రమణునికి-విషముసైతమునిండె
కలికి నీవంటి లక్షణవతియు గలదె ।3।
నీలలితవృత్త కుచ-ములు మేలుబంతులును
బాలకస్తూరి తిలకంబు............... ।౪।

జంపె॥ వెలఁది కృష్ణుని మాకు-విభుఁజేయు నీపేరఁ
జెలఁగి బొమ్మలపెండ్లి-చేసెదము గౌరి ॥౧॥
జలజాక్షుకెమ్మోవి-చవిచూడఁజేయుమీ
ఫలపూజ చేసెదము-ఇలనీకు గౌరి ॥౨॥
కేళి హరిఁగూడి మను-నోలలాడఁగఁజేయు
నోలలాడించెదము-చాల నిను గౌరి ॥3॥

వ. అని యివ్విధంబున ననుదినంబును గౌరీదేవిని బ్రార్థించి పూజించుచు నొక్క-నాఁడుపొద్దున మేల్కా-ంచి గోపకన్యకలు యమునానదికిఁ జనిరట యెటువలెను.

లఘుశేఖర తాళము॥

ఒప్పుఁగప్పు కొప్పులందు-గుప్పళించితుఱిమినట్టి
చెప్పిచూపరానితావు-లుప్పతిల్లు విరులుజాఱ ॥౧॥
ఉబ్బుగబ్బిగుబ్బగవల-నబ్బురంపుఁ గుంకుమంబు
గుబ్బుమనుచు గుబులుకొనఁగ-నబ్బురంబుతోడ
నలఁది ॥౨॥
ముంచి ముంచి చంచరీక-ములధరింపఁజేసినట్లు
అంచమించ మించుకంచు వంచజేయుచూపుల మరి?॥3॥
తళుకుగులుకు కప్పురంపు తళుకునలుక పలుక......
పలుకు పలుకునకును దేనె-చిలుకు చిలుకపలుకులమర॥౪॥

వ. ఇవ్విధంబున గోపకన్యకలు యమునానదికింజనియొక్క విజనస్థలంబున వలువలూడిచి జలంబుసొచ్చి విహరించిరంట యెటువలెను.

లఘుశేఖర తాళము॥

ముకురముఖులు వేడ్కతోడ-ముద్దుజెలులతోడఁగూడి
యొకరినొకరు పేరఁజీరి-యుబ్బుమీర నోలలాడి ॥౧॥
వనజనయన లటమటించి-వదలకుండఁగౌఁగిలించి
యొనరజలము ముంచిముంచి-యొకతెనొకతెహెచ్చి పొంచి ॥౨॥
లలన లొండొరులును కేళి-నెలయఁబువ్వొదులను దేలి
కలసిమెలసిహోళిదెలిసి-సొలసి సరసకేళిఁదేలి ॥3॥

వ. మరియు నెటువలెను.

గీ. ఒకతె కెంగేలఁ గెందమ్మి యొకతెయొడుచు
కొనినఁబూనిక దానితోఁ బెనఁగులాడు
నంతకై మును తామును వంతులకును
దంటలగుచును మల్లయుద్ధములు సేయ.

వ. అప్పుడారమణులు సరసోక్తులు తమలోఁ దామేమను చున్నారు.

కురుచ జంపె॥

మగువ, యాకుచముదామరలా- వేగ
మగిడింతు నిన్ను దా మరలా ॥౧॥

లలన, వైచితిమేలు కలవా_నీవు
తలఁకకువె యోఁచ నీకలవా ॥౨॥
చల్లనగుపూఁదేనె చాలా_మీఁదఁ
జల్లకువె సఖి, చాలుఁజాలు ॥౩॥

ద్వి॥ నలినగంధులు యమునానది నింపు
వెలయ నివ్విధమున విహరింపుచుండ
నదియెల్ల శ్రీకృష్ణుఁడాత్మలోఁ దెలిసి
పదరిచెప్పుచు గోపబాలురతోడ
నయ్యెడకే తెంచి యందర సన్న
నొయ్య నొయ్యన నిల్పి యొదుఁగుచుఁ జేరి
పొలుపుమీరఁబురాణపురుషుఁడైయుండి
వెలయ బాలుని రీతి వికచాబ్జముఖుల
చీరలు గొనిపోయి చెంగటనొక్క
చారుకదంబ భూజంబుపై నెక్కె.

వ. అపుడా శ్రీకృష్ణునిఁజూచి తమలోఁదామేమనుచున్నారు.

ఆటతాళము॥

అవుర యమ్మకచెల్లతగవరి_వాడు మేలెక్కుడలచూచిన
వాఁడునగరా కోడిగములివి_వలదుకృష్ణా ॥౧॥
పూనిదొంగిలి కోకలటుగొని_పోకుపోయిన నీకునందుని
యాన రామునియాన మాయమ_యాన సుమ్మా ॥౨॥
లోకమున నిటువంటినగవుల_పోకతనములు గలవెయివిదా
లేక దొరబిడ్డలకె కలదో_కాక తెలియ ॥౩॥

జంపె॥ పుట్టు మొదలును నిట్టి-గట్టివాయితనంబు
 లెట్టు నేర్చితిబుద్ధి-యిఁకనైన వలదె ॥౧॥
 ఇలలోన మిగులగుణి-వలెనుందువొక వేళ
 తెలియ నొకగుణమైన-కలదె నీయందు ॥౨॥
 రాజుతో చెప్పెదము-రాజీవదళనేత్ర
 ఓజతో మావలువ-లూరకిచ్చెదవొ ॥3॥

వ. అనిన వలువలీకున్న నతని నేమని ప్రార్థించుచున్నారు.

ఆటతాళము॥

ఓడకిటువలె సతులు జలకము లాడగానూ-వత్తురె
 జాడఁబడి మగవారు దుష్టభు-జంగదమనా ॥౧॥
 వచ్చిమముఁగని సరగమగుడఁగ-వలయుఁగాక-కోకలు
 ముచ్చిలింతురె శౌరి యింత-మోసపఱచి ॥౨॥
 జలజలోచన, మమ్మునీదా-సులనుదయను-గనుఁగొని
 వలువలొసగుము నీటిలో చలివశముగాదు ॥3॥

వ. అనిన విని శ్రీకృష్ణుఁడు మీరు నన్నింతదూఱనేల? మీ వలువలువచ్చి తీసుకపొండనిన గోపికలు మొగంబులుచూచుక తమలోఁ దామేమనుచున్నారు.

జంపె॥ వలిపట్టినీటిలో-వణఁకనోపుదుమె పో
 వలయుఁ గోకలకనుచుఁబలికెనపుడొక తె ॥౧॥
 అత్తవిననిదియేమి యని యడగదే వాని
 పొత్తుకిటువలె నీవె-పొమ్మనియె నొక తె ॥౨॥

సిగ్గుపోయినవెనుక-చీరలేటికె వాని
దగ్గరికి నేరాను - తలమనియె నొకతె ॥3॥
అంకెగూడినమీఁద-గొంకుకొసరును బిగువు
నింక చెల్లునె వెడల-రేయనియె నొకతె ॥౪॥
ఆమహాత్ముని వేళ-యయియున్న దిప్పుడిక
నేమిచెప్పినఁజేయు-టేయనియె నొకతె ॥౫॥
తాళఁజాలకపాలి-మాలిపోయిన యపుడె
యీలాగువాఁడయ్యె-లేఁడనియె నొకతె ॥౬॥
ఒనరఁదామరపాకు-లున్న వే యచ్చోట
ననువుగైకొనచ-క్కనానియె నొకతె ॥౭॥
ఒద్దికై యవి వాని-యొద్దనేయుండనీ
పొద్దుగ్రుంకినఁగాని-పోననియె నొకతె ॥౮॥
నెలవుకొని యీచీరు-నీటిలోనిట్లున్న
ఫలమేమి మనకు కో-కలకనియె నొకతె ॥౯॥

వ. అనిన నొకవిధంబున వెడలిరా నుద్యోగించి ఆయింతు లేమని పొరిచూపులాడుచున్నారు.

ఏకతాళము।

కలపెద్దలు మీరలు ముందఱఁజనుఁ
డలసయానమున ననెనొకబాల ॥౧॥
ఎఱుఁగని పడుచుల-కెగ్గేమిటికిఁక
నెరుగుఁడు సరగున-ననెనొకప్రౌఢ ॥౨॥

ఇందుకు పొరిచూ-పేటికిఁ గుమిగ్గుమై
నందఱు చనుదెండనె నొకభామ ॥3॥

వ. అనిహృదయంబులు పదిలపఱచుకొని వెడలివచ్చునప్పు డెటువలెను.

జంపె॥ బలిమినొకయింతి రొమ్ములబంటి కేతెంచి
నిలిచె నీఁకరానసుచు-నిగిడిసిగ్గునను ॥౧॥
పదమనుచుఁ బెఁదొడల-బంటికినిదావచ్చి
చదికిలంబడియె నొక-సతిప్రిడతోడన్ ॥౨॥
దిట్టయై యొకతరుణి-గట్టుదాఁకనువచ్చి
యట్టెగ్రక్కు-నమరలె-నెట్టుకొనిలజ్జన్ ॥3॥

వ. ఇవ్విధంబున వెడలి రాలేక కొందుకుచు నొకవిధంబున వెడలి కరతలపిహిత కుచస్మరమందిరలై గోపికలు శ్రీకృష్ణుని యెదుట నిలిచి చీరలిమ్మని యడిగిన నవ్వుచు నతఁడేమను చున్నాఁడు.

ఆటతాళము॥

కూర్మి పిన్నటనాఁటనుండియుఁ-గూడి పెనఁగిన నన్ను గొనకొని
ధర్మమాయిటు సిగ్గుపడను-తరుణులార ॥౧॥
గొరినింతయుఁ జులుకసేయుట-గాక మీవలె వలువ లూడిచి
నీరుచొత్తురె వ్రతమునలిపెడి-వారలెచటన్ ॥౨॥

వ్రితఫలం బిటు మీకునిప్పుడు-వలసెనేనియు రెండు
చేతుల
సతులు మీరందఱును మ్రొక్కుడు-చక్కనిలిచి ॥3॥

వ. అనిన గోపికలు తమలోఁ దా మేమనుచున్నారు.

జంపె॥ మ్రొక్కవలెనఁట మీఁదు-మిక్కిలి యిరుకుకొని
చిక్కితిమిగా వీని-చేననియె నొకతె ॥౧॥
పురుషోత్తముండు గొబ్బునన చలివిడిపించి
దరిజేర్చు, మ్రొక్కవల-దాయనియె నొకతె ॥౨॥
ఎక్కడే తనయెమ్మెలిటుగాని తెలియవో
మ్రొక్కఁగా మనకేమి-చిక్కనియె నొకతె ॥3॥
మోసపోయిన వెనుక-(మ్రొక్కకే తీఱునా
వాసులకు పెనఁగంగ-వలదనియె నొకతె ॥౪॥
చేతులెత్తుక మ్రొక్కఁ-జెల్లు మనమందఱము
ఈతఁడును మఱిదేవుఁ-డేయనియె నొకతె ॥౫॥
ఇందులో నడిసన్న-యింతిచే మ్రొక్కింత
మందఱికి నెలవగును-అనిపలికె నొకతె ॥౬॥
వినరె యిదియునుగాక-తనయెదుట మ్రొక్కవలె
మనపుణ్య మీడేరె-నని పలికె నొకతె ॥౭॥
ఏమేలు గనియె వాఁ-డింతయేలా నిట్లు
ఏమాయె మ్రొక్కఁగద-రేయనియె నొకతె ॥౮॥

ఆదంటయాడేటి-యాట యామ్రొక్కులకు
గాదమ్మ పైకొసరు-గలదనియె నొకతె ॥౯॥
కడమ కింతెయుసిగ్గు-విడిపించుకుండెడి
పడుచు సేఁతలు సేయ-గడుసనియె నొకతె ॥౧౦॥

వ. అని యాయింతులు శ్రీకృష్ణునితో నేమనుచున్నారు.

ఝంపె॥ ఏయూరి యాడవా-రీతీరుతో నుండి
చేయెత్తి మగవారిఁ-జేరి మ్రొక్కుదురు ॥౧॥
మ్రొక్కంగ వలసెనా-మ్రొక్కెదము మదినైనఁ
జక్క కన్నులుమూసి-సరవితో నుండు ॥౨॥
మొనసి చేతులనెత్తి-మ్రొక్కవలె నంటివా
యొనరఁ గన్నులుమూసి-యుండు మ్రొక్కెదము ॥3॥

వ. మ్రొక్కెదమని పలుకఁదగునే వెఱ్ఱిపడఁతులార! నిదుర
పోవువారి పాదంబుల కెఱఁగినదాన ఫలంబుకలదే! అనిన
హర్షించి గోపికలు వ్రతభంగమగునని శ్రీకృష్ణునకు మ్రొక్క
నట యెటువలెను.

ఏకతాళము॥

బలుసిగ్గున నొక-బాలారత్నము
చెలఁగి నగుచునొక-చేతను మ్రొక్కెన్ ॥౧॥
కన్నులు మొగుచుక-కన్నియ యొక్కతె
వెన్నుఁడు నగనగ-వేగమె మ్రొక్కెన్ ॥౨॥

కరమరుదుగ ముఖ-కంజాతము పెడ
మరలిచి యొకసతి-సరగున మ్రొక్కెన్ ॥౩॥
చలము సొగనీక-సొగుదుగాయని
తలవంపున నొక-పొలంతుక మ్రొక్కెన్ ॥౪॥
ఒఱపరి యొక్కతె-యొడలెల్లను పె
న్నెఱులఁ బొదవుకొని-నెమ్మిని మ్రొక్కెన్ ॥౫॥
ఇందఱు మ్రొక్కఁగ నిదియే సందని
సందడిపడి యొక-జవ్వని మ్రొక్కెన్ ॥౬॥

వ. ఇవ్విధంబున మ్రొక్కిన గోపికలను గరుణించి వస్త్రంబులొసంగి వారందఱి యనురాగంబులఁ దెలిసి నోములు కడమగాకుండ నోచిన మీమనోరథంబు లీడేరునని వారలఁ బనిచి, శ్రీకృష్ణుఁడు నిజనివాసమునకుఁ జనియె. అంతటఁ గొన్నిమాసంబులకు శరత్కాలంబు గనుపట్టె. అప్పు డెవ్విధాననుండెను,

కొఱుచజంపె॥
కరము తరముగఁబూచె శరము-తేరి
సరసులను జెలువొందె శరము ॥౧॥
అమరె వాసనల కుముదములు-వినిచె
నెమిలిగమి షడ్జనినదములు ॥౨॥
కొమరొందెఁ బుండరీకములు-మొరసె
రమణతోఁ జంచరీకములు ॥౩॥
విలసిల్లెఁ గలశజుఁడు మింట-మరుఁడు
వెలఁదుకలనేసెఁ బూవింట ॥౪॥

ద్వి. ఈరీతి లోకైక హృద్యంబులైన
శారద లలితవాసరములు మిగులఁ
దమకించి గోపికల్ దామొక్కనాఁడు
కమలాక్షు సౌందర్య గరిమంబు నతని
గుణములుఁ గథలు వాకుఁచ్చి వర్ణించి
మనసిజ వివశలై మామనోహరునిఁ
గన్నుల కఱవుపోఁ గనుఁ గొందు మెపుడు
తిన్నని మాటలఁ దేలింత మెపుడు
రమ్మని వానియురమ్ము చన్నొనలఁ
గుమ్ముదు మెప్పుడు గుచ్చిపాఱఁగను
వలపున సొక్కించి వలరేని కేళిఁ
జెలరేఁగి పరవశుఁ జేయుదు మెపుడు
చక్కెర వాతెరల్ చవిచూపి చాల
సొక్కింతు మెప్పుడు సొంపుమీఱఁగను
అని తలపోయుచు నాగోపకాంత
లానరఁ గోర్కులతోడ నుండునంతటను.

క. ఘనతామసైందరిజాలికుఁ
డానరెడు కెంబట్టుబంతి నొకచేతను లే
దనియొక చేచూపిన క్రియ
వనజాప్తుఁడు గ్రుంకె వనజవైరియుదోఁచెన్॥

వ. ఆసమయంబున నెటువలెను.

జంపె॥ కలువముచ్చటదీరె_నలిచకోరము కేరె
జలజంబువెతగూరె_శశివాడు దేఱెన్ ॥౧॥
నెలరాజు గమకించె_వలరాజు విలువంచె
చలిగాలి చనుదెంచె_జలధి గురి మించెఁ ॥౨॥
విరహవేదన నెలసె_విసిగి జక్కవసొలసె
విరిమల్లియలు విరిసె_వెన్నెలలు వెలసెన్ ॥3॥

వ. ఇట్లుసకలమనోరంజకమైన చంద్రోదయంబున గోపికలు శ్రీకృష్ణస్వామిఁది కోర్కులినుమడింప నప్పు డిటులనెను॥

జంపె॥ ఇందుముఖులకుఁదాప_మెచ్చెనెంతయును మక
రందములు కుందములు_గంధములు ననినన్ ॥౧॥
నీరజాక్షులవంత_నిగిడెను మణిసరులు
హారములు హీరములు_కీరములు ననినన్ ॥౨॥
శాతోదరులకు దగ_సంఘటిల్లెను సరో
జాతములు చూతములు_గీతములు ననినన్ ॥3॥
నాగయానలకళుకు_నాటుకొనె నవసుమ ప
రాగములు త్యాగములు_భోగములు ననినఁ ॥౪॥

వ. అప్పుడాగోపిక లేమనుచున్నారు.

క. వెన్నుని యురమునఁజేర్చని
చన్నులు వివరింపమొగలిచన్నులు, వానిన్
జెన్నలరఁ జూడకుండెడు
కన్నులు వివరింప నెమిలికన్నులు దలఁపన్॥

వ. అని తమలోఁదా మేమనుచున్నారు.

ఆటతాళము ॥

అనువుగా వేడుకనుజూతము ఎదుటనునిచి-పటమున
వనజనాభునిరూపు నొనరఁగ-వ్రాయరమ్మ ॥౧॥
సారెకును వీనులకు నెంతయుఁ-జవులుగాను-నవనీత
నీరజాక్షునిగుణములభివ-ర్ణింపరమ్మా ॥౨॥
పొలుపుగాఁ జిత్తంబులలరఁగ-సుతులుగూడి-మెల్లన
బలుని తమ్మునిమీఁదఁ బాటలు-పాడరమ్మా ॥౩॥

వ. అని యివ్విధంబున గోపికలు కృష్ణాసక్తలై యుండు నపుడు భక్తవత్సలుండగు శ్రీకృష్ణుండు వారల ననుగ్రహింపఁ దలఁచి యమునానదీసైకత ప్రదేశంబున వేణుగానంబుచేసెనట యెట్టులనెను॥

చచ్చరేకులు ॥

పికిలిపువ్వు లెడలనెడలఁ-బెనచినట్టి పూలదండ
లొకయొయ్యారమమర-నొప్పు గొప్పకొప్పుచుట్టి ॥౧॥
వలపుగులుకు వైజయంతి-వక్షమందునొనరఁదాల్చి
పొలుపుమీఱ కొండగోఁగు-పూలు కర్ణములధరించి ॥౨॥
నీటువెలయఁ గటినిడాలు-నిగుడఁబట్టు దట్టి గట్టి
సూటిమీఱఁదావి కస్తూరిబొట్టు నుదుటఁబెట్టి ॥౩॥
పిల్లగ్రోవి తేనెలుప్ప-తిల్ల మోవిఁగూర్చి గోప
వల్లభుండు పాటపాడె-వట్టిమాఁకు లిగురువెట్ట ॥౪॥

వ. ఈవిధంబుగ జగన్మోహనంబుగఁ బాటపాడిన విన్ని, విరాళిగొని, తదాయత్తచిత్తలై శ్రీకృష్ణుండున్నచోటికి గోపికలు వచ్చిరఁట యెటువలెను.

ఏకతాళము ॥

తుఱుమునఁబువ్వులు తుఱిమి తుఱుమకయె
పరువున నపుడొక-భామినివచ్చెన్ ॥౧॥
తీసుగఁ గాటుక-దిద్ది దిద్దకయె
కూరిమినపుడొక-కోమలి వచ్చెన్ ॥౨॥
అరుదుగ గంధంబలఁదియు-నలఁదకె
సరగునఁ దమినొక-శశిముఖివచ్చెన్ ॥3॥
తొడవులు చక్కఁగఁ దొడిగియుఁ దొడగకె
వడి మీఱఁగ నొక-పడఁతుకవచ్చెన్ ॥౪॥

వ. ఇవ్విధంబున మోహపరవశలై వచ్చిన గోపికలఁ జూచి శ్రీకృష్ణుఁ డేమనుచున్నాఁడు.

ద్వి. ఇక్కడ కీరీతి నేలవచ్చితిరి
అక్కట యిట్టి సాహసములుగలవె!
ఈమెయి నేతెంచు టెఱిఁగిన మిగుల
మామ గోపించును మగఁడు శిక్షించు
బావలు మఱఁదులుఁ బాటింపరెలమి
ఈవలావలివార లెగ్గులాడుదురు,

చుట్టముల్ చుల్కఁగాఁ జూతు రెవ్వారు
గుట్టువీడిన నాఁడుఁ గొడుకును రోయు
ఇహపరదూరంబు లిటువంటిపనులు
విహితమే కులవధూవితతికి నెందు
పెలుచైన బెడుసైనఁ బేదవాఁడైన
ములుచైన మూర్ఖైన మూగవాఁడైన
గడుసైన తోడుసైన గర్వితాసైన
వెడఁగైన బడుగైన వెఱ్ఱివాఁడైన
నేరీతివాఁడైన నింతికి విభుని
నూరకె విడుచుట యుచితంబుగాదు
కావున మీరలు కంజాక్షులార
యీవంకనుండక యిప్పుడె పొండనిన.

వ. చింతాక్రాంతలై గోపిక లేమనుచున్నారు.

జంపె రేకులు ॥

వెఱఁగందిమోము-వెలవెలచేసె నొకతె ।౧।
పరఁగి కన్నీరు రెప్పలనించె నొకతె ।౨।
తలవంచి మొనవ్రేల-నిలవ్రాసె నొకతె ॥౩॥
వల పింతచేసెనని-వగనొందె నొకతె ।౪।
అతనిపగ యీడేరె-నని నవ్వె నొకతె ।౫।

వ. ఇవ్విధంబునఁ జింతాక్రాంతలై గోపికలు శ్రీకృష్ణునితో నేమనుచున్నారు.

త్రిపుట॥ ఇట్టి బెడిదపు మాటలాడఁగ–నెట్టుగా నోరాడెనన్నియు॥
గట్టిపెట్టి విరాళివచ్చిన–కామినులకు ।౧।
పతినివిడుచుట సతికిఁ దగదని–పలికితివి యీరూప–
ముగనినుఁ
పతివిగా భావించి సన్యసఁ–బాపమేమీ ।౨।
సతత సౌఖ్యములిచ్చు నీతో–సలుపకుండఁగ లేము
క్రీడలు
వెతలఁబెట్టెదు పతులఁ జెప్పగ వేడ్క–గలదె? ।3॥

వ. అని మఱియు నేమనుచున్నారు.

జంపె॥ నీపదాంబుజ సేవ–నిగిడిచెయ్యనెగాని
యేపనికి మాచేతు–లీకఁగొలుపవీశా ! ।౧।
నీనామవచనములు–నెమ్మివిననేకాని
వీనులన్యోక్తులను–వినఁజోరవు కృష్ణా ! ॥౨॥
నిన్నుఁగనుఁగొనఁగాని–నెఱయ మాలోచనము
లున్నవారిని జూడ–నొల్లవు ముకుందా! ॥3॥

త్రిపుట॥ వలపుతో మాతలను రేఁగెనో–
వలవకో మునుసతులు పతులకు।
వలచిరని వారొల్లరైరో వారిజాక్షా ! ॥౧॥

మేను నిదియెటేఁగింపవలెనా_
మహిని పురుషులకంటె సతులకు
కామ మష్టగుణంబ వేత్తని_గాథవినవే ||౨||

పెక్కు_విధములఁ బురుషు లతివల_
ప్రేమ కానఁగలేరు వారలు
సాక్షి_ పైకొన నొల్లననియెడు_సుగుణి గలదె ||3||

వ. అనిన నాశ్రీకృష్ణుఁడు మదీయలోకంబుచేరి కృతార్థులై యుందురు. తిరిగిపొండనిన గోపిక లేమనుచున్నారు.

ఝంపె॥ కమ్మని యధరసుధ_కలశమను వాతెఱయు
నెమ్మిఁ జిలుకకయున్న_నేఁడోర్వఁగలమా ||౧||
నీవిమల కరపద్మ_మీవాలు గోపివెడల
నీవేళ యీకున్న_నీకఁ దాళఁగలమా? ||౨||

వ. అని మఱియు నేమనుచున్నారు.

త్రిపుట॥ ఇట్టి యీధైర్యంబుచూచిన_
గట్లు రాళ్లును గరుఁగు హరిహరి
ఎట్లు కరఁగదు నీదుచిత్తం_బింతయైన ||౧||
చులకఁగా నీవెంత చూచినఁ_
జూడు మిందఱునైన నీకడఁ
దలఁగిపోవఁగలేరు నీపా_దంబులాన ||౨||

తాళుకొన నిఁకఁ జాల మతనుఁడు-
తను వెఱుంగఁడు చాటిచెప్పెద
మేలు దూరకు మీఁడు కొలదా మేలుకృష్ణా ?

ద్వి. అని దూఱిపలికిన-నావ్రజ సతులఁ
గనుఁగొని యెంతయుఁ-గరుణతోఁ జేరి
శౌరి వారలనెల్ల సరసవాక్యముల
గారవించుచు మది క్రిందెల్ల మాన్చి
మరుకేళిఁగళలంటి మర్మంబులంటి
కరఁగించి సౌఖ్యసాగరమునఁ దేల్చి॥

ద్వి. తమకు శ్రీకృష్ణుండు దక్కెనటంచు
రమణులు మిగుల గర్వమును జెందినను
గ్రక్కున వారి గర్వంబు నణంపఁ
జక్కఁగఁ బిదపఁ బ్రసన్నుఁ డౌటకును
మునుల చిత్తాంభోజముల నున్నమేటి
తనరంగ నపుడు నంతర్హితుండైన

జంపె॥ ఇప్పుడే కొనగోరఁ గొప్పు దువ్వుచు రమణుఁ-
డప్పుడే యెటువోయె-నని బ్రమసెనొకతె ॥౧॥
గుఱి మించుతమి మోవి-గ్రోలఁగానే విభుఁడు
జరిగె నెక్కడికనుచు-వెఱగందె నొకతె ॥౨॥

అలముకొని కౌఁగిటను_అంటియుండిన నడుమఁ
జెలువుఁడెటు వోయెనని_చింతించె నొకతె ॥3॥

వ. అటమీఁదటి వృత్తాంతం బెటువలెను.

రచ్చరేకులు॥

నల్లనయ్య వెదుకఁ జనిరి_గొల్లయిల్లాండ్రు గోరి
నల్లనయ్య నేటిదరుల_రంజిల్లు వనములందెల్ల ॥౧॥
పదురు పదురు గుములుగూడి_యదరుబెదరు లేకపూవుఁ
బొదలు తప్పకుండఁ బొదలు_పొదలు తమిని వెదకి
రపుడు ॥౨॥

వ. ఇవ్విధంబున వెదకిన మత్తకాశిను లేమనుచున్నారు.

దరువు। ఆటతాళము॥

వచ్చినాఁడఁట చూపరే కురవకములార_నుదుటను
పచ్చికస్తురిబొట్టు నొసపరి_బాగువాని ॥౧॥
చండితనమున వచ్చెఁ జూపరె_జాతులార_యన్యుల
దండితారులఁ జెలఁగు పచ్చని_దండవాని ॥౨॥

అర్ధచంద్రికలు॥

చాయమించిన యింద్రనీలపుఁ జాయవాఁడు ॥౧॥
నవ్వుమోమున నిండుఁజందురు_నవ్వువాఁడు ॥౨॥
బాగునకు బాగొసఁగు నొసపరి_బాగువాఁడు ॥3॥

వ. శ్రీకృష్ణుఁడు వచ్చెఁగాయని యచటివృక్షంబుల నడిగి యటఁ గానక, మఱియొకవనంబునకుఁ జని వెదకుచు నేమనుచున్నారు.

జంపె॥ అదె పుష్పలతలార! అంబుజాక్షుండు మీ
పొదలచాటున డాఁగె_పొసఁగురమ్మా ॥౧॥
కిటుకుతనమున విభుఁడు_క్రీడించి యేతెంచె
నిటుల కేతకులార_కృపఁ జూడరమ్మా ॥౨॥
జాతికొమ్మలఁ బాయ_నీతిగాదని పతికి
శ్రీతులసి, నీవైనఁ_జెప్పఁగదవమ్మా ॥౩॥

వ. అని మఱియు నేమనుచున్నారు.

త్రిపుట॥ వాంఛితార్థములను భజించిన_
వారి కొసఁగెడువాని నవశిఖ_
పింఛలాంఛనుఁ గానవా, తా_పింఛనగమా ॥౧॥
పంచసాయకుఁ గన్నతండ్రిని_భామినీ జనచిత్త చోరుని॥
కాంచనాంబరుఁ గానవా సుర_కాంచనంబా ॥౨॥
పూని పగడపుఁదీఁగె నగుకె_మ్మోవిఁ దనరెడువాని వెన్నని
మాని నీవిటుగానవా యెల_మావి మొలకా!

అర్థచంద్రికలు:
మాధవుఁగానరే మాధవులారా
మధురిపుఁ గానరే_మధుపములారా!
హరిఁగానరుగా_హరిణములారా !

వ. మఱియు నేమనుచున్నారు.

జంపె॥ అలకమల దళనేత్రుఁ-బలుకతోడనె వచ్చె
చిలుక, ముద్దులుచిలుకఁ-బలుకవే తెలియ ॥౧॥
సారెకును వెదకి-వేసారితిమి కంటివా
శౌరిఁ జూపుము శారి-చేరి వేఁడెదము ॥౨॥
వంచనను మముడాగు-రించి విభుఁడెటువోయె
నంచ, వివరించుమిా-యంచె నుండినను ॥౩॥

వ. అని వెదకుచు గోపికలు తదేకధ్యానంబునంది తన్మయత్వంబునొంది కృష్ణలీలల నప్పుడు విహరించిరఁట యెటు వలెను.

జంపె॥ నెలఁతయొక్క-తె తాను నీలవర్ణుఁడననుచుఁ
దలఁజుట్టెఁ బింఛంపు-దండ వేడుకను ॥౧॥
తనుమధ్యయపుడొకతె-తానె కృష్ణుఁడననుచు
గొనబువ్రేలను బిల్ల-గ్రోవి ధరియించెన్ ॥౨॥
నిండుజవ్వని యొకతె-నేనె శ్రీహరి ననుచుఁ
గొండగొడుగుగ నెత్తెఁ-బుండరీకమును ॥౩॥

క. వనమున మఱియును వెదకుచు
గనిరంబుజముఖులు మత్స్యకలశధ్వజశం
ఖనలిన చామరశరలాం
ఛనములు దనరెడు పదాంబుజమ్ములజాడల్॥

ద్వి. కనుఁగొని విభుజాడగానుండఁ దెలిసి
వనితలు సంతోషవారిధిఁ దేలి
యీయడ్డు లేకదా యిందిరాదేవి
పాయక తనగుబ్బ పాలిండ్లఁదాల్చె;
ఈయడ్డు లేకదా యెపుడు నిల్పుదురు
తోయజాసనసురాదులు మానసమున;
ఈపదము లేకదా యీశవాణీశ
గోపతిముఖదేవ కోటీరకోటి
ఘటితపంకజరాగ కమనీయకాంతి
పటలనీరాజన పరిభాసితములు.
అని చాలవర్ణించి యాచాయనొక్క-
వనితపోయినజాడ వరుసనీక్షించి
మనలను వంచిరాచి మగువనొక్కతెను
తనవెంటఁ దోడ్కొని తమినేఁగినాఁడు.
ఆకాంత యేమిపుణ్యముచేసె నొక్కొ!
ఏకాంతమున సతి నెనసియుండియును
దగనేమి దలఁపరు తగవెంచరకట!
మగవారి నెట్లు నమ్మగవచ్చునమ్మ.

వ. అని మఱియు నేమనుచున్నారు.

ఝంపె॥ మక్కువను విరులు భామకుఁ గోసియిచ్చుచును
నిక్కినిలిచినజాడ చక్కగనుపట్టెన్

ఇక్కడను ముడిచినాఁడిందువదనకుఁగొవ్వొ
చొక్కముగఁ గూర్చున్న-చొప్పుపొలుపొందెన్ ॥ ౨॥
మనసార రతుల వని-తను గూడినాఁడిచట
బెనఁగులాడినరీతి-యొనరఁ గనిపించెన్ ॥3॥

వ. అని ముద్దుముకుందుండును దామును విహరించిన స్థలంబులఁజూచి యేమనుచున్నారు.

ఏకతాళము ॥

నీటుగ రమణుఁడు-నేనునుజోడై
పాటలుపాడిన-చోటిది బోఁటీ! ॥౧॥
భావజజనకుఁడు-భక్తిఁ దనకుఁ గె
మ్మోవి యొసంగిన-తావిది తన్వీ! ॥౨॥
చెలిమిఁబతి తనకుఁ-జెలువునఁ గస్తురి
తిలకముదిద్దిన-నెలవిది నెలఁతా! ॥3॥
పరఁగుచు నాతొడ-పై సలయిక శ్రీ
హరి పవళించిన-యిరవిది యింతీ! ॥౪॥
నెమ్మిఁబ్రియుఁడనను-రమ్మనికపురపుఁ
దమ్ములమిచ్చిన-యిమ్మిదికొమ్మా ॥౫॥
తలమని యల్గినఁ-దనపాదములకుఁ
జెలువుఁడు మొక్కిన-తలమిది తరుణి ॥౬॥

ద్వి. కనుఁగొని విభుజాడగానుండఁ దెలిసి
వనితలు సంతోషవారిధిఁ దేలి
యీయడ్గు లేకదా యిందిరాదేవి
పాయక తనగుబ్బ పాలిండ్లఁదాల్చు;
ఈయడ్గు లేకదా యెపుడు నిల్పుదురు
తోయజాసనసురాదులు మానసమున;
ఈపదము లేకదా యీశవాణీశ
గోపతిముఖ దేవ కోటీరకోటి
ఘటితపంకజరాగ కమనీయకాంతి
పటలనీరాజన పరిభాసితములు.
అని చాలవర్ణించి యాచాయనొక్క
వనితపోయినజాడ వరుసనీక్షించి
మనలను వంచించి మగువనొక్కతెను
తనవెంటఁ దోడ్కొని తమిసేఁగినాఁడు.
ఆకాంత యేమిపుణ్యముచేసె నొక్కొ!
ఏకాంతమున సతి నెనసియుండియును
దగనేమి దలఁపరు తగవెంచరకట!
మగవారి నెట్లు నమ్మగవచ్చునమ్మ.

వ. అని మఱియు నేమనుచున్నారు.

జంపె॥ మక్కువను విరులు భామకుఁ గోసియిచ్చుచును
నిక్కినిలిచినజాడ చక్కగనుపట్టెన్ ॥౧॥

ఇక్కడను ముడిచినాఁడిందువదనకుఁగొవ్వు
చొక్కముగఁ గూర్చున్న-చొప్పుపొలుపొందెన్ ॥౨॥
మనసార రతుల వని-తను గూడినాఁడిచట
బెనఁగులాడినరీతి-యొనరఁ గనిపించెన్ ॥3॥

వ. అని ముద్దుముకుందుండును దామును విహరించిన స్థలంబులఁజూచి యేమనుచున్నారు.

ఏకతాళము ॥

నీటుగ రమణుఁడు-నేనునుజోడై
పాటలుపాడిన-చోటిది బోఁటీ! ॥౧॥
భావజజనకుఁడు-భక్తిఁ దనకుఁ గె
మ్మోవి యొసంగిన-తావిది తన్వీ! ॥౨॥
చెలిమిఁబతి తనకుఁ-జెలువునఁ గస్తురి
తిలకముదిద్దిన-నెలవిది నెలఁతా! ॥3॥
పరఁగుచు నాతోడ-పై నలయిక శ్రీ
హరి పవళించిన-యురవిది యింతీ! ॥౪॥
నెమ్మిఁబ్రియుఁడునను-రమ్మనికపురపుఁ
దమ్ములమిచ్చిన-యిమ్మిదికొమ్మా ॥౫॥
తలమని యల్గినఁ-దనపాదములకుఁ
జెలువుఁడుమ్రొక్కిన-తలమిది తరుణి ॥౬॥

వ. అని మఱియుఁ బెక్కుభంగుల బృందావనం బంతయుఁ గలయ వెదకి, శ్రీకృష్ణునిఁగానక, చింతాక్రాంతలై యాయింతు లేమనుచున్నారు.

జంపె॥ మిహిరాంశుముఖి యొకతె-మిథ్య యిపుడయ్యెనని
మహిని సర్వం విష్ణు-మయమనెడి మాట ॥౧॥
అలివేణి యొకతె మృష-యయ్యెనని జగత్రిలో
పల వాసుదేవ స్సర్వమనుమాట ॥౨॥
అణుమధ్య యొకతె బొంకయ్యె నిత్తఱి ననియె
అణుపరిపూర్ణుఁ డచ్యుతుఁ డనుమాట ॥౩॥

వ. అని శ్రీకృష్ణుఁడు యమునానది సైకతప్రదేశంబున నుండునోయని చని, యచటఁగానక, వేదనలకోర్వలేక, యిందుముఖులు ఇందు మందానిల కందర్పాదుల నుద్దేశించి యేమనుచున్నారు.

త్రిపుట॥ ఉష్ణకరు క్రియఁ జందురుఁడు మొగ-
మోటమేమియు లేకయెంచి
కృష్ణలాంఛన మొందుటయును గీడుఁదనము ॥౧॥
రూపమొదవక యుడుకుచల్లుచు-
రుటముచూపె గంధవాహుడు
రూపమొందిన నంతవేఁడిమి-చూపఁగలఁడో ॥౨॥

తులువతనమున మరుఁడు తండ్రికిఁ-
దోడు తానును వెతలఁ బెట్టె
పులికిఁబుట్టిన కూనమేయనె-పూరి యెచట ॥౩॥
చెంతఁ జిలుకలు మరునిఁదగవుగఁ-
చెలఁగిపాడెడు వేడినాయవి-
యెంతపోరిన పక్షపాతం-బేల మాను ॥౪॥
పరుష ఝుంకారముల మధుకర-
పంక్తి మిక్కిలి యేఁపఁ దొడఁగెను
విరహులను నేచేదిగాదా-మరునిగుణము ॥౫॥

వ. అని శ్రీకృష్ణు నేమనుచున్నారు.

త్రిపుట॥ మరుఁడు పగగొని-కదలి తఱుముచు
తిరుగగా నీవారి నబలల
పరుల కప్పననేయుటిది యేపౌరుషంబు॥
పతులువలచిన నెంత యేనియు-బాఁతియఁగుఁ
గాకివ్విధంబున
సతుల వలచిన నెట్టివారికిఁ-జౌకగాదే ॥౨॥
ఎంచిమావలెనీకుఁ దలపోన-రించఁడాయెనుగాకదైవము
మించియిటువలె మేము నిన్నుడికించలేమా ॥౩॥

వ. అని మఱియు నేమనుచున్నారు.

ఝంపె॥ అరసి, వలచిననతుల-నడవిలో దిగవిడచి
యరుగఁ బాదంబులె-ట్లాడెరా నీకు ॥౧॥

నడిరేయి నీవెయని-నమ్మివచ్చిన సతుల
నుడికించ మనసెట్టు-లొప్పెరా నీకు ॥౨॥
ఏమిటికి నూరకే-యెమ్మెలకు సలిగితివి
యేముచేసిన నేర-మేమిరా నీకు ॥౩॥

త్రిపుట॥ ఏలవేలర యేఁపదొఱఁకొనె దెంతవేడి-మొక్కిన
* * * * *
నివ్వటిల్లిన ప్రేమనెనఁటను-నిలిచి యుండ-నుండుము
రవ్వలేటికి నిదిగొ గానుక-పువ్వుదండ ॥౨॥
* * * * -అలుకను
నున్న యోరువలేము నీపాదంబుల్యాన ॥౩॥

వ. అని మఱియు నేమనుచున్నారు.

వసంతతిలకావృత్తము॥
ఏరాతొలంగి మమునేఁచఁగ నీకుమేరా
యీరాదయన్ జనవు లింతటనైన మాకున్॥
గోరా యుపాయనము-గొబ్బున గుబ్బబంతుల్
రారా యిఁకన్ వలదుథా చలపోరఁగృష్ణా!

ద్వి. అనుచు నీరీతి నయ్యంబుజాననలు
గొనకొని పెక్కు-భంగులఁ బలుకుచును
పోరిఁబోరి పుంఖాను పుంఖముల్ గాఁగ
మరుఁడేయు శరముల మర్మంబు లగల

మితి లేని విరహాగ్ని మేనులు గ్రాఁగి
మతిలోన నెంతయు మనికితపడుచుఁ
బతిఁజూచుటకు నొండుపాయంబు లేక
యతిభీతిఁ గన్నుల నశ్రువుల్ గ్రమ్మఁ
గరములు మొగిచి గద్గదకంఠులగుచుఁ
గరుణ నింతటఁ గృష్ణ, కావవే యనినఁ,
దొగల సంగడికానితోఁ దులదూఁగు
మొగమునఁ జిఱునవ్వు మొలకలెత్తఁగను
దూఁకొని మెఱుఁగులఁ దులకింపఁ బసిఁడి
కోక బిగించి చుంగులు వాఱఁ గట్టి
లోల మధువ్రత లులితోరు పుష్ప
మాలికలనుబూని మన్మథుఁడగుచుఁ
దామరసాక్షుండు దయతోడ గోప
భామల ముందఱఁ బ్రత్యక్షమయ్యె.

జంపె॥ ఒగిఁ గ్రమ్మకొనిరి కృష్ణా యంచుఁజెలులపుడు
మిగులఁ దమకమునఁ దుమ్మెదల చందమున ॥౧॥
మూఁగి రతివలు విభుని-మోవిపంటికి నపుడు
రాగతనమునఁ గలికి-రాచిలుకలనఁగ ॥౨॥
పట్టిపెనఁగిరి సుజన-పారిజాతము నపుడు
దిట్టలై సతులలరుఁ-దీఁగెలవిధముగ ॥3॥

వ. మఱియు నప్పుడెటువలెను.

జంపె॥ మోదమున వికసితాం-భోజదళనేత్రినకుఁ
గైదండయొసఁగె నొక-కలకంఠి యపుడు ॥౧॥
తటుకునను విభుని పు-క్కిటివిడె మందేదగ
సటలుసేయుచు నొక్క-జలజాతగంధి ॥౨॥
పాదుకొనుభక్తిఁ గర-పల్లవంబునఁ బ్రియుని
పాదంబులొత్తె నొక-పద్మాయతాక్షి ॥౩॥

వ. ఈరీతి గోపభామినులు బహువిధంబులఁ బ్రియునుపచరించి, యతనియం దన్యకాంతారతి కీలితచిహ్నంబులఁ గనుఁగొని, మనంబులఁ గినుకపొడమ నప్పుడెటువలెను॥

అర్ధచంద్రికలు॥

సురటిమరుగున నోరకన్నులఁ జూచె నొకతె ॥౧॥
ఈసు మదిపెనఁగొనఁగ మొగమటు చేసెనొకతె ॥౨॥
మించు వెడనిట్టూర్పులను నిగిడించె నొకతె ॥౩॥
పెదవి విఱిచటుచూచి బొమముడి-పెట్టె నొకతె ॥౪॥
వంత నీకనేమందునని తల-వంచె నొకతె ॥౫॥

వ. ఈవిధంబునఁ గోపాయత్తచిత్తలైన మత్తకాశినులేమనుచున్నారు.

ఝంపె తాళము॥

కన్నవారు విన్నవారుఁ గాదనంగ నిన్నుజార.........
......కన్నియలనె......నెంచదగునె ॥౧॥
తగవు విడిచి సిగ్గు విడిచి–మగని విడిచి నిన్ను దగిలి
నట్టి యిగురుఁబోండ్ల నెగులు–పఱపనీకుఁ దగునె
మఱియు ॥౨॥
కె...వచ్చు...దియెరాలు–నేరాలు చేసినట్టి
జారచోరులనక వచ్చు–సతుల నెతలఁబెట్టఁదగునె ॥౩॥

వ. అని శ్రీకృష్ణుని వంచితాలాపంబుల నుపచరించివచ్చిన సతులేమనుచున్నారు.

సీ. గాసలిచ్చి జుణిఁగి వేసరించితివిట్టి
మాయలాగడములు గాయకములు
నెన్నముచ్చ, నీకు వెన్నతో నిడఁబోలుఁ
గన్ననాఁడె నిన్ను గన్నతల్లి.

జంపె॥ పోవోయి నీతోడి–పొందు లిఁకఁజాలు నీ
లావు మామీఁదఁ నీ–లాగు చూపితివి ॥౧॥
ఉండంగఁగదె మమ్ము–నుడికించ నిఁకరాక
నిండువారవాడువు–నేఁడు తెలిసితిమి ॥౨॥
కతలుసెప్పక తొలఁగఁ–గదవోయి యూరకే
నెతలఁబెట్టకు నేము–విన్నారమిప్పుడు ॥౩॥

ఆ. వె. ఒంటినుండుదాని వెంటనే తిరిగితి
మేలుమేలు భళిర! మేలుమేలు
చాలుఁజాలు నీకు సతతంబు సక్కటా
యేపరాకు ? మమ్ము నేఁపరాకు.

వ. అని తనుదూఱి పలికిన గోపభామినుల యలుకను శ్రీకృష్ణుఁడు తీర్చినఁట యెట్టనలెను.

జంపె॥ రమణి యొక్కతె కొప్పు రమణుఁడలమఁగఁజూచి
చమరించె......బెట్టుగ చన్నుమొనల ।౧।
బెట్టుగా నొకతెతోఁ బ్రియుఁడు పెనఁగఁగఁజూచి
బట్టబయలుగ నొకతె పంతంబునొందె ।౨।
ప్రాని పతియొకతె కుచములు నంటఁగాఁజూచి
తానొకతె యానడుమ మాని నుపడెనయ్యా ।౩।

వ. అప్పుడు శ్రీకృష్ణుఁడు వారలతోఁగూడి యెటువంటి స్థలాల విహరించెను.

జంపె॥ జలజనేత్రుఁడు సతుల సరసులను జొక్కించె
నెలరాజుచెలువుతో నలరాజసమున ।౧।
కదియఁ గొఁగిటఁజేర్చి కరఁగించెఁబ్రౌఢిమము
పొదల నీడలను నింపొదవ శ్రీవిభుఁడు ।౨।
కలకంతులను శౌరి పలురతులఁ దేలించె
నలరుతావులఁ జాల నలరుతావులను ।౩।

పద్మాక్షుఁ డప్పుడు బహువిధరూపుఁడై
తరుఁణుల నెడ నెడఁ దాను నిల్చి
యొండొరుల్ హాసంబు లొనరంగఁ గీలించి
మండలాకృతినిల్పి మధురసరణి
కేలఁకుల నిద్దఱు వెలఁదులు వీణియల్
పలికించి చొక్కపుఁ బాటపాడ
మోహనభంగిమై మురళిమ్రోయించుచుఁ
గడకఁ దన్మండలి నడుమనుండి

గీ. కంకణంబులు మొలనూళ్ళఁ గింకిణులును
నూపురంబులు మొఱయ మనోజ్ఞగతుల
మురువుదీరుచు కరపదస్ఫురణ మెఱసి
కేళికలనూత(?) రాస కేళిసలిపి॥

త్రిపుట॥ అలరుసంపెగ విరులసందుల_తులసిపెనసిన
దండలాగున
నళినదళలోచనలుఁ గృష్ణులుఁ_జెలఁగిరప్పుడు ।౧।
పసిఁడిపూదెలు నలరునీలము_లెసఁగఁగూర్చిన పేసతీరున
గిసలరాగాధరలుఁ గృష్ణులు........ ।౨।
నడుమనడుమను మెఱుఁగు లెంతయు_నడరు కాదంబిని
విధంబునఁ
బడఁతులును శ్రీకృష్ణులును_జూపట్టిరప్పుడు ।౩।

వ. ఇవ్విధంబున రాసకేళియొనర్చ, నంత విశ్రాంతలైన కాంతలతోఁగూడి విభుఁడెటువలెను.

జంపె॥ చేరి యొక్కతె చెలియ-చెక్కు-చెక్కునఁజేర్చ
శౌరి తమ్ములమొసఁగె-గారవంబాదవన్ ॥౧॥
వనిత యొక్కతె యలసి-వ్రాలఁగా మాధవుడు
ఒనరంగఁ దనభుజము-నూఁతగావించెన్ ॥౨॥
కొమ్మయొక్కతె దప్పి-గొనియున్నఁగని విభుఁడు
కెమ్మోవి తేనియల్-నెమ్మితో నొసఁగెన్ ॥౩॥
వనితయొక్కతె బడలి-నను జూచి కృష్ణుండు
తనువుగా నపుడు గంధంబుపై నలఁదెన్ ॥౪॥

... ... ... ... ... ...
... ... సురటిఁగొని విభుఁడు విసరెన్ ॥౫॥

క. ఈలీల రాసకేళీ
లోలుండై శౌరి గోపి ... ...
... ... ... ... ... ...
... ... ... ండె ననవరతంబున్॥

ద్వి. అని గోపికామనోహరుని పేర
... ... ... ... ... ...
తపనీయకౌస్తుభ ధారుని పేర
తపనకోటిసమాన ధాముని పేర

తపనీయమగు ... ... ... ...

... ... ... ... ... ...

అంకితంబుగ వేంకటాధిప పాద

పంకజ ... ... యుగభ్రమరాయమాన

... ... ... కర తిమ్మయ దండనాథ

... తను సంభవుండు అక్కయప్రధానుండు

ఖచిత సమస్త ... ... ... ...

... ... ... ... ... ...

ఆచతురాబ్ధి వేలావనియందు

ఆచంద్రతారార్కమై యొప్పుఁగాక !

---

కాకినాడ : జార్జిప్రెస్ నందు ముద్రింపఁబడియె.

Andhra University Series No. 67

# యక్షగానములు

## (తంజావూరు)

సంపుటము ౫

---

# పారిజాతాపహరణము

---

పరిష్కర్త
విద్వాన్
గంటి జోగిసోమయాజి, ఎం. ఎ., ఎల్. టి.,
ప్రొఫెసర్, ఆంధ్రవిశ్వకళాపరిషత్తు.

---




ఆంధ్ర విశ్వకళా పరిషత్తుచే ప్రచురితము

Price Rs. 2-50] 1960 [వెల రు 2-50

# ఉపోద్ఘాతము

ఆంధ్రనాయక రాజులచేతను తరువాతి మహారాష్ట్ర పరిపాలకులచేతను పోషింపఁబడిన కవులు, లేఖకులు స్వయముగా రచించినట్టియు నితరుల గ్రంథములకుఁ బ్రత్యంతరములుగా సేకరించినట్టియు వ్రాఁతప్రతులు తంజావూరి సరస్వతీ మహాలు గ్రంథాలయమునం దనేకములుగలవు. అవి యరవము తెనుఁగు సంస్కృతము మొదలైన భాషలలోని గ్రంథములు; తాటాకుప్రతులు, కాగితపుప్రతులు, ప్రత్యంతరములును; వానిలో ముద్రితములు నముద్రితములు గూడ నున్నవి.

ఆంధ్రవాఙ్మయమున కలంకారములైన నన్నెచోడుని కుమారసంభవము, శ్రీనాథుని క్రీడాభిరామము మొదలైన మహోత్తమ గ్రంథములు అందలి ప్రతులనుండియే పరిష్కరింపఁబడి ముద్రింపఁబడినవి. అచ్చటి తెలుఁగు గ్రంథములను గూర్చివివరణపూర్వకమైన యొక కేటలాగు అప్పటి యుపాధ్యక్షులుశ్రీ డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారి ప్రోత్సాహమున, పి. పి. ఎస్. శాస్త్రిగారి యాధిపత్యమున 1933లో ప్రచురింపఁబడినది.

మఱికొంతకాలమైనతరువాత, అక్కడనుండిన తెనుఁగు వ్రాఁతప్రతులలో నముద్రితములైనవాని కన్నిటికిని ప్రత్యంత

రములు వ్రాసి తెచ్చుటకు కొందఱు లేఖకులను నియమించి, యప్పటి యుపాధ్యక్షులగు డాక్టర్ (శ్రీ) కట్టమంచి రామలింగా రెడ్డిగారి ప్రోత్సాహమున 1938 వ సంవత్సరము నుండియు పనిప్రారంభమైనది. అప్పటినుండియు 1948 వ సంవత్సరము వఱకు నచటి యముద్రితముల కన్నిటికిని ప్రత్యంతరములు వ్రాయించి తెప్పింపఁబడినవి. పైరీతిని సేకరింపఁబడిన వ్రాఁత ప్రతులలో వీలైనన్ని ముద్రించి ప్రచురించుటకు విశ్వకళా పరిషత్తువారు తీర్మానించిరి. ఆతీర్మానము ననుసరించి ద్విపద భారతము మొదటిసంపుటము 1948 లోను, రెండవసంపుటము 1950 లోను అప్పటికి తెనుఁగుశాఖాధ్యక్షులైన (శ్రీ) పింగళి లక్ష్మీకాంతంగారు పరిష్కర్తగా ప్రచురింపఁబడినవి. ఆ తరు వాత డాక్టర్ శ్రీ వాసిరెడ్డి శ్రీకృష్ణగారు ఆంధ్రవిశ్వకళాపరిష దుపాధ్యక్షులై మిగిలిన గ్రంథముద్రణమునకు దారిఁ గొన వలసినదని ఆంధ్రశాఖాధ్యక్షుఁడనైన నాకానతి యిడిరి. వారి యాజ్ఞ ననుసరించి ద్విపదభారతము మూఁడు నాలుగు సంపు టములు 1950 సంవత్సరాంతమునకుఁ బ్రచురింపఁ బడినవి.

మిగిలిన గ్రంథములలో ననేకములైన యక్షగానములు నితరకృతులు నున్నవి. వానిలో నల్పసంఖ్యాకములను సరస్వతీ మహాల్ అధికారులు ప్రచురించిరి. ఆంధ్రవిశ్వకళాపరిషత్తు వారిచే వ్రాయించి తెప్పింపఁబడిన యీ మిగిలిన వానిలోఁ గొన్నిటినైనను ప్రచురింపవలసినదని యుపాధ్యక్షులైన డాక్టర్

శ్రీ వాసిరెడ్డి శ్రీకృష్ణగారు ఆజ్ఞాపింపఁగా యక్షగాన ప్రచురణ మారంభింపఁ బడినది. అందు ఇప్పటికి నైదు సంపుటములలో నీక్రిందిరీతిని ప్రచురింపఁబడినవి.

1 వ సంపుటము 1955 సం॥
- ప్రహ్లాద చరిత్ర
- పూతనా హరణము
- కాళీయ మర్దనము
- హేమాబ్జనాయికా స్వయంవరము

2 వ సంపుటము 1956 సం॥
- విజయ రాఘవచంద్రికా విలాసము
- విజయరాఘవ కల్యాణము
- తంజాపురాన్నదాన మహానాటకము

3 వ సంపుటము
- ద్రౌపదీ కల్యాణము
- రతి కల్యాణము
- శచీపురందరము
- సతిదానశూరము

4 వ సంపుటము
- వాసంతికా పరిణయము
- వివేక విజయము
- చిత్రకూట మాహాత్మ్యము
- భీమసేన విజయము
- శ్రీకృష్ణలీలా విలాసము

ప్రకృతప్రచురణము అయిదవ సంపుటము. తరువాతి సంపుటములును క్రమముగా ప్రచురింపఁబడును. ఇప్పటికిఁ

బ్రిచురితమ్ములైన యీ సంపుటము లన్నియు నొక్కొక్కటి సుమారు మూఁడువందల పుటలు గలవి. ఇవి గాక యనకాశ మునుబట్టి ప్రచురింపవలసిన గ్రంథములు సుమారు 25 సంపుటములు కావచ్చును.

పై గ్రంథముల నన్నిటిని బరిశీలించియుఁ బరిష్కరించియు శుద్ధప్రతులను దయారుచేయుటలో శ్రీ కొమ్మనమంచి జోగయ్యశర్మగారు సహాయులుగా పనిచేయుచు నుపయోగించుచున్నారు. పరిషత్ కళాశాలలో నుపన్యాసకులుగా పనిచేయుచు యక్షగాన విషయమున గాఢ పరిశ్రమచేసి పి. హెచ్.డి పట్టమును పొందిన శ్రీ ఎస్. వి. జోగారావుగారు ఈసంపుటములప్రచురణ విషయములలో మిక్కిలిగా సహాయపడియున్నారు.

ఈగ్రంథము లిట్లుప్రచురణభాగ్యము నందుటకు ఆంధ్రవిశ్వకళాపరిష దుపాధ్యక్షులగు శ్రీ వాసిరెడ్డి శ్రీకృష్ణగారి యాదరాభిమానములు మూలకారణములు. ఇట్టి యుపాధ్యక్షులవారికిని, సిండికేటువారికిని, కీ. శే. లైన యీకృతికర్తల పక్షమున కృతజ్ఞతాభివందనముల నొనర్చుచున్నాను.

పరిష్కర్త,
ఆచార్య విద్వాన్ జి. జె. సోమయాజి,
ఆంధ్రశాఖాధ్యక్షుఁడు,
ఆంధ్రవిశ్వకళాపరిషత్,
వాల్తేరు.

# కృతజ్ఞత

అక్షరరూపమున వెలయుచు ఆంధ్రభాషాయోషాలంకారములయి చాలకాలమినాలోకయోగములేని యీయనర్ఘకృతిరత్నముల ప్రకాశనమున దీక్షాపరులయి ఆంధ్రభాషోద్ధరణమున ఆదరముగలిగిన పండితపక్షపాతులు

ఆంధ్రవిశ్వకళాపరిష దుపాధ్యక్షులు
శ్రీ శ్రీ వాసిరెడ్డి శ్రీకృష్ణగారికి
నిరంతర కృతజ్ఞతాభివందనములు.

నిండుమనంబు నవ్యనవనీతసమానము, పల్కు శర్కరా
ఖండసమంబు, చేతయుపకారపరంబు, సధర్మచింతనల్
ఖండనసేయువర్తనము గల్గునుదారుఁడు వాసిరెడ్డి కృ
ష్ణుండు నిరామయాభ్యుదయ నూత్నవికాసము లొందుఁ
గావుతన్.

పరిష్కర్త,
ఆచార్య విద్వాన్ సోమయాజి.

# పీఠిక.

## పారిజాతాపహరణము

ఇది క్రీ. శ. 1787-1798 సంవత్సరముల నడుమఁ దంజావూరి నేలిన మహారాష్ట్ర ప్రభువగు అమరసింహున కంకితముగా నతని యమాత్యుఁ డగు శివరామమంత్రి ప్రేరణమున మాతృభూతకవిచే రచింపఁబడినది. ఇతని గోత్రము శాండిల్యము. తండ్రి రంగార్యుఁడు. ఇతఁడు త్రిశిరగిరి మాతృభూతేశ్వరస్వామి భక్తుఁడు.

తెనుఁగునఁ గల కడుపెద్ద యక్షగానములలో నిది యొకటి. మొదట వరుసగా వినాయకుఁడు, కటికము, దాష్టిక పండితుఁడు- నను పాత్రల ప్రవేశము, తరువాత పార్వతీపరమేశ్వరుల ప్రసంగము నిందుఁ గన్పట్టును. ఈ పాత్రలకుఁగాని ప్రసంగములకుఁగాని ప్రధానకథతో నెట్టిసంబంధమును లేదు. అట్టివే యాతరువాతనున్న భోటకన్యావృత్తాంతము, భాషాదేవి గొల్లకలాపమును. ఇవి యీ పారిజాతకథకు ముఖబంధముగా నెందుకు రచింపఁబడినవో దురూహము. పారిజాతాపహరణ ఘట్టమునకుఁ బిదప నిందున్న జలక్రీడలు, గోపికా వస్త్రాపహరణ కథయు నట్టివే. వాని కిటఁ దగిన ప్రసక్తి కనుపట్టదు. పారిజాతకథతోఁ బ్రసక్తి లేని రాధపాత్ర కిందుఁ బ్రవేశము

కాఁగా ఆకథ నను బంగసాగిలకునొన పుణాంక వాకకథ కిందుఁ

బ్రిస క్తి కలుగ లేదు. సవతి కయ్యము, సింగి సింగల ప్రసం గము లిందుఁ గలవు. కాని యేకథలోనైన ర క్తికట్టవలసిన యూపట్టుల నింత ర క్తి కలుగ లేదు. భావములను, పదబంధ ములను, పద్యపాదములను బాదములుగానే తిమ్మనగారి పారిజా తాపహరణమునుండి గ్రహించిన మాతృభూతన, ఆయన సత్య భామయలుక చిత్రించినఘట్టమును నాల్గుపుటలలో నడిపించి యుండఁగాఁ దాను ముప్పదిపుటలుగా సాగఁదీసినాఁడు. తిమ్మ నార్యునకు మూఁడాశ్వాసముల పైచిలుకు పట్టిన పారిజాతాప హరణఘట్టమును మాతృభూతన యొక్కముక్కలోఁ దెమల్చి వైచినాఁడు. ఈమార్పులు దృశ్యోద్దిష్టమగు యక్షగానప్రాయ రచనలో సముచితములనియే చెప్పవచ్చును. కాని, మొత్త ముపైఁ గథను సమ్యక్సంవిధానముతో నాటకోచితముగా మలచ లేకపోయినాఁడు.

ఇది నాటకమని పలుతావులఁ జేర్కొనఁ బడినది. ఏడం కములుగా విభజింపఁబడినది. అంతమాత్రమే మార్గనాటకాను కరణము. తక్కినదంతయు యక్షగాన ఫక్కికయే. సాధారణ ముగా ముందుఁ బాత్రప్రశంసయుఁ దదుపాతి పాత్రప్రవేశపు దరువు నుండును. పాత్రల తెరమఱుఁగు ప్రసంగములు, మాధవి పలుకరింపులు, సవతి కయ్యము మొదలగునవి భామకలాపపు బాణీని దలపింపఁ జేయును. సింగి సింగల ప్రసంగములు కొర

వంజి తీరును జ్ఞప్తికిఁ దెచ్చును. ప్రత్యంకాది యందునుగృతిపతి నుద్దేశించియున్న 'అవధరింపు'మను నెత్తుగడయుఁ బ్రత్యంకాంతమందును గల గద్యలు,మధ్యనున్న సుదీర్ఘ వర్ణనలును ప్రబంధ ఫక్కిని దలపించును.

ఇందు సంస్కృతమున సుమారు పాతిక శ్లోకములు, న్నాలుగైదు చూర్ణికలు, కొలఁది తమిళ కన్నడ మహారాష్ట్ర భాషాప్రసంగములును గలవు. తెలుఁగున వచనములు తఱచు ద్విపదలు, దరువులు (దరువులలోఁ గృష్ణుఁడుద్దిష్టుఁడుగా 'త్రిశిర గిరి నిలయసఖ' యనుముద్రలు గలవు.' ఉత్తరాది దరువులు, గూడఁగలవు) పద్యములును గలవు. సీసములు సుమారొక నూరున్నవి. అందుఁ బ్రతిపాద సమతాపాదనముతోడి తూఁగు బాగుగ నున్నది. తలుపుపాట, నలుగుపాట, శోభనములు, గౌరీకల్యాణము మొదలగు స్త్రీల వేడుక పాటలు నిందుఁ గలవు. వీనినన్నిటిని బట్టిచూడఁగాఁ గవి తానెఱింగిన భిన్న ప్రక్రియల నన్నిటి నేకముఖముగా దండ గ్రుచ్చుటకుఁ బ్రయత్నించినట్లు తోఁచుచున్నది. గొల్లకలాపము, జలక్రీడలు, గోపికావస్త్రాప హరణము మొదలైన కృష్ణలీలలు తనకుఁ బరిచితము లైనవి యేకసూత్రాను మాత్రముగా నిందు గుదిగుచ్చినాఁడు. నైక్యదృష్టితో దీనిని జూచినచో నిది యతుకులబొంతవలెఁ దోఁచును.

ఇఁకఁ బాత్రపోషణము ప్రసంగౌచిత్యము ననునట్టివి కొంతవఱకు గ్రామ్యశక్తినే యున్నవి. సత్యభామా శ్రీకృష్ణ సంవాదము, పరస్పరానునయము, ప్రసాదీకరణము ననునవి సుకుమార ప్రవృత్తిగల యౌచితీవిధానజ్ఞులకు నంతగా రుచింపవు. కొన్ని యెడల సంవాద సరళియు గ్రామ్యజనోచితముగనే యున్నట్లు మనకుఁ దోఁపవచ్చును. కాని యాకాలమున నిట్టి రచనలకుఁ బ్రాచుర్యము గలిగి వీనిని జూచి జనులానందించుచుండెడివారు. ఇట్టిరచనలు నేఁడును వీధి భాగవతములలోఁ గలవు.

# పారిజాతాపహరణము



మాతృభూతకవి

దేవముని వనచైత్రి, ధృతకనకవేత్రి।
శరణు శరణు విపక్షశిక్షణ।
శరణు త్రిజగద్రక్షణ! శరణు విమలకటాక్ష
వీక్షణ, శరణు శుభకరలక్షణ ॥శం॥
నందనందన, వినతసనక సనందన, జనానందన।
నందకాయుధధర, పురందర నందన రచితవందనా ॥శ॥
భానుకోటి సహస్రభాను విభాసమాన, నిరంజనా।
ధేనుకాసుర మదవిభంజన, దివిజసముదయరంజనా ॥శ॥
వల్లవీరమణ త్రిశిరగిరివాసమిత్ర సనాతనా।
పల్లవచరణ దళితపూతన పాలితాఖిలచేతనా ॥శ॥

మంగళం॥ మధురావిహారికి మంగళం।
మధుకైటభారికి మంగళం॥
గోపసంచారికి, గోవర్ధనోద్ధారికి।
మాపతికిని జయ మంగళం॥
పాపసంహారికి ప్రబలకంసారికి।
మాపాలి గోపాలునికి మంగళం॥
జన్మరహితునకు జగదేకవీరునకు।
మన్మథగురునకు మంగళం॥
సన్ముని వంద్యునకు శంఖచక్రధరునకు।
మన్మథ మన్మథునకు మంగళం॥

దీనవత్సలునకుఁ ద్రిశిరగిరీశు సఖునకు
మానితాచారునకు మంగళం॥
భానుకోటి తేజునకుఁ బరమదయాళునకు
మాణిక్యాభరణునకు మంగళం॥

ద్విపద: శ్రీగణనాథుని సింధురాననుని
వాగీశముఖ్య గీర్వాణసేవితుని
ఏకదంతమువాని హేరంబుఁడనఁగఁ
బ్రాకటవిఖ్యాతిఁ బడసినవాని
మోదకహస్తుని ముక్కంటిపండ్లు
సాదరంబుగ మెక్కు చక్కనివాని
కలుగులాయపుఁ దేజి కడువడి నెక్కి
యిల నెల్లలోకము లేలెడువాని
తన్నుఁ బూజించిన ధన్యులపాలి
పెన్నిధానంబుగాఁ బెంపొందువాని
ఆదిగణేశ్వరుఁ డైనట్టివాని
పాదాబ్జములకును భక్తితో మ్రొక్కి,
శ్రీరుక్మిణీలోలు శ్రితపరిపాలుఁ
గారుణ్యమయ శీలుఁ గాంచనచేలు
నందగోపకుమారు నవనీతచోరు
బృందారకాధారు బృధ్వీవిహారుఁ

గనకరత్న నికాయ కలితవిభూషు
ఘనతర మృదుభాషుఁ గమనీయవేషు
నతసీ కుసుమదేహు నాజానుబాహు
శ్రితరక్షణోత్సాహు శ్రీఖగవాహు
శ్రీవత్స కౌస్తుభాంచిత వక్షుఁడైన
శ్రీవిష్ణుదేవుని సేవించి మించి,
అతని పట్టపురాణి యలినీలవేణి
తతసైకతశ్రోణి తరుణాబ్జపాణి
యానత గీర్వాణియగు మంజువాణిఁ
బూని యిందిరను నేర్పున సన్నుతించి,
తమ్మిగద్దియమీఁదఁ దాఁగొలువుండి
దొమ్మిగా బ్రదుకుపొద్దుల లెక్క నుదుట
టాకులపై వ్రాయు నబ్జసంభవునిఁ
బ్రాకటముగ నీరుపాలు వేర్వఱచు
వాపుర మెక్కెడువాని నెమ్మదిని
వేవేగ భక్తితో వినుతించి మించి,
తలవాకిట మెలంగు తామరసాక్షి
పలుకుల జవరాలు బ్రహ్మయిల్లాలు.
చదువులపుట్టిల్లు జగడంపు బువ్వ
కదలికఁ దినువానిఁ గన్నట్టితల్లి
నాలుకపై నటనము చేయు దేవి.

త్రైలోక్య జననిని దలఁచి ప్రార్థించి,
ఐదుమోముల వాని, నమరు ముమ్మొనల
కైదువ గలవాని, గళమున విసము
ధరియించుకొనువానిఁ దరుణతుపార
కరకిరీటుని జహ్ను కన్యకాధరుని
మహనీయ రుద్రాక్ష మాలికాధరుని
అహిరాజభూషణుఁ డైనట్టివానిఁ
గైలాస నిలయుని ఘన హిమశైల
బాలికాలోలుఁడై పరఁగినవాని
జగతి సృష్టిస్థితి సంహారకర్త
యగువాని నష్టమూర్తైనట్టివాని
భావించి పూజించి ప్రార్థించి మించి
సేవించి యభిమతసిద్ధి గావించి,
గట్లురాయని ముద్దుగారాబు పట్టి
యాట్లాటలుగను బ్రహ్మాండభాండములఁ
బాలనగావించు పరమకళ్యాణి
శూలిని మాతల్లి సురకల్పవల్లి
గజముఖ గుహులను గన్నట్టిమాత
సుజనావనఖ్యాత సుగుణసంజాత
కాళిక సకలదిక్పాల కిరీట
కలిత రత్నచ్ఛటా ఘటితపాదాబ్జ

లలితమైతగు శ్యామలాంబికకెఱఁగి,
వ్యాస వాల్మీకాది వరకవీశ్వరుల
భాసురభక్తిచే భావించిమించి,
నన్నయభట్టాది నానాంధ్రకవులఁ
జెన్నుమీఱఁగ మదిఁదలఁచి నుతించి,
లక్షణ లక్ష్యంబు లని మెఱుంగకను
అక్షరశూన్యులై యమరినయట్టి
కుకవుల నెల్లఁ జేకొనక నిందించి,
ప్రకటమౌ మద్గురుస్వామినిఁ దలఁచి
గురుతర శాండిల్యగోత్రపావనుఁడ
వరకవిరంగార్య వరతనూభవుఁడ
గురుకృప సౌగంధి కుంతలాదేవి
వరముచే జనియించి ప్రబలినవాఁడ
మాతృభూతస్వామి మహితకటాక్ష
చాతుర్య పరిలబ్ధ సరససాహిత్య
సంగీత మధుర వాగ్ఝరి గల్గువాఁడ
శృంగారరసము తెల్సిన మేలువాఁడ
కవి మాతృభూత నాఖ్యానంబుచేత
భువిలోపలఁ బ్రసిద్ధి పొందినవాఁడ
గరిమచే లోక విఖ్యాతంబుగాను
సరవి మీఱఁగఁ బారిజాతాపహరణ
మను మహానాటకం బందఱు మెచ్చ
వినిపింతుఁ ద్రైలోక్య విఖ్యాతముగను.

వ. అని.

శ్లో॥ సర్వత్ర పరిపూర్ణో య, స్సమస్త జగతాంపతిః।
సంప్రార్థ్య తం జగద్వంద్యం, కరోమికృతిముత్తమాం॥

వ. అని యిష్టదేవతా ప్రార్థనంబును, గురుచరణారవింద వందనంబును సుకవిజనతాభినందనంబును కుకవిజన తిరస్కారంబును గావించి కృతిపతి నభివర్ణించెద నెటువలెను.

శ్లో॥ శ్రీమత్ ప్రతాపహరిభూపతి పుణ్యపాక
రూపే లసత్యమరసింహ మహీపచంద్రే।
ఆశాతరంగ లసమాన మనుష్యపూర
లోకాంబురాశి రగమన్మహనీయహాసం।

శ్లో॥ విష్ణు స్స్వకీయ నరసింహమహావతారం
సంత్యజ్య పుణ్యజనపీడన ముఖ్యహేతుం।
సంప్రాప పుణ్యజనతా పరిరక్షణార్థ
మద్యక్షితా వమరసింహ నృపావతారం॥

శ్లో॥ జ్ఞానాంజనేన పరిలబ్ధ మదృశ్యరూపం
శ్రీరామ నామకనిధిం హృదయాబ్జకోశం।
యస్మాద్వహ త్యమరసింహ మహీపచంద్ర
స్తస్మాత్తదీయ గుణవర్ణనమేవ ముఖ్యం॥

ద్వి॥ శ్రీభోసల కులాబ్ధిశీతాంశుఁడనఁగఁ
బ్రాభవంబందిన పరమపుణ్యుండు,
శ్రీకరముగను భాసిలు చోళరాజ్య
మేకచక్రంబుగా నేలెడువాఁడు,
మకరంద ముఖ్యనామాంచిత బిరుదు
లకలంకముగఁ బూని యమరినవాఁడు,
పొలుపైన శ్రీతంట పుటభేదనమును
తెలిదీవికని విష్ణుదేవుఁడౌవాఁడు,
సార భుజాంతర సంతతోల్లసిత
భూరి ప్రతాప విస్ఫురదబ్జమిత్ర
శమిత మదోన్మత్త శత్రురాజన్య
కుముద సందోహుఁడై కొమరొందువాఁడు,
శరదభ్రపీచికా చంద్ర సితాబ్జ
వరతార ఫేన దివ్యయశఃపయోబ్ధి
నిబిడీకృతాద్భుతానేక వేధోండ
శబల కరండ సంచయుఁడైనవాఁడు,
భవ్యతరౌదార్యవార్ధి నిమగ్న
దివ్యమణీ కామధేను మందారుఁ,
డతులిత మృదుహృదయాంభోజ సదన
తతభక్తి పేటికాంతర గుప్తమహిత
ధర్మార్థకామాది దానచాతుర్య

నిర్మల హరిహయ నీలవజ్రేంద్రుఁడు,
స్థిర చోళరాజ్యసంస్థిత మహనీయ
పరమదేవాలయ బ్రహ్మాలయాది
భాగ్య సర్వస్వభవ్యాకార లసిత
యోగ్య పుణ్యామయ దేహుండైనవాఁడు,
సంతతాశ్రిత సుధీజన కవిరాణ్ణి
రంతరతర దరిద్రత్వసరోజ
సోమాయిత కటాక్ష సురుచిరాపాంగ
సీమాభిరామ లక్ష్మీవిలాసుండు,
భోసలకుల సుధాంభోధి నుప్పొంగఁ
జేసిన చంద్రుఁడై చెలఁగినవాఁడు,
నిరతంబు తుళజావనీపాలునకును
గరమొప్పఁ బౌత్రుఁడై గడఁగినవాఁడు,
మఱియుఁ బ్రతాపసింహక్షితీంద్రునకు
సారిది సుపుత్రుఁడై శోభిల్లువాఁడు,
వ్యక్తమై తగు యమునాంబికాగర్భ
శుక్తి మౌక్తికముగా సొంపొందువాఁడు,
సార్వజ్ఞుఁడౌ తుళజావనీంద్రునకుఁ
గూరిమి యనుజుఁడై కొమరొందువాఁడు,
దాతలకెల్లను దాతతానగుచు
భూతలంబునఁ గీర్తిఁ బొందినవాఁడు,

తఱుచైన కవిబుధతతులకుఁ గల్ప
తరువుచందంబునఁ దనరినవాఁడు
విద్యలలోఁగల వివరంబుదెలిసి
విద్యాధికులఁ బ్రోవ బిరుదందువాఁడు
రహిఁ జంద్రమౌళీశ్వర ప్రసాదంబు
బహుళంబుగాఁ గల్గి భాసిల్లువాఁడు,
రమణకెక్కు ప్రతాపరాముని కృపను
విమల భూమండలం బేలెడువాఁడు,
మఱి మహిషాసురమర్దని నెపుడు
గురుతర భక్తిచేఁ గులదైవముగను
మదిలోన భావించి మంచిపువ్వులను
ముదమొప్పఁ బూజించి ముదమందువాఁడు,
ధర్మమార్గము నీతి దప్పనివాఁడు,
ధర్మస్వరూపుఁడై తనరినవాఁడు,
ఇంచుబోణులకెల్ల నెలమితోఁ దుతను
బంచబాణుని రీతిఁ బరఁగినవాఁడు,
తాలిమిగలవాఁడు దాక్షిణ్యశాలి,
మేలుతెల్సినవాఁడు, మేలైనవాఁడు.
ఇంతటి నెఱదాత యింతటినేత,
ఇంతవదాన్యుండు నింతపుణ్యుండు
నింతటిమాన్యుండు నింతధన్యుండు

నింతటి మహిపాలుఁ డింతసుశీలుఁ
డింతటి యమరసింహేంద్రుఁడౌ నృపతి
చెంత పాయకయుండు శివరాయమంత్రి
ఎటులన్న హరిహరు లేకమౌరీతి
నిట కన్కమున్వన్నె యేకమౌరీతిఁ
గుసుమంబు వాసన గూడినరీతి
నెసఁ జంద్రచంద్రికల్ వెలసినరీతిఁ
బాలు నీరొక్కటై పరఁగినరీతి
మేలియద్దము నీడ మెలఁగినరీతిఁ
దనరు ప్రతాపరుద్రనృపాలుచెంత
నొనర యుగంధరుఁ డొప్పినరీతి
సారంగధరుఁడను జనపతిచెంతఁ
గూరిమిని సుబుద్ధి కొమరొందురీతి
రమణకెక్కిన కృష్ణరాయలచెంత
విమలుఁడై యప్పాజి వెలసినరీతి
మహారాజు కరుణకు మఱి పాత్రుఁడగుచు
విహితధర్మముచేత వెలసి శంభోజి
రాయని తనయుఁడై రాష్ట్రంబునందు
నాయతకీర్తిచే నమరినవాఁడు,
అమరిన సామదానాద్యుపాయముల
క్రమము దెల్సినయట్టి ఘటనాపరుండు,

అల త్రియంబకమంత్రి కనుజుఁడౌ వాఁడు,
కలిత నాగోజి శంకరుల కగ్రజుఁడు
ఎలమిమై నమరసింహేంద్రుని సభను
నలుగురు మెచ్చంగ ననుబిలిపించి
యాచంద్రతారార్క మానట్టుగాను
భూచక్రమెల్లను బొగడి మెచ్చఁగను
నవ్య శృంగారాభినవ రసభావ
భవ్యమై తగు గద్యపద్యాత్మకముగ
నలపారి జాతాపహరణంబు ముద్దు
గులుకు పల్కులచేతఁగొమరుమీఱఁగను
రచియింపు మనుచు నుల్లాసంబుగాను
ముచిర తాంబూల జాంబూనదాంబరము
లమరసింహేంద్రుచే నత్యాదరముగ
నమరఁగ నిప్పింప నతిముదంబునను
గవితా చమత్కార గరిమతోఁ దుతను
వివరింతుఁ దత్కథావృత్తాంతమంత.

సీ॥ ఏనృపాలుని కీర్తి హీరహారతుషార
డిండీరదరముల డింపుపఱచు,
నేరాజు విక్రమంబిల దుర్గ్రహోగ్రహో
దగ్రశాత్రవ రాణ్మహోగ్రమణఁచు

నేవిభు నౌదార్యమిల నిర్జరాగము
నైచికీ మణులను గోఁచఁజేయు
నేఘను సౌందర్యమెలమిఁ గంతుజయంత
నల వసంతాదుల నవ్వుచుండు
నతఁడు శ్రీపార్వతికి సాటియనఁగ వెలయు
చున్న యమునాంబికా గర్భశుక్తిముక్తి
కమనఁ జెలువొందుఁ జక్కనియమరసింహ
రాజచంద్రున కెనయైనరాజుగలఁడె!

శ్లో. మిత్రత్వాత్సతతం సమస్తజగతాం జైవాతృకత్వాదపి
శ్రీరమ్యామరసింహ నామకహరేః సంప్రాప్య నేత్రాకృతిం
సత్పద్మావనతత్పరః కువలయాధారస్స్వయం రాజతే
రాజశ్రీ శివరాయ ధీవరమణిర్విద్యాబ్ధిపారంగతః।

సీ. భానుమండలము స్వర్భానుపీడితమయ్యెఁ
దాంతమైభక్తుల స్వాంతమలికె
ఫలములు లేవాయెఁ దులసీవనంబున
నల విషభవమయ్యె నబ్జవనము
భక్తులపాలయ్యె వైకుంఠనగరంబు
పంకసంకరమయ్యెఁ బాలకడలి
వారిధినిమునింగె ద్వారకాపురంబు
గొల్లలనశమయ్యె గోకులంబు

అనుచు నవి రోసి యమరసింహావనీంద్రు
నగరఁ బ్రత్యక్షమైనిల్చి నటనచేయు
బాలగోపాలమూర్తిపైఁ బారిజాత
హరణ నాటకమొనరింతు నద్భుతముగ.

సీ. శ్రీవెలసినయట్టి దేవకీవరగర్భ
కలశాబ్ధిచంద్రుఁడై చెలఁగువాఁడు
సొబగైన నందయశోదాదులకు నయ
నానందముగ నాటలాడువాఁడు
భవ్యతరాభీర భామినీమణులను
లీలసుఖాబ్ధిఁ దేలించువాఁడు
శ్రీవత్స కౌస్తుభాంచితవత్సభాగుఁడై
నలుభుజంబులచేత మెలఁగువాఁడు

గోపకులఁగూడి క్రేపులు మేపువాఁడు
వేణునాదవిశారదుఁడైనవాఁడు
డంబుమీఱిన పీతాంబరంబువాఁడు
కృష్ణదేవుఁడు మిమ్ము రక్షించుఁగాత!

వ. తదనంతరంబ నాటకసంగ్రహం బెట్టులనిన.

సీ. సమరాశనుఁడు పారిజాతసుమముదెచ్చి
యింపుతోఁ గృష్ణున కిచ్చుటయును
ఆకుసుమంబు శ్రీహరి రుక్మిణికొసంగ
ముదిత వేనలియందుముడుచుటయును

అది సత్యవిని మది నాకులపడి కుంది
తొడిఁబడి కృష్ణుని దూఱుటయును
హరి నారదునిగొని సురతరు దెప్పించి
యొగి సత్యముంగిట నునుచుటయును
ధాత్రినీకథ పారిజాతాపహరణ
మాట గావున నదియెల్ల నాటకముగఁ
బూని రచియించినాఁడను బుధులు తప్పు
లెంచి చూడక నన్ను మన్నించరయ్య.

క. శ్రీవిలసద్భోసలకుల,
పావనమకరందబిరుద, భావజరూపా!
శ్రీవనితాంచితవీక్షణ,
సేవకరిపుభూస, యమరసింహామహీపా!

గీ. అవధరింపుము నీపేర నంకితముగఁ
బారిజాతాపహారణంబు బాగుమీఱ
నాటకముగాను రచియించినాఁడ వేడ్క
నెలమినందునఁ బ్రథమాంక మెట్టెదనిన.

వ. అని యిట్లు సేయందొడంగిన
పారిజాతాపహరణ నాటకారంభ సమయంబున
వినాయకుఁడు వచ్చేమార్గం బెవ్విధాన నంటేను.
2

సీ. పలుమాఱు బుసకొట్టు పాపజందెముతోడ
మొలకనవ్వుల గజముఖముతోడ
ఘనదానజల లసద్గండస్థలముతోడ
గురుతరంబగు నొంటికొమ్ముతోడ
వన్నెమీఱినయట్టి వక్రతుండముతోడ
గొప్పయౌ బ్రహ్మాండ కుక్షితోడ
పాశాంకుశములచేఁ బరఁగు చేతులతోడ
శ్రీకరంబగు చేటచెవులతోడ

ముంజిమొలనూలిగంటల మ్రోఁతతోడ
దాసులనుబ్రోచు పాదపద్మములతోడ
మూషికారూఢుఁడగుచును ముదముతోడ
వచ్చె గణపతి తన భక్తవరులఁబ్రోవ!

దII శంకరాభరణముII ఆదిII

గణపతివచ్చెను జూడరె కనుగొని వరములు వేడరె
ఫణియజ్ఞోపవీతము మెఱయఁగఁ బాశాంకుశములు
కరములఁ బూనుక IIగII
మోదకహస్తముతోడను ముంజిమొలనూలితోడను
మాదిరిలేని చంద్రఖండము మస్తకమునఁ దళతళ
యని మెఱయఁగ IIగII

జంటిపంటి నెఱదంట ఒనరఁగ దానముకొంట
దంటతనంబునఁ గొలిచినవారికిఁ దాఁ బ్రత్యక్షం
బౌనంట ॥గ॥
త్రిశిరగిరినిలయుని తనయుఁడు దేవతా సార్వభౌముండు
అపమానంబగు మూషికవాహనారూఢుండై వేడుక
మీఱఁగ ॥గ॥

వ. ఇట్లువచ్చిన గణపతిని స్తోత్రింబుచేసేమార్గం బెట్టిధాన
నం కేఁ.

శ్లో॥ మధుకరవృతగండం మత్తమాతంగతుండం
జఠరనిబిడకాండం సాధుసంత్రాణశౌండం
పరిధృతశశిఖండం పాపవిచ్ఛేదచండం
పదనతసురకాండం భావయే వక్రతుండం॥

వ. మఱియు నెటువలెను.

చ॥ కరిముఖమున్ జతుర్భుజత గండమదంబును నేకదంతమున్
మురువగు వక్రతుండమును మోదకహస్తము మందహాస
మున్
చిరుమొల నూలిగంటలు విచిత్రపు రత్నవిభూషణంబులున్
శిరమునఁ జంద్రరేఖగల సిద్ధివినాయక! నీకు మ్రొక్కెదన్॥

వ. ఇట్లు వినాయకుఁడువచ్చినతదనంతరంబ కటికమువాఁడు
వచ్చేమార్గం బెట్టిధానవం కేను.

క. వింతలగు మాటలాడుచు
నెంతే నవ్వించుకొనుచు నెకసక్కెమునన్
గంతులు వైచుచుఁ గటికం
బంతట హరి సభకువచ్చె నతిముదమొదవన్

మంగళకైశిక॥ చాపు॥

అల్లదె వచ్చెను కటికము – అల్లదె
కొల్లకొల్లలుగ వింతమాటలాడుకొంట
మేలంట వాదంట దుముకుకొంట ॥అల్ల॥

పట్టెనామముఁబెట్టి పండ్లు వెళ్లఁబెట్టి
పట్టుదుప్పటిగట్టి శాకుపట్టి
దిట్టముగా వెండికట్టిన బెత్తపుకట్టె చేతఁబట్టి
కడు వేడుకతోను ॥అల్ల॥
మిడిగుడ్లతో కోరమీసము లిట్టట్టె
వడి వేయుచును బరాబరి సేయుచు
ఎడవిడక పరాకు హెచ్చరికయనుచు
విడెము చొల్లుగార వికవికనవ్వుచు ॥అల్ల॥
త్రిశిర గిరీశ్వరుని చెలియైన గోపాల
దేవుని గుణములు వర్ణింపుచు
అసమానమైన శ్రీకృష్ణదేవుని సభ
సందడు మెచ్చఁగఁ జిందులు ద్రొక్కుచు ॥అల్ల॥

వ. ఇట్లు కటికము వాఁడు వచ్చిన తదనంతరంబ దాష్టికం పంతులు వచ్చెడిమార్గం బెవ్విధాననం టే.

క. దుష్టాధికారధుర్యుఁడు
భ్రష్టాకారుండు సభికులను నవ్వించే
చేష్టలు గల్గినజాణఁడు
దాష్టికపండితుఁడు వచ్చెఁ దద్దయు వేడ్కన్.

వ. తదనంతరంబ పార్వతీపరమేశ్వరులు వచ్చేమార్గం బెటు వలెను.

క. నగజాసమేతుఁడగుచును
నగచాపుఁడు వృషభ వాహనం బెక్కఁగ ప
న్నగరాజ హారములు మి
న్నగ నురమున మెఱయవచ్చె నతిముద మొదవన్.॥

౩౹కల్యాణి॥ చాపు॥

పార్వతీపరమేశ్వరులు వచ్చిరి - పరమహర్షమునను
ఉర్విని అఖిలాండకోటిబ్రహ్మాండముల - కుత్పత్తిస్థితి
లయకారకులైనట్టి ॥పా॥
నీలధవళవర్ణములతో చంద్రికవంటి - నిండు మంద
హాసములతో
ఫాలమునను మృగనాభితిప్రుండ్రములు - పలుమాఱు
మెఱయఁగ నందివాహనమెక్కి ॥పా॥.

కీరకురంగహస్తములతో వేద-సారములైన రూపము
లతోఁ దన

రారు కనక సర్పకుండలములసియాడ-రత్నరుద్రాక్ష
హారము లురమునఁ గదల ||పా||

నవ్యాబ్జావతంసములతోఁగరు-ణారసాంచిత కటాక్షము
లతో|

దివ్యపీతాంబర గజచర్మములుపూని-దేదీప్యమానహా
త్రిశిరగిరిని వెలయు ||పా||

వ. ఇట్లువచ్చిన పార్వతీ పరమేశ్వరులను దేవతాస్త్రీలుఁ
స్తోత్రంబు చేసిరఁట యెటువలెను.

వృషభారూఢసాంబ - వేదాంతవేద్య సాంబ
చంద్రశేఖర సాంబ - శంభో శంకర సాంబ
నాగభూషణ సాంబ - నగచాపధర సాంబ
అంతకాంతక సాంబ - అమితపరాక్రమ సాంబ
త్రిశిర గిరీశ సాంబ - దేవాదిదేవ సాంబ||

వ. అని మఱియు నేమనుచున్నారు.

పంతువరాళి|| చాపు||

దక్షహరణదక్ష ! రక్షమాం - శంకరా ||దక్ష||
యక్షరాజపక్ష ! సర్వ - లక్షణాంచి తోక్షవాహా -

మోక్షకరకటాక్ష ! సురా - ధ్యక్ష ! దీనరక్షణా ॥ద॥
సంగరహిత! మంగళప్రదా ! మత్తమా - తంగ దనుజ
భంగ! భూరథ !

తుంగ - సర్వ - మంగళాంత - రంగ ధృతకు - రంగ
పురవి - భంగ మోహ,నాంగ దయా - పాంగనరభు-
జంగభూష ॥ద॥

కంజలోచ నాంజనేయ - (...) వినతపాద
కంజ, మానిపుంజగేయ ।
కంజవైరి - కంజసఖ ధ - నంజయాక్ష - మంజుతరప।
తంజలిముఖ - రంజనేంద్ర - కుంజరా ర్తిభంజనా॥దక్ష॥

పూతనా ద్యరాతి సాయకా - త్రిశిరగిరి, ని
కేతనభవ! భూతనాయకా !
శీతలనవ - నీతహృద - జ్ఞాతభక్త - జాతవిబుధ-
గీతజగ - త్రాత మాతృ - భూత భర్గ ॥దక్ష॥

వ. ఇట్లు దేవతాస్త్రీలు స్తుతిచేసిన తదనంతరంబ పార్వతీ పరమేశ్వరులు పరస్పర వచనములాడిరంట యెటులనెను.

పరుజు ॥ఆది॥

ఏలనను విడనాడేవే - ఓపార్వతి
ఆలాటివాడఁ గానే ॥
నామీఁద తప్పులెంచకె ఓపార్వతి
నన్ను నిరాకరించకె॥

పరిశుద్ధుఁడని తెలియవే - ఓపార్వతి
సరసకు చేరరావె॥

పరిశుద్ధతలు తెలిసెరా - మునిసతులఁ
బట్టి నప్పుడె యీశ్వరా॥

దయవాఁడ నేనుగాదా - ఓపార్వతి,
అయిన నాతోనె వాదా॥

చాలు నీదయ తెలిసెరా - సృష్టిస్థితి
సంహార కర్తైనప్పుడే॥

శ్రీమంతుఁడని తెలియవే - ఓపార్వతి
చిత్తమున దయనిల్పవే।

శ్రీమంతుఁడని తెలిసెరా - భిక్షాటనము
చేసినప్పుడె యీశ్వరా॥

సొగసుకాఁడని తెలియవే - ఓపార్వతి,
చొక్కించి యేలుకోవే।

సొగసుకాఁడని తెలిసెరా - పెనుబాముల,
సొమ్ములుగఁ బూనినపుడె॥

గుణవంతుఁడని తెలియవే - ఓపార్వతి
కోపము సేయనేల ।

నీదుగుణములు తెలిసెరా - త్రిశిరగిరీశ,
నిర్గుణుఁడై నప్పుడె॥

వ. ఇట్లు పార్వతీ పరమేశ్వరులు పరస్పరవచనంబులాడిన తదనంతరంబ భోజకన్యక వచ్చెడి మార్గం బెవ్విధానసంటే.

క. అల భోజకన్యకామణి
తిలకము మెఱయంగఁ గృష్ణదేవుని సభకుఁ ।
గిలకల మంచముతోడను
చెలువలరఁగ వచ్చె నతి విచిత్రముమీఱన్ ॥

సౌరాష్ట్ర॥ చాపు॥
భోజకన్యక వచ్చెను, బొందుగఁ గృష్ణునిసభకు ।
ఈజగతిఁ ద్రిశిరగిరీశ్వరుమాయ, లేమనవచ్చు ॥భో॥
బంగారు మయమైన, పట్టెమంచముమీఁదను ।
అంగనామణి పవ్వళించి, శృంగారముమీఱఁగాను ॥భో॥
తళుకైన నెమ్మోమునఁ, దిలకము ముద్దుగార ।
అలరు బంగరు సలాక, వలెను మెఱయుచును ॥భో॥
గుత్తంపు రైకలోపలి, గుబ్బచన్నులు మెఱయ ।
ముత్తెపు ముంగర కదల, ముద్దులొలుకు పలుకు
లతో ॥భో॥

వ. ఇట్లు వచ్చిన భోజకన్యకను మాధవి, నీ వెవ్వరని యడుగఁగా భోజకన్యక యేమనుచున్నది.

ద్వి. వినుమాధవీ, నాదువృత్తాంతమంత
అనువుగాఁ దెలిపెద నదియెట్టులనిన
లలిఁగంచుకోటయు రాగికోటయును
లలితమై తగినట్టి రాతికోటయును
వెలయు నిత్తడికోట వెండికోటయును
ఎలమి బంగరుకోట యినుపకోటయును
గలయుజ్జయిని మహాకాళేశ్వరమున
నలువొందు పుటభేదనంబును నేలు
భోజుఁడు మాతండ్రి భువనంబులోన
రాజాధిరాజుల రాజనవెలయు;
నాతల్లియైన మానవతీలలామ
ఆతరిఁ దపముసేయంగ నీశ్వరుఁడు
ప్రత్యక్షమైనిల్చి ఫలమొక్కటీయ
నత్యంత ముదమున నదిభుజియించి
గర్భంబుధరియించి గలిగిన తనకు
దుర్భరంబైనట్టి దౌహృదంబమున
నేడు మేడలుగట్టి యిలనందుఁబసిడి
తోడ రత్నంబులతోఁ జేసినట్టి
మంచాన నన్నుంచ మణిశతురాజా
పంచినన్ దెమ్మనఁ బంతంబులాడి
మంచంబుతో నన్ను మణికన్నగాఁడు

వంచనగావించి వసుధకుఁదెచ్చె
ఏమిసేయుదునింక! నెవ్వరుదిక్కు!
ఈమహావ్యసనంబు నెవరుదీరుతురు!
గిరులార! తరులార! ఖేచరులార!
నరులార! నాపీట ననుజేర్పరయ్య!

వ.. అని మఱియు నేమనుచున్నది

ముఖారి॥

దాదినమ్మా దాదినమ్మా దాదినేచిన్న దాననమ్మా।
మా దేవుఁడౌ త్రిశిరగిరీశు, మాయ లేమని తెలుపుదు
నమ్మా ॥దా॥
నాతండ్రిభోజరాజు నా పేరులీలావతి।
నాతల్లి మానవతి-నామగఁడు మోహనాంగుఁడు॥
కంచుకోట యినపకోట-కల్లుకోటయిత్తడికోట।
మంచి వెండి పసిఁడికోట-మూనైనరాగికోట॥
ఏడుకోటలనడుమ-నేడుమేడలు గట్టించి
వేడుకైన మంచమున-వెలయఁగా నన్నుంచియుండ॥
పగరాజు ననుదెమ్మని-పంపించఁగాఁబంతమాడి।
మగువలార, కన్నగాఁడు-మంచముతోఁ దెచ్చెనమ్మ
ఏమిసేతు! నెవరుదిక్కు-ఎవ్వరితో నేఁదెలుపుదు ॥దాది॥

వ॥ అనిమఱియు నేమనుచున్నది॥

ఘంట॥

అక్కట నేనేమిసేతు_అరిమెలపెరిమెల పెరిగి
యిక్కడగండ్ల కిమ్మాయెగా హాదైవమా
రాజశాజై వెలసిన - భోజరాజు కూఁతురనై
ఈజాలి కిమ్మాయెఁగా ॥హా।
ధాతవ్రాసినయట్టి - వ్రాతకుఁ దప్పరాదు
ఈతటి నేనేమి సేతునే ॥హా॥
మాయదారి కన్నగాఁడు - మంచముతోఁ దెచ్చి నన్ను
ఈ యడవి పాలుచేసెఁగా ॥హా॥
నాసొగసు నావ్రాయము - నాగుణము నారూపు పని
హా సాస్పద మాయెనుగా ॥హా॥
పాపజాతి దైవమా, నా - పట్ల నీకుదయ లేక
యీపాపము కట్టుకొంటివా ॥హా॥
పగరాజు మాటవిని - పాపిష్ఠి కన్నగాఁడు
అగచాట్ల కిమ్ముచేసెఁగా ॥హా॥
పిన్ననాఁడొక రాకొమరునకు - పెండ్లిచేసి యిచ్చి యుంటే
నిన్నిపాట్ల కిమ్ముగాదుగా ॥హా॥
ఈయెడ శ్రీత్రిశిరగి - రీశ్వరాజ్ఞ కేమందు నా
ప్రాయము నన్నింతచేసెఁగా ॥హా॥

వ. అని యిట్లుతనలోఁ దా నెత చెంది కర్ణకరునిజూచి భోజ కన్యక యేమనుచున్నది.

ద్వి. ఓకర్ణకారుఁడ, ఓయన్న, వినర
యేకపూ కంబాన నేడు మేడలను
మంచి చప్పరకోళ్ల మంచాన నన్ను
నుంచియుండఁగ నీవుపొంచటు వచ్చి
పగరాజు మాటలే పాటించియెంచి
తెగువతో నన్నిట్లుఁ దే నాయమఁటర !
ఆ పగరాజిచ్చు నంత కిమ్మడిగ
నేపుమీఱ ధనంబు నేనొసఁగెదను
నను నీవు మన్నించి నాతండ్రివద్ద
ననుజేర్చి మిగుల నున్నతకీర్తి గనుమి!

వ. అని యిట్లు కర్ణకమునిఁజూచి భోజకన్యక పరితాపముఁ జెంది పలుకుచున్న యవసరంబున.

సీ. రాజరాజగు నొక రాజకుమారుండు
ఆవనంబున వేఁటలాడియాడి
చతురంగ బలముల సారెకుఁ గూడుక
యట నొక్కకొలని చెంగటికిఁజేర
నాసమయంబున నబలయార్తరవంబు
వినివచ్చి భోజకన్యనుచుఁ దెలిసి
కర్ణకరునిబట్టి కడువేగబంధించి
భోజకన్యను దెచ్చి భోజరాజు

కిచ్చినంతనె యాతఁడు మెచ్చి తనకు
నిచ్చినంతనె పెండ్లాడి యింతిఁగూడి
యున్న తానందవారిధి నోలలాడి
సుఖముగానుండె వైభవస్ఫురణతోడ

వ. ఇట్లు భోజకన్యక వచ్చిన తదనంతరంబ గొల్లభామవచ్చె
నాట యెటువలెను।

క. అల్లదిగో భామాపతి
గొల్లతవేషంబు దాల్చుకొని ద్వారకకున్
చల్లో చల్లోయనుచును
చల్లమ్ముచువచ్చె గోపసతుతాననఁగన్।

మోహన ॥చా॥

గొల్లభామవచ్చెను వేడుకమీర ॥గొల్ల॥
గొల్లభామవచ్చె గులుకునడలతోను–అల్ల త్రిశిరగిరి
హారుసఖుఁ బొగడుచు॥ ॥గొల్ల॥
మొలకనవ్వుమోము ముద్దుగారఁగాను–అలికమునఁ
దిలకమణియమరఁగాను।
జిలుగుచీరలోన జిగిమీరు తొడలకాంతి–వెలికిఁబర్వ
మంచికులుకు గుబ్బలు మెరయు ॥గొల్ల॥
చల్లోయమ్మచల్ల।

వ. ఇట్లువచ్చిన గొల్లభామనుజూచి మాధవినీ వెవ్వరనియడుగఁగా గొల్లభామ యేమనుచున్నది.

ద్వి. మోమునఁ జిరునవ్వు మొలకలెత్తంగ
గోమైన చక్కని కొప్పుసియాడ
పంజులకమ్మలు బాగుమీఱంగ
ముంజేతి కంకణమ్ములు ఘల్లుమనఁగ
తిరుమణి తిరుచూర్ణదీప్తులు నెలుఁగఁ
బొలుపైన పాపటబొట్టుసియాడ
బిగువైన చనుకట్టు పిక్కటిలంగ
అగణితంబైన యొడ్యాణంబు మెఱయఁ
బలుగజ్జెలందెలు పాదసరమ్ము
లలరుచుఁ బదముల నతిశయిల్లంగ
చల్లచల్లోయని చల్లమ్ముకొనుచు
గొల్లభామిని వచ్చెఁ గోలాహలముగ
చల్లో॥ అయితే ఏకుండతోఁదెచ్చినావనఁగా

క. చెలువగు బంగరుకలశము
సలలితముగఁబూని చల్లచల్లోయనుచున్
తొలకరి మెఱుపుతెఱంగున
వెలువడె నలగొల్లభామ వెలఁదులుపొగడన్॥

వ. అయితే తెరకీవలరావమ్మా పాలోయమ్మ

పాలోకొానరమ్మ చెలులార। ఆవు

పాలోకొానరమ్మ బాగుమీఱఁగాను-బాళిగఁగన్నట్టి

పసిబిడ్డలకు మీరు ॥పాలో॥

పెరుగో కొానరమ్మ చెలులార।

పెరుగు కొానరమ్మ పేర్మితోడ నరిమి

పెరిమగఁ గన్నట్టి బిడ్డలకును మీరు ॥పెరు॥

వెన్నో కొానరమ్మ చెలులార।

వెన్నో కొానరమ్మ వేడుకమీఱఁగ -

మన్నుగ నవరత్నములు దెచ్చి వెలఁబెట్టి ॥వెన్నో॥

చల్లో కొానరమ్మ సఖులార।

చల్లో కొానరమ్మ అల్లత్రిశిరగిరి -

వల్లభుని కర్పితమై వఱలుచున్నయట్టి ॥చల్లో॥

వ. అయితే రాగులకు జొన్నలకు నీచల్లపోసేవా అనఁగా గొల్లత యేమనుచున్నది.

ఆణిముత్యముల కడ్డెడుచల్ల - మాణిక్యములకు మానెడు చల్ల

ముకవా వజ్రములకు ముంతెడుచల్ల - దొరయుపచ్చలకు తూమెడుచల్ల

పొలుపౌ పగడములకు పుడిసెఁడుచల్ల - తులలేని వై
డూర్యములకు దోసెఁడు చల్ల
సారగోమేధికములకుచారెఁడ్డుచల్ల - మేనత్రిశిరగిరిశ్వ
రుఁడు మెచ్చినచల్ల ॥చల్లో॥
ఇట్లే ఏ యే దేశములలో చల్లమ్మినావనఁగా

ద్వి. మాళవ నేపాళ మగధకళింగ
గౌళ పాంచాల బంగాళకాశ్మీర
కరహాట వరహాట కర్ణాట లాట
కురు శక బాహ్లీక కోసలచోళ
ఘోటక మత్స్యాంగ కురుకురు సౌవీర
భోట కేరళ వంగ ముఖ్య దేశముల
చల్లమ్ముచును నేను సంచరింపుదును
ఎల్ల వృత్తాంతంబు లే నెఱుఁగుదును

వ. అయితే నీపే రేమందురనఁగా

గీ. మహిని నాదుపేరు మఱినీకుఁ దెలిపెద
వినుము వేడ్క మీఱ వివరముగను
రహిని బుట్టినింట రంగనాయకి యండ్రు
అత్తయింట మోహనాంగి యండ్రు

వ. అయితే నీకులవృత్తాంతమేమి? అని యడుగఁగా
3

ద్వి. మా కుల వృత్తాంత మంతయు నీకు
నేకతంబున నే నెఱిఁగింతు వినుము
గొల్లకులంబులు కూర్మిఁ బంచెరింను
చెల్లుగా నీతోన చెప్పెదనిపుడు
పూడిగొల్లలు మంచి ముదితగొల్లలును
వేడుకైతగు పెసపీటి గొల్లలును
ముదమొప్పఁగాఁ బలుముష్టి గొల్లలును
నదుకుసేయని పాకనాటిగొల్లలును
కరిణిగొల్లలు హెచ్చు గంప గొల్లలును
నెఱి నల్లగొల్లలు నేతిగొల్లలును
ఏకారిగొల్లలు నెఱ్ఱగొల్లలును
సాకారులైన సజ్జనపు గొల్లలును
పని రెండుజాతులై పరఁగునందులను
ఎనలేనివారము ఎఱ్ఱగొల్లలము
ముదమొప్ప ముక్కర మొదలైనసొమ్ము
లదనమా మాజాతి నది యుంచదగదు.

వ. అయితే గొల్లారిపాపా ముక్కర మొదలైన సొమ్ములెవరో సంగిరనఁగా చెప్పెదను వినఁగదోయి బాపనయ్యా — నాచల్లకు మెచ్చి యిచ్చిరి.

ఉ. ముక్కర శుక్రుఁడిచ్చె నయ మొప్పఁగఁ గమ్మలు సూర్యుఁడిచ్చె పెం
పెక్కిన తారహారములు పేర్మిని జందురుడిచ్చె నింద్రుఁడున్
ఎక్కువయైనకంకణములిచ్చెను పాపటబొట్టుశంభుఁడున్
చక్కని సూర్యచంద్రులను శారదయిచ్చెను నాదు చల్లకున్

వ. ఆ వృత్తాంతం బట్లుండనిమ్ము, ఎట్టివారలమైన నీకుల మెక్కువేమి.

ద్వి. వామాక్షి, రేపల్లెవాడలో మేము
తామరతంపరై తనరియుండుదుము
మాకులంబునను శ్రీ మధుసూదనుండు
శ్రీకృష్ణుఁడై పుట్టి చెన్నొందెఁ గనుక
పరమేశ్వరుఁడు గొల్ల, పరమేష్ఠి గొల్ల
సొరిద ధర్మజుఁడు సర్వజ్ఞుఁడును గొల్ల
అలచంద్రుఁడు గొల్ల, యర్కుండు గొల్ల
అలరు భౌముండగ్ని యముఁడును గొల్ల
వర నైఋతియు గొల్ల, వరుణుఁడు గొల్ల
తిరమొప్పఁగా వాయుదేవుఁడు గొల్ల
ఘనుఁడు గుబేరుఁడు గొల్ల, బుధుఁడును గొల్ల

ఆ రాహు కేతువు లాదిగా గొల్ల
లిందుఁడు గొల్ల, ఫణీంద్రుండు గొల్ల,
సాంద్రమైతగు ప్రపంచంబెల్ల గొల్ల
కిన్నర గంధర్వ గీర్వాణ యక్ష
పన్నగ ముఖ్యులు పలుగొల్లవారు.

వ. అయితే పరమేశ్వర బ్రహ్మ సూర్యార్జునులు గొల్లలైన కారణమేమనఁగా.

గీ. పరఁగు హరియైన కృష్ణుని బావగనుక
పతని నాభిని నుదయించు సుతుఁడు గనుక
సందియుండలి విష్ణుత్వ మొందెఁ గనుక
మఱియుఁ గృష్ణుని చెల్లెలి మగఁడు గనుక.

వ. అని మఱియు నేమనుచున్నది.

బ్రహ్మదేవుఁడు గొల్లోయమ్మ - ఓయమ్మలార
చంద్రదేవుఁడు గొల్లోయమ్మ - ఓయమ్మలార
ఇంద్రదేవుఁడు గొల్లోయమ్మ - ఓయమ్మలార
త్రిశిర గిరి నిలయుఁడు గొల్లోయమ్మ - ఓయమ్మలార.

వ. అయితే గొల్లవారి పాపా యింద్రచంద్రులు మొదలైన ప్రపంచంబెల్ల గొల్లలైన కారణంబేమి.

మధ్య॥ చాపు॥

జగమెల్ల గొల్లాయెనే యీమాటుమ-జ్జగమెల్ల
గొల్లాయెనే

జగమెల్ల త్రిశిరగిరీశ్వరు చెలికాండ్రై తగినట్టి

కృష్ణస్వరూపము గనుక ॥జగ॥

స్థలములు వనములు సకలగిరులునదులు- జలధులంత
రిక్షస్వర్గములు

నలుదిక్కులును నా, నాజీవరాసులు

అలదేవతలు మును, లతినిరూపముగనుక ॥జగ॥

వ. అనిన గొల్లభామను జూచి మాధవి అయితే నీ చల్ల
మహిమ వినిపింపుమనఁగా గొల్లత యేమనుచున్నది.

నాదరా॥ శ్రీరమ్యమైనట్టి చిక్కని చల్ల

స్వారస్యమైనట్టి చక్కని చల్ల

కుమారిమిఁ గొనరమ్మ కొమ్మరైన చల్ల

భారతి గొన్నట్టి బాగైన చల్ల

శ్రీరమణి గొన్నట్టి చెలువైన చల్ల

పార్వతి గొన్నట్టి బాగైన చల్ల

నవ్వుచుఁ గొనరమ్మ నాచేతి చల్ల

ఇంద్రాణి గొన్నట్టి హెచ్చైన చల్ల

సల్లావు పితికిన నయమైన చల్ల
తెల్లావు పితికిన తేటైన చల్ల
ఎఱ్ఱావు పితికిన హెచ్చైన చల్ల
త్రిశిరగిరీశు కర్పితమైన చల్ల॥

వ. చల్లో గొనరమ్మ సఖులార।
చల్లచల్లో గొనరమ్మ సఖులార॥
చిలుకలవలెఁ గల కలమని పలుకుచు ॥చల్లో॥
అబ్బురపుటుబ్బు గబ్బిసిబ్బెంపు గుబ్బలు గదల ॥చల్లో॥
అల్లిబిల్లిగాను మెల్ల మెల్ల యుల్లమలరంగ ॥చల్లో॥
ఎలమి త్రిశిరగిరి నిలయుని కర్పితహా ॥చల్లో॥

వ. గొల్లారి పాపా నీ చల్లమహిమ యేమి.

సీ. ఈచల్ల త్రాగిన నిలశశిప్రభగల్గు
నీచల్ల త్రాగిన హెచ్చుబుద్ధి
ఈచల్ల తాగిన నినుని తేజము కల్గు
నీచల్ల తాగిన నెనయు విద్య
ఈచల్ల తాగిన నింద్రభోగముగల్గు
ఈచల్లచే వ్యాధు లెడలుచుండు
ఈచల్ల తాగిన హెచ్చును బలవృద్ధి
ఈచల్ల తాగిన నిముడు సుఖము

వసుధ వృద్ధులకైనను వయసునచ్చు
నాయురారోగ్యసంపద లధికమౌను
పుత్రపౌత్రాభివృద్ధినిఁ బొందఁజేయు
దీని మహిమంబు లిట్లని తెలిసికొమ్మి.

వ. అయితే ఈచల్ల యెవరెవరుకొని యేమిఫలము పొంది నారే గొల్లారి పాపా.

ద్వి. అల్ల యిందుడుడు కొని యతిభోగి యయ్యె
చల్ల చంద్రుఁడు కొని చల్లనై పరఁగె
భారతి కొని బ్రహ్మవాక్కున వెలసె
ఆ రతి గొని మగనటు బ్రదికించె
పార్వతి గొని తనపతిమేన వెలసె
ఉర్వి శ్రీ గొని హరియురమున వెలసె
కమలజుఁడు గొని సృష్టికర్తయై పరఁగె
రమణ శ్రీ హరి గొని రక్షకుండయ్యె.

వ. ఆ గొల్లారి పాపా యింత మహిమ గలదా నీ చల్ల! ఇంకా యెలాగుననే చల్లమహిమ చెప్పుమా.

శ్లో. ఏలా నాగర సంయుక్తం
కించి ల్లవణ మిశ్రితం।
జంబీర రస సంయుక్తం
తక్రం శక్రస్య దుర్లభం॥

వ. ఇంకా చెప్పేను వినగదో బాపనయ్యా.

శ్లో. హిమ కుంద శశిప్రభ శంఖ నిభం
పరిపక్వ కపిత్థ సుగంధయుతం ।
యువతీకర నిర్మథితం మథితం
పిబ హే సర్వారుచి తాప హరం॥

వ. ఇంకా చెప్పేను వినగదో బాపనయ్యా.

క. తెల్లనయై పుల్లనయై
చల్లనయై సకలతాప శమమై సమమై ।
పెల్లుగ మధురం బౌ నా
చల్లకు ముల్లోకములను సాటిం గలదే॥

వ. అయితే ఇంతరుచికరమైన నీచల్లపుడిసెడు పోసేవా అనగా చిలికి పోసేనోయీా ! బాపనయ్యా.

దధిమధన మధుసూదన । కేశవ నారాయణ ।
కృష్ణ దామోదర ।
వాసుదేవాచ్యుత వామన ప్రద్యుమ్న ।
త్రిశిర గిరీశ్వర మిత్ర దివ్యమోహనగాత్ర ॥

వ. మరి స్నేటువలెను,

సురటి॥ పెరుగు చిలికెను జూడరె గొల్లభామామణి పెరుగు
కరమరుదుగ బంగరు గిన్నెలతో
సరి పెనఁగెడు కుచగిరులును కదలఁగ ॥పెరు॥
పంకజముఖి పాటలు పాడుచుఁ గర
కంకణములు ఘలు ఘల్లని మ్రోయఁగ ॥పెరు॥
కమ్మని వాసన ఘుమ్మని దిక్కులఁ
గ్రమ్మఁగఁ దాటం కమ్ములు కదలఁగ ॥పెరు॥
కులికి త్రిశిరగిరి నిలయుని సఖుఁడగు
గోపాలున కర్పితమై చెలఁగిన ॥పెరు॥

వ. ఇట్లు పెరుగు చిలికిన తదనంతరంబ గొల్లభామామణి చల్లమ్మెనఁట యెటువలెను.

కల్యాణి॥ ఆది॥
చల్ల గొనరె మీరు చల్ల గొనరె। రే
పల్లెలో నుండి తెచ్చితి భామలార యీచిక్కని ॥చ॥
తఱచుగా రుచియైనచల్ల తాపము లెడలించుచల్ల
మెఱయ గోపాలుఁడు తాగి మిగిలినచల్ల
హరిహర బ్రహ్మాదుల కర్పితమ్మైనట్టిచల్ల
పెరుగువలె నుండేచల్ల పేరైనగోవులచల్ల ॥చ॥
భారతి పార్వతి లక్ష్మి బాళిమీఱఁ గొన్నచల్ల
కోరి నవరత్నములిచ్చి కొనఁదగినచల్ల

చారెఁడు గోరిలిన సకల శ్రమములు తొలఁగించుచల్ల
కూరిమి గొల్లవనితలు కూడిచిలికి నట్టిచల్ల ॥చ॥
రోగము లెడలించుచల్ల లోకప్రసిద్ధమైనచల్ల
మీగడ వాసనచేత మించినచల్ల
ఆగి యత్తమామలు నన్నమ్మిక రమ్మన్నచల్ల
బాగైన శ్రీ త్రిశిర గిరీశ్వరుఁడు మెచ్చఁదగినచల్ల ॥చ॥

వ. ఇట్లు చల్లమ్ముచు వచ్చిన గొల్లతను జూచి సుంకరి యేమనుచున్నాఁడు:

సుంక మియ్యకనె యుంటే పొంకమైన నీగుబ్బలు
ఇంకఁ బట్టక నే విడుతునా—ఓగొల్లదానా!
పంకజాక్షి నీకు జడుతునా॥

గొల్లత వాక్యము :

గొల్లభామ యని లేక—గుబ్బలు పట్టేమనేవు
చెల్లబో నీకుమర్యాదా। ఓసుంకరీడ।
అల్ల పనికి సమయము లేదా॥
ముద్దుపెట్టేనంటె నీవు—దుద్దుబెట్టి జరిగేవేమి
సద్దుచేయక యుందురా వె। ఓగొల్లదానా।
పొద్దు పోయె మాటలాడవే॥
కిన్నర మీటుకొంటును—కేరిముద్దుబెట్టెనంటే
సన్నలు సైగలు సేతురా। ఓసుంకరీడ।
నన్ను చెనక కొట్టు వేతురా॥

కాసు నిచ్చేటందు కన-కాశము లేకయు నుంటే
ఆసదీర కౌగిలింతునే। ఓగొల్లదానా।
నే సరసములు గావింతునే॥

మిట్టబావి గట్టుకింద-పొట్ల పందిళ్ల నడుమ
ఇట్లు కౌగిలించమందురా। ఓసుంకరీడ।
చుట్లవారు చూడకుందురా॥

చెలువైన శ్రీ త్రిశిరగిరి-నిలయుని కర్పితముగ
కలిసి మెలసి కూడి యుందామె। ఓగొల్ల దానా।
అలరతి సౌఖ్యము కందామె॥

చెలువైన శ్రీ త్రిశిరగిరి । నిలయుని కర్పితముగ
కలసియుందామని పలికేవు । ఓసుంకరీడ।
తెలిసె తెలిసె ఏల కులికేవు॥

వ. అంత సుంకరి సమీపమునకురాఁగా గొల్లత యేమను-చున్నది.

నాట॥ చాపు॥

సుంకరి వచ్చెగదే-అమ్మలార ॥సుంక॥
సుంకరి వచ్చె నేవంక పోయినగాని
కొంకు కొసరులేక బింకముతో పెద్ద ॥సుంక॥

కోపముతో వెఱ్ఱిచూపులు చూచుచు
నేఁపరాలు పెట్టె నాపైని దాడిగ ||సుంక||
అల్ల త్రిశిరగిరి-వల్లభుని కర్పితమౌ
చల్లమ్మవచ్చిన సమయము చూచుక ||సుంక||

వ. ఇట్లు సుంకరివచ్చి గొల్లభామను కొంగుపట్టి యీడ్వఁ-గా గొల్లత యేమనుచున్నది.

సీ. పలుమారు నాకొంగు పట్టేవదేమిరా
మాయత్త వింటేను మాటవచ్చు
బటువు గుబ్బలు పట్ట వచ్చేవదేమిరా
మా మామ వింటేను మాటవచ్చు
నును చెక్కులను గోట నొక్కేవదేమిరా
మావారు వింటేను మాటవచ్చు
బలవంతముగ నన్ను గలసేవదేమిరా
మగఁడు వింటే నింక మాటవచ్చు

మట్టు మరియాదతో నుండు ముట్టవలదు
అడ్డగించకు నీకు నాయాన వినుము
ఓరి సుంకరివాఁడ, నీ గారడములు
చాలు చాలును నావద్ద సాగవిపుడు.

వ. అని మఱియు నేమనుచున్నది.

సీ. కొసరి సుంకము తీసికొనవలెనే గాని
కొంగుఁ బట్టీడ్తురా కొంచెకాఁడ !
తప్పుమాటలచేతఁ దాఱుమాఱుగ నీవు
కూసేవదేమిరా కొంచెకాఁడ !
ఈసుద్ది నామగఁ డిపుడు వింటే నిన్ను
కొంచానఁ బోనీఁడు కొంచెకాఁడ!
సుంకరివైతేని టంకంబు తీసుకో
కూఁతలు పెట్టకు కొంచెకాఁడ!

నీదు బెదరింపులకు నెల్ల నేనువెఱవ
దగ్గఱికి వచ్చియిటుసేయఁ దగదు నీకు
ఏల త్రుళ్ళేవు నీమదంబిపుడడంతు
చాలు నీజాణతనమెల్ల సాగదిచట.

వ. అంతట అత్తవచ్చుట.

వ. ఇట్లు గొల్లభామ వచ్చిన తదనంతరంబ ద్వారకాపుర వర్ణనం బెటువలెను.

ద్వి. పొలుపైన ద్వారకా పురభేదనంబు
అలకాపురంబన నతిశయిల్లుచును
కోటలు కొమ్మలు కొత్తళంబులును
చేటి యగడ్తలు మేలుమాళిగలు

ఉప్పరంబునకన్న నున్నతంబైన
గొప్ప యుప్పరిగలు గోపురంబులును
రాజసౌధంబులు, రాజవీధులును
భోజనశాలలు భువనేశ్వరములు
రథ గజ తురగముల్, రమణీయములగు
పృథులపతాకలు, పెంపొందినట్టి
పానీయశాలలు ఘాటకశాల
లూని యున్నతములౌ యుపవనంబులును
కనకరత్నచ్ఛటా ఖచిత కవాట
ఘనతర దేహళీ కలిత గేహములు
నీలాల గోడలు నిలువుటద్దములు
చాలుగాఁ గలిగిన చంద్రకాంతంపు
శిలలచే సంతన చేసినయట్టి
పలు చంద్రశాలలు, బాగైన జాతి
పగడాల కంబముల్, పనివానువులను
జిగిమించు పచ్చరా చిత్తరంబులును
పటికపుఁ దిన్నెలు పరిఢవిల్లఁగను
చటుల మాణిక్యపుఁ జవికెలు గలిగి
నిత్యోత్సవములచే నెగడు యాదవుల
యత్యంత కోలాహలంబులు గలిగి
గోగణంబుల నెల్లఁ గొమరొంది మిగుల
బాగుగా మేపు గోపాల బాలికలు
వరుస బ్రహ్మక్షత్రి వైశ్యశూద్రులును

వరములై తగు సరోవరములు గలిగి
రంగు బంగరు బొమ్మలను ధిక్కరించు
నంగనా మణులతో నలరుచు మిగుల
చెలువైన యష్టలక్ష్మి విలాసముగ
నలువొందు ద్వారకా నగరంబునందు.

వ. అట్టి ద్వారకాపురంబున కృష్ణమూర్తికొలువుకూటంబు నకు వచ్చెనఁట యెటులనెను.

ద్వి. ఓర కొండెయును మయూర పింఛెమును
గీరు నామంబును కేలవంపును
నాసాగ్రమందున నవమౌక్తికమును
వాసవమణి నీలవర్ణ దేహమును
మురువైన చెవులను మొసలివాయొంట్లు
మెఱుఁగుఁ జెక్కులపైని మేలమాడఁగను
తెలితామరలను ఎంతే ధిక్కరింపఁ
గలిగిన నిడువాలుఁ గన్నులతోను
ఆననాంచిత మందహాస చంద్రికలు
పూని నల్దిక్కులఁ బొలుపొందఁగాను
వదనారవింద సంపదలు పెంపొదల
నదనైన కేయూరహారముల్ కదల
దర చక్ర శార్ఙ్గ గదాదాయుధములు
కరపంకజమ్ములఁ గర మొప్పఁగాను

నవరత్నమయ భూషణముల దీధితులు
ప్రవిమలంబుగ నిండి పరిఢవిల్లగను
పసమించు పసిఁడిదుప్పటిచెంగు నేల
నొసపరి జీరాడ హారాయఁలు మీఱఁగను
దనరు మన్మథ మన్మథాకారుఁడగుచు
మొనసిన శృంగారమూర్తి తానగుచు
గోపవేషంబుతో గోపాల శౌరి
యైపునఁ గొలువుకు వచ్చె నంతటను.

రా॥ బిలావత్ ॥ ఆది॥

కృష్ణమూర్తి వెడలి వచ్చెనదిగో-కీరవాణులార
చూడరె।

జిష్ణుఁడై వర్ధిష్ణుడై ప్రభవిష్ణుఁడైన శ్రీకృష్ణ దేవుఁడగు॥
ఓరకొండె పించెము ఒయ్యార-
మొనర గీరు నామము కళలూర।
చారు కేయూర మంజీర హీర-
హారపంక్తులు దనరార ॥కృష్ణ॥
మొసలి రొయింట్లు చెవుల ముద్దుగార-
మోము చంద్రబింబమును మీఱ।
పసిఁడి వలువ వలెవాటు జీర-
భామలకును మనసునఁ దమియూర ॥కృష్ణ॥

త్రిశిరగిరి నిలయుని చెలికాఁడు-
దేవకీ తనయుఁడైనవాఁడు।
కుశల మొసఁగు రాముని సైదోడు-
కోటిమన్మథాకృతితో నేఁడు ॥కృష్ణ॥

వ. ఇట్లు వచ్చిన కృష్ణమూర్తి తెరమఱుఁగున నుండి యే
మనుచున్నాఁడు.

శ్లో. ఆశానిబద్ధ హృదయై ర్దృశ్యతే నాంతరాంతరం।
చంద్రిస్స్వయంప్రకాశోపి కుముదే నిహితాశయః॥

శ్లో. మత్స్యః కూర్మో వరాహశ్చ
నారసింహశ్చ వామనః।
రామో రామశ్చ రామశ్చ
బౌద్ధః కల్కీతి తే దశ॥

వ. అని పలికిన కృష్ణమూర్తిని జూచి మాధవి యేమను
-చున్నాఁడు.

సీ. ఎవరయా నీవు నీ వెచటనుందువు నీదు
పేరేమి యూరేమి పేర్మితోడ
నీతల్లి పేరేమి నీతండ్రి పేరేమి
నీయన్న పేరేమి నేఁడు దెల్పు
నీకులగోత్రముల్ నిలువరంబుగ మాకుఁ
దెలియంగఁ బలుకుము దిట్టముగను

కడువేషధారివై గనుపట్టుచున్నావు
నల్లనైయున్నావు నయముమీఱి
గీ. ఓరకొండెయుఁ బించెంబు నొసరఁబూని
విటుఁడు గేస్తైనచందాన గలసినావు
అట్లు గావున నీదు వృత్తాంతమంత
చెవులు విసఁగోరి యున్నవి చెప్పవలయు.

వ. అని యడిగిన మాధవుని జూచి కృష్ణమూర్తి యేమను చున్నాఁడు.

ద్వి. వినర మాధవ, నీకు విశదంబుగాను
వినిపించెదను నాదు వృత్తాంతమెల్ల
మాతలిదండ్రులు మమత మీఱఁగను
ఆతతిఁ బరిణయంబగు సమయమున
మామ కంసుఁడు రథంబప్పుడు గడప
నామెయిఁ బలికెను ఆకాశవాణి:
"శిష్టురాలైన నీచెల్లి దేవకికి
అష్టమ గర్భాన హరి జనియించి
చాణూర ముష్టిక సహితమై నీదు
ప్రాణముల్ చదియంగఁ బరిమార్చు నిన్ను."
అన విని కంసుఁ డత్యాగ్రహమ్మునను
తనతోడఁబుట్టువుఁ దాఁ జంపఁదలఁచె.

నాతణి మాతండ్రి యతనిఁ బ్రార్థింప
మాతల్లి నాతఁడు మన్నించె నంత
వసుదేవ తనయుఁడై వసుధ దేవకికి
నసమాన బలుఁడనై యవతరించితిని.
ప్రీతిగా దేవకీ వసుదేవు లెన్న
నాతలి దండ్రులు నాయన్న బలుఁడు.
నాపట్ట మహిషు లెన్నఁగ రుక్మిణియును
పైపైన సత్యయు వరజాంబవతియు
మొదలైన యెనమండ్రు ముదితలుగాక
ముదమొప్ప రాధ నామోహంపురాణి;
ఎఱుఁగవా మాధవా! యెఱుఁగవా నన్ను?
ధరలోనఁ గృష్ణావతారుండ నేను.

వ. అయితే నీభార్యల పేరు వివరింపవయ్యా.

ద్వి. మాటికి విను నాదుమగువల పేరు
మేలైన రుక్మిణి, మిన్నైన సత్య,
దంతియానైన సుదంతియు నొకతె,
కాంతలలో మేటి కాళింది యొకతె,
భద్రేభయానైన భద్రయు నొకతె,
మాదిరి లేనట్టి లక్ష్మణయును నొకతె,
మేలైన యల మిత్రవిందయు నొకతె,
బాళియుఁ గల్గు జాంబవతియు నొకతె,

పదియారు వేల గోపస్త్రీలు గలరు.
అదిగాక తనకు మోహము రాధమీద.

వ. ఆవృత్తాంతం బట్లుండనిమ్ము. మత్స్యాద్యవతారంబులు ఏమి నిమిత్తంబునఁ గావించితివి వివరింపవయ్యా.

ద్వి. అరయ నీ వెఱుఁగవా ఆదిని నేను
ధరలోనఁ బదియవతారముల్ చేసి
మచ్ఛమై సోమకు మదమణంచితిని
అచ్ఛపుఁ గూర్మమై యద్రిమోచితిని
అల కిటినై హిరణ్యాక్షుఁ దునించితిని
లలి నృహరినయి ప్రహ్లాదుఁ గాచితిని
వడుగునై బలిచక్రవర్తిచే మూఁడు
అడుగులు దానంబు నపుడు తీసితిని
భృగుపత్రై నృపతుల పేరడంచితిని
నగరాముఁడగుచు రావణుని ద్రుంచితిని
హాలినై ప్రలంబుని హతమొనర్చితిని
లలి బౌద్ధుఁడై బౌద్ధులను జయించితిని
యవనులకై కల్కి నగుటకు నెంచి
భువినెల్ల రక్షించి బొలుపొందువాఁడ
భువనత్రయంబును బోషించుటకును
అనతార మొందిన యట్టి కృష్ణుఁడను.

ఎనమండ్రు సతులలో నిరువురిమీఁద
ఘనతరంబగు ప్రేమ గల; దదిగాక
రాధను జూడక రహిఁ దాళలేను
మాధవ, యీమర్మ మంతయు వినుము.

వ. అయితే ఇంతసేపు తెరమఱుఁగున నున్నావు; ఈవల రావయ్యా, అనగా కృష్ణమూర్తి రాధను తలంచుకొని యే మనుచున్నాఁడు.

ద. నా ఒయ్యారి రాధ నా చిన్నారి రాధ
ముద్దుల గుమ్మరాధ–చక్కెర బొమ్మరాధ
చిలుకల కొలికి రాధ–మరునిపూ ములికిరాధ
రతి సురతాణిరాధ–వరశుకవాణి రాధ
కులుకు మిటారి రాధ–మరుని కటారి రాధ
మదనుని దంతి రాధ–వలపుల దొంతి రాధ.

వ. అని పలికి చెలిని జూచి మఱియు నేమనుచున్నాఁడు.

చ. వలపులదొంతి,బల్ పలుకు వాటమునేర్చినమేలుబంతి,యా
చిలుకలకొల్కి,మన్మథునిచేఁ దనరారెడుపూవుముల్కి–కాం
తలకును మేటి, బంధములఁ దప్పకనన్ బెనఁగేవధూటియో
ళలకును మోధయై నెనరు దాఁచనిరాధనుదేర్చగక్కనన్

ద్వి. చానల మేల్బంతి జాజిపూబంతి
నానెమూ గజయాన నవలతికూన
పరంగు తేనియవాక పసిండిసలాక
మరువంపురెమ్మ కమ్మని ముద్దుగుమ్మ
రమణులలో మేటి రతులం గిరీటి
సమములేని వధూటి సద్గుణపేటి
కలికి చక్కనిజాణ కస్తురి వీణ
అలరువిల్తుకటారి యతివమిటారి
వెన్నెలలోంబేట విరజాజితోంట
చిన్నారిపొన్నారి చెలి హొంతకారి
రాధికామణిని నుల్లాసంబుమీఱ
నీధరలోన నే నెన్నండు చూతు!

ద॥ నవరోజు॥ ఆది॥

రాధనుగానరుగా చక్కనిరాధనుగానరుగా।
మాధవశ్రీమధు-సూదనయని మధు-రాధర మొసంగిన-
న్నాదరించిన చక్కని ॥రాధ॥
మొలకనవ్వులది చిలుకకులుకులది-కలికి చారెడు
కన్నులది
కులుకుగుబ్బలది గొప్పపిఱుందులది
తొలకరి మెఱుపన చెలువలరినయది ॥రా॥

లలన బంగరుసలాకవంటిది—వలపుఁజూపులు కలిగినది।
తళుకుఁ జెక్కులది పలుచని మోవిది—
యలయంచల చెన్నడరిన నడలది ॥రా॥
పిడికిట నడఁగిన నడుము గలిగినది—
నిడుదయైన కీల్జడగలది।
అడరి త్రిశిరగిరి జడదారికి సం—
గడి యనిపొగడుచుఁ గలిసి మెలసినది ॥రా॥

వ. మఱియు విరహాభరంబు సైపంజాలక యే మను చున్నాఁడు.

సీ. పున్నమచంద్రునిఁ బొడగాంచినంతనే
తరుణి రాధిక మోము తలఁపువచ్చు
కడఁగి బింబఫలంబు కనుఁగొన్నయంతనే
తరుణి రాధిక మోవి తలఁపువచ్చు
కనకకుంభంబులు కనుగొన్నయంతనే
తరుణి రాధిక చనుల్ తలఁపువచ్చు
కదళికాస్తంభముల్ కనుగొన్నయంతనే
తరుణి రాధిక దొడల్ తలఁపువచ్చు
మొనసి యమునానదీతీరమునఁ జెలంగు
గుజ్జుగొజ్జంగి పొదరిండ్ల జొచ్చి చేరి
కూడియాడిన చక్కని కులుకులాడి
నెపుడు గనుఁగొందు! నా వెత లెప్పుడు డిందు!

సౌరాష్ట్రి: రాధిక నెన్నఁడు కందురా

ఉల్లాసముగ నెపుడుందురా।
మనసునిచేతి కటారిరా– అది–
మగువలలోన మిటారిరా।
సుదతి బంగరు సలాకరా– ఎంతో–
సొగసైన బలుతేనె వాకరా।
కొమ్మమరుని మత్తదంతిరా– ముద్దు
గుమ్మలలో మేలుబంతిరా।
రతులకెల్ల సురతాణిరా– ఆ
రాజవదన కీరవాణిరా।
చక్కని చిలుకల కొలికిరా– ఆర
జిమ్ములు దెలిసిన కలికిరా।
ఎనలేని మరువంపు మొలరా– మిగుల
హెచ్చైన రతిచేతి చిలుకరా!
ఇంతి యెంతో నెఱజాణరా– భువి
నెనలేని కస్తూరి వీణరా।
పడఁతులలో నెఱయోధరా– నా
ప్రాణపదంబైన రాధరా।
కీరవాణి కనిదెలియురా– త్రిశిర
గిరి నిలయు సఖుఁడని కలియురా॥

మ. నిమిషంబాయుగమాయె, గన్నుఁగనకున్ నిద్రించు
లేదాయెఁ, బ్రా
యము వ్యర్థంబయిపోయె, నెమ్మదికినిన్ హాయించు
లేదాయె, న
న్న మొకింతైనను సైచదాయె, బలుమింటన్ జంద్రికల్
చిచ్చులై
రమణీ! తోఁచె; నికేమిసేతు! నిటకున్ రాధామణిన్
దేగదే!

మధ్యమావతి॥ ఆది॥

రాధామణిని జూపరమ్మా । నాబయ్యారి రాధామణిని
జూపరమ్మా॥

మాధవ యనుచు గుజ్జుమామిళ్ళనీడల-
మధురాధర మొసఁగి నన్నాదరించిన చక్కని ॥రా॥

మొలక ప్రాయమునాఁడె చిలుకవలె మాటలాడి-
తిలకము దిద్ది వగలుచేసి। శృంగారరస మొలుక
మాయవల వేసి। ఓరఁజూపులఁదిలకించి। కనుసన్న చేసి
వద్దకి డాసి। కులుకు గుబ్బల ఒమ్ముకుమ్ములాడి
వేడిన ॥రా॥

సొగసుకాఁడా నాచేఁ దగిలితివని వచ్చి।
వగలఁ గౌఁగిటఁ గదియఁ దిచ్చి।
తనకుఁదగిన మగఁడు నీవేయని మెచ్చి।

ముసిముసి-నగవు నగుచుఁ దనయంతరంగ మిచ్చి-
విరహ తాపము- ఇఁకఁ దాళఁజాలనని-
యెంతో లాలించినట్టి ||రా||

అద్దంపు బిళ్ళల కుద్దియనుచు ప్రేమ-
గొద్ది చెక్కిలు ముద్దులాడి- వట్టి
సుద్దులఁ బొద్దు జరపవద్దని వేడి- త్రిశిరగిరీశు-
కుద్దినీవని కొనియాడి- రతులఁ గూడిన-
ముద్దుగుమ్మ నామీఁద మోడిచేసెందున్నదో ||రా||

ద్వి|| చానల||

వ. అని యిట్లు కృష్ణమూర్తి రాధామణిని దలంచి విరహ పడుచున్న సమయంబున రాధికామణి విరహాభరాక్రాంతయై కృష్ణమూర్తిని దలంచుకొని వచ్చెనట యెటువలెను.

ద్వి. ఎనలేని విరహాన నేమితోఁచకను
ఘననిభశ్యాముఁడై కడఁగిన హరిని
వనములందును గొల్లవాడలయందు
నెనరుతో సురపొన్ననీడలయందు
నలుపు మీఱిన యమునా తీరమందు
పొలుపొందుచున్న పూఁబొదరిండ్లయందు
వెతకుచుఁ గానక వెతలఁ జెందుచును
అతి విరహంబున హరిహరీ యనుచు

నిట్టూర్పు లంతట నిగిడించుకొనుచుఁ
బట్టఁగూడని ప్రేమ బయలు పడంగ
సకల భూషణముల చాకచక్యములు
చిలికిగాఁ దనువునఁ జెన్నొందఁగాను
హాకృష్ణ! హాకృష్ణ! హాకృష్ణ! యనుచు
వాకుఁ ద్రిచ్చుచును రాధ వచ్చెనంతటను.

పంతువరాళి—

రాధికామణి వచ్చెను—హరినిఁ వెతకుచు ॥రా॥
రాధికామణి వచ్చె వి—రాళినిలుపఁ జాలకను॥
మాధవుని దిక్కు—ల ము—మ్మాటికిని వెతకుచును ॥రా॥
చిన్ననాఁడె బాసలిచ్చి—నన్ను గూడిన కృష్ణుని
ఎన్నఁడు కనుఁగొందునో యంట—నామనోరథ
మేరీతి నెఱవేఱునే యంట—మది నెంచు కొంట ॥రా॥
వెన్నెలబైటను ఇసుక—తిన్నెలను గలసినట్టి
వన్నెకాఁడౌ త్రిశిరగిరి—వాసుసఖునిఁ జూడఁగోరి ॥రా॥

వ. ఇట్లు వచ్చిన రాధికామణి హరిని తలంచుకొని విరహ భరంబున తెరమఱుఁగున నుండి యేమనుచున్నది.

సీ. నాప్రాణనాథుండు నాతోనె మోవివిం
    దెపు డారగించునో యెఱుఁగరాదు
నారమణుఁడు వచ్చి నాతో నుసరసంబు
    లెప్పు డొనరించునో యెఱుఁగరాదు

నావల్లభుఁడు వచ్చి నను గౌఁగిటనుఁజేర్చి
ఎప్పుడు లాలించునో యెఱుఁగరాదు
నాకాంతుఁ డిటువచ్చి యేకాంతమునఁ జేరి
యెప్పుడు నన్నేలునో యెఱుఁగరాదు

వాని జూడక నిమిషమైనాను నేను
మానఁజాలను ఎటులైనఁగానివాని
పూని తోడ్కొని వచ్చి నాప్రాణములను
నిలుపరే మీరు చెలులార! నేర్పుమీఱ.

వ. అని యిట్లు విరహ మొందిన రాధను జూచి మాధవి నీవెవ్వరని యడుగఁగా రాధ యేమనుచున్నది.

ద్వి. ఓసరసిజనేత్రి యోశుకవాణి
ఓసైకతశ్రోణి యోనీలవేణి
నీపేరు ఏమని నీవడిగితివి
నాపేరు తెలిపెద నయముగా వినుము
అందమౌ రేపల్లె కధిపతియైన
నందుండు మాయన్న నలినాయతాక్షి!
అతని పట్టపుదేవియైన యశోద
క్షితిలోన వదినెయై చెలఁగును దనకు
అలరు కృష్ణుండు మేనల్లుండు తనకు
నలినాక్షి వినుమింక నాపేరు రాధ.

కన్నె కృష్ణుండు చక్కని వాఁడటంచుఁ
జిన్ని ప్రాయమునాఁడె చేపట్టఁ బట్టితిని
కావున వానిపైఁ గడు మోహమునను
వేవేగ కృష్ణుని వెదక వచ్చితిని.

వ. అయితే ఎంతసేపు తెరమఱుగున నున్నావు. ఈవలకు రావమ్మా- రాధికామణివచ్చెను. ఇట్లు తెరకీవలవచ్చి రాధికామణి విరహాభరంబున కృష్ణమూర్తి నిఁ దలఁచుకొని యేమనుచున్నది.

సీ. నీలోత్పలంబుల నెఱిఁజూచినంతనే
హరి దేహకాంతులే స్మరణవచ్చు
పుండరీకముల పొడ చూచినంతనే
హరినయనంబులే స్మరణవచ్చు
ఘనచంద్రబింబంబు కనుఁగొన్నయంతనే
శౌరిముఖాబ్జమే స్మరణవచ్చు
మకరికా పత్రముల్ మఱిచూచినంతనే
మకరకుండలములె స్మరణవచ్చు
వసుని వనమాలికయును శ్రీవత్సకౌస్తు
భములు కస్తూరితిలకంబు బర్హిపింఛ
మసని రూపంబు నెంతసేపైనఁ జూడ
కెటుల నేస్హైతు! నింక నేనేమి సేతు!

వ. అని మఱియు నేమనుచున్నది.

ఆహూరి॥ ఏలపరాకు చేసేరె చెలులార- గో-
పాలకృష్ణుని జూపరే చెలులార॥
ఎందువెతకినఁ గాననే చెలులార- గో-
విందు నెప్పుడుచూతు చెలులార॥
కుంజగృహామునఁ గలసి చెలులార- మనసు-
రంజన చేసినవాఁడె చెలులార॥
ఎక్కడఁ జూచినఁగాని చెలులార- వాని
చక్కఁదనమె కనిపించె చెలులార॥
వాని కౌఁగిలించకనె చెలులార- విరహా-
పూన జాల నేమిసేతుఁ జెలులార॥
వానిమోవిపానకము చెలులార- పూని-
యానక నేమానఁజాల చెలులార॥
మరుని విరిశరములకు చెలులారా- నన్ను-
గురిచేసె నిఁకేమి సేతు చెలులార॥
మలయ మారుతము వేడి చెలులార- ము-
మ్మాటికి సైపఁజాలనె చెలువార॥
త్రిశిర గిరీశ్వరుని సఖుఁడు చెలులార- తొంటి
తెలుఁగున గూడేదెన్నఁడె చెలులార॥

వ. అని మఱియు నేమనుచున్నది.

ఉ. చక్కని కృష్ణ రారయని సందిటనన్ గదియించి వానినున్
జెక్కిలి నొక్కిముద్దులిడి చివ్వన మోవిసుధారసంబు పెం
పెక్కఁగఁగ్రోలి బల్ సరస భేదములన్ మురళీవినోదుచేఁ
జిక్కి సుఖించుటెన్నటికొ చెల్లబొ నెచ్చెలులార చెప్పరే!

పున్నాగవరాళి॥ ఆట॥

ఏమోయని యుంటి-నిన్నాళ్లవలెఁ గాదు-
ఎన్నెన్నో నేర్చినాఁడే!
భామలార త్రిశిరగిరి-ధాముఁడైన గో-
పాలకృష్ణుఁడు మును,పటివాఁడు గాడె ॥ఏమో॥
నామాట మీఱక-నడుచుకొన్న వాఁడు
నన్ను నిరాకరించెనే!
కామిని నాపొందు-కాసించినవాఁడు
కోమలాంగుల పొందు-గోరంగ నేర్చెనె ॥ఏమో॥
నను వినా యొరులను-కనులఁ జూడనివాఁడు
వనితలఁ జూడ సాగెనే!
ఎనలేని నాయిల్లు-నెడఁబాయనివాఁడు
ఇల్లిల్లును దూఱి-యేమేమొ చేసెనె ॥ఏమో॥
రహిమీఱఁగనన్ను-రతుల నేనసినవాఁడు
బహువల్లభుఁ డాయెనే!
బహువిధముల వీని-నడకలెంచి చూచితె
భారతకథలై-పలుమాఱు తోఁచెనే ॥ఏమో॥

వ. ఇట్లు విరహమొందిన రాధామణిని జూచి మాధవికృష్ణ మూర్తిని కనుపింపఁగాసంతుష్టాంతరంగయై నమస్కరించెనఁట యెటులనెను.

శ్లో. నమామి సంపుల్ల సరోజనేత్రం
నమామి పూర్ణేందు సమానవక్త్రం।
నమామి లక్ష్మీ రమణీ కళత్రం
నమామి కృష్ణం వసుదేవపుత్రం॥

వ. ఇట్లు నమస్కరించిన రాధనుజూచి కృష్ణమూర్తి యే మనుచున్నాఁడు.

చ. కులుకు మిటారి గబ్బిచనుగుబ్బల మేలగుహారాంతకారి య
య్యలరుల విల్తుచేఁ దనరు నాకౌతరంబగుచిక్కటారి రా
చిలుకకు మిన్నగా మురువుచిల్కెడు పల్కుటొయారి
నిన్ను నే
నెలమిని జూడఁగోరినది నేఁడుగదా ఫలియించె రాధికా!

వ. అని పలికిన కృష్ణమూర్తిని జూచి రాధ నిష్ఠురోక్తుల నేమనుచున్నది.

ఎరుకల ॥ఆది॥

రాధామణిరో నీమధు,రాధర మిమ్మనుచునో
మాధవా,నీవునా,మనసు సోధించెవేరా॥

అందకాఁడా మోహము చెందినవానివలెనె
అందగించి ముద్దుపెట్టి-యాడేవేమిరా॥
మొగము ముందర నొకటి-మొగము వెన్క-నొక్కటి
మొగమాయకాఁడా నీ-ముచ్చువగలు దెలిసేరా॥
భామచేఁ జిక్కి-నావయసు - పాన్పుపాలుచేసితివి
యేమిరా నాపై నేరము-లిపుడు దెలుపరా॥
కిసలయ తల్పమునఁ గుంజ-గృహమున మునుపటివలె
కసిదీరఁ గౌఁగిటఁగుచ్చి - కలయవేమిరా॥
త్రిశిరగిరిని వెలయుదేవు - నిసఖుఁడైతేనేమి
యసమీయక నీవు నన్ని-ట్లగడు చేతురా॥

వ. అనియనేక విధముల నిష్ఠురోక్తులు పలికిన రాధను బుజ్జగించి పరిరంభణముచేసి సంతుష్టాంతరంగుఁడై కృష్ణమూర్తి రాధను గూడి నటనముచేసెనఁట యెటువలెను.

ముఖారి॥

ఆడెనే కృష్ణుఁ డాడెనే!
ఆడెనే శ్రుతిగూడుక యేలలు పాడుచు శిఖముడి
వీడఁగ శుశ్రితులు కొని యాడగ భక్తులు
గూడుక వరములు-వేడఁగ మిక్కిలి వేడుకతోన ॥ఆడె॥
నెట్టన నడుమున ( గట్టిన బంగారు
దట్టి బిగియఁగాఁ గట్టుక ప్రేమ।

యుట్టిపడంగను దిట్టపురాధను
చెట్టఁబట్టి పదఘట్టనతోను ॥ఆడె॥
సజ్జికముగఁ దన యజ్జను గట్టిన
గజ్జెలు ఘలుఘలు ఘల్లనిమ్రోయఁగ।
గుజ్జరూపమున ముజ్జగములుగల
జొజ్జగదలఁగ జగజెట్టిపుడు ॥ఆడె॥
డాసి త్రిశిరగిరి వాసుఁడు సత్యో
ల్లాసముచే సంధ్యాసమయంబున।
హాసముగ గౌరి సెబాసన నటనము
చేసిన రీతిని దాసులు పొగడ ॥ఆడె॥

వ. ఇట్లు కృష్ణమూర్తి రాధనుగూడి సంతుష్టాంతరంగుండై నటనంబు చేసి తదనంతరంబ రుక్మిణీదేవిని దలంచుకొని చెలి కత్తెలఁ జూచి యేమనుచున్నాఁడు.

పంతువరాళి॥ ఆట॥ చా॥

రారేచెలులార వేగము తోడి తేరే చెలులార।
ఆరుక్మిణి నిష్కారణముగను మో
మోరఁజేసుకొని మోడిచేసినది ॥రా॥
మొనపంట నలదాని-మోవి గట్టిగ గొబ్బన
నొక్కితే నొవ్వఁబోయెనని।
అనయము మదినెంచి-యహహాయన్నందుకా
వనజాక్షి నీఁ దలఁచెననియెంచుకొనెనేమొ ॥రా॥

చిగురువంటిమేను-చెలఁగి కౌఁగిట బిగియ
కదిసి బిగియించితే కందునని।
యువిదరో మదినెంచి-యుస్సురన్నందుకు
సవతిపై మోహమని-చలము చేసెనేమో ॥రా॥

నిన్నరే త్రిశిరగిరి-నిలయుని సఖుఁడనై
వన్నెలాడిని గలసి-పరవశమై।
యున్న వేళనా-కన్నెను మదిఁదలఁచు
కొన్నాఁడని నాపై-కొదవ లెంచెనేమో ॥రా॥

వ. అని యిట్లు చెలులనంచి పిలిపించఁగా రుక్మిణీదేవివచ్చె
నంట యెటువలెను.

ద్వి. బంగారు గజ్జెలు పాదసరమ్ము
లుంగరమ్ములు నందె లుచితమైనట్టి
గిలుకు మట్టెలరవల్ గిలకొట్టఁగాను
పలుచని దంతపుఁ బావలుమెట్టి
పసిమి బవంతిరాపని హెచ్చుచీర
మిసిమి కుచ్చెలచీర మీఁగాళ్ళఁజీర
ఘనమైన మొలనూలి గంటలమోతఁ
నొనరు నెన్నడుమున నొడ్డాణ మమర
కరమున రత్నకంకణములు మెఱయ
సరసాంగదాది భూషణకాంతులలర

కులగిరులను బోలు కుచముల మీఁద
లలి నవరత్నహారము లసియాడ
రాణించు పైఠాణి రవిక ధరించి
పోణిమతో సంపెంగపువ్వును నవ్వు
ముక్కున ముత్యంపు ముక్కరపూని
చక్కని తాటంక చాకచక్యంబు
తళుకుఁ జెక్కులమీఁద తళతళలీన
కలువరేకులవంటి కన్నులయందుఁ
గాటుక తనరార, కంబుకంఠమున
మేటిభూషణములు మెఱసి పెంపొంద,
పున్నమచందురుఁ బోలు మోమునను
తిన్నగాఁ గస్తూరితిలక మింపెసఁగ,
పురణించు కెంపుల బుగడలు చెంప
సరములు నెలకొచ్చు చంద్రసూర్యులును
ప్రతిలేని వజ్రాల పాపటబొట్టు
సతతంబు ఫాలదేశంబున మెఱయ,
గొప్పైన యరజారు కొప్పున విరులు
ఒప్పుగా ధరియించి హొయలు మీఱగను,
పదునారు వన్నియ బంగారుబొమ్మ
ముదితలలో మేటి ముద్దులగుమ్మ
మంచివాసనగల మరువంపు మొలక

గాంచినపట్ల చక్కని రామచిలుక
చిరుతప్రాయము గుల్కు చిలుకలకొలికి
మరునిచే విలసిల్లు మంచిపూముల్కి
కమలాయతాక్షి చక్కఁదనాలకుప్ప
రమణుని విరహావారాశికిఁ దెప్ప
బాగైన చక్కని భద్రేభయాన
నాగరికంబైన నవలతకూన
మెలఁకువఁ దొలకరి మెఱుపుచందమున
లలిమించు పసిఁడి సలాకయందమున
చేలాగు చెలులీయ శ్రీకృష్ణుకడకు
మేలిమితోడ రుక్మిణి వచ్చెనంత.

సావేరి॥ వెడలి వచ్చెనదిగో రుక్మిణిదేవి ॥వెడ॥

పిడికిట నడఁగు నెన్నడుము కుచభారమునకు
వడఁకఁ గైదండలు వనితలొసఁగఁగాను ॥వెడ॥

తాటంకములకాంతి తళుకుఁ జెక్కులపైని
మాటికి నిగనిగ మనుచు మెఱయఁగాను
గాటంపుటందెలు ఘలుఘల్లు మనిమ్రోయ
మేలైన తొలకరి మెఱుపుతీఁగోయనఁగ ॥వెడ॥

తలిరుఁబోఁడులు కైదండ లొసఁగ
నెరుఁగెలఁకులఁ జామరములు వీవఁగ

పలుమాఱు రతనంపుఁ బావాలు మెట్టుక
చిలుకఁ జేతఁ బూని శృంగారముతోన ॥వెడ॥

జిలుఁగుఁ బసిండి చీరకుచ్చెలు వీఁగాళ్ళఁజీర
మొలకనవ్వు మోమునఁ దిలకము మెఱయ
అలత్రిశిరగిరీశు చెలికాని పట్టంపు
నెలఁతయైన రుక్మిణీదేవి హొయలుగ ॥వెడ॥

వ. ఇట్లు వెడలివచ్చిన రుక్మిణీదేవి శ్రీకృష్ణమూర్తినితలంచు
కొని యేమని విరహాపడుచున్నది.

సీ. పున్నమచందురుఁ బోలు మోమును జూచి
కమలంబులను గేరు కనులఁ జూచి
యతి మధురంబైన యధరబింబముఁ జూచి
తళుకైన చెక్కుటద్దములఁ జూచి
వన్నెకెక్కు విశాల వక్షఃస్థలముఁ జూచి
పొలుపైన యొగుభుజంబులను జూచి
దివ్యమై తగినట్టి దేహకాంతులఁ జూచి
శతకోటి మన్మధాకృతిని జూచి
చంద్రికను మించు మందహాసంబుఁ జూచి
వలపు సొలపుల వెలయు చూపులను జూచి
నిండు మోహంబుఁ జెందితి నెలఁతలార!
రమణు నీకఁ దేరె రుక్మిణీరమణి నేను.

గీ. ప్రాణ నాయకుఁ డింటికి వచ్చుననుచు
నెదు రెదురు చూచి సొలసితి నింతులార!
నిమిష మొక్కొక్క యుగమాయె నేమిసేతు!
తోయజాక్షుని నీకనైనఁ దోడి తేరె.

శంకరాభరణము ॥చా॥

చెలువుని గనిపింపరె ఓ చిలుకలార, మీ
రలు వానిఁ గానరఁటె యో హంసలార।
దయితునిఁ గానరఁటే యో తరుణులార
ప్రియుని గానరఁటే వనప్రియములార।
గోవిందుని గానరఁటె కొమ్మలార, నా
దేవునిఁ గానరఁటే యో తెఱవలార।
మగనిఁ గానరఁటే యో మగువలార, త్రిశి
రగిరీశ్వరు సఖుని దేరె రామలార॥

సీ. ఏయింతి నావిభు నెనయఁగా మదిఁగోరి
తనయింటిలోపల దాఁచుకొనెనొ!
ఏరామ వాని యొయ్యారంబు గనుఁగొని
కౌఁగిట బిగియించి క్రమ్ముకొనెనొ!
ఏకాంత వానితో నేకాంత మొనరించి
యొనరంగఁ దనశయ్య నుంచుకొనెనొ!
ఏ మానినీమణి నామోహనాంగునిఁ
గ్రీడింపనెంచి దక్కించుకొనెనొ!

కటకటా! నాము సామ్ము లేకాంతలైన
తలఁచి యాశించినంతనె దక్కునఁటవె!
ఏమిసేయుదు! విరహంబు నెట్లుసైతుఁ
దోడితేరమ్మ కృష్ణుని వేడుకలర॥

వ. అని యిట్లు విరహమొందిన రుక్మిణీదేవినిజూచి మాధవి యేమనుచున్నాఁడు.

సీ. ఎవ్వరిదానవే యిప్పుడు నీపేరేమి
తేటతెల్లముగాను దెలుపవమ్మ
నీతల్లిదండ్రులు నెలఁతరో యెవ్వరు
తేటతెల్లముగాను దెలుపవమ్మ
నీయన్నదమ్ములు నీయెడ నెవ్వారు
తేటతెల్లంబుగాఁ దెలుపవమ్మ
నీమగం డెవ్వాఁడు నెమ్మి నాతనిపేరు
తేటతెల్లమ్ముగాఁ దెలుపవమ్మ
యిచట వచ్చిన కారణం బేమి నీవు
ఎవరిఁ గనుఁగొన వచ్చినా విందువదన!
వెలఁది, యిదియెల్ల నీవు సవిస్తరముగఁ
దేటతెల్లముగాఁ బూని తెలుపవమ్మ॥

వ. అనిన రుక్మిణీదేవి యేమనుచున్నది.

ద్వి. వినవె మాధవి, నాదు వృత్తాంతమంత
ననువుగా భీష్మకుండను దొడ్డరాజు
కరయ నేవురుపుత్రు; లందగ్రజుండు
వరుసతో రుక్మియు; వారితోఁబుట్టి
పరఁగిన రుక్మిణీ భామైన తనకు
వరుడు కృష్ణుండు గావలెనంచుఁగోరి
మాతల్లిదండ్రులు మమతతో నుండ
నాతటి మాయన్న యాగ్రహం బంది
యిల శిశుపాలున కిత్తునఁటంచు
బలిమి సంకల్పింప, భయమంది నేను
హితుఁడైన విప్రునిఁ గృష్ణుని కడకు
నతివేగమునఁ బంప నతని వాక్యములు
హరి విని యిట వచ్చునంతలో నేను
వరుస గౌరీపూజ వాంఛతోఁ జేసి
సేవించు ఫలమున శ్రీహరి వచ్చి
యావేళ నన్ను దా నరదంబుపైని
నిడుకొని రాజుల నేపడఁగించి
వడిమీఱఁ గొనిపోవ, వచ్చి మాయన్న
యని మొన నెదిరింప, నతనిఁ గృష్ణుండు
కసలి విరూపునిఁ గావించి నన్ను

ద్వారకకును దెచ్చి తగరాజులెన్న
గారవంబు చెలంగఁ గల్యాణ మందె.
భామరో, రుక్మిణీభామ నాపేరు;
మానుక వృత్తాంత మది యిది సుమ్మీ.

వ. అనిన మాధవి యేమనుచున్నది.

ఉ. చీరెలు దొంగిలించి కొని చిక్కులు తక్కులుఁజేసి జారుఁడై
చోరుఁడటంచుఁబేరుగని, సూటిగ నావులు మేపి మామనున్
ఆరయ సంహరించి, మగనాండ్రను బట్టినవాని భార్యవా?
సారెకు మేలు మేలు మది సంతసమందెను నీకుమ్రొక్కెదన్

వ. అని పలికి యింతసేపు తెఱమఱుంగున నున్నావు. ఈవల రావమ్మా యనఁ వెడలివచ్చె. (పాత్రప్రవేశము) ఇట్లు వెడలి వచ్చి రుక్మిణీదేవి విరహాభరాక్రాంతయై యేమనుచున్నది.

సీ. ఏముద్దుగుమ్మ తానే ముద్దుపెట్టెనో
నాముద్దుసామి నన్ దలఁచఁడమ్మ,
ఏయంగనామణి యేయంగ మొసఁగెనో
నాయంగ మంటఁగా డాయఁడమ్మ
ఏకామినీమణి యేకమై పెనఁగెనో
శ్రీకాంతుఁ డిటకును జేరఁడమ్మ
ఏమచ్చెకంటి తానేమచ్చు చల్లెనో
యీముచ్చటకును రాఁడాయెనమ్మ.

ఏమిసేయుదు ! విరహంబు నెటులసైతు !
వలపు నిలుపంగ నికనాకు వశముగాదు
ప్రాణపదమైన ముద్దుగోపాలు నిపుడు
తోడితేరమ్మ గ్రక్కున చేడెలార !

వ. అని.

ఘంట ॥చా॥

ఎందు వెతకి చూతుఁ జిలుకా విరహ-
మెంతని సైరింతుఁ జిలుకా।
అందగాఁ డైనట్టి కందర్ప జనకుఁడే
మందయానచేతి మందులోఁ దగిలెనో ॥ఎందు॥

సారెకు నాముద్దు చిలుకా గోపాల
శౌరిని దోడ్తేవె చిలుకా।
మారుని చేతి ల కోరికోలలు మీఱి
మీఱి యురముదూఱి పాఱెనేమిసేతు ॥ఎందు॥

మలయ మారుతము చిలుకా బె
బ్బులి వలె దూలీని చిలుకా।
అల తుమ్మెదలు శారికలు కోకిలలు గూడి
కలకల మనుచును గవిసె నేమి సేతు ॥ఎందు॥

నామనసు తెలిసిన చిలుకా ప్రాణ
నాథుని వెదకవె చిలుకా।
రామ త్రిశిరగిరి ధాముని సఖుఁడైన
నాముద్దు గోపాల స్వామి రాకయున్నా ॥డెందు॥

వ. అని మఱియు నేమనుచున్నది.

వ. అని పలికి స్వామినిజస్వరూపము తలంచుకొని యేమనుచున్నది.

సీ. పాదాగ్రమున గంగ బలుపొక్కిలిని బ్రహ్మ
యురమున శ్రీదేవి మనుఁడు మదిని
కమల గర్భాండ భాండము లెల్లఁ గుక్షిని
బొలుపొందు వీపున భూమిదేవి
తలపైని జక్కని తులసీ మహాదేవి
చెన్నైన తల్పంబు చిలువ ఱేఁడు
వర కేతనంబున బాగైన గరుడుండు
పలుగంధవాహను వాయుగణము
సూర్యచంద్రులు కన్నులు సురలు రోమ
గణము ఋషులెల్ల కాంతలు గానుగలిగి
చెలఁగు గోపాలమూర్తి యేచెలియయింట
నెలకొనున్నాఁడో తెలుపరే నెలఁతలార!

వ. అని యిట్లు విరహాపడుచున్న సమయంబున స్వామి యెదుట వచ్చి నిలిచినట్లు భ్రమచెంది యేమనుచున్నది.

ప॥ పరజు ॥ఆది॥

పాలవంటి వయసు పాన్పుపాలాయె నేమిసేతు నా –
బాళిదీర్ప వేమిరా గోపాలా।

ఆ లలనకై లోనై గోపాలా నీవు నన్నిట్లు-
జాలి బెట్టేది మేలా గోపాలా।
నినుబాసి తాళఁ జాల-గోపాల యిసుమంతైన
కనికరము నుంపవేర గోపాలా।
నీలమేఘశ్యామల గోపాలా (శ్రీ)శిశిరగిరి
నిలయు సఖుఁడైన వేణు గోపాలా॥

వ. అని మఱియు నేమనుచున్నది.

సీ. నాపయోధరచక్రి మీఁపునఁబట్టఁగా
ఘనచక్రధరుఁ డనుఖ్యాతి గలిగె
నాకంఠమునఁ జేయి నాథుండు వేయఁగా
ఘనశంఖధరుఁ డనుఖ్యాతి గలిగె
నాదు నూఁగారంట నాయెదఁ బవళింప
ఘన శేషశాయను ఖ్యాతి గలిగె
నాతోన రతికేళి నయమొప్పఁ జేయఁగా
ఘనపురుషోత్తమ ఖ్యాతి గలిగె
నిట్టి మర్మంబు తెలియక యింతి, నాదు
విభుఁడు ఎవ్వతెపైఁ గన్ను వేసినాఁడొ
వెదకి కృష్ణుని దేకున్న విరహాభరము
తాళఁ జాలను దోడ్తేరె తరుణులార !

వ. అని యిట్లనంగా భంగుర విషకీలి కీలాకరాళ భుజంగోపమాన తీక్ష్ణబాణజాల సంకీర్ణ వక్షఃస్థలయైయున్న యవసరంబున మాధవి యేమనుచున్నాఁడు.

గీ. ఏల వెతఁజెందుచున్నావె యిగురుఁబోఁడి?
నందనందనుఁ డిప్పుడానందముగను
గొలువు గూర్చుండి యున్నాఁడు; కూర్మినతని
సరస గూర్చుండి ముచ్చటల్ సలుపవమ్మ.

వ. అనిరుక్మిణీదేవి యానంద కందళ తరంగితాంతరంగయై విరహాభర సరిదధిప తరణ చతురతర తరణిప్రతీకాశ నిజరమణ విలోకన సంభూతానంద రసమరంద తుందిలనయనారవిందయై కృష్ణమూర్తికి నమస్కరించెనట యెటువలెను.

శ్లో. నమామి సంసారతమః పతంగం
నమామి గోపీజన మోహనాంగం।
నమామి రాధారమణీ భుజంగం।
నమామి కృష్ణం కరుణాతరంగం ।

గీ. కేశవాప్రమేయ, కృష్ణ, దామోదర,
పంకజాక్ష, శౌరి, పద్మనాభ,
వాసుదేవ, దేవ, వరద, నారాయణా,
దైత్యహరణ, నీకు దండమయ్య.

వ. అని నమస్కరించి నిజదర్శన కుతూహలాయత్తహృద యారవిందుండైన గోవిందునింజూచి సంతుష్టాంతరంగయై యేమనుచున్నది.

ఎరుకల కాంభోజి ॥ఆది ॥

నేడుగా నాకోర్కె నీడేరె సామి
ఈడు లేని త్రిశిరగిరీశు చెలికాండైన
కోడె గాండాచక్కని - గోపాలకృష్ణ ॥నేడు ॥

నిన్ను బాసినది మొదలు - నీమెర కంటికిరాక
అన్నము సైంచక - హాయని లేక।
ఉన్నవిషము దెలిసి - యుల్లమున దయయుంచి
నన్ను జేరందీసి - నయము చేసితివి గనుక ॥నేడు॥

వ. అనిపలికి రుక్మిణీదేవి నీలమేఘుంబు కుఱంగలి మెఱుపు తెఱంగున హరిచెంగట సుఖాసీనయైన తదనంతరంబ అష్టమహి షుల చెలికత్తెలు వచ్చెడి మార్గం బెవ్విధానసం బే.

మోహన ॥ఆది॥

వచ్చి రష్టమహిషుల చెలికత్తెలు - వన్నెలు మీఱంగను ॥
హెచ్చగు త్రిశిరగిరీశసఖుండైన - యిభరాజ వరదుని
సభకు వేవేగమె ॥వచ్చి॥

కొప్పునందుఱిమిన కుసుమవాసనలు - గుబులుకొనంగాను।
తెప్ప వేయని వారి చెలువు కోడనంబవి
లీలలుచేయు గోపాలుని సభకును ॥వచ్చి॥

గుబ్బలపై నవరత్న హారములు గునిసియాడఁగాను।
గబ్బిగ పాద సరమ్ములందియలు ఘలుఘలుమనగాను
వేవేగమె ॥వచ్చి॥

తాటంకమ్ముల కాంతులు చెక్కులఁ దళతళలీనఁగను।
దీటులేని సయ్యాటలాడుచును
దేవ కీతనయుని సముఖమునకు ॥వచ్చి॥

వ. ఇట్లువచ్చిన చెలికత్తెలు కృష్ణమూర్తికి నమస్కరించి రఁట యెటువలెను.

శ్లో. నమామి దీనావనకామధేనుం।
నమామి భక్తార్తి తమిస్రభానుం।
నమామి విధ్వంసిత మత్త ధేనుం
నమామి కృష్ణం వసుదేవ సూనుం॥

వ. తదనంతరంబ యష్టమహిషులు వచ్చెడిమార్గం బెవి ధానసంబే.

కాపి ॥ఆది॥

అష్టమహిషులు వచ్చిరి కృష్ణునికడకు ॥అష్ట॥
సృష్టికర్తనుగన్న శ్రీ కృష్ణదేవుని సభకు ॥అష్ట॥
పలుచని దంతపుఁ బావలు మెట్టుక
వెలలేని భూషణావళుల ధరించి।
తొలకరి మెఱుపుల వలెనె మెఱయుచు
నెలమిఁ ద్రిశిరగిరి నిలయు సఖుని చెంతకు॥ అష్ట॥

వ. ఇట్లు వచ్చి నమస్కరించిన యష్టమహిషులం గూడి యానందభరితాంతరంగుఁడై కొలువున్న కృష్ణమూర్తిని జూచి మాధవి యేమని కొనియాడుచున్నాఁడు.

నమస్కారశ్లోకము.

శ్లో. గోపాలం యదునందనం సురగురుం గోవర్ధనోద్ధారకం
గోపస్త్రీ కుచకుంకుమాంకిత లసద్విస్తార వక్షఃస్థలం।
గోబృందైఃపరివేష్టితం మురహరం గోపాలకైస్సంవృతం
గోవిందం మదమత్తకంసహరణం ధ్యాయామిలక్ష్మీపతిం

వ. ఇట్లు వినుతించిన మాధవి వినుతింగొని పేరోలగంబునఁ గొలువున్న సమయంబున నాకస్మికంబుగా నారదమునీంద్రుఁడు వచ్చెనఁట యెటువలెను.

ఉ. ఫాలమునన్ త్రిపుండ్రమును బాణితలంబున రుద్రవీణయున్
లాలితమైనయట్టి రుదురాకలపేరులు కంఠమందునున్
వ్రేలుజడల్ కమండలువు వేమఱుపూని సురప్రసూనమున్
గేలనుగొంచు నారదుఁడు కృష్ణునివద్దకు వచ్చె వేడుకన్.

మధ్య॥ ఆది॥ నారదముని వచ్చెను వేడుకమీఱ॥ నార॥
చేరి రుక్మిణితోడ శ్రీకృష్ణదేవుఁడు
ఆరసి జూదము లాడుచునుండఁగ॥ నార॥

నెమ్మని మహతియనే వీణ పూనుక
సమ్మతి సప్తస్వరమ్ములతో।
కమ్మని విలుతుని గన్నతండ్రిపైని గీ
తమ్ములఁ బాడుచుఁ దన్మయుఁడై సొక్కుచు॥ నార॥
భూతి రుద్రాక్షలు పొలుపు మీఱఁగాను
చేత జపమాలిక చెలఁగఁగను।
బ్రాఁతిగ శుద్ధ స్ఫటిక దేహముతోడ
ఖ్యాతి మీఱ నాకస్మికముగను॥ నార॥
జడలు ధరించుక సరసకమండలు
విడుకొని నటనము వెలయఁగను।
వడిగఁ ద్రిశిరగిరి పతిసఖునిచెంతకు
నడరి కృపారస మట పొదబల్లుచు॥ నార॥

వ. ఇట్లు వచ్చిన నారదమునీంద్రునిం గనుంగొని కృష్ణమూర్తి యెదుర్కొని వచ్చి యంజలిచేసుక యేమనుచున్నాఁడు,

గీ. అర్ఘ్యపాద్యంబు లాతిథ్య మధికభక్తి
నిత్తుఁ గైకొమ్ము మునివర్య, యిప్పు డాత్మ
యందుఁ గరుణించి రత్నసింహాసనమున
శుభము మీఱఁగ మీరు కూర్చుండవలయు.

వ. అనిన నారదుం డేమనుచున్నాఁడు.

క. నంద యశోదా నందన,
బృందావనవాస, సుగుణబృంద, వరమణీ
సందోహ ఖచితపీఠము
నందున్ గూర్చుండరయ్య యతివయుమీరున్.

వ. అనిన నిరువురు నాసీనులైన తదనంతరంబ నారదమునీంద్రుని జూచి కృష్ణమూర్తి యేమనుచున్నాఁడు:

క. సురమునివర, మీ రిటకును
అరుదెంచినమాత్రమునఁ గృతార్థుఁడ నైతిన్,
మఱి యితర చింతలేటికి
నరగున నాజన్మ మిపుడు సఫలం బయ్యెన్.

వ. అనిన కృష్ణమూర్తిని జూచి నారదుం డేమని కొని యాడుచున్నాఁడు.

చూ॥ శ్రీమద్వసుదేవకుల కలశ జలనిధిచంద్రం।
సకల సద్గుణసాంద్రం। సరసిజభవముఖ
సురనికర మకుట ఖచిత తరుణ తరణిశత
శతరుచి రుచిర మణిగణ ఘటిత చరణ కమలం।
అత్యంత విమలం। శ్రీవత్స కౌస్తుభ వనమాలికా
ద్యలంకృత విశాలవక్షస్థలం। కంసగజ కంఠీర
వాయమాణ భుజబలం। శంఖ చక్ర గదా
ద్యాయుధాలంకృత చతుర్భుజం।

వాహనీకృత ద్విజం। నిరుపమాన కృపారస
మకరంద బిందు సందోహ తుందిల నయనారవిందం॥
ఆనత ముచుకుందం। ఇందీవరశ్యామల శరీర
సజల జలధరాంతర విలసమాన తటిత్సమాన
పీతాంబరాలంకృత కటిప్రదేశం।
భక్తజన సంరక్షణావేశం। లీలామానుషవేషం
నవనీత మృదుల భాషం। త్వా మాలోక్య మమజన్మ
సఫల మద్యైవాభూత్॥

శ్లో. సకల సురకిరీట ప్రత్నరత్నప్రభాంచత్
పదకమల మరందీభూత గంగాప్రవాహం।
భుజబల జితకంసం చారుపింఛావతంసం
మధుర మధురభాషం భావయే గోపవేషం॥

వ. అని వినుతించి కుశలం బడిగెనట యెటువలెను.

ఉశాని॥ చాపు॥

శ్రీకరులైనట్టి మీకు మీసతులకు సేమమా శ్రీకృష్ణ।
ప్రాకటముగ బలభద్రాదులకును భద్రమా కృష్ణా॥
కోమలైనద్వారకా పురినిమీవారికిఁ గుశలమాకృష్ణా।
సమములేని మీదా సానుదాసులకు సౌఖ్యమాకృష్ణా
తోడఁబడి మిముఁగన్న తలిదండ్రులకును సంతోషమా॥
కృష్ణా॥

బడిబడి మీాబంధు బలగమ్ములకును భవ్యమాకృష్ణా॥
కనులపండువుగాను నీమూర్తి గనుగొనఁగలిగె
శ్రీకృష్ణా।
వినవయ్య త్రిశిరగిరీశ్వరు చెలికాఁడై వెలయు
శ్రీకృష్ణా॥

వ. అని మఱియు నేమనుచున్నాఁడు.

క. లోకములోపలి మర్త్యుఁడ
వే ! కనుఁగొనుపట్ల నాదివిష్ణుఁడవీవే
గాకను వేఱే గలరా !
శ్రీకర, కరుణాలవాల శ్రీగోపాలా !

కల్యాణి॥ లోకములోని మర్త్యుఁడవా మనవి
చేకో మహానుభావ శ్రీకృష్ణదేవ॥ లో॥
యజ్ఞకర్తవీవె యజ్ఞభోక్తవీవె
యజ్ఞరూపము నీవేయను మర్మము
సుజ్ఞానులకుఁ దెలియును మౌనివినుత స
ర్వజ్ఞ పురుషోత్తమ స్వామి శ్రీకృష్ణా॥ లో॥
స్నానసంధ్యానుష్ఠాన జపతపోధ్యానధారణాదు
లన్నియును
బూని మీాకృతముగాని వేఱె గలదా।
దీనావన దేవదేవ శ్రీకృష్ణా॥ లో॥

నీవాదివిష్ణువు నీసతిరుక్మిణీ-
దేవి మహాలక్ష్మిగ్ర త్రిశిరగిరి
దేవుని చెలికాఁడై తేజరిల్లిన నిన్ను
భావింపఁ బరతత్త్వము నీవె శ్రీకృష్ణా॥ లో॥

వ. అని కొనియాడి పారిజాతకుసుమం బొసంగఁ దలంచి యేమనుచున్నాఁడు.

చ. తిరముగ రాజుచెంతకును దేవునిచెంతకు నోజ్జచెంతకున్
వరుసఁగ రిక్తహస్తముల వచ్చుట ధర్మము గాదుగావునన్
ఉరుతర పారిజాతసుమ మొక్కటి దెచ్చితి నీకుఁగానుకఁగా
సరసత నీవు గైకొనుము సారెకు సజ్జన పారిజాతమా.

వ. అని పలికి నారదుం డొసంగిన కుసుమంబు గైకొని వినయ విస్మయ భరితాంతరంగుఁడై కృష్ణమూర్తి తనలోఁ దా నేమనుచున్నాఁడు.

ద్వి. నారదుం డిచ్చిన నందనోద్యాన
పారిజాత సుమంబు పరమాద్భుతంబు
ఇది రుక్మిణీమణి కిచ్చినయంత
మదిలోన వెతఁజెందు మఱి సత్యభామ.
ఇది సత్యభామకు నిచ్చినయంత
మదిలోన రుక్మిణీమణి వెతఁజెందు.
కాన నీసుమము నీగరితలలోన
నే నెవ్వరికి నిత్తు నిలువరంబుగను

వ. అని చింతించు హరి యంతరంగంబు దెలిసి నారదుఁ డేమనుచున్నాఁడు.

క. ఇందిరకుఁ గాక తక్కిన
యిందుముఖుల కమరకుసుమమిది యోగ్యంబే,
ఇందీవరాక్షి రుక్మిణి
యిందిరగాన్పునను నామె కిప్పింపవయా.

వ. అని పలికిన నియ్యకొని కృష్ణమూర్తి రుక్మిణీదేవిని జూచి యేమనుచున్నాఁడు.

దర్బారు॥ ఆట॥

దివ్యసుమము గైకోవే రుక్మిణీ నీవు।
దివ్యసుమము హాసిదెచ్చె నీకుయోగ్యమని-
భవ్యుఁడౌ త్రిశిరగిరి పతికర్పితమైన॥ దివ్య॥
కప్పుటొప్పు నెఱి కొప్పున నిప్పుడు
ఇప్పుడు నీవు ధరించినను।
మెప్పైన యానీల మేఘము చాటున
నొప్పు చంద్రబింబమో యన్నట్లుండేను॥ దివ్య॥

వ. అని పలికి యొసఁగిన పారిజాతసుమంబు ధరియించు కొని నీలమేఘముచెంగటి మెఱుంగు తెఱంగున హరిచెంత వెలుఁగుచున్న రుక్మిణీదేవిని జూచి కలహాశనుఁ డేమను చున్నాఁడు:

ద్వి. వినవమ్మ వేల్పుల విరిమహిమంబు
లనఘంబులై యుండు నదియెట్టులనిన
పౌలోమి పార్వతి పద్మజురాణి
యాలక్ష్మియును దాల్తు రది శిరంబునను.
నపులకు ధరియింప నలవియే కాదు.
హరికి బహిఃప్రాణ మాటచే నీవు
ఇరవొందఁగా నొక యిందిరవగుట
ధరియింప యోగ్యవు తామరసాక్షి !
నీవు దాల్చుటచేత నీకుసుమంబు
పావనంబయ్యెను బరమ కల్యాణి !

వ. అని మఱియు నేమనుచున్నాఁడు:

క. వాడదు కందదు వాసన
వీడదు పక్వంబు చెడదు వినుపుష్పాళిచేఁ
గూడి మనోహరమై కొని
యాడఁ దగిన కుసుమరాజ మంబుజవదనా!

సీ. రమణి, నీపతి నీవు రతి సేయు వేళల
ఘనతరోల్లాసంబు గలుగఁ జేయు
కడు రతిశ్రమచేతఁ బొడమిన చెమటలు
తొలఁగింప సురటినై మెలఁగుచుండు
నెలమి నే యే వేళ నేమికోరినఁగాని
యరసి యాయావేళ కది యొసంగు

కలనైనఁగాని నీచెలువుండు నీమాట
　　జవదాఁట కేయుండుఁ జంద్రవదన!
తరుణి, యీవిరి కొప్పునఁ దాల్చినంత
సవతులెల్లను నీపాదసరసిజముల
నాశ్రయింతురు సంశయ మనుచు లేదు
దీనిమహిమంబు లిట్లని తెలిసికొనుము.

గీ. సత్యభామయందు శౌరికిఁ బ్రియమంచు
భావమునను జాల భ్రమసి యుంటి;
దివ్యకుసుమ మిచ్చు దేవి, నీకొసఁగంగ
నీవె ముఖ్యమనుచు నేఁడు తెలిసె.

క. పతి తనకు వశ్యుఁ డనుచున్
బ్రతిదినము మదించు సత్యభామకుఁ జెలులీ
వెత మెఱిఁగించినఁ జూచిన
ధృతి వదలి మనంబులోన దిగ్భ్రమఁ జెందు

క. అప్పువ్వు నీవు ముడిచిన
నొప్పంగ నొకవత్సరంబు నుండును నీదౌ
కొప్పున; నటుతరువాతను
దప్పక యలపారిజాత తరువునకరుగున్.

వ. అని పలికి కృష్ణమూర్తి యనుజ్ఞ వడసి నారదుండు
త భామకును నీ సుమవృత్తాంతం బంతయుఁ జెప్పి యంత
ర్హితుండయ్యె. తదనంతరంబ.

మాలిని. సలిలనిధిగభీరా! శత్రుగర్వాపహారా!
సులలితగుణసాంద్రా! చోళభూమండలేంద్రా!
హలధరసిభకీర్తీ! యంచితోదారమూర్తీ!
విలసదమరసింహా! విక్రమాటోపసింహా!

ఇది చోళసింహాసనాధ్యక్ష భోసలప్రతాపసింహ రాజ పూర్వపుణ్య పరిపాకస్వరూప యమునాంబికా గర్భ శుక్తి మౌక్తికాయమానామరసింహ మండలాధీశ్వర నామాంకితం బైన మంత్రిమార్తాండ శివరాయమంత్రి కారితంబైన శ్రీమత్సు గంధి కుంతలేశ్వర కరుణాకటాక్షవీక్షణ సుధాసారసంజనిత చతుర్విధ కవితాసర్వాహక శాండిల్యగోత్రపవిత్ర కవిరంగ యార్యపుత్త్రి విద్వజ్జనవిధేయ మాతృభూతకవి నామధేయ ప్రణీతంబైన పారిజాతాపహరణ నాటకంబునందుఁ గృతిపతి నభివర్ణించుటయును, గణపతి వచ్చుటయును, దౌవారికుఁడు వచ్చుటయును, పార్వతీపరమేశ్వరులు వచ్చుటయును, భోజ కన్యకవచ్చుటయును, గొల్లభామవచ్చుటయును, కృష్ణమూర్తి వచ్చుటయును, రాధికామణి వచ్చుటయును, రుక్మిణీదేవి వచ్చుటయును, అష్టమహిషుల చెలికత్తెలు వచ్చుటయును, అష్టమహిషులు వచ్చుటయును, తదనంతరంబున నారదమునీం ద్రుఁడు వచ్చి కృష్ణమూర్తికిఁ బారిజాత కుసుమం బొసంగు టయు నను కథలఁ జెలంగు నిది ప్రథమాంకము.

# పారిజాతాపహరణము

## ద్వితీయాంకము

శ్రీమత్ప్రతాప సింహా ధ
రామండల రమణ పుణ్యరమ్యాకారా,
రామాభిరామ, సుజన
క్షేమంకరశీల, యమరసింహనృపాలా!

గీ. అవధరింపుము నీపేర నంకితముగఁ
బారిజాతాపహరణంబు బాగుమీఱ
నాటకముగాను రచియించినాను వేడ్క-
నెలమి నందు ద్వితీయాంక మెట్టిదనిన.

వ. ఇట్లు నారదుం డంతర్హితుం డైన యనంతరంబ వారి వారి సఖీజనులు తమతమ దేవేరులతో నీవృత్తాంతం బెఱిఁగింప నష్టమహిషులుం జింత నొందిరఁట యెటువలెను.

చ. వెతలను జెందె లక్ష్మణయు, విన్ననయయ్యె సుదంతి,
భద్రికున్
ధృతి చెడె, మిత్రవిందకు మతిభ్రమ పుట్టెను, సూర్య
పుత్రికిన్

హీనవని లేదు, జాంబవతి కేమియుఁ దోఁచదు,
సత్యభామ వే
వితముల నాదునెచ్చెలియు వేగను రాదని చింత
జేయుచున్.

వ. ఇట్లు చింతించి సత్యభామామణి కొలువుకూటంబునకు వచ్చుమార్గం బెవ్విధానసంటే.

ద్వి. వారిలో నన్నియు వాసియుఁ గలిగి
యారూఢి కెక్కిన యలసత్యభామ
కనకరత్నప్రభా ఖచితమై మిగులఁ
గనుపట్టుచున్న బంగరుమేడలోనఁ
బలుమాఱు చలువచప్పరములోపలను
జెలికత్తె లెల్లను జేరి కొల్వఁగను
నవరత్నఖచితమైనట్టి భూషణము
లవిరళముగఁ దన యంగంబునందు
నొనరంగ ధరియించి యుల్లాసముగను
వనిత యొక్కతె వీణ వాయించఁగాను.
మరకత మణిమయమగు చామరంబు
లిరువంకఁ దరుణులు ఎలమి వీవఁగను,
నామాంకితములుగా నవ్యగీతములు
కోమలాంగులు శ్రుతిగూడి పాడఁగను,

కపురంపుమడుపు లక్కజముగా నొక్క
చపలాక్షి నిండుముచ్చట నొసంగఁగను.
క్రొవ్విరి సురటులు ఘుమఘుమమనఁగ
నవ్యనజాతాక్షు లంది వీవఁగను,
జతి గతి భేదానుసరణి తప్పకను
అతివలు నెదుర నాట్యమ్ము లాడఁగను
దివ్యసుగంధముల్ దివ్యమాల్యములు
దివ్యాంబరంబులు దెఱఁగొప్పఁబూని
మరువంపు మొలక యామరు రామచిలుక
యరుదైన గజయాన యలలతకూన
యదనైన విరిదండ యపరంజికుండ
మదనుని చికటారి మంచిమిటారి
వలపుల సురతాణి పలుకీరవాణి
కళ లొల్కు నెఱజాణ కస్తూరి వీణ
సౌందర్యసరణి మేల్ జవ్వాది బరణి
కుందనంపు సలాక క్రొందేనెవాఁక
తళుకుటొయ్యారి సిగ్గా హొంతకారి
లలిత సద్గుణధామ లావణ్యసీమ
యల రతిదేవియో యనిన యందమున
మొలఁకువఁ దొలకరి మెఱుపు చందమున
నలరెడు వేడ్కతో నలసత్యభామ
కొలువుకూటము కడకును వచ్చెనంత.

## పాత్రప్రవేశము

వసంతము॥ అల్లదె వెడలివచ్చెను సత్యాభామ॥ అల్ల॥
అల్లదె వెడలివచ్చెను కలహంస నడలతోను
ఉల్లమలరఁ జెలు లూడిగములు సేయఁగాను॥ అల్ల॥
పలుకులఁ దేనెలొలుక బాగాముంజేతిచిలుక
కలకలమని పలుక కరుణ కనుఁగొనలఁ జిలుక॥ అల్ల॥
చెంగావి సరిగ చీర చుంగులు నేలజీర
శృంగారము దనరారఁ జెలియఁహొయలుమీఱ॥అల్ల॥
త్రిశిరగిరీశు చెలికాని తేటవ వెలపెట్టరాని
మిసిమిజీనికడాని మినుకు తొడవులఁబూని॥ అల్ల॥

వ. మఱియు నెటువలెను.

చూ॥ అహో ఖలు విధుబింబడంబర విడంబన
నిపుణ వదనవిలసిత దరహసిత చంద్రికా
ఝురాంతర పర్యటన్మీనాయమాన కర్ణాంతాయత
లోచనా। నిఖిల కలుష విమోచనా। నిజకపోలముకుర
ప్రతిఫల దతులిత వనజహితశత శతరుచి
రుచిర మణి నికర ఖచిత తాటంకా। వినత జనతావన
నిశ్శంకా। ముఖారవింద మకరందబిందు సందోహాస్వాద
నాగతేందిందిరాయమాణ ఘనాఘన నీల
ముఖావలంబి తాలకా। అతివిమల సుగుణజాలకా।
తనులతాంచత్ ఫలయుగళ విలసమాన కుచకలశ

పరిలిప్త కుంకుమ సంకుమద మృగమద ప్రముఖ
పరిమళ ఘుమఘుమాయమాన నిఖిల దిగంతరా!
ఆభోగ భోగ నిరంతరా। చాయతర హీరహార కేయూర
మంజీర కటక కంకణాది సకల
భూషణాలంకృత సర్వాంగ సుందరీ। అఖిల జగదీశ్వరీ
లావణ్యసీమా సత్యభామా నిజనికేతన స్వర్ణ
సౌధ వీధికాయాం అనర్ఘ్య దివ్యరత్న ఖచితసింహాసనే
సుఖాసీనా కృష్ణనామాంకిత పదాని గాయంతీ
అత్యంత విరహసాగర తరణిం శ్రీకృష్ణం మనసి
నిధాయ ధ్యాయతీ నిజమనోగతం పరితాపం
ఉపకంఠ పరివేష్టిత సఖీజనాన్ ప్రతి ఉవాచ.

వ. ఇట్లు సౌధాగ్రంబునకు వచ్చి చెలులను జూచి సత్య
భామ యేమనుచున్నది.

క. రావే మను చికటారీ
రావే ముద్దుల మిటారి రావె యొయారీ
రావే బలు చిన్నారీ
రావే నెఱహొంతకారి రావే నారీ.

క. హరి చెంత లేక చిత్తం
బిరవొందదు; అతని వద్దకేఁగిన చెలి యీా
వఱకుం గృష్ణుని తోడ్కొ-ని
మఱిరా దిఁక నేమిసేతు మదనతులారా!

సీ. నాప్రాణనాథుండు నన్ను దలంచితే
    ముక్కంటి కభిషేక మొనరఁజేతు
నామోహనాంగుండు నను జెట్టఁబట్టితే
    పరమాన్న మర్పింతు భానునకును
నా చెలువుఁడు వచ్చి ననుముద్దుపెట్టితే
    అంబ కఖండదీపంబు లిడుదు
నామనోహరుఁడు మిన్నఁగ నన్నుగూడితే
    శనివార మొక్కప్రొద్దైనసేయుందు
నిన్నివితముల దేవుళ్ళ కిపుడు మ్రొక్కి
తలఁచి వేఁడినచో నొక్కదైవమైనఁ
గోరిక లొసంగి కాపాడకుఁ డునొక్క
యేమి సేయుదు విరహంబు నెటులనైతు..

వ. అని మఱియు.

సీ. పడఁతిరో నాపతి పయనమయ్యేవేళఁ
    దోడిఁబడి యొక్కరైనఁ దుమ్మరైరి
వెలఁది, నావిభుఁ డిల్లు వెడలిపోయేవేళ.
    నెలతుకలొడ్డిఁబెట్టి నిలుసరైరి
కాంత, నా చెలువుండు గడప దాఁటేవేళ
    నించుఁబోఁడులు నడ్డగింపనైరి
కలికి, నాప్రియుఁడు వాఁకిలిదాఁటిపోవుచో
    "హరి! యెందుఁబోయెద?" వనకపోయి

రెన్నటికిఁ గందు! నా వెత లెప్పుడు డిందు!
ప్రాణవిభుఁడందు విమము నాప్రాణమిందు
ఇందు కేమందు హరిని బాసెట్టులుందు
వనిత, యెన్నఁడు గల్గునో వాని పొందు!

అని.

బృందావన సా॥ ఆది॥

సఖి సఖుని నన్ను గూర్పవే మకరకేతనునిభయము
దీర్పవే।
ముఖాముఖిగ శశిముఖిరమణుని సముఖానఁజేరి
సుఖింప రమ్మని॥ సఖి॥
రకంబుగను నన్నుబాసెనే దేవకీసుతుఁడు వింతచేసెనే।
యిఁకేమిసేతు వగకాని బలురాకకె- యెదురుచూచు
కొనుచు సొలసితి॥ సఖి॥
తలోదరికి వాఁడు దక్కెనే చింతలోన నామనసు
చిక్కెనే।
అంతలోన దానివలలోఁ దగిలి చెలులలోన రచ్చలకు
లోఁజేసెనిఁక॥ సఖి॥
తరతరము తెలియఁడాయెనే విభుఁడురాని
దిన మేమి సేయనే।
హరిహరీ విను త్రిశిరగిరీశ్వరుని సఖుఁడురాక
నన్నిటు పరాకు చేసెనే॥ సఖి॥

వ. నీ మగఁ డెటువంటివాఁడే యమ్మా. చెప్పెదనే అమ్మయ్యా.

శ్లో. హస్తౌ మాయూరబర్హం మృగమదతిలకం చారు లాలాటపట్టే
కర్ణద్వంద్వేచ తాళీదళ మతిమృదులం మౌక్తికం నాసికాయాం
హారో మందారమాలా పరిమళభరితః కౌస్తుభశ్చోప కంఠం
పాణౌ వేణుశ్చయస్య వ్రజయువతియుతః పాతు పీతాంబరో నః॥

వ. ఇటువంటివాఁడే అమ్మయ్యా, మఱియు నెటువంటి వాఁడే అమ్మా.

సీ. మత్స్యమై జలధులు మఱి కలంచినవాఁడు
ఇలఁ గూర్మమై కొండ నెత్తువాఁడు,
సూకరరూపమై క్షోణి మోచినవాఁడు,
నరసింహుఁడై దైత్యు నణఁచువాఁడు,
వామనరూపమై బలిని వేఁడినవాఁడు
భృగుపత్రై నృపతులఁ దెగడువాఁడు,
రాముఁడై దశకంఠు రహిని గెల్చినవాఁడు
బలుఁడై. ప్రలంబుని గెలుచువాఁడు,

నందు నింటను ఆనంద మందువాఁడు
బౌద్ధుల నడంచు బుద్ధుఁడై పరఁగువాఁడు
కలికి యాటకు మదిలోనఁ దలఁచువాఁడు
లీలఁ బదివేషములఁ దాల్చుమేలువాఁడు.

వ. ఇటువంటివాఁడే అమ్మయ్యా. మఱియు నెటువంటివాఁడే అమ్మా. చెప్పెదనే అమ్మయ్యా.

సీ. పుట్టి పుట్టకమున్న భువి విష్ణురూపంబు
తలిదండ్రులకుఁ జూపి తనరువాఁడు
కన్నులు తెఱువకమున్నె యాపూతన
చనుఁబాలు త్రాఁగి గ్రోలి చంపువాఁడు
నెలలు మూఁడైనంతనే శకటుని బట్టి
తనచిన్ని పదములఁ దన్నువాఁడు,
పేఁడాది బిడ్డఁడై యొలమిఁ దృణావర్తుఁ
డను రక్కసుని మదంబణఁచువాఁడు
బకునిఁ గంసుని మత్తధేనుకునిఁ దునిమి
యలకపాత్రియాన భూభార మొగిని దీర్చి
పార్థసారధి యనుచును వార్త కెక్కి
సకల భువనంబు లేలెడు చక్రధరుఁడు.

వ. కుమ్మరివాఁడా ! అయితే వాని పేరేమమ్మా. ఆ అమ్మయ్యా.

గీ. అవని నిల్లాంత్రి సభలలో నళుకు లేక
చెట్టఁబట్టిన విభుపేరు చెప్పరాదు;
అతని పేరేమటంచు నీవడుగరాదు;
దాన గుఱుతులు చెప్పెదఁ బూనివినుము.

వ. అయితే గుర్తులు వివరింపుమా.

శంకరాభరణము॥ చాపు॥

వానిపేరు చెప్పలేనే ఓవనితా గురుతు వివరించెదనే।
పూని త్రిశిరగిరి లోనవెలసిన యీ
శానుసకీస పాణ్ణి సఖుఁడైన చక్కని॥ వాని॥
శ్యామలవర్ణమువాఁడె తెల్ల, తామరకన్నులవాఁడె బల
రాముని కనుజుఁడై సోముని గెలుచు నె
మ్మోమువాఁడె మామ మామైమె మెఱయువాఁడె॥వాని॥
పిల్లంగోవి యూదువాఁడే నెమలి పింఛము సిగ
నమరువాఁడె।
అల్ల పాలు పెరుగు, చల్ల వెన్న నెయ్యి
కొల్లలాడి గొల్ల, పిల్లలకిచ్చినవాడె॥ వాని॥
మన్వంపు సొమ్మునివాఁడె పసిఁడి దువ్వటము
వలెవాటువాఁడె।
మువ్వురికిని ఆదిమూలమై శేషునిపైఁ
బవ్వళించినట్టి పరమాత్ముఁడగువాఁడె॥ వాని॥

వ. మఱియు నెటువంటివాఁడే యమ్మా. చెప్పెదనే అమ్మయ్యా.

సీ. నీలమేఘముడాలు డీలుగొల్పఁగఁజాలు
మెఱుఁగైన నల్లని మేనువాఁడు
మకరకుండల చకచ్చకలీను చెక్కిళ్లు
గలవాఁడు చిఱునవ్వు లొలయువాఁడు
దర చక్ర శార్ఙ్గ గదాద్యాయుధములచేఁ
గొమరొందు కరముల నమరువాఁడు
శ్రీవత్స కౌస్తుభాంచిత వక్షుఁడగువాఁడు
నెమిలిపించెము చూళి నిడినవాఁడు
తెల్లతామరలోయన నుల్లసిల్లు
కనులు గలవాఁడు మదనుని గన్నవాఁడు
మొలను బీతాంబరము దట్టి గలుగువాఁడు
వేణునాద విశారదుఁడైనవాఁడు.

ఇటువంటివాఁడే అమ్మయ్యా, అయితే వాని తలిదండ్రులు కులగోత్రములువినరింపవమ్మా.

గౌళిపంతు॥ ఆది॥

దేవకి వానితల్లి వసుదేవుఁడు తండ్రి।
భావమలర మేనమామ కావలెఁ గంసుఁడు॥ దే।
నందయశోదలు పెంచిన తల్లిదండ్రులు- వాని
కందమైన రాధామణి యత్తగావలెను॥ దే॥

గొల్లకులము వానికులము గోపవేషము।
అల్లబలరాముఁడు వాని కన్నగావలెను॥ దే॥
పరఁగు త్రిశిరగిరీశ్వరుఁడు బావగావలెను।
సారిదిఁ బ్రిద్యుమ్నుఁడు వాని సుతుఁడుగావలెను॥ దే॥

వ. ఆవృత్తాంతం బట్లుండనిమ్మ నీవెవ్వరమ్మా. అయితే చెప్పెదనే అమ్మయ్యా.

క. ధర సత్రాజిత్తునకున్
వరతనయను నేను సత్యభామను పేరన్
బరఁగినదానను; ఇప్పుడు
ఎఱిఁగించెద నీకు నావృత్తాంతంబున్.

ద్వి. ధరణి మాకంద్రీ సత్రాజిత్తునకును
దరణి యిచ్చిన శమంతకమణి యంత
హరి తన కిమ్మన్న నతఁడియ్యకంట
హరువుగాఁ బెట్టుండ నాప్రసేనుండు
అడవికిఁ గొంపోవ నప్పుడు సింహంబు
వడి నాప్రసేనుని వధియించి మణిని
జవముగాఁ గొనిపోవ జాంబవంతుండు
గవిసి సింహంబును ఖండించి మణిని
ఆతఁడిఁ గొనిపోయి యర్మిలి నున్న
కూఁతుని తొట్లకుఁ గొమరొప్పఁగట్టె.

అప్పుడు సత్రాజిత్తుఁ డాత్మసోదరుఁడు
ఇప్పుడిట రాఁడాయె నేమొకో చెల్ల!
శ్రీకృష్ణుఁ డిది మాయచేసెఁ గాఁబోలు!
కాకున్న నొరులచేఁ గాదని యెంచె.
అంతఁ గృష్ణుఁడు నదియంతయుఁ దెలిసి
యెంతేని వెలుఁనడి యిలఁబడి మిగుల
నడరి మృగేంద్రుని నట పొడగాంచి
తొడరి యా జాంబవంతుని గెల్వ నతఁడు
మణియును గన్యకామణి హరికీయ
మణి మాధవుఁడు తెచ్చి మాతండ్రికీయ
మాతండ్రి గురుతరమణియును నన్ను
ఖ్యాతిగాఁ గృష్ణున కర్పించె నంత,
భామలలో సత్యభామ నాపేరు,
మామక వృత్తాంత మది యిది సుమ్మి.

వ. అయితే నీయత్తమామలపేరు వివరింపుమమ్మా.

గౌళిపంతు॥ ఆది॥

దేవకి మాయత్త వసుదేవుఁడు మామ!
ఠీవి మీరఁగాను బావగానలెను బలభద్రుఁడు॥ దే॥
తోడపహా రేవతి నాదు తోడికోడలు।
నాకెపు రుక్మిణిదేవి సవతిగాలెను॥ దే॥

చక్కని ప్రద్యుమ్నుఁడునా సవతికొమరుఁడు।
మక్కువమీఱ యోగ మాయ మాపనినె॥ దే॥

తిరముగాను దనకు రతిదేవి కోడలు।
మఱి త్రిశిర గిరీశ్వరుని మఱఁది నావిభుఁడు॥ దే॥

వ. అయితే ఆవృత్తాంతం బట్లుండనిమ్మా. కృష్ణమూర్తి నీకేమిగావలెనమ్మా? చెప్ప సిగ్గయ్యేనే అమ్మయ్యా. గంపెడు సిగ్గులోఁ బిడికెఁడు సిగ్గు పోతేపోనీ చెప్పవమ్మా. అతఁడు నాయత్తకొడుకే అమ్మయ్యా. అతఁడు నా బావకు తమ్ముఁడే అమ్మయ్యా. అతఁడు నా బావకు మఱఁదికి సందువాఁడే అమ్మాయ్యా. అతఁడు నా చెలికాఁడే అక్కయ్యా. అతఁడు నా మామ కుమారుఁడే అమ్మయ్యా. అతఁడు నా మగఁడే అమ్మయ్యా

వ. అయితే ఇంతసేపు తెరమఱుఁగున నున్నావు. ఈవలకు రావమ్మా.

ద. ఆనందభైరవి॥

నేతాళలేనే భామా। వాఁడేలరాఁడే భామా।
మదనసదనమున ముదమలరఁగఁ బవ
నొదవఁగఁ జేసిన సదయునిఁ బాసి॥ నే॥

ఎలమిఁ ద్రిశిరగిరి నిలయుని సఖుఁడగు
అలగోపాలుఁడు చులుక చేసెనిఁక॥ నే॥

సీ. సిగవాడు విరులతోఁ జిటులుగందంబుతో
బూసిన జవ్వాది పూఁతతోడ
మోవిగాయంబుతో మొనగుబ్బపోటుతోఁ
బసుపు దుప్పటి వల్లెవాటుతోడ
నిద్దురమబ్బుతో నిండుతెబ్బిబ్బుతో
నురమునఁ గుంకుమ కురులతోడ
దొంతరవిడెముతోఁ దుదఁ జిక్కు-సరులతో
మోమున లత్తుకముదరితోడ
వీపునను దద్దులగు జడవేటుతోడఁ
గులుకుఁ జెక్కు-లపైఁ గోటిగంటుతోడ
నరయ నావాఁకిటికి వచ్చినట్టిహరిని
ముదిత, రావద్దు పొమ్మని మోసపోతి.

వ. అని మఱియు నేమనుచున్నది.

పున్నాగవరాళి॥ తాళఁ జాలనే యోయమ్మ॥
తాళఁజాలబాళితో గోపాలుఁడిందు రాకయుం డే॥ తా॥
దానిమాయలకె లోనాయెనె నాపాలి!! దైవమెంతో
పగదాయెనె॥
మానవతి వానిమోవి పానకము లానకనే ॥ తా॥
ఇంతి వానిమనసు విఱిచెనే శ్రీత్రిశిరగి-రీశసఖుడు
నన్నుమఱచెనె। పంతమున వింతచేసి కెంతు
జారివంతు చేసె॥ తాళ॥

వ. అని మఱియు నేమనుచున్నది.

సీ. కటి తట విలసిత కనకదుకూలంబు
గరిమ విద్యుల్లత కరణిగాఁగ,
పూళి సంశోభిత మాయూరపింఛంబు
ప్రకట బలారి చాపంబుగాఁగ
మోహనకర దివ్యమురళీనినాదంబు
డంబైన ఘనగర్జితంబుగాఁగ
కరుణాకటాక్ష వీక్షణ సుధారసధార
లతులిత నిబిడ జలంబుగాఁగఁ,
దనరుచున్నట్టి కృష్ణాభిధాన మహిత
నీలమేఘంబు గోపికానికర నృత్త
కుచగిరులమీఁద విహరించుకొనుచు వేడ్క
నెందు వసియింపుచున్నదో యెఱుఁగరమ్మ.

వ. అని మఱియు నేమనుచున్నది.

పున్నాగవరాళి॥ ఏమని తాళుదు నమ్మా।
ఓయమ్మలారా॥ ఏమ॥
ఏమని తాళుదు నన్నెడఁబాసి నావిభుఁడు.
ఎవతె యింటనో యున్నాఁడమ్మా- ఓయమ్మలార॥ ఓ॥
మోడిచేసుకొన్నాఁడమ్మా ఓయమ్మలార।
మోడిచేసుకొన్నాఁడు మునుపటివలెఁ గాదు।

ముదిత మందు తలకెక్కెనమ్మా॥ ఓయమ్మ॥
తెలవ నేనేమందునమ్మా అమ్మక్కచెల్ల!
తెలవ నేనేమందుఁ ద్రిశిరగిరీశుసఖుఁడు
మఱచి యిందు రాకున్నాఁడమ్మా॥ ఓయమ్మ॥

వ. అని మఱియు నేమనుచున్నది.

సీ. వగలాడి వేసినవలను జిక్కినవాఁడు
ఇటకురా నేర్చునా యింతులార!
పాపంబు చేసిన పాపాత్మురాలికి
దక్కునా యలవాఁడు భామలార!
దైవంబునకు నేమి దయతప్పియుండెనో
చలమున సాధించె సకియలార!
వాననఁ బనియేమి వనితపెట్టినమందు
మాయచేసినదింత మగువలార!
ఇంత కెడమాయె విధివశంబేమిసేయ
మనుఁడనెడు బోయ యెదదూయ శరము లేయ
వేగ ననుడాయరాఁడాయె విభునిమాయ
లేమొ తెలియంగ రాదాయెనేమిసేయ!

వ. అని యిట్లు సత్యభామ అత్యంత విరహతాపపీడితయై
చెలులం జూచి యేమనుచున్నది.

వ. చెలి యిట కేలరాదు? హరిచెంతకు నేఁగెనో
యూరకున్నదో!
చెలువునితోడ నాదువెత చెప్పెనో! వాఁడు పరాకు
చేసెనో!
వలపెటు సైఁపనేర్తు! వలవామవిలోచన పెట్టు మందుచేఁ
బలుకదొ! లేకయున్న వలభామిని గ్రక్కున రాక
యుండునే!

వ. మఱియు నేమనుచున్నది.

ఆనందభైరవి॥ ఆట॥

ఏల రాదాయెనే యిందాఁక చెలి యేలరాదాయెనే।
ఈలాగురానందు కేమికారణమో గోపాలునివద్దకుఁ
బంచిన చెలియిప్పు॥ డేల॥

చెలువునివద్దకుఁ జెలిచేరదాయెనో- చెలి చెప్పినసుద్ది
చెవియొగ్గివినఁడో। తలిరుఁబోఁడి యిందుకు తచ్చన
చేసెనో- పాలఁటిరో యీమర్మ మెలమిఁ దెలియ
లేను॥ ఏ॥

శ్రీరుక్మిణికి నెఱచి హరిప్రేమదాఁచెనో
తీరని నావెత తెలియకున్నాఁడో।
సారెకు నాచెలిని సద్దసేయలేదో!
సాగసాక్షిరో యీజాడ తెలియలేదు॥ఏ॥

సందడిలోఁ దెలుప జడిసి యూరకున్నదో।
కందర్ప జనకుఁడు కపట మెంచినాఁడో।
ఇంతటిలో త్రిశిరగిరీశు నెచ్చెలియా గో-
విందుని కడకేఁగు నెలఁది యీనటకు॥ ఏల॥

వ. అని యిట్లు పంచబాణ బాణపరంపరా సంఘట్టన సంజాత దురంత నిరంతర చింతాభరాక్రాంత స్వాంతయై చెంతనున్న మదమత్త దంతావళియానలతోఁ దాను స్వప్నంబుగన్న వృత్తాంతం బెఱిఁగించెనఁట యెటు వలెను.

ద్వి. తెలివరో నిన్నరాతిరి కలగన్న
తెఱఁగెల్ల నీకునేఁ దెలిపెద వినుము
విపులపానుపుమీఁద వేడుక మీఱ
నరవి నేనిదురించు సమయంబునందు
నాప్రాణనాథుఁడైనట్టి కృష్ణుండు
తా ప్రసన్నత చెంది దగ్గఱ వచ్చి
నీసవతైనట్టి నెలఁత రుక్మిణికి
నాసుమ మిచ్చితి నని వెత చెంది
చిన్నపోవఁగనేల చిక్కఁగ నేల
నన్ను దూఱఁగనేల నలినాయతాక్షి!
ఆయింద్రలోకంబునకునైన నేఁ బోయి

సూయింద్రుని జం౦చి యాపారిజాత
వృక్షంబు పెఱికించ్చి వేగమె తెచ్చి
యీక్షణంబునను నీయింట నుంచెదను.
అని బుజ్జగించి చయ్యన కౌఁగిలించి
నునుజెక్కులను గోట నొక్కి ముద్దాడి
యరవింద సమమైన హస్తంబుచేత
మెఱుఁగు బంగరుచాయ మేనట్టె నిమిరి
కపురంబు మడుపు లక్కఱమీఱ నొసఁగి
యుపమతో రతికేళి నొగి నోలలాడి
నన్ను మెచ్చినయట్టి నాప్రాణ విభుని
గన్నులు చల్లఁగాఁ గనునంతలో నె
నిద్దుర మేల్కాంచి నెమ్మితో నాదు
వద్ద నున్నట్టి గోపాలుని వెదకి
కానక వెఱచెంది కడువిస్మయించి
పూని యింటను మూలమూలలఁ జూచి
యలసితి సొలసితి హా యేమిసేతు !
మెలఁత యీయాశ్చర్య మేమందునమ్మ.

వ. అని మఱియు నేమనుచున్నది.

ఘుంట॥ కలగంటినమ్మా అమ్మలార॥ కల॥
కలగంటినమ్మ చక్కని కృష్ణదేవుఁడు।
కిలకిల నవ్వుచు వలుదగుబ్బలు పట్టి।
నెలవంకలనుంచి జిలుఁగువలువదూసి

కళలంటి సొక్కించి కలసిమెలసినట్లు॥ కల॥
మక్కువ మీఱఁగ దక్కించుకొని దక్కి
పక్క మచ్చికచేసి పుక్కిటు విడె మూని।
చక్కని నునుతొడ లెక్కసక్కులు చేసి
చొక్కమైన కెంపు ముక్కర కిచ్చినయట్లు॥ కల॥
మచ్చికతోఁ జేరవచ్చి మాటికిఁ దమి
హెచ్చి యెన్నో బాస లిచ్చి మిక్కిలి పచ్చి।
పచ్చి వగల నీవె నచ్చితివని మెచ్చి
మెచ్చి కౌఁకిటఁ గదియ గుచ్చినట్లు నేను॥ కల॥
శ్రీమ త్త్రిపురగిరి ధాముని చెలికాఁడు
రామ, నిన్నటిరేయి నామీఁద దయయుంచి
వేమాఱు సరసత మోము మోమునఁ జేర్చి
నామోవి పానకము ప్రేమఁ గ్రోలినయట్లు॥ కల॥

వ. సుస్వప్నంబు తెఱంగెఱింగించి తదనంతరంబు దుస్స్వప్నంబు గన్న తెఱం గెఱింగించెనఁట యెట్లన్న.

సీ. మగువరో రుక్మిణీమణితోడఁ గృష్ణుండు
హంసతూలిక నూఁగులాడినట్లు
కలనైన నిను బాయఁగాఁ జాలననుచును
జెలువుఁ డామెకు బాస చేసినట్లు

కాంతను గృష్ణుండు గౌఁగిటఁ గదియించి
సరససల్లాపముల్ సలిపినట్లు
రమణుని నేఁ బిల్వ రాను పొమ్మనుచును
మించి నేను నిరాకరించినట్లు
పక్కమచ్చికలను దానిపక్కచేరి
చొక్కి చొక్కించి చక్కని చెక్కు నొక్కి
సవతితోడను రతికేళి సలిపినట్లు
నిన్నరాత్రి కలఁగంటి నేమిసేతు!

వ. అని యిట్లు సత్యభామామణి దుస్స్వప్నవృత్తాంతంబు చెలులతోఁ దెలుపుచున్న యవసరంబున నపశకునంబులు గనిపించినఁ జెలులతో నేమనుచున్నది.

కాంభోజి॥ ఆది॥

వలకన్నదరె నేమిసేతు వనితా ధూర్తగోపాలుఁడే।
జలజాక్షిని జూచి కనుసన్న చేసెనో।
దక్షిణభుజమదరెనే దక్షిణనాయకుని నాపైఁ
గక్షగట్టి యొవతె బిగియఁ గౌఁగిలించెనో॥
మాటికిఁ జెలియలతోన మాటాడ సైఁపనెవ్వతెతో
మాటికి మనసిచ్చి విభుఁడు మాటలాడెనో।
ఏమొ!. నాదు తోడలదరె నీకేమిసేయఁగలదాన

రాఁడే మందయానను నొడపైనిడి ముద్దాడెనో॥
సారసాక్షి త్రిశిరగిరీశ్వరుని సఖుఁడైనకృష్ణుఁడు
ఆరుక్మిణి మాయలకే యట లోనాయెనో॥

వ. అని యిట్లుపశకునవృత్తాంతంబు చెలులతోఁ దెలుపు చున్న యవసరంబునఁ గృష్ణమూర్తి నద్దకుఁ బోయినచెలికత్తె వచ్చెనఁట యెటునలెను.

తోడి॥ చెలికత్తె యదె వచ్చెను॥ చె॥
చెలునైన త్రిశిరగిరి నిలయుని సఖుఁడైన
శ్రీకృష్ణదేవుని చెంగటికిఁ బోయిన॥ చెలి॥
ఏమని యచటివార్త యిందీవరాక్షికి।
వేమఱు దెలిపెదనని వెఱచుకొనుచును।
మోము చిన్నచేసుక ముదిత తడఁబాటుతోను
గోమలాంగైన సత్యభామామణివద్దకు॥ చెలి॥

వ. ఇట్లు వచ్చిన చెలికత్తె సత్యభామతో నేమనుచున్నది.

జుజావంతి॥

ఏమని వివరింతునె వానిగుణము లెంతని వర్ణింతునె।
ఆమునిముచ్చు మాయలఁ దగిలి కృష్ణుఁడు
ఏమేమొ కపటము లిపుడు నేర్చుకొన్నాఁడు॥ ఏమ॥
తచ్చన లోకచోట నెన్నఁడులేని దండన లోకచోట।
మచ్చకంటిరో తెల్లనివెల్ల పాలని
మది నెంచుకొంటివా మాయకాని వగలు॥ ఏ॥

చనవు రుక్మిణియందు నెంతో వంచనలెల్ల నీయందు।
మునుపటివలెఁ గాదు నల్లని మగవారి
ముదితరో కలనైన నమ్మరాదు నే॥ నే॥
శ్రీశిరగిరీశుసఖుఁ డింతవాఁడని తెలిసెనమ్మా నేఁడు॥
వశముచేయఁ దలఁచి వద్దచేరినందుకు
అసమిచ్చెఁడాయె నీయన్యాయము గలదా॥ ఏ॥

వ. అని మఱియు నేమనుచున్నది.

ఉశాని॥ ఆట॥ చాపు॥

దివ్యకుసుమము నారదుఁ డత్యద్భుతముగాఁ దెచ్చె నమ్మా।
భవ్యుఁడైన గోపాలునికిఁ గానుకగా నిచ్చెనమ్మా।
వసుదేవతనయుఁడు రుక్మిణికా కుసుమ మొసఁగె నమ్మా।
ఒసఁగిన యంతనె రుక్మిణి కొప్పున ముడిచె నమ్మా॥
సవతులు నీసేవకులని పలికి ముని చనియె నమ్మా।
కువలయాక్షిరో యింతింతని తెలుపఁగూడదమ్మా॥
శ్రీశిరగిరీశ్వరుని చెలికాని వంచన తెలిసెనమ్మా। దివ్య-
కుసుమము రుక్మిణి ముడిచి సంతోషానఁ గులికె నమ్మా॥

వ. అని యిట్లు కృష్ణదేవునివద్దకుం బంచిన చెలికత్తె వచ్చి యచ్చటి వృత్తాంతం బంతయు సవిస్తరముగాఁ గలయఁబలికిన పలుకులు ములుకులై తోఁపఁ గలఁకఁబాఱి కోపాటోపంబునఁ గనుబొమలుముడివడఁ జికిముడిపాటుతో వెడవెడఁ దలయూఁచి నాసాగ్రంబునఁ గరాంగుళి నిడుకొని కనులఁ గెంపుల సంపదలు బాలారుణచ్ఛాయల ధిక్కరింప నుస్సు రుస్సురని నిట్టూర్పులు నిగుడించుచుఁ బెదవు లదర నింధనంబు గోలుపోయిన నిఱుపేదచందంబున దిక్కులు విదిక్కులు బ్రమసి చూచుచుఁ గొంతతడ విట్టుండి ధైర్యం బవలంబించి తెలివి తెచ్చుకొని “కటకట! నామనోవల్లభుండైన శ్రీకృష్ణదేవుండు మునిముచ్చు మాయలం దగిలి ముని యిచ్చిన కుసుమంబు ఘనతఁ జేసి నన్నెంత లేదని యెంచక నాసవతియగు రుక్మిణి కొసంగి యచ్చిన్నబున్న జడదారి యాడిన మాటలకు సమ్మతించి తన్ను సడ్డసేయఁ”డని యతికోపంబున విరహతాపంబునఁ దలంచి తలంచి, పంచశరు మదహస్తి విడివడిన తెఱంగున మరుని బాణంబుకై నడి సత్యభామ కృష్ణమూర్తివద్దకు వచ్చి కోపావేశంబున నేమనుచున్నది.

మ. అకటా! నీవిటువంటినిర్దయుఁడవై యానాటి మర్యాదలెం
చక నన్నింత పరాకుచేసి మునిముచ్చిచ్చినట్టి యానారదుం
డొక పూవీయఁగ రుక్మిణీమణికి నీవున్నిచ్చి యచ్చోట మ
చ్చికలున్ జేయుచు నన్ను వచ్చనలుచేసేవేమి గోపాలకా!

వ. అని పలికి రారా కృష్ణా యని చెట్టఁ బట్టఁగా రాసఁ భామా యని విదళించఁగా నప్పుడు సత్యభామ స్వామిఁ జూచి యేమనుచున్నది.

ద్వి. ఇంతటి కపటంబ దేమిరా నీకు!
వింత చేసెద వెంత పిలిచిన రావు,
ఏ చెలి చెప్పెరా యీబుద్ధి నీకు!
ఏచాయ హితవుగా నేమి విన్నావు.
చెలువుఁడా! నీకు నేఁ జేసిన మేలు
తలపఁగ నేరమై తాఁదోఁచెనేమొ!
అవనికెల్లను జల్లనైన చందురుఁడు
జవరాండ్రి పాలిటి శత్రుడైనట్లు
నీవు నన్నేఁచుట నీకింకఁ దగదు
నావద్దకును రార నాప్రాణనాథ!

వ. రారా కృష్ణా! అనిన స్వామి కోపావేశుఁడై యేమనుచున్నాఁడు.

సీ. మంతనంబునకు సుదంత నాకుండంగఁ
గ్రీడసేయుటకు రుక్మిణియు నుండ,
సతిప్రేమగల జాంబవతి చెంతనుండంగ
నందమై తగు మిత్రవిందయుండ

లాలించి తేలించ లక్ష్మణయుండంగ
భద్రి పల్మలు పక్కఁ బాయకుండ
యోథయై రతిసేయు రాధ చెంగట నుండ
మందయానైన కాళింది యుండఁ

జెలఁగి పదియాఱువేవురు చెలియలుండ
నీవునేపాటి దానవు నీసనెంత
కోపగించెదు, రుక్మిణి కోపకత్తె
చాలుఁ జాలును నీపేరిమ సత్యభామ.

వ. అనిన సత్యభామ యేమనుచున్నది

ఉ. ఎక్కువ రుక్మిణొక్కతె యేనొకతింతియ కానియెన్నచోఁ
దక్కినవారు చిల్లరలు దానవమర్దన, వారితో ననున్
మిక్కిలి సాటిసేయుచును మేలి మొఱుంగనివానిరీతి న
న్నెక్కువ మాటలాడెదవు; ఇంతులువిన్నను నిన్ను నవ్వరే!
వ. అనిన స్వామి యేమనుచున్నాఁడు.

ఉ. చిల్లరలంచు వారలను జెప్పఁగ శక్యమె సత్యభామ, నీ
యుల్లమునందు నీవు బహుళోన్నతురాలవటంచు నందఱిన్
చిల్లరలంచు నెంచెదవు! చెన్నుగ నాచెయి పట్టువారలున్
జిల్లరవార లౌదురొకో! సిగ్గొకయించుక లేదె కోమలీ!

వ. అని యిట్లు నిరాకరించి స్వామిపలికినఁ బ్రియవాక్యం
బుల నేమనుచున్నది.

నీలాంబరి॥ ఆది॥

కోపమేల చేసేవురా గోపాలా విరహ
తాపమున నేఁగఁ జాలర గోపాల।
పాపజాతి మునిచేత గోపాల నన్ను
బట్టి యపస్వరింపవలదు గోపాల।
నిన్ను బాసినది మొదలు గోపాల నా
కన్నులకు నిదుర రాదు గోపాల।
వెన్నెల చిచ్చునకు నేను గోపాల మిగుల
సన్నమాయెఁ దాళఁజాల గోపాల।
త్రిశిరగిరీశు సఖుఁడైన గోపాల రతుల
దేలించి నన్నేలుకోర గోపాల॥

వ. రారా కృష్ణా! రాని భామరా. అనిన సత్యభామ కోపాన నేమనుచున్నది.

సీ. మధురవాక్యములు చూచి మదిభ్రమసితిఁగాని
కపటవర్తుఁ డీవని యెఱుఁగనైతి;
సొగసుఁ డంచని నిన్నుఁ జాల నమ్మితిఁగాని
నిర్గుణుండవటంచు నెఱుఁగనైతి,
దయవాఁడ వంచును దలఁచియుంటినిగాని
యెంగిలి ముచ్చని యెఱుఁగనైతి.
సరసుండ వంచని సరసఁ జేరితిఁగాని
స్త్రీ ద్రోహివనుచును దెలియనైతి,

జార! చోరుఁడ! నీ యింద్రజాలమెల్ల
జాలఁ దెలిసెను నీమదిఁ జల్లనాయె.
అమ్మ నేఁజెల్ల! మగవారి నమ్మవశమె!
యేల యింతపరాకు గోపాలకృష్ణ!

వ. రారా కృష్ణా! రానే భామా! అనినఁ బరస్పరమేమను చున్నారు.

ఘంట॥ ఆది॥

అలివలలో నను జౌకసేయవలదంటే గోపాలా।
గతమిడి దయగలవాఁడవునీవు గావుర గోపాల॥
దయగలవాఁడవు గావని పలుకఁగఁదగునె సత్యభామా।
నయ మొనరించక దయ గలుగునఁటే నాతి,
సత్యభామా।
గొల్లవాఁడ వీవే మెలుఁగుమువిఁక కొమ్మల మరియా
అల్లిబిల్లిగా నుండక నాతో సహాసహమును వాదా॥
మగనిచెంత గయ్యాళితనంబే మగువకైనఁ దగునా।
తెగువతోడ మోమోట లేక నను దెగనాడఁగఁదగునా।
. రమ్మని పిలిచిన యంతటనే నేరము లెంచేవేరా।
యెమ్మెకాఁడ, త్రిశిరగిరీశ్వరు సఖ, యిఁకనైనను రారా।

వ. రారా కృష్ణా! రానే భామా! అని పలికి యదుకృష్ణుఁ డైనఁ గానక సత్యభామ తనగృహంబునకు మరలి వచ్చి చెలికత్తెలం జూచి యేమనుచున్నది.

సీ. తెఱవ, నావిరిశయ్య దిగకయుండినవాఁడు
చెలువకు శుశ్రూషసేయఁ బోడఁగె;
రమణి, నాయాజ్ఞ మీఱకయె యుండినవాఁడు
కాంతకు జడఁబూలు కట్టసాఁగె
కలనైనఁ గాని నాగడప దాఁటనివాఁడు
ఉవిద వాఁకిలిఁ గాచి యుండఁదొడఁగె
పడఁతి నాయురముపైఁ బవ్వళించినవాఁడు
లేమ చెంతను సంచరింపఁదొడఁగె
ఉపచరించిన నాయందుఁ గపటమెంచి
ముదితచేయు తిరస్కారమునకుఁ జిక్కె,
దాని బిగువేడ! తానేడ! తలఁచిచూడ
గొల్లబుద్ధికి నేముందుఁ గొమ్మలార!

వ. అని మఱియు నేనునుచున్నది.

సీ. వనములో సంచార మొనరించు వానికి
మేలైన బంగారు మేడగల్గెఁ
బసులకాపరియైన బలుగొల్లవానికి
వెలలేని భూషణావళులు గలిగె,
మఱి దొంగిలించుచుఁ దిరుగాడువానికి
నెల్లలోకంబులు నేలఁ గలిగె
సడరి ఱోటను గట్టువడి యున్నవానికి
హంసతూలిక నూఁగులాడఁ గలిగె

నన్ను బెండ్లాడినది మొదలిన్నిభోగ
భాగ్యములు గల్గుటెంచక పసుపు లేక
మఱచి యలరుక్మిణీమణి మాయఁదగిలి
నాకను బరాకుచేసెఁగా రమణులార!

వ. అని మఱియు నేమనుచున్నది.

ఘంట॥ ఏమిసేతు నెట్లుసైఁతు నీమోహమే నెట్లు
రామరామ రామ యింతచలమా। (శ్రీ)త్రి(శిరగిరి-
ధాముని కిందున ఘలమా॥

దిట్టముగఁ జిన్ననాఁడె చెట్టఁబట్టి మెడను బొట్టు
గట్టి పెండ్లాడినది మఱచెనో। ఓయమ్మలారా
రట్టడి సేయఁగఁ దలఁచెనో॥

నీటైన నాకనులఁ గొనగోట, జూ మవగలుచేసి
కాటుక దిద్దినది మఱచెనో। ఓయమ్మలార
బోటి యెవతె మనసు విఱిచెనో॥

ఉరమైన గబ్బిగుబ్బల నదిమి చిదిమి గోరులుంచి
కదిసి పట్టినది మఱచెనో। ఓయమ్మలార
మదను పాలు సేయఁ దలఁచెనో॥

నేను నిన్ను మాననని తేనెమోవి పానకము
లాని రుచిచూచినది మఱచెనో। ఓయమ్మలార
దాని బోధనలకె వెఱచెనో॥

తక్కుల చొక్కుల నన్ను నక్కునఁ జేరిచి చెక్కిలి
నొక్కి ముద్దాడినది మఱచెనో। ఓయమ్మలార
చిక్కుఁ బెట్టఁగఁ దలఁచెనో॥
మదను సదనమునంటి పదనుచేసి రతికేళిని
మొదలు గలసినది మఱచెనో। ఓయమ్మలార
మదనతి యాజ్ఞలో నిలిచెనో॥

వ. అని మఱియు నేమనుచున్నది.

శ్లో. మోహాంభోనిధి తారణాయ సుదృఢాం కృష్ణాభిధా
నాంతరం
తాం సంగృహ్యా కరస్థితాంచ కుసు మే పాణిప్రియే
హే సఖి.
ఏతస్మిన్ ప్రకటీ కుసుమ్య సమయే కౌశల్య మత్యాదరాత్
ఇత్థం త్వం నకరోషి చేన్మమతినా పాణిః కథం తిష్ఠతి॥

సీ. కాంతుండు నాసోయగము చూచునేగాని
యితరంబుఁ జూడఁడే యింతులార!
రమణుండు నామందిరమున నుండు నె కాని
పొరుగిండ్ల కేఁగఁడే పొలఁతులార!
పతి నాదు పక్కను బాయకుండును గాని
యన్యుల డాయఁడే కన్యలార!
చెలువుండు నాతోన జెలిమి సేయునుగాని
పరులకు నసమీఁడె పడఁతులార!

ఇట్టి పారిజాతేశ్వరుండు నియ్యెడఁ బరాకు
చేసి యెడఁబాసి విరహవారాశిఁ ద్రోసి
యిది వఱకు రాకయున్నవాఁ డేమిసేతు
నయ్యయో! యింతయున్నాఁడు మనసుగలదె!

పరజు॥ ఆది॥

గోపాలునిఁ జూపరే యో కొమ్మలార విరహ
తాపము లెడఁబాపరే యో తరుణులార।
ఏమోవింతచేసినాఁడె యింతులార యిప్పుడు
ఆమర్మము తెలియదె యో యమ్మలార।
సకల గుణాభిరాముఁడె యో జాణలార యే
సకి యింట నున్నాఁడో తెలియదు సకియలార।
ఎవతె మందులోఁ దగిలెనో యువతులార సు
వివరించి నాతోడఁ దెలుపరె నెలఁతలార।
తామసము సేయఁదగదు భామలార నా
స్వామి శౌరిని జూపరే వనితలార।
త్రిశిర గిరీశ్వరు చెలికానిఁ దెఱవలార మీరు
అసమానుని గానరె ఓయమ్మలార।

వ. అని మఱియు నేమనుచున్నది.

శా. నన్నుం గన్నడ చేసి పాసి విభుఁ డేనాతింట
నున్నాఁడో! నా
కన్నార న్నతనిం గనుంగొనుటకే కర్వాయెఁగాఁ!
గృష్ణునిన్
ఎన్నాళ్లంచును జూడకుందు! నతని న్నే నెట్లుపాసుందునే!
వెన్నుం డైన మురారి శౌరి నిపుడున్ వేగంబుగాఁ జూపరే!

శా. ఆమోమందము నావెడందయురము న్నామందహాసం
బునున్
ఆమిన్నైన తగు మోహనాకృతియునున్ ఆముద్దు పాదంబు
నున్
ఆమాధుర్యము లొల్కు ముద్దుపలుకుల ఆదివ్యసౌందర్య
మున్
ఈముల్లోకములందు లేదనుచు నేనెందైనఁ జాటించెదన్.

ద్వి. పచ్చమంజి ముత్యాల యొంట్లు దీపింప
వరకిరీటద్యుతుల్ వన్నెలు చూప
శ్రీవత్స కౌస్తుభాంచిత వక్షు మలర
నావేళ్ళ మణిముద్రికావళి మెఱయ
కరుణారసంబు చూడ్కుల దీపింపఁ
దెఱఁగొప్ప కస్తూరి తిలక మింపెసఁగఁ
బరిమళవాసన పరిఢవిల్లఁగను
సురుచిరవైభవ స్ఫురణ మీఱంగ

నేకామినీమణి యింటిలోపలను
ఏకాంత మాడుచు నెలమి నున్నాఁడో!
ఏసరసిజనేత్రి యింటిలోపలను
ఆసక్తిఁ జేరి మాటాడుచున్నాఁడో!
సరసంబు లెవతెతో గలుపుచున్నాఁడో!
యరయ నెవ్వతెమోవి యానుచున్నాఁడో!
సొక్కి యేయింతిని జూచుచున్నాఁడో!
మిక్కిలి యెవతెతో మెలఁగుచున్నాఁడో!
చూడరే చెలులార! చూచి యీక్షణమె
వేడుక రమ్మని వెన్నునితోడఁ
దెలుపరే నేనుండు తెఱఁగెల్ల నిపుడు.
అలిగి రాకయె పరాకై యుండెనేని
మదన శిలీముఖ మహిమప్రభావ
మది మదిఁ దెలిసికొమ్మని పల్కరమ్మ.

వ. అని మఱియు నేమనుచున్నది.

శ్లో. పీడితా విరహతాప వహ్నినా
కాలకూట సదృశేన శీతలా।
వాసుదేవ కరుణాంబునా వినా
మత్తనుస్థితి రియం కథం భవేత్॥

ఘంట॥ ఆది॥ అలుక యెందుకుఁ జేసెనే ఓయమ్మలార
అకట నన్నేడఁ బాసెనే।
పలుమారు త్రిశిరగిరి నిలయునికిని ఎంతో
చెలికాఁడై పెలసిన శ్రీకృష్ణదేవుఁడు॥ అలుక॥
నమ్మని పిలువఁడాయెనే వాఁడు నాచెంత
రానిదిన మేడాయెనే।
అమ్మ చెల్ల యీవిరహాబ్ధికి దరిగాన
నొమ్మ నే నేమిసేతునె గోపాలుఁడు॥ అలుక॥
మరుబారి పాలుచేసెనే- నాపై పోటిగ ఆమగువను
వలవేసెనే।
తరుణిరో యింతైన దయలేని వాఁడని
యెఱుఁగక మోసపోతినే గోపాలుఁడు॥ అలుక॥
నన్నేలు ననియుంటినే వానిగుణములు
నానాఁటఁ గనుఁగొంటనే।
ఇన్నాళ్ళవలెఁ గాదు ఎవతెబోధనోగాని
నన్నంటె వెగటాయెనే గోపాలుఁడు॥ అలుక॥

వ. అని మఱియు నేమనుచున్నది.

చ. అలుకల విల్తుఁడున్ చిగురుటాకుశరమ్ము లురమ్ము
దూరుచు ని
చ్చలు చలపోరి యేసి నను సాలెకు నామదిలో నిరంతరం

చెలమి వసించు నాప్రియున కెక్కడ తాఁకునొ యంచు మిక్కిలిన్
అలసితిఁగాని యీమనసున కల్కినదానను గాను నెచ్చెలీ!

క. చెలువుని నిటఁ దోడ్తెచ్చిన
చెలియలు మది గోరినన్ని చీరలు సొమ్ముల్
వలసిన ధనములు నిచ్చెదఁ
జెలులారా! నాదు మనవి చేకొనరమ్మా!

ద్వి. అరయ నా ప్రాణనాయకుఁ డైనవాఁడు
మఱి యెంచి చూడ నామాన్యుఁడే! కాదు
వసుదేవ దేవకీ వరతనూభవుఁడు
వసుధఁ గంసునిబట్టి వధియించువాఁడు
నందయశోదల నందనుం డగుచు
నందునింటను నటనము చేయువాఁడు
మొలకప్రాయమునాఁడు మొనసి పూతనను
దిలకింపఁ జనుదాఁవి తెగటార్చువాఁడు
మమతతో రాధికామణిని వరించి
యమళార్జునములను హరియించువాఁడు
అటువంటి గోపాలుఁ డనతార్తమూర్తి
దిటవుగ నాపాలి దేవుఁడో యమ్మ.

వ. అని మఱియును.

సీ. మత్స్యమై జలధిలో మఱి ప్రవేశించెనో!
కూర్మమై గిరిక్రిందఁ గుదురుకొనెనో!
సూకరరూపమై క్షోణిలో డాఁగెనో!
నరహరియై కంబాన నంటుకొనెనో!
వామనుండై బలివద్దకు డాసెనో!
భృగుపత్యై నృపుల నొప్పింపఁ జనెనో!
రాముఁడై పర్ణశాలలఁ జేరనరిగెనో!
ధృతి హలియై యమునను ద్రిప్పఁజనెనో!
బుద్ధుఁడై బౌద్ధుల నడంపఁబూనుకొనెనో!
కలికివేషంబు ధరియింపఁ దలఁచుకొనెనో!
మనసు శోధింప నెంచి రమాధవుండు
ఎదుటఁ బొడసూపకున్నవాఁ డేమిసేతు!

వ. అని పలికి ఝుల్లు ఝుల్లుమని పులకాంకురంబులు నిగుడఁ దన్మయత్వంబున నేమనుచున్నది.

భైరవి॥ ఆట॥ ఏమో వాని మాయ లేమందునమ్మా!
ఈమహిఁ ద్రిశిరగిరీశు నెచ్చెలికాఁడై
తామెఱయు కృష్ణుఁ డెంతటివాఁడె యమ్మా॥ఏమో॥
ఎందుఁ జూచిన వాని యందమైనరూపము
కందోయి కెదురుగఁ గనుపించెనమ్మా!
చందన గంధి నాడెంద మతనియందె
పొందుగాను ఇంపొందినదమ్మా॥ ఏమో॥

ఎవరు మాటాడిన నవి వానికథలుగ
వివరింపఁ జెవులకు వినఁబడె నమ్మా।
అవలీలగాఁ జప్పుడైనమాత్రమున న
ఉవిద వాఁడు వచ్చినట్లున్నదోయమ్మా॥ఏమో॥
అతివ పీడె మన్నము హితమై తోఁచదు
అతని పేరే హితమై తోఁచెనమ్మా।
నెత తీఱ నిదురించు వేళ శ్రీకృష్ణుఁడు
అతని కేళిఁ గూడినట్లె యున్నదమ్మ॥ఏమో॥

వ. అని యిట్లు విరహసాగరాంతర్నిమగ్నయై తన్మయత్వమున నున్న సత్యభామ విరహతాపంబు మాన్పఁదలంచి చతుష్షష్టికళా విశారదయగు శారద యొుకత వేషంబున వచ్చెడి మార్గం బెటువలెను.

సీ. కుడినైపు పైఱిణికొంగు నేలకుజీర
గురిగింజముక్కర కొమరుమీఱఁ
దళుకైన జీవదంతపుఁ గమ్మ లల్లాడఁ
దనరు చెక్కులు తళతళ మనంగ
చికిలి కన్గొనలఁ గాటుక రేక సొంపొంద
నొసట నామము భూతి పసఘటింప
సంకుపూసలపేరు చనులపై నటియింపఁ
గొప్పున విరితావి గుప్పుమనఁగఁ

జందుపుని గేరు మోమున మందహాస
మంకురింపంగ నెఱుకల పంకజాక్షి
యెఱుక యెఱుకో యటంచును నెఱుక చెప్ప
సత్యభామామణింటికి సరగ వచ్చె.

కేదార॥ జంపె॥

వచ్చె నెఱుకత సత్యభామ వద్దకును బలువేడ్కను।
హెచ్చు త్రిశిరగిరీశు సఖుసతి కెఱుక చెప్పెను జోకను॥
సంకుపూసల బూసనమ్ముల సరులు గళమునఁజుట్టుక।
పొంకముగ సకునాలబెత్తము బుట్టి చంకను బెట్టుక॥
వచ్చె॥

వంకి తెలిగురిగింజముక్కర వరుస కదలేట్టుగా
బింకముగఁ జనుబాలు ద్రాగే బిడ్డవీపునఁ గట్టుక॥
వచ్చె॥

కళగులుకు మంచిపగడపు చేకట్లు చేతులఁ బొదలఁగా।
వెలయు పట్టెలు నల్లరా బావిళ్ళు చెవులను గదలఁగా॥
కలికి చెక్కులయందు దంతపుఁ గమ్మ కుచ్చులు
మొదలఁగా।
నెలఁత లండజు చూచి మెచ్చఁగ నిక్కు గుబ్బలు
కదలఁగా॥

పిత్తళుంగరములును గాజులు
పెంపు సొంపు మీఱఁగా।

చిత్తరువుపని హొయపు గలిగిన- చీరె కుచ్చెలు జీరఁగా॥
అత్తఱిని శకునమ్ము లడుగుట కతిప లందఱు వేడఁగా।
బత్తిమనసున మీఱ సత్యభామ నద్దకుఁ జేరఁగా॥
నచ్చె॥

వ. ఇట్లు నచ్చిన యెఱుకెతను జూచి మాధవి యేమను చున్నాఁడు.

వ. ఎవ్వతెవు ? ఏదేశము ? అని యడుగఁగా మాధవితో నెఱుకత యేమనుచున్నది.

ఉ. భూత భవిష్యదర్థములు పోఁడిమిగాఁ గనినట్లు చెప్పుదున్
ఏతఱి మూఁడులోకముల నెల్లప్పుడున్ మఱిసంచరింపుదున్
సీతకు గౌరికి న్నలువచేడెకు నేగుఱి చెప్పినాను మున్
తొయ్యలి మాధవీ, యిపుడు సత్యకు నే గుఱి చెప్ప
నచ్చితిన్.

వ. అనిన యెఱుకత వృత్తాంతము మాధవిచే విని సత్యభామ యెదురుకొని వచ్చి యుపచరించి యుచితాసనమునఁ గూర్చుండ నిచ్చి యెఱుకతను జూచి సత్యభామ యేయే దేశములు చూచినావనఁగా నెఱుకత యేమనుచున్నది:

చెలియరో నీవేమడిగినఁ జెప్పెదనమ్మా।
పలుమాఱు నీమది కోర్కులు పార్థించి నన్నడుగ
వమ్మా॥ చెలి॥

మాళవ కాంభోజ నేపాళకరహాటవరాట।
చోళకర్ణాట మరాట గౌళభోట।
బంగాళ కోసల బాహ్లీక కాశ్మీ
రాంగవంగ పాంచాలాదిదేశములందు సంచరించినా
నమ్మా॥ చె॥

వ. అయితే ఏయేగిరులు చూచినావని యడుగఁగా.
మలయగిరి చిత్రగిరి మందరగిరి హిమగిరి
కల గంధ మాదన గిరి కైలాసగిరి।
విలసిత సువర్ణగిరి వింధ్యగిరి యుదయగిరి
సలలితాస్తాద్రి ముఖగిరులు సంచరించినా నమ్మా॥
చెలి॥

వ. అయితే ఏయేమూలికలు తెలియుననఁగా
వనితరో యపూర్వమైన వనమూలికలు తెలియునమ్మా.
ఎనలేని సిద్ధక్రియలు నే నెఱుఁగుదునమ్మా।
కనని వింతలెల్ల నేను గనుగొని యున్నానమ్మా॥
కనకాంగి, త్రిశిరగిరీశు కరుణగలదాననమ్మా॥

వ. మఱియు నేమనుచున్నది.

ద్వి. గుఱుతుగా నావద్దఁ గూర్చుండవమ్మ
అరవింద సమమైన హస్తమీవమ్మ.
మురిపెడు ముత్తియమ్ములు పోయవమ్మ.
గుఱి ఫలించిన సన్ను గొనియాడవమ్మ

ఎఱుకరాయనితోడు ఇదినమ్మవమ్మ
తరకట బురకట తప్పుగాదమ్మ
శ్రీరమా సతికి నేఁ జెప్పితినమ్మ
శ్రీరాము సీతకుఁ జెప్పితినమ్మ
చేరి పార్వతికి నేఁ జెప్పితినమ్మ
గుఱుతుగాఁ బదునాఱుగురు రాజులెన్న
వరుస నాఱ్వురు చక్రివర్తులు నెన్న
మేలైన మలయాద్రి మెలఁగుచుండుదును.

వ. అని పలికిన సత్యభామ మిగుల సంతోషించి గుఱి చెప్పుమనఁగా నెఱుకత గుఱిచెప్ప నిశ్చయించి యిష్టదేవతా ప్రార్థన చేసెనఁట యెటువలెను.

ద్వి. శ్రీకాకుళప్పయ్య, సింహాద్రినాథ,
ఏకామ్రనాథయ్య, యేగాటిరాయ.
శ్రీవేంకటేశ, కాశీవిశ్వనాథ,
కోవిల రంగయ్య, కొల్లాపురమ్మ,
వీరభద్రయ్య యోవిఘ్నేశ్వరయ్య,
ధారుణిఁ గలపర్వతాల మల్లయ్య,
మారకాపురి చెన్న, మధుర మీనమ్మ,
భైరవి మళయాళి, భగవతి, తల్లి
అల్లెల హనుమంత, ఆనందవల్లి
తిల్ల గోవిందయ్య, తిరుణామలేశ,

ఆదినారాయణా, ఆకాశవాణి,
మాధవ దేవుఁడా, మాతృభూతేశ,
ఇన్ని దేవతలు నాయెడఁ గరుణించి
నన్ను మీఱఁగ నాకు వాకియ్యరయ్య.

వ. అని యిష్టదేవతాప్రార్థనముచేసి శకునము చెప్పనంట యెటువలెను.

ద్వి. వినవె నీమదిలోని వృత్తాంత మంతఁ
గనినట్లు చెప్పెదఁ గరమొప్పఁగాను,
మురహరుతో నీవు మున్నొక్కనాఁడు
సరస రతిక్రీడ సలుపంగఁ జూచి
సైఁచక రుక్మిణీసతియు నీమీఁద
ఆఁచక పగఁ బట్టి యతని రప్పించి
కాంతునకును నీకు గానీక చేసి
యింతిరో! నీపేను నెత్తనీయట్లు
తనివి తీఱఁగ నిన్ను దలఁపనియట్లు
తనియించి కృష్ణునిఁ దనమందిరమున
నిలుపుక యున్నది; నెలఁతరో! నీవు
పిలిపించినా, రాఁడు ప్రియుఁడాగ్రహపడు,..
కానుక లంపినా గాని గైకొనఁడు
దాని మాయలచేతఁ దగిలియున్నాఁడు
అందువల్లను ఇప్పుడతిన, నీమనసు
చిందరవందరై చిక్కియున్నావు.

అదిగాక జడదారి యాపువ్వు దెచ్చి
ముదితతోఁ గలహంబు పుట్టించుటకును
అలరు కృష్ణునకీయ నతఁడు రుక్మిణికిఁ
బొలఁతిరో, యీయంగ ముడిచెఁ గొప్పునను,

వ. అని మఱియును నేమనుచున్నది.

అసావేరి|| అతివరో నీవందు కారాట పడనేల
హరియిందువచ్చునమ్మా| సతతము నీమదికి సంతోష
మొనఁగూర్ప జతగతఁ గల్పవృక్షము దెచ్చునమ్మా||
అతి||
నేఁ జెప్పిన యీసుద్ది నీవు విశ్వసించి నిజమంచు
నమ్మవమ్మా|
ఈజగతిఁ ద్రిశిరగిరీశు చెలికాఁడు నిన్నెప్పటిచందాన
నెనసి కూడునమ్మా|| అతి||

వ. ఇట్లు ఎఱుకత సత్యభామకు శకునములు పలుకఁగా నెఱుకతను గానక నెఱుకరాయఁడు వెతకుచు వచ్చెనఁట యెటువలెను.

పు. సింగఁడు వచ్చెఁగదే దేవలోక|| సిం||
సింగఁడు వచ్చెను కొంగ ఱెక్కలు ఉత్త
మాంగమునఁ బూనుక సింగిని వెదకుచు|| సిం||
పొట్టముఖాలితోడ మిట్టపండ్లతోడ

పొట్ట కదలగాను అటుకెట్టు దాటుచు॥ సిం॥
వెట్టివెట్టిగఁ గన్ను లెట్టఁ జేసుకొని
మిట్టునఁ జూచుచుఁ గట్టి చేతఁబూని॥ సిం॥
బాళి త్రిశిరగిరి వాసు నెచ్చెలియా గో
పాలుని సభికులఁ బకపక నవ్వింప॥ సిం॥

వ. ఇట్లు వచ్చిన సింగనిఁ జూచి సింగి యేమనుచున్నది.

ప. ఎంత వింత వంతకారిరా సింగా నీవు॥ ఎంత॥
ఎంత వింత వంతకారి వంతువేసి చెంతఁజేరి
పంతగించి చేతులేసి ముంతలవంటి చండ్లు పిసికే॥ వెంత॥
కన్ను లిక్కి మయిల్ సూచి కరుత్త కొప్పాలొపువ్వాలు సూచి।
నిన్ను వదటు కడిసెసంట నిక్కి నిక్కి చూసేవేర॥ ఎంత॥

సింగని వాక్యము॥
ఎంత వింత హొంతకారివె సింగి నీవు॥ ఎంత॥
మిట్ట మీఁద వలలుగట్టి అట్టె గువ్వపిట్టఁబట్టి
ఘట్టినేయఁ మఱచి నిన్ను అట్టెవలపు చెందినాను॥ఎంత॥
నైసి త్రిశిరగిరిని వెలయు సంగమయ్య నెచ్చెలైన
దాసరయ్య సభను నీవు తక్కులు సిక్కులు సొక్కులు సేసే॥ ఎంత॥

వ. ఇట్లు సింగి సింగఁడు పరస్పర వచనము లాడఁగాఁ జెంత నున్న పులి యెఱుకతబిడ్డను గొనిపోఁగా నెఱుకరాయని జూచి యెఱుకత యేమనుచున్నది.

కాంభోజి॥

అరిమె బిడ్డను బులి యిపుడెత్తుకొని యురికె
నేమిసేతురా। ఓరి యెరుకలరాయ నాబిడ్డ మోము
నేనెపుడు చూతురా॥
ఇల్లు వెళ్లినపుడు పిల్లెడ మైనందు కిదె ఫలించెరా।ఓరి।
యెల్లవారలు చూడఁ జన్నుచేపుచున్న దేమిసేతురా॥
త్రిశిర గిరీశ్వరుని మాయ లిట్లనుచును దెలియనైతిరా।
పసిబాలుని దెచ్చి యియ్యక నేవిడువఁ బంతమేలరా!॥

వ. అని యిట్లు శోకించిన యెఱుకత నూఱడించి యెఱుకతకు బిడ్డనిచ్చి సంతుష్టాంతరంగులై యున్న యెఱుకదంపతులైయున్న వాణీకమలాసనులను మెచ్చి సత్యభామామణి మణిభూషణాంబరావళు లొసంగి సంతుష్టాంతరంగయై యుండె నంత॥

మ. కనకక్ష్మాధరధీర, మన్మథసమాకారా, శ్రితానేక స
జ్జనమందార, పరితాపరామకరుణా సంపాదిత శ్రీనికే
తన సద్యోన్నత చోళదివ్య వసుధాధారైకదోస్సార, మో
హనరాజద్గుణవార, శ్రీయమరసింహ క్ష్మాప చూడామణీ!

వ. ఇది శ్రీ చోళసింహాసనాధ్యక్ష భోసల ప్రతాపసింహరాజ పూర్వపుణ్య పరిపాక స్వరూప యమునాంబికా గర్భశుక్తి ముక్తికాయమానామరసింహ మండలాధీశ్వర నామాంకితంబైన మంత్రి మార్తాండ శివరాయమంత్రికారితంబైన శ్రీమత్సుగంధి కుంతలేశ్వర కరుణాకటాక్ష వీక్షణ సుధాసార సంజనిత చతుర్విధ కవితానిర్వాహక శాండిల్యగోత్ర పవిత్రి కవిరంగయార్యపుత్ర విద్వజ్జనవిధేయ మాతృభూత కవినామధేయ ప్రణీతంబైన పారిజాతాపహరణ నాటకంబునందు సత్యాభామామణి సౌధాగ్రంబునఁ గొలువు గూర్చుండుటయును, సఖిరాక కెదురుచూచుటయును, సఖి వచ్చి కృష్ణునిచెంత నడచిన వృత్తాంతం బంతయు సవిస్తరంబుగా వినిపింప విని వెతచెంది కృష్ణమూర్తి వద్దకు వచ్చి యనునయోక్తులఁ బిలుచుటయును, కృష్ణమూర్తి రానని నిరాకరించుటయును, పరస్పర వచనము లాడుటయును, అంత సదృశ్యుండైన, నిజమందిరమునకు వచ్చి మిగుల తాపంబున నోపిక లేకయున్న యవసరంబున నెఱుకత వచ్చి శకునము చెప్పిన శుభవార్త విని కొంత సంతోషంబున నుండె నను కథల మెలంగు నిది ద్వితీయాంకము.

# పారిజాతాపహరణము

## —: తృతీయాంకము :—

క. శ్రీమత్ప్రతాప రామ
స్వామి పదాంభోజ హృదయ షట్చరణ, మహో
ద్దామ, రిపుభీమ, సద్గుణ
సీమ, కృపావాల, యమరసింహ నృపాలా.

గీ. అనధరింపుము నీపేర సంకీర్తముగఁ
బారిజాతాపహరణంబు బాగుమీఱ
నాటకముగాను రచియించినాను వేడ్క
నెలమి నందుఁ దృతీయాంక మెట్టిదనిన.

వ. ఇట్లొలుకత శకునంబు చెప్పినఁ గొంతతడవు ధైర్యంబవ లంబించి తదనంతరంబు విరహాభరంబు సైరింపఁజాలక మున్నొక్కనాఁటిరాత్రి సరసములకు పొద్దుపోయి రతిక్రీడ సేయు నంత నిశాంతంబైనవింత యంతరంగంబునఁ జింతించి చెంతనున్న దంతియానలఁ జూచి సత్యభామామణి యేమనుచున్నది:

సీ. మోము మోమునఁ జేర్చి ముద్దాడునంతలో
మును జాముపొద్దాయె మోహనాంగి,
సరససల్లాపముల్ మఱి చేయునంతలో
జాములు రెండాయెఁ జంద్రవదన,

ప్రియమునఁ గౌఁగిటఁ బెనఁగొనునంతలో
మూఁడవ జామాయె ముద్దుగుమ్మ
నయ మొప్ప మోవిపానక మానునంతలో
నాలవ జామాయె నలినగంధి,
చొక్కి చొక్కించునంతలోఁ జుక్క పొడచెఁ
గదిసి తొడ మల్చునంతలో గాలి విసరెఁ
గొసరి పైకొనునంతలోఁ గోడికూసె
వల్లభునిఁ గూడునంతలోఁ దెల్లవాఱె.

ఘంటు॥ ఏల దెల్లవాఱెనమ్మ- నేనిందు కేమిసేతునమ్మా।
బాల యింద్రనీల నీలవర్ణుఁడు కనకచేలుఁడు కరు
ణాలవాలుఁడు వరవన మాలికాభరణుఁడు।
మాళపింఛము గోపాలకృష్ణుఁడు నన్ను లాలించు
నంతలో॥ ఏ॥
కూరిమితోఁ జేఁదీసి పన్నీరుగంధము మేనఁబూసి క
స్తూరి తిలకము నొసను మీఱ దిద్ది శృంగారరసము
వెల్లునె
పార సరసోక్తుల గారవించి పాలుగారు చెక్కిట
నూరారు ముద్దులుంచి యూరడించునంతలో॥ ఏల॥
మక్కువతోఁ గౌఁగిలించి యెంతో పక్కముచ్చిక
లొనరించి

లెక్క కెక్కు_వైన పెక్కు బంధములను, జక్కవకవరీతిఁ
దక్కితినని పెనఁగి
చక్కరవిలుకాని కెక్కు_వైన శౌరి మిక్కిలి నావలలోఁ
జిక్కెడునంతలో॥ ఏల॥

సరి మోవి పానకమాని సారెసారెకు మదిఁబ్రేమఁబూని
అరవిరి సరులు కొప్పునఁ జుట్టి గుబ్బచములపైని
కఱకుగోరులుంచి।
అరుదైన శ్రీత్రిశిరగిరి నిలయుని సఖుఁడు
సురతకేళిని మనసు కరఁగించునంతలో॥ ఏల॥

వ. అని పూర్వరతి సంగతులు చెలులతోఁ దెలిపి మిగుల
విరహతాపంబు రెట్టింపఁ జెలులతో నేమనుచున్నది.

సీ. రమణుండు చిన్నప్రాయమునాఁడు మొదలుగా
నామాట మీఱఁడే నలినగంధి
తరుణుఁడే సొమ్మైనఁ దనకొసంగునుగాని
యెవ్వారి కొసఁగఁడే యిగురుఁబోఁడి
బోఁటులు తనకేమి బోధింతురోయని
లంచంబు లొసఁగునే చంచలాక్షి
సవతులు నాతోడ సరిపంతగించితే
సైరింపఁ జాలఁడే చంద్రవదన!

సొగసు వగలను ప్రేమచేఁ జొక్కి దక్కి
వంచనలులేని తమకంబు నించిపొంచి
కనికరంబున రతులను గలిసి మెలసి
యున్న విభుఁ జేలరాఁడొకో సన్నుతాంగి !

సీ. వేదాంతగుహలోన విహరించు బ్రహ్మంబు
కొమరైన వాచామగోచరుండు
రహి నాది మధ్యాంత రహితుఁడౌ దేవుండు
మూలకారణమైన మొదటివేల్పు
చిద్ఘనానందుఁడై చెలఁగు సర్వేశుండు
పరతత్త్వమైనట్టి పరమపురుషుఁ
డఖిల మేకాకారుఁ డైనట్టి విష్ణుండు
వేదస్వరూపుఁడై వెలయు విభుఁడు
అచ్యుతుఁ డజేయుఁ డవ్యయుఁ డప్రమేయుఁ
డగణితుఁ డచింత్యుఁ డాద్యుఁ డనంతుఁ డనఘుఁ
డైన గోపాలకృష్ణుఁడే ధృతినయింట
దాఁగియున్నాఁడొ తెలుపరే తరుణులార !

పురుజు॥ ఆది॥ ఎట్లా వాని నమ్మవచ్చునే యమ్మా!
ఎట్లు వాని నమ్మవచ్చు నింతిరో యావెన్నముచ్చు
ఇట్లుచేసితే నేమందునే నావిభుం డెవతె
యింట నున్నాఁ డని యందునే అమ్మ నేచెల్ల!

చుట్టుపట్ల నున్న జనులు చోద్యమంది యొకసక్కెములు
మాట్లాడు కొనుచు నవ్వే టట్లాయెఁగా నాబ్రతుకు॥
ఎట్లు॥

నన్నాఅడి పెట్టఁదలఁచి నాపాణవల్లభుఁడే
వన్నెలాడిపై మనసు నుంచెనో। లేపల్లెగొల్ల
వనితలపై మోహముంచెనో। అమ్మ నేచెల్ల।
ఇన్నాళ్ళవలెనుగాదు ఏమోగాని నెనరులేదు
చెన్నుగాఁ గొన్నమగఁడని చెప్ప సిగ్గయ్యెనమ్మ॥ ఎట్లు॥
సరసుని బిలువనంపితే సరసరాక, పరకాంతతో
సరస సల్లాపములాడెనే। నాపేరంటే సకియ సణ్గసేయఁ
డాయెనే। అమ్మనేచెల్ల
పెరటిచెట్టు మందులకుఁ గొఱగాదన్నట్లు నాపట్ల
మరియాద లేకయే మదని శరములకు గురిచేసెనే॥
ఎట్లు॥

రామరో త్రిశిరగిరి ధామసఖుఁడైన కృష్ణునకు
నామీఁదఁ బ్రేమ లేదాయెనే। వానికిఁగాని
యీమెనింక నేమి సేయనే। అమ్మనేచెల్ల।
ఏమో మదిఁ నెంచుకొని నా స్వామి యెన్నఁడు లేని పో
రామి చేసెనంటె యిది నా నోములఫలమింతేకాని॥
ఎట్లు॥

వ. ఎట్టివాని॥

శ్లో. నీలాభ్ర సన్నిభతనుం నిజవక్త్ర చంద్ర
జ్యోత్స్నాయమాన నిబిడీకృత మందహాసం।
గోపాంగనాజన మనోహర వేణుగానం
గోపాల బాలక మహం ప్రణతోస్మి నిత్యం॥

సీ. పగలాడి వాని కెవ్వతె మందుపెట్టెనో
సకియరో నేనంటె సైఁపఁడమ్మ,
కలికి యెవ్వతె వాని కరుణ తప్పించెనో
సుదతిరో నను గంటఁ జూడఁడమ్మ,
నెలఁతుక యెవతె వానికి బాసలిచ్చెనో
నాయింటి త్రోవైన నడువఁడమ్మ,
ఏయింతి వానికి నిపుడు బోధించెనో
కలనైన నాపేరు దలఁపఁడమ్మ
ఏమిసేయుదు విరహంబు నెటులసైఁతు
మరుని బాణంబులకు నోర్వఁదరముగాదు
ప్రాణనాయకుఁడైన గోపాలు నిపుడు
వేడుకలరంగ వేగమే తోడి తేవె.

వ. అని,

శ్లో. చంద్రోదయం కువలయం పరివాంఛతీవ
సూర్యోదయం సరసిజం పరివాంఛతీవ
కృష్ణం సమస్త రతికౌశల పూర్ణతృష్ణం
చేతో మదీయ మిహ వాంఛతి కిం కరోమి.

దరు॥ బేగడ॥ ఆట॥

ఏమి సేతునే యీ విరహ మేనెట్లుసైతునే।
రామరో సుగుణాభి రాముఁడైన గోపాలుఁ
డేమో మది నెంచుక యిందు రాకయున్నాఁ॥ డే॥
నామనసు తెలిసికొని నడువనేర్చినవాఁడు
నామాట మీఱని నయమైన వాఁడు।
నామనోహరుఁడై నను జెట్టఁబట్టినవాఁడు
ఏమోగాని తెలియ దీవఱకును రాకున్నాఁ॥ డే॥
సేపపెట్టి పెండ్లి చేసుకొన్నవాఁడు ఆసదీఱఁ బెనఁగి యణఁగినవాఁడు।
నా సామ్మైనవాఁడు నాపాలి దేవుఁడు ఈసమయము నందు రాక యున్నా॥ డేమి॥
కసిదీఱఁగగుచ్చి కౌఁగిలించేవాఁడు- ముసిముసి నవ్వు నెమ్మోము గలవాఁడు।
రసికతచే రతులను మెప్పించెడివాఁడు
శ్రీశిరగిరీశరసిక దేవుఁ డిందు రాకున్నా॥ డే॥

చు. దయితుం డీడకు వచ్చునా! యతనిఁ గాదంచా మె
రానిచ్చునా!
దయ నాపై మఱి హెచ్చునా! విరహ సంతాపంబు
తావిచ్చునా!
ప్రియుడుం గౌఁగిట గుచ్చునా! చెలియ బాళిఁ వానిఁ
దోడ్తెచ్చునా!
యయినా నావిధి యింతయోజనకు నిహ్మానట్లుగాఁ
జేసెఁగా!

వ. అని మఱియు నేమనుచున్నది.

సీ. వీఁక నామనవి చేకోక నే తానింద్దు
రాక నే యున్నాఁడు శ్రీకరాంగి,
పూనెనే పగనన్ను మానెనే దానిమో
వానెనే యలవాఁడు సూనగంధి,
వంచెనే కడకుఁ గావించెనే చలము సా
ధించెనే యలవాఁడు చంచలాక్షి!
చొక్కెనే దానిచేఁ జిక్కెనే చేయెత్తి
మొక్కెనే తరుణికి టక్కులాడి!
యచట పోనేల! యిచటఁ గాలాడనేల!
చెలియలందఱు విని గేలి సేయనేల!

♦ ♦ ♦ ♦ ♦

అతివ, యింతటి యన్యాయ మవనిఁగలదె!

వ. అని విరహ మొంది చెలికత్తెలను బిలిచి యేమను చున్నది.

సీ. పారిజేశునకుఁ జెప్పి పంపెదనంటినా
కలికిరో! తనకు లాఘవముగాదె!
చెలియరో నావెత చెప్పింపకుంటినా
తమక మింతింతనఁ దరముగాదె
వానికైనా తోఁచి వచ్చునోయంటినా
తొడిఁబడి నావిధి తోఁచ నీదె,
తెఱవలతో గుట్టు తెలిపెద నంటినా
వెలఁది, మర్మము బైట వేయరాదె!
ఏమిసేయుదు నా వెత లెట్లు దీఱు
నయ్యయో యింత కెడమాయె నతను మాయ
పారిణవల్లభుఁడైన గోపాలు నిపుడు
తోయజాక్షిరో నీపైనఁ దోడితేవె !

వ. అని మఱియు నేమనుచున్నది.

సౌరాష్ట్రి॥ జంపె॥
ఇంతిరో నీవిందురావె మానవాలిచ్చెదను వేగఁ
గైకోవే।
పంతమున నీవందుఁ బోవే ముద్దుగోపాలకృష్ణుని దోడి
తేవె, తేవె॥ ఇంతి॥

అతను బారికిఁ దాళఁజాల నిట్టి సమయాని
కొదవని చెలియ లేల। జతగూర్పవే ముద్దుబాలా
నాప్రాణ। పతిని గల్గనైన నెడఁబాయఁగాఁజాల॥ ఇంతి॥
అంతరంగము తెలియఁ బలికి యేయుపా
యము చేతనైనను కలికి। సంతతము నీవతని
కలికి యుండకను। సముఖమునఁ జేరిపిలువవే
ముద్దు గులికి॥ ఇంతి॥
త్రిశిరగిరి నిలయునకు జంటయగు కృష్ణ
దేవు నెటులైన వేడ్కొంట। కుశలముగ నీదు వెను
వెంటఁ।
దెచ్చినను। గోరినది యిత్తునిదిగో వెంట వెంట॥ఇంతి॥

వ. అని యిట్లు సత్యభామ పలికినఁ జెలికత్తె యిందిరానా సమై చెన్నొందు రుక్మిణీదేవి మందిరమునఁజేరి యందు నిందు కాంతసౌధంబున నానందంబున నున్న గోవిందునిం గని దండ ప్రణామంబు చేసి మందమంద వచనంబుల నేమనుచున్నది.

కేదారగౌళ॥

తోడి తెమ్మనెరా నిన్ను దోడి తెమ్మనెరా।
వేడుకఁ ద్రిశిరగిరి నిలయుని సఖుఁడైన। కోడెకాఁడౌ
చక్కని గోపాల కృష్ణ! నిను॥ తోడి॥
నిదుర కంటికిరాక నిన్నటి వేళనుండి।
యెదలోన దిగులొంది యేమితోఁచక నీ

కెమరెమరె చూచురా। బయలు కౌఁగిలించుటకుఁ
జెయి సాఁచురా। నీవు రాకున్న।
ముదిత విరహ సముద్రమందు మునిఁగి తేలుచు
నిర్వహింపక
సదయుఁడా నీదు సముఖమునకు సారె నను బంచి
నిను వేగమె॥ తోడి॥

వ. అని పలికిన చెలివాక్యంబులువిని స్వామి పరిహాసోక్తిగా
నేమనుచున్నాఁడు.

గీ. దానివంటి చెలులు ధరణి నాకెందఱో
లెక్క లేదుస్మీ సత్య యెక్కువేమి।
మనసు లేనిచోట మలయునే సౌఖ్యంబు
రమణి, దానికడకు రాను పొమ్ము.

అని కృష్ణమూర్తి నిరాకరించి పలికినఁ జిన్నవోయిన వదనంబునఁ జెలికత్తె వచ్చినట యెటునలెను.

తోడి॥ ఆది॥ చెలికత్తె యదె వచ్చెను–
చెలువైన త్రిశిరగిరి నిలయుని సఖుఁడైన
శ్రీకృష్ణదేవుని చెంగటికిఁ బోయిన॥ చెలి॥
ఏమని యుచటి వార్త యిందీవరాక్షికి
వేమఱు దెల్పుదునని వెఱచు కొనుచును।
మోము చిన్నఁజేసుక ముదిత తడఁబాటుతోను
కోమలాంగైన సత్యభామామణి వద్దకు॥ చెలి॥

వ. ఇట్లు వచ్చిన సఖి ముఖలక్షణం బుపలక్షించి సత్య భామ యేమనుచున్నది.

**శాహాన॥ ఆది॥**

ఏమనెనే కొమ్మ నాసామి నీతో॥ ఏమనెనే॥
ఏమనెనే పరాకైమెసఁ జేసెనో భామ, ముంగలనునా సతియనా గోపాలుఁడు॥ ఏమ॥
పరిహాసనము చేసెనో నేఁజెప్పంపిన పలుకులు చెవుల వినెనో
ఎఱిఁగి యెఱుఁగనట్లుండి యేమనఁ డాయెనో।
తరుణి నీమాటలకుఁ వచ్చిన గావించెనో॥ఏమని॥
కానుక గైకొనెనో తనకుఁ గల్గిన కపటముతోఁ పఁ జేసెనో।
దానితోఁ గూడుకదంతపుఁ జవికెలో
పానుపుపైనుండి పరవా సేయఁడాయెనో॥ ఏమ॥
ఇంటికి వచ్చేననెనో రానని నీతో నెదిరించి విడనాడెనో।
దంట త్రిశిరగిరి ధాముసఖుఁడై తిమ్మ
కంటియై వెలయు చక్కని గోపాలదేవుఁడు॥ ఏమ॥

వ. అనిన చెలికత్తె యేమనుచున్నది.

సీ. చెలియరో నీవు ఇచ్చిన కానుకలను జే
కొనఁడాయె నిందు కేమనఁగ వచ్చు
వనిత, నీమాట యెత్తిన వినివిననట్లు
మాటాడఁడాయె నేమనఁగ వచ్చు

నీచెలి నని పోయి నిలిచిన యంతనే
మనసీయఁ డాయె నేమనఁగవచ్చు
కలికి, గోపాలుని కథలు భారతములై
కనుపట్టె నిందు కేమనఁగ వచ్చు
సత్యముగఁ దెల్పెదను విను సత్యభామ,
మగువలు వినంగ రుక్మిణీమణి వినంగఁ
బూని దాక్షిణ్యమనుచు నింతైన లేక
రాను రానని గోపికా రమణుఁ డిపుడు॥

వ. అని మఱియు నేమనుచున్నది.

ఎరుకల కాంభోజి॥ ఆది॥

ఏమోయని యుంటినె। సామిమనసు
గంటినె భామ, నీపై నెనరు లేని భావమును గనుఁ
గొంటినె॥
అల దానికె దక్కెనె యలివనలలోఁ జిక్కెనె।
మలయజగంధి పెట్టిన మందు తలకెక్కెనె॥
ఘనుఁడు ఇందు రాననెనె కపటమునకె పూనెనె।
వనజాక్షి గోపాలుఁడు వచ్చేసుద్ది కానెనె॥
దానింటనె వెలసెనె తరుణితో కలిసెనె।
చాన త్రిశిరగిరీశ్వరుని సఖుని గుణము తెలిసెనె॥

వ. అని పలికిన చెలి కఠోరవాక్యంబులు విని నిశ్చేష్టితయై యుండెనఁట యెటువలెను.

సీ. బలు మిన్ను విఱిగి పైఁబడినరీతిని గొంత
ధనము గోల్పడిన చందమునఁ గొంత
పలుమాఱు కొండపైఁ బడిన కైవడిఁ గొంత
యతివేగ భ్రమపడినట్లు కొంత
ఘనమైన గ్రహము సోఁకిన జాతిగాఁ గొంత
యల ప్రసంచము గుప్పించినట్లు కొంత
కినుకచే యుగము దుర్గిగిన జాడగాఁ గొంత
యలవెళ్లఁ బెగులు కొన్నట్లు కొంత
చిత్త మొకచోట నిలువక తత్తఱించి
విరహ వేదనచేఁ గుంది వెతల నంది
యంతరంగంబునందు శ్రీహరిని దలఁచి
యేమి తోఁచక యుండె నాయిగురుఁబోఁడి.

వ. ఇట్లుండి.

క. కళవళముఁ జెంది, మూర్ఛిలి
యలయిక నిదురించి లేచినటువలె జిక
న్నులు తెఱచి మూర్ఛ దెప్పిఱి
వలపోపక సత్యభామ వనితిలకనియెన్.

వ. ఇట్లు చెలికత్తెలను జూచి యేమనుచున్నది.

సీ. వెన్నుని మోహన వేణునాదామృత
పానంబు సేయని వీనులేల
హరి పరీరంభణాత్యద్భుత సౌఖ్యంబు
లనుభవించనియట్టి తనువదేల
మధువైరి శతకోటి మన్మథాకారంబు
గనుఁగొనఁగాలేని కన్నులేల
కృష్ణునితో రతికేళిని గూడని
వరరూప లావణ్య గరిమ యేల
శ్రీధరుని మోవి గ్రోలని జిహ్వయేల
శేషశాయిని దలఁపని చిత్తమేల
పద్మనాభునకునుగాని ప్రియమేల
శౌరి సంభాషణము లేని జన్మమేల.

వ. అని మఱియు నేమనుచున్నది.

ఆహరి॥ ఆట॥

రానని పలికెనటె గోపాలుఁడు॥ రా॥
రానని పలికెనా రమణికో గోపాలుఁ
డానాఁ డిచ్చిన బాస లన్నియు మఱచి యింపు ॥రా॥
పలుమాఱు నాపక్క పాయక నే యున్న,
చెలువుఁ డింతైన దాక్షిణ్య మనుచును లేక॥ రా॥
బొట్టుగట్టి పెండ్లాడి నట్టి వితమెంచక।
మట్టుమీఱటి నలుగురిలో మాటికి విడనాడి॥ రా॥

నామాట మీఱక నడచుకొన్నవాఁడు।
భామ రుక్మిణి యింటఁ బాళెము వేసుక॥ రా॥
చెలియ త్రిశిరగిరీశు చెలికాఁడైన కృష్ణుఁడు
అలరు విల్తుని కేళి ననఁగి పెనఁగినది మఱచి॥ రా॥

వ. అని మఱియు నేమనుచున్నది.

ఉ. ఏమని విన్నవింతు విధినేమని దూఱుదు నేమిసేతుఁ బో
రాములఁ బెట్టనెంచి ం టురానని పల్కినయట్టి గోపికా
రామున కిప్పుడేమి యపరాధముచేసితి రామరామ నా
స్వామికిఁ దోఁచెఁగా వెగటు సారెకు నాతలవ్రాఁతయెట్టిదో॥

సీ. అతివయుఁ దానొక్కటై యుండితేనేమి
తోడరి నాపేరెత్తి దూఱఁదగునె
చానతో రతికేళి సలిపితేనేయేమి
చెలియతో నను గేలిసేయఁ దగునె!
అలివేణితోడ సయ్యాటలాడిననేమి
కలికితో నాగుట్టు తెలుపఁదగునె!
చిన్నారి వలలోనఁ జిక్కికొంటేనేమి
తెఱవతో నాసుద్ది తెలుపఁ దగునె!
కాని కానిమ్ము నాచేతి కబ్బినపుడు
అడుగకయె వానిఁ గొంచాన విడుతునఁటవె!
ఇంతచేసిన గోపాలుఁ డెంత సేయఁ
డమ్మ నేచెల్ల యిఁక వాని నమ్మనళమె!

కన్నడ॥ ఆది॥

ఈమాట విని నేనెట్లు సైఁతునె।
రామరో త్రిశిరగిరి ధాముని చెలికాఁడో
నాముద్దు గోపాలుని నడక లేమందునె॥ యీమాట॥
చక్కెర బొమ్మమోవి నొక్కి రుచి చూచితే నేమి?
చొక్కించి నేను నీకు దక్కితి ననవలెన।
గ్రక్కున దాని బిగి కౌఁగిటఁ జేర్చితేనేమి
యెక్కువైన యాసౌఖ్యమెందు లేదనవలెనా॥ యీ॥
కులుకులాఁడి సిబ్బెపు గుబ్బలు పట్టితేనేమి
మెలఁతలలో నీవె మేటి యనవలెనా॥
అలదానికి మనసిచ్చి యాటలాడితేనేమి
జలజాక్షి నీకెవ్వరు సాటిలేదనవలెనా॥ యీ॥
ముదిత చెక్కిలి నొక్కి ముద్దులాడితేనేమి
మదవతి నిను విడువ మనసు రాదనవలెన।
మదను కేళిని ముమ్మాటికిఁ గలసితే నేమి।
మదికి బ్రహ్మానంద మిది యనఁ గావలెన॥ యీ॥

వ. అని మఱియు నేమనుచున్నది.

చ. సరసములందుఁ బెక్కు నెకసక్కెములిందు, బెడంగు ముచ్చటల్
మురిపెములందుఁ, బంతమును మోడియు నిందుఁ, గటాక్ష వీక్షణ

స్ఫురణములందు, నెఱ్ఱనగు చూపులు నిండు, నిదేటి చిత్రమో
హరి బహు జార చోరుఁ డని యాడిన మాట నిజంబు కోమలీ.

సీ. ఇటువంటివాఁడని యింతైనఁ దెలియక
నావంటి గుణియని నమ్మియుంటిఁ,
గపట మానసుఁ డని కలనైనఁ దెలియక
మంచివాఁడని మది నెంచియుంటి,
వంచనా పరుఁడని యించుకతోఁచక
దయగలవాఁడన్ని తలఁచియుంటి
బహు వల్లభుండనే భావంబు తెలియక
నావల్లభుండని నమ్మియుంటి
నమ్మనేచెల్ల మగవారి నమ్మరాదు
మొగము చూచిన నొకమాట మొగము చూడ
కున్న నొకమాట యేమని విన్నవింతు
సుదతి, కృష్ణుని నమ్మిన సుఖము గలదె!

ద్వి. వనితరో రుక్మిణి వంచనచేసి
గొనకొని తానందుకొనెఁ గుసుమంబు
అందుకేమాయె నాయందుఁ గలట్టి
యందచందంబులు నతిపౌరుషంబు

నెఱుఁగదా రుక్మిణి! యెఱుఁగఁడా హరియు!
ఎఱుఁగరా భువనమం దెల్లవారలును!
నావట్టు దెలిసిన నంద నందనుఁడు
భామరుక్మిణి కిచ్చెఁ బారిజాతంబు.
నా సవతులలోన నగుబాటులాయె
నాసరివారిలో నవ్వుల కాయె
నేమని తెలుపుదు నేటు నమ్మవచ్చు
కామిని, కృష్ణుని కపటంబు దెలిసె.
ఎలమిఁ గృష్ణుఁడు రుక్మిణింట నున్నపుడు
కలహాభోజనుఁడు నాకస్మికంబుగను
ప్రాకటంబుగ వచ్చి పారిజాతంబు
నాకృష్ణున కొసంగ నతఁడు రుక్మిణికి
నొప్పుగాఁ గుసుమంబు నొసఁగంగ నామె
కొప్పున ధరియించుకొనె నేమిసేతు!
ఇందుకా పెండ్లిచేసిచ్చెను నన్ను
నిందీవరశ్యాము కిపుడు మాతండ్రి.
మనసున్నచోట సమ్మతముగా నడచు,
మఁని దూఱనేల! యమ్మని యేమిసేయు!
ఆవులకాపరి యగుచు నింపొందు
గోవిందు నిపు డనుకొనవలెఁ గాక.
లవలేశమైన మర్యాదని లేక

సవతి ముందఱఁ జౌక సలిపె నేమందు!
నావంటి దానికి నగుఁబాటులైన
నేవనితల కింక నేమిదాఁ గాదు!
కలికిరో మనసునఁ గళవళప్పట్టెఁ
దలఁకుచుఁ బ్రాణముల్ తల్లడమందె,
చెలియలారా! యేమిసేయంగ వచ్చు!
తలను వ్రాసినవ్రాఁత తప్పింపవశమె!

వ. అని మఱియు నేమనుచున్నది.

సీ. వయసు వచ్చిరాక వన్నెకెక్కిననాఁడు
బటువుగా గుబ్బ లేర్పడనినాఁడు
కలయఁ గురుల్ దువ్వి కట్టనేరనినాఁడు
చెలిమి బాలికలతోఁ జేయునాఁడు
అక్కఱతో బొమ్మలాట లాడెడునాఁడు
కన్నెప్రాయంబైన చిన్ననాఁడు
రమణ సంయోగ సారం బెఱుంగనినాఁడు
సిగ్గని తెలియక చెలఁగునాఁడు
నన్నుఁ జేపట్టి పెండ్లాడునాఁడు నాదు
చే విడువనంచు బాసలు చేసినాఁడు
మరులు పుట్టించి రాఁడయ్యె మాధవుండు
తోడి తేరమ్మ కృష్ణుని వేడుకలర.

మధ్యా॥

పాలియ మేల వచ్చెనె అమ్మనేచెల్ల॥ పా॥
ఈయెడఁ దిశిరగిరీశ్వరు చెలికాఁడు
నాయెడ దయలేక నన్నలయించుటకు॥ పా॥
బొమ్మరిండ్లు గట్టి బుడుతలతోఁ గూడి
బొమ్మల పెండ్లిండ్లు పొందుగను।
అమ్మనలును చిట్టిపొట్లకాయలు—
ఒమ్మిక నాడుచు నున్నట్టి తనకింత॥ పా॥
పొన్నారి దొంతులు ప్రతికలఁబెట్టి గుజ్జనగూళ్లు
వండి చెన్నుగను।
చిన్నపడుచులతోనఁ జేరియారగించి
యెన్నఁడు సిగ్గని యెఱుఁగని తనకింత॥ ప్రాయ॥
ఓమనగుంటలు ఓమను కుప్పలు లేమరో గుజగుజ
రేకులును॥
వామాక్షి యక్కపవరము 'దేవుడి గిన్నె'
పేలిమతో నాడుచుఁ బెరిగిన తనకింత॥ పాలియ॥

వ. అని పలికి జన్మము వ్యర్థమే యనుచుఁ జెలులఁ జూచి యేమనుచున్నది.

సీ. వెన్నని ఱొమ్మును వీడకుండుటకును
బొలఁతి, కౌస్తుభముగాఁ బుట్టనైతి
అధర బింబంబును నానియుండుటకును
బోఁటిరో వేణువైపుట్టనైతి,

ప్రాణనాయకుఁడు నన్ బైకొనుండుటకును
బొలఁతిరో పక్షినై పుట్టనైతి
ఎడఁబాయకను గటి నెనసియుండుటకును
భువి హేమచేలమై పుట్టనైతి
ఆడుపుట్టువుపుట్టి యిట్లువిధికాయె
వాని కృపలేక వయసెల్ల వ్యర్థమాయె
విభుని నేమని దూఱుదు వెతలకాయె
నిపుడు కృష్ణుఁడు లేఁడాయె నేమిసేయ.

వ. అని మఱియు నేమనుచున్నది.

చూ. అద్యాఖలు అతులతర కుసుమశర కరతల
విలసదలఘుతర ఖర శరపరంపరా సంధాన సంజాత
దురంత నిరంతర చింతాభరాక్రాంతం మమస్వాంతం।
అత్యంత జ్వలజ్జ్వాలా కరాళాసహనీయ విరహాగ్ని
సంతాప విభంగం మమ సర్వాంగం। సకలతరు
వికస దతులిత కుసుమ నికర
మకరంద బిందు సందోహాస్వాదన సంజనిత
మదమత్త మధుకర ఝ్ఝాంకరణ శుకపిక ముఖ
శకుంతరావ పీడితం మమ శ్రవణ యుగళం।
తృణాగ్రం చలదపి హరిరాగత ఇతి భ్రమేణాహర్నిశ
మనిమిష జాగరూకత్వ మవలంబ్య తదనురాగ

ప్రకట కమిత నలుసనయుగళ మనురక్తం।
హేసఖి! ఏతస్మిన్ సమయే మదీయ మోహాంధకారః
కృష్ణమిత్రం వినా కథం శామ్యతి। మదీయ విరహా
కానసం కృష్ణ దవానలం వినా కథం శామ్యతి।
కథమపి నామాదిభిశ్చతురుపాయై గ్మమ ప్రాణేశ్వరం
కృష్ణమానీ యాత్యంతా మోదం కురు.

సీ. లాలించి యిటకు నారమణుని దెచ్చిన
పణతికి రత్నకంకణము లిత్తుఁ
బ్రియుని వేగమె యీడఁ బిలుచుక వచ్చిన
భామకు మగఱాల పతకమిత్తు
దయితుని నాయింటిదాఁకఁ దోడ్తెచ్చిన
కాంతకు ముత్యాలగంట యిత్తుఁ
గాంతుని నాకనుంగవకుఁ గాన్పించిన
తెఱవకు వ్రేలియుంగరము లిత్తు
వినుమ యెన్నైన నాప్రాణవిభునిఁ దెచ్చి
పొందఁ జేర్చిన మేలైన భూషణములు
చాల మీకిత్తుఁ గృష్ణుని రమ్మనిరిగాను
దామసింపక తోడ్తేర తరుణులార!

వ. అని పలికి సత్యభామామణి తనకుఁ బ్రాణపదమైన మాధవినిఁ జేరఁబిలిచి యేమనుచున్నది.

మోహన॥

వేగమె తోడితేవె మాధవి నీవు॥ వే॥
వేగ శ్రీత్రిశిరగిరి నిలయుని సఖుఁడైన
శ్రీగోపాలుని జాగు సేయక యిపుడు॥ వే॥
అతివరో నావిభుని నతివేగ తెచ్చితే
ఆదివారపుసొమ్ము లిచ్చేనే। హితవుగ నావిభుని
నిటఁ దోడి తెచ్చితే నిందువారపు సొమ్ము లిచ్చెనె
మాధవి॥ వేగ॥
భామరో నావిభుని నడిగఁ దోడ్తెచ్చితే భౌమవారపు
సొమ్ము లిచ్చెనె। చామరో నావిభుని ఝుటితిగాఁ
తెచ్చితే
సౌమ్యవారపు సొమ్ములిచ్చేనే మాధవి॥ వేగ॥
కొమ్మరో నావిభుని నెమ్మని దెచ్చితే గురువారపు
సొమ్ము
లిచ్చెనె। సమ్మతిగా విభు నిచటికిఁ దెచ్చిన శనివారపు
సొమ్ము లిచ్చేనే మాధవి॥ వేగ॥

వ. అని పలికిన మాధవి యేమనుచున్నది.

గీ. ఏడువారాలసొమ్ముల నెలమినొసఁగి
ముక్కరయు నిచ్చితేని నీమొగనికడకుఁ
బోయి నీవంతలెల్లను బొసఁగఁ జెప్పి
వేగిరమె తోడి తెచ్చెద వెలఁది, వినవె

వ. అనిన సత్యభామ యేమనుచున్నది.

గీ. రమణిరోనీకు నాయువారములసొమ్ము
లెలమితో నిత్తు నింక నీరెండు దక్క;
పెక్కుభృగువాసరపుసొమ్ము ముక్కరయును
బోలంతి, యీరెండు ముత్తైదుపోణిమినుమి.

వ. అని మఱియు నేమనుచున్నది.

ఉ. సూర్యుఁడులేని వాసరము సోముఁడులేక మెలంగు
రాత్రియున్
ఆర్యులులేని రాజసభ యంగనలేని గృహంబు మంచియౌ
దార్యము లేనిసంపదయు ధారుణి ముక్కరలేని
ముక్కు మా
ధుర్యము లేని యాకవిత తొయ్యలి, వ్యర్థముగాదె
యెన్నఁగన్.

వ. అనిన మాధవి సమ్మతించి కృష్ణమూర్తిని బిలుచుకొని వచ్చెద ననఁగా సత్యభామ యేమనుచున్నది.

క. నే జాబు వ్రాసియిచ్చెద
నాజీలుగఁ గొంచుఁ బోయి హరిచేతికినిన్
ఈజాబు నీవొసఁగి యా
రాజీవదళాక్షు నిటకు రమ్మను చెలియా.

వ. అని పలికి సత్యభామామణి జాబు వ్రాయించి యిచ్చె టన యెటునలెను.

స్వ. శ్రీమతుల్ యదుకుల శేఖరులైన
కామినీజన బృంద కందర్పులైన
సార సద్గుణ గణ సంపన్నులైన
చారు మహామేరు సమధీరులైన
యష్టలక్ష్మీ విలాసాంచితులైన
శిష్ట పశిష్ఠాది సేవితులైన
నిత్యాన్నదాన మనీషాఢ్యులైన
సత్యవ్రతాచార సంపన్నులైన
భక్తజనాభీష్ట ఫలదాతలైన
సక్తంచర భుజంగ నాగారులైన
యవ్యయులైన నిరాకారులైన
యవ్యక్తులైన నిత్యానందులైన
మామనోహర రాజమాన్య రాజశ్రీ
స్వామివారి పదాంబుజాతంబులకును
సత్యభామామణి సాష్టాంగ మెఱఁగి
యత్యంతభక్తిఁ జేయఁగలవిన్నపము.
క్షేమమై యున్నాము క్షితి నేఁటివఱకు
స్వామి యోగక్షేమ సంతోషములను
సామెడఁ గరుణించి నయము మీఱఁగను

వ్రాయించి పంపఁగావలయు నిత్తరిణిః
ఇచ్చటినుంచి మీ రేఁగిన పిదప
మచ్చరంబున హెచ్చి మఱి చేరవచ్చి
దుర్మార్గుఁడగు మన్మథుండు నామీఁద
మర్మంబు మనసున మాటికి నుంచి
పొదల మాటునను నేర్పునఁ బొంచిపొంచి
మదమునఁ జెఱకువిల్ మఱి వంచివంచి
ఘనికి వసంతాదులను గూడి హెచ్చి
తన దళంబులతోడ దండెత్తి వచ్చి
చండశరాళి విషజ్వాల తీక్ష్ణ
కాండంబు లెదదూయఁగా నెంచినాఁడు.
ప్రాణేశ, నీ వె యీపట్ల రాకున్నఁ
బ్రాణముల్ నిలవు మీపాదంబులాన,
శరణాగతులను రక్షణసేయఁబూను
బిరుదు నిజంబైన వేగ రావలయు.
ఇవి తామరసపత్రమే కాగితముగ
సవరించి కస్తూరి చాయ యొనర్చి
నఖరాగ్రలేఖిని సమర నీసుద్ది
లిఖియించి పంపితి, లీల నీజాబు,
పదివేల జాబుల పగిదిగా నెంచి
కదలి వేగమె వచ్చి కాపాడవయ్య.

వ. అని యిట్లు సత్యభామామణి వ్రాయించి యిచ్చిన-జాబు మాధవి గైకొని యతిత్వరితగతిం జని కృష్ణమూర్తింగని దండప్రణామంబు లాచరించి జాబొసంగి యేమనుచున్నది.

శంకరాభరణము॥

పిలుచుకురమ్మని పంపెరా। సత్యభామామణి॥ పిలుచు॥
చెలువైన శ్రీత్రిశిరగిరి నిలయునికి నెచ్చెలివై
వెలసిన గోపాల సత్యాలలనామణి యెట్టు పెట్టి॥
పిలుచు॥

పలుకవు సడ్డసేయవు తలఁపవు దాపేరంటే।
చులుకన చేసేది మేరా యలుక లేరా చెలివెంటనె॥
పిలుచు॥

వ. అని పలికి జాబు చదువుకొమ్మనఁగా కృష్ణమూర్తి జాబు చదివెనఁట.

'శ్రీమతుల్' ఇట్లు జాబు చదువుకొని కన్ను లెఱ్ఱఁజేసి మాధవిని జూచి కృష్ణమూర్తి యేమనుచున్నాఁడు.

గీ. రమణి రుక్మిణి కన్నను రాధకన్న
సత్యభామకు నేపాటి చక్కఁదనము
చాలుఁ జాలును దానిందప్రజాలమెల్ల
నేనెఱుంగుదు దానింటి కేను రాను.

వ. అని నిరాకరించి పలికిన మాధవి మరలి వచ్చెనంట నొటువలెను.

పాత్రి ప్రవేశము॥ చెలికత్తె॥

వ. ఇట్లు వచ్చిన మాధవినెదుర్కొని సత్యభామ యేమనుచున్నది.

క. గోపాల దేవుఁడిచటికి
నీపట్లను వచ్చునో మఱిప్పుడు రాఁడో
రేపగలు రుక్మిణింటను
గాపుర మున్నాఁడో యొళవు గంటివె చెలియా!

వ. అని యడిగిన సత్యభామను జూచి చెలి యేమనుచున్నది.

చ. హరికడకేఁగి వచ్చితిమి యచ్చట సాగవు మాప్రియంబులున్
వనునకు నెంత తాఁ దెలుపవచ్చును, వాని తలంపులిట్లటం
చెఱుఁగఁగరాదు; గాదనుచు నీడకు వచ్చునొ రాకయుండునో
సరసిజనేత్రి రానియదొ సారెకు నిట్లని తెల్పశక్యమే!

వ. అని మఱియు నేమనుచున్నది.

ఝం ర టి॥

ఏమి చెప్పుదు సత్యభామ వానిగుణము లెంతని విన
రింతు నె॥
భామ త్రిశిరగిరి ధాముసఖుఁడైన గోపాలకృష్ణుఁడు
మునుపటి

వాఁడు గాఁడె॥ ఏమి॥

జగడంపు ముని యిచ్చిన పువ్వుచేకొని సకియ రుక్మిణి
చేతికి నిచ్చి యిది నీకుఁ।
దగును ఇతరులకుఁ దగదనియించుక। మొగమోట లేక
నా మోముముంగలఁ బలికె॥ నేమి॥
పడఁతిరో నీసవతులెల్ల నీదు వామపాదముకిందది
వారని మువ్వాటికి। జడదారి పలుకగ విని
గోపాలుఁడు
సమ్మతించియుండె నమ్మక్క నేచెల్ల॥ ఏమి॥
ఆరుక్మిణిముంగల నారదుఁడు నీపేరెత్తి దూషింప
విని సమ్మతించుక। యూరకుండెనుగాని దాని
పేరెత్తుటకుఁ గారణ మేమని కమలాక్షుఁ డడిగెన॥
ఏమి॥

వ. అని పలికిన వాక్యంబులు విని విరహతాపంబుచేమిగుల
నొగిలి యేమియుఁ దోఁచక మూర్ఛచెందిన వెలఁగంది చెలులు
శైత్యోపచారములు చేసిరఁట యెటువలెను.

కేదారగౌళ॥ ఆది॥

ఉపచారములు సేయరె సత్యభామకు। ఉప।
కృపగలుగు త్రిశిరగిరినిలయుని సఖుఁడైన కృష్ణునిపై
మోహాము చెంది బడలినది॥ ఉప॥

పన్నీటఁ దడియొత్తరె పునుఁగు జవ్వాది పరిమళములు
పూయరె।
చెన్నైన జీనిసురటి చేకొని విసరరె_ కన్నెలార మంచి
గందపొడి చల్లరె॥ ఉప॥

మరువము కురువేరు దవనము బొండు
మల్లెలు పెదచల్లరె। అరవిందముల పాన్పు నతివకు
వేయరె
విరవాజులు జాజులు వేనలిఁ జుట్టరె॥ ఉప॥
కుంకుమ కస్తూరి పచ్చకర్పురు గంధము కుచములపై
నలఁదరె।
కంకణములు ఘలు ఘల్లని మ్రోయఁగ ఫొంకమైన
వీణె
నేర్పున వినిపింపరె॥ ఉప॥

వ. ఇట్లు చెలులు శైత్యోపచారములు చేసినఁ దెలివిగలిగి
కనులు తెఱచి చూచి చెలులతో నేమనుచున్నది.

సీ. పన్నీరు గంధంబు పైపైన చల్లేరు
తీరునా విరహంబు దీనిచేత!
మొగసి రూపము పటమున వ్రాసి చూపేరు
తీరునా మమతలు దీనిచేత!
సొగసైన పువ్వుల సురటిచే విసరేరు
తీరునా బడలికల్ దీనిచేత!
సారెకు శైత్యోపచారముల్ చేసేరు
తీరునా తాపంబు దీనిచేత!

వట్టిమాటలచే నాస లెట్టుతీరు!
ప్రియము గల్గిన మీరు నా ప్రియునికడకు
వేగిరమె పోయి యిపుడు నావెతలఁ దెలిపి
తోడితేరమ్మ కృష్ణుని వేడుకలర.

వ. అని పలికి యత్యంత సాహసంబునసత్యభామ యేమనుచున్నది.

సీ. సుమనోరజములను చుఱుకునిప్పులలోనఁ
బలుమాఱు నేనింకఁ బడకమానఁ
గఱకైన చిగురాకు గండకత్తెరచేతఁ
గుత్తుక దెగఁగోసికొనకమాన
నలరెడు పండువెన్నెల కాఱుచిచ్చులో
గ్రక్కున నేదుముకకను మానఁ
గ్రాఁగెడు పన్నీటి కాలువలోపలఁ
గడుఁ దెంపుచే మునుఁగకను మానఁ

దపసి చేసిన మాయకు దనుజవైరి
వంచనకు రుక్మిణీమణి వన్నెలకును
నేను నున్నట్టి యునికికి నిజముగాను
బ్రాణములఁ దెంపుచేయక మానసిపుడు.

సీ. మాటికి విషపానమైనఁ జేయఁగవచ్చు
విరహవేదనకోర్వఁ దరముగాదు,
మఱి శిలీముఖముల మది నొత్తుకొనవచ్చు
విరహవేదనకోర్వఁ దరముగాదు,
చిచ్చులోనైనను జొచ్చి వెళ్ళఁగవచ్చు
విరహవేదనకోర్వఁ దరముగాదు,
తెగువతోఁ గుత్తుక తెగఁగోసికొనవచ్చు
విరహవేదనకోర్వఁ దరముగాదు
ఆడుపుట్టువు వ్యర్థమై యడవిఁ గలిసె
ప్రాణములు వానికై సమర్పణముసేయ
కేను మాననుఎట్టిచందానవైన
వేగఁ గృష్ణునిఁ దేరమ్మ వెలఁదులార!

సీ. నీలజీమూత సన్నిభ శరీరము నాదు
కుచశైలములమీఁదఁ గూర్పరమ్మ
అతసీకుసుమ సన్నిభాత్యద్భుతాంగు నా
కలువదండలతోడఁ గట్టరమ్మ

రమణీయ తరతమాలశ్యామలాంగుని
మత్తను లతికతో మలఁచరమ్మ
హరినీల నిభ కళేబరుని నాజిగికంట
సరులతో జతగూడ సలుపరమ్మ
అతుల శతకోటి సూర్యప్రభావిభాస
మానగాత్రుసఁ దెచ్చి మదానవాబ్జ
మున్నకు వికసన మొనరించి మనుసరమ్మ
జాగుచేయకుఁ డమ్మ యోచానలాక!

వ. ఇట్లు విరహంబు సైరింపఁ జాలక తత్తరపాటుఁ బొందు చున్న యవసరంబున మరుబలంబుల కోలాహలంబులు విన వచ్చిన నులికిపడి యేమనుచున్నది.

సీ. కోకిల గుంపులు గుమిగూడి కూసేని
చిలుక పౌఁజులు కలకల మనేని
గొరువంక గుబురులు మిణుమిణ్లు చేసేని
కలహంస నికరముల్ సెలువడేని
పలు మయూరములు రెక్కలు విచ్చి యాడేని
తుమ్మెద మొత్తముల్ జుమ్మనేని
వలిగాలి బెబ్బులివలె దూఱి సాగేని
యల వసంతుఁడు కంటికగపడేని

చిలుక బాబావజీరుండు చిగురుటాకుఁ
గత్తి చేఁబూని ఝుళిపించి హత్తి హత్తి
యుల్లిదేఁ బూంచి మితిమించె నమ్మచెల్లి!
కృష్ణునిఁ గానఁ దోడ్తెవె కీరవాణి!

క. ధం ధం ఢణ ఢణ యనుచును
దుందుభిరవముల్ సెలంగ దోర్బలవిలసత్।
గంధవహ వాహుఁడై శర
సంధానము సేయ మరుఁడు సారిన్ వెడలెన్॥

ద్వి. ఓలిమై మొగలిపువ్వు తుపాకిఁ జేసి
లీలతో బొండుమల్లెల గుండ్లు చేసి
సొగసైన పచ్చికస్తురి మందుచేసి
జగతిఁ బుప్పొడిని రంజకముగాఁ జేసి
నగి కురువేరు జానకి త్రాడుచేసి
నిగుడు గన్నేరుమొగ్గ నిప్పుగాఁ జేసి
లలిఁ దమ్మితూఁడు సలాకగాఁ జేసి
పొలుపు మీఱంగఁ బూఁబొదలకు డాసి
యిదె వచ్చె మన్మథుఁ డిఁక నేమిసేతు
మదవతులార, నా మగనిఁ దేరమ్మ.

బృందావన సారంగ॥

చెఱకు విలుతుఁడు వెడలెనె।
యీవేళ నాపై॥ చెఱ॥
చెఱకు విలుతుఁడు చుఱుకు చుఱుకని యురముదాయ
గఱకు టమ్ములు కరుకు కరుకని నాటింప॥ చెఱకు॥
తూరిగ జంగి చిక్కటారి చేఁబూనుక
తారుచును మితి మీఱి యీసారి సారి॥ చెఱకు॥
పొదలుచున్న యట్టపూఁ బొదలకడఁ బొంచితు
మ్మెదల నారి వింటను గదలక సంధించి॥ చెఱకు॥
రోసముచేఁ గనులెఱ్ఱఁ జేసి మీసము వడి
వేసికొనుచు ప్రావేశముతోఁ గూడి॥ చెఱకు॥
నేలైన త్రిశిరగిరి నేలు హరి నెచ్చెలియా గో
పాలుఁడు ననుఁబాసిన వేళ గురిచేసికొని॥ చె॥

వ. అని మఱియు నేమనుచున్నది.

సీ. పొంచెనే చెఱకువిల్ వంచెనే శరముసం
ధించెనే మాధవీ పంచశరుఁడు
డాసెనే రభసంబు చేసెనే ఝుమ్మని
మోసెనే మాధవీ మొనసి తేంట్లు
మెల్లనే చిచ్చుగా నల్లెనే వెన్నెల
చల్లెనే మాధవీ చందురుండు
కలఁకనే మితిమించి కలికెనే కలకల
పలికెనే మాధవీ చిలుకగములు

అల్లదె వసంతుఁ డల్లదె యుల్లసిల్లి
వెల్లివిరిసెను బవనుండు విసరఁ దొడఁగెఁ
గోకిలలు పాడెఁ గేకులు కునిసియాడె
నేమిసేయుదు విరహంబు నెటులసైఁతు.

వ. అని పలుకుచున్నంతన మదనుండు ప్రత్యక్షమై నిలిచి నట్లు తోఁచిన సత్యభామ యేమనుచున్నది.

శా. ఏరా నీవతినిర్దయాపరుఁడవై యిట్లేల యేఁచేవురా
ఈరీతి న్నలయింప న్యాయమటరా, యీకంటు నీకేలరా
ఘోరాముల్ ఘొనరింపఁగాఁ దగదురా పోరా, చలం బేలరా
తోరంబైన పరాక్రమం బిపుడు నాతో నా రతీవల్లభా.

సీ. విరహాగ్నిచేఁ గుంది వెతచెందు వేళల
మండింతురా మంటమారి మార!
మోహసాగరమున మునిఁగి తేలెడు వేళ
శరవృష్టి గురుతురా పరమమార!
తమకంబుచేతను దత్తరించెడు వేళ
చెఱకువిల్ వంతురా చెనఁటి మార!
వలపోవఁ జాలక చరియించు వేళల
బలము లంపింతువా పలువ మార!

నీదు రథ మేడు తునకలై సింగిజాఱ
నీదు బలములు చెట్లకు నెగసి పాఱ
నీదురూపం బరూపమై నిగుఱుపాఱ
నీధనుర్గుణరవమాఱ నిలను మార!

సీ. గళమున నలఁదిన కస్తూరి గనుఁగొని
విషమని యెంతురా వెఱ్ఱిమదన!
కొమరొప్పు నుదుటి కుంకుమచుక్కఁగని ఫాల
నేత్రం బనెంతురా నేఁడు మదన!
విరహాంబునను మేన వెలసిన పాండిమ
భూతి యనెంతురా పోర మదన!
తల నిడుకొన్నట్టి యలుకను గని చంద్ర
లేఖని యెంతురా లేర మదన!
పరమశివుఁ డని మదిలోన భ్రమసి భ్రమసి
యెంచి మిఱి మించి చెఱకువిల్ వంచి వంచి
పొంచెద గుఱించి శరము సంధించఁ దగునె!
యయ్యయో దోసకారివైనట్టి మదన!

సీ. నీలోత్పల శరంబు నీవు ప్రయోగింప
నిడుద కన్నులచేత నేజయింతు
నీరజాతశరమ్ము నీవు ప్రయోగింప
నెఱిఁ గరమ్ములచేత నేజయింతు

నిండు చూత శరంబు నీవు ప్రయోగింప
నిగ్గుపాదములచే నేజయింతు
నిగుడు మల్లె శరంబు నీవు ప్రయోగింప
నీలైన నవ్వుచే నేజయింతు
వద్ద నీవుంచి చెఱకువిల్ నంచితేని
నిడుదలైనట్టి బొమలచే నేజయింతుఁ
జాలు నీబంటు తనమిందు సాఁగ దిపుడు
ఏల పోకిళ్ళఁ బోయేవు బాలమదన!

సీ. నీను కాల్బలములు నింగి పాలౌఁగాక
నీవిల్లు ఖండమైపోవుఁ గాక
నీనారి తెగిపడి నేలఁ బర్వలిడుఁగాక
నీతేరు తునియలై నెగడుఁగాక
నీధ్వజంబులు రెండు నీటిపాలౌఁగాక
నీరూపు బూడిదై తీఱుఁగాక
నీశరంబులు వాఁడి నిర్ధూళి యగుఁగాక
నీమదోద్రేకంబు నిలుచుఁ గాక
తోయజాక్షుల వెతఁబెట్టు ద్రోహివనుచు
శివుఁడు మదినెంచి భస్మంబు చేసెనిన్ను
తిరిగి బ్రదికించి శల్యంబు దెచ్చెనొక్కొ
చెల్లఁబో యేల యేఁచెను చెనఁటి మదన!

సీ. స్త్రీలపై బాణముల్ చెనకియేసెడి వేళ్ళ
విఱచకనే యేల విడిచె శివుఁడు,
కంటుగాఁ దనకంటిమంటచేఁ పడఁద్రోసి
యేల నిన్ బ్రదికించె నిపుడు శివుఁడు,
నీధ్వజంబులు రెండు నీటిపాలుగఁజేసి
నిన్నేల మన్నించె నేఁడుశివుఁడు
అంగహీనంబుగా నైయుండ భువిలోన
నిన్నేల వెలయించె నేఁడు శివుఁడు
నీవు మదిఁబుట్టినప్పుడే నీదుతండ్రి
యుదరగత లోకములు గాల్చి చెదరఁజేయు
పాపకర్ముండ వని నిన్ను బైటవేసె
విరహిణులకెల్ల మృత్యువై వెలయుమదన!

ఆనంద భైరవి॥ ఆది॥

మదనా శరములు సూటిగ నాయెద
నాటించిన నీకనేఁ దాళుదునా। తరుణీజన భయకర
వదనా
చలమిఁకేల దుర్గుణసదనా। ఇది మేరగాదు॥ మదనా॥
పోరా నాతోనిటునలెఁ బోరాటము సేయుట నీకిది
మేర! ధూర్తగోపాలకుమార। బాణ
ఘాతి కోర్వలేర। యిది మేరగాదు॥ మదనా॥

చలమా విరహుల నేఁచేదొక ఫాలమా యింతకు
మేమోర్వఁగలమా యిందునవేమైన ఫలమా
నాయెదుటనె కోలాహలమా । యిది మేరగాదు॥
మదనా॥

ఈపాపము నీకేలర సుమచాపకశిశసటాటోపా।
త్రిశిరగిరిస్థిత నిర్లేపా వికలీకృత నిజపదూరిపా।
యిది మేరగాదు॥ మదనా॥

వ. అని పలికి వెన్నెల కాఁకకు సైరింపఁజాలక చంద్రో
పాలంభ చేసెనఁట యెటువలెను.

సీ. నీకుటిలత్వంబు నేఁటికి నామీఁదఁ
గనిపింపఁ జెల్లునా కమలవైరి!
నీవిషజాతత్వ మీవేళనామీఁదఁ
గనుపింపఁ జెల్లునా కమలవైరి!
నీగురుద్రోహబుద్ధిగతి నామీఁదఁ
గనిపింపఁ జెల్లునా కమలవైరి!
నీము వెన్నెల చిచ్చునేఁటికి నామీఁదఁ
గనిపింపఁ జెల్లునా కమలవైరి।
భువిని బమనాకుతుని మునైపోవునిన్ను
మరలబ్రదికించెఁగా మంటమారిబ్రహ్మ
యేల తరుణుల పాప మీవేళ నీకు
నవనిఁ దోఁబుట్టునకు ద్రోహమైనచంద్ర!

సీ. భువిఁ గన్నతండ్రినిఁ బొంగిపొరగిలంగఁ
బడఁ ద్రోచినట్టి బల్పాపివీవు,
ఒక్క రోహిణిఁ దక్కఁ దక్కిన భార్యల
వాండించు బలుమంటమారి వీవు
గురుపత్నియనియెడు మరియాదలేకను
జేఁబట్టి మెససిన చెనఁటివీవు.
ధరఁ దోడఁ బుట్టినదాని యింటికిఁ గీడు
దలఁచినయట్టి ఘాతకుఁడవీవు
కాన నీజన్మ మెన్నుచోఁ గడిది పూర్వ
పక్షమేగాని సిద్ధాంత పటిమ లేదు
ఇట్టి కుటిలుఁ డనెంచక యీశ్వరుండు
నిన్ను శిరసావహించెఁగా నేఁడు చంద్ర!

సీ. కామినీజనముల కన్నీటివెల్లిలో
నేల పోనైతివో బాలచంద్ర!
విరహిణీ కాంతల విరహాగ్నిలోఁ బడి
నీఱుగానైతివో నీరజారి!
నెమ్మి వియోగుల నిట్టూర్పుపొగలచే
సమయకపోతివో కుముదమిత్ర!
యబలల వెతపెట్టు నన్యాయమునకైనఁ
దునిసి పోనైతివో దోసకారి!

యిప్పుడు క్షయచేత హతుఁడవై యెలమి పొందు
రోగిమైయుండి యోగుకుదోహి, నన్ను
ముంచి చిచ్చు వితాన మంటించుటెల్ల
నీకు న్యాయంబుగాదురా నేఁడు చంద్ర!

సీ. స్త్రీలనెల్లను గాఱుచిచ్చువై మండించు
చందంబు నీకేల చందమామ!
చక్రంబులకును విషాదంబు గల్పించు
చందంబు నీకేల చందమామ!
సత్సంతతుల కాంతి సారెకు నణఁగించు
చందంబు నీకేల చందమామ!
క్షితిఁ బతివ్రతలను జెనకి దుర్యశమొందు
చందంబు నీకేల చందమామ!
యోరి కుటిలుఁడ, పాపాత్మ యోరి దోష
కారి, నాపట్ల నింత కర్కశుఁడవగుచుఁ
దోడఁ బుట్టిన వావంచుఁ దోఁచకిపుడు
సారె కలయింప న్యాయమా చందమామ!

సీ. వెను గురుద్రోహాని పేరందితివిగదా
సంతతంబును నీవు చందమామ!
దోషాకరుండను ఘోరమగ్గైనుగదా
సంతతంబును నీకుఁ జందమామ!

తోడఁ బుట్టింటికిఁ గీడెంచితివిగదా
సంతతంబును నీవు చందమామ!
అబలల పాలింటి యముఁడవైతివిగదా
సంతతంబును నీవు చందమామ!

అమరులెల్లను నిను గుటుక్కనుచు మ్రింగ
లీలఁ బెనుబాము నిను గబళీకరింప
రంకు నీయందుఁ గలిగి కళంకు పొడమఁ
జాల సన్నెట్టులేఁతురా చందమామ!

సీ. కోలచేఁ బట్టి యారాహు కబళింప
సమయమైతి విదేమి చందమామ!
ఎలమి సురాచార్యుఁ డిచ్చిన శాపాన
సమయమైతి విదేమి చందమామ!
వేల్పులు మ్రింగిన వేళ జీర్ణంబుగా
సమయమైతి విదేమి చందమామ!
విషముతోఁ బుట్టిన వేళ నాకాఁకచే
సమయమైతి విదేమి చందమామ!
తోడఁబుట్టినయింటికిఁ గీడుదలఁచు
వాఁడ విఁకనీకు వావేల వరుస యేల
రమణులను నేఁచు పాపకలంకమిప్పుడు
నిన్ను జుట్టక విడుచునా నేఁడు చంద్ర!

క. పగలింటికిఁ బగవైతివి
యగణితసన్మార్గవృత్తి నణఁగించితి, పై
వగ నుడికి సున్నమైనను
బగ విడువవు ద్రోహబుద్ధి వలదురచంద్రా!

చ. ఇలఁ గలకంఠనాదతతి కెన్నఁగ నన్నగధారిజాతహ
స్త లలిత కాండఘాత కెదఁజల్లని చల్లని గాలిరాఁగనే
వలికళికీరసంతతికి హా యని హాయని లేక తాఱఁగా
నిలఁగలనా! నికృష్టరజనీచర! నీకరశాతహేతికిన్॥

ఆహరి॥

నీచందమింకఁ జూపి యేఁచం దగదురోరి
చందమామ। మంచి। రాచవాఁడవైతే రమణుల
నేఁతురా చందమామ॥
నిండు వెన్నెల చిచ్చు నిగిడింపకురోరి చందమామ॥
సుర-
మండలములు నిన్ను మఱి మ్రింగఁ బోయేసు చంద
మామ॥
పగఁ బెట్టి నన్నిట్లు బాధింప వలదుర చందమామ।
పుట్టి!
నెగడు పెద్దపాము నిను గఱవఁబోయెను చందమామ।
అబలల పాలిటి యముఁడవై యున్నావు చందమామ।

నిన్ను। బ్రిబలమైన క్షయము బాధింపకుండున చంద
మామ'.

లక్ష్యములేక రవ్వచేసితివేని చందమామ। నీకు।
దక్షునిశాపము దగులక మానునె చందమామ।
మోహసాగరమున మునిఁగి తేలేవేళ చందమామ।
ఈద్రోహబుద్ధి గురుద్రోహి నీకేలర॥ చం॥
రవ్వసేయక త్రిశిరగిరీశ్వరుఁడు నిన్ను। చంద॥
తల-పువ్వుగా నిడుకొన్నఁ బోకెళ్ళఁ బోయేవు॥చంద॥

సీ. చుఱుకు వెన్నెలకాఁక చూపెదవేమిరా
పంకజారీ, నిన్ను పాముకఱవ,
పంచబాణములు నాటించెద వేమిరా
మార, నీరూపంబు నీఱుగాను
చెనఁటి, నన్ పసియింపఁ జేసెదవేమిరా
మాధవా, నీమధ్యంబడవిఁ గలియ
నెస వేడి వేడిగా విసరెదవేమిరా
మలయానిలా, నిన్నుఁ జిలువ మ్రింగ

నెలమి నెలదోఁటఁ గలకలఁ బలుకు చిలుక!
పంజరంబున నినుఁ జెఱఁబట్టి వేతు
నన్ను నలయించినంతఁ గొన్నాళ్ళకైన
మదము లుడుగకపోవునే మహిని మీకు!

వ. అని చంద్రాద్యుపాలంభంబు చేసిన తదనంతరంబునఁ
చెలులఁ జూచి యేమనుచున్నది.

అడవిలో నొకవృక్షమై యుండుట మేలు
రట్టడి యాఁడుదై పుట్టుకంటె,
ఘనశైలమున రాయిగా పడుండుట మేలు
రట్టడి యాఁడుదై పుట్టుకంటె
ఆకాశమునఁ బక్షియై చరించుట మేలు
రట్టడి యాఁడుదై పుట్టుకంటె
అలగుహలను మృగంబై వసించుట మేలు
రట్టడి యాఁడుదై పుట్టుకంటె,
ఆడుపుట్టువుఁ బుట్టి యిట్లవిధి కాయె
వానికృపలేక వయసెల్ల వ్యర్థమాయె
నేమిసేయుదు! నీమోహ మెటులణఁతు!
నయ్యయో యింత యన్యాయ మవనిఁగలదె!

శ్లో. వృథా నిర్గంధ కుసుమం
వృథా నిష్పండితా సభా।
వృథా నిశ్చంద్రికా రాత్రిః
వృథా నిష్కాంత యౌవనం॥

వ. అని మఱియు నేమనుచున్నది.

ఆ. వె. ఏఁగాఁడు కృష్ణుఁ డెవతెమాయలలోనఁ
దగిలినాఁడో! తెలియఁ దరముగాదు!
ఏమిసేతు! విరహ మేమని సైరింతు!
తోయజాక్షు నిటకుఁ దోడితేరె!

శంకరాభరణము॥ చా॥

ఏలరాఁడు తెల్పవే గోపాలుఁడు॥ ఏల॥
ఏలరాఁడు ఈవేళఁ ద్రిశిరగిరి నేలినచక్కని
వేలుపు చెలియా గోపాలుఁడు
పలు నిందరి జాలము సేయుచు నేలలనామణి
పాలైనాఁడో తెలియ॥ ఏల॥
వన్నెరైకలోనఁ జెన్నుగఁ గ్రిక్కిజేసి యున్న
యట్టి చిన్ని
చన్నులపైమంచి క్రొన్నెలవంకలు తిన్నగఁ గావించి
యెన్నొ సరసములు మిన్నఁగఁ జేసిన కృష్ణుఁ॥ డేల॥
వాలుగంటినిడు వాలుకీల్జడకు మేలౌసన్నజాజి
పూలట్టె సవరించి పాలుగారుచెక్కు లోలిముద్దులాడి
బాళిమోవితేనె గ్రోలిన చక్కని కృష్ణు॥ డేల॥
ముప్పిరిగొన్నట్టి గొప్పప్రేమను గళ, మప్పళించి నన్ను
రెప్పవేయక చూచి కప్పురంపు మడుపు లుప్పొంగి
కౌఁగి
కౌఁగి తెప్పున రతులను దెప్పలాడించిన కృష్ణుఁ॥ డేల॥

వ. అని మఱియు నేమనుచున్నది.

సీ. నగధరు మోవి పానక మానకనుగాని
దాహంబు తీఱునా మోహనాంగి!
వనజనాభుని కౌఁగిటను గదించకగాని
తాపంబు తీఱునా తలిరుఁబోఁడి!

మధుకైటభారితో మాటలాడకగాని
మది జింతదీఱునా మధురవాణి!
పురుషోత్తమునితోను భోగించకనుగాని
యాసలు దీఱునా యంబుజాక్షి!
నాతిరో వెన్నముచ్చు ఎన్నటికి వచ్చు
నెపుడు చనవిచ్చుఁ దాపంబు లెపుడు విచ్చుఁ
గోర్కు లెపుడెచ్చు విభుఁడు నేకొలఁది మెచ్చుఁ
దోడితేరమ్మ కృష్ణుని వేడుకలర.

న. అనిన సఖి యేమనుచున్నది.

బిలహరి|| ఆది||
ఏల వెతలు చెందేవే యోసత్యభామ|
యెందుకు నిటుల కుందేవె||
కన్నీరు నించవలదే యోసత్యభామ|
కరగిన నేమి గలదె||
ప్రాణములు తెగువసేయకే యోసత్యభామ|
పలుమాఱు మనసు రోయకే||
త్రాసము చెందనేలనే యోసత్యభామ|
తత్తర మిఁకఁ జాలునే||
చెలువుని నిన్నుగూర్చెనే యోసత్యభామ|
చింతలెల్లఁ దీర్చెనే||

తెలిసి తానే వచ్చునే త్రిశిరగిరీశు
చెలికాఁడు నినుమెచ్చునే॥

వ: అని యిట్లు సఖి పల్కినఁ గొంతధైర్యం బవలంబించి యుండెనంత.

మ. పరరాజన్య కిరీట సంఘటిత దీవ్యజ్జీవరత్నప్రభో
త్కర నీరాజితపాద, భవ్యమహిమాన్యచ్ఛందప్రమాళీశ్వర
స్థిరకారుణ్య కటాక్ష లబ్ధ విమలశ్రీచోళరాజ్యేందిరా
కర బాహామర సింహభూప, సకలక్ష్మాపాలచూడామణీ!

ఇది శ్రీచోళసింహాసనాధ్యక్ష భోసలప్రతాపసింహరాజ పూర్వ పుణ్యా పరిపాక స్వరూప యమునాంబికా గర్భశుక్తి ముక్తికాయమానాహరసింహ మండలాధీశ్వర నామాంకితం బైన మంత్రి మార్తాండ శివరాయ కారితంబైన శ్రీమత్ సుగంధి కుంతలేశ్వర కరుణా కటాక్ష వీక్షణ సుధాసార సంజనిత చతుర్విధ కవితానిర్వాహక శాండిల్యగోత్ర పవిత్ర కవిసంగయామాత్యపుత్ర విద్వజ్జనవిధేయ మాతృభూత కవి నామధేయ ప్రణీతంబైన పారిజాతాపహరణ నాటకంబునందుఁ గృష్ణమూర్తినద్దకు సఖినిబంపి పిల్వనతఁడు రాననినఁ దాఁబోయి నిష్ఠురోక్తులాడియు రాననిన మరలివచ్చి విరహంబునఁ బొగులుచుఁ జంద్రాద్యుపాలంభంబుచేసి చెలుల హితోపదేశంబున సంతోషంబున నుండుటయు ననుకథల మెలంగు నిది తృతీయాంకము.

---

# పారిజాతాపహరణము

## చతుర్థాంకము

శ్రీరమ్యా, సుగుణహారా,
ధారుమహోదార, సుకవిజనమందారా.
ఘోరారి మద విదారా,
క్షీరాబ్ధిగభీర, యమరసింహ నజీరా!

క. అవధరింపుము నీపేర నంకితముగఁ
బారిజాతాపహరణంబు బాగుమీఱ
నాటకముగాను రచియించినాను వేడ్క-
నేలమినందుఁ జతుర్థాంక మెట్టిదనిన.

వ. ఇట్లు చెలికత్తెలు పలికినం గొంతతడవూరకుండి విరహోద్రేకంబు సైరింపఁ జాలక చెలికత్తెలఁ జూచి యేమనుచున్నది.

సీ. చెలికత్తె నంపించి పిలిచినరాఁడాయెఁ
జెలికత్తెతో మాఱు పలుకఁడాయె
సవతి ముందఱ నన్ను సడ్డసేయకపోయె
సవతికి నేనన్న చప్పనాయె
నతనికి నాపట్ల హితవు తోఁచనిదాయె
నతను బారైతేను అధికమాయె
నాసరివారిలో నవ్వుల కెడమాయె
మగఁడు నామర్యాద మఱచిపోయె

వరుఁ డిటకు రాక వయసెల్ల వ్యర్థమాయె
స్వామికేని గాని శృంగార మేమిసేయఁ
దెలివి మీఱంగ నేఁబోయి తెలియఁ బలికి
ప్రాణనాథుని నెట్లైనఁ బట్టి తెత్తు.

వ. అని నిశ్చయించి సత్యభామామణి విరహంబు సైరింపఁ జాలక కృష్ణమూర్తి చెంగటికి వచ్చి యేమనుచున్నది.

పరుజు॥

ఏహి ఏహి గోపాలకృష్ణ- పాహి పాహి॥ ఏహి॥
ఏహి ఏహి మాం పాహి పాహి మే దేహి తవపరిరంభం।
మృదులాహిశయన కంసాహి ఖగ! జగన్మోహిత
గోపస్త్రీ హితరూపా॥ ఏహి॥
నంద నందన సనందన నుత గోవింద భక్తహరిచందన
పరమానందరూప ముచుకుంద వరద సంక్రందనసందన
వందిత చరణా॥ ఏహి॥
మిత్రనిశాకరనేత్ర పవిత్ర చరిత్ర నీలనిభ గాత్ర
మునిస్తుత పాత్ర బకశకట జైత్ర హరే సుపత్రత్రి పత్ర
యదుగోత్రజ శౌరే॥ ఏహి॥
అశ్వముఖ సకల విశ్వంభర సర్వేశ్వర నిరవధికైశ్వర్య ప్రద-
శాశ్వత త్రిశిరగిరీశ్వర సఖ సర్వ స్వతంత్ర జితవిశ్వా
మిత్ర॥ ఏహి॥

వ. ఇట్లు పిలిచిన నిరుత్తరుఁడై యున్న కృష్ణమూర్తిని జూచి వెఱఁగంది "మాధవి! సంస్కృతముతోఁ బిలిచినఁ బలుకఁ డాయెనే! యేమిసేతునే। మాధవి, కన్నడముతోఁ బిలుతామఁట నె.

అయితే పిలిచి చూడనమ్మా.
బారో కృష్ణబారో వొందు ముద్దు తారో కృష్ణతారో
బారో వొందుముద్దుత్తారో మన్మథవికార తీరతికే,
శ్రీరమణా శ్రీరుక్మిణియు బోదనెయ -క్కళినన మేలే
నెరవెణసబేడ నీనేగతి ననగె॥ బారో॥
రాకేందు సమవదన యూకో నన మేలే
యీణోపవు నినగె, సాకు సాకో॥
ఏకాంత దల్లి బ్బరేక దాగిరల- కంద నన్నప
రాకు మాడ బేడ॥ బారో॥
బాళియింత బరహేళి కళసువాగి జాలమాడువరు
నేను వె నినగె।
మేలా యితు శ్రీత్రిశిరగిరీశ్వరన మిత్ర నాద
సుచరిత్రి కరుణై యిట్టు॥ బారో॥

కల్యాణి॥
ఎన్నయ్యా గోపాలా వుమక్కి-త్తనై మోడి,
యానుమ్మై నరిత్తదుం వెరుం నీణాచ్చుదో
యివ్వళవుం।

తోణాదో నన్నాచ్చుగు ఆశై యిట్టు పిరియలామో
ఎన్నయ్యా॥

వరవర నీరెందన్ వళప్రక్కు మున్పోలె
వరచ్చొన్నపోదెల్లాం వళక్కాడురీర్।
హరి హరి యెన్ మీదిల్ కురై యెణ్ణి యిల్లాద
తిరుకుం మురుకుం పణ్ణి పెరుమయాయి పేశురీ॥
రెన్నయ్యా॥

మయ్యల్ కొండు యెన్నై కైయ్యొప్పి డిత్తు సరసా
సెయ్యత్తోడుత్తదుం పొయ్యాచ్చుదో అంద
తయ్య లిట్ట మరుంకు మెయ్యాయి తలైక్కేరి
సెయ్యాద కారియం సెయ్యని నైక్కురీః రెన్నయ్యా॥

ఆశైకొండు మోహావేశం తేరకూడి
ప్పేశనంద ఎన్నై యేశు కిరీర్।
దాస సంరక్షణోల్లాస శేషైకుంఠవాస
శేత్రిశిర గిరీశకుక్కం నేశశే॥ యేన॥

మహారాష్ట్రిం॥

యాహే గోపాలా కరుణేనే యాతా॥
తుజ వినా గతి, మజ కోణ్హీ నహీ।
సుజనా మందారా॥ గో॥
విరహాభరసో స్త్వైనతు జాణ సరసిజదళనయనా॥ గో॥
త్రిశిర గిరీశమిత్ర దివ్యతర చరిత్ర వసుదేవబాళ॥ గో॥

హిందీ॥

గలేగలే మిలేల ఆరే గోపాలా॥
తేరే మిహర్ భాగీ మే శరణో తేరే
ఉనో చలో మేరే ఘుమ్క జన్ది ఆరే॥ గలే॥
త్రిశిరగిరీసరపిృయసఖ సునో రే।
పూలకే భాగమే ఖేలే ఆరే॥ కృష్ణ॥ గలేగలే॥

వ. అని యనేకవిధంబులఁ బిలిచియు మాటాడకయున్న, మాధవి 'నమస్కరించి పిలిచి చూడు' మనఁగా భయభక్తితో సత్యభామామణి కృష్ణమూర్తికి నమస్కరించెనఁట యెటు వలెను.

శ్లో. నమామి సంసార తమః పతంగం
నమామి గోపీజన మోహనాంగం
నమామి రాధారమణీ భుజంగం
నమామి కృష్ణం కరుణాంతరంగం॥

క. దండమయా జగదీశ్వర,
దండమయా మోహనాంగ, దండము రమణా
దండమయా పురుషోత్తమ,
దండమయా మదనమదన! దండముకృష్ణా!

వ. అని మఱియు నేమనుచున్నది.

సీ. ఒక్కదండము నీకుఁ బక్కినెక్కినసామి
పదిదండములు నీకుఁ బరమపురుష!
నూఱుదండంబులు నీరదనిభగాత్ర,
వేయిదండంబులు వేదవేద్య!
పదివేలదండాలు యదుకులాంబుధిచంద్ర!
లక్షదండములు విపక్షశిక్ష!
దశలక్ష దండాలు వసుదేవ వరపుత్ర
కోటిదండంబులు కైటభారి!
నీకు దశకోటిదండాలు లోకనాథ!
నీకు శతకోటి దండాలు నిర్మలాత్మ!
మొనసి నేఁజేయు నపరాధములు సహించి
వడిగ నింటికి రమ్ము గోపాలకృష్ణ!

వ. అనినఁ గృష్ణమూర్తి యాశీర్వాదించెనఁట యెటువలెను.

సీ. పూసరమ్ములచేత వాసించునీకప్పు
గొప్ప కొప్పునకును గుశలమస్తు
బింబఁబునకుఁ బ్రతిబింబమై తగునీదు
పలుచని మోవికి భద్రమస్తు
కనక కుంభంబులకన్న మిన్నైన నీ
బటువు గుబ్బలకు సౌభాగ్యమస్తు
శృంగార లావణ్య సీమమై తగునీదు
చక్కందనమునకు సౌఖ్యమస్తు

భామ, నీమధ్యమునకును క్షేమమస్తు
రామ, నీకుచ్చులకుఁ గల్యాణమస్తు
కమలదళనేత్రి, నీకు దీర్ఘాయురస్తు
రమణి, నీయింటికిని నేను రానుపోవె!

వ. అని

గీ. నీకు దీర్ఘాయువగుఁ గాక నీరజాక్షి,
నీకుఁ గుశలంబు తోఁగాక నీలవేణి,
నగలు సేయను మిపుడు నీనగలు దెలిసెఁ
జాలు నీయింటి కేరాను సత్యభామ!

వ. అని నిరాకరించిన కృష్ణమూర్తినిఁ జూచి నయవాక్యంబుల నేమనుచున్నది.

క. రావయ్యా గోపాలక
రావయ్యా భక్తవరద, రాక్షసహారణా!
రావయ్యా ప్రాణేశ్వర
రావయ్యా కమలనాభ. నవిశాలనేత్రా!

వ. అనినఁ గృష్ణమూర్తి యేమనుచున్నాఁడు.

క. పదియారువేల సంఖ్యల
సుదతుల కన్నాను నీకు సౌభాగ్యఫలంబా
మదిరాక్షిరో! నీయింటికిఁ
బదివేలైనాను రాను పదవే పదవే.

వ. అనిన సత్యభామ.

క. రావే కమలదళాక్షా!
రావే కరుణాకటాక్ష, రాక్షసశిక్షా!
రావే యాదవపక్షా!
రావే నతకల్పవృక్ష, రావే కృష్ణా!

వ. అనినఁ గృష్ణమూర్తి

క. అందని మ్రానిఫలంబున
కందముగా రామచిల్క యాశించుగతిన్
ఎందుకుఁ బిలిచితి విప్పుడు?
ఇందుముఖి నేను నీదునింటికి రానే.

వ. అనిన విని సత్యభామ.

క. రారా గోపకుమారక!
రారా వరజారచోర, రారా రమణా!
రారా మందరగిరిధర!
రారా కంసాసురార్తి, రారా శౌరీ!

క. రానే చిలుకల కొలికీ!
రానే మరుపువ్వములికి, రానే కలికీ!
రానే యిఁక నీయింటికి
రానే యోసత్యభామ, రానేరానే!

వ. మఱియుఁ గోపావేశుఁడై యేమనుచున్నాఁడు.

క. రారా పోరా యనుచును
వారిజదళనేత్ర, యేకవచనముగాఁగఁ
సారెకుఁ బిలుచుచును వృథా
పోరాటము పెట్టవలదు పోవేపోవే!

వ. అని నిరాకరించి పలికెడు సత్యభామామణి యవ్వాక్యంబుల కేమనుచున్నది.

ఎఱుకల కాంభోజి॥

మదుని శరములకు నేమని సైఁతురా కృష్ణ!॥
తెలివ, యిన్నాళ్ళకైనఁ దెలిసెనా యోసత్య!॥
చంద్రుకు కాఁక కే నెట్లు సైరింతురా కృష్ణ!
చందనగంధి నీపొందు చాలునె యోసత్య॥
బిగియఁగౌఁగిలించి నాతోఁ బెనఁగవేర కృష్ణ!
వగలాడి నిన్నెఱుఁగనా నీవగలు చాలు సత్య॥
చక్కెర కెమ్మోవి నీవు నొక్కవేర కృష్ణ!
అక్కర గలదానివలె నాడేవేమి సత్య॥
ఎలమిఁ ద్రిశిరగిరీశ్వరుని చెలికాఁడైన కృష్ణ!
చలమేల మునుపటి పొందు చాలునె యోసత్య॥

వ. అని మఱియు నేమనుచున్నది.

సీ. గజనిమ్మపండ్లిదే కానుకగా నిచ్చెదఁ
బట్టరా చేకొద్ది ప్రాణనాథ!
కడిఁది బింబఫలంబు కానుకగా నిచ్చెద
రుచిచూడరా యనిరుద్ధరూప!
కడుఁ జెక్కుటద్దముల్ కానుకగా నిచ్చెద
ముద్దులు పెట్టరా మోహనాంగ!
కాముని రాజ్యంబు కానుకగా నిచ్చెద
నెమ్మిని నేలరా యెమ్మెకాఁడ!
బలిమి వలచితి ననుచును జాలుకచేసి
పలుకక చెలులలోపల నలిగి యిట్లు
జాల మొనరింప నాయమా సరసిజాక్ష!
భక్తరక్షణకృష్ణ! గోపాలకృష్ణ!

వ. అనినఁ గృష్ణమూర్తి యేమనుచున్నాఁడు.

సీ. కనకకుంభములు లెక్కకు మిక్కిలైయుండ
గజనిమ్మపండ్లేమి కానుకేమి
మాకందఫలము లనేకంబులైయుండ
ఘనబింబ ఫలమేమి కానుకేమి
కులుకుఁ గుందనపుఁ దళ్కు లపారమైయుండఁ
గడిఁది యద్దములేమి కానుకేమి
కమ్మవిల్తుని బొక్కసమ్ము లెన్నోయుండఁ
గలికి రాజ్యంబేమి కానుకేమి

యిచటఁ దక్కువయేమె యోయెమ్మెలాడీ
నీదు కపటస్వభావంబు నీను వగలు
నీదు తసుకులు నసుకులు నేనుగంటిఁ
జాలుఁ జాలును నీప్రేమ సత్యభామ.

వ. అనిన సత్యభామ యేమనుచున్నది.

ఎంత వేడినఁగాని వింతచేసేవేమి బాలకృష్ణా! యీ
యింతులలో నీవు ఏపాటిదానవు సత్యభామా॥
నెనరిసుమంతైన నీకేల లేదుర బాలకృష్ణ॥
మనసు లేనిచోటి మత్ప్రేమ గలదఁటె సత్యభామ॥
లంచము లిచ్చి పిలిపించిన రావేమి బాలకృష్ణ! నీ
వంచన మాటలు వనిత కట్టి పెట్టు సత్యభామ॥
పాపజాతి మరునిపాలు సేయవలెన బాలకృష్ణ।
కోపకత్తె రుక్మిణి వినఁబోయెని సత్యభామ॥
త్రిశిరగిరీశ్వరుని సఖుఁడని తెలిసెనుర బాలకృష్ణ।
వశము చేసుక రతులఁ గలయఁ జూచేవేమి సత్య
భామ॥

రారా కృష్ణా॥ రానే భామా॥

వ. అనిన సత్యభామ యత్యంత కోపావేశంబునఁ గృష్ణ
మూర్తిని నిందించెనఁట యెటువలెను.

శా. దొంగా, జారుఁడ, ధూర్త, పుణ్యజనతాద్రోహీ,
జగద్వంచకా,
యెంగిల్ ముచ్చ, కిరాతమిత్రి, రమణీహింసాపరా,
మామనున్
భంగంబుం బొనరించువాఁడ, కుటిలుండైన ట్టనాకార, నీ
సంగంబున్ మదిఁ గోరినట్టిసను నేఁచన్ నాయమా
నిర్గుణా!

ఉశాని॥ చాపు॥

నీకేటి కనికరము నీకేటి ప్రేమ।
శ్రీకరుఁడౌ త్రిశిరగిరి శివుని మిత్రుఁడైన కృష్ణ!
పొలఁతుల మనసు తెలియని పుట్టుబ్రహ్మచారివి।
వెలఁది యెంగిలి కాసించు వేషధారివి।
తెలిసి స్త్రీహత్యలకు వెన్కదీయని దోసకారివి।
చెలఁగి బ్రహ్మహత్య లెన్నో చేసిన యనాచారివి॥ నీ॥
అరయ నావియనుటు లేక యత్తను బట్టినవాఁడవు
పరువడిఁ గూఁతురిని జెట్టఁబట్టువాఁడవు।
గురుతరమైనట్టికులము గోత్రము లేనివాఁడవు।
నరులు నవ్వఁగను మగనాండ్రను జెఱిచేవాఁడవు॥ నీ॥
రేపల్లె యిండ్లలో దొంగిలించుచుఁ దిరిగేవాఁడవు।
ఏపున నావుల దూడల మేపేవాఁడవు
రూపించుపట్ల పుణ్యజన ద్రోహివై వెలయువాఁడవు।
నైపుమీఱి మందగొల్ల వాఁడవైన నిర్గుణుఁడవు॥ నీ॥

వ. అని మఱియు నేమనుచున్నది.

సీ. అవని వావని లేక యుత్తిను బట్టిన
  విత్తము లెల్లను బైట వేయవలెనొ!
మరియాద లేకను మగనాండ్రఁ బట్టిన
  గుట్టెల్ల రచ్చలఁ బెట్టవలెనొ!
ఇండ్ల నిండ్లను దొంగిలించిన సిగ్గు
  పలుమాఱు సభలలోఁ దెలుపవలెనొ!
యుడరి రోటనుగట్టువడి పెట్లుతిన్నట్టి
  చప్పుఁదనంబెల్ల జెప్పవలెనొ!
యిట్టి నీగుట్టు మఱి నీదునింటివరుస
యెల్లవారలుఁ దెలియ నంగళ్ళఁ బెట్టి
బైట వేయకమున్నె నాపరిక్కఁ జేరి
నేఁడు నన్నేలి సిగ్గు గాపాడుకొమ్ము.

వ. అనినఁ గృష్ణమూర్తి యేమనుచున్నాఁడు:

సీ. మహిని నేఁ బరబ్రహ్మమని యెంచి రాధిక
  యాత్మనివేదనం బప్పుడొనర్చె,
మునిసముదయములు మోక్షార్థులై నన్ను
  వల్లవీకాంతలై వలచిరెన్న,
ఆభీరవనితల యతిభక్తి శోధింప
  జారచోరత్వంబు సల్పినాఁడ
ధనదాత్మజుల శాపమును దీర్చుకొఱకునై
  బలిమి ఱోటనుగట్టువడితి నేను,

తెఱవ, యీమర్మమిట్లని తెలిసికొనక
యూహబుద్ధిని నను వెడనాడఁ దగునె!
నీదుగుణముల నెఱుఁగుదు నీరజాక్షి!
చాలుఁ జాలును నీప్రేమ సత్యభామ.

వ. అనిన సత్యభామ యేమనుచున్నది.

సీ. మామయంచును లేక వేమాఱు కంసునిఁ
జేరి చంపిన సుద్ది చెప్పవలెనొ!
నందనుండని లేక నరకాసురునిబట్టి
చిదిమిన యాసుద్ది చెప్పవలెనొ!
స్త్రీహత్య యనిలేక చెలఁగి పూతనఁబట్టి
చిమ్మిన యాసుద్ది చెప్పవలెనొ!
తల్లిని వెఱపించి తగనపకీర్తులఁ
జెందిన యాసుద్ది చెప్పవలెనొ!
ఇట్టి నీగుట్లు మఱియు నీయింటివరుస
నెల్లవారలుఁ దెలియ నంగళ్ళఁ బెట్టి
బైట వేయకమున్నె నాపక్కఁ జేరి
నేఁడు నన్నేలి సిగ్గు కాపాడుకొమ్ము.

వ. అనినఁ గృష్ణమూర్తి యేమనుచున్నాఁడు.

సీ. వసుదేవతనయుఁడై వసుధ జన్మించుట
కంసవధార్థంబుగాదె తెలియ!
దనుజమర్దన బిరుదాంకుఁడై నందనుం
డగు నరకునిఁ దెగటార్చినాను

నన్నుఁ జంపుటకునై చన్నియవచ్చిన
కుటిల పూతన నేలఁగూల్చినాను
ధర నన్ను పెంచిన తల్లికి నావిశ్వ
రూపంబు నైపుగాఁ జూపినాను,
ఇట్టి మర్మంబు దెలియక యిగురుఁబోఁడి
పూని వెడ నాడెదవు ఆడుబుద్ధిచేత
నీదుగుణముల నెఱుఁగుదు నీరజాక్షి!
చాలుఁ జాలును నీప్రేమ సత్యభామ.

వ. అనిన సత్యభామ యేమనుచున్నది.

సీ. గొల్లవాఁడా నీవు కొండనెత్తితివని
లీలతోడుతను గర్వించినావా!
పసుల మేపేవాఁడ, ముసలిపామును మెట్టి
కొని నటించితినని కొవ్వినావా!
దొంగిలించేవాఁడ, తోషరి దైత్యులఁబట్టి
దుంచితినని మితిమించినావా!
వేసకాఁడా చిచ్చు విడక మ్రింగితినని
వేమాఱు మది విఱ్ఱవీఁగినావా!



కాని కానిమ్ము ఇపుడు నీకథలు బట్ట
బైట వేయకమున్నె నాప్రక్కచేరి
నేఁడు నన్నేలి సిగ్గు గాపాడుకొమ్ము.

వ. రారా కృష్ణా! రానే భామా॥

సీ. నీవు నన్నాడిన నిష్ఠురవాక్యముల్
మదికి నింతైనను మఱపురాదు,
కొండ నెత్తినదెల్లఁ గొప్పమహాసత్వముగాదు
గోవుల గొల్లలఁ గావఁ గాదె!
పాముపై నటియించువాఁడ వంటివి దేమి
జీవరాసుల నెల్లఁ బ్రోవఁగాదె!
దొంగిలించితివని దూఱనాడితి వేమి
మఱి జారచోరత బిరుదుగాదె!
మంచి గుణములు ఇవియను మర్మమెల్లఁ
దెలియఁ జాలక యిటుల నిందింపఁ దగునె!
యెఱిఁగి యెఱుఁగని వారికి నెఱుక చేసి
చాలుఁ జాలును నీప్రేమ సత్యభామ.

వ. అనిన సత్యభామ యేమనుచున్నది.

సీ. నీతల్లి నెఱుఁగనా నీకుఁ జన్నియక
పుట్టినప్పుడె వెళ్ళఁగొట్ట లేదా!
నీయక్క నెఱుఁగనా నెఱినొక్కనినిఁగాక
యైదుగురిని బెండ్లియాడ లేదా!
నీయత్త నెఱుఁగనా నింఘుమోహముఁజెంది
సిగ్గులేకను నిన్ను జెనక లేదా!
నీచెల్లి నెఱుఁగనా నెఱిముచ్చుసన్యాసి
నక్కఱతోఁ బెండ్లాడ లేదా!

ఓరి, నీయింటివరుస లిట్లున్నవనుచు
బంధుజనులెల్ల నవ్వఁగా బైటవేసి
యాడికల కిమ్మసేగఁని యటకుమున్నె
నేఁడు నన్నేలి సిగ్గు గాపాడుకొమ్ము.

సీ. మాతల్లి గుణములు మఱియేమిగంటివి
కంసుండు చేసిన హింసగాదె!
మాయక్క మహిమ లేమనియంటి వామెను
స్మరణచేసినఁ బాపహరముగాదె!
మాయత్త నడకలు మఱియేమిగంటివి
బ్రహ్మసంకల్ప మాపాటిగాదె!
భామ, నాచెల్లెలి నేమిగంటివి నీవు
మమతతో నేఁజేయు మాయగాదె!
భామ, నీవిట్లు సభలోనఁ బలుచఁజేసి
మగడనే మేర మర్యాద మట్టులేక
మించి వెడనాడఁ దగునఁటే చంచలాక్షి !
చాలుఁ జాలును నీప్రేమ సత్యభామ!

వ. అనిన సత్యభామ యేమనుచున్నది.

సీ. మున్నిటఁ బుట్టిన పుణ్యసంబంధమా
గవ్వనుబట్టి శంఖంబనేవు,
గుండుగా విలసిల్లు కుమ్మరిసానను
గరమునఁ బట్టి చక్రింబనేవు,

గొప్పవృక్షంబుల దెప్పున ఛేదించు
గండ్రగొడ్డలిఁబట్టి గదయనేవు,
వనములోఁ బుట్టిన వంకరబద్దను
రహిఁజేతఁ బట్టి శార్ఙ్గంబనేవు
నీదు దాసరివేషంబు నీదువగలు
నీదు గొల్లతనంబును నీదుగుణము
బైట వేయకయున్న నాపత్రికఁజేరి
నేఁడు నన్నేలి సిగ్గు కాపాడుకొనుము.

వ. రారా అనినఁ గృష్ణమూర్తి యేమనుచున్నాఁడు.

సీ. ప్రణవాత్మకంబైన పాంచజన్యముఁజూచి
ననబోణిగో గవ్వ యనఁగఁ దగునె!
సూర్యకోటిసప్రభాశోభి చక్రముఁ జూచి
మొనసి కుమ్మరిసారె యనఁగఁ దగునె!
కర్పూరవన పావకంబైన గదఁ జూచి
యల గండ్రగొడ్డలి యనఁగఁ దగునె!
శాత్రవశైల వజ్రమగు శార్ఙ్గముఁ జూచి
యలుకు వంకరబద్ద యనఁగఁ దగునె!
దీని మహిమంబు లిట్టివని తెలిసికొనక
మూఢబుద్ధిని నీవు పరాటలాడఁ దగునె!
మంచి గుణములు గావివి మంజువాణి!
చాలుఁ జాలును నీ ప్రేమ సత్యభామ.

వ. అనిన సత్యభామ కనలి యేమనుచున్నది.

అసావేరి॥

బాగాయె నీగుట్టు గన్గొన బైలాయెఁ గదర।
ఆగడకాఁడా। త్రిశిరగిరి పతికి సనుఁగనైన
గోపాలకృష్ణ॥ బాగాయె।
ఏపౌరుషంబని మేనమామ నెంచక నీవు
సంహరించినావు। ఏపాటి వివేకమనుచు స్త్రీహత్య
నెన్నక నీవు గావించినావు॥ బా॥
ఏమి తెలియవనుచు ముచ్చుసన్యాసి కెలమి నీచెల్లెలి
నిచ్చినావు। ఏమి పరీక్షించుటంచు బోయదా నెంగిలి
పండ్లారగించినావు। బా।
ఏగొప్పతనంబని బ్రహ్మహత్య మొస్నక నీవు గావించి
నావు।
ఏగౌరవమని రేపల్లెలోన నిండ్లనిండ్ల దొంగిలించి
నావు॥ బా॥
ఏమి భూషణంబని మగవాండ్రి నెనయఁగోరి
చెట్టెఁబట్టినావు
ఏమరియాదని మేనత్తయైన యింతి రాధికను
గూడినావు॥ బా॥
పెట్టిబహుమానమని సుజ్ఞానహాపమొత్తి బలిని
యాచించినావు। ఏటి ఘనత యని శుద్ధ
బౌద్ధుఁడన నెంతో ఖ్యాతి చెందినావు। బా॥

వ. అని మఱియు నేమనుచున్నది.

క. పెను ఱాయి మోచి యప్పున
మునిఁ గందఱిలోన భంగ మొందిన బలున
ల్లనిసామి, నీకు నాపైఁ
గనికర మొకయించుకైనఁ గలుగునెకృష్ణా!

వ. అనినఁ గృష్ణమూర్తి యేమనుచున్నాఁడు.

సీ. ఒక కొండ యెత్తినందుకు నాడితివి రెండు
కొండలు నీయందు నుండలేదె!
యప్పులో మునిఁగినానంటివి కాంతి స
ముద్రంబునను నీవు మునుఁగలేదె!
భంగంబుఁ జెందిన వాఁడవంటివి నళి
భంగంబు నీయందుఁ బరఁగలేదె!
నల్లని మగవారి నమ్మరాదంటివి
నల్లన నీదు వేనలిని లేదె!
ఇట్టి దుర్గుణముల కునికిపట్టవీవె
కాక కలదఁటె యన్యాయకారి, ద్రోహి,
పాతకీ, నీవు నన్నిట్లు పలుకఁ దగునె!
తత్వ మింతైనఁ దెలియక తలిరుఁబోఁడి!

వ. అని యిట్లు పలికిన హరిని ననేకవిధంబుల నెడనాడి కోపావేశంబున రుక్మిణిం జూచి సత్యభామ యేమనుచున్నది.

ఉ. నీదగు కోర్కి పండెఁగద! నీతపముల్ ఫలితంబులాయెఁగా
నీదు మనోరథంబులును నెమ్మదిగా నెఱవేర్చుకొంటివే!
నీదగుపద్దు చెల్లెఁగద! బిచ్చలు నీవలె నేనుగానొ! నా
నాథుని నన్ను బాపితివి నాకొక దైవములేదె రుక్మిణీ!

ద్వి. మగువరో విను నీదు మర్మంబులెల్లఁ
దెగువతో నలుగురుఁ దెలియఁ బల్కెదను.
చేరి నీతండ్రియా శిశుపాలునకును
నీరజదళనేత్రి, నిన్నిత్తుననుచు
సమకట్టియున్న యాసమయంబునందుఁ
గ్రిమమున విప్రునిఁ గడువేగఁబంచి
వడి మీఱ నీగొల్ల వాని రప్పించి
బడిబడిఁ బెండ్లిసంభ్రమమెల్లఁ జెఱచి
యీగొల్లవానితో నిలరథంబెక్కి
బాగుగా నడ్డమై వచ్చు మీయన్న
నొగిఁ దల గొరిగించి యుల్లాసముగను
నగుచును నగధరునటఁ బెండ్లియాడి
నట్టి సాహసివీవు నాసరిగాను
నెట్టన నీవు నన్నెదిరించితేని
సదయుఁడు చూడ నీపతులుచూడ
నదన నీచెలికత్తెలందఱుఁ జూడఁ
జెలి, నాదు జడయను చేర్పాందు చేత
వెలఁదిరో, పెల్లని వేయక మాన.

వ. అనినఁ గోపావేశంబున రుక్మిణీదేవి సత్యభామను జూచి యేమనుచున్నది.

ద్వి. పొల్లఁతిరో, వినవె నీపూర్వోత్తరంబు
దెలిపెద నీకఁ దేటతెలివిగా నీదు
తండ్రి సత్రాజిత్తుఁ దగనిందఁబెట్ట
వేండ్రమై తగు నింద వేగఁబాపుటకు
మణిదెచ్చి యీయఁగా మచ్చిక మెచ్చి
మణితోడ నిన్ను నీమాధవు కిచ్చె.
ఆనిందకోసమై యఁతివరో, నిన్నుఁ
బూని చేకొనె నట్టిపొలఁతివి నీవు,
కడు మనఃపూర్వంబుగాఁ బెండ్లియాడు
పడఁతి రీతిని నన్ను బంతగించేవు.
పనుపడి నిన్న కుప్పయును నేఁడాళ్ళు
వనితరో, సరిఁబోరవచ్చుట కీవు.
ఏపాటిదానవు ఎంచిచూడఁగను!
హా పోవె నీకు నాకజగజాంతరము
కొండతోఁ దగరు డీకొన్నచందాన
మెండొడ్డి నన్ను నేమేమొ పల్కెదవు,
మగని నెంచక తప్పుమాట లాడెదవు
మగఁడు చూడంగ నీమగువలు చూడ
సరగ నందఱు సఖీజనములు చూడ
గరిమ నాజడచేతఁ గట్టి కొట్టెదను

వ. అని పరస్పర మేమనుచున్నారు.

సవతుల కొట్లాట:

నామగనికి నాకుఁ గాకచేసితివదేమె రుక్మిణీ।
నీమగండె కాని నామగఁడు గాఁడంటె సత్యభామ॥
మాట యెత్తనట్లు మందుఁబెట్టితివదేమె రుక్మిణి।
సాటిగ నీవు నాతో నెదిరించఁ దగునఁటె సత్యభామ॥
విరిముడిచి గర్వాన విఱ్ఱవీఁగి పలికేవేమె రుక్మిణి।
ఎఱుఁగ కిట్లాడితే యిఁకబుద్ధి దెలిపెద సత్యభామ।
హెచ్చుతగ్గులుగ నిట్లుపోనాడే వదేమె రుక్మిణీ।
ముచ్చుఁదనంబెల్ల నావద్ద చెల్లదు సత్యభామ॥
సవతిపంతము నీవు చెల్లింపఁ జూచేవదేమె రుక్మిణి।
వివరము తెలియక యూరక మొఱఁగేవు సత్యభామ॥
అతివ, మాకందఱకుఁ బెద్దదానవు నీవు అక్కరుక్మిణి।
జతగా నీవు నేను గూడి యుందమిప్పుడు సత్యభామ॥
అల్ల త్రిశిరగిరి వల్లభుచెల్లెలవైన రుక్మిణి।
చల్లఁగ నాడితివి సంతోషమాయెను సత్యభామ॥

వ. ఇట్లు రుక్మిణీసత్యభామలు వచనంబులాడుచున్న సమయంబున నడ్డంబు తగిలి రాధ సత్యభామను జూచి యేమనుచున్నది.

చ. మగఁడని మేలెఱయెంచకను మాటికిఁ గృష్ణుని పీడనాడి పె-
ల్లుగ మఱిపెద్దయెంచనక రుక్మిణినిన్ మఱిపీడనాడి తీ-
వగ నీఁక పెట్టిపట్టితివో! పల్మఱు బుద్ధికయింతలేకయో
మనువరో! సిగ్గులేక యిటు మాటలనాడఁగ నీకుఁజెల్లునే

వ. అనిన సత్యభామ యులికిపడి మాధవినిం గనుంగొని యిదెవ్వతె యని యడుగఁగా, రాధయని మాధవి తెలుపఁగా, రాధను గనుంగొని సత్యభామ యేమనుచున్నది.

ద్వి. చాన రుక్మిణి నేను సవతులు గనుక
ఆని కొట్లాడుచో నడ్డంబు తగిలి
సరసగ మాటాడ సవతివా నీవు
ఎఱుఁగనా నేను నిన్నెగ్గింతలేక
యల్లునిఁ జేపట్టినట్టి దుర్గుణివి.
ఇల్లాలివలె నీవు నెదిరించఁ దగునె!
కరమొప్ప హరి బొట్టుగట్టెనా నీకు!
పెరిమతో మావలెఁ బెండ్లాడినావ?
దొంగతనంబుగాఁ దొలినుంచి శౌరి
యెంగిలి కాసించు నింతివి నీవు.
నీమట్టు నీగుట్టు నేనెఱుంగుదును.
భామ, నాతోఁ బ్రియకు వచ్చితి వేని
కఱుకైన నాచెలికత్తెలచేత
బరువడి నాసయన్ పగ్గంబుచేత

మగువరో నీదాంగమగఁడు చూడంగఁ
బగఁబెట్టి నేనొక్కపట్టున నిన్ను
గట్టించి కొట్టించి కడుభంగ పఱచి
ముట్టిడి మోహాబ్ధి ముంచకమాన.

వ. అనిన రాధిక సత్యతో నేమనుచున్నది.

క. ఏపాటి దాన వీవిపు
డేపాటి వివేకివీవు ఎదురా నదురా!
గోపాలుఁడు కలనైనన్
నీపేరును నెత్తనట్లునేఁ జేసెదనే.

పరు॥ మధ్యమావతి॥

ఏమనుచుఁ బలికితివె యోసత్యభామ॥ ఏమ॥
రామరో త్రిశిరగిరి ధాముని సఖు శ్రీకృష్ణస్వామి
యీ మాటలు వింటే చాల దండించఁ బోయెనే॥ఏమ॥
నిన్నుఁ బెండ్లాడితే నేమి నెలఁతరో వానికి నాపైనున్న
వలపు
నీపై నుండునా। నను వినా వేఱే వన్నెలాడి పక్కఁ
బండునా।
నన్ను జూడకయున్న వాని కోర్కెపండునా మగవారికి।
కొన్న పెండ్లాముకన్న మిన్న మోహపురాణని।
విన్నది కన్నది లేదా చిన్నబుద్ధిచేత నీవున॥ న్నేమ

బోఁటిరో నీవు నాసరి సాటిదానవాయని నోటిక్రొవ్వు
మాట లాడేవు। గర్వించి నీవేపాటియని మాటవీడ
నాడేవు। మోముఁ జూడక యేటికె నన్ను బోనాఁ
డేవు।
మంచిది కాని। నేఁటికి నీసుద్దులు కిరీటి చెలికాఁడైన
యట్టి కైటభారికిఁ జెప్పినీ నోటికిఁ దగు బుద్ధి
చెప్పెదు॥ నేమ॥
కన్నెరో నావలె రతులఁ గలసి మెలసి వానిమనసు
తిన్నఁగాఁ గరగింప నేర్తువా। కసిదీఱఁజెనఁగి మిన్నగాఁ
గౌఁగిటను జేర్తువా। తేనె మోవిచ్చి వెన్నుని
దాహము
దీర్తువా। గోపాలుఁడు చెన్నుగ నష్టమహిషులకన్న।
గోపస్త్రీలకన్న మిన్నయని నన్ను వలచియున్న విత్తము
తెలియక॥ యే॥

వ. అని యిట్లు సత్యభామను విడనాడి రాధ స్వామిని
జూచి యేమనుచున్నది.

క. అల్లుని జేఁబట్టిన నీ
విల్లాలవ! బొట్టుగట్టు నింతివ! యనుచున్
బ్రల్లదములాడి సభలో
నుల్లంఘన చేసె సత్య యోహో కృష్ణా!

వ. అని మఱియు నేమనుచున్నది.

ద్వి. ఏమిరా గోపాల, యీసత్యభామ
నామట్టు దెలియక నను సడ్డ లేక
నీవు నాసవతివా! నీవు నాసరియః!
నీవు నాకెదిరివా! నీ వెవ్వతనుచుఁ
దృణముగా నెంచి యొంతేమాటలాడఁ
దాణఁగే నీవిధము నీతోనఁ జెప్పితిని.
కలికి రుక్మిణి కంటెఁ గాళిందికంటెఁ
దలఁప లక్ష్మణయు సుదంతయుకంటె
అలనాగ్న జితి మొదలగు వారికంటె
అదను మోహపు రాణియౌ తనకంటె
నిది యేమి యెక్కువా యేమి గోపాల!

వ. అని మొగంబు చిన్నఁబుచ్చుకొన్న రాధను బుజ్జగించి గారవించి కౌఁగిలించి సమాధానంబుచేసి సత్యభామను జూచి కోపావేశంబునఁ గృష్ణమూర్తి యేమనుచున్నాఁడు.

ద్వి. ఇంతగర్వంబేమి యెలనాగ, నీకు?
నెంత లేదని నీవు నెగ్గులాడెదవు!
కయ్యంబునకు నీవు కాలుద్రవ్వెదవు
చయ్యన రుక్మిణీ సతిని దూరెదవు
మొగమోటమని లేక మొగఁడైన(?) నన్ను
బగవానివలె నెంచి పలుకుచున్నావు.

పదునాఱువేల గోపస్త్రీలలోన
మదిరాక్షిరో యష్టమహిషులలోన
మోహంపురాణివై మొనయు రాధికను
దేహంబు తెలియక తెగనాడెదీవు.
"మేటి నామగనికి మెడ దాఁచినావ!
గాటంబుగా బొట్టుగట్టినా నీకు!
పెరిమతో నావలెఁ బెండ్లాడినావ!
అరసి చూడంగ నిల్లాలివా" యనుచుఁ
బోనాడఁ దగునఁటే పొగడు మీఱఁగను!
నేను వరించిన నెలఁత రాధికను
బొట్టుగట్టినయట్టి పొలఁతులకన్న
నెట్టన మోహంపు నెలఁత యే మేలు.
మగని నెంచనియట్టి మానినికన్న
జగతిఁ బ్రేమవతైన జారిణి మేలు.
ఇఁకమీఁద దానిపేరెత్తితివేనిఁ
బొగరణంగుటకును బుద్ధిచెప్పుదును

వ. అని యిట్లు నిరాకరించి పలికిన గోపాలమూర్తినిజూచి కటకటపడి సత్యభామ యేమనుచున్నది.

సీ. అకట! నీవిట్లు నన్నలయించఁగాఁగదా
నలుపు నీమేనెల్ల నాక్రమించె
పలుమాఱు నామీఁదఁ బగఁబట్టఁగాఁగదా
పరఁగు నీమేన వంకరలు పుట్టె,

సవతిని నాతోన సరిసేయఁగాఁగదా
మఱి నీకు జోమ్మన మచ్చికట్టె
నాయింటికిని రాక నలయించఁగాఁగదా
నిర్గుణుండను పేరునీకుఁగల్గె
వనిత లుస్సురుమన్నచో వ్యర్థమగునె!
సాటి బోఁటులలో నను మేటిఁజేసి
చేరి నన్నేలికొన్న నీసిఁగ్గదక్కు-
భక్తరక్షణకృష్ణ! గోపాలకృష్ణ!

వ. అని మఱియు నేమనుచున్నది:

పంతువరాళి॥

అయ్యయో నేఁజేయు పాపమా। నీనంటి
దయాళున కంతరంగమున నాపైఁ గోపమా।
కుయ్యక నె యున్నావు నిన్నుగోరినట్టి నామేలిమి తెలియఁక
యియ్యెడఁ గనుఁగొనఁగ నీవివేక మింతేనా గోపాల కృష్ణ॥ అయ్య॥
స్వామి నీవు సర్వజ్ఞుఁడవుగాదా ఊరడించి నాతోఁ
జల్లనిమాటలాడరాదా। ఏమేమొ భ్రమసికొని
నేనిన్నిపుడువలచి పెండ్లాడినందుకు। కాముల కెడచేసి
నన్ను మారునిబాణజాలముల కప్పగించితివి॥అయ్య॥

నేఁడు నీమనసు గరగదాయెనా నామనోరథములు
నెఱవేర్చుట నీకు భారమాయెనా। ఈడు జోడు లేని
విరహ
సాగర మీఁదలేక తత్తరించు వేళ। మోడిచేసి
మనసు ఱాయిచేసుక మోమెత్తి చూడకున్నావు॥
అయ్యో।
జతగూడేటంతపాటి సేయనా నన్ను గలసితే నీ
పితురార్జిత సేమైన పోయెనా।
క్షితిఁ బ్రదిశరగిరీశ్వరుని మిత్రుఁడై చెలఁగియు నన్నిపుడు
చౌకచే, సితివి సవతి బోధనవిని నీకిది
చెల్లునా గోపాలకృష్ణ॥

వ. అని కృష్ణమూర్తిని దూఱ పలికి కోపావేశంబున నిజ గృహంబునకు వచ్చి చెలికత్తెఁ జూచి యేమనుచున్నది.

సీ. పతి మోముఁ జూచి నేబ్రిమసి యుంటినిగాని
ప్రేమతో నొకముద్దు పెట్టనైతి,
విభునియందముఁ జూచి వెఱఁగందితినిగాని
యింపుతోడఁ గవుంగి లింపనైతి,
చెలువుని మాటల కెలమిఁ జొక్కితిఁగాని
చక్కెర కెమ్మోవి నొక్కనైతి,
ప్రియుని శృంగారంబు పేర్మిఁ జూచితిఁగాని
కసిదీఱ రతి కేళిఁ గలయనైతి

కులుకు గుబ్బలచే బొమ్మ గ్రుమ్మనైతిఁ
జేరి చెలువుని పదసేవఁ జేయనైతి
మొనసి కరుణింపుమనుచును మ్రొక్కనైతి
నింక నీవైనఁ దోడ్తేవె పంకజాక్షి!

అఠాణ॥ ఆట॥

ఇది యేమిసుద్ది గోపాలునకు
నెవను చెప్పినసుద్ది। మదవతి పెట్టిన మందులోనఁ దగిలి
సదయుఁడు నన్నింతో చౌకచేసెనఁట॥ ఇది॥
నన్ను వంచనచేసి సన్నుతాంగిపైనిఁ గన్ను వేసి
నాఁడఁట।
చిన్నెలు వన్నెలు ఎన్నో చేసెనఁట। అల్లదాని।
చిన్నిచన్నులపైని క్రొన్నెలవంకలు మిన్నగఁ గావించి
మెచ్చు
కొన్నాఁడఁట॥ ఇది॥
వలచి యల్లదాని వలలోఁ జిక్కుకొని చెలియకు
దక్కెనఁట
దాని మాయలకె సొక్కెనఁట। దాని న్గొసలఁ దిలకము
కొనగోట దిద్ది చెక్కిలి నొక్కి మొలకనవ్వుమోము
ముద్దా
లాడెన ట॥ ఇది॥

ఎలమిఁ ద్రిశిరగిరి నిలయుని చెలికాఁడై వెలసిన
గోపాలుఁడు।

ఇట్టివాఁడని తెలియనైతిని నేఁడు। రతుల నన్నుగలసి
యున్నది మఱచి పిలిపించినారాక వెలఁడియింటఁ
బాళెము

వేసియున్నాఁడఁట॥ ఇది॥

వ. అని పలికి సత్యభామ తనలోఁ దానేమనుచున్నది.

సీ. జారచోరుండైన చక్కని కృష్ణుండు
తనమది శోధింపఁ దలఁచినాఁడో!
కపట నాటకుఁడైన ఘన నీలదేహుండు
తనమది శోధింపఁ దలఁచినాఁడో!
బహువల్లభుండైన పరమదయాళుండు
తనమది శోధింపఁ దలఁచినాఁడో!
నాప్రాణనాథుఁడైనట్టి శ్రీకృష్ణుండు
తనమది శోధింపఁ దలఁచినాఁడో!
వచ్చునో రాఁడో! వచ్చి తావనములోన
దాఁగి తనమది శోధింపఁ దలఁచినాఁడో!
వనుస మీాఱంగ శృంగారవనికిఁ బోయి
చూచివత్తము రారమ్మ సుదతులార!

సీ. అతులిత సాచీకృతాననాబ్జంబుపై
నలకాళి వితతి ఝమ్మనుచుఁగ్రమ్మ
లీలతో హస్తాంగుళీదళపంక్తులు
వరవేణురంధ్రాళిపై నటింప
బ్రహ్మాద్యగోచర వ్యత్యస్తపాదంబు
గోపికా వితతికిఁ గొమరుచూప
రమణీయ మౌళి కలాపి కలాపంబు
తళుకు తళుక్కని తాండవింప

శిలలు గరగంగ మ్రాఁకులు చివురుతెత్త
జగము మోహింప వల్లవీజనము చొక్క
వేణునాదంబుఁ జేయుచు వెలయు, కృష్ణుఁ
డెచట నున్నారొ తెలుపరే యింతులార!

వ. అని పలికి సత్యభామ చెలులకై దండలు పూని యడుగులం దడఁబడ విరహసాగరము నీఁది యలసిన రీతిని జేతులిట్టట్టు వైచుచు గోవ జవ్వాది మొదలైన పరిమళములు మెలంగు పైఁటకొంగు, అఁలయికల చిఱుచెమటలఁ దడిసి నలుగడల ఘుమఘుమతావులు గ్రమ్మిరింప, సకలశృంగారములతో శృంగారవనికి వచ్చి యచ్చటఁ గృష్ణమూర్తిని వెదకు సమయంబున నచ్చట స్వామిపదంబులు కనఁబడ నచ్చెరువంది, గోపాలమూర్తిని గనులారఁ జూచినట్లు సంతసిల్లి చెలులం జూచి యేమనుచున్నది:

సీ. ఈపదాబ్జంబులే యింతిరో, మహనీయ
వేదాంత వీధికా విహరణమ్ము,
లీపదాబ్జంబులే యింతి, శ్రీకుచలిప్త
ఘనతర పత్రలేఖాంచితములు,
ఈపదాబ్జంబులే యింతిరో, సనకస
నందన ముఖమౌని వందితములు,
ఈపదాబ్జంబులే యింతిరో నిజభక్త
సంచయ కైవల్య సాధకంబు
లీపదంబులె సుజ్ఞాన దీపకళిక
లీపదంబులె సతతకలుషాపహములు;
ఈపదాబ్జంబు లిటనుండ గోపతనయుఁ
డిచట నున్నాఁడు కాఁబోలు నింతులార!

వ. అని పలికి యచట నుండు పుష్పగుచ్ఛలతాదులఁగనుఁ
గొని యేమనుచున్నది.

సీ. వసుదేవతనయుండు వసుస నెందున్నాఁడొ
చూత గుచ్ఛములార చూప రమ్మ,
ఇందీవరశ్యాముఁ డేచాయనున్నాఁడొ
యేలాలతికలార, యెఱుఁగరమ్మ!
కమలదళాక్షుఁ డెక్కడ దాఁగియున్నాఁడొ
మాధవీ లతలార, మనుపరమ్మ!
మన్మథజనకుఁ డేమాటుననున్నాఁడొ
తిలక వృక్షములార, తెలుపరమ్మ!

మధువిరోధిని జూపరే మల్లెలార!
హంసగమనుని జూపరే హంసలార!
చక్రహస్తుని జూపరే సరసులార!
రాజవదనుని జూపరే లతికలార!

ద॥ ఆహరి॥

మాధవుఁ గానరే మదమరాళములార
మీరు దెల్పరె- శ్రీధరుఁ గానరె చిలుకలార
యిపుడు మీరు దెల్పరె॥
ప్రాణేశుఁ గానరే బర్హిసంఘములార మీరు-
నానాథునిఁ గానరే కోకిలలార మీరు దెల్పరె॥
హృదయేశుఁ గానరే యిపుడు శారికలార మీరు।
సదయునిఁ గానరే సరసులారయిపుడు మీరు॥
నగధరుఁ గానరే నగనికరములార మీరు।
మగనిఁ గానరఁటె మంచి కొమ్మలార మీరు॥
ఇలఁ ద్రిశిరగిరీశు చెలికాఁ డెందున్నాఁడొ మీరు।
ఎలమిని ఈవిరహ మెంతని సైరింతు మీరు తెల్పరె॥

చ. చిలుకల అంతు తాళుదునా, చిచ్చగు వెన్నెలకాఁక
కోర్తునో।
యళులరొదల్ సహింపుదునో యల్లవసంతుని బారిఁగందునో
మలయసమీరు రాకకును మారునిషాకకు నిర్వహింతునో.
పొలఁతుకలార! మీరు యదుపుంగవు నీడకుఁ దేరె
గ్రక్కునన్.

వ. అని యిట్లు కేళీవనంబున వెదకి కానక చెలులతో నేమనుచున్నది.

ఆహిరి॥ ఆట॥

ఎందు వెదకినఁ గాననే- గోపాలుని॥ ఎం॥
అందమైన త్రిశిరగిరి హారుని చెలికాఁడైన- కందర్ప
జనకుని గాంతలార యిపుడు॥ ఎం॥
బాగా బృందావనమునఁ గొలఁకులయందుఁ- బరఁగు
పద్మవనమున- దాఁగి తానున్నాఁడేమొగాని తెలియదు
ఆగోపాలుని కథ లతిశయము లైనవి॥ ఎం॥
కుంజగృహాంతరమునఁ బరమయోగి పుంజహృదంత
రమున
కంజనయనలార। కడు వేగముగాను। కంజదళాక్షునిఁ
గనులఁ జూడఁ గోరి॥ యెందు॥
ఎవతెయింట నున్నాఁడో- ఆటలకు నెచట దాఁగి
యున్నాఁడో
ఎవతె మాయలకు నిపుడు లోనైనాఁడో- చిగురుఁ
బోఁడు
లార యీ చిత్రమున కేమందు॥ నెందు॥

వ. అని మఱియు నేమనుచున్నది.

సీ. దాని మాయలకును లోనాయెఁ గాఁబోలు
లేకున్న నతఁడిందు రాకయున్నె!
తరుణి పెట్టినమందు తలకెక్కెఁ గాఁబోలు
లేకున్న నతఁడిందు రాకయున్నె
వాలాయముగ దాని వశమాయెఁ గాఁబోలు
లేకున్న నతఁ డిందు రాకయున్నె!
చెలి యిట రానీక చేసెనుగాఁబోలు
లేకున్న నతఁ డిందురాకయున్నె!
యతని ననవేల రుక్మిణి ననఁగనేల;
తలను వ్రాసినయట్టి విధాత నిపుడు
దూఱవలెఁగాని మునిని దా దూఱనేల!
యయ్యయో యిందు కేమందు సతివలార!

వ. అని యిట్లు హాలాహల కాలానల కీలాకరాళవిరహ సంరంభంబు సైరింపఁజాలక వెతలఁ జెందుచుఁ గుందుచు భుగ భుగమని వగల సెగలఁ బొగలెగయ నిట్టూర్పులు నిగిడింపుచుఁ బంతంబు లుగ్గడింపుచుఁ గళవళపడి మరుని బాణపరంపరల కలికి బెళికి చలియింపుచు హరిహరీయని కలవరింపుచుఁ దెలివి తొలఁగి నెఱిచెన్ను పాయుచు నఱగన్ను వేయుచుఁ జందురుబింబంబుఁ గ్రందుకొని నిందించు నందమైన ముఖారవిందమునఁ జిఱుచెమటలూర, మృగమదతిలకంబు కరఁగి జాఱ, క్రొమ్ముడి వీడ, ముంగురు లసియాడ రంగారు బంగారు గిన్నెల కన్న

మిన్నలై చెన్నొందుచున్న చిన్ని చన్నులమీఁద నలఁదిన జవ్వాది తావులు ఘుమఘుమమని నలుగడల గుబులుకొనఁగఁ బవజుల కమ్మలసియాడఁ బాపట బొట్టు నుదుటఁ దాండవం బాడఁ బైటకొంగు జాఱ, జుక్కాను జుక్కాను ముక్కారముత్తి యంబు గదల, మొలనూలిగంటలు మ్రోయ, గిలుకుమెట్టెలు గిలకొట్ట, గోపాలమూర్తినిఁ జూపరేయని చెలుల వేడుచు, నతనిపై గీతమ్ములఁ బాడుచు విరహజలధరాంతర్యాభిత చంచలాయమానగాత్రియై యరుణారుణ నేత్రియై కోపాగారంబునకు వచ్చి యచ్చట ధ్యానధారణ సమాధులనుండు యోగీశ్వరుని చందంబున డెందంబున హరిని దలంపుచు-

ఉ. కన్నులు గూర్కి-చొక్కఁ గలగన్నవితంబున నుల్కి-
లేచు నా
చెన్నుని జింతసేయుచును వేగ బయల్ మఱి కౌఁగి
లించుఁ దాఁ
గన్నుల నీరునించుఁ జెలికత్తెల నెల్లను పీడనాడు న
త్యున్నతమైన మోహమున నుస్సురటంచు హరిన్
దలంచుచున్.

వ. ఇట్లు హరిం దలంచుచుఁ గోపాగారంబున సత్యభామామణి భూశయ్యనుండు సమయంబున నచ్చట-

చ. వెలుపల లోపలన్ మెలఁగు విశ్వమయుం డల సత్య
భామలోఁ
దలఁపు లెఱింగి మోహపరితాపము నోర్వఁగఁ జాల
దంచు నున్
దెలిసి దయాసనుండ్రఁ డగు దేవుఁడు తత్తఱపాటు
చెంది య
చ్చెలి పరితాపమున్ దొలఁగఁ జేసెదనంచు మదిం
దలంచఁగన్.

వ. ఇట్లు సత్యభామగృహంబునకు హరి రాఁదలంచు సమ
యంబున సత్యభామకు మంచిశకునంబులు గనిపింపఁ జెలికత్తెలఁ
జూచి యేమనుచున్నది.

ఘంట॥ మంచి శకునములు గనిపించె నిపుడు
మదవతులార। మంచివేళ వచ్చెనుగాఁబోలు మదవతు
లార। ఏమో తెలియదు నాయెడమ భుజంబిపు
డదరెనే। కామినులార మిక్కిలి యెడమ కన్నదరెనె।
గరుడగమనుఁ డిటవచ్చునో దక్షిణ గౌళయ్యెనె।
హరి నను గౌఁగిట గుచ్చునో కృష్ణసహాయంబయ్యెనె
వరుఁడు తలఁచెనేమొ యశరీర వాణయ్యెనే।
నరకహరుని దయవచ్చెనేమొ ఆనందమయ్యెనె।
నాథుఁడు రతులను గలియునేమొ ఘంటానాద
మయ్యెనే।
ఈధరఁ దిశిరగిరీశు సఖునకు మదెదురెదురయ్యెనే॥

వ. అని యిట్లు సత్యభామ మంచి శకునంబులు గన్న తెఱంగు చెలులతోఁ దెలుపుచుండఁ గృష్ణమూర్తి వచ్చెనటు వొటువలెను.

సీ. బంగారు దుప్పటి చుంగులు జీరాడ
బర్హిపింఛము సిగపైని గదలఁ
గౌస్తుభమాణిక్య కాంతులు చెన్నొందఁ
గస్తూరి తిలకంబు కరఁగి జాఱఁ
జెవులను మొసలొంట్లు చికిలిగా నసియాడ
మొలక నవ్వుల ముద్దుమోముతోడఁ
గుంకుమారసంబు నల్గడల నల్లుకొనంగ
నీలమేఘమువంటి నిగ్గు మెఱయ
ముజ్జగంబుల కిరవైన బొజ్జగదల
విమల నాసాగ్రమునను నవీనమైన
జాతి హురుమంజి ముత్యంబు చౌకళింప
సత్యభామామణింటికి శౌరి వచ్చె.

గౌళ॥ జంపె॥
ఆరుక్మిణింటనుండి హరి వెడలి వచ్చెన్।
సారెకు త్రిశిరగిరీశు సఖుఁడైన గోపాలు॥ డారు॥
పలుమాఱు పసుపుదుప్పటి వల్లెవాటు జీఱ। మొలక
నవ్వులయు నెమ్మోము దనరారు। చెలువైన కస్తూరి
తిలకము

ముద్దుగారఁ వెలయు కరుణాకరముఁ వెల్లువలైపాఱ।
ఆను॥

సరిలేని నెమలి పింఛము సిగను గదలఁగ-
కరములను శంఖ చక్రంబులను బూని।
అరయ వనమాలికాద్యాభరణములు మెఱయ।
వర పారిజాతసుమ వాసనలతోన॥ ఆను॥
తరితీపు వగలఁ దత్తఱపాటు చెందుచును।
విరహా మోర్వలేక వెతలఁ జెందుచును।
విరిబోఁడిపైని ముప్పిరిగొన్న ప్రేమచే।
పరమాత్ముఁ డాసత్యభామయింటికిని॥ ఆను॥

వ. ఇట్లు వచ్చిన కృష్ణమూర్తి సత్యభామను సౌధాగ్రంబున నెవకి కానక తనలోఁ దానేమనుచున్నాఁడు॥

ద్వి. మునినాథుఁ డిచ్చు నద్భుత పారిజాత
మొనరంగ రుక్మిణి కొసఁగిన జాడ,
యిందఱు చెలులు నీయెడమపాదంబు
క్రింది వారని మహా కీర్తించు జాడ,
అలహరిని సత్యను ల్లంఘన సేయ
నెలయంగ నేఁబూని విన్నట్టి జాడ
గాంచి సాత్రాజితి కడనున్న బోఁటి
యంచితమ్ముగను నాయందు నేరముగ
నేమేమి కల్పించి యిపుడు నాసత్య

భామ ముంగల వచ్చి పలికెనోగాని
లేకున్నచోట నీలేమ మందిరము
ఈకరణిని జెల్వ యిటు తగ్గనేల!
నాప్రాణపదమైన నలినాయతాక్షి
నాప్రేమ కిమ్మైన నవమోహనాంగి
లలితసద్గుణధామ లావణ్యసీమ
యలిగి యెందున్నదో యలసత్యభామ.

వ. అని చింతించి యట నొక చెలిని జూచి కృష్ణమూర్తి యేమనుచున్నాఁడు.

పంతువరాళి॥ ఆట॥

ఏమని సేసేఁతునే ముద్దుగుమ్మను
ఎందు వెంతానె చూతునె। రామరో కల్యాణసీమయైన
సత్య- భామామణిని ఏ(ప్రక్క- చూచినఁ గాన॥ ఏమ॥
తరితీపువగల గుత్తపు రైకలోన (గిక్కి-జిసినచను
మొన లరుదుగను। ఉరము దూసిపాఱ నొనరఁ
గౌఁగిలించి। మఱి యాదరించిన మగువను జూడక
॥ఏమ॥
పక్క- మచ్చిక చేసి పరిమళములు పూసి। చెక్కి-లి
కొనగోట
నొక్కి- నొక్కి-। దక్కి-తినని చొక్కి- చొక్కించి
యంతలోఁ

జిక్కించు కొన్నట్టి చెలియను జూడక॥ ఏమ॥
నిరతము త్రిశిగగిరి నిలయునకును సఖుఁడై
మెఱసితివని నన్ను మెచ్చుకొని।
సురతకేళిని మనసు చొక్కించి యంతలోఁ।
బరవశమైనట్టి పడఁతిని జూడక॥ ఏమ॥

వ. అని యిట్లు వెతచెందుచున్న సమయంబున నందొక్క చెలి సత్యయున్న తావలం బెఱిఁగింప నంతఃపురంబున కరిగి కోపాగారంబు చేరవచ్చుసమయంబున దౌవారికయైన చెలి కత్తె స్వామినిజూచి యేమనుచున్నది.

శంకరాభరణము॥ ఆట॥

సారెకు నామాట వినవోయి నీకిది సమయము
గాదోయి। ఆరుక్మిణింటికిఁ బోవోయి మాయమ్మ
యధికకోపముతోడ నున్నదోయి। కృష్ణా॥ నారెకు॥
అలిగి రానిచ్చెనో నీవైనవచ్చితివో యామర్మ
మేమోయి। కతమిడివాఁడవు నీనడక భారతమై
యున్నదోయి॥ సారె॥
ఇప్పటి కోపము ఇంతింతని నీతోఁ జెప్పఁగూడదోయి।
చప్పుడు చేయక వచ్చిన త్రోవనె జరిగితే మేలోయి-
శ్రీకృష్ణ॥ సారె॥
కోపము తీరితే నీవు వచ్చిన సుద్ది కొమ్మకుఁ దెలిపే
మోయి। గోపాలా త్రిశిరగిరీశు నెచ్చెలియా నీ
గుణములు తెలిసెనోయి శ్రీకృష్ణ॥ సారె॥

వ. అని పల్కిన సఖని జూచి స్వామి యేమనుచున్నాఁడు.

గీ. సత్యభామ యెచట సారెకు నున్నదో
యనుచు వెదకి వెదకి యలసినాఁడ
ఎచట నున్నదిప్డు డెలుఁగంగఁ జెప్పవే
దానిఁ జూడ కేను దాళలేను.

వ. అని మఱియు నేమనుచున్నాఁడు.

దరు॥ ఎరుకల కాంభోజి॥ ఆట తాళం॥

చిలుక తాళి సరుల సిచ్చేను నేనువచ్చిన సుద్ది
దెలుపవె కొమ్మ। చిలుక తాళిసరులు సత్యభామ మాకిచ్చినది రుక్మిణితోఁ జెర్లాడఁ బోవోయి కృష్ణా॥
చీని చీనాంబరా లిచ్చేను నేను వచ్చిన సుద్ది తెలుపవె
భామా॥ చీనిచీనాంబరా లిపుడు సత్యభామ
యిచ్చినది నీకైనచోఁటికిఁ బోవోయి కృష్ణా॥
కొమ్మ శ్రీశివగిరీశ్వరుని సఖుఁడు నిన్ను గోరివచ్చి నాఁడని
తెలుపవే। నెమ్మిని నేఁబోయి తెలుప సమయము
గాదు నీవై సత్య చెంగటికిఁ బోవోయి కృష్ణ॥
సత్యతో నీవు వచ్చిన సుద్ది నేనెపోయి తెల్పెద నోయి
కృష్ణ॥

వ. అని పలికి సత్యభామ సన్నిధికిఁ జని చెలికత్తె యేమను చున్నది.

ధ|| మాంజి|| ఏకతాళము||

నిన్ను జూడ వచ్చినాఁడె। నెలఁత సల్లని మేనివాఁడె।
చన్నె కాఁడ నీవెవరంటే శ్రీశిరగిరివాసు నెచ్చెలి
నన్నాఁడె|| నిన్ను||

జిలుగు బంగరు వలువవాఁడె మంచి చికిలికాఁడై
యున్నాఁడె।

కలికి తావచ్చిన చెలిమి నీతో నిపుడు తెలుపుమని
బ్రతిమాలినాఁడె|| నిన్ను||

చేరెఁడు కన్నుల వాఁడె కస్తూరి తిలకమమరు
వాఁడె। ఓర కొప్పుడెపై మయూర పింఛము నొయ్యార
ముగఁ బూనినాఁడె|| నిన్ను||

మురళి చేతఁబూనినాఁడె చందురువంటి నెమ్మోము
వాఁడె। సరిలేని శ్రీవత్సకౌస్తుభములను పేరుర
మున ధరియించినాఁడె|| నిన్ను||

వలపు నిలుపలేనన్నాఁడె- తలవాఁకిటఁ గాచి
యున్నాఁడె।

చెలఁది, నిన్ను వెదకి వెదకి యలసి నిట్టూర్పులు
నిగిడింపుచున్నాఁడె|| నిన్ను||

కంతునకెనయైనవాఁడె- నీకథలంతే చొక్కు
చున్నాఁడే
చెంతఁజేరి నీపేరేమని యడిగితే సిగ్గుచే నూర
కున్నాఁడే॥నిన్ను॥

వ. అనిన చెలికత్తెనుజూచి సత్యభామ యేమనుచున్నది.

మ. వనితాజారుఁడో! చోరుఁడో! కుటిలుఁడో! వాఁడెవ్వఁడో!
యీడనే
పనిగా వచ్చెనో! నాదు వాఁకిటికి ! నాభావంబు
నిట్లెంచనిన్
గనకన్ వేవివరంబుగాఁ దెలియ లేకన్నంగ మచ్చంబు దా
వినిపింపం దగ దింక నెవ్వఁని వేవేగన్ విచారింపవే.

వ. అని యిట్లు సత్యభామ చెలికత్తెను జూచి పలికిన పలు
కులు విని కోపాగార కవాట పాంతమునఁ బొంచి యున్నఁ
గృష్ణమూర్తి యేమనుచున్నాఁడు.

తలుపు తీసే పాట॥

కినుక దీర్ప నేనేవచ్చితి వాఁకిలి దీయవే
యో భామ। పని వడి నేననఁగా నీ వెవ్వరు వాఁకిలి
తీయను పోవోయి॥
విష్ణుదేవుఁడై మెఱసిన చక్కని కృష్ణుడనేన భామా
కృష్ణుఁడ వైతే నేమా యెను రుక్మిణి యింటికి నీవు
పోవోయి॥

జిలిబిలి పగలను గులికి సలికి నను వలపించవె
యో భామ।
వలపు సొలపు పుట్టించే జాంబవతి యింటికి నీవు
పోవోయి॥
కులుకు గబ్బి సిబ్బెపు గుబ్బలపై గోరు లుంచెదనె
భామా।
లలి గుబ్బల గోరుల నుంచుటకును లక్ష్మణయింటికిఁ
బోవోయి।
తేనెల సోనలు చిలికెడు మోవి పానక మీయవె
భామ।
పానక మానుటకును నీవిపుడా భద్రయింటికిని
బోవోయి।
కడునడిఁ దమి దీఱుటకును నీబిగి కౌఁగి లీయవె
భామా।
విడువక కౌఁగిటఁ బెనఁగను మిత్రవింద యింటికిని
బోవోయి॥
తళుకు టద్దమన వెలసిన నీచెక్కిలి ముద్దియ్యవె
భామా।
తళుకగు చెక్కిలి ముద్దాడుటకు సుదంత యింటికిని
బోవోయి॥
సరసంబుగ నీ కీలు జడకు విరి సరులు చుట్టెదనె
భామా।

కరమున జడకును విరులు చుట్టుటకుఁ గాళిందింటికిఁ
బోవోయి॥
ముద్దు మోమునను గస్తురి తిలకము దిద్దెదనే
యో భామ।
తద్దయుఁ దిలకము దిద్దుటకును రాధామణి యింటికిఁ
బోవోయి॥
కుంకుమ జవ్వాజి పునుఁగు గంధ మలంకరించెదనె
భామా।
కుంకుమ గంధ మలంకరించుటకు గోపిక లిండ్లకుఁ
బోవోయి॥
కంకణములు ఘులు ఘల్లని మ్రోయఁగఁ గరము
పట్టెదనె భామా।
పంకజ లోచన నీ చెయి పట్టే భామ యింటికే
పోవోయి॥
అల యుపరతులను గలసి మెలసి నన్నలయించెదనె
యో భామ।
అలనాఁటికిఁ గలసినదే చాలును అది యిట సాగదు
వినవోయి॥
త్రిశిరగిరీశుని చెలికాఁడని నను దేలించవె యోభామ।
త్రిశిరగిరీశ్వరునికిఁ జెలికాఁడైతే నేమాయెను విన
వోయి॥

వ. అని యిట్లు సత్యభామ చెలికత్తెల ననిచి తలుపోరఁ జేయుమని కనుసన్న చేసి సరిగ పైఁట చెఱంగు ముసుంగిడి యూరకున్న యవసరంబున గోపాలమూర్తి మెల్ల మెల్లనఁ గోపసదనాంతరంబు ప్రవేశించిన నచ్చట.

సీ. బాగాల మడుపులు భామ యొకర్తె కొసంగఁ
బదసేవన మొకర్తె పడఁతి సల్పఁ
గలఁగిన కచభరంబు లొకర్త సవరింపఁ
జెమట బిందువు లొక్క చెలియ యొత్తఁ
గనకమయంబైన కాళంజి యొకతె పట్ట
నొక్కతె తిలకంబు చక్కదిద్ద,
నూఱట మాటల నొకయింతి వచియింప
సుదతి యొక్కతె జీని సురటి విసరఁ
జలువ చెఱఁగు ముసుంగిడి వలపు సొలపు
టలయికల నేమితోఁచక యలరు విలుతు
ములుకులకుఁ జాలభయమంది ముదిత గుంది
జగతిఁ బవడించియుండె నాసత్యభామ.

వ. ఇట్లు కోపాగారంబునఁ బవ్వళించియున్న సత్యభామను మాయామయుండైన గోపాలమూర్తి కనుంగొని నాపరాధిసం దంబున నేమియు ననక కొంతతడ వూరకుండి యందొక్క చెలిచేతి జీనిసురటి చేకొని విసరెనట యెటువలెను.

ఉ. ఆసతిచేతి జీనిసురటంతటఁ గైకొని సత్యభామ కా
యాసము దీఱఁగా విసరె నద్భుతనందనకాననాంత రో
ద్భాసిత పారిజాత సుమ వాసన లెల్లెడలన్ గుబుల్కొనన్
ఆసరసీరుహేక్షణుఁడు నార్తజనావనుఁ డౌను గావునన్.

వ. ఇట్లు విసరినఁ బారిజాతసుమవాసనలు నలుగడల నిండి సత్యభామ ముసుఁగులోఁ జొఱఁబాఱిన నత్యాశ్చర్య మొంది చెలులఁ జూచి యేమనుచున్నది.

మధ్యమావతి॥ ఆట॥

రమణులార పారిజాత సుమవాసనరాఁ గారణమేమొ।
కోమరా త్రిశిరగిరి నిలయుని సఖుఁడైన గోపాలుఁడు
వచ్చెనో లేక యుంటే॥ రమణు॥
ఎన్న రుక్మిణివలను జిక్కినకృష్ణునకు నిచటికిరాఁ
దోఁచెనో।
కన్నది విన్నది గాదిది చోద్యముగా నున్నది గదవే
యీ సమయాన॥ ర॥

వ. అని పలికి ముసుంగు దెఱచి కృష్ణమూర్తిని జూచి కోపావేశంబున మోమోరఁ జేసి మరల ముసుంగిడి యూరక యున్న సత్యభామను జూచి స్వామి యేమనుచున్నాఁడు.

గీ. తనువు వాడనేల! తాపమందఁగనేల!
చింతలేల! యిట్లు చిక్కనేల!
యేమి కారణంబో యికనైనఁ దెల్పుమీ
సత్యమైన ప్రేమ సత్యభామ.

శ్లో. కి మాశ్చర్యం బాలే నవదసి కి మర్థం మృదువచః
కటాక్షాళి శ్రేణిః ప్రసరతి నమే వక్త్రికమలే।
కిమర్థః కోపోయం మయి హుతవహేనైవ సదృశః
సమస్తం తద్ బ్రూహి త్వమిహ కృపయా చంద్ర
వదనే.

చూర్ణికా॥

హే సత్రాజిత్కుల దీప కళికే। ఆళిక ఫలక
విలసిత మృగమద తిలకే। మమ ప్రాణనాయికే।
నిరవధిక సుఖదాయికే। నిజ కబరీ భర సజల జలధర
వినిర్గళచ్ఛంపాలతికాయమాన నవనీత మృదులతర
మనోహరాంగి। నిజతనుకాంతి ప్రవాహ కోకనద
కుట్మలాయమాన కుంకుమ సంకుమద పత్రభంగ
దంతుర భవదీయ కుచకలశ పరిరంభణోత్సుకం।
నిరపరాధినం। మహానీయ కరుణారస సుధా వారాశి
సంచరన్మీనాయమాన కర్ణాంతాయతలోచ
నాపాంగేన। మాం। అనవలోక్యైవ కిముపేక్షసే।
మయి కోపాగమనాయ కిం కారణ మేతత్సమస్తం
విస్తరేణ కథయ। -

వ. అని మఱియు నేమనుచున్నాఁడు.

శా. ఏమే చక్కని సత్యభామ, ననునీవిట్లాఱడిం బెట్టుచో
నేమంచుం దమి నోర్చుకొందు నిఁక నే నెందాఁక
సైరింతు నీ
మోముం జూపకయున్నఁ దాళఁగలనే! మోడింకనీ కేలనే!
నామీఁదన్ దయఁదాఁచి తప్పలిటు లెన్నంగ నాయమే
కోమలీ!

ఉసాని॥ చాపు॥

ఎన్నఁడు లేనికోప మెందుకె లలన।
పన్నగ వేణి నన్ను పగవానివలె నెంచి-
కన్నులఁ జూడక కన్నడ చేసేవు॥ ఎన్న॥
పలుకులఁ దేనెలొల్కఁ బలుకకున్నావేమి- వెలఁది
నిన్నెమైనా విడనాడితినా। కులుకు గుబ్బల ఱొమ్ము
గుమ్మఁగాడవదేమి। కల్లనైన నీమాట కల్గికి జవ
దాఁటినానా॥ ఎన్న॥
పలుచని కెమ్మోవి పానక మీయవేమి
చెలియ, నీ కపరాధములు చేసితినా।
పొలఁతి నీతళుకుఁ జెక్కులు ముద్దులీయవేమి-
పలుమాఱు నేనంతటి పాపము చేసినానా॥ ఎన్న॥
కలకంఠి నీబిగి కౌఁగి లీయవదేమి- నలుగురిలోనె
తప్పు నడచుకొన్నానా। అల యుపరతుల నన్నసఁగి
పెనఁగ వదేమి। అల త్రిశిర గిరీశు చెలికాఁడ నేఁ గాన
ఎన్న॥

వ. అని స్వామి పలికి మఱియు నేమని చింతించుచున్నాఁడు

ఉ. మాటికిఁ గోపమున్ మదిని మానినికిన్ మితి మీఱెనింకిటన్
మాటలచేతఁ దీఱదను మర్మ మెఱింగి విరాళిచే జగ
న్నాటక సూత్రధారి లలనామణికిం బ్రణమిల్లె నంత న
బ్బోఁటియుఁ దన్నె వామపదముం గొని కృష్ణుని మస్తకంబునన్.

వ. ఇట్లు కోపావేశంబున మణిగణ ఖచిత శింజాన మంజుతర మంజీర సమంజస తదీయచరణ కంజాత ప్రహారంబునకు మదనరాజ్య సామ్రాజ్యంబు కరగతంబైన తెఱంగుననుప్పొంగి మనసు ఝల్లు ఝల్లుమన రోమాంచ కంచుకిత సర్వాంగుండై సత్యభామను జూచి కృష్ణమూర్తి యేమనుచున్నాఁడు.

చ. పులకలు కంటకంబులనఁ బుట్టిన నాదుశరీరమందు నీ
తలిరులవంటి పాదములు తాఁకినయంత నె యెంతనొచ్చెనో!
చిలుకల కొల్కి, నీవు దయచేఁ గడకన్నులఁ జూడకున్ననీ
వలపెటు సైఁతునే వికచ వారిజలోచన, మాటలాడవే!

ఉ. చందన గంధి, నీవిపుడు సారెకుఁ బల్కిన నోటి ముత్తెముల్.
చిందునో! చాలచే మిగులఁ జెన్నగు తేనెల సోన లొల్కునో!

యొంటుల కింత కోపమున కేమి నిమిత్తము చాలుఁజాలునా
యందుఁ గటాక్ష ముంచి తరళాయతలోచన,
మాటలాడవే.

వ. అని పలికిన పలుకులు విని మునుంగు తెఱచి మేయొఱ
దోఁప, ఫీడిస కచభరంబు చక్కదిద్దుకొను నెపంబున బాహు
మూలచులు వెలిం బర్వఁజేయుచుఁ చందురుని డిందుపఱచు
సందమైన ముఖారవిందంబుఁ జిఱుముత్తియములు వెదచల్లు
చందంబునఁ జిఱుచెమట లూటఁ గనులకెంపుల సంపదలు
శోణాంబుజచ్ఛాయల నెంతలేదని ధిక్కరింపఁ బెదవులు చలింప,
గుహనా దీనచిత్తుఁడగు గోపాలమూర్తిని జూచి సత్యభామ
యేమనుచున్నది.

శ్లో. సుధోపమం స్యాద్వచనం త్వదీయం
సుశీతలాః కృష్ణ, భవత్కటాక్షాః।
తథాపి చిత్తం కుటిలం తవైవ
దుష్టోగుణః స్సర్వగుణాన్ నిహన్తి॥

ద్వి. కటకట! యీనయగారంపుసుద్దు
లెటు నేర్చుకొంటివో యెఱుఁగంగరాదు.
పుట్టినప్పుడె కూడఁ బుట్టిన గుణము
నెట్టన పోవునే నెఱి నేరికైన!
ఏల యీ మటుమాయ లిపుడు చేసెదవు!
చాలును నీయింద్రజాలముల్ దెలిసె.

వల్లని మగవారి నమ్మరాదనుచుఁ
జెల్లఁబో లోకులు చెప్పంగ వినమె!
ఈతప్పు విసయంబు లీనుచ్చు వగలు
నీతటవటలును ఈ యిచ్ఛకములు
గన్నవి విన్నవి గావు నాయెమాట
నిన్ని విన్నాణాలు లేల చేసెదవు!
గొల్లవానికి నేల కొమ్మల మేర!
చెల్లఁబో నీవు నాచెంతకు రాకు.
పసుల మేపుచు మందబైటను దిరుగు
పసుల కాపరికేల పడఁతులచింత!
బ్రహ్మచారికి నేల భామల పొందు!
బ్రహ్మాండ గహ్వరంబులు కట్టిపెట్టు
మునుపునై యుప్పులో మునిఁగిన నీకు
మొనసి వీపున తాయి మోచిన నీకుఁ
బలుమాఱు గర్తలు భక్షించు నీకు
ఎలమి తోడుతను బండ్లఁగించు నీకు
కడు గొప్పదనము పోకార్చిన నీకు
వడి మీఱఁగను గొంచెఁబడిపెట్టినీకు
పదుగురిలో భంగపా టొందునీకు
నెదబడ కడవుల కేఁగిన నీకు
జగతిలో దుక్కిసుమైపెట్టి నీకుఁ
బగఁబట్టి మగనాండ్రఁ బట్టిన నీకు
బౌద్ధావతారుఁడై పరఁగెడి నీకు

నిద్ధరఁ గల్కి- గానెంచిన నీకు
నేమని యిచ్చెనో యిట్టిగేస్తునకు
నీ మర్మ మెఱుఁగక యిపుడు మాతండ్రి-
వాననఁ బని యేమి వరుసతోడుతను
నానోము ఫలమిట్లు నగుఁబాటు చేసె;
నెనరెల్ల బయలాయె నీపొందు చాలు;
నను జెనకఁగ రాకు నాయాన నీకు.

సీ. పలుమాఱు నీళ్ళలోఁ బడఁద్రోయకనుగాని
యిపుడు నామచ్చరం బెట్లుతీఱు!
పెనుతాయి నీవిపుసను బెట్టకనుగాని
యిపుడు నామచ్చరం బెట్లు తీఱు!
అడవిలోపల నిన్ను వెడలించకనుగాని
యిపుడు నామచ్చరం బెట్లుతీఱు!.
ఆవులు మేపుమం చలయకొట్టకకాని
యిపుడు నామచ్చరం బెట్లుతీఱు!
కాని కానిమ్ము తెలిసె నీకథలు ఇపుడు
నిన్నుఁ గొంచాన విడువను నిజముగాను
ఇంతచేసినవాఁడ వీవెంతసేయు!
నమ్మ నేచెల్ల! యిఁక నిన్ను నమ్మవశమె!

గౌళిపంతు॥ ఆట॥

కాని కాని నీజాణతనము నేఁ
గనకనే కొంచాన విడిచేన। దాని చెంతఁజేరితే నేమి
నా చేతఁ దగిలితి విఁక నిన్ను దరలిపో విడిచేనే॥ కాని॥
దొంగతనముగాఁ జేసికొన్న పనులు ముంగిళ్ళఁబెట్టక
విడిచేనా। అంగనామణుల కొంగుఁ బట్టిన సుద్ది
యాగుదూగు సేయక నేవిడిచేనా॥ కాని॥
వావి వరుసలు లేక అత్తను బట్టితివని రచ్చసేయక
విడిచేనా। ఆవుల మేపుచు బ్రదికే గొల్లవాఁడవనే
గుట్టు బైటవేయక నే విడిచేనా॥ కాని॥
మగనాండ్రఁ బట్టిన మర్మము రచ్చను మందలించ
కనే విడిచేనా। జగతిఁ దిరిశిరగిరి నిలయు
నెచ్చెలియైన నగ కాఁడ నీతప్పునగలు నే నెఱుఁగనా॥

వ. అని మఱియు నేమనుచున్నది.

సీ. మునిముచ్చు బోధన విని నాదు వద్దకు
రాఁ గూడెనా నీకు రాజవదన!
రమణి రుక్మిణి యీడ రానిచ్చెనా నిన్ను
తొలిన తప్పితి వేమొ తోయజాక్ష!
ఇన్నాళ్ళకైనను ఈ తెల్వి గల్గెనా
యిది యేమి యాశ్చర్య మెమ్మె కాఁడ!
జిలన పెట్టిన మందులాహిరి తిరిగెనా
తలఁచుకొంటి వదేమి సొలపు కాఁడ!

తపసి నీకిచ్చు పారిజాతప్రసూన
వాసనలఁ జూప వచ్చితో వన్నెకాఁడ!
కపట నాటక సూత్రముల్ గంటి గంటి
భక్తరక్షణ కృష్ణ, గోపాలకృష్ణ!

సీ. ఆయింతిఁ గూడి నన్నలయించినప్పుడే
నీమోము చూతురా నీరజాక్ష!
ఆవిన్నపమును తొయ్యలి తెచ్చినప్పుడే
నిను సద్ద సేతురా వనజనాభ!
ఆమునిమెచ్చు మాయలఁ జిక్కినప్పుడే
నిను నమ్మవచ్చునా నీలవర్ణ!
ఆనాఁటి బాస బొంక్యాస మీఱినప్పుడే
నిను జేరఁదీతునా దనుజవైరి!

నీకు నాయాన నన్నంట రాకు రాకు
నీకు మనసైనచోటికి నీవుపొమ్ము
చాలుఁ జాలును! నీదు గంజాలుఁ జాలు!
భక్తరక్షణకృష్ణ! గోపాలకృష్ణ!

సీ. అడరి బాలురతోడ నాడ నేర్చిననాఁడె
మించి మామను సంహరించినావు,
బాలత్వమునఁ జన్నుపాలు ద్రావేనాఁడె
స్త్రీహత్య యెంచక చేసినావు,

అడుగులు పెట్టుచు నడువ నేర్చిననాఁడు
పేర్మిఁ దల్లిని వెఱపించినావు
గొల్లపల్లెలఁ బాలు గ్రోలనేర్చిననాఁడె
నడకలు మితిమీఱి నడచినావు

ఇట్టిపాపంబులకు నొడిగట్టినట్టి
పుట్టు వడుగైన నిన్ను నేఁజెట్టవట్టి
యేమిసుఖమాయె! నిందుల కేమిసేతు!
భక్తరక్షణకృష్ణ! గోపాలకృష్ణ!

ఉ. ఱోటను నీవు కట్టువడి రోయక వల్వాల ముచ్చిలించి బం
డాటల కున్కిపట్టునయి యత్తనుబట్టిన నీచరిత్రముల్
నాఁటికి నెంచి చూడఁగను నాతలిదండ్రులు ఇచ్చినందు కీ
పాటి సుఖంబు గల్గె వలపాఱడికాయెను నందనందనా!

ఉ. దొంగిలుచున్నవానికిని దోసము లేదవి? జాతిహీనురా
లెంగిలి దిన్నవానికిని నెగ్గిపుడేడది? కృష్ణ! కృష్ణ! నా
చెంగట నిల్వఁబోకు ననుజేరఁగరాకు పరాకు మ్రొక్కెదన్.



నీలాంబరి॥ జంపె॥

వలచినందుల కిదా ఫలము శ్రీకృష్ణ!
తెలిసెఁ దెలిసెను నీదు పొలము।
చెలువుఁడ యగ్నిసాక్షిగ నీకు మాతండ్రి
పొలుపలర నను దారపోసినది మొదలుగ॥ వ॥

వీణె దాసరి యిచ్చినట్టి సుమము- వెలఁది కిచ్చితివి
చలపట్టి। కాణాచి దానింటఁ గావింప నొడిగట్టి
జాణతనమున నన్ను జౌక చేసితివిగ॥ వల॥
అలరు ముడుపను యోగ్యురాలు- కాదనుచు-
హారి నీకుఁ దోఁచెఁ గాఁబోలు। నన్ను।
పలుచ చేసిన నీకుఁ బడివేలు దండాలు।
నలినాక్ష నేఁ జిన్ననాఁడు మొదలుగ నిన్ను॥ వల॥
పిలిపించినప్పుడు ఇటు రాక హద్దు- పెట్టితివి
మోమోట లేక। అలివేణి నంటి నన్నంటరాకు
పరాక। అల త్రిశిరగిరినిలయుఁ చెలికాడవని
నిన్ను॥ వల॥

సీ. ఆడుది యనురన్న నది మంచిదేకాదు
నీ వెఱుంగని దేమి నీరజాక్ష!
ఒకకంట సున్నంబు నొకకంట వెన్నయు
మఱి పెట్ట న్యాయమా మదన జనక!
తరితీపువగలఁ దత్తరపాటు చెందఁగాఁ
బలుకు బంగారమా ప్రాణనాథ!
నెల కొక్క- సారైన నీవిందు రాకున్నఁ
బ్రాణముల్ నిలుచునా పరమపురుష!

దోసకారీఁడ విటువంటి దోహబుద్ధి
కెప్పు డొడిగట్టె తప్పుడే; యింక మీఁద
నన్ను జెనకఁగ రాదు నీకన్నులాన
భక్తరక్షణ కృష్ణ! గోపాలకృష్ణ!

సీ. స్త్రీహత్యకును వెన్కఁదీయని వాఁడని
యల పూతనను జంపినపుడె తెలిసె,
తనవారితన మొకింతైన లేదను మర్మ
మవని మామను జంపినపుడె తెలిసె,
వావివర్తనలు దేవరకు లేవను వార్త
యత్తను బట్టినయపుడె తెలిసె
తారతమ్యం బొకింతైన లేదను సుద్ది
యమ్మను వెలపించినపుడె తెలిసె
నిట్టి దోహంబులకు నొడిగట్టినట్టి
పుట్టువడు గైన నిన్ను నేఁ జెట్టపట్టి
యేమి సుఖమాయె! నిందుల కేమిసేతు!
భక్తరక్షణ కృష్ణ! గోపాలకృష్ణ!

వ. అని యనేకవిధంబుల నయ ప్రియ నిష్ఠుర భాషణంబుల వెడనాడిన సత్యభామను జూచి గోపాలచక్రవర్తి యేమను చున్నాఁడు:

ద్వి. ఇంత కోపంబేమి? యెలమి నీనగలు
వింతలై కనుపట్టె వలఁదిరో, యిపుడు
ఎన్నిక లేక నీ వింత లేదనుచు
నన్ను బోనాడేవు నలినాయతాక్షి!
మగఁడను నాకియూప మది నింత లేక
పగవానివలె నెంచి పలుకుచున్నావు.
ఈ యాడుబుద్ధికి నేమందు నేను!
నాయెడఁ దప్పులెన్నఁగరాదు సుమ్ము.
దోసకారీ, నేను ద్రోహిని గాను
ఈసున నీ చలం బేలచేసెదవు?
నిమిషంబు నినుబాసి నేఁదాళలేను
రమణిరో! యింత పరాకేల నీకు!
తరళాక్షి, నాపైని తప్పు గల్గినను
తెఱఁగొప్పఁగా నీవు దిద్దికోరాదె!
చెలియ, నీవలలోనఁ జిక్కిన నన్ను
అలమట పెట్టేది యలవియేగాదు.
మ్రొక్కి వేడినఁగాని మోడి చేసెదవు;
దక్కితి నన్నాను తప్పులెంచెదవు.
కొమ్మల కింతేటి కోపంబు గలదె!
నమ్మినవాఁడను నన్నేలుకొమ్ము.

వ. అని మఱియు నేమనుచున్నాఁడు.

సీ. పలుకవే ముద్దులు గులుకవే కృపయింత
చిలుకవే చక్కని కులుకులాఁడి!
డాయవే సరసాలు సేయవే గంధంబు
పూయవే యో మట్టుమాయలాఁడి!
దక్కవే చెయ్యెత్తి మ్రొక్కవే నును చెక్కు
నొక్కవే చక్కని తక్కులాఁడి!
వేఁడవే సయ్యాట లాడవే యుపరతిఁ
గూడవే తమిదీఱఁ గోమలాంగి!
చాలు నీ వేళఁ దమకంబు తాళఁ జాల
నేల నాపాల నీవట్టి జాల మేల!
చెంతఁ జేరిన నన్నింత వింత చేసి
యలుక సేయంగ నాయమా యలుగఁబోఁడి!

ఉ. ఇంతటి కోపమేమి! యిపుడేయపరాధ మొనర్చినాఁడ! నన్
వంతలఁ బెట్టరాదు; పగవాఁడను గాను; పరాకు సేయుచో
గంతు శరప్రహారముల గాసికి నేనికఁ దాళలేను; నా
చింతలు దీఱఁ గౌఁగిటను జేర్పకయుందునఁటే విలాసినీ!

ఉ. మాటికి నిన్ను గోరి బ్రతిమాలిన నన్నిటు చౌక సేయఁగా
నేటికిఁ నింతద్రోహమిపుడేమి యొనర్చితిఁ ద్రోసకారి, నీ
సాటి వధూటికోటి యొకసక్కెము లాడకమున్నె గూడకన్
మాటల (పంతగించి) యనుమానము సేయకుమీ
విలాసినీ !

సీ. మొససి నీబిగి చన్ను మొనలచే నురమున
నెదురొత్తు లీయవే యిగురుఁబోఁడి!
మమత మీఱంగ నాదుతమిదీఱఁ గెమ్మోవి
పానకం బీయవే పంకజాక్షి!
పసివాడియున్న నా కసిదీఱ నీబిగి
కౌఁగిటఁ జేర్పవే కంబుకంఠి!
కనులు చల్లఁగ నను గనుఁగొని తళుకైన
చెక్కు ముద్దీయవే చిగురుఁబోఁడి!
మరుఁడు మెరమెర లాడుచుఁ జెఱకువింటఁ
గఱకుటరవిరి శరముల నురముదూయ
గుఱిగ నేయంగ నన్నేలుకొనక యింత
జాల మొనరింప న్యాయమా సత్యభామ!

ఉ. కన్నడ సేయరాదు బిగికౌఁగిటఁ జేర్పక యుండరాదు నీ
మన్నన తప్పరాదు బ్రతిమాలిన నన్ విడనాడరాదు నా
విన్నప మింకమీఁదఁ గడువేగమె గైకొనకేటివాదిఁకన్
సన్నగ నన్ను గూడినను బాపము రాదుసుమీ విలాసినీ!

ఉ. చక్కని ముద్దుగుమ్మ, నను జల్లని చూపులఁ జూచి
నీనునున్
జెక్కిలి ముద్దులిచ్చి పచిచిల్కఁగ బింబసమానమైన నీ
చక్కెర మోవిపానకము సారెకొసంగక యుంటివేని నీ
తక్కువ నీకెకాక కలదా! వలదా దయ యో విలాసినీ!

కర్ణాటక సారంగ। ఆది॥

ఊరకే యుండనేల యోసత్యభామ॥ ఊర॥
ఈరీతిఁ ద్రిశిరగిరీశు సఖుఁడై తేనేమి
నేరము గలుగుచో నీవు దండింపవలెఁగాక॥ ఊర॥
బాహులతలచేత బిగియించి పట్టిబంధన మొనరింపవె।
శ్రీహరి యనేమేటి చిత్తమున నెంచక।
మోహాకరమగు కుచదుర్గముల పాలుసేయవె॥ ఊర॥
విసరుక సరులచేతఁ జెక్కిలిగొట్టి వేమాఱు బుద్ధిచెప్పవె।
మసలక మగఁడను మర్యాద చూడక- కసిదీఱఁ
గెమ్మోవి గాయములు సేయవె॥ ఊర॥
తనివి తీఱ నన్ను జడ కొద్ది మీఁటి దద్దులు గావింపవే।
మనసిజు యుద్ధరంగమున నాతో నెదిరించి-
విను మానందసముద్రమున నోలలాడింపవె॥ ఊర॥

ఉ. నెమ్మిని నామనమ్మునను నేఁటికి నాఁటికి నొక్కరీతిఁగా
నమ్మితిఁగాని యిట్లు విడనాడుట నేనెఱుఁగంగనైతి; హా
యమ్మకచెల్ల! యీవగను ఆఱడిఁ బెట్టఁగనేల! నన్ను నీ
సొమ్ముగఁ జేసి నీవు దయఁజూడక యెందుకఁటే విలాసినీ!

ఉ. పాపము లేలకట్టెదవు భావమెఱుంగక నీవు! కంతు సం
తాపముచేతఁ గొట్టువడి తాళకవచ్చినవేళఁ జల్లనౌ
చూపులఁ జూడ కెట్టినగు చూపులఁ జూచుచు నన్ను
నిట్లు రా
తాపులఁ బెట్టి యింతటి పరాకొనరింతువఁటే విలాసినీ!

తోడి॥ ఆది॥

అయ్యయ్యో దోసకారి నిరాకరించే
జాణకే యన్యాయకారి।
ఇయ్యెడఁ ద్రిశిరగిరీశు సఖుఁడను మరియాద
తొయ్యలి నీమదికిఁ దోఁచకనే యిట్లు॥ అయ్య॥
కొంగుపట్టి తీసి కొసరి వేడెదనంటే।
ఇంగిత మెఱుఁగక యీసడించెదవు।
బంగరాలవంటి గుబ్బలపైఁ జెయివేసెదనంటే
సంగతి వద్దురా నాసామి యనేవు॥ అయ్య॥
పలుచని తియ్యమోవి పానక మానే నంటే
మొలక నవ్వుల మోమోరఁ జేసేవు।
తిలకము కొనగోట దిద్దిముద్దాడేనంటే-
కలికి కోపమునఁ గ్రీఁగంటఁ జూచేవు॥ అయ్య॥
అలయిక తీఱుటకు నలమి కౌఁగిలించేనంటే-
జలజాక్షి యసమీాక జాగుచేసేవు।
కలికి యెప్పటివలెఁ గలిసిమెలసి యుండేనంటే
చలపట్టి మొదటిపొందు చాలు ననేవు॥ అయ్య॥

వ. మఱియు నేమనుచున్నాఁడు.

సీ. కౌఁగిట బిగియించి కట్టివేయకగాని
మానదు నీమీాఁది మచ్చరంబు
పెదవిపైఁ బలుముద్రి పెట్టకనేగాని
మానదు నీమీాఁది మచ్చరంబు

ఘన కుచమర్దనం బొనరింపకనుగాని
మానదు నీమీఁది మచ్చరంబు
మరుసంగరంబున మఱి జయింపకగాని
మానదు నీమీఁది మచ్చరంబు
ఎంతలేదని మదిని చన్నెంచకిటుల
నాడినందుల కిటునంటె యాజ్ఞలెల్లఁ
జేసి నిను గైనసంబు నేఁజేసికొనక
మానఁజాలను ఈమాట మఱవవలదు.

వ. అని పలికిన కృష్ణమూర్తిని జూచి సత్యభామ యేమను చున్నది.

ఉ. పోటి యొనర్చి యాసుమము బోఁటికిఁ బ్రేమ నొసంగి పిల్చినన్
మాటికి రాక నా చెలిని నున్నన సేయక నేరమేమియున్
నేటికి లేనివానివలె నీవిటు వచ్చివు డిచ్చకంబుగా
మాటల నాడి యిట్లు బ్రతిమాలినఁ జెల్లునె నందనందనా!

ఉత్తరాది దరువు॥

నిను నమ్మరాదు పదివేలైన- అమ్మనేచెల్ల నిను।
మనసిజు మీఁదాన మాటకేఁ గలనైన॥ నిను॥
కనికరమింతైన లేదాయె- అమ్మనేచెల్లకపట।
మెఱుఁగనైతి బాగాయె। వినినవారికి నవ్వులాయె।
కన్నదిగాదు। అనువొంద నీమాయ హాలల్లా యేమి॥
సేయ॥ నిను॥

మట్టు మరియాద లింతలేక- అమ్మనేచెల్ల।
గుట్టుపోఁగొట్టినదిగాక- చెనక వచ్చేవు
వట్టి తనుకులేల పరాక- నలుగురిలో న
ష్టట్టిట్టు చేసితివి అయ్యయ్యో మనసీక॥ నిను॥
ఏమని నేను తాళుకొందు- అమ్మనేచెల్ల
స్వామి యిఁకఁ జాలును నీపొందు- శ్రీత్రిశిరగిరి
ధాముని చెలికాఁడా నీవందుఁ- దగిలితివి నీ
వామాయలాడి నగల నకట యిందుకేమందు॥ నిను॥

వ. అని మఱియు నేమనుచున్నది.

శా. గోపాలా యదునందనా మనవిచేకోరా! చలంబేల! రా
రాపుల్ పెట్టుట నీకు న్యాయమఁటరా! రమ్మన్న
నా నెచ్చెలిన్
పోపొమ్మంచు నిరాకరించి వెడచూపుల్ చూతురా!
యేఁతురా!
నాపైఁ గోపము సేతురా! విరహ మెన్నాళ్ళంచు
నేసైఁతురా!

దరు॥ పదర పదర అందుకేమి పదర వద్దుర।
చెదర నాడుచు నన్నిట్లు చెనకవద్దురా॥ ప॥
అలదాని నంటినీవు నన్నంటే వేమిరా। నీ
మెలఁకునలు తెలిసె నిదియేమిటి సోరామిరా॥ పద॥
చెల్లఁబో నీమటుమాయలెల్లఁ గంటిరా। హో
లల్లా నీదు తప్పునడక లెల్లవింటిరా॥పద॥

నీవిలాంటి వాఁడవని నేఁడు తెలిసెరా- నే
గావించు పూజాఫల విూగతిని వెలసెరా॥ పద॥
తెఱవు తెలిసి నీవు వచ్చినదే పదివేలురా- యో
చెఱకు విలుకానయ్య నినుజూచినదె చాలురా॥ పద॥
త్రిశిర గిరీశు సఖుఁడని విశదమాయెరా- యో
రసికుఁడ నీకు నిందువల్లను నేమాయెరా॥ పద॥

వ. అనిన స్వామి యేమనుచున్నాఁడు.

ఉ. కోపము లేలనే కులుకుగుబ్బలఁ బట్టక తాళఁజాలనే
పాపము గట్టకే యిఁకను బల్మఱు నాపయిఁ బద్దుపెట్టకే
తాపులు మానవే కనికరం బినుమంతయునైనఁ బూనవే
యేపునఁ జౌకచేసి యలయించుట న్యాయమఁటే విలాసినీ!

వ. అనిన సత్యభామ యేమనుచున్నది.

ఉ. వంచన యింతలేని మగవాని విధంబున మాటలాడి చె
ల్లించుకొనేవు నీదువగలెల్లను; పిన్నటనాఁటనుండి నేఁ
గాంచినదాన నూతనముగాదిది; యీవగమాటలెల్ల నా
చంచల నేత్రియింట; నిటసాగవు శ్రీహరి నందనందనా!

వ. అనిన స్వామి యేమనుచున్నాఁడు.

ఉ. ఆచెలియింట నున్నయపు డాసుమ మామునితెచ్చి యీయఁగా
నాచపలాక్షి కిచ్చితిని; అంతకుఁ దాళఁగలేక నేరమున్

దోఁచిన నెంత లేదనుచు దూకొని చూడినచో విరాళి నే
సైఁచఁగఁ జాలనీయలుక చాలును జాలునుబో విలాసినీ !

వ. అనిన సత్యభామ యేమనుచున్నది.

ఉ. ఎక్కువయైన యాసుమము నింతికొసంగిన నెంత లేదనన్
తక్కువ చేసి యల్లవిరితాపులు చూపఁగవచ్చి నాపయిన్
మక్కువ గల్గువానివలె మాటలనాడుచుఁ దప్పు
మొక్కులన్
మ్రొక్కెద వీవు చాలు మునిముచ్చుఁ దనంబులు నంద
నందనా !

వ. అని పరస్పర మేమనుచున్నారు.

ఎఱుక॥ చాపు॥

పసిఁడి వలువమీఁదఁ దగిలినట్టి పసుపునిగ్గేమో॥ అది
పసిఁడికిఁ గలిగిన గుణమని తెలియక భ్రమసుకొనే
వేమి॥
సిస్సైన నీయురమున గుబ్బలపోటు చెలఁగిన విత
మేమో॥
కౌస్తుభమున నీగుబ్బల కాంతులు కనుపించినది
తెలియదా॥
తెలిదామరల వంటి నీకనులను వెలయు కెంపు
లేమో॥
సలలితముగ భాగ్యవంతులకును సహజగుణముగాదా॥

వన్నెమీఱినట్టి నీదు సిగను వాడిన విరు లేమోయి।
నిన్న మొన్న భక్తులు పూజించిన నిర్మాల్యమని
దెలియదా॥
అలసుఁ జెక్కులమీఁద గోటి గుంపు లమరిన
విత మేమోయి।
అల బృందావని పూఁబోదల దూఱఁగాను గొమ్మలు
చీరినవి తెలియదా॥
వేడుకగా నీనోట దొంతర విడెము దేమోయి।
వీడెము గాదు నీపై యనురాగము వెలికిఁ బర్వీన
దెఱుఁగవా॥
సరిలేని కంఠమున బంగరు కంట సరులచిక్కే మోయి।
మఱి మల్లయుద్ధము శేయఁగఁ జిక్కిన మర్మము
నీ వెఱుఁగవా॥
కమ్మని నీమోవిపై మించిన కసికాటు లదేమోయి।
కొమ్మ, చిలుకను ముద్దాడ బింబమని కొఱికిన
విత మెఱుఁగవా॥
దాఁచక తెలుపవోయి వీపునజడ వద్దుల దేమోయి।
నాచిన్నిపాయాపుఁ దల్లి బెత్తముచేత నన్ను గొట్టిన
దెఱుఁగవా॥
మాటికి మోమునను దగిలినట్టి కాటుకగుఱు తేమోయి।
మేటి నామోముఁదమ్మిని జూపులనే తుమ్మెదలు
వ్రాలిన దెఱుఁగవా॥
లలితమైనట్టి నీనుదుటను లతుక గుఱుతు లేమోయి।

చెలియ నీవిరహాగ్నిఁ గలిగిన నిట్టూర్పు కలలని
నీ వెఱుఁగవా॥
ఆయింతి నెనసితివో నీకునింత యాయాస మేమోయి
హాయిగ నీవునన్నుఁ గూడక నేయున్న నాయాసముగాదా॥
త్రిశిరగిరీశ్వరుని చెలికాఁడని తెలిసెఁ దెలిసెనోయి!
వశమైతినని వట్టివాదేల చేసేవు వనిత నన్నేలుకోవె॥

వ. అని యిట్లు పరస్పర వచనములైన తదనంతరంబునఁ గృష్ణమూర్తి సత్యభామను జూచి యేమనుచున్నాఁడు.

ద్విపద. ఎంత వేడినఁ గాని యెలనాగ, నీవు
అంతరంగంబీక యఁగడు చేసెదవు.
ఏమి కారణ మిందు కేమందు నేను!
ఏమినేరంబు లే వీఁకఁ జేసినాను?
నామీఁదఁ దప్పులున్నట్లైన యేని
భామరో, వివరించి పలుకంగరాదె!
వేవేగ గోర్కులు విన్నవించినను
కావలసిన పనుల్ కాఁజేయనేర్తు,
మనసులోఁ బెట్టక మఱి చెప్పకున్న
గొనబైన కోర్కులు కొనసాఁగు టెట్లు?
ఇపుడు నీమదిలోన నేమితోఁచినది
కపటంబు విడిచి చక్కఁగఁ జెప్పుమింక.

వ. అనిన వికసిత వదనారవిందయై సత్యభామ యేమనుచున్నది.

ద్వి. మునియిచ్చు సుమము నామునిచితకు నిచ్చి
నను జిన్నఁబుచ్చి యానాతిని మెచ్చి
పిలిపించినను రాక ప్రియము చేకొనక
నలువురిలోపల నగుఁబాటు చేసి
కనుగొన నేమెఱుంగనివాని రీతి
నొనర నేరముచేయు కున్నట్టిరీతిఁ
గనికర మెంతేనిఁ గలవానివలెను
వనజాక్ష, నీవు నావద్దకు వచ్చి
సురటిచే విసరుచుఁ జొక్కు చల్లుచును
మురువు మీఱఁగఁ దప్పుమొక్కులు మొక్కి
యీ నక్కవినయంబు లేలచేసెదవు?
నీ నెనరెటువలె నిజమంచు నెంతు?
ఇటువంటిప్రేమ నీకిప్పుడు గల్గినను
తటుకునఁ బారిజాత ప్రసూనంబు
గ్రక్కున గొనిదెచ్చి కరుణతో నిచ్చి
మక్కువ నన్నేలు మదనగోపాల!

వ. అని పలికిన సత్యభామను జూచి స్వామి యేమను-చున్నాఁడు.

సీ. ఇందుకా నీవు నన్నెంతలేదని దూటి
యలుకలు చేసితి వంబుజాక్షి!
ఇందుకా నీమనసిచ్చి మాటాడక
కినుకతో నుంటివి కీరవాణి!

ఇందుకా నేను నిన్నెంత వేడినఁగాని
యిమ్మాయమైతివి యిగురుఁబోఁడి!
ఇందుకా నీవు నన్నిన్నాళ్ళు పిలువక
యూరక యుంటివి యోలతాంగి!

ఎంతమాత్రింబు ఈకార్య మిఁకనుజూడు
మేను గావలెననిచో నేమిగాదు!
ఏమొ యని యుంటి నీభావ మిప్పుడుగంటి
నీదు మనసున కితవుగా నేను నడతు.

గీ. పారిజాత మహీజంబు శాఁగుమీఱఁ
బెల్లగించుక కొని తెచ్చి పేర్మితోడ
నీదు శృంగారవనములో నిపుడు నేను
పెరటి చెట్టుగ నాఁటింతు సరసిజాక్షి!

వ. అని కృష్ణమూర్తి పలికినపలుకులు వీనులకమృతప్రవాహంబులై తోఁప నలుకమాని యానందకందళిత తరంగితాంతరంగయై రోమాంచ కంచుకిత సర్వాంగియై కరుణాకటాక్ష వీక్షణ సుధాప్రవాహంబునఁ దేలింపుచు, ముసిముసినగవులు నగుచు, వేద వేదాంత వేద్యుండై పురాణపురుషుండై యోగిజనదుర్లభుండై లీలామానుషవిగ్రహుండై చతురాననాదిసకల సుర కిరీట ఖచిత మణిచ్ఛవిచ్ఛటా నీరాజిత చరణారవిందుఁడైన గోవిందునిం జూచి సకలసద్గుణధామయు, లావణ్యసీమయునైన సత్యభామ యత్యంత ప్రేమతో నుండె. అంత,

ఉ. శారద నీరదేందుధర చందన నారద కుంద హీర మం
దార తుషార పారద శతార సితాంబుజ వారిపూర ఖ
ర్జూర పురందర ద్విరద శుభ్ర హలాయుధ రాజతాద్రి గో
క్షీర యశోనిధీ! యమరసింహమహీప! దిలీపవిక్రమా!

ఇది శ్రీచోళసింహాసనాధ్యక్ష భోసలప్రతాపసింహరాజ పూర్వ పుణ్య పరిపాక స్వరూప యమునాంబికా గర్భశుక్తి ముక్తికాయమానామరసింహ మండలాధీశ్వర నామాంకితం బైన మంత్రి మార్తాండ శివరాయ కారితంబైన శ్రీమత్ సుగంధి కుంతలేశ్వర కరుణా కటాక్ష వీక్షణ సుధాసార సంజనిత చతుర్విధ కవితానిర్వాహక శాండిల్యగోత్ర పవిత్ర కవిరంగయామాత్యపుత్ర విద్వజ్జనవిధేయ మాతృభూత కవి నామధేయ ప్రణీతంబైన పారిజాతాపహరణ నాటకంబునం గృష్ణుని వద్దకు సత్యభామ వచ్చుటయును, నిష్ఠురోక్తు లాడుట యును, కృష్ణమూర్తి రానని నిరాకరించుటయుఁ, దదనంతరం బున రాధా రుక్మిణీ సత్యభామల పరస్పర సంవాదంబును, తదనంతరంబున సత్యభామ నిజగృహంబునకు వచ్చి వనవిహా రం బొనర్చి యత్యంత విరహంబునఁ గోపాగారంబున నుండు టెఱింగి కృపానిధియగు కృష్ణమూర్తి సత్యభామవద్దకు వచ్చు టయు, సత్యభామామణి కోపావేశంబున నిష్ఠురోక్తు లాడు టయుఁ బారిజాత మహీజంబు తెచ్చి యిచ్చెదనని యొడఁబఱ చిన సత్యభామామణి యానందంబుననుండెనను కథలఁజెలంగు నిది చతుర్థాంకము.

---

# పారిజాతాపహరణము

## —: పంచమాంకము :—

క. శ్రీరామచంద్రపదసర
సీరుహ భృంగాయమానచిత్త, మనోజా
కార, రణశూర, సకల
శ్రీరమ్యాగార, యమరసింహావజీరా!

గీ. అవధరింపుము నీపేర నంకితముగఁ
బారిజాతాపహారణంబు బాగుమీఱ
నాటకముగాను రచియించినాను వేడ్క
నెలమి నైదవ యంకం బదెట్టిదనిన.

వ. అని యిట్లు పారిజాత మహీజంబు తెచ్చి యిచ్చెద ననిన సంతుష్టాంతరంగయై సత్యభామ స్వామినిజూచి యేమని వినుతింపుచున్నది.

క. ఝషకశఫర, కమఠ, కిటి, నర
హరి వామన రామరామ హలధర కృష్ణా!
వరబుద్ధ కలికిరూపా
గిరిధర గోవింద! మానిగేయ! ముకుందా!

వ. అని మఱియు నేమనుచున్నది.

సీ. నీల నీరదగాత్ర, నిర్జర నుతిపాత్ర,
వసుదేవపుత్ర పావనచరిత్ర
దాస మానసహంస, దళితవత్సనృశంస,
మర్దితకంస, ధర్మప్రశంస,
గోవర్ధనోద్ధార, గోధనపరివార,
భవ్యకృపాపూర, గవ్యచోర,
ద్వారకాపురవాస, వారితార్తత్రాస
మహిత చంపకనాస, మంజుహాస,

కనకమయచేల, గోపికాజనవిలోల,
యమిత భవరోగవైద్య, వేదాంతవేద్య,
సారసదళాయతాక్ష, విశాలవక్ష!
భక్తరక్షణతృష్ణ! గోపాలకృష్ణ!

వ. అని మఱియు నేమనుచున్నది.

ద్వి. వినవయ్య గోపాల, విఖ్యాతశీల,
అనుమత గుణజాల, యాశ్రితపాల,
నీమహాద్భుత మహనీయచరిత్ర
లేమున్న యుంగుదు నేమంటివేని
యడరి యా సాందీపునకైనట్టివాని
కొడుకును దేలేదె కూర్మితో మున్ను
చెనఁటి సోమకుఁడు మ్రుచ్చిలిన వేదము
మొనసి వాని హరించి మునుపు తేలేదె!

భూమిఁ జుట్టిచుట్టుక పోయిన ఖలుని
వేమాఱు దండించి విపుల తేలేదె!
యటుగాన దేవర కలసురదు)ముము
నిట గొని తెచ్చుట యేపాటి నీకు
ఎలమి నిందాౖదులు నెదిరించి రేని
నిలిచి జయింపఁగ నేర్తువు నీవు
కావున వేడితిఁ గడు వేగమునను
ఈవులచెట్టు నీవిటకుఁ దేనలయు.

వ. అని మఱియు నేమనుచున్నది,

క. దేవర, నా వెత తెలుసుక
ఈవగఁ గరుణింపవచ్చి యీావులచెట్టున్
వేవేగఁ దెత్తుననుచును
గోవిదనుత, పలికినపుడె కోర్కులు పండెన్.

వ. అని యిట్లు పలికి యత్యంతముదంబుతో సత్యభామా మణి చెలులైన సన్నుతాతిన్నె మీఁద వెన్నునిఁ గూర్చుండ నియోగించి పన్నీట జలకమార్చి, చలువలచేఁ దడియొత్తి పీతాంబరంబు ధరియింపఁజేసి నుదుటఁ గస్తురితిలకంబు నిడి యనర్ఘ్య మణిమయ కిరీట కుండల హార కేయూరా ద్యాభర ణంబు లలంకరించి దివ్యచందన కస్తూరి సంకుమదాద్యనేక పరి మళము లలంది, నానావిధ ప్రసూన హారంబు లలంకరించి, తదనంతరంబ తానును గుజ్జుగొజ్జంగినీట మజ్జనమాడి, వనిహ

రువు సరిగచెంగావి పావడమీఁద హెచ్చిన సచ్చుతావన్నె బవంతిచీర ధరియించి, పైఠిణీరైక దొడిగి నెన్నొసలఁ గస్తూరి తిలకం బిడుకొని సొగసుఁ గన్నులను గాటుకదిద్దుకొని, యెఱ జాజు కొప్పున నగవిరిసరులు ముడుచుకొని, సర్వాభరణాలంకృతయై, మృగమద కుంకుమ సంకుమద విలిప్తాంగయై, నీల మేఘంబు చెంగటి మెఱుపుఁదీగయునుం బోలె హరిచెంగట నిలిచి వెలహెచ్చు బంగారు పళ్ళెరంబున శాలీయాన్న భక్ష్య భోజ్య లేహ్య చోష్య పానీయాదుల నిడి హరియును దానును బొత్తుభుజించి రంగారు బంగారు భృంగారు జలంబులం గరం బులఁ గడిగికొని, కపురంపు వీడియంబు లొసంగి, యతఁడు కొఱికిన మడుపులు తానందుకొని శృంగారంబుగా రంగారు తిరుచెంగావి బంగారు పైఁటకొంగుచే విసరుచు, భావి సురతోత్సన సూచక పరస్పర వీక్షణంబుల మెలంగియున్న యవసరంబున—

సీ. పంకజ మిత్రుండు పశ్చిమాంబుధి చేరెఁ
గమనీయ సాంధ్యరాగంబు మీఱె,
విరహిణీ జనముల వేసటలును దీఱె
పంచబాణుఁడు స్వారి బయలుదేరె
సాంద్రంబులై చంద్రచంద్రికల్ తనరారె,
నక్షత్ర పంక్తులు నయము మీఱె,
అలచకోరకముల కానందములు సేరెఁ
గలువలు వికసించి కళలు దేరెఁ

బద్మినీబృందములు తమపతినిబాసి
తమ్మిమోములు ముడిచి ఖేదమ్ముఁ జెందె.
కలిమ్ముకొని కమ్మతెమ్మెర కడఁగి విసరె
మహితమైనట్టి యాసంధ్య మఱుఁగు వేళ.

వ. ఇట్లు సంధ్య మఱిఁగిన తదనంతరంబు సకలశృంగారము లతో రంగారు బంగారు మేడమీఁద నరవిరిసరులచే మురువుగా నమరు నసమాన్యోపధానంబుల నొప్పారు నిద్దంపు టద్దములఁ బొలుపుమీఱు హంసతూలికాతల్పంబున సత్యభామను గూడి మాయామయుండైన గోపాలమూర్తి యెడవిడునని ప్రేమచే గాఢాలింగనంబు చేసికొని, యెన్నరాని జంటితేనె కన్న మిన్నయై కనుపట్టుచున్న కెమ్మోవి పానకంబాని, తళతళల నీను తళుకుటద్దంబుల కుద్దియైన తళుకుఁ జెక్కులు నొక్కి, ముద్దులిడి. యరజాఱుపైఁట తొలఁగించి పైఠిణీ రవికలో నిజికి హొన్నుగిన్నెలకన్న మిన్నలై వన్నెమీఱుచున్న చిన్నిచన్నుల నొడిసిపట్టి, నఖక్షతంబు లొనరించి, వళిత్రియంబుల నాని, పోకముడి సడలించి కాంచిదేశంబు తోరణంబుగట్టి, చొక్కి చొక్కించి, దక్కి దక్కించి, మొక్కి మొక్కించి, చిక్కి చిక్కించి, వలచి వలపించి, సొలసి సొలయించి, యనంగరాజ్య సామ్రాజ్యంబు కైవసంబు చేసికొని, చౌసీతి బంధముల నెనసి, బహుకాలసంజాత విరహసాగర తారణ కారణ పరస్పర క్రీడా భేదంబుల నానందవార్ధిలో నోలలాడుచుఁ బారవశ్యంబుఁ జెంది యున్న యవసరంబున.

సీ. కలువలు ముకుళించెఁ గమలముల్ వికసించెఁ
గెరలి తుమ్మెదల ఝంకృతులు మించె
పలుచైన పక్షుల కలకలంబులు మీఱె
నల చంద్రికల వెలవెలలు పాఱె
కడు దీపకళికల కాంతు లంతట తగ్గె
చీకటుల్ గుహలందుఁ జేరి మ్రగ్గె
విరహిణీజనులకు వేసట పెంపెక్కె
పెడవిల్తుఁ డంతట వెనుకద్రొక్కె

దిక్కులెల్లను దెలివొంది తేజరిల్లె
జక్కవలు జోడువీడక సంతసిల్లె
మలయపవనుండు విసవిసమనుచు విసరె
నినుఁడు పూర్వాద్రిపై నుదయించు వేళ.

వ. అంతట మాయామయుండైన గోపాలమూర్తి కాలోచితక్రియలు నెఱవేర్చి, భోజనాదివిధులాచరించి, సత్యభామాసమేతుండై కొలువున్న యవసరంబున నారదమునీంద్రుఁడు వచ్చెనఁట యెటువలెను.

దరువు॥ మధ్యమావతి॥ ఆట॥

నారదముని వచ్చెను వేడుక మీఱ॥ నార॥
నారదముని వచ్చెనఁట నటనము సేయుచుఁ
జేరి సత్యభామ కృష్ణుల చెంతకు॥ నార॥

అలికమునఁ దిర్యపుండ్రము హస్తమున జపసరము
కళగుల్కు రుద్రాక్ష కంఠ మాలికయు। చెలువైన
జడలును జేకమండలువు మెఱయ- నలత్రిశిరగిరి -
నిలయుని సఖుని చెంతకు॥ నా॥

వ. ఇట్లు వచ్చిన నారదమునిని సత్యభామాసహితుఁడై కృష్ణమూర్తి యెదుర్కొని యర్ఘ్యపాద్యాచమనీయాదివిధులఁ బూజించి, యుచితాసనంబునఁ గూర్చుండ నియమించి, నారదునితో విందారగించి సత్యభామా నీరజాతనయనకుఁ బారిజాతం బొసంగఁ దలఁచి విరించినందను గుఱించి యేమనుచున్నాఁడు.

ద్వి. నారదమునివర్య, నగవైరితోడ
వేఱుసేయకను ఈవృత్తాంత మెల్లఁ
దెలుపు; మేమనిన- భూదేవినందనుని
అలయుద్ధమునఁ ద్రుంచి యదితికుండలము
లేఁ దెచ్చి దాఁచినా; నిపుడు నిందు్రుండు
ఆదటఁ దానేల యడుగకున్నాఁడు.
ఈ సత్యభామకు నింద్రాణిఁ జూడ
నాసయై యున్నది యది వివరింపు.
ఆనందనంబును అమరావతియును
మానసంబునఁ జూడ మఱి కోరినాఁడ.
అవిగాక కొన్ని కార్యము లున్నవచట;
వివరింపు వచ్చెద వృత్రారికడకు.

వ. అని పలికి నారదు నింద్రునికడకుఁ బంపిన తదనంతరం బునఁ గృష్ణమూర్తి గరుత్మంతుని స్మరించిన, గరుత్మంతుఁడు వచ్చినఁట యెటువలెను.

దరువు॥ మోహాన॥ ఆది॥

వైనతేయుఁడు వచ్చెను వేగముగాను॥ వైన॥
జ్ఞానైన త్రిశిరగిరీశ్వరుని చెలికాఁడు మదినిఁ
బూని తలఁచినమాత్రమునను వేగముగాను॥ వైన॥
పాములపగవాఁడు పక్షుల యెకిమీఁడు- వేమాఱు
అరుణునకు వెనుకటివాఁడు। ఆమేఘవాహు గెల్చి
యమృతము దెచ్చినవాఁడు- స్వామి కార్యధురీణుఁ
డై మెఱచినవాఁడు॥ వైన॥

వ. ఇట్లు వచ్చిన గరుత్మంతుఁడు స్వామిని గొనియాడు చున్నాఁడు.

క. శ్రీరమణీ ముఖచంద్ర చ
కోరా, నవనీతచోర, గోపవధూటీ
జారా, కంస ముఖాసుర
ఘోరా ద్రిశతార, నందగోపకుమారా!

క. శ్రీధర, ప్రద్యుమ్న. జగ
న్నాథ, హృషీకేశ, పద్మనాభ, ముకుందా,
మాధవ, రాధావల్లభ,
గోధన సంచార, నందగోపకుమారా!

మాలిని. కనక రుచిరచేలా! కామినీ కేళిలోలా !
వినిహత శిశుపాలా! విశ్వ విశ్వానుకూలా!
ముని జన సురపాలా! మోక్షసంధానశీలా!
ఘన జలధర నీలాకార! గోపాలబాలా!

మ. యమునా తీరవిహార, నీలమణి దివ్యాకార, కంసాది దై
త్యమహాశైల శతార, దీనజనతా దారిద్య్ర సంహార, య
ర్యమ బింబాంచదగార, నందసుకుమారా, భక్త
మందార, శ్రీ
రమణీ వక్త్రిలసత్కళానిధి చకోరా, గోపికావల్లభా!

వ. అని యిట్లు సన్నుతించిన పతంగపుంగవునిం గనుంగొని కృష్ణమూర్తి యేమనుచున్నాఁడు.

ద్వి. వినవోయి చక్కఁగా వినతాతనూజ
అనిమిషపురికినే నతివతోఁ గూడ
నతివేగమునఁ బోయి యమరుల గెల్చి
జతలేని యాపారిజాతంపు దెచ్చి
పనివడ నీసత్యభామ యుద్యాన
వనమున నాటింపవలెనని కోరి
నిన్ను దలంచితి నిర్జరపురికిఁ
బన్నుగఁ బోవలెఁ బయనమ్ము గమ్మ.

వ. అని పలికిన కృష్ణమూర్తిని గనుంగొని గరుత్మంతుఁ డేమనుచున్నాఁడు.

క. ఏకార్య మానతిచ్చిన
నాకార్యము క్షణములోన నతివేగముగాఁ
జేకొని యొనరించెద న
త్యాకాంతామణి సత్కృష్ణ! హరి, హరి, కృష్ణా!

వ. అనిపలికిన యదనంతరంబునఁ గృష్ణమూర్తి సత్యభామా సమేతుఁడై చిలువఖాణంబు తేజినెక్కి శంఖ చక్రాద్యాయుధంబులఁ గరంబులఁ బూని యాదవబలసమేతుఁడై యింద్రపురి కరిగె. అంత దేవేంద్రుఁడు కృష్ణమూర్తి రాక నారదునిచే మున్ను విన్నవాఁడు గావున నెదుర్కొన వచ్చెనట యెట్టు లనెను.

ధన్యా॥ ఆట॥
దేవేంద్రుఁడు వచ్చెను వేడుకమీఱ॥ దేవే॥
శ్రీ వెలయు త్రిశిరగిరీశు చెలికాఁడైన శ్రీకృష్ణ
దేవుని చెంత కెదుర్కొన।
అచ్చర వనితలు నాట్యమాడ వి। యచ్చర కోటులు గొలువగను।
హెచ్చైన తెల్లని యేనుఁగుపై నెక్కి। పచ్చనివిల్తునిగన్న
పరమాత్ముని కడకు॥ దేవే॥

వ. ఇట్లెదుర్కొనివచ్చి జిష్ణుండు విష్ణుండగు కృష్ణు నాలింగనంబు చేసికొని యమరావతికిం దోడ్కొనిపోయి నందనవనం

బున విడిది యమర్చి చింతామణి భద్రపీఠంబునఁ గూర్చుండ నియోగించి యర్ఘ్యపాద్యాది విధులఁ బూజించి యేమను చున్నాఁడు.

ముఖారి॥ దరువు॥

ధన్యుఁడైతిని నేటికి నేను-
మాన్యుఁడ నైతిని। నన్నుఁడా నీయడుగులు నావీట
సోఁకినయంతనే। ధన్యు॥

అ। వేదవేదాంతోపనిషదాదులకు దుర్లభంబు॥
ఆదికిని నాదియైన నీరూపము గనుఁగొని॥

వ॥ బ్రహ్మాదులకైనఁ గనుపట్టరానియట్టి పరబ్రహ్మమైన
నీరూపము పలుమారు కనుపించినప్పుడే॥ ధ॥
నిర్గుణమైన యన్నిదిశల నిండి యేకమైన నీవు
నిసర్గముగ నాయెదుట సగుణమై కనుపించినప్పుడే।
ఆదిమధ్యాంతరహితుఁడై యంటియంటనట్టి నీవు-
పాదుకొని గోపవేషమునఁ బ్రత్యక్షమై నిలిచి
నప్పుడే॥ ధ॥

నిత్యుఁడైన త్రిశిరగిరి నిలయుని సఖుఁడైన నీవు
సత్యభామతోఁ గూడుక సాక్షాత్కారమైనయప్పుడే॥
ధన్యు॥

వ. అని యిట్లు సంస్తుతించి యిందుఁగు నగరు ప్రవేశించిన యంత కృష్ణమూర్తి యదితిసన్నిధానంబునకుఁ బోయి

సత్యభామాసమేతుఁడై సాష్టాంగదండప్రణామంబు లాచరించి మున్ను నరకాసురుండు గైకొనిపోయిన కుండలంబుల నదితి కొసంగి, యామెను సంతుష్టాంతరంగురాలిఁ జేసి, యామెచే దీవనలువడసి, యిందుండ్రిందుచేయు విందారగించి, యుండొక నాఁడు వసియించి మఱునాఁటి ప్రాతఃకాలంబునఁ బారిజాతాప హరణం బొనరించి గరుత్మంతునిపై నిడుకొని, సత్యభామా సమేతుఁడై గరుత్మంతునిపైఁ గూర్చుండి బయలు వెడలి కొంత దూరం బరుగుసమయంబున వనపాలకులు దేవేంద్రున కత్తెఱం గెఱిఁగించిన,

క. దేవతలతోడఁ గూడుక
దేవేంద్రుఁడు యుద్ధమునకుఁ దెగఁబడిరాఁగన్,
ఆవేళ హరి జయించెను
దేవేంద్రుంతోడ సకల దిక్కులు నవ్వన్.

సీ. సురనికరములు ప్రసూనవర్షంబుల
నెలమి బోరనఁ గురియించి రపుడు,
కిన్నర గంధర్వ గీర్వాణ యక్షులు
చేరి గానంబులు చేసిరపుడు
అప్సరస్త్రీ సమూహమ్ము లద్భుతముగా
నటనమ్ము చేసిరి నయముతోడఁ
బటహ శంఖ మృదంగ పణవ భేరీధ్వనుల్
సురలు మ్రోయించిరి సొంపుమీఱ

నారదాది మునీంద్రు లానంద మొంది
సంస్తుతించిరి కృష్ణుని సరసఁజేరి
యమరపురినుండి పారిజాతావనీజ
మచ్యుతుఁడు తెచ్చి సత్యకు నిచ్చువేళ.

వ. ఇట్లు పారిజాతాపహరణం బొనరించుకొని కృష్ణమూర్తి సకల జగజ్జేగీయమానుఁడై సురనికరయాదవప్రముఖులు సన్నుతింప సురదుందుభులు మ్రోయఁ బురజను లచ్చెరువొంద ద్వారకానగరప్రవేశంబు చేసెనంట యెటువలెను.

దరువు॥ శ్రీరాగము॥

పారిజాతము దెచ్చెను శ్రీకృష్ణుఁడు
పారిజాతము దెచ్చెను। అరయ సత్యభామామణి
మనసునఁ
గోరిన కోర్కె కొనసాగెనని పొగడ।
ఈడు జోడులేని శ్రీత్రిశిరగిరీశున కర్పితమై।
వాడక కందక వాసన లెన్నఁటికి వీడని పువ్వుల
నెలసియున్నయట్టి పారి॥

వ. ఇట్లు పారిజాతంబు దెచ్చి సత్యభామామణి కేళీవనంబునఁ జెంగల్వ కొలనిచెంగటఁ గప్పురంపు్రటనంటుల నడుమ నాటించిన తదనంతరంబ సత్యభామ యానంద కందళితాంతరంగయై స్వామిని ఏమనికొనియాడుచున్నది.

ఉ. పాండవ మిత్ర, దీనపరిపాలక, పాపలతాలవిత్ర, మా
ర్తాండ సహస్రధామ, భవతారక, చంద్రకులాబ్ధిసోమ, బ్ర
హ్మాండలసత్ప్రచండ, యమలార్జున కాళియ కంసధేను కో
ద్దండ గిరిప్రభేదన శతార, మురాంతక, నందనందనా !

క. శ్రీగోవర్ధన గిరిధర !
యోగిమనః పద్మభృంగ ! యుద్ధవసఖ ! స
ద్యాగమ వినుత పదాంబుజ !
నాగణపరివార ! నందగోపకుమారా !

గీ. కోర్కు లీడేరె మదిలోని కొదవతీరె;
పద్దు నెఱవేఱె వలపు నీపైని పేరెఁ
గోపమింకఁ బాఱె మనసు నీకూర్మిఁ గోరె
నేలుకోవయ్య గోపాల ! జాలమేల !

కేదారగౌళ॥ ఝంపె॥
హరిహరీ నామనసు కానందమాయెన్।
ఇరవుగా నాపంతి మీఁదేర్చినపుడె॥
అ॥ నేను నోచిన నోము నేఁడుగా ఫలియించెఁ।
బూని నాభుజము లుప్పొంగఁ దొడఁగె।
దీనరక్షణ బిరుదు దేవరకు నిజమాయెఁ।
బూని సవతులలోనఁ బూజ్యతందఁగలిగె॥

నాపుణ్య మీఁడేరె నాజన్మ మీఁడేరె।
నాపూజ లీడేరె నయముగాను।
ఆపారిజాతంబు నతివేగ గొని తెచ్చి
నైపుగా శృంగార నని నుంచినపుడె॥
మహిలోన నీవంటి మగనిఁ బెండ్లాడఁగా
బహుళతర భాగ్యంబు పండె నిపుడు।
మహిమగల త్రిశిరగిరి మాతృభూతేశ్వరున
కహరహము మిత్రుఁడైనట్టి శ్రీకృష్ణా।

వ. ఇట్లు గొనియాడిన సత్యభామను గూడి కృష్ణమూర్తి యానంద సముద్రంబున నోలలాడుచునుండె. అంత రుక్మిణి.

పాత్రప్రవేశము॥ దరువు॥

ద్వి. ఇదె వచ్చెద నటంచు నింతిరో! నాదు
సదయుండు వెలువడి సత్యచెంగటికిఁ
బోయె నాయింటికిఁ బోలఁతి, కృష్ణుండు
ఈయెడ రాఁడాయె నేమొకో తెలియ.
నెలఁది తాఁ గృష్ణుని నెలఁబెట్టి కొనెనో!
తలకెక్కెనో లేక తరుణిచే మందు !
దాని మాయలలోనఁ దగిలియున్నాఁడో !
కాణాచి దానింటఁ గావించినాఁడో!

మనసులోపల నన్ను మఱచి యున్నాఁడో!
తనరెడు దాని బోధనలు విన్నాఁడో!
లేకున్నఁ గృష్ణుండు లేమరో! యిందు
రాకనే యింత పరాకు చేయునో కో!
ఏమని సైరింతు! నీవిరహాబ్ధి
నేమని యీఁదుదు! నేమందు నిపుడు!
ఒకమాట యొకనిజం బొకపద్దు హద్దు
ఇఁక లేని మగవాని నెట్లునమ్మవచ్చు!

వ. మఱియు నేమనుచున్నది

దరువు॥ భైరవి॥ ఆది॥

ఏమి సేతు నెటుల సైఁతు! ఈవిరహ మెటుఁ బోదు।
రామరో శ్రీగోపాలుఁడు రాక నేయుంటే॥ ఏమి॥
కన్నులకు నిదుర రాదు కలికిరో పొద్దుపోదు
అన్నమైతే సైఁచ లేదు- అతని దయ రాదు॥ ఏమి॥
పీడమైతే వెగటాయె- సన్నెలకాఁక తఱుచాయె।
ఆడికల కెడమాయె- నదియేమో మాయ॥ ఏమి॥
ఎవతెయింట నున్నాఁడో - ఏమితాఁ దలంచుకొన్నాఁడో
ఎవతె బోధనలకు నిఁక లోనైనవాఁడో॥ ఏమి॥

సత్యభామ చేతిమందు చాలఁ దలకెక్కె- నేమందు
అత్యంతమహా ప్రేమయుందు, నాగడాలిందు||ఏమి||
చెలియరో శ్రీత్రిశిరగిరి - నిలయుని సఖుఁడైన|
కృష్ణుఁడు|
పిలిపించినా యిందు రాఁడు- ప్రియమా గైకొనఁడు||

వ. అని మఱియు నేమనుచున్నది.

సీ. లేమరో! నాపొత్తు లేక భుజింపఁడు
ఉవిద, నన్నెడఁబాసి యుండ లేఁడు
ఏమన్న నామాట కెదురాడఁ జాలఁడు
కలనైన నాతోడ నలుగఁ జెప్పఁడు
ఇసుమంత నాపక్క- నేమఱఁ జెన్నఁడు
నొంటిగా నను బాసి యుండ లేఁడు
గర్విమైన నను జూడకను దాళఁ జాలఁడు
వెలఁది, నాకౌఁగిలి విడువ లేఁడు

ఇట్టి ప్రాణేశ్వరుండు నన్నిపుడు పాసి
సత్యభామకు లోకువై సారెకచటఁ
బాళిమిటు చేసి నను మరుపాలు చేసి
యిందుఁ గృష్ణుఁడు రాఁడాయె నేమి సేతు!

పదము॥ పున్నా॥ చాపు॥

అలిగి రాకయున్నాఁడె గోపాలుఁడు।
అలిగి రాకయున్నాఁడె॥ అలిగి॥
అలిగి యిందు రాక యుత్తిన సత్యతోన- చెలిమి చేసి రతులఁ
గలిసి మెలఁగుకొనుచు। పిలిపించిన రాక చులకచేసి
యిపుడు॥ అలిగి॥
కన్నెలలోన నన్ను మిన్నచేయునని - యున్నందులకుఁ దప్పి
తెన్నన్నో యెంచుక। నన్ను వంచన చేసి
వన్నెలాడికిఁ దక్కె॥ అలిగి॥
మక్కువఁ దా నీకు దక్కితి నని చొక్కి- చొక్కించి మిక్కిలి
పక్క మచ్చికచేసి। యక్కజ పుట్టించు నక్కని
స్వామి॥ అలిగి॥
రామ త్రిశిరగిరి ధాముని చెలికాఁడై- వేమారు
వెలసిన కాముని గన్నయయ్య। ఏమో లేనిపో
స్వామి చేసి యిపుడు। అలిగిరాకయున్నాఁడె-
అమ్మ నేచెల్ల విరహము తాళలేనె॥
ఎంతని యోర్తు ముద్దులగుమ్మ గోపాలుఁడు॥ అలిగి॥

వ. అని మఱియు నేమనుచున్నది.

దరు॥ శం॥ ఆది॥

ఎమ్మెకాఁడు వచ్చునని యెదురెదురు చూచి
సొమ్మసిల్లితిఁగాదె యోయమ్మ నేచెల్ల॥
ఈలాటి వాఁడని తెలియ కేల పెండ్లాడితినే।
ఓబాలరో తెలిసెఁ దెలిసె గోపాలుని వగలు॥
బాసలిచ్చిన నీలాగు మోసపుచ్చె దెఱుఁగనైతి
నాసవతింటఁ బాళెము వేసెఁ గదవే॥
మట్టు మర్యాద లేకనే రట్టడి మరుని పాలయ్యె
టట్టు చేసి నన్ను రచ్చఁబెట్టెఁ గదవే॥
వెలఁదిరో శ్రీత్రిశిరగిరి నిలయుని చెలికాని వగలు
పలుమాఱు నేనిట్లని నేను దెలియనైతినే॥

వ. అని మఱియు నేమనుచున్నది.

దరువు॥ శంకరా॥ చాపు॥

అమ్మ చెల్ల యేమిసేతునే। వానియెమ్మె నేమోస
పోతినే। రచ్చ।
కీమ్మచేయు నని పోతినే। నిప్పు। డించుకైనఁ
దెలియ నైతినే।

ఇదిగో వచ్చెనని పోయెనే। కృష్ణుఁ। డిదివఱకును
రాఁడాయెనే।

ఆ। మదవతికి లోనాయెనే। నాపై। మమత యించుక
లేదాయెనే॥

ఎంతసేపు తాళుకొందునే। చెలుల। సెంతని నే వేఁడు
కొందునే।

తన। యంతరంగము దానియుందునె। యుంచి।
యగడుచేసె నేమందునె॥

ప్రాణవల్లభుఁ డెడఁ బాసెనే। మను। జారికి లోకువ
చేసెనే।

తన। జాణతనము బైటఁ బెట్టెనె। విధి। సకియ
నాతల నిట్లువ్రాసెనె॥

త్రిశిరగిరీశ్వరు చెలికాఁడు। తెలిసి। తెలిసి యించు
రాకయున్నాఁడు । అన్ని । దిశలను దానైన
గోపాలుఁడు।

నను శోధింపఁ దలఁచినాఁడేమొ నేఁడు॥

వ. అని యిట్లు విరహాపడుచున్న రుక్మిణి చెంతకు స్వామి వచ్చెనఁట యెటువలెను. (పాత్రప్రవేశము) కృష్ణమూర్తి వెడలివచ్చె నదిగో కీరవాణులార చూడరె!

వ. ఇట్లు వచ్చిన స్వామిని జూచి రుక్మిణీదేవి యేమను-చున్నది.

ద్వి. ఇదె వత్తునని పోయి యిన్నాళ్ళు నీవు
మదిరాక్షి సత్యభామామణి యింట
వాసమై యుండి నావద్దకు రాక
మోసంబు చేసి యిప్పుడు వద్ద వచ్చి
సరసంబు లొనరింప సాగెదవీవు.
మరియాదగాదు నీమాయలు దెలిసె.
నీతప్పు సరసాలు నీవినయములు
నీకిటవటమాట లిటఁ జెల్ల వింక.
ఒమ్మికగాను నిన్నొగి వెలఁబెట్టి
యమ్మకం బిడిమెనా యలసత్యభామ!
పారిజాతముఁ దెచ్చి పడఁతింటఁబెట్టి
గౌరవం బిటఁ జూపఁగా వచ్చినావా!
నీముచ్చటదనములు నే నెఱుంగుదును
నాముందు నిలువకు నళినదళాక్ష!

వ. అని యిట్లు కోపావేశంబున నల్లతాోచోయన నల్లనైన యల్లికల నుల్లసిల్లి, జాజీ చంపక మల్లికాది కుసుమ వాసన లెల్లెడలన్ నెల్లివిరిసినరీతిఁ బారిజాతవాసనలఁ బడెఢవిల్లి, రత నంపుఁ జెక్కడపు జాళువారాకఁ డీకొప్పు జడబిళ్ళఁ గుచ్చుల

హైన నిడుద జడచే లీలామానుష విగ్రహుండైనగోపాల మూర్తిని ఘెళ్ళుఘెళ్ళున నూటిగా మీటిన వేటునడి యనంగ సామ్రాజ్య రాజ్యంబు కైవసంబైన తెఱంగున సంతుష్టాంతరంగుండైన హరిని జూచి రుక్మిణీదేవి యేమనుచున్నది.

చూర్ణిక॥

శ్రీమదఖిల కల్యాణ గుణాభిరామ। గోపికా రామ। నీలనీరదశ్యామ। జైవాతృక ఇవ జైవాతృకః। భుజంగ ఇవ భుజంగః। చతురానన ఇవ చతురాననః। మహాకాళ ఇవ మహాకాళః। పద్మినీవల్లభ ఇవ పద్మినీవల్లభః। భవాన్ మదీయ సౌధాగ్ర భాస్వచ్చంద్ర శాలాంతర విలసిత ముకుర నికర పరివేష్టిత మల్లికా మాలతీ జాజీచంపక ప్రముఖ కుసుమ మాలికా విరచిత వితానాలంకృత హంసతూలికా తల్పే। రతిసమయే పరస్పర విరచిత నఖదంతక్షత పరిరంభణాది సకలలీలావిలాస సంజాతానంద సమయే। కిమపి మనసి నిధాయ మాం త్యక్త్వా। అహమద్య వాగచ్ఛామీ త్యుక్త్వా సత్యభామా గృహాంతరం గత్వా। శింజాన మంజు మంజీర సమంజస తదీయచరణ కంజాత ప్రహార సంజాత కుతూహలః। తచ్చరణయోః ప్రణమ్య

తయా సహైవ పురావతీం ప్రాప్య పారిజాతాపహరణం
కృత్వా తదపహరణ జనిత పరిభావ మంగీకృత్య,
అమరతరుం తద్గృహే నివేశ్య, నిరపరాధీవ
మద్గృహ మాగత్య కింవదసి? అవయోః॥ఇతః పరం
కిం వచనీయం? తత్రైవ గత్వా సుఖమనుభవ.

వ. అని పలికిన రుక్మిణీదేవిని జూచి స్వామి యేమను చున్నాఁడు.

గీ. కోప మిపుడేల చేసెదు కోమలాంగి!
పారిజాతంబు దానింట బాగుమీఱఁ
బువ్వులెల్లను నీయింట నివ్వటిల్ల
వెలయఁ జేసితి నీజాడ దెలిసికొమ్ము.

వ. అని పలికిన కృష్ణుని మృదుమధుర వచనరచనలకు సంతుష్టాంతరంగయై రుక్మిణీదేవి స్వామిని జూచి యేమని కొని యాడుచున్నది.

పంచచామరము॥

మురాసురారి దైత్యరాట్సముద్ర కుంభసంభవా!
సరోజ దివ్యపత్రనేత్ర! సామజేంద్ర పాలకా!
ధరామరాళి వందనీయ! తాపసాళి వందితా!
కిరీటి పూజితాంఘ్రియుగ్మ! కృష్ణ! నందనందనా!

మాలిని. కరధృత నవనీతా! కామితార్థ ప్రదాతా!
సరసిజదళనేత్రా! సజ్జనస్తోత్ర పాత్రా!
నిరుపమ ఘనదేహా! నిస్తులాజానుబాహా!
నరకదనుజహారీ! నందగోపాల శౌరీ!

వ. అని యిట్లు వినుతించిన తదనంతరంబ కృష్ణమూర్తి రుక్మిణీ సత్యభామలకు సమాధానంబు సేయంగోరి, సత్యభామను బిలిపించి రుక్మిణీ సత్యభామలను జూచి స్వామి యేమనుచున్నాఁడు.

క. మీరిరువు రింకఁ బాలున్
నీరుం బలెఁ గలసి మెలసి నెమ్మది మీఱన్
నారెకు నాయిరు జెసలను
గూరిమితో నుండవలయు గుణవతులారా!

వ. ఇట్లు సమాధానలై పరస్పరవచనంబు లాడిరంట యెటువలెను.

సవతుల కాట్లాట॥ ఎరుకల కాంభోజి॥ చాపు॥
ఏమే సత్యభామ యిప్పుడు నీకింత గర్వమేలనే।
నా మనోహరుని సైనసము జేసికొని నన్నించ
కుందువఁటె

నీ మగఁ డంటివేమె రుక్మిణి ! నా మగఁ డతఁడు
గాఁడా॥
నామీఁదఁ గలిగిన ప్రేమ కృష్ణునకు నీమీఁదఁ
గలుగునఁటె॥
ఒక్క సుమము నీకు నిచ్చినంత టువిద, గర్వించితివి
చక్కనైన పారిజాత వృక్షము తనకు సదయుఁడు
తెచ్చిచ్చెనె॥
ఇచ్చితే నేమాయెనే యందువల్ల నేమి ఫలము
గంటివె।
హెచ్చుమాట లాడుచు నాతో సరిసరిగ నెదిరించఁ
జూచేవేమె!॥
ఎదిరించి మాటాడేవు నీవల్ల నేమి సేయఁ వచ్చునె।
సదయుఁడు నాప్రాణపదమై యుండ నిన్ను సడ్డ
సేతునఁటవె॥
సదయుఁడు నావాఁడని యింతైనఁ దోఁచక మాట
లాడేవేమె।
సదయుఁడు నీవాఁడో నావాఁడో యీజాడ జగతికెల్లఁ
దెలియునె॥
తెలిసె నీవాఁడైతే పూవుల చెట్టు తెప్పించుకొన
రాదఁటె।
వెలఁది యూరకే పోకిళ్ళు పోయేవు రెట్టి పట్టెసఁటె॥

కలికిరో నీకు నాకు హస్తిమశకాంతర మెంచిచూడ।
ఏమి తార తమ్య మెఱుఁగక నీవు నన్నేల
దూషించేవె॥

తార తమ్య మేమె హరికి మెడ దాఁచిన వారిలోన॥
పెద్దైనవారము మనమిద్దఱముగాక। వేఱెవరున్నారె।
అయితే తెలిసికొంటివె మనమిద్దఱ మన్యోన్యమై
యుందమె॥

నయము పాలును నీరువలె మనముంటేను
ప్రియునకు సమ్మతమె।
మంచిదికానీవె యీ మాట బ్రహ్మానందమై
తోఁచెనే॥

పంచశరునిఁ గన్న గోపాలుని యిరువురిక్కల మన
ముందమె॥
త్రిశిర గిరీశ్వరుని చెలికాఁడైన దేవకీ నందనుని।
వశము చేసికొని ద్వారకాపురిలోన వసియించి
యుందామె॥

వ. అని యిట్లిరువురికి సమాధాన మైన తదనంతరంబున మెఱుపుఁ దీగెలనడుమఁ బ్రకాశించెడు నీలమేఘంబుకైవడి శ్రీరుక్మిణీసత్యభామాసమేతుఁడై శ్రీకృష్ణమూర్తి నిత్యోత్సవ పక్షోత్సవ మాసోత్సవ సంవత్సరోత్సవంబుల నాచరింపుచు ద్వారకాపుటభేదనంబున సుఖంబున నుండునంత.

జలక్రీడలు :

గీ. చెలులు జలకము లాడ విచిత్రవలువ
లపహరించుక కొనిపోవు నంతలోన
నల్లవీ కామినీమణులెల్లఁ గూడి
వెదుక వచ్చిరి కృష్ణుని వేడుకలర.

దరు॥ మోహన॥ ఆట॥

వెదుక వచ్చిరి కృష్ణుని। గోపస్త్రీలు
వెదుక వచ్చిరి॥ ప్రతిలేని త్రిశిరగిరి నిలయుని
చెలికాఁడై
యతిశయిల్లుచున్న హరిని వేవేగమె॥ వెదుక॥
అడవు బంగరు పళ్యములో యనఁ దొడల
నడుమ మరుదివాణములు మెఱయ। వడిమీఱఁ
దామరల
వంటి హస్తములతోఁ- గడఁగి మూసికొనుచుఁ
గడు సిగ్గు
పడుకొంచు॥ వెదుక॥

వ. ఇట్లు గోపాంగనలు వచ్చి చీరలు గానక యేమను
చున్నారు.

ఆది॥

తోయజాక్షులార చీరలు దొంగ గొంచుఁ బోయె।
వేయు విధంబుల దొంగను మనమింక వెదకుదము రండి॥
కొమ్మలార రారే ముద్దు గుమ్మలార రారే। మరువపు
రెమ్మలార రారే। బంగరు బొమ్మలార రారే॥
మొల్ల మొగ్గల చీర యో యక్క మల్లిపూలరైక।
తెల్లపట్టుచీర యోయక్క నల్లగుత్తరైక।
సరిగెపూలచీర యోయక్క జాజిపూలరైక॥
గురిగింజచీర యోయక్క మణిపైరిణిరైక।
ఇంద్రనీలపుఁ జీర యోయక్క హెచ్చు సుకపురైక।
చంద్రకావిచీర యోయక్క జంటకోసరైక।
ఇంకు వనలార త్రిశిరగిరీశుని సఖుఁడైన।
నందనందనుని ఇనుమంతైన నమ్మవశముగాదె॥

వ. అని యిట్లు వెదకి వెదకి చీర లెత్తుకపోయిన కృష్ణుని పొన్నమ్రానిమీఁద బొడగాంచి గోపస్త్రీలు ఏమనుచున్నారు.

దరువు॥ పరజు॥ చాపు॥

ఓరి మాచీరలీర। యోరచూపు లేర। యీగారడిలు
సాగ విచట మేరగాదు లేర॥ చీర లెత్తుకొని పొన్న
చెట్టెక్కుదురా। నీరజాక్ష మా సామ్మె నీకు దక్క
దురా॥ ౧

స్వామి॥ దక్కవని పలుకఁ దగునె, తరుణులార। చీరెలూ
మొ్రక్కక నే నిత్తునా ముదితలార॥౨
మొక్కలి తనమునను మమ్ము మొ్రక్కమందురా।
తక్కులాడి చీరలెల్ల దాఁచుకొందురా॥
చెలిఁడలారా మీరు రెండు చేతుల చేతను।
చెలువలరఁగ మొ్రక్కకున్నఁ జీరలియ్యను॥
ఒక్కచేత మొ్రక్కేమురా యోరి కృష్ణ।
చక్కెర విలుకానిఁ గన్న నాసామి కృష్ణ॥
త్రిశిరగిరీశ్వరుని సఖ యిదేటి వాదుర।
ఇసుమంతైనఁ గరుణ నీకు నేలలేదుర॥

వ. అని పలికిన యిట్లు పరస్పర వచనంబులైన తదనంతరంబున గోపస్త్రీ లేమనుచున్నారు.

సౌరాష్ట్రి॥ చాపు॥

చేయెత్తి మొ్రక్కితే చీరలిచ్చేమని చెప్పేవదేమిరా।
ఈయెడఁ ద్రిశిరగిరీశు సఖుఁడై తేనే యీాదుడుకు
తగునఁటరా। గోపాలా।
మానాభిమానము మఱి నీదే కాదా మాటికి
మరియాద ॥
దీనుల పట్లను దయయింత లేదా- తెలిసికొనరాదా।
గోపాల॥ చేయెత్తి॥

వ. అని పలికి గోపస్త్రీలు మొక్కికొంటు యిట్లనెను.

ఘుమ్మకాంభోజి॥ ఆది॥

చేరి మొ్రక్కిరి। గోపాంగనలు

చేరి మొ్రక్కిరి॥ చేరి మొ్రక్కిరి సిగ్గుచేతఁ గనులు

మూసుక।

సారె త్రిశిరగిరీశు సఖుఁడైన శ్రీహరికి॥

మొగగుబ్బలు కదల బాహు మూలకుచులు పొదల।

కనకపుఁ బళ్లెము లనఁగఁ దళతళను ననవిలుతు

దివాణములు తెలియఁగ॥ చేరి।

వ. ఇట్లు మొ్రక్కిన సమయంబున గోపాలమూర్తి గోప స్త్రీ సర్వాంగ దర్శన సంజాత కుతూహలుండై చీరలొసంగిన ధరియించుకొని సంతుష్టాంతరంగలై గోపస్త్రీలు స్వామిని బరి వేష్టించి యేమని కొనియాడుచున్నారు.

శ్లో. తవ కథామృతం తప్తజీవనం

కవిభిరీడితం కల్మషాపహం।

శ్రవణ మంగళం శ్రీమదాతతం।

భువి గృణంతి యే భూరిదా జనాః॥

శ్లో. అంగనా మంగనా మంతరా మాధవః
మాధవం మాధవం చాంతరేణాంగనా।
ఇత్థమా కల్పితే మండలే మధ్యగ
స్సంజగౌ వేణునా దేవకీనందనః॥
(శ్రీ)రుక్మిణీలోల, చిరసుగుణజాల.
కారుణ్యమయశీల, కల్యాణచేల,
మందహాస ముఖారవింద, గోవింద,
నందగోపకుమార, నవనీత-చోర,
నీలాంబుదాకార, నిగమాంతసార,
ఆలోల వనమాలికాద్యలంకార,
సకలలోకాధార, సాధుమందార.
శకటాసుర విదార, శరధి గంభీర,
గోవర్ధనోద్ధార, గోపికాజార,
గోవింద, యదువీర, గోపకుమార,
త్రిశిరగిరిపతిమిత్ర, దివ్యచారిత్ర!

నలుగు॥

జయ జయ గోపాలా జయ రుక్మిణీలోలా,
జయ మధుర వాగ్జాల జయ కరుణాలవాల.
అలమోహినినై సురల కమృతము పంచినయట్ల్,
నలినాక్ష, చెయుతేరా నలుగు పెట్టేను.

పెరుగు పాలు వెన్న పేర్మి మ్రుచ్చిలి తిన్న
నరసఖు, చెయి తేరా నలుగు పెట్టేను.
గోపాలుర కొఱకునై కొండ నెత్తినయట్టి
గోపాల, చెయి తేరా నలుగు పెట్టేను.
ఎన్నక శకటాసురుని దన్నిన చక్కని
చిన్ని పాదము లీర నలుగు పెట్టేను.
నగుచుఁ గాళీయాహి నౌదల మెట్టిన
చిగురు పాదములీర నలుగు పెట్టేను.
భాసిల్లు త్రిశిరగిరీశ్వరుని సఖుఁడైనట్టి
నాసామి చెయి తేర నలుగు పెట్టేను
శోభనమే, శోభనమే కృష్ణునకు; శోభనమే కృష్ణునకు.
శోభనమే జిష్ణునకు, సురుచిర వర్ధిష్ణునకు, శోభనమే
పావనగుణహారికిని, భవరోగవిదారికిని,
గోవర్ధన శౌరికిని గోపాల శౌరికిని॥శో॥
నవనీత చోరునకు ♦ ♦ ♦ ♦ ♦ ♦ ♦ ♦
మందరోద్ధారునకు మధురా విహారునకు
♦ ♦ ♦ ♦ ♦ ♦ ♦
త్రిశిరగిరి పతిసఖునకు దివ్యచారిత్రునకు
వసుదేవ పుత్రునకు వసుధా కళత్రునకు॥
శోభనమే॥

పూజలు॥

సరస వసుమతి భద్రపీఠిగాఁగ
సప్తకులగిరులుఁ గంబములు గాఁగ,
మెఱయు నంబరమె మేల్ మిద్దెగాఁగ
మేఘ మండలమె మేల్ కట్లుగాఁగ,
సారిదిఁ దారలె విరిసరులుగాఁగ
సూర్యేందులుభయదీపములుగాఁగ,
నెఱకీవిగ నజాండ భాండ మెల్ల
నిండిన యుయ్యాల వేడ్కఁగాఁగ,
వేదాంతమే పసిఁడి తొట్లఁజేసి
వేదములు నాల్గు గొలుసులుగఁ జేసి,
పోల్పిదిగాఁ బ్రణవమటు పలకచేసి,
భుజగపతి రతనంపుఁ బాన్పుచేసి
పాదుకొని జాగరూకత వహించి,
భక్తసంఘములఁ బ్రోవఁగఁ దలంచి.
ఆది మధ్యాంతముల యందు వెలయు
అంబుజాక్షుండు నుయ్యాల లూఁగు.
అరయ శాంతియు దాంతి యనెడుభామ
లమర నిరుగడల నందముగ నిల్చి
కరకంకణములు ఘుల్ ఘల్లనంగ

కళగుల్కు జోకొట్టి పాడి యూఁచ.
తంజపురి మేడయందుఁ ద్రిశిరగిరి నిలయస్వరూపుఁ
డగుచు॥
పరఁగు సంతాన గోపాలమూర్తి,
బాగు మీఱఁగను నుయ్యాలలూఁగు.
మహనీయ వేదాంత మంటపాంతరమునను
మహిమతోఁ జెన్నొందు నుయ్యాల,
బహుళ సుజ్ఞానమను అద్దంపుఁ జవికెతో
భాసిల్లు చున్నది యుయ్యాల,
అష్టాదశస్మృతీతిహాస పురాణంబు
లమర మేల్కట్టాయె నుయ్యాల.
శ్రేష్ఠమై తగునుపనిషత్తులను బహువిధుల
శృంగారమై యున్న దుయ్యాల.
రవి చంద్రులనెడు దీపములచే నిరుగడల
రంజిల్లు చున్నది యుయ్యాల,
తివిరి రుక్మిణి సత్యభామల కటాక్షముల
తెరలచేఁ జెన్నొందు నుయ్యాల,
అవని శేషుఁడను వెలిపట్టు దూదిపాన్పనం
దంద మై తగియుండు నుయ్యాల,
సువిశాలమౌ వాని పడగలను తలగడల
శోభిల్లుచున్నదీ యుయ్యాల.

ఎలమి శాంతియు దాంతి యను కామినీమణులు
ఇరుగడలఁ బాడి యూఁతు రయ్యాల,
పలుమారు త్రిశిరగిరి నిలయుసఖుఁడైనగో
పాలరాయం దూఁగు నుయ్యాల,
మంగళం॥ మధురావిహారికి మంగళం॥

అను పాట పాడేది.

సీ. కరుణారసాంచిత వరుణాలయాలయ,
లక్షణాక్షీణ కటాక్షవీక్ష,
గగనధునీలసత్కంజాత సంజాత,
మకరంద నికరసత్సోకర వచన,
సాంద్ర నిస్తుల చంద్ర చంద్రికాచ్ఛచ్ఛవి
తుందిల కమనీయ మందహాస,
దివ్యభవ్యాధార సవ్యగవ్యాత్యంత
మృదుల రామాధీన హృదయపద్మ,

జన్యగర్విత శత్రురాజన్య నికర
గర్వపర్వతహారణ సుపర్వ రమణ!
ధీరసన్నుత, మన్మథాకార, శూర,
మహితగుణసాంద్ర, యమరసింహాక్షితీంద్ర!

చ. సకల సురాధినాథ సహజాంఘ్రి సరోజ మధూళి
కోల్లసత్
ప్రకట సురాపగాంతర విరాజిత సారస మంజులామృత
ప్రకర రుచిప్రకార పరిభావసమార్థ వచోవిలాస, కౌ
శిక వరగోత్ర, శ్రీయమరసింహ మహీప, దిలీప విక్రమా!

శా. మత్తారి క్షితిమండలేశ్వర మహామాతంగ కంఠీరవా!
చిత్తోద్భూత సమానరూప! విజయశ్రీ కామినీ వల్లభా!
సత్తాపాంధతమో దివాకర! రణోత్సాహజ్ఞ నౌదార్య! స
ద్వృత్తాఢ్యామరసింహ రాజసుకృతీ! విఖ్యాత
శౌర్యోన్నతీ!

ద్వి. భోసల వంశాబ్ధి పూర్ణేందు పేర
భాసుర కీర్తి సంపన్నుని పేర
దాతల దాతయౌ ధన్యుని పేర
ఖ్యాతలఁ జోళరాజ్యాధీశు పేర
ధరఁ బ్రతాపమ్ము గేంద్రు తనయుని పేర
నిరవొందు నమరసింహేంద్రుని పేర
పరమాంకితంబైన పారిజాతాప
హరణ నాటక మిది యనువు మీఱఁగను
ఎందాఁక రవిచంద్రు లీసముద్రములు
ఎందాఁకఁ గులగిరు లీభువనములు

నెందాఁకఁ దారక లీగ్రహంబులును
ఎందాఁక దిక్కులు నీదిగ్గజములు
నెందాఁక నాకసం బెందాఁక భూమి
యందాఁక శాశ్వతంబై యొప్పఁగాక
చెలువైన చక్కని శ్రీకృష్ణ చరిత
నలువు మీఱినయట్టి నాటకం బిదియు
వేయించు వారికి వేయు వారికిని
వేయివితంబుల విన్నవారికిని
ఆయు రారోగ్యంబు లధికసంపదలు
ఆయత పుత్రపౌత్రాభివృద్ధియును
శ్రీకృష్ణ దేవుండు చిరతరంబుగను
ప్రకటంబుగ నిచ్చి పాలించుఁ గాక.

---

## గద్య.

ఇది శ్రీచోళసింహాసనాధ్యక్ష భోసలప్రతాపసింహరాజ పూర్వ పుణ్య పరిపాక స్వరూప యమునాంబికా గర్భశుక్తి ముక్తికాయమానామరసింహ మండలాధీశ్వర నామాంకితంబైన మంత్రి మార్తాండ శివరాయమంత్రి కారితంబైన శ్రీమత్ సుగంధి కుంతలేశ్వర కరుణా కటాక్ష వీక్షణ సుధాసార

సంజనిత చతుర్విధ కవితానిర్వాహక శాండిల్యగోత్ర పవిత్ర కవిరంగయార్యపుత్ర విద్వజ్జనవిధేయ మాతృభూత కవి నామధేయ ప్రణీతంబైన పారిజాతాపహరణ నాటకంబందు సత్యభామ స్వామిని స్తుతిసేయుటయును, పరస్పర సంయోగానందంబును, సత్యభామా సమేతుండై స్వామి కొలువుండుట యును, నారదముని వచ్చుటయును, స్వామి సత్యభామాసమేతుండై యింద్రలోకమున కరుగుటయును, అదితి కుండలంబు లొసంగుటయును, పారిజాతాపహరణంబు చేసి స్వామి ద్వారకానగరంబునకు వచ్చుసమయంబున నింద్రుని జయించుటయును, పారిజాత మహీజంబుదెచ్చి సత్యభామా కేళీవనంబున నుంచుటయును, రుక్మిణి యుపాలంభంబును రుక్మిణీసత్యభామలకు స్వామి సమాధానంబు సేయుటయును, గోపస్త్రీ వస్త్రాపహరణంబును రుక్మిణీ సత్యభామా సమేతుండై స్వామి నిత్యోత్సవంబుల నుండుటయు ననుకథల మెలంగు నిది సర్వంబును బంచమాంకము.

---

కాకినాడ : జ్యోతిప్రెస్ నందు ముద్రింపఁబడియె.